# బాలల విజ్ఞాన సర్వస్వం

## సంస్కృతి విభాగం



సంపాదకుడు

బుడ్డిగ సుబ్బరాయన్



అభినందన పబ్లిషర్స్

28-10-1 కారల్ మార్క్స్ రోడ్డు, విజయవాడ-520002

నుండి ఆయన కృష్ణాపత్రికకు ప్రధాన సంపాదకుడుగా పనిచేశారు. స్వాతంత్ర్యోద్యమకాలంలో కృష్ణాపత్రికలో



ఈయన వ్రాతలు చాలా తీవ్ర ధోరణిలో సాగుతుండేవి. దీనితో ప్రభుత్వం నుండి ఒత్తిడిరాగా జిల్లా సంఘం ఇతని సంపాదకత్వాన్ని తాత్కాలికంగా నిలుపుదల చేసింది. తర్వాత జిల్లా సంఘాన్ని ఎత్తివేయగా 'కృష్ణాపత్రిక'పూర్తిగా ఈయన యాజమాన్యంకిందికే వచ్చింది.

దేశ స్వాతంత్ర్యోద్యమ వివిధ ఘట్టాలలో ఆంధ్రులకు ఉత్తేజం కల్గిస్తూ కృష్ణాపత్రిక ద్వారా కృష్ణారావు నిర్వహించిన పాత్ర అసాధారణమైంది. జాతీయ భావాలకు సంఘ సంస్కరణ, స్వదేశీ ప్రచారాలకు ఆయన ఎంతో కృషి చేశారు. 1945లో కృష్ణారావు కీర్తిశేషులయారు. ఈయన శిల్ప విగ్రహమును హైదరాబాద్‌లోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ప్రతిష్టించి గౌరవించారు.

## ముద్రారాక్షసం

ముద్రా రాక్షస నాటకం సంస్కృతంలో విశాఖ దత్తుడు (క్రీ.శ. 8వ శతాబ్ది) వ్రాసిన ఒక విలక్షణమైన నాటకం. రాజనీతి ప్రయోగం ప్రధానంగా గల ఈ నాటకం కౌటిల్యుని అర్థశాస్త్రానికి లక్ష్యంగా రచించ బడింది. కౌటిల్యుడు (చాణక్యుడు) ఈనాటకంలో ఒక పాత్ర. మౌర్య చంద్రగుప్తునికి మంత్రి అయిన చాణక్యునికి ప్రతిగా నందరాజులకు మంత్రి, రాజభక్తి పరాయణుడు అయిన రాక్షసమంత్రి కల్పించబడ్డాడు. వ్యూహాలు పన్నడంలోనూ, బుద్ధి చాతుర్యంలోనూ చాణక్యుడూ, రాక్షసమంత్రీ ఒకరినొకరు తీసిపోరు. చివరికి రాక్షసమంత్రి పేరు ఉన్న ముద్రాంగుళీయకాన్ని సంపాదించి దానిద్వారా రాక్షస, మలయ కేతువుల మధ్య భేదం కల్పించి రాక్షసుణ్ణి వశపరుచుకొన్న వృత్తాంతం దీనిలో అభివర్ణించబడడం వల్ల ఈ నాటకం 'ముద్రారాక్షసం' అయింది.

## మృచ్ఛకటికం

చూ. శూద్రకుడు

## మెకన్జీ, కల్నల్ కాలిన్

ఆంధ్రదేశ చరిత్రకు గణనీయమైన చారిత్రక సామగ్రిని సమకూర్చిన ఆంగ్లేయుడు. స్కాట్లండ్‌కు సమీపంలోని స్టార్నో దీవిలో 1754లో మెకంజీ జన్మించారు. 1782లో మదరాసుకు వచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీ ఇంజనీరింగ్ శాఖలో ఉద్యోగిగా చేరారు. ఆరోజులలో గొప్ప హైందవ విద్యా కేంద్రమైన మధురకు మెకంజీ వెళ్ళి అక్కడి ప్రముఖ పండితుల్ని కలుసుకొన్నాడు. వారితో సంభాషణల వల్ల దేశీయ వాఙ్మయం నుండి, ప్రాచీన వృత్తాంతాలనుండి దేశ చరిత్రకు ఉపకరించు సాధన సామగ్రిని సంపాదించవలెనను సంకల్పం మెకన్జీకి కలిగింది. మొదటిసారిగా నెల్లూరు నుండి తూర్పు కనుమల ద్వారా రాయలసీమ ప్రాంతానికి ఒంగోలుకు రహదారి మార్గాల నమూనాలతో దేశ పటమును తయారుచేసుకొన్నాడు. మెకన్జీ కృషి ఫలితంగా మొదటి సారిగా దక్కను ప్రాంతం ముఖ్యంగా నెల్లూరు, గుంటూరు, రాయలసీమ, మైసూరు ప్రాంతాల దేశ, నైసర్గిక పటము తయారైంది. మెకన్జీ సర్వే పనులపై దేశాటనం చేయునపుడు అనేక దేవాలయాలు, శాసనాలు అతని దృష్టికి వచ్చినాయి. అజ్ఞాత లిపిలో ఉన్న ఎన్నో తెలుగు, కన్నడ శాసనాల్లోని వివరాలను తెలుసుకోవడానికి, గ్రామ చరిత్రలు వ్రాయడానికి తాళ పత్రగ్రంథ సేకరణకు, చరిత్రకుపకరించు ప్రాచీన నాణాలను సంపాదించడంలో ఏలూరుకి చెందిన కావలి వెంకట బొర్రయ్య, వెంకట లక్ష్మయ్య అను సోదరుల సహాయం తీసుకున్నాడు. 1810లో మెకన్జీ మదరాసు ప్రాంతానికి సర్వేయర్ జనరల్‌గా నియమితులైనారు.

చరిత్రకుపకరించే 5,31,255 సాధనాలను మెకన్జీ కైఫీయితుల పేరిట మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథభాండాగారమున ఇప్పటికీ మెకన్జీ సేకరించిన చారిత్రక వృత్తాంతాలున్నాయి. 1821లో మెకన్జీ కలకత్తాలో స్వర్గస్థులయిరి.

## మెక్కా

ముస్లిముల పవిత్ర పుణ్యక్షేత్రం. సౌదీ అరేబియాలో ఉంది. ఇస్లాం (చూ.) మత స్థాపకుడు మహమ్మదు ప్రవక్త జన్మస్థలి. ఎర్ర సముద్రపు (రెడ్‌సీ)

రేవు పట్టణం జుద్దాకు 60 కి.మీ దూరంలో ఉంది. ఇచ్చట ఉన్న మహా మసీదు ప్రపంచంలోని ముస్లిము లందరికీ ప్రార్థనాకేంద్రం. మూలల్లో గోపురాలతోనూ ఆర్చీల తోనూ ఉన్న ఆర్కేడ్ మధ్య చిన్న కట్టడం పవిత్ర కేంద్రం

కాబాశిల—మెక్కా



'కాబా' శిల. ఇది నల్లగా ఉంటుంది. ప్రపంచంలోని ముస్లిములు అందరూ ఈ కాబా శిలవైపు తిరిగి మోకాళ్ల పై కూర్చుని 'నమాజు' ప్రార్థనలు జరుపుతారు. అందుకే భారతదేశంలోని ముస్లిములు పశ్చిమ వైపుకు తిరిగి నమాజు చేసు కుంటూ ఉంటారు. భారత దేశానికి మెక్కా పశ్చిమంగా ఉంది. కావున అలా జరుపు కుంటారు.

ముస్లిము పంచాంగం ప్రకారం 10–11 మాస ములలోను 12 మాసం మొదటి పదిరోజులలోను మెక్కా పుణ్య క్షేత్రం దర్శిస్తారు. ఈ తీర్థ యాత్రను 'హాజీ' యాత్ర అంటారు. యాత్ర చేసి తిరిగి వచ్చినవారు తమ పేరు ముందు 'హాజీ' అని జోడిస్తారు. 'కాబాశిల' చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణ చేయడంతో హాజీ యాత్ర ముగుస్తుంది. ప్రతి ముస్లిం జీవితంలో ఒకసారి హాజీ యాత్ర చేయ్యడంతో తన జన్మ ఫలించిందని విశ్వసిస్తారు. హాజీ మహోత్సవ సమయంలో మెక్కాలో ప్రత్యేక వసతి ఏర్పాట్లు చేస్తారు. ప్రతి దేశం నుండి ముస్లిములు సురక్షితంగా తీర్థయాత్ర జరుపుకురావడానికి యాన సౌకర్యాలు ఆయా ప్రభుత్వాలు చేయడం పరిపాటి. ముస్లిమేతరులకు మెక్కా ప్రవేశం నిషేధం.

# మెక్సికో

యునైటెడ్ స్టేట్స్‌కు దక్షిణంగా ఉన్న లాటిన్ అమెరికన్ గణతంత్ర రాజ్యం. ఈ ప్రాంతంలో పన్నెండువేల ఏళ్లనాడు ప్రజాజీవనం ఉన్నట్లు దాఖ లాలున్నాయి. క్రీ.శ. 16వ శతాబ్ది ఆరంభంలో స్పెయిన్ వారి రాకకు ముందు ఆజెటిక్ నాగరకత (చూ.) కు కారకులయిన రెడ్ ఇండియన్‌లు టెనోచ్తితిలాన్ (ఇప్పటి మెక్సికో) రాజధానిగా పాలన సాగించారు. క్రీ.శ 1821లో మెక్సికోకు స్వాతంత్ర్యం ప్రాప్తించింది.

మెక్సికో సింధుశాఖలో పడుతున్న గ్రాండేనది పెద్దది. ఇది 2090 కి.మీ. పొడవుఉండి యునైటెడ్ స్టేట్స్‌కు సరిహద్దుగా ప్రవహిస్తున్నది. దక్షిణమున బాల్సాస్ నదీ ఇంకను చిన్న నదులు మెక్సికోకు జలాధారాలు. **ఆదిమ** జాతులతో సంకరానికి లోనైన సంతతి వారిని మెస్టిజో అంటారు. ప్రతివాడు మెస్టిజో అని చెప్పుకోవడానికి గర్విస్తాడు.

విస్తీర్ణం: 19,58,201 చ.కి.మీ.; జనాభా: 8,27, 21,000 (1988); రాజధాని: మెక్సికో సిటీ; అధికార భాష: స్పెనిష్. ఆదిమ మెక్సికన్‌లు, మాయన్, మిక్స్‌టెక్, నాహూట్లా, ఓటోమీ, తారస్కానా, జెపోటికా వంటి ప్రాచీన భాషలు మాట్లాడతారు. మాయన్, ఆజెటిక్ నాగరకతావశేషాలు పలుచోట్ల కనిపిస్తాయి. పుచ్చ, దోస, మిర్చి, బార్లీ, చిక్కుడు, జొన్న, అరటి, మామిడి పండ్లు, నిమ్మనారింజ, వరి, చెరకు, గోధుమ, పొగాకు, ప్రత్తి, పండ్లు, హెనెక్విన్ నార, ఆల్ఫాల్ఫా, కాఫీ, మొక్కజొన్న ప్రధానమైన సాగుపంటలు. పశువుల పెంపకం ప్రజలకు జీవనాధారం. ఆబలోనే, ఆయిస్టరులు, సార్డీనులు, రొయ్య, ట్యూనా మత్స్యపరిశ్రమలో చెప్పుకోదగ్గరకాల చేపలు. నేలబొగ్గు, ఇనుపరాయి, సీసం, రాగి, జింకు, వెండి, తగరం, గంధకం, చమురు




వాయువు, జిప్సమ్, బంగారం, మాంగనీస్, ఫ్లోర్‌స్పార్, పెట్రోలు తైలనిక్షేపాలు మెక్సికో లోని ఖనిజసంపద. చిక్లీ, ఎబనీ, పైన్, ఇరుగుడు చేవ, మహోగనీకలప అడవులలో లభించేవి. సిమెంట్, రాసాయనిక ద్రవ్యాలు, దుస్తులు, ఎరువులు, ఉక్కు, ఆహారపదార్థాలు, కలపగుజ్జు, కాగితం ప్రధాన పారిశ్రామికోత్పత్తులు.

Baalala Vijnana Sarvaswam

EDITOR: Buddiga Subbarayan

PUBLISHERS
Abhinandana Publishers
Vijayawada-520 002

DIRECTOR OF PUBLISHING
B. Babjee

FIRST EDITION : 1990
Reprint : 1991
PRICE : Rs. 150/-

బాలల విజ్ఞాన సర్వస్వం

ఎడిటర్: బుడ్డిగ సుబ్బరాయన్

పబ్లిషర్స్
అభినందన పబ్లిషర్స్
విజయవాడ–520 002

డైరెక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
బి. బాబ్జి

మొదటి ప్రచురణ: 1990
రెండవ ముద్రణ: 1991
వెల: రూ. 150/-



ART WORK: Goli Sivaram

LAYOUT: Premraj

TYPESETTING & PRINTING
Card Box Company
Hyderabad

PROCESSING: Manorupa Offset Process

ఆర్ట్ వర్క్: గోలి శివరామ్

లే అవుట్: ప్రేమ్‌రాజ్

టైప్‌సెట్టింగ్ & ముద్రణ
కార్డ్ బాక్స్ కంపెనీ
హైదరాబాద్

ప్రాసెస్: మనోరూప

ISBN 81-85591-00-8

# ప్రకాశకీయం

మా సోదరసంస్థ న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ ద్వారా ఇప్పటివరకు ఎన్నో విజ్ఞానదాయకమైన పుస్తకాలు ప్రచురించి అందించిన మా నూతనసంస్థ అభినందన పబ్లిషర్స్, విజయవాడ మంచి అందరికి ఉపయోగపడే విధముగా పిల్లలకై ఒక విజ్ఞాన సర్వస్వమును ప్రచురించాలని ఉత్సాహం కలిగింది. ముఖ్యముగా విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ప్రాచీన, ఆధునిక విజ్ఞానాన్ని సంకలింప చేసి ప్రచురించి అందుబాటులోకి తేవాలనే ఆశయంతో ఈ "బాలల విజ్ఞాన సర్వస్వం" తలపెట్టాం.

ఇప్పుడు అన్ని పాఠశాల, కళాశాలయందు ప్రాంతీయ భాషలోనే బోధనాదులు జరుగుతున్న దృష్ట్యా ఈ "బాలల విజ్ఞాన సర్వస్వాన్ని" తీర్చిదిద్దాలనే ఉద్దేశంతో తెలుగులోనే చక్కని శైలిలో ప్రచురించాం.

విద్యార్థులకు విషయ పరిజ్ఞానాన్ని అందించటమే ధ్యేయంగా పెట్టుకుని ఈ "బాలల విజ్ఞాన సర్వస్వము"ను కొన్ని భాగాలుగా ప్రచురించాలని అనుకున్నాము. కానీ విజ్ఞానానికి అవధులెక్కడ? అందుకే చరిత్ర, భాష, వాఙ్మయ, లలితకళ మొదలగు అంశములపై విషయ సంగ్రహణమంతయు సమగ్రముగా విపులీకరించి "సంస్కృతి విభాగము"ను ఒక సంపుటముగా సమకూర్చటం జరిగినది.

ఈ విజ్ఞానసర్వస్వ నిర్మాణ కార్యరంగంలో మంచి అనుభవమున్న శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ గారు ఈ 'బాలల విజ్ఞాన సర్వస్వా'నికి సంపాదకత్వం నిర్వహించారు. వారు కూడ శ్రమించి పిల్లల అవసరాలను దృష్టిలో పెట్టుకుని ఈ "బాలల విజ్ఞాన సర్వస్వ" పథకానికి ఒక సమగ్ర రూపకల్పన చేశారు. చిత్ర రూపకల్పన శ్రీ గోలి శివరావ్ గారు చేపట్టారు. ఇటువంటి ఆకర గ్రంథాల ప్రచురణ రంగంలో మేము చేసిన ఈ ప్రథమ ప్రయత్నాన్ని పాఠకలోకం ముఖ్యంగా విద్యాసంస్థలు సాదరంగా స్వీకరించి ప్రోత్సహిస్తాయని విశ్వసిస్తున్నాం. పిల్లల పుస్తకాలు నిర్దుష్టంగా ఉండాలనే సంకల్పంతోనే మా సంపాదక, చిత్రకల్పన విభాగాలు శ్రమించి పనిచేశాయి. లేజర్ డి.టి.పి. టైప్ సెట్టింగ్, రెండురంగుల ఆఫ్ సెట్ వంటి అత్యంత ఆధునిక ముద్రణ పద్ధతులను ఈ సంపుటం ప్రచురణలో వినియోగించి సాధ్యమయినంత నిర్దుష్టంగాను, అందంగాను, ఆకర్షకంగాను అందించుటకు ప్రయత్నించాం. బహుశ తెలుగులో ఆకర గ్రంథా (రిఫరెన్స్ బుక్స్)ల ప్రచురణ చరిత్రరంగంలో మా అభినందన పబ్లిషర్స్ ఒక వినూత్నమైన ప్రయోగం చేసి ఈ సంపుటాన్ని ఈ విధంగా మీ ముందుంచ గలిగినందుకు సంతోషిస్తున్నాం.

ఇట్లు
బి.బాబ్జీ
డైరక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
అభినందన పబ్లిషర్స్

విజయవాడ.
జూన్ 25, 1990.

గమనిక:

రెండవ ముద్రణ: ఈ రెండవ ముద్రణలో కొన్ని ముద్రణదోషాల్ని సవరించడం జరిగింది. ఇంకను మిగిలిన వాటిని పాఠకులు మా దృష్టికి తెచ్చిన మలి ముద్రణలో పరిహరించ వీలవుతుంది.

# ప్రస్తావన

'విజ్ఞాన సర్వస్వ' మన్నది ఇంగ్లీషులో 'ఎన్‌సైక్లోపీడియా (జ్ఞానచక్రం) అనే పదానికి తెలుగులో సమానార్థకంగా మొదటిసారిగా శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు **వాడుక** చేశారు. ఆయనే తెలుగులో ప్రప్రథమంగా విజ్ఞాన సర్వస్వాన్ని అకారాదిలో 'అ' మీద మూడు సంపుటాలు విజ్ఞాన చంద్రిక గ్రంథమాల తరపున ప్రకటించారు (1912–23). అంతకు పూర్వమే ఫ్రాన్స్‌లో ఎన్‌సైక్లోపీడీ.(18వ శతా)(ఫ్రెంచిలోనూ, ఇంగ్లండులో 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' (1768–75) ఇంగ్లీషులోనూ వెలుగు చూశాయి. ఈ ప్రయత్నాలు యూరపియన్ ప్రజలలో నవజాగృతిని కల్గించి జాతిని చైతన్యవంతం చేయడానికి బాగా ఉపయోగపడ్డాయి. భారత స్వాతంత్ర్యానంతరం (1947) తెలుగులో విజ్ఞానసర్వస్వాన్ని తయారు చేసి తెలుగుజాతిని జాగృతం చెయ్యాలనే ఉద్దేశం 1947లోనే అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ఆర్థిక మంత్రిగా ఉన్న డా|| బెజవాడ గోపాలరెడ్డి, భాషా సంస్కృతుల్లో నిష్ణాతులైన డా|| మోటూరి సత్యనారాయణ ప్రభృతులకు కలిగి తెలుగుభాషాసమితిని వ్యవస్థాపించి (1947–86 మధ్య) '**విజ్ఞాన సర్వస్వం**'గా పలు విషయప్రధాన సంపుటాలు వెలువరింప చేశారు. పిల్లలకై తెలుగులో విజ్ఞాన సర్వస్వం తయారు చేయాలనే ప్రయత్నాలు జరిగాయి. కాని ఫలించినట్టులేదు. పొరుగు భాషలలో ముఖ్యంగా తమిళంలో అకారాది 'శిరువనర్ కళైకళంజియమ్' పది సంపుటాలు (1965–75), కన్నడంలో విషయ ప్రధానంగా 'జ్ఞాన గంగోత్రి' 7 సంపుటాలు (1969–75), మలయాళంలో విషయ ప్రధానంగా కూర్చిన మొదటి సంపుటి 1989లోనూ వెలుగుచూశాయి. ఇలా ఇతర భారతీయ భాషల్లో కూడా పిల్లలకై విజ్ఞాన సర్వస్వాలు **వెలువడ్డాయి.**

విజ్ఞాన సర్వస్వ నిర్మాణం, అందునా 'బాలల విజ్ఞాన సర్వస్వం' ప్రచురణ జటిలమైంది. ఏదైనా ధర్మ సంస్థయో, ప్రభుత్వ సంస్థయో తల పెట్టవలసిందేగాని వ్యాపారసంస్థకు ఇది కష్టసాధ్యమయిన పని. కాగా ఏడాది క్రితం (1989) చిరకాల మిత్రుడు, నా శ్రేయోభిలాషి డాక్టరు వెలగా వెంకటప్పయ్య సలహామేరకు నన్ను అభినందన పబ్లిషర్స్ (విజయవాడ) సంస్థ అధినేత శ్రీ బెల్లపు బాబ్జీ సంప్రదిస్తూ 'బాలల విజ్ఞాన సర్వస్వం' వేయాలనే అభిలాష వెలిబుచ్చారు. వాస్తవానికి నాకు ధైర్యం చాలకను, నాకున్న త్రాణ సరిపోతుందా అన్న మీమాంస తోనూ ఏక వ్యక్తిగా నేను ఈ పథకాన్ని సుసాధ్యం చేయగలనా అని సందేహంతో కొంత తాత్సారం చేశాను. అయితే శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు, కందుకూరి బాలసూర్య ప్రసాదరాయ భూపతి (1938–40)గారు *(ఆంధ్ర విజ్ఞానం)*, మాగంటి బాపినీడు (1942)గారు *(ఆంధ్ర సర్వస్వం)* వంటి మహనీయులు ఏకవ్యక్తి పథకాలగనే కదా పూర్తి చేయగలిగారు, దాదాపు మూడు దశాబ్దాల (1950–76) పాటు తెలుగు భాషా సమితిలో (మద్రాసు) మధ్య) నాలుగు సంపుటాలకు చీఫ్ కంపైలర్‌గా ప్రత్యక్ష అనుభవమూ మిగతా సంపుటాల నిర్మాణంలో పరోక్ష సంబంధమూ నాకు ఉందిగదా! ఈ సమయంలోనే (1950–76) డాక్టరు గిడుగు వేంకటసీతాపతి, శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మ, మేడేపల్లి వరాహ నరసింహస్వామి, వసంతరావు వెంకటరావు, చీమకుర్తి శేషగిరిరావు వంటి మహాపండిత మేధావుల పర్యావరణంలో పనిచేసి అనుభవం సంపాదించానుగదా! అని ధైర్యం వచ్చింది. పైనచెప్పిన విజ్ఞాన సర్వస్వ వైతాళికుల స్ఫూర్తి నందుకుని ఈ 'బాలల విజ్ఞాన సర్వస్వం' నిర్మాణానికి సాహసించి ఉపక్రమించాను. ఆంధ్రప్రదేశ్ బాలల **అకాడమీ** (రాష్ట్రప్రభుత్వ సంస్థ) కార్యదర్శిగా (1976–88) ఉన్నప్పుడు బాలల విజ్ఞాన సర్వస్వాన్ని తయారు చేద్దామని సంకల్పం ఉండేది. కారణాలు ఏమైతేనేమి ప్రయత్నం 'ప్రయత్నం'గానే ఉండిపోయింది. చివరకు అభినందన పబ్లిషర్స్ వారి పూనికతో ఈ ఆశయం కొంతవరకూ నెరవేరిందని చెప్పవచ్చు.

ఈ సందర్భంలో ఒక విషయం ప్రస్తావించవలసి ఉంది. నేను 1987లో యునైటెడ్ స్టేట్స్ వెళ్ళడం, మూడు నెలలు అక్కడ వుండడం తటస్థపడింది. అప్పుడే అమెరికాలో బహుళప్రచారంలో ఉన్న 'కల్చరల్ లిటరసీ' (పబ్లిషర్స్: హఫ్టన్, మిఫిన్ కంపెనీ, బోస్టన్) అనే పుస్తకం నా కంటబడింది. ఇది విద్యావిషయక సంబంధమయిన గ్రంథం. దీనిని వర్జీనియా యూనివర్సిటీ ప్రొఫెసర్ ఇ.డి. హిర్ష్ (జూ) ఇంగ్లీషు బోధనలోనూ, విద్యార్థుల విషయ అవగాహనలోనూ తన అనుభవాల్ని గుప్పించి విమర్శనాత్మకంగా వ్రాశారు. ఒక కాపీ కొన్నాను. మూడుసార్లు చదవగా కొన్ని ఆసక్తికరమయిన విషయాల్ని తెలుసుకోగలిగాను. ఈ బాలల విజ్ఞాన సర్వస్వం పథకం స్వరూపాన్ని నిర్దేశించడంలో ఈ 'కల్చరల్ లిటరసీ'లోని విషయాలు నాకెంతో ప్రయోజన పడ్డాయి. ఈ 'కల్చరల్ లిటరసీ' అన్న పదబంధమే కొత్తగా సృష్టింపబడింది. ఈ భావమే సరికొత్తది. ఆబాలగోపాలమూ తప్పనిసరిగా తెలుసుకోదగ్గ విషయాధ్యయనరంగమని కల్చరల్ లిటరసీకి తెలుగులో అర్థం చెప్పుకోవచ్చుననిపిస్తూంది. జాతి సంప్రదాయ వ్యవస్థ ద్వారా విషయ సంపదా, శాస్త్ర విజ్ఞానమూ ఒక తరం నుండి తరువాతి తరానికి సంక్రమించడం పరిపాటి.

అయితే లోగడ జ్ఞాన సంపద పరిమితంగా ఉన్నప్పుడు మాట ఏలా ఉన్నా నేడు లోకజ్ఞానం ఉరకలు పరుగులు (నాలెడ్జి ఎక్స్ప్లోషన్) మీద రాసిలోనూ, వాసిలోనూ పెరిగిపోతూంది. నేటి విద్యార్థి బ్రహ్మాండమయిన ఈ విషయ సామగ్రిని ఒక్కొక్కప్పుడు ఒకేసారి వినీ, చూచీ, చదివీ అర్థం చేసుకొని మెళుకువతో మెలగవలసి వస్తూంది. పైగా నేడు బడి నాలుగు గోడలమధ్య నేర్చిన దానితోబాటు ఈ మీడియా ధాటిని ఒకవైపు తట్టుకుంటూ, అవగాహనం చేసికొని జీర్ణించుకొని సద్వినియోగం చేసికోవాలని ప్రతి అమ్మాయీ, అబ్బాయీ తహతహలాడుతూ ఉండటం సహజం. నిజంగా అవగాహన చేసికొని ఒంటపట్టించుకున్నవారే రేపు వచ్చే సమాజంలో మనుగడ సాధించగలుగుతారన్నది జీవనసమర యథార్థ విషయంగా తోస్తూంది.

ఈ 'బాలల విజ్ఞాన సర్వస్వం' నిర్మాణం ఈ విధంగా సిద్ధపరచడంలో అనేక పరిమితులకు లోబడి పనిచేయవలసి వచ్చింది. ఈ సంపుటం సంస్కృతికి సంబంధించిన విషయాలకే పరిమితం చేయబడింది. శాస్త్రవిజ్ఞాన విషయాలు ఇందులో చేర్చలేదు. గ్రంథవిస్తరణ కూడ ఆదిలో 250 అనుకున్నది 357 పుటలకు పైగా చేరింది. ఇందులో ప్రపంచంలోని 160 దేశాలు అంటే ఐక్యరాజ్య సమితి సభ్యదేశాలూ, భారతదేశంలోని 25 రాష్ట్రాలూ, ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలకు సంబంధించిన భౌగోళిక, చారిత్రక, **ఆర్థిక** సిరిసంపదలూ దిఙ్మాత్రంగానైనా పిల్లలకు పరిచయం చేయాలనేదే ముఖ్య ధ్యేయంగా పెట్టుకోవడం జరిగింది. ఇక ప్రపంచం, మనదేశం, మన రాష్ట్రం—వీటిలో తమ అడుగుజాడలను వదిలిన మహామేధావులు, విజేతలు, రాజనీతిజ్ఞులు, మహాకవులు, కళాకారుల జీవితవివరాలు పిల్లలను ఉత్తేజపరచే విధంగా క్లుప్తంగా ఇవ్వడం జరిగింది.

ప్రపంచంలో వెలిసిన ప్రముఖ నాగరకతలు, చారిత్రక సంఘటనలు, సాంస్కృతిక శీర్షికలు, ఆధునిక పాశ్చాత్య భావాలు, ప్రాచ్య భారతీయ భావాలు, ఉద్యమాలు, విప్లవాలు తాలూకు 1000 అకారాది శీర్షికలలో మధ్య మధ్య బొమ్మలతో, దేశపటాలు (స్పాట్ మ్యాపులు) ఈ 'బాలల విజ్ఞాన సర్వస్వం'లో చోటు చేసుకొన్నాయి. అయితే ఒకమాట. ఇది సమగ్రం కాకపోవచ్చు. కాదుకూడా. పిల్లలకు ముఖ్యంగా నేడు తెలుగు బోధనాభాషగా స్వీకరించినవారికి ఇది ఒక కర దీపిక లాగా తీర్చి దిద్దడ మయింది. ఈ 'బాలల విజ్ఞాన సర్వస్వం' రూపకల్పనలో అకారాది పద్ధతి అనుసరించడమైంది. శీర్షికలు సంగ్రహంగానే లేత మనసులకు విషయ అవగాహన (కమ్యూనికేటివిటీ)కు వీలుగా ఉండేట్టు వాడుక భాషాశైలిలోనే ప్రస్తావించడమైంది. బహుశః ఇది అందరికి ఆమోదకరం కావచ్చునని ఆశిస్తున్నాను. కొన్ని నిర్దిష్ట పరిమితులకు లోబడి దీనిని సిద్ధపరచినట్లు పైన పేర్కొడమైంది. అయినా ఇంకా చేర్చదగు విషయాలెన్నో విడచిపెట్టడమైంది. శూన్యదోష*ప్రయుక్తం (జీరో డిఫెక్ట్)గా ఉండాలన్న ధ్యేయం పెట్టుకున్నా గుప్తదోషాలు కొన్ని ఇందు దొరలి ఉండవచ్చు. ఇందులోని లుప్తదోషాలూ, పునరుక్తి దోషాలు నాదృష్టికి తీసుకొని వస్తే వాటిని పరిశీలించి మలికూర్పులో సర్దుబాట్లు, దిద్దుబాట్లు చేసుకోగలనని సహృదయులకు మనవి చేస్తున్నాను. అట్టి అభిప్రాయాల్ని నేరుగా నాకు (బుడ్డిగ సుబ్బరాయన్, 3–4–495, హైలైన్ అపార్ట్‌మెంట్స్, బర్కత్‌పురా, హైదరాబాదు—500 027) వ్రాయనుని ప్రార్థిస్తున్నాను.

ఈ 'బాలల విజ్ఞాన సర్వస్వ' నిర్మాణ కృషిలో నాకు సలహా సహకారాలందించిన చిరకాల మిత్రులు తెలుగు భాషాసమితిలో నా సహఉద్యోగి శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారికి (సంస్కృత కవులు, ఆర్ష సంప్రదాయ శీర్షికలు), ఇంకను సహకారం అందించిన శ్రీ కె.ఆర్.కె. మోహన్, శ్రీమతులు వై. రాజీవ, గాలి ప్రభావతి గార్లకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. అలాగే నాకు చేదోడు వాదోడుగా ఉన్న శ్రీ యామిజాల ఆనంద్ కృషి అభినందనీయం.

ఇక చివరగా, నా ఈ బాలవిజ్ఞాన సర్వస్వ నిర్మాణ కృషి ఇలా జయప్రదంగా ముగియడానికి నాతో సదాసహకరిస్తూవచ్చిన నా శ్రీమతి సౌభాగ్యవతి కమల అందించిన తెరవెనుక ఉత్సాహప్రోత్సాహ దోహదాదులు ప్రస్తావించకుండా ఏలా ఉండడం!

హైదరాబాదు:
జూన్ 25, 1990

బుడ్డిగ సుబ్బరాయన్
సంపాదకుడు

* Every author may aspire to praise, the lexicographer *(encyclopaedist)* can only hope to escape reproach and even this negative few' Dr. Johnson

# వర్గీకృత విషయసూచి

ఈ బాలల విజ్ఞాన సర్వస్వంలో ప్రస్తావించిన 1000 శీర్షికలను విషయప్రధానంగా వింగడించి క్రింద పొందుపరచడమైంది. ఆయా విషయాలను తెలుసుకొనగోరు పాఠకుల సౌలభ్యానికై ఈ విధం తోడ్పడుతుంది.

ఇందులో ఉపయోగించిన సంకేతాలు
కి.మీ. = కిలోమీటరు; చ.కి.మీ. = చతురపు కిలో మీటరు;
మీ. = మీటరు. చూ. = చూడు.



## ప్రపంచదేశాలు / ఐ.రా.స. సభ్యదేశాలు

అంగోలా 1; అప్పరవోల్టా (బూర్కినా ఫాసో) 7; ఆంటిగ్వా & బార్బుడాస్ 14; ఆండోర్రా 15; ఆఫ్ఘనిస్తాన్ 21; ఆర్జెంటీనా 23; ఆల్‌జీరియా 23; ఆల్‌బేనియా 24; ఆస్ట్రియా 25; ఆస్ట్రేలియా 25; ఇంగ్లాండు 26; ఇండియా 26; ఇండోనీషియా 26; ఇజ్రాయెల్ 28; ఇటలీ 28; ఇరాక్ 29; ఇరాన్ 29; ఈక్వడార్ 30; ఈక్వెటోరియల్‌గినీ 31; ఈజిప్ట్ 31; ఉగాండా 32; ఉరుగ్వే 34; ఎతియోపియా 35; ఎల్‌సాల్వడార్ 36; ఐర్లాండ్ 40; ఐవరీకోస్ట్ 40; ఐస్‌లాండ్ 40; ఓమన్ 43; కంపూచియా 44; కాంగో 52; కాటార్ 54; కామెరూన్ 55; కువాయిట్ 60; కెనడా 64; కెన్యా 66; కేప్‌వర్డ్ 66 కొమోరూస్ 68; కొరియా 68; కొలంబియా 69; కోస్టారికా 70; కొటేడి ఐవరీ 67; క్యూబా 71; గయానా 78; గాంబియా 80; గినీ 81; గినీ, బిస్సౌ 81; గేబన్ 84; గ్రీస్ 90; గ్రెనడా 91; గ్రేట్‌బ్రిటన్ 91; గ్వాతెమాలా 92; ఘనా 92; చాద్ 95; చిలీ 98; చీనా 99; జపాన్ 101; జమైకా 102; జర్మనీ 105; 106; జాంబియా 109; జింబాబ్వే 117; జీబౌటీ 118; జెకొస్లోవాకియా 119; జెయిరీ 119; జోర్డాన్ 121; టర్కీ 123; టాంజేనియా 124; టిబెట్టు 126; టునీషియా 127; టోగో 128; ట్రినిడాడ్ & టుబాగో 128; డెన్మార్క్ 129; డొమినికన్ రిపబ్లిక్ 129; డొమినికా 130; తాయిలాండ్ 134; తువాలుదీవులు 139; దక్షిణాఫ్రికా 144; నమీబియా 152; నార్వే 159; నికరాగ్వే 159; నెదర్లాండ్స్ 161; నేపాల్ 163; నైజర్ 163; నైజీరియా 163; న్యూజీలాండ్ 166; నవామాకాలువ 172; పరాగ్వే 173; పశ్చిమ సామో 176; పాకిస్తాన్ 177; పాపువా న్యూగినీ 178; పాలస్తీనా 179; పెరూ 182; పోర్చుగల్ 183; పోలండ్ 184; ఫిజీదీవులు 200; ఫిన్లాండ్ 200; ఫిలిప్పీన్స్ దీవులు 201; ఫ్రాన్స్ 202; బంగ్లాదేశ్ 203; బర్మా 204; బల్గేరియా 204; బహామాదీవులు 205; బహ్రెయిన్ 205; బార్బడోస్ 207; బురుండీ 209; బూర్కినాఫాసో 210; బెనిన్ 211; బెర్ముడా 212; బెలిజీ 212; బెల్జియం 212; బొలీవియా 214; బోత్స్వానా 214; బ్రూనే 218; బ్రెజిల్ 218; భారతదేశం 222; భూటాన్ 235; మంగోలియా 235; మకావూ 237; మడగాస్కర్ 237; మలావీ 242; మలేసియా 242; మారిటేనియా 248; మారిషస్ 248; మాల్‌దీవులు 250; మాలీ 251; మాల్టా 251; మెక్సికో 255; మొజాంబిక్ 258; మొనాకో 259; మొరాకో 259; యుగోస్లావియా 261; యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ 262; యునైటెడ్ కింగ్‌డమ్ 262; యునైటెడ్ స్టేట్స్ 263; యెమన్ (ఏడెన్) 264; యెమన్ (సాన్ ఆ) 265; రష్యా 267; రుమేనియా 283; రువాండా 283; లక్సెంబర్గ్ 287; లావోస్ 291; లిక్టెన్‌స్టీన్ 292; లిబియా 292; లెబనాన్ 294; లెసోతో 294; లైబీరియా 295; వనౌతూ 296; వియత్నామ్ 303; వెనుజ్యూలా 309; శ్రీలంక 319; సాన్‌మారినో 328; సావోటోమీ & ప్రిన్సిపీ 328; సింగపూర్ 330; సియెర్రాలియోనీ 334; సిరియా 334; సుడాన్ 336; సురినామే 339; సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ 340; సెకెల్లిస్ (సెషెల్లె) 341; సెనెగల్ 341; సెయింట్ కిట్స్—నెవిస్ 341; సెయింట్ లూసియా 342; సెయింట్ విన్సెంట్ 342; సైప్రస్ 342; సొమాలియా 344; సోలమన్ దీవులు 344; సౌదీ అరేబియా 344; స్పెయిన్ 345; స్వాజీలాండ్ 346; స్వీడన్ 347; హంగేరీ 348; హయిటీ 349; హాంకాంగ్ 352; హోండూరస్ 356.



## భారతదేశ రాష్ట్రాలు / కేంద్రపాలిత ప్రాంతాలు


అరుణాచల్‌ప్రదేశ్ 10; అస్సాం 14; ఆంధ్రప్రదేశ్ 15; ఉత్తరప్రదేశ్ 32; ఒరిస్సా 41; కర్నాటక 50; కేరళ 67; గుజరాతు 82; గోవా 87; జమ్మూ & కాశ్మీర్ 103; తమిళనాడు 131; త్రిపురా 142; నాగాలాండ్ 156; పంజాబు 169; పశ్చిమబెంగాలు 175; బీహారు 209; మధ్యప్రదేశ్ 240; మణిపూర్ 238; మహారాష్ట్ర 246; మిజోరామ్ 253; మేఘాలయా 257; రాజస్తాన్ 270; సిక్కిమ్ 332; హర్యానా 351; హిమాచల్‌ప్రదేశ్ 353.

అండమాన్ నికోబార్ దీవులు 1;చండీఘడ్93;డయ్యూ & డామన్ 128; దాద్రా & నగర్‌హవేలి 146; పాండిచ్చేరి 176; లక్షదీవులు 287; ఢిల్లీ 130;




## ఆంధ్రప్రదేశ్ జిల్లాలు


అనంతపురం 6; ఆదిలాబాదు 20; కడప 45; కరీంనగరం 49; కర్నూలు 50; కృష్ణ63; ఖమ్మం 75; గుంటూరు 81; చిత్తూరు 97; తూర్పు గోదావరి 139; నల్గొండ 153; నిజామాబాదు 160; నెల్లూరు 162; పశ్చిమ గోదావరి 174; ప్రకాశం 184; మహబూబునగరం 243; మెదకు 256; రంగారెడ్డి 265; వరంగల్లు 296; విజయనగరం 301; విశాఖపట్టణం 304; శ్రీకాకుళం 315; హైదరాబాదు 355.




## భౌగోళిక విశేషాలు / మహానగరాలు / నదులు మహాసముద్రాలు/ జలపాతాలు/పర్వతాలు/దేశాన్వేషకులు


అంటార్కిటికా 1; అంతర్జాతీయ తేదీరేఖ 2; అక్షాంశరేఖాంశాలు 3; అట్లాంటిక్ మహాసముద్రం 5; అమెజాన్ నది 9; అమెరికా 9; అయనం 9; అరకులోయ 9; అరేబియా 10; ఆండీస్ పర్వతశ్రేణి 15; ఆఫ్రికా 22; ఆఫ్రికా 22; ఆర్కిటికా 22; ఆల్ప్సు పర్వతశ్రేణి 24; ఆసియా 25; ఎవరెస్ట్ శిఖరం 36; ఎస్కిమోలు 37; ఋతువులు 44; కలకత్తా 51; కాంచనగంగా శిఖరం 53; కావేరీనది 57; కె–2 పర్వతశిఖరం 64; కోనసీమ 70; కోస్తాప్రాంతం 70; కృష్ణానది 64; గంగానది 76; గోదావరినది 85; గ్రీనిచ్‌కాలమానం 90; చండీఘడ్ 93; జీలంనది 118; టోక్యోనగరం 127; ఢిల్లీమహానగరం 130; తపతినది 131; తిరువనంతపురం 137; తుంగభద్రానది 138; తూర్పుకనుమలు 139; తెలంగాణా 140; దక్షిణ అమెరికా 144; థార్‌ఎడారి 143; నందదేవి శిఖరం 150; నయాగరాజలపాతం 152; నర్మదానది 152; నాగార్జునసాగర్ డాము 155: నైలునది 164; నైమిశారణ్యం 164; న్యూయార్క్ మహానగరం 166; పడమటి కనుమలు 171; పర్షియా 173; పారిస్‌నగరం 178; ప్రపంచం187;బంగాళాఖాతం203;బొంబాయి 213; బ్రహ్మపుత్రానది 216; మద్రాసు 239; మానససరోవరం 248; మాస్కో 252; యూరల్ పర్వతశ్రేణి 264; యూరప్ 264; రాకీపర్వతశ్రేణి 269; రాయలసీమ 280; రోమునగరం 284; లండను మహానగరం 286; లాటిన్ అమెరికా 291; విజయవాడ 301; వటికన్ సిటీ 296; వోల్గానది 310; వాషింగ్‌టన్ డి.సి. 300; సంవత్సరం 322; సట్లెజ్‌నది 322; సింధునది 330; సైబీరియా 342; హిందూమహాసముద్రం 353; హైదరాబాదు 355.

ఇత్సింగ్ 29; ఇబ్న్‌బతూతా 29; కొలంబస్, క్రిస్టఫర్ 69; న్యూనిజ్ 166; ఫాహియాన్ 200; మర్కోపోలో 249; వాస్కోడిగామా 300; **హుయాన్‌త్సాంగ్** 355.



## భారతరాజ్యాంగం / ప్రభుత్వం / రాజనీతి

ఎన్నికలు 35; గవర్నరు 78; జనగణమన—జాతీయగీతం 101, 110; జాతీయచిహ్నం 110; జాతీయపండుగలు 111; జాతీయ పక్షి, జంతువులు 111; జాతీయ పతాకం 112; జాతీయ పురస్కారాలు 112; జాతీయ భాషలు 113; పంచవర్ష ప్రణాళిక 168; పంచశీల 168; పంచాయితీ వ్యవస్థ 169; పార్లమెంటు 178; ప్రధాని 187; ప్రభుత్వం 197; ప్రాథమిక హక్కులు 198; భారతప్రభుత్వం 229; భారతరాజ్యాంగం 229; ముఖ్యమంత్రి 253; రాజ్యసభ 272; రాష్ట్రపతి 280; రాష్ట్రప్రభుత్వం 281; రాష్ట్రావతరణ 281; లోక్‌సభ 295; వోటు 310; శాసనసభ 313; సభాపతి 325; స్పీకర్ 345.



## జాతీయ పండుగలు / పండుగలు—పర్వాలు / వినోదాలు / పురస్కారాలు

ఆగస్టు 15 20; ఉగాది పండుగ 32; ఉపాధ్యాయ దినోత్సవం 34; ఏషియాడ్ 38; ఒలంపిక్ క్రీడలు 42; క్రిస్టమస్ పండుగ 71; కుంభమేళ 58; గొబ్బిలాట 84; జాతీయ పండుగలు; దీపావళి 146; పండుగలు—పర్వాలు 170; మకరసంక్రాంతి 237, 322; మహాశివరాత్రి 247; మొహర్రం 260; విజయదశమి 301; శ్రీరామనవమి 318.

జవహర్‌లాల్ నెహ్రూ పురస్కారం 108; జాతీయ పురస్కారాలు 112; జ్ఞానపీఠ పురస్కారం 122; నోబెల్ బహుమతి 165; మెగసేసే పురస్కారం 256.



## విజేతలు / పాలకులు / చారిత్రక పురుషులు / రాజవంశాలు

అక్కన్న—మాదన్న 3; అక్బర్ 3; అట్లీ, క్లిమెంట్ 5; అబ్రహాం లింకన్ 7; అశోకుడు 12; అల్ బుకర్క్, అల్ఫాన్సో 23; అలెగ్జాండర్ 24; ఔరంగజేబు 43; కనిష్కుడు 47; కర్జన్ 49; కృశ్చేవ్ 62; కుబ్లయ్‌ఖాన్ 59; కులీకుతుబ్‌షా 60; కృష్ణదేవరాయలు 62; కెన్నడీ 65; క్లియోపాత్రా 72; క్రిప్స్ 71; క్లైవ్, రాబర్ట్ 72; ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ 75, 77; గజనీమహమ్మద్ 76; గణపతిదేవుడు 77; గోర్బచేవ్ 86; గౌతమీపుత్ర శాతకర్ణి 89; చంద్రగుప్త మౌర్య 93; చంద్రగుప్త విక్రమాదిత్య 93; చాణక్యుడు 25; చెంఘిజ్‌ఖాన్ 100; జహంగీర్ 109; జోన్ ఆఫ్ ఆర్క్ 121; టాలమీ 126; టిప్పుసుల్తాన్ 126; ట్రాట్‌స్కీ 128; డల్‌హౌసీ 129; డూప్లే 129; తానీషా 134; తామర్లేన్ 134; తిమ్మరుసు 135; తోడరుమల్లు 140; నాదిర్షా 157; నానాఫడ్నవీస్ 158; నానాసాహెబ్ 158; నెపోలియన్ బోనపార్టీ 161; నిజాము 160; పురుషోత్తముడు 181; పృథ్వీరాజ్ 182; ప్రతాపరుద్రుడు 186; బాబర్ 206; బిందుసారుడు 208; బుష్, జార్జి 210; బెంటింక్, విలియమ్ 210; బ్రహ్మనాయుడు 216; మహబూబ్ అలీ పాషా 243; మహమ్మద్‌బిన్ తుగ్లక్ 244; మావో 251; మౌంట్‌బాటన్ 261; యుగంధరుడు 261; రంజిత్‌సింగ్ 266; రాజరాజ నరేంద్రుడు 270; రాజరాజచోళుడు 270; రాణాప్రతాప్‌సింగ్ ; రుద్రమదేవి 282; రూజ్‌వెల్ట్, ఫ్రాంక్లిన్ డిలానో 283; లింకన్, అబ్రహాం 292; లెనిన్ 293; వాషింగ్‌టన్, జార్జి 299; విక్టోరియా మహారాణి 300; విన్‌స్టన్ చర్చిల్ 302; శాలివాహనుడు 313; శివాజీ 314; షర్షా 320; షాజహాన్ 320; షార్లమాన్ 321; సముద్రగుప్తుడు 325; సాతవాహనులు 327; సీజర్, జూలియస్ 335; హర్షుడు 351; హిట్లర్, అడాల్ఫ్ 353; హుమాయూన్ 354; హేస్టింగ్స్, వారెన్ 355; హోచిమిన్ 357.



## అంగోలా

ఆఫ్రికా ఖండంలో పశ్చిమ తీరాన అట్లాంటిక్‌ని ఆనుకొని ఉన్న స్వతంత్ర గణరాజ్యం. 1975లో స్వాతంత్ర్యం సిద్ధించే వరకూ అంగోలా పోర్చుగీసు వారి పాలనలో ఉండి 'పోర్చుగీస్ వెస్ట్ ఆఫ్రికా'గా వ్యవహరింప బడేది.




విస్తీర్ణం: 12,46,700 చ.కి.మీ.; జనాభా: 93,86,000 (1988); రాజధాని:లువుండా;అధికార భాష: పోర్చుగీస్.ప్రజలు బంటూ అనేఆదిమభాషదాని మాండలికాలూ మాట్లాడుతారు. ఓవిం బుండూ, మ్బుండూ, కోంగో, లుయింబే, హుంబే, న్యాన్కా, చూక్వే తెగలవారు వారి వారి భాషలు మాట్లాడుతారు. వారు క్రైస్తవ మతానుయాయులు. కొంతమంది ఆదిమ మతాలను అనుసరించేవారూ ఉన్నారు. కౌంగానది, కునౌనేనది, కుబాంగోనది, కుల్తోనది, కాసైనది ముఖ్య మయిన నదులు.

కర్ర పెండలం, అరటిపండ్లు, చెరకు, మొక్కజొన్న, చిరుగడం, సిసాల్ నార, అపరాలు, పామ్ గింజలు, కాఫీ, వేరుసెనగ మొదలైన పంటలు పండుతాయి. పశుపాలన ప్రజలకు జీవనోపాధి కల్పిస్తూంది. విలువైన వజ్రాలు, పారిశ్రామిక వజ్రాలు ముఖ్య ఖనిజ సంపద; నేల బొగ్గు, పెట్రోలు, ఇనుపరాయి, చమురు వాయువు ఇతర ఖనిజ నిక్షేపాలు. పంచదార, సిమెంట్, తైలశోధన ప్రముఖ పరిశ్రమలు. చేపలు, వజ్రాలు, ముడి పెట్రోలు, కాఫీ, ఇనుపరాయి, కలప, సిసాల్ నార అంగోలా నుంచి ఎగుమతి అవుతున్నాయి.

## అంటార్కిటికా

దక్షిణధ్రువం పరిసరాలలో ఉన్న భూఖండం. ఏడాది పొడుగునా ఇది మంచుతో కప్పబడి ఉంటుంది. దీని విస్తీర్ణం: సమారు 13,00,00,000 చ.కి.మీ. దీని చుట్టూ ఉన్న సముద్రాన్ని అంటార్కిటిక్ మహాసముద్రం అంటారు. అంట్లాంటిక్, పసిఫిక్, హిందూ మహాసముద్రాల దక్షిణ భాగంలో ఇది ఉంది. 1772లో జేమ్స్‌కుక్ మూడేళ్ల పాటు సముద్రయానం చేసి ఈ అంటార్కిటికా ఖండం ఉనికిని కనుగొన్నాడు. తరువాత అనేక దేశాలు దీని పరిశోధనకు పూను కున్నాయి. ఇటీవల (1984లో) భారతదేశం కూడా గోవాలోని జాతీయ సముద్ర శాస్త్ర సంస్థ నుంచి పరిశోధక బృందాలతో నౌకలను అంటార్కిటికాకు పంపి పరిశోధనలు జరిపింది. పెంగ్విన్ పక్షులూ, సీల్, తిమింగలం వంటి జలజంతువులు ఇక్కడ ఎక్కువగా కనిపిస్తాయి. ఈ దక్షిణ ధ్రువ ప్రాంతపు ఆకాశంలో రంగు రంగుల కాంతులు కనిపిస్తాయి. వాటిని 'అరోరా ఆస్ట్రాలిస్' అంటారు.

## అండర్‌సన్ చూ. హేన్స్‌క్రిస్టియన్ అండర్‌సన్

## అండమాన్, నికోబార్ దీవులు

భారత ప్రభుత్వ అధీనంలో ఉన్న కేంద్ర పాలిత ప్రాంతం. మద్రాసుకు తూర్పుగా సుమారు 1200 కి.మీ. దూరంలో బంగాళఖాతంలో ఉన్న రెండు ద్వీప సముదాయాలను 1. అండమాన్‌దీవులు, 2. నికోబార్ దీవులు అంటారు. బ్రిటిష్ ప్రభుత్వ పాలనలో ద్వీపాంతర వాస శిక్షకోసం, ముఖ్యంగా రాజకీయ ఖైదీలను నిర్బంధించడం కోసం ఇక్కడ ఒక సెల్యులర్ జైలు నిర్మించారు (1897). ఈ దీవుల విస్తీర్ణం: 8,249 చ.కి.మీ. జనాభా: 1,88,471 (1981). రాజధాని: పోర్ట్‌బ్లెయిర్. ఈ దీవులలో అండమానీస్ అనే ఆదిమ వాసులు ఉన్నారు. ప్రస్తుతం జీవనోపాధి కోసం చాలా మంది భారతీయులు ఇక్కడికి వలస వెళుతున్నారు. ప్రధాన ఆర్థికసంపద అటవీ సామగ్రి, నాణ్యమైన టేకు కలప అండమాను అడవుల్లో లభిస్తుంది. ఇతర జాతుల కలపనుపయోగించి ప్లైవుడ్‌ను తయారుచేస్తున్నారు.

## అంతర్జాతీయ కార్మిక సంఘం

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచ శాంతికోసం ప్రముఖ ప్రపంచ దేశాలు నానాజాతి సమితి (లీగ్ ఆఫ్ నేషన్స్) ని ఏర్పరచుకోగా 1919లో దానికి

అనుబంధ సంస్థగా ఏర్పడిన సంఘం. ప్రభుత్వాలకూ, ఉద్యోగులకూ, కార్మికులకూ చెందిన ప్రతినిధులు దీనిలో సభ్యులుగా ఉంటారు. ఈ సంఘం లక్ష్యం సభ్యదేశాలలో సామాజిక స్థిరత్వాన్ని కల్పించి ఆర్థిక వ్యవస్థని అభివృద్ధి పరచి, కార్మికుల ఉద్యోగ పరిస్థితులను మెరుగుపరిచి వారి జీవిత ప్రమాణాలను అభివృద్ధి చేయడం. నానాజాతి సమితి అంతరించిన తరువాత 1945లో ఏర్పడిన ఐక్యరాజ్యసమితి ఈ సంఘాన్ని తన అనుబంధ సంస్థగా గుర్తించింది. అదే నేటి అంతర్జాతీయ కార్మిక సంస్థ.

అంతర్జాతీయ కార్మిక సంస్థ ప్రధాన కార్యలయం స్విట్జర్లాండ్‌లోని లేసాన్‌లో ఉంది. ప్రస్తుతం దీనిలో 144 దేశాలకు సభ్యత్వం ఉంది. వీటిలో కెనాడా, చైనా, ఫ్రాన్స్, పశ్చిమజర్మనీ, ఇండియా, ఇటలీ, జపాన్, రష్యా, బ్రిటన్, అమెరికా అనే పది దేశాలకూ శాశ్వత స్థానాలు ఉన్నాయి. మిగిలిన దేశాల ప్రతినిధులకు ఎన్నిక ఉంటుంది. దీని కార్యనిర్వాహక వర్గంలో 48 మంది సభ్యులు ఉంటారు. వీరిలో 24 మంది ప్రభుత్వాలకూ, 12 మంది ఉద్యోగులకూ, 12 మంది కార్మికులకూ ప్రతినిధులై ఉంటారు. ఎన్నికైన ప్రతినిధులు 3 సంవత్సరాలు పదవిలో ఉంటారు. ఈ కార్మిక సంస్థ ప్రతి సంవత్సరం సమావేశం అవుతూ ఉంటుంది.

## అంతర్జాతీయ తేదీ రేఖ

180° రేఖాంశాన్ని అంతర్జాతీయ తేదీ రేఖ అంటారు. చిత్రంలో చూపినట్లు ఇది వంకర టింకరగా పసిఫిక్ మహాసముద్రం మధ్య భాగం గుండా వెళుతుంది. 0° గ్రీనిచ్ రేఖాంశానికి 180° దూరంలో ఈ రేఖ ఉంటుంది. భూమి ఒకసారి తను చుట్టూ తాను తిరిగే




సమయం (24 గం.ల కాలం) ఒక రోజుగా పరిగణించ బడుతుంది. భూమి పశ్చిమం నుంచి తూర్పుకు తిరుగుతూ ఉండడం వల్ల పశ్చిమార్ధగోళంలో కంటె 24 గం. ముందుగా పూర్వార్ధ గోళంలో సూర్యోదయం అవుతుంది. అందుచేత తూర్పునుంచి పడమర దిశగా ప్రయాణం చేసే యాత్రికులు అంతర్జాతీయ తేదీ రేఖా (180° రేఖాంశం)ను దాటగానే తమ గడియారాలలోని తేదీని ఒకరోజు వెనుకకు (ఉదా 10వ తేదీని 9వ తేదీగా మార్చుకోవాలి. అలాగే పడమర నుంచి తూర్పు దిశగా ప్రయాణం చేసేవారు ఈ రేఖ దాటగానే తమ గడియారాలలోని తేదీని ఒక రోజు ముందుకు(ఉదా 9వ తేదీని 10వ తేదీగా) మార్చుకోవాలి. (చూ. గ్రీనిచ్ కాలమానం.)

## అంతర్జాతీయ ద్రవ్య నిధి

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత ప్రపంచ బ్యాంకుతో పాటుగా వివిధ దేశాలమధ్య ఆర్థిక వ్యవహారాలను సమన్వయ పరచడం కోసం ఏర్పాటైన మరొక అంతర్జాతీయ సంస్థ. 1944లో జరిగిన 'బ్రెటన్ వుడ్స్' కాన్ఫరెన్స్‌కు హాజరైన వివిధ దేశాలు బంగారం రూపంలోనూ, కరెన్సీ రూపంలోనూ ఇచ్చిన విరాళాలతో 1946లో వాషింగ్‌టన్ కార్య కేంద్రంగా స్థాపించ బడింది. ఈనాడు విదేశీమారక ద్రవ్యం కొరతవల్ల ఏర్పడే ఇబ్బందుల నుంచి సభ్యదేశాలను కాపాడేందుకు ఇది విశేషంగా తోడ్పడుతూంది.

## అంతర్వేది

ఆంధ్రప్రదేశ్ తూర్పు గోదావరి జిల్లాలోని సుప్రసిద్ధ నార సింహక్షేత్రాలలో ఒకటి. నరసాపురమునకు సమీపమున గోదావరీ నది బంగాళాఖాతంలో కలిసేచోట ఒక దీవి మీద ఈ ఆలయం ఉంది. ప్రతి ఏటా భీష్మ ఏకాదశి (జనవరి—ఫిబ్రవరి) నాడు బ్రహ్మోత్సవం జరుగుతుంది.

## అంబేద్కర్ 1891–1951

భారత రాజ్యాంగనిర్మాత. ప్రముఖజాతీయ నాయకుడు. పూర్తిపేరు భీమారావ్‌రామ్జీ అంబేద్కర్. 1891 ఏప్రిల్ 14న బొంబాయిలో ఒక నిరుపేద హరిజన కుటుంబంలో ఈయన జన్మించాడు. ఉన్నత విద్య అభ్యసించి ప్రముఖన్యాయవాది అయ్యాడు. స్వాతంత్ర్యం సిద్ధించగానే నెహ్రూ ప్రధాన మంత్రిగా ఏర్పాటైన

(1947) తాత్కాలిక కేంద్ర ప్రభుత్వంలో న్యాయ శాఖామాత్యులు అయ్యారు. భారత రాజ్యాంగం రూపొందించడంలో ప్రముఖపాత్ర నిర్వహించారు. అత్యంత దిగువ స్థాయిలో ఉన్నహరిజనుల సంక్షేమం కోసం పాటుపడడమే కాకుండా షెడ్యూల్డ్‌కులాలు, షెడ్యూల్డ్ తెగలవారికి సాంఘిక, ఆర్థిక న్యాయంసమకూర్చడానికి ఈయనవిశేషంగా కృషిచేశారు. 1951వరకూకేంద్ర ప్రభుత్వంలో ఈయన మంత్రిగా ఉన్నారు. హిందూ మతంలోని కుల భేదాలనూ, అసమానతలనూ నిరసిస్తూ తమ అనుయాయులతోసహా డా: అంబేద్కర్ బౌద్ధమతం స్వీకరించారు.



## అక్కన్న—మాదన్న

చూ. తానీషా

## అక్బర్ 1542–1605

భారతదేశాన్ని పాలించిన మూడవ మొగలాయీ చక్రవర్తి. హుమయూన్ కుమారుడు, బాబర్ మనుమడు. తండ్రి మరణానంతరం 1556లో అక్బర్ ఢిల్లీ సింహాసనం అధిష్ఠంచేనాటికి రాజ్యం అంతా అల్లకల్లోలంగా ఉంది. సామంతులు తిరుగ బడుతున్నారు. గద్దెఎక్కిన వెంటనే అక్బర్ చేసిన మొట్టమొదటి పని రెండవ పానిపట్టు యుద్ధంలో హేమూని జయించడం. 1576లో హల్దీఘాట్ యుద్ధంలో రాణా ప్రతాపసింహుణ్ణి అతడు ఓడించాడు. 1586 కాశ్మీరును, 1592లో ఒరిస్సాను జయించి క్రమంగా కాశ్మీరు నుంచి దక్షిణాపథం వరకూ మొగలాయీ పాలనను విస్తరింపచేశారు.

అక్బర్ గొప్ప పరిపాలన దక్షుడు. హిందూ మహమ్మదీయుల మధ్య సౌభ్రాత్రాన్నీ, సామరస్యాన్నీ పెంపొందించడానికి ప్రయత్నించాడు. రాజపుత్రస్త్రీ అయిన జోధ్‌బాయిని వివాహమాడి మతసహనం ప్రదర్శించాడు. తోడర్‌మల్‌వంటి రాజపుత్రులకు తనఆస్థానంలో ఉన్నతపదవులిచ్చాడు.అక్రమంగా హిందువులమీదవిధించిన జిజియా పన్ను(జుట్టుపన్ను)మరద్దుచేశాడు. సర్వమతాలసారమూ ఒకటే అని చాటుతూ 1589లో 'దీన్—ఇలా—హీ' అనే నూతన మతం స్థాపించాడు. బీర్బల్, తాన్‌సేన్ వంటి హిందూ విద్వాంసులను అక్బర్ తన ఆస్థానంలో పోషించాడు.

1571లో ఆగ్రాసమీపమున ఫతేపూర్ సిక్రీ అనే పట్టణం నిర్మించి అక్బర్ తన రాజధానిని అక్కడికి మార్చాడు. కాని అక్కడ నీటి ఎద్దడి ఏర్పడడంవల్ల తిరిగి రాజధానిని ఢిల్లీకి మార్పుచేయవలసి వచ్చింది. మొగలాయీరాజులందరిలో మాగొప్పవాడనీ,ధర్మాత్ముడనీ పేరుపొందిన అక్బర్ చక్రవర్తి 49 ఏళ్ళు రాజ్యంచేసి, 1605లో కన్నుమూశాడు.



## అక్షాంశ, రేఖాంశాలు

భూగోళం మీద అడ్డంగానూ, నిలువుగానూ కొన్ని ఊహారేఖలను భూగోళశాస్త్రజ్ఞులు ఏర్పాటు చేశారు. అడ్డంగా గీయబడిన ఊహారేఖలను అక్షాంశాలనీ, నిలువుగా గీసిన రేఖలను రేఖాంశాలనీ వ్యవహరిస్తారు. ఈ అక్షాంశ, రేఖాంశాలను డిగ్రీ (0°) లలో లెక్కిస్తారు. సువిశాలమైన భూగోళం మీద ఏ పర్వతం, ఏ నది, ఏ నగరం ఎక్కడ ఉందో తేలికగా నిర్దేశించేందుకు వీలుగా ఈ ఊహారేఖలు కల్పించబడ్డాయి.

అక్షాంశరేఖలలో భూగోళానికి అడ్డంగా మధ్య భాగంలో ఉన్న రేఖ(0°)ను 'నిరక్షరేఖ' (భూమధ్యరేఖ) అంటారు. దానికి ఉత్తరాన 90° (రేఖలు), దక్షిణాన 90° (రేఖలు) ఉన్నట్లు ఊహించారు. దక్షిణమున 23½° అక్షాంశమును మకరరేఖగాను, ఉత్తరమున 23½° కర్కాటరేఖగాను వ్యవహరిస్తారు.

ఇలాగే భూగోళాన్ని పూర్వార్ధ గోళంగానూ, పశ్చిమార్ధ గోళంగానూ విభజిస్తూ లండన్ సమీపంలోని గ్రీనిచ్ గుండా వెళ్లే (°) రేఖాంశాన్ని 'మెరిడియన్' అని వ్యవహరిస్తారు. దానికి తూర్పువైపు 180° (రేఖలు)

పడమటి వైపు 180° (రేఖలు) మొత్తం 360° రేఖాంశాలు ఉన్నట్లు ఊహించారు.

అక్షాంశ, రేఖాంశాలవల్ల వేరువేరు ప్రాంతాలమధ్య గల దూరాలను కూడా కచ్చితంగా లెక్కగట్టి చెప్పవచ్చు. ఒక డిగ్రీ (రెండు రేఖాంశాల) మధ్యదూరం 97 కి.మీ. అలాగే ఒక డిగ్రీ (రెండు అక్షాంశాల) మధ్య దూరం 111 కి.మీ. ఒకే రేఖాంశం మీద ఉన్న ప్రదేశాలలో సమయం ఎప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. (చూ. అంతర్జాతీయ తేదీ రేఖ)

## అగ్నిత్రయం

చూ. త్రేతాగ్నులు

## అగ్నిదేవుడు

వేదాలలో ప్రముఖంగా పేర్కొనబడిన ఒక దేవత. పురాణాలలో ఈయన బ్రహ్మదేవుని జ్యేష్ఠపుత్రుడైన 'అభిమాని'గానూ, ఈయన భార్య స్వాహాదేవిగానూ పేర్కొన్న బడ్డారు. 'స్వాహ' దేవికి పావకుడు, పావమానుడు, శుచి అని ముగ్గురు కుమారులు కలిగారు. వారు తిరిగి 45 మంది పుత్రులను కన్నారు. అందుచేత వాయు పురాణంలో అగ్నులు మొత్తం 49 గా పేర్కొనబడ్డాయి.

## అజంతా, ఎల్లోరా గుహలు


మహారాష్ట్రంలోని ఔరంగాబాదు పట్టణానికి 72 కి.మీ. దూరంలో ఉన్న .జగత్ ప్రసిద్ధిచెందిన గుహలు. అర్ధచంద్రాకారంగా ఉన్న ఒక కొండను 29 గుహలుగా తొలిచి వాటిలో బుద్ధుడి విగ్రహాలనూ ఇతర శిల్పాలనూ చెక్కారు. అవే అజంతా గుహలు. వాటి కుడ్యాలమీద అద్భుతమైన చిత్రాలను చిత్రించారు. ఇవి అన్నీ నేటికీ చెక్కు చెదరకుండా నిలిచి, ప్రపంచ పర్యాటకులమ విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

బౌద్ధ శిల్పులూ, చిత్రకారులూ క్రీ.పూ. 200– క్రీ.శ. 700 సంవత్సరాల మధ్య వీటిని నిర్మించారు. వీటిలో 10వ గుహ విలక్షణమైంది. ఈ అజంతా గుహలలో ప్రత్యేకంగా చెప్పుకోవలసినవి గుహల గోడల మీదా, కప్పులలోపల భాగాల మీదా చిత్రించిన వర్ణ చిత్రాలు. ఇవన్నీ బుద్ధుని జీవిత కథలను తెలియజేస్తున్నాయి.

ఎల్లోరా గుహలు: ఔరంగాబాదు పట్టణానికి 24 కి.మీ దూరంలో ఉన్నాయి. అజంతా గుహలన్నీ బౌద్ధమతానికి సంబంధించి నవే కాగా, ఎల్లోరాలో ఉన్న 34 గుహలలోనూ హిందూ, జైన, బౌద్ధమతాలు మూడింటికి చెందినవీ ఉన్నాయి. వీటిలో కైలాస నాథాలయం గుహ చాల గొప్పది. దీనిలో విశేషం గుడి మొత్తం స్తంభాలు, ద్వారాలు, చివరికి ధ్వజస్తంభంతోసహా అన్నీ ఒకేరాతిని తొలచి చెక్కడం. ఈ గుహాలయాలు సుమారు ఒకటిన్నర కిలోమీటరు పొడ వున వ్యాపించి ఉన్నాయి.

అజంతా, ఎల్లోరా గుహలలో చాలా గుహలను ఆంధ్రశిల్పులూ, ఆంధ్ర చిత్రకారులే రూపొందించారు. ఆనాడు ఈ ప్రాంతం అంతా ఆంధ్రసాతవాహన రాజుల ఏలుబడిలో ఉండేది.

## అజాద్, మౌలానా అబుల్ కలామ్



భారతస్వాతంత్ర్యోద్యమ ప్రముఖ నాయకులలో ఒకరు. 1889 లో మక్కాలో జన్మించి, బాల్యం అరేబియాలో గడిపారు. అరబిక్ భాషను, ప్రాచ్యమత సిద్ధాంతాలను అభ్యసించి మొదట ఉపాధ్యాయ వృత్తి చేపట్టారు. ఇరాక్, ఈజిప్ట్, సిరియా, టర్కీ, ఫ్రాన్స్ సందర్శించి యూరిపియన్ భాషాసారస్వతాల పరిచయం కూడా సంపాదించారు. 1898లో ఇండియాకు వచ్చి ఖిలాపత్ ఉద్యమంలో (1920) ప్రధాన పాత్ర వహించారు. తరువాత జరిగిన సహాయనిరాకరణోద్యమం, శాసనోల్లంఘనం, ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలో పాల్గొని అనేక సంవత్సరాలు కారాగారవాస శిక్ష అనుభవించారు. భారత జాతీయ కాంగ్రెస్‌కు 1920, 1930, 1940 – 46 సంవత్సరాలలో అధ్యక్షులుగా ఉన్నారు. స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన తాత్కాలిక భారత ప్రభుత్వంలో విద్యాశాఖామాత్య పదవి చేబట్టి 1958లో మరణించే వరకూ ఆపదవిలో ఉన్నారు. అజాద్ వ్రాసిన ఖొరాన్ వ్యాఖ్యానం ప్రసిద్ధిచెందింది. ఇదిగాక అరబ్బీ, ఉర్దూ, పారసీక భాషలలో అనేక రచనలు చేశాడు. తన ఆత్మకథను ఇంగ్లీషులో 'ఇండియా విన్స్ ఫ్రీడమ్' అను రచనలో పొందుపరచాడు. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం; ఖిలాఫత్ ఉద్యమం)

## అజాద్ హింద్ ఫౌజ్

చూ. సుభాస్ చంద్రబోస్

## అట్లాంటిక్ మహాసముద్రం

పసిఫిక్ మహాసముద్రం తరువాత అట్లాంటిక్ మహాసముద్రమే చాలా పెద్దది. ఇది యూరప్ ఖండానికీ, అమెరికా ఖండానికీ మధ్య ఉంది. ఇది చాలా పెద్దసముద్రం కావడంవల్ల యూరప్ ఖండవాసులకు దీనిని దాటి అమెరికా ఖండం చేరుకోవడం చాలా కాలం వరకూ సాధ్యం కాలేదు. 15వ శతాబ్దంలో భారతదేశానికి నూతన సముద్రమార్గం కనిపెట్టాలని బయలుదేరిన స్పానిష్ నావికుడు క్రిస్టఫర్ కొలంబస్ అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ప్రయాణంచేసి అనుకోకుండా 1492లో అమెరికా ఖండం చేరుకున్నాడు. అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటడానికి ఆనాడు ఆయనకు 70 రోజులు పట్టింది. అటు తరువాత 346 ఏండ్లకు 1838లో మొదటిసారిగా స్టీమ్ బోట్ 17 రోజులలోనే అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటింది. 1952లో అత్యాధునికమైన అమెరికన్ నౌక 3 రోజుల 10 గంటలలో దీనిని దాటగలిగింది. 1919లో తొలిసారిగా ఒక విమానం కేవలం 16 గంటలలోనే అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటింది.

ఈ సముద్రం విస్తీర్ణం: 8,16,62,000 చ.కి.మీ. మిక్కిలి లోతైన ప్రదేశం 'మిల్లినాకీ' డీప్ పోర్టరీకో గాడిలో ఉంది. అక్కడ దీనిలోతు 8,648 మీటర్లు.

## అట్లీ 1883–1967

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించేనాటికి (1947) బ్రిటిష్ ప్రధానిగా ఉన్నవారు. పూర్తి పేరు క్లిమెంట్ రిచర్డ్ అట్లీ. ప్రముఖ బ్రిటిష్ సోషలిస్ట్ నాయకుడు ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో స్టెప్నీ మేయర్‌గా పనిచేసి (1919–20), 1922లో పార్లమెంట్ సభ్యుడుగా ఎన్నికై, 1955 వరకూ, వరుసగా పార్లమెంట్‌కు ఎన్నికవుతూ వచ్చారు. 1935లో లేబర్‌పార్టీ నాయకుడై, ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో చర్చిల్ ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు పార్లమెంటులో ప్రతిపక్షనాయకులుగా పనిచేశారు. 1940లో చర్చిల్ ఏర్పాటు చేసిన సంకీర్ణ ప్రభుత్వంలో చేరి, 1943–45 లో ఉపప్రధాని అయ్యారు. 1945 ఎన్నికలలో లేబర్‌పార్టీ గెలుపొందడంతో అట్లీ బ్రిటిష్ ప్రధానమంత్రి అయ్యారు. 1955లో ఆయనకు 'ప్రభూ' (లార్డ్) బిరుదం లభించింది.

## అధర్వ(ణ)వేదం

మిక్కిలి ప్రాచీనమూ, హిందువులకు ఆరాధ్యమూ అయిన వేదాలలో ఇది నాల్గవది. తక్కిన మూడు వేదాలు: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం. అధర్వణవేదంలో 760 మంత్రాలూ, 6000 శ్లోకాలూ

(పనసలూ) ఉన్నాయి. ఇది ఇతర వేదాలలోని మంత్రాలవలె ఆధ్యాత్మిక చింతనతో కూడినవికావు. భూతాలు పిశాచాలు, మంత్ర తంత్రాలు మొదలైన వాటికి సంబంధించినవి.

## అధోలోకాలు

వీటినే 'నరకం' అనికూడా అంటారు. పాపాత్ములు ఆత్మలు పంపబడే ఈ నరకాలలో మొత్తం 21 రకాలు ఉన్నట్లు మనువు పేర్కొన్నారు. అవి 1. తమిస్రం, 2. అంధత మిస్రం, 3. మహారౌరవం, 4. రౌరవం, 5. నరకం, 6. కాలసూత్రం, 7. మహానరక పూతి మృత్తిక, 8. సంజీవనం, 9. మహావీచి, 10, తపన్న సంప్రతాపనం, 11. సంహతం, 12. కుడ్మం, 13. లోహం, 14, సంకు, 15. ఋజిస పంఠనం, 16. శాల్మని, 17. అసిపత్రవనం, 18. లోహదారకం, 19. తలాతలం, 20. కాకోలం, 21. అవీచి.

## అనంతపురం జిల్లా

ఆంధ్ర ప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. రాయలసీమలో కర్ణాటక రాష్ట్రానికి ఆనుకుని ఉన్న ఈ జిల్లాకు తూర్పున కడప జిల్లా, ఉత్తరాన కర్నూలు జిల్లా ఉన్నాయి. దీని విస్తీర్ణం: 19,125 చ.కి.మీ.; జనాభా: 26,18,239 (1981). జిల్లా కేంద్రం అనంతపురం. ఈ జిల్లాలో ప్రవహించే పెద్దనది పెన్న. హగరీ, చిత్రావతి, కుశావతి, పడకలేరు, స్వర్ణముఖి, పందమేరు, మద్దలేరు, పాపఘ్ని మొదలైనవి కూడ ఈ జిల్లాలోని నీటి వనరులలో పేర్కొనదగినవి. 'భైరవాని తిప్ప' వద్ద హగరీ నది మీద డామ్ కట్టారు. ఈ జిల్లాలో నీటి ఎద్దడి ఎక్కువ కావడంవల్ల జొన్న, సజ్జ వంటి మెట్టపంటలే ఎక్కువగా పండుతాయి. వేరుసెనగ వంటి వాణిజ్య పంటకూ, పట్టు పరిశ్రమకూడా ఈ జిల్లా ప్రసిద్ధి. ధర్మవరం పట్టుచీరలకు ప్రసిద్ధి. గుంతకల్లు, గుత్తి ప్రధానమైన రైల్వే జంక్షన్‌లు. లేపాక్షిలోని బసవన్న, గుత్తికోట, తాడిపత్రి, పెనుకొండల లోని విజయనగర రాజులు నాటి శిల్పసంపద పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి. హేమవతి జైనశిల్ప కళకు, కటారుపల్లె వేమన్న సమాధికి కదిరి పురాతన వటవృక్షానికి ప్రసిద్ధి చెందాయి. జిల్లా కేంద్రమైన అనంతపురం పట్టణంలో శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, నూనె గింజల పరిశోధన కేంద్రం ఉన్నాయి.




## అన్నంభట్టు

సంస్కృతంలో గొప్ప విద్వాంసుడుగా ప్రసిద్ధి పొందిన ఆంధ్రుడే. ఈయన వ్రాసిన 'తర్కసంగ్రహం' న్యాయశాస్త్రం అధ్యయనం చేసేవారికి తొలి పాఠ్యగ్రంథముగా భారతదేశం అంతటా పఠన పాఠానాలలో. ఉంది. ఈయన గుంటూరుజిల్లా గరికపాడు వాస్తవ్యుడనీ, 15వ శతాబ్దంలో జీవించాడనీ కొందరూ, 18వ శతాబ్దం తొలిపాదం వాడని మరికొందరూ అంటున్నారు. 'మీమాంస', వేదాంతం', 'వ్యాకరణా'లకు సంబంధించిన గ్రంథాలను కూడా ఈయన రచించాడు.

## అన్నమాచార్యులు 1424–1503



సుప్రసిద్ధాంధ్ర పదకర్త, వాగ్గేయకారుడు, కడప జిల్లా లోని తాళ్లపాక గ్రామంలో జన్మించి, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర స్వామిని భక్తితో సేవించాడు. స్వామిని కీర్తిస్తూ 32,000 కీర్తనలూ, పదాలూ ఈయన రచించాడు. ఈయన ఇతర రచనలలో ముఖ్యమైనవి: ద్విపదరామాయణం, శృంగార మంజరి, వేంకటేశ్వర శతకం, సంస్కృతంలో వేంకటాచలమహాత్మ్యం అనే మరో గ్రంథం కూడా ఈయన రచించారు. అన్నమయకు 'పద కవితా పితామహు'డనీ 'సంకీర్తనాచార్యు'డనీ బిరుదులు కలవు. సుప్రసిద్ధ విమర్శక పండితులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ అన్నమయ కీర్తనలను పరిశీలించి, కొన్నింటిని స్వరపరచి వాటి పట్ల ఆసక్తిని, అభిరుచిని కల్గించినారు.

సుమారు 32 కి.మీ. దూరంలో ఉంది. ఒకప్పుడు ప్రపంచ ప్రసిద్ధి గాంచిన బౌద్ధక్షేత్రం ఇది. దక్షిణాదిన



అమరావతి స్తూపం

ఆనాడు మహాయాన బౌద్ధానికి ముఖ్య కేంద్రంగా ఉండేది. ఇక్కడ బౌద్ధ భిక్షువులు క్రీ.పూ. 2వ శతాబ్దంలో బుద్ధుని దంతావశేషాన్ని నిక్షేపించి దాని మీద బ్రహ్మాండ మైన స్తూపాన్ని నిర్మించారు. 49 మీటర్ల వెడల్పు 29 మీటర్ల ఎత్తుగల ఈ స్తూపం నేడు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సాంచీ స్తూపం కంటే కూడా పెద్దది. దీనికి సమీ పంలో బౌద్ధ భిక్షువుల ఆరామాలు, విద్యాలయాలు ఉండేవి. విద్య నేర్చుకోడానికి పలుదేశాల నుంచి విద్యార్థులు ఇక్కడికి వస్తూ ఉండేవారు. క్రీ.శ. 640లో ఈ క్షేత్రాన్ని దర్శించిన చైనా యాత్రికుడు హ్యూయాన్ స్యాంగ్ దీనిని గురించి ఘనంగా కీర్తించాడు. ఈ స్తూపం మీదా సమీపంలోనూ బుద్ధుని జీవితంలోని వివిధ ఘట్టాలను తెలియజేసే అద్భుతమైన శిల్పఖండాలు ఉండేవి. దురదృష్టవ శాత్తూ మత దురహంకారుల చేతులలో ఈ స్తూపం, శిల్పాలు ధ్వంసం అయ్యాయి. ఈనాడు అమరావతిలో ఒకప్పుడు స్తూపం ఉండేదని సూచించే పునాదులు మాత్రమే అవశేషాలుగా మిగిలి ఉన్నాయి. శిల్పాలలో ఎన్నోపోగా మిగిలినవాటిని మద్రాసు మ్యూజియంలోనూ, లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియంలోను భద్రపరిచారు. ఇంకా కొన్నింటిని అమరావతిలోనే ఒక మ్యూజియం నిర్మించి అందులో ఉంచారు. ఉన్నవి కొంచెమే అయినా ఈ అవశేషాలు ఆనాటి శిల్పుల అసమాన ప్రతిభను చాటుతున్నాయి.

బౌద్ధమతం అంతరించాక వీరశైవం ఇక్కడ విజృంభిం చింది. కృష్ణానదీ తీరంలో ఉన్న ఈ అమరావతిలో వీరు అమరలింగేశ్వరాలయం నిర్మించారు. రాజావాసిరెడ్డి వెంక టాద్రి నాయుడు ఈ ఆలయాన్ని అభివృద్ధి పరిచారు. ఈనాడు అమరావతిలో యాత్రికులను ప్రధానంగా ఆకర్షించేది ఈ శివాలయమే.

అమరావతికి సమీపంలోనే ప్రాచీన ఆంధ్ర సాత వాహనుల రాజధాని 'ధాన్యకటకం' ఉంది. ఇక్కడ పురావస్తు శాఖవారు జరిపిన త్రవ్వకాలలో ఆ కాలానికి చెందిన మృణ్మయ పాత్రలు, ఆభరణాలు, ఆయుధాలు, నాణేలు వంటి అమూల్య వస్తువులు ఎన్నో దొరికాయి. వీటి ఆధారంతో ఆనాటి చరిత్రనూ, ప్రజల జీవనం విధానాన్ని తెలుసుకోడానికి అవకాశం కలుగుతూంది.

## అమీర్ ఖుస్రూ 1252–1324

హిందీ, పారసీక మహాకవి. సూఫీ గురువు 'చిస్తీ' సంప్రదాయ అవలంబకుడు. ఖిల్జీ, తుగ్లక్ ప్రభువుల కొలువులో ఆస్థాన కవి. ఈయన ప్రధాన రచనలు: తాజుల్ ఫతూహ్, నుహ్‌సిపేర్ తుగ్లక్‌నామా.

## అమృత్‌సర్

సిక్కుల పవిత్ర యాత్రాస్థలం. పంజాబ్ రాష్ట్రంలో వాయవ్యభాగాన ఉంది. ఇచ్చటి స్వర్ణ దేవాలయం యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తూంది. చూ. గురునానక్; గ్రంథసాహెబ్; సిక్కుమతం.



## అమెజాన్ నది

దక్షిణ అమెరికాలోని ఒక పెద్దనది. భారీ రాశిలో వర్షపునీటిని జలనిర్గమనం చేసేనది ఇంతకంటే పెద్దనది ప్రపంచంలోనే లేదు. పెరూలో ఆండీస్ పర్వతాల్లో పుట్టే హా ఆర్కో ఉసియాల్ నది, మారానాన్ నదులు కలిసి అమెజాన్ నదిగా ఉత్తర బ్రెజిల్‌లో ప్రవహించి బెలెమ్ అనుచోట అట్లాంటిక్ మహాసముద్రంలో సంగమిస్తూంది. దీని పరీవాహక ప్రాంతం 60 లక్షల చ.కి.మీ. అమెజాన్ నదికి ఉపనదులు మెదిరోనది వంటివి అనేకం ఉన్నాయి. అమెజాన్ నది ప్రవహించే ప్రదేశం వర్షారణ్యాలతో నిండిన దట్టమయిన అడవులు. అమెజాన్ నదిలో నౌకలు పెరూలోని ఈక్విటోస్ రేవు వరకూ ప్రయాణిస్తూ ఉంటాయి.

## అమెరికన్ విప్లవం చూ. బోస్టన్ టీ పార్టీ

## అమెరికా

ఉత్తర, దక్షిణ దిశలుగా 15,300 కి.మీ. పొడవున వ్యాపించి ఉన్న పొడవాటి భూఖండం. దీనిలో మూడు భాగాలు: 1 ఉత్తర అమెరికా, 2 మధ్య అమెరికా, 3 దక్షిణ అమెరికా. ఉత్తర అమెరికాలో యునైటెడ్ స్టేట్స్, కెనడా దేశాలున్నాయి. దక్షిణ అమెరికానే లాటిన్ అమెరికా అనికూడా అంటారు. దీనిలో బ్రెజిల్, అర్జెంటీనా, పెరూ, చిలీ, ఉరుగ్వే, పరాగ్వే, బొలీవియా, కొలంబియా, సురినామ్ మొదలైన దేశాలు ఉన్నాయి. మెక్సికో మొదలైన దేశాలతో కూడింది మధ్య అమెరికా. ఉత్తర అమెరికాలో ఇంగ్లీష్, ఫ్రెంచ్ భాషలూ, దక్షిణ అమెరికాలో స్పెనిష్, పోర్చుగీస్ భాషలూ మాట్లాడతారు. అమెరికా ఉనికి మొదట 1492 లోనే కొలంబస్ కనుగొనినప్పటికీ 'అమెరిగో వెస్పుస్సీ' (1497) మొదట గ్రంథస్థం చేయడంవల్ల ఈ భూ ఖండానికి 'అమెరికా' అనే పేరు వచ్చింది. (చూ. ఆయా దేశాలు).

## అయనం

సంవత్సరాన్ని ఉత్తరాయనం, దక్షిణాయనం అని రెండు భాగాలుగా విభజించారు. ప్రతి అయనం మూడు ఋతువులతో కూడి ఉంటుంది. సూర్యుడు భూమధ్య రేఖ నుంచి ఉత్తర దిశగా ప్రయాణించే ఆరు మాసాల కాలాన్నీ ఉత్తరాయనం అనీ, దక్షిణ దిశగా ప్రయాణించే ఆరు మాసాల కాలాన్నీ దక్షిణాయనం అనీ అంటారు. ఉత్తరాయనం ప్రారంభించే రోజునే మనం మకర సంక్రాంతి పండుగను జరుపుకుంటాం.

## అయోధ్య

హిందువులకు పవిత్రమైన సప్త పుణ్య క్షేత్రాలలో ఒకటి. ఉత్తర ప్రదేశ్‌లో లక్నో, అలహాబాద్ రైలు మార్గంలో ఫైజాబాద్ సమీపంలో ఉంది. ఫైజాబాద్, అయోధ్య కలిసిపోయి జంటనగరాలుగా ఉంటాయి. సరయూనదీ తీరాన ఉన్న ఈ క్షేత్రం రామ జన్మభూమి కావడం వల్ల హిందువులకు పరమ పవిత్రమైన పుణ్య క్షేత్రం.

## అరకులోయ

ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్టణానికి 200 కి.మీ. దూరంలో ఉన్న సుందర వన్య వినోద యాత్రాస్థలం. (దీని ఉనికి 18° 20' ఉ 82° 50 తూ). ఘాట్‌రోడ్ మీద ప్రయాణం ఉల్లాసకరంగా ఉంటుంది. సముద్రమట్టానికి 975 మీ. ఎత్తున ఈ లోయ ఉంది.

## అరవిందఘోష్ 1872–1950

భారతీయ తత్త్వవేత్త, విప్లవయోధుడు, 1905 లో బెంగాల్ విభజనను ప్రతిఘటిస్తూ జాతీయోద్యమంలో ప్రవేశించి, ఆయన విప్లవ పంథాతొక్కారు. 'వందేమాతరం', 'కర్మయోగిన్', 'ఆర్య' (1940) అనే పత్రికలకు సంపాదకత్వం వహించి తన విప్లవాత్మక, తాత్త్విక సందేశాలను ఆయన ప్రజలకు అందజేశారు. 1910 నుంచి తురీయాశ్రమం స్వీకరించి, యోగ సాధనకై దక్షిణాదిన పాండిచ్చేరిలో అరవిందాశ్రమం స్థాపించారు. 'మదర్' గా ప్రసిద్ధి పొందిన ఫ్రెంచ్ మహిళ ఆయనకు ప్రధాన శిష్యురాలు. 'సావిత్రి' మొదలైన అరవింద ఘోష్ రచనలు విశ్వవిఖ్యాతి పొందాయి. 1950లో పాండిచ్చేరి లోనే అరవింద ఘోష్ సిద్ధి పొందారు.



## అరిషడ్వర్గాలు

మనిషికి శత్రువులు బయట కాకుండా తన మనస్సులోనే ఉంటారనీ, అలాంటి శత్రువులు ఆరుగురనీ భారతీయ తత్త్వశాస్త్రం బోధిస్తుంది. ఆ శత్రువులు: 1. కామం (కోరిక), 2. క్రోధం (కోపం), 3. లోభం (పిసినారితనం), 4. మోహం (భ్రాంతి, అజ్ఞానం), 5. మదం (అహంభావం, గర్వం), 6. మాత్సర్యం (ఈర్ష్య, అసూయ). ఈ శత్రువులను ముందుగా అణచివేస్తేగాని మనిషికి ఆత్మశాంతి కలుగదని భారతీయుల విశ్వాసం.

## అరుణాచలప్రదేశ్

భారతదేశంలోని 25 రాష్ట్రాలలోను ఈశాన్య భాగాన ఉన్న పర్వతమయమైన రాష్ట్రం. మూడు ప్రక్కల అంతర్జాతీయ సరిహద్దులుగల ఈ రాష్ట్రానికి దక్షిణాన అస్సాం రాష్ట్రం ఉంది. విస్తీర్ణం: 83,743 చ.కి.మీ.




జనాభా: 6,32,000 (1981). రాజధాని: ఇతానగర్. అధికార భాష: అస్సామీ ప్రజలలో అధిక భాగం (79 శాతం) ఆదిమవాసులు. వారిలో ఆది, నిషీ, అపాతనీ, టాగిన్, మిష్మీ, సింగ్పో, మోన్పా, షె క్టడుక్ పెన్, ఆకొరాతెగలు ప్రధానమైనవి. ఈ ఆదిమజాతులు వారు నేటికిని తమ గిరిజన భాషలోనే మాట్లాడు తున్నారు. ఈ ఈశాన్య సరిహద్దు రాష్ట్రం1972 వరకూ నీఫా రాష్ట్రంగానూ, ఆ తరువాత 'అరుణాచలప్రదేశ్' కేంద్ర పాలిత ప్రాంతంగా ఉండేది. 1975లో పూర్తి స్థాయి రాష్ట్రంగా అవతరించింది. ఆర్థికసంపద: అటవీసామగ్రి, వరి, మొక్క జొన్న చిరుధాన్యాలు, గోధుమ, ఆవాలు పండుతాయి.

## అరేబియా

నైరృతి ఆసియాలో ఎడారులతో నిండి ఉన్న ఒక ద్వీపకల్పం. సౌదీ అరేబియా, యెమెన్, ఓమాన్ (మస్కాట్), యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, కాటార్, ఏడెన్, కువాయిట్ మున్నగు దేశాలు అరేబియాలో ఉన్నాయి.

మహమ్మద్ ప్రవక్త జన్మించిన మెక్కా పట్టణం ఎర్రసముద్రాన్ని (రెడ్‌సీ) ఆనుకుని అరేబియాలో పశ్చిమ తీరాన ఉంది. పెట్రోలు, చమురు వాయువు పుష్కలంగా లభించడం వల్ల గత 100 ఏళ్ళుగా ఈ ప్రాంతం సుసంపన్నం అయింది. తూర్పున అరేబియా సముద్రం, పశ్చిమాన ఎర్రసముద్రం, ఈశాన్య భాగాన పర్షియన్ సింధు శాఖ ఉన్నాయి. సాగర తీరాలలో ఉన్న పట్టణాలలోనే జనసాంద్రత ఎక్కువ.

అరేబియా జనాభా 2 కోట్లు. ఇందులో 20 లక్షల మంది ఒక చోట నిలకడగా ఉండని దేశద్రిమ్మరి జాతులవారు. ఈ ప్రాంతంలో అక్కడక్కడ ఒయాసిస్‌లు అనబడే పచ్చ పట్టులు ఉంటాయి. అక్కడ పంటనీరు దొరకదు. దొరికిన చోట్ల బార్లీ, మొక్కజొన్న, గోధుమ, చిరుధాన్యాలు పండిస్తారు. పుచ్చ, ద్రాక్ష, ఖర్జూరం, అంగూర, అత్తిపండ్లు ఎక్కువగా పండుతాయి. శ్రేష్ఠమైన అశ్వజాతికి అరేబియా ప్రసిద్ధి! చూడటానికి అందంగా ఉండి, మంచి, పనివాళ్ళుగా అరబ్బీలు ప్రసిద్ధి పొందారు. వేసవికాలంలో ఉష్ణోగత 54° సెంటీగ్రేడ్ దాకా పెరిగి ఎండలు మండి పోతూ ఉంటాయి. అరేబియాలోని పెద్ద పట్టణం కువాయిట్‌లో జనసంఖ్య ఎక్కువ. ఆహార దినుసులు, యంత్ర సామాగ్రి విదేశాలనుంచి వారు దిగుమతి చేసుకుంటారు.

## అరేబియన్ నైట్స్

సుమారు 1000 ప్రపంచ ప్రసిద్ధమైన కథలు గల అరబ్బీగాథావళి. సుల్తాన్ షాహ్రియాన్ తాను వివాహమాడిన మరునాడే ఆ నవ వధువుకు మరణదండన విధిస్తూ తీర్పు చెప్పేవాడు. ఒక వజీరు కుమార్తె షెహెర్ జాదే సుల్తాన్‌ను వివాహమాడ గోరుతుంది. శోభనం నాటిరాత్రి తాను చెప్పే ఒకే ఒక కథను వినవలసిందిగా భర్తను ఆమె బ్రతిమాలుతుంది. సుల్తాన్ అంగీకరిస్తాడు.

కథ మంచి రసవత్తర ఘట్టంలో ఉండగా తెల్లవారిపోతుంది. ఆమె కథా విధానం సుల్తాన్‌కు నచ్చడం వల్ల మరణ దండనను మరునాటికి ఆయన వాయిదా వేస్తాడు. ఇలా ప్రతిరాత్రీ ఒక్కొక్క రసవత్తరమైన కథ చెబుతూ షెహెర్‌జాదే తన ఆయుస్సును పెంచుకుంటు పోవడం అరేబియన్ నైట్స్ కథలలో ప్రధాన ఇతి వృత్తం. వెయ్యిన్నొకటవ రాత్రి చెప్పిన వెయ్యిన్నొకటవ (1001) కథను సుల్తాన్ చాలా మెచ్చుకుంటాడు. తన నిర్ణయం మార్చుకుని ఆమెకు విధించిన మరణ దండనను రద్దుచేస్తాడు. ఈ కథలలోని 'మాయలాంతరు అల్లావుద్దీన్,' 'ఆలీబాబా నలభై దొంగలు,' 'సింద్‌బాద్ అనే నావికుడు' వంటి కథలెన్నో విశేష ప్రసిద్ధిని పొందాయి.

## అర్జునుడు

పంచపాండవులలో మూడవ వాడు కుంతికి ఇంద్రుని అనుగ్రహం వలన జన్మించాడు. ద్రోణాచార్యుని వద్ద విలువిద్య నేర్చి గొప్ప ధానుష్కుడయ్యాడు. ధనుర్విద్యలో ఆయన ప్రజ్ఞ సాటిలేనిది. శ్రీకృష్ణుని సోదరి సుభద్రను వివాహమాడాడు. అర్జునునికి ఆమె వలన కలిగిన కుమారుడే అభిమన్యుడు. కురుక్షేత్ర సంగ్రామ రంగంలో శ్రీకృష్ణుడు ఆత్మతత్త్వాన్నీ, సృష్టి తత్త్వాన్నీ, మానవ కర్తవ్యాన్నీ అర్జునునకు వివరిస్తూ గీతోపదేశం చేస్తాడు (చూ. భగవద్గీత). కిరీటి, గాండీవి, ధనంజయుడు, పార్థుడు, ఫల్గునుడు, విజయుడు, సవ్యసాచి మొదలగునవి అర్జునుని పేర్లు. అర్జునుని విల్లు పేరు గాండీవం.

## అలినోద్యమం చూ. నాన్ ఎలైన్డ్ మూమెంట్

## అల్లూరి సీతారామరాజు

సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధుడు. 1897లో పశ్చిమ గోదావరి జిల్లాలోని మోగల్లు గ్రామంలో ఈయన జన్మించారు. రాజమండ్రి, విశాఖపట్నం, నరసాపూర్‌లలో హైస్కూల్ విద్య అభ్యసించారు. కాని, ఆంగ్ల విద్య అబ్బక పోవడంవల్ల విద్యకు స్వస్తి చెప్పారు. విలువిద్య, గుర్రపు స్వారీ వంటి ఆటవిక విద్యలు నేర్చుకున్నారు. అలాగే పెక్కు భాషలు, మంత్రతంత్రాలు, సాముద్రికం, యోగాభ్యాసం మొదలైనవి నేర్చుకున్నారు. 1921–22 మధ్యలో ఆయన విశాఖపట్టణం జిల్లాలోని కృష్ణదేవి పేట అనే గిరి జన గ్రామానికి వెళ్లి అక్కడ రామ మందిరం నిర్మించి తపస్సు చేయసాగాడు. అప్పటి నుంచి అక్కడ కోయలు, ఇతర గిరిజనులు సీతారామరాజుని దైవాంశ సంభూతునిగా భావించి ఆరాధింప సాగారు.



ఆరోజులలో గాంధీ మహాత్ముని సహాయ నిరాకర ణోద్యమం తీవ్రంగా సాగుతూంది. ఆయన ఆదేశం మేరకు సీతారామరాజు ప్రజలను ప్రభుత్వపు కోర్టులను బహిష్కరించవలసిందిగా కోరారు. అంటాడ, రంప, పెద్దవలస గ్రామాలలో పంచాయతీ న్యాయస్థానాలు ఏర్పరిచాడు. ఆ ప్రాంతాల ప్రజలు ఈ న్యాయ స్థానాలలో పెద్ద మనుష్యులద్వారా తమ తగవులను పరిష్కరించుకో సాగారు. దానితో బ్రిటిష్ పాలకులు ఆగ్రహం చెంది సీతారామరాజుపై రాజద్రోహం నేరంమోపి ఆయనను జైలులో వేశారు. అయితే ఆయనకు ఎవరూ వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పేవారు లేకపోవడంతో గత్యంతరంలేక ఆరువారాల తర్వాత ఆయనను విడుదల చేశారు. అయినప్పటికీ ఆయన మీద గూఢచారులను నియమించి వేధించ సాగారు.

ఆ కాలంలో గూడెం కొండల మధ్య ఉన్న గానాలపాలెం అనే గ్రామంలో మల్లుదొర, గంటందొర అనే సోదరులు ఉండేవారు. వీరికి చుట్టుపక్కల గ్రామాలలో మంచి పలుకుబడి ఉండేది. వీరిమీద ప్రభుత్వ వ్యతిరేక నేరంమోపి వారిని మునసబుగిరి నుంచి తొలగించి వారి భూములను కూడా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. సెబాస్టియన్ అనే తహసీల్‌దార్ ఈ అన్యాయం చేశాడు. మల్లు, గంటం దొరలకు అనేకమంది గూడెం నాయకులు అండగా నిలిచారు. వీరందరూ సీతారామరాజు దగ్గరకు పోయి మొరపెట్టుకుని ఆయన సహాయం కోరారు. లమ్మసింగు అనే చోట రోడ్డు వేయడానికి ప్రభుత్వం తీర్మానించింది. దీనికి గవర్నమెంటు కంట్రాక్టర్లుగా కూడా సెబాస్టియన్, ఓవర్‌సీర్ సంతానం పిళ్లేలు

వ్యవహరింపసాగారు. కూలీలకు సరిగా పైసలు ఇవ్వక ఆడ, మగ అనే తేడాలు లేకుండా వారిని హింసలకూ, అవమానాలకూ గురిచేస్తూ ఉండేవారు. వారందరూ కూడా సీతారామరాజు శరణు వేడారు. దానితో సీతారామరాజు మన్యం ప్రజలకు నాయకత్వం వహించి ప్రభుత్వంపై తిరుగుబాటు లేవదీశాడు. ఆయన నాయకత్వంలో మూడు వందల మంది గిరిజనులు విల్లులు, అమ్ములు, ఈటెలు, బల్లాలు, గొడ్డళ్లువంటి ఆటవిక ఆయుధాలతో ముందుకు వచ్చారు. ముందుగా వీరు 1922 ఆగస్టు 12న చింతపల్లి పోలీస్‌స్టేషన్‌ను ముట్టడించి దానిలోని ఆయుధాలనూ మందు సామాగ్రినీ స్వాధీనం చేసుకున్నారు. ఆగస్టు 24న కృష్ణదేవి పేట పోలీస్‌స్టేషన్ నుంచి కూడా ఆయుధాలు సంపాదించారు. ఈ వార్త తెలిసి విశాఖపట్నం కలెక్టర్ పోలీసు బలగంతో వెళ్లాడు. వీరికీ, గిరిజనులకూ మధ్య పోరాటం జరిగింది. పోలీసులు తట్టుకోలేక పారిపోయారు. దానితో ప్రభుత్వం అస్సాము, మలబారుల నుంచి అదనపు పోలీసు బలగాలను తెప్పించడమే కాకుండా సీతారామరాజును పట్టిచ్చిన వారికి రూ. 10,000 బహుమానాన్ని ప్రకటించారు. వెదురు ముడి వద్ద జరిగిన పోరాటంలో గాముదొర చనిపోయాడు. అగ్గిదొర, మల్లుదొర బందీలయ్యారు. సీతారామరాజు వేరేచోట ఉండిపోయాడు. దానితో గిరిజనులు చెప్పరాని కష్టాలకు గురి అయ్యారు. చివరికి అస్సాము సైనికుడు ఒకడు కొయ్యూరు సమీపంలోని అడవిలో సీతారామరాజుని పట్టుకుని అధికారులకు అప్పగించాడు. ఆయనను పోలీసులు తుపాకీతో కాల్చిచంపారు. మహాయోధుడు సీతారామరాజు!

## అశోకుడు

భారతదేశ చరిత్రలో సుప్రసిద్ధులైన చక్రవర్తులలో అశోకుడు ఒకడు. ఈయన మౌర్య వంశానికి చెందినవాడు. తండ్రి బిందుసారుడు. తాత మౌర్య చంద్ర గుప్తుడు. క్రీ.పూ. 272లో ఈయన చక్రవర్తిగా అభిషిక్తుడు అయాడు. రాజ్యానికి వచ్చిన వెంటనే అనేక రాజ్యాలను జయించి మగధ రాజ్యం విస్తరింపజేశాడు. చివరకి క్రీ.పూ. 268లో కళింగ దేశం (నేటి ఒరిస్సా)పై దండయాత్ర చేశాడు. మూడు సంవత్సరాలు సాగిన ఈ యుద్ధంలో రక్తం ఏరులై పారింది. సుమారు లక్ష మంది మరణించారు. ఇంకెన్నో లక్షలమంది క్షతగాత్రులయ్యారు. ఊళ్లకు ఊళ్లే నాశనం అయాయి. ఈ కఠోర దృశ్యాలు



అశోకుడు అశోకస్తంభం

చూసేసరికి అశోకుని హృదయం ద్రవించి పోయింది. అప్పటి వరకూ కర్కోటకుడుగా, రక్త పిపాసువుగా ఉన్నవాడు అమాంతం శాంతికాముకుడు అయిపోయాడు. దయార్ద్ర హృదయుడుగా మారిపోయాడు. జయించవలసింది మానవుల మనస్సులను కాని రాజ్యాలను కాదు అన్న సత్యం గ్రహించాడు. బుద్ధుని బోధనల వలన ప్రభావితుడై బౌద్ధమతం స్వీకరించి బౌద్ధ భిక్షువుగా మారాడు. బౌద్ధ మతాన్ని భారతదేశంలోనే కాకుండా కుమార్తె సంఘమిత్రను సింహళదేశానికి పంపి అక్కడ బౌద్ధాన్ని వ్యాపింపజేశాడు. దేశంలో 47 చోట్ల శిలాస్తంభాలను ప్రతిష్ఠించి వాటిపై బౌద్ధ ధర్మాలను చెక్కించాడు.

అశోకుని పరిపాలన ఆదర్శప్రాయంగా సాగింది. ప్రజలను కన్న బిడ్డలుగా చూశాడు. మనుష్యులకూ, జంతువులకూ కూడా ఎన్నో ఆసుపత్రులు కట్టించాడు. నూతులు తవ్వించాడు. బాటలు నిర్మించి బాటసారుల కోసం విశ్రాంతి గృహాలు నిర్మించాడు. జంతు వధను నిషేధించాడు. బౌద్ధమతాన్ని స్వీకరించినా, హిందూ మతాన్ని కూడా గౌరవించి ఆదరించాడు. క్రీ.పూ. 231లో అశోకుడు మరణించాడు. ఈనాడు. భారత

ప్రభుత్వం జాతీయ పతాకంలో స్వీకరించిన ధర్మచక్రం సారనాథ్‌లోని అశోకస్తంభాల మీద నుంచి గ్రహించిందే!

## అష్టదిక్పాలురు

ఎనిమిది దిక్కులకు అధిపతులుగా ఎనిమిది మంది దేవతలు ఉన్నారని భారతీయ పురాణాలు చెబుతున్నాయి: తూర్పు — ఇంద్రుడు; ఆగ్నేయం — అగ్నిదేవుడు; దక్షిణం — యముడు; నైర్రుతిమూల — నిర్రుతి; పశ్చిమం — వరుణుడు; వాయవ్యం — వాయువు; ఉత్తరం — కుబేరుడు; ఈశాన్యం — ఈశానుడు.

## అష్టదిగ్గజాలు

16వ శతాబ్దానికి చెందిన శ్రీకృష్ణదేవరాయల (చూ.) ఆస్థానంలోని 8 మంది మహాకవులు. రాయలు తాను స్వయంగా కవి. ఎందరో మహాకవులను ఆయన తన ఆస్థానానికి ఆహ్వానించి గౌరవించేవాడు. అష్టదిగ్గజాలుగా ప్రసిద్ధిపొందిన వారు రచించిన ప్రసిద్ధ కావ్యాలు: అల్లసాని




పెద్దన: మనుచరిత్ర; నందితిమ్మన: పారిజాతాపహరణం; ధూర్జటి: శ్రీకాళహస్తి మహాత్మ్యం; మాదయగారి మల్లన: రాజ శేఖర చరిత్రము; అయ్యలరాజు రామభద్రుడు: రామాభ్యుదయం; రామరాజభూషణుడు: వసుచరిత్ర; పింగళి సూరన: కళాపూర్ణోదయం; తెనాలి రామకృష్ణ: పాండురంగ మహాత్మ్యం.

## అష్టభోగాలు

సౌఖ్యహేతువులైన ఈ క్రింది అంశాలను ప్రాచీనులు అష్టభోగాలుగా పేర్కొన్నారు. అవి: 1. గంధం, 2. తాంబూలం, 3. పుష్పం, 4. భోజనం, 5. వస్త్రం, 6. సతి, 7. స్నానం, 8. సంయోగం.

## అష్టసిద్ధులు

యోగసాధన వలన మనిషి మనస్సు సాధించే 8 విధాలైన మహిమలను అష్టసిద్ధులు అంటారు. యోగ సూత్రంలో సిద్ధులు ఎనిమిదిగానే పేర్కొనబడినా బ్రహ్మవైవర్త పురాణం మొదలైన వాటిలో మరో 26 సిద్ధులు కూడా చేర్చి మొత్తం 34 సిద్ధులు పేర్కొన బడ్డాయి. అణిమ, గరిమ, లఘిమ, దూర దర్శనం, దూరగమనం, దూరశ్రవణం మొదలైనవి ఈ సిద్ధులలో ప్రధానమైనవి.

## అష్టాదశపురాణాలు చూ. పురాణాలు

## అష్టాధ్యాయి

సంస్కృత భాషలో పాణిని రచించిన జగత్ ప్రసిద్ధి పొందిన వ్యాకరణ గ్రంథం. ఒక్కొక్క అధ్యాయానికి నాలుగేసి పాదాలచొప్పున 8 అధ్యాయాలలో మిక్కిలి సంక్షిప్తంగా ఈ వ్యాకరణం వ్రాయబడింది. అందుకే ఇది 'అష్టాధ్యాయి' అయింది. ప్రపంచ భాషావేత్తలకు ఆశ్చర్యం కలిగించిన అద్భుతమైన వ్యాకరణ గ్రంథం ఇది. చూ. పతంజలి

## అష్టావధానం

ఏకకాలంలో ఎనిమిది అంశాలమీద అవధానం నిలుపుతూ గొప్ప ధారణశక్తిని, మేధాశక్తిని ప్రదర్శించే విద్య. అష్టావధానంలో కవి ఎంచుకునే అంశాలు సాధారణంగా 1. వర్ణన; 2. సమస్య; 3. నిషిద్ధాక్షరి; 4. వ్యస్తాక్షరి; 5. ఆశువు; 6. పురాణం; 7. ఖేలనం; 8. గణనం.

ఎనిమిది మంది పృచ్ఛకులు ఈ ఎనిమిది అంశాలు ప్రశ్నిస్తూ ఉండగా ఒక్కొక్క తడవకు ఒక్కొక్క పాదం చొప్పున చెబుతూ నాలుగు పాదాలు పూర్తి అయిన తర్వాత మొత్తం పద్యాన్నంతనీ ధారణ పట్టి చివరకు అవధాని అప్పచెప్పగలగాలి

ఒక్కొక్కప్పుడు అప్రస్తుత ప్రసంగం, చిత్రాక్షరి వంటి ఇతర అంశాలు కూడా ఈ ఎనిమిది అంశాలలో చేరుతూ ఉంటాయి.

## అష్టైశ్వర్యాలు

ఆర్ష సంప్రదాయం ప్రకారం సంపదలు 8 విధాలు. అవి: 1. దాసీజనం, 2. ధనం, 3. ధాన్యం, 4. పుత్రులు, 5. బంధువులు, 6. భృత్యులు, 7. మిత్రులు, 8. వాహనాలు.

## అస్సాం

ఇండియాలోని 25 రాష్ట్రాలలో ఒకటి. భారత స్వాతంత్ర్యం (1947) నాటికి ఇండియాలోని రాష్ట్రా లన్నిటిలో అస్సాం రాష్ట్రం పెద్దది. కాలక్రమేణ దాని నుంచి కొన్ని ప్రాంతాలు విడివడి నాగాలాండ్, మేఘా లయా, మిజోరామ్, అరుణాచల్ ప్రదేశ్ ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తిని సాధించడంతో అస్సాం రాష్ట్రం చిన్నదై పోయింది. విస్తీర్ణం: 78,525 చ.కి.మీ., జనాభా: 1,98,96,843 (1981). అధికార భాష: అస్సామీ, రాజధాని: డిస్పూర్ (ప్రాగ్జోదిస్పూర్)




అస్సాంలో బారక్ లోయ, బ్రహ్మపుత్రలోయ అనే రెండు ప్రాంతాలున్నాయి. ఏడాదిలో నాలుగు మాసాలు తీవ్ర అతివృష్టికి ఈ ప్రాంతం గురి అవుతూ ఉంటుంది. అందుచేత వరదల బెడద ఎక్కువ! అస్సాంలో 750 తేయాకు తోటలున్నాయి. తేయాకు ఒక ప్రధానమైన ఎగుమతి పంట. పట్టు పరిశ్రమ, కాగితపు పరిశ్రమ, చేనేత, వెదురు సామగ్రి ఈ రాష్ట్రంలో ప్రధాన పరిశ్రమలు దేశంలో పెట్రోలు, చమురు వాయువు ఎక్కువగా లభించే ప్రాంతాలలో అస్సాంది అగ్రస్థానం. ఇక్కడ లభించే ఇతర ఖనిజాలలో డోలమైట్, నేలబొగ్గు, సున్నపురాయి, బంకమన్ను ముఖ్యమైనవి.

## అహోబిలం

కర్నూలు జిల్లాలో నంద్యాలకు సుమారు 40 కిలోమీటర్ల దూరంలో ఉన్న వైష్ణవ పుణ్యక్షేత్రం. ఇచ్చట నరసింహస్వామి వారి దేవళం శిల్పసంపదకు ప్రసిద్ధి.

## ఆంజనేయుడు

వాయు దేవుని వలన అంజనాదేవికి జన్మించిన కుమారుడు. ఈయనను హన్మమంతుడు అనీ, మారుతి అనీ కూడా అంటారు. రామాయణంలో రామునికి నమ్మిన బంటుగా ఈయన నిర్వహించిన పాత్ర సుప్రసిద్ధ మైంది. భారత కాలంలో కూడా ఈయన జీవించి ఉన్నట్టు సౌగంధికాపహరణం కథ వలన తెలుస్తూంది. భీముడు సౌగంధిక పుష్పం కోసం వెళుతూ దారిలో అడ్డంగా ఉన్న ఆంజనేయుని తోకను కదల్చలేక ఆయన వాయు పుత్రుడైన హనుమంతుడని తెలిసి నమస్కరిస్తాడు.

అంజనాదేవి కేసరి అనే వానరుని భార్య. కేసరి తపస్సుకు పోతూ భార్యను వాయుదేవుని సేవిస్తూ ఉండమని అన్నాడు. అంజనాదేవి భక్తికి మెచ్చి వాయువు తన గర్భంలో ఉన్న శివుని వీర్యాన్ని ఆమెకు ఈయగా ఆమె గర్భవతియై ఆంజనేయుని ప్రసవించింది. అందుకనే ఆంజనేయుని శివుని అవతారంగా పరిగణిస్తారు. బాల్యంలో ఆంజనేయుడు ఉదయిస్తున్న సూర్యబింబాన్ని చూసి పండు అనుకొని మ్రింగబోతాడు. అప్పుడు ఇంద్రుడు వచ్చి తన వజ్రాయుధంతో ఇతని హనువులను కొట్టడంతో ఇతనికి హనుమంతుడనే పేరు వచ్చింది.

## ఆంటిగ్వా, బార్బుడా

బ్రిటిష్ వెస్టిండీస్‌లోని రాజ్యం. ఈ ద్వీప రాజ్యంలో 'రెండుండా' దీవి నివాసయోగ్యం కాదు. ఈ రాజ్యం 1981లో స్వాతంత్ర్య ప్రతిపత్తిని సాధించుకుని పార్ల మెంటును ఏర్పరచుకుంది. విస్తీర్ణం: 442 చ.కి.మీ; జనాభా: 77,400 (1988); రాజధాని: సెయింట్‌జాన్స్; అధికారభాష: ఇంగ్లీషు; షేషోస్. ప్రజలలో నీగ్రో వర్గానికి చెందిన వారే ఎక్కువ (94 శాతం). ములాత్తో తెగవారు కూడా కొందరు ఉన్నారు. తెల్లవారు సుమారు ఒక శాతం ఉన్నారు.

కూరగాయలు, ప్రత్తి, చెరకు, ప్రధానమైన పంటలు. మత్స్య పరిశ్రమ ఎక్కువ.

## ఆండీస్ పర్వత శ్రేణి

దక్షిణ అమెరికాలో పశ్చిమానగల 7,200 కి.మీ. పొడవు గల పర్వతశ్రేణి. ఉత్తర కొలంబియా నుంచి వెనిజ్యులా వరకూ ఇది విస్తరించింది. దీనిలో అత్యున్నత శిఖరం ఎత్తు: 6,850 మీ. ఆ శిఖరం పేరు: అన్కకవా.

## అండోర్రా

యూరప్‌లో ఫ్రాన్స్, స్పెయిన్ దేశాలమధ్య గల పిరనీస్ పర్వతశ్రేణిలో వున్న ఒక చిన్నరాజ్యం. ఫ్రాన్స్, స్పెయిన్‌ల సంయుక్త ఆధిపత్యంలో వున్న ఈ స్వతంత్ర రాజ్యపు విస్తీర్ణం: సుమారు 495 చ.కి.మీ. జనాభా: 7,000.

## ఆంధ్రప్రదేశ్

భారతదేశంలోని 25 రాష్ట్రాలలోను పెద్ద రాష్ట్రాలలో ఒకటి. ఉత్తరాన మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన తమిళ నాడు, కర్నాటక, పశ్చిమాన కర్నాటక, మహారాష్ట్ర ఈ రాష్ట్రానికి సరిహద్దులు. ఈ ప్రాంతాన్ని క్రీస్తుశక ప్రారంభంనుంచి శాత వాహన, చోళ, చాళుక్య, కాక తీయ, విజయనగరాది రాజవం శాలు పరిపాలించాయి. కొన్నాళ్లు ఈ ప్రాంతం మొగలాయి సామ్రాజ్యంలో భాగమయింది. మరికొంత కాలం గోల్కొండ నవాబుల పాలన ఇక్కడ కొన సాగింది. అనంతరం కోస్తా రాయలసీమ ప్రాంతాలు బ్రిటిష్ పాలనలోకి వచ్చాయి. భారత స్వాతంత్ర్యానంతరం (1947) మద్రాసు రాష్ట్రంలో ఉన్న తెలుగు ప్రాంతం 1953లో కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. 1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పుడు నాటి హైద్రాబాద్ రాష్ట్రంలోని తెలంగాణా జిల్లాలు ఆంధ్ర రాష్ట్రంలో కలిసి 'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రం అవతరించింది (నవంబర్ 1, 1956).

ఈ రాష్ట్రం విస్తీర్ణం: 2,77,068 చ.కి.మీ. జనాభా: 5,35,49,673 (1981) రాజధాని: హైదరాబాదు. అధికార భాష: తెలుగు; ఉర్దూ కూడా మాట్లాడతారు. భౌగోళికంగా ఈ రాష్ట్రం మూడు సహజ భాగాలుగా ఏర్పడి ఉంది. (1) కోస్తా మైదానాలు, (2) తూర్పు కనుమలు, (3) పశ్చిమాన దక్కన్ పీఠభూమి. రాష్ట్రంలో ప్రవహిస్తున్న రెండు పెద్ద జీవనదులు గోదావరి (చూ.), కృష్ణ (చూ.). వీటి సాగరసంగమ ప్రాంతాలలో ప్రపంచ ప్రసిద్ధిగన్న సారవంతమైన పెద్ద డెల్టాలు ఏర్పడ్డాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారత దేశానికే ఒక పెద్ద ధాన్యాగారం అనే పేరు తెచ్చుకుంది. కోస్తా



ప్రాంతంలో కొల్లేరు, దక్షిణాదిని పులికాట్ సరస్సు ఉన్నాయి. పెన్న, తుంగభద్రా, మంజీర, వంశధార, చిత్రావతి, పాపఘ్ని, నాగావళి, సగిలేరు, సువర్ణముఖి మొదలైన నదులు ఈ రాష్ట్రానికి ఇతర జలాధారాలు. కృష్ణానదిమీద బహుళార్థ సాధకమైన భారీ డామునిర్మించి దానికి 'నాగార్జున సాగరం' (చూ.) అని పేరు పెట్టారు (1967). ఇంకా ఎగువను శ్రీశైలం (చూ.) వద్ద కృష్ణానదిమీద జలవిద్యుత్తును ఉత్పత్తి చేయడమేగాక పంటనీటిని కూడా అందించే మరో డామును నిర్మించారు (1982). 'తెలుగు గంగ' ప్రాజెక్ట్ ప్రస్తుతం (1990) నిర్మాణ దశలో ఉంది. విజయవాడలో పాత ఆనకట్ట (1852) వద్ద ప్రకాశం బరాజు (1957) అనే రోడ్డుతో కూడిన పెద్ద ఆనకట్ట నిర్మించారు. గోదావరి మీద పోచంపాడు (నిజామాబాద్ జిల్లా) వద్ద శ్రీరామ సాగర్ డామును కట్టి తెలంగాణా జిల్లాలకు పంటనీటిని సరఫరా చేస్తున్నారు. గోదావరి మీద బ్రిటిష్‌వారి హయాంలో ధవళేశ్వరం వద్ద నిర్మించిన ఆనకట్ట (1852) దగ్గర క్రొత్తగా కాటన్ బరాజు నిర్మించారు (1982). ఇంత భారీ పంట నీటివనరులు కలిగి ప్రముఖ వ్యవసాయిక రాష్ట్రంగా ప్రసిద్ధిగాంచిన ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానంగా పండే పంటలు: వరి, జొన్న, చిరుధాన్యాలు, వేరుసెనగ, చెరకు, పొగాకు, ప్రత్తి, ద్రాక్ష, నిమ్మ, నారింజ, మామిడి, జామ, దానిమ్మ, జీడి మామిడి, మొదలైన పండ్ల జాతులు భారీ ఎత్తున పండిస్తున్నారు. పాడి పరిశ్రమ విరివిగా కొనసాగుతూంది. రాజమండ్రి సమీపంలో హార్లిక్స్ ఫ్యాక్టరీ, విజయవాడ సమీపంలో ఐస్‌క్రీమ్ కర్మాగారం పేర్కొనదగిన క్షీరోత్పత్తి పరిశ్రమలు. కోళ్ళ పరిశ్రమకు గ్రుడ్ల ఉత్పత్తికి ఆంధ్రప్రదేశ్ (హైదరాబాద్) ప్రసిద్ధిగాంచింది. నేలబొగ్గు, పెట్రోలు, తైలనిక్షేపాలు, చమురు వాయు నిక్షేపాలు ఈ రాష్ట్రంలో పుష్కలంగా ఉన్నాయి. కొత్తగూడెం, రామగుండం, సింగరేణి వంటి బొగ్గుగనుల ప్రాంతాలలో విద్యుదుత్పత్తి భారీ ప్రమాణంలో జరుగుతూంది. ఈ రాష్ట్రానికి విశాఖపట్టణం ప్రధాన రేవుపట్టణం. ఇక్కడ ఉక్కు కర్మాగారం నిర్మించారు. ఇంకా ఇతర పరిశ్రమలు కూడా ఉన్నాయి. హైదరాబాద్ నగర శివార్లలోని పారిశ్రామిక వాడలలో అనేక భారీ, చిన్న తరహా పరిశ్రమలు స్థాపించబడ్డాయి. భారత్ హెవీ ఎలక్ట్రికల్స్, ఎలక్ట్రానిక్ కార్పొరేషన్, భారత్ డైనమిక్స్,ఐ.డి.పి.ఎల్. వంటి అనేక కర్మాగారాలు ఉన్నాయి. రిఫ్రిజిరేటర్‌లు, చేతి గడియారాలు(వాచీలు) తయారుచేసే హైదరాబాద్ ఆల్విన్స్ ఇక్కడ ఉంది. కాకిరాయి (ఇనుము), ముగ్గురాయి (బెరైటస్), బంకమన్ను, మైకా, మాంగనీసు, బాక్సైట్, అల్యూమినియం, ఆస్బెస్టాస్, సున్నపు రాయి ఈ రాష్ట్రంలోదొరికే ముఖ్యమైన ఖనిజాలు. అంతర్జాతీయ మెట్టపంటల పరిశోధన కేంద్రం (ఇక్రిశాట్) ఈ రాష్ట్రంలోనే హైదరాబాద్ సమీపంలో పటాన్‌చెరులో ఉంది  చూ. రాష్ట్రావతరణ.



# ఆంధ్రప్రదేశ్ చరిత్ర: కొన్ని ప్రముఖ ఘట్టాలు

క్రీ.పూ. 1000 ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రుల గూర్చి మొదటి ప్రస్తావన.

500 ఆంధ్రుల రాక-స్థిర నివాసాలు.

323 మెగస్తనీస్ తెలుగుదేశ సందర్శన.

263 బౌద్ధం ఆంధ్రలో ప్రవేశించింది.

సాతవాహన రాజ్యస్థాపన. శ్రీముకుడు సింహాసన మెక్కాను. (శ్రీకాకుళం, ధాన్యకటకం రాజధానులు) సాతవాహనపాలన సామ్రాజ్యస్థాయి నందుకొంది. కణ్వులపై పులోమావి జయభేరి.

---

క్రీ.శ. 62 శకుల్ని జయించి గౌతమీపుత్ర శాతకర్ణి, ఆంధ్ర సాతవాహన రాజ్యాన్ని పునఃస్థాపన, గంగానదినుండి కన్యాకుమారి వరకు సామ్రాజ్యం విస్తరించింది. నహపానా నాణేలు ముద్రించాడు.

75 కృష్ణానది లోయలో (నాగార్జున కొండ) మహాయాన బౌద్ధంలోని మాధ్యమిక సంప్రదాయాన్ని నాగార్జునాచార్య ప్రచారం చేశాడు.

163 సాతవాహనుల పతనం. కృష్ణానది తీరమున ఇక్ష్వాకుల రాజ్యస్థాపన.

250 ఇక్ష్వాకుల వైభవం, అమరావతీ, నాగార్జునకొండ స్తూపాల విస్తరణ

200 400 మచిలీపట్నంలో బృహత్పలాయనాలు, వేంగిలో శాలంకాయనులు, సముద్రగుప్తుని దండయాత్ర (క్రీ.శ. 350) విష్ణుకుండినులు ఉత్తరాన, పల్లవులు దక్షిణాన ప్రబలమైన రాజ్యాలు.

398 411 ఫాహియాన్ చీనా యాత్రికుని సందర్శన

400 600 విష్ణుకుండినులు వేంగిలోనూ కంచిలో పల్లవులు హిందూ మతాన్ని పోషించారు. ఉండవల్లి, మొగల్రాజపురము (విజయవాడ)లలో శైవమతాన్ని పోషిస్తూ గుహాలయాలు శిల్పించారు.

ఆగ్నేయాసియా రాజ్యాలతో నౌకావాణిజ్యం నెరపేరు. బౌద్ధ తర్కపండితుడు దిఙ్నాగ (480-569) వేంగిలో ఉండేవాడు.

631 తూర్పు చాళుక్య రాజ్యస్థాపన. పులకేశి II తన సోదరుడు కుబ్జ విష్ణువర్ధనుని వేంగి రాజుగా చేస్తాడు.

640 హుయాన్ స్యాంగ్ తెలుగుదేశ సందర్శన.

671- 695 చీనా యాత్రికుడు ఇత్సింగ్ సందర్శిస్తాడు.

750 పూర్వ మీమాంస సంప్రదాయాన్ని ప్రవేశపెట్టిన కుమారిలభట్టు దక్షిణాన బౌద్ధం క్షీణించడానికి కారకుడయ్యాడు. వామాచార సంప్రదాయ ప్రవేశం. బౌద్ధ పంచారామాల్ని శైవ మతాచార్యులు చేజిక్కించుకుని శైవ క్షేత్రాలుగా మార్చివేశారు.

848 ప్రఖ్యాత తూర్పు చాళుక్యరాజు గుణగవిజయాదిత్యుని కాలంలో తెలుగు భాషకు రాజపోషణ లభించింది.

948- 993 వేంగిలో పోరాటాలు సంభవించాయి.

985 చోళ సామ్రాజ్య స్థాపన రాజరాజ I (985-1016)

999- 1000 రాజరాజచోళుని సహాయంతో తూర్పు చాళుక్య రాజ్య పునఃస్థాపన.

1000 కాకతీయ రాజ్యపాలన ప్రారంభం.

1022 రాజేంద్రుని కుమారుడు రాజరాజ నరేంద్రుడు కుళోత్తుంగ చోళుడుగా చోళ సామ్రాజ్యాధిపతి అవుతాడు. నన్నయ్య మహాభారతాన్ని తెలుగులో రచించాడు.

1104 పల్నాటి వీరయుద్ధం.

1135 వెలనాటి చోళులు (1135-1206) తెలుగుదేశాన్ని పరిపాలించారు.

1155 బసవేశ్వరుడు వీరశైవాన్ని ప్రచారం చేస్తాడు.

1158 రుద్రదేవుడు కాకతీయ (1158-1195) రాజ్యాన్ని పాలిస్తాడు.

1198 కాకతీయరాజు గణపతి దేవుడు వరంగల్లు సింహాసనమెక్కుతాడు. శాంతి భద్రతలను కాపాడతాడు. సాతవాహనుల తరువాత తెలుగు మాట్లాడే ప్రాంతాన్నంతటినీ ఒకే రాజ్యపాలనలోకి తెస్తాడు.

విదేశీ వాణిజ్యాన్ని ప్రోత్సహించడానికి బాపట్ల సమీపాన మోటుపల్లి రేవులో అభయ శాసనం (కాకతీయ రాజులు) ప్రకటిస్తారు.

1200 'చాపకూడు' అను సహపంక్తి భోజనాలను పల్నాటిమంత్రి బ్రహ్మనాయుడు ప్రోత్సహిస్తాడు.

1261 ముత్తుకూరు వద్ద పాండ్యులతో పోరాడుతూ నెల్లూరు మనుమసిద్ధి వీరమరణం పొందాడు.

1200- 1258 తిక్కన మహాభారతాన్ని 15 పర్వాలలో పూర్తి చేస్తాడు.

కాకతి గణపతిదేవుని మరణం.

1258 కాకతీయ సామ్రాజ్యానికి రాణి రుద్రమదేవి పట్టాభిషిక్తురాలయింది. దక్షిణాన చోళుల్ని, ఉత్తరాదిన యాదవుల్ని అదుపులో పెడుతుంది.

1271 ఇటలీ యాత్రికుడు మార్కోపోలో మోటుపల్లిని సందర్శిస్తాడు.

1273 దేవగిరిపై అల్లాఉద్దీన్ ఖిల్జీ దండయాత్ర.

1296 ప్రతాపరుద్రుడు కాకతీయ సింహాసనం ఎక్కుతాడు.

1303 అల్లాఉద్దీన్ సేనలు వరంగల్లుపై దాడి.

1307 దేవగిరి పతనం.

1309 వరంగల్లుపై రెండవసారి దాడి.

1323 ఢిల్లీ సుల్తాన్ ఘియాసుద్దీన్ తుగ్లక్ వరంగల్లు కోటను కైవసం చేసుకుంటాడు. ఆఖరు కాకతీయ రాజు ప్రతాపరుద్రుడు బందీ అవుతాడు. దారిలో ఆత్మహత్యకు గురి అవుతాడు.

1326 కొండవీడులో రెడ్డిరాజ్యం.

1424

1326 కంప్లీ పతనం. హరిహర బుక్కరాయల్ని మహమద్‌బిన్ తుగ్లక్ చెరబడతాడు.

1336 విద్యారణ్యస్వామి ఆశీర్వదబలంతో హరిహరబుక్క రాయలు హంపీ వద్ద విజయనగర సామ్రాజ్యస్థాపన.

కాపయనాయుడు వరంగల్లు సింహాసనం ఎక్కుతాడు.

1347 గుల్బర్గాలో బహ్మనీ సుల్తానేట్ రాజ్యస్థాపన. మహాభారతంలోని నన్నయ్య, తిక్కన విడిచిపెట్టిన అరణ్యపర్వాన్ని ఎర్రన (1300-1370) పూర్తి చేస్తాడు.

1354 కాపయ- ప్రోలయ నాయకత్వంలో హరిహర సోదరుడు బుక్క I వరంగల్లు సింహాసనం ఎక్కుతాడు.

1358 కొండవీటిరెడ్ల కింద కోస్తా ప్రాంతంలో తెలుగు నాయకులు సామంత రాజులవుతారు.

1367 కాపయ మరణానంతరం అనపోత, రేచర్ల ప్రముఖులు తెలంగాణాలో పాలకులవుతారు.

1383- కుమారరెడ్డి, కాటయ వేమారెడ్డి పాలన.

1410 1402 పెదకోమటి వేమారెడ్డి దర్బారులో శ్రీనాథుడు ఆస్థానకవి.

1406 సాళువదేవరాయ I విజయనగరగద్దె ఎక్కుతాడు.

1425- 75 సర్వజ్ఞ సింహ పాలనా కాలంలో పోతన మహాకవి.

1443 కృష్ణానదికి ఉత్తరాన బహ్మనీ రాజ్యస్థాపన.

1490 సాళువ నరసింహరాయతో సాళువ రాజ్యం అంతమైంది.

1505 వీర నరసింహరాయలుతో తుళువ రాజవంశ పాలన ప్రారంభమయింది.

# ఆంధ్రప్రదేశ్ చరిత్ర: కొన్ని ప్రముఖ ఘట్టాలు

1509 తుళువరాజు కృష్ణదేవరాయలు విజయనగర చక్రవర్తి అయ్యాడు. సామ్రాజ్యం బాగా విస్తరించింది. సాహిత్యపోషణ, (అష్టదిగ్గజాలు), కవులకు పోషణ లభించింది.

1518 తెలంగాణాలో గోల్కొండ రాజధానిగా కుతుబ్‌షాహీ వంశపాలన ప్రారంభమయింది.

1530 కృష్ణదేవరాయలు స్వర్గస్థులైరి.

1530-43 విజయనగరరాజులు- అచ్యుతరాయ, రామరాయ పాలన.

1543 సదాశివ పాలన.

1550-80 మల్కిభిరాముడుగా పేరొందిన ఇబ్రహీం కుతుబ్‌షాహీ తెలుగు దేశంలో పాలన. గోల్కొండ సామ్రాజ్యం స్థిరపడింది. నదులు, తటాకాలు, ప్రజోపయోగ పనులు జరిగాయి.

1565 రామరాయ-ముస్లిములకు రక్కసి తంగడి వద్ద (జనవరి 23) పోరాటం. రామరాయ ఓటమి.

1570 ఆరవీటి రాజవంశ పాలన తిరుమలరాయతో ప్రారంభమయింది.

1589 భాగ్యనగరం (హైదరాబాదు) స్థాపన.

1591 మహమ్మద్ కులీ హైదరాబాదు రూపురేఖలు దిద్దెను.

1592 విజయనగర సామ్రాజ్యానికి చంద్రగిరి రాజధాని అయింది.

1611 తూర్పు కోస్తాతీరాన ఇంగ్లీషు ఫ్యాక్టరీ స్థాపన.

1623-59 మధురలో తిరుమల నాయకరాజు తెలుగు సాహిత్య పోషణ.

1633 అహ్మద్‌నగర్ పతనం.

1597- తంజావూరులో రఘునాథ నాయకరాజు.

1639 చంద్రగిరిరాజు దగ్గర నుండి దాన
1640 పట్టా పొంది ఇంగ్లీషువారు మద్రాసులో ఫోర్ట్ సెంట్ జార్జి (కోట) నిర్మాణం.

1651 విజయనగర రాజుల వారసుల్ని ముస్లిం సైన్యాలు ఓడిస్తాయి.

1656 గోల్కొండపై ఔరంగజేబు దండయాత్ర.

1678 శ్రీరంగరాయ III మరణంతో విజయనగర సామ్రాజ్య పతనం.

1687 మొగల్ సైన్యాలకు లొంగి గోల్కొండ పతనమైంది.

1701 క్రైస్తవ మతంలోనికి మార్పిడి ప్రారంభం.

1724 అసఫ్‌జాహీ (నిజాం) వంశపాలన ప్రారంభం.

1746 తెలుగులో ముద్రణ ప్రారంభం. నూరు జ్ఞాన వచనాలు (బైబిలు)

1747 బొబ్బిలి పతనం.

1764 వాగ్గేయ కారుడు త్యాగయ్య జననం

1768 ఉత్తర సర్కారులను ఈస్ట్ ఇండియా కంపెనీకి నిజాం ఇచ్చివేసెను.

1800 రాయలసీమ (దత్త మండలాలు) జిల్లాలను నిజాము ఈస్ట్ ఇండియా కంపెనీకి ఇచ్చివేసెను.

1802 శాశ్వత పరిష్కారం (పర్మినెంట్ సెటిల్‌మెంట్.)

1806 తెలుగు ముద్రణలో టైపుల అభివృద్ధి

1816 వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు పిండారీ దాడులను తరిమికొట్టేరు.

1820 థామస్‌మన్రో నాయకత్వంలో పోలిగార్ల ఆగడాలు అణచివేయబడ్డాయి.

1829 తూర్పు కోస్తాలో పెను తుఫాను. బందరు ఉప్పెన.

1839 మొట్టమొదటి తెలుగు వార్తాపత్రిక 'వృత్తాంతిని'

1843 ప్రప్రథమ విజ్ఞాన పత్రిక 'సేద్య చంద్రిక' హైదరాబాదు నుంచి.

1848 సంఘ సంస్కర్త, సాహిత్యవేత్త కందుకూరి వీరేశలింగం జననం.

1852 గోదావరిపై ధవళేశ్వరం (రాజమండ్రి) వద్ద ఆర్థర్ కాటన్ ఆనకట్ట నిర్మించారు. పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం వద్ద వర్నాక్యులర్ పాఠశాలను జి.ఎన్. టేలర్ ప్రారంభించారు.

1855 విజయవాడ వద్ద కృష్ణానదిపై ఆనకట్ట. నోబెల్ కాలేజీ స్థాపన.

1886 విశాఖపట్టణంలో సరస్వతీ నిలయం మొదటి గ్రంథాలయం స్థాపన.

1893 తెలుగుదేశంలో మొదటి రైలుమార్గ నిర్మాణం.

1909 గాడిచర్ల హరిసర్వోత్తమరావు (మ. 1960) పై రాజద్రోహ అభియోగం.

1912 ప్రప్రథమ దిన వార్తాపత్రిక 'ఆంధ్రపత్రిక' తెలుగువారికి ప్రత్యేక రాష్ట్రం కావాలని నిడదవోలులో జరిగిన కృష్ణా సభలో మొదటిసారిగా ప్రస్తావన.

1913 ఆంధ్ర మహాసభ స్థాపన. ప్రత్యేక రాష్ట్ర తీర్మానం.

1918 హైదరాబాదులో ఉస్మానియా యూనివర్శిటీ స్థాపన.

1922 మన్యంలో అల్లూరి సీతారామరాజు 'పితూరీ'

1926 వాల్తేరులో ఆంధ్ర యూనివర్శిటీ స్థాపన

1931 తెలుగులో మొదటి శబ్ద చిత్రం (టాకీ) 'భక్త ప్రహ్లాద'

1937 'శ్రీ బాగ్' ఒడంబడిక.

1946 ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి టంగుటూరు ప్రకాశం ప్రధాని

1947 భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.

1948 హైదరాబాదు సంస్థానంలో 'పోలీసు చర్య'

1949 తెలంగాణా రైతుల పోరాటం

1952 బూర్గుల రామకృష్ణరావు మంత్రివర్గం.

1952 పొట్టి శ్రీరాములు 58 రోజులు ప్రాయోపవేశం చేసి మద్రాసులో మరణానికి గురి అయ్యారు.

1953 కర్నూలు రాజధానిగాను, గుంటూరులో హైకోర్టుతోను ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. (అక్టోబర్ 1). టంగుటూరి ప్రకాశం మొదటి ముఖ్యమంత్రి అయ్యారు. (1953-55).

1954 'విజ్ఞాన సర్వస్వం' మొదటి సంపుటం (తెలుగు భాషా సమితి) భారత రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌చే విడుదల.

1956 హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు(నవంబరు 1).

1964 ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం ఏర్పాటు.

1967 నాగార్జున సాగర్ నిర్మాణం పూర్తి.

1969 ప్రత్యేక తెలంగాణాకై ఆందోళన.

1972 జవహర్‌లాల్ టెక్నలాజికల్ యూనివర్శిటీ స్థాపన.

1972 ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికి ఆందోళన.

1974 కేంద్ర ప్రభుత్వంచే హైదరాబాదు యూనివర్శిటీ స్థాపన.

1975 ప్రథమ ప్రపంచ మహాసభల నిర్వహణ.

1983 జన. శాసనసభ సార్వత్రిక ఎన్నికలలో తెలుగు దేశం పార్టీ నాయకుడు నందమూరి తారక రామారావు (ఎన్.టి.ఆర్) విజయం సాధించి ముఖ్య మంత్రి అయ్యారు.

1984 పద్మావతీ మహిళాయూనివర్శిటీ స్థాపన.

1985 తెలుగు యూనివర్శిటీ స్థాపన.

1989 డిసె. శాసనసభ సార్వత్రిక ఎన్నికలలో కాంగ్రెస్(ఐ) విజయం సాధించగా మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర స్వరూపం: జిల్లాల వివరాలు

| వరుస సంఖ్య | జిల్లా పేరు | విస్తీర్ణం చ.కిమీ. | జనాభా (1981) | జిల్లా కేంద్రం | అక్షరాస్యత శాతం |
|---|---|---|---|---|---|
| 1. | అనంతపురం | 19,130 | 26,18,239 | అనంతపురం | 27.08 |
| 2. | ఆదిలాబాదు | 16,128 | 16,38,130 | ఆదిలాబాదు | 18.98 |
| 3. | కడప | 15,359 | 19,27,682 | కడప | 30.99 |
| 4. | కరీంనగరం | 11,823 | 24,36,075 | కరీంనగరం | 21.99 |
| 5. | కర్నూలు | 17,658 | 24,04,358 | కర్నూలు | 28.42 |
| 6. | కృష్ణా | 8,727 | 30,41,949 | చిలకలపూడి (మచిలీపట్నం) | 41.43 |
| 7. | ఖమ్మం | 16,029 | 17,44,966 | ఖమ్మం | 25.79 |
| 8. | గుంటూరు | 11,391 | 34,27,081 | గుంటూరు | 36.25 |
| 9. | చిత్తూరు | 15,152 | 27,46,847 | చిత్తూరు | 31.60 |
| 10. | తూర్పుగోదావరి | 10,807 | 37,01,714 | కాకినాడ | 35.12 |
| 11. | నల్గొండ | 14,240 | 22,75,476 | నల్గొండ | 21.81 |
| 12. | నిజామాబాదు | 7,956 | 16,79,279 | నిజామాబాదు | 21.90 |
| 13. | నెల్లూరు | 13,076 | 20,06,447 | నెల్లూరు | 31.89 |
| 14. | పశ్చిమగోదావరి | 7,742 | 28,56,999 | ఏలూరు | 37.65 |
| 15. | ప్రకాశం | 17,624 | 24,56,545 | ఒంగోలు | 27.39 |
| 16. | మహబూబునగరం | 18,432 | 24,46,548 | మహబూబునగరం | 18.95 |
| 17. | మెదకు | 9,699 | 18,27,588 | సంగారెడ్డి | 21.36 |
| 18. | రంగారెడ్డి | 7,492 | 15,79,862 | హైదరాబాదు | 28.96 |
| 19. | వరంగల్లు | 12,846 | 23,01,374 | వరంగల్లు | 23.84 |
| 20. | విజయనగరం | 6,539 | 18,09,688 | విజయనగరం | 23.12 |
| 21. | విశాఖపట్టణం | 11,161 | 25,22,313 | విశాఖపట్టణం | 29.72 |
| 22. | శ్రీకాకుళం | 5,837 | 19,02,041 | శ్రీకాకుళం | 24.64 |
| 23. | హైదరాబాదు | 217 | 22,87,704 | హైదరాబాదు | 55.95 |
| | ఆంధ్రప్రదేశ్ | 2,77,068 | 5,35,49,673 | హైదరాబాదు | 29.9 |

గమనిక : జిల్లాల మొత్తం విస్తీర్ణానికి రాష్ట్ర భౌగోళిక విస్తీర్ణానికి కొంత వ్యత్యాసం ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, మూడు భౌగోళిక ప్రాంతాలుగా ఉంది.

1. కోస్తా ప్రాంతం : *9 జిల్లాలు:* శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు.
2. రాయలసీమ : *4 జిల్లాలు:* అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు.
3. తెలంగాణా : *10 జిల్లాలు:* హైదరాబాదు, రంగారెడ్డి, మెదకు, మహబూబునగరం, నిజామాబాదు, ఆదిలాబాదు, కరీంనగరము, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ.

(ఈ జిల్లాలను గూర్చి ఇతర వివరాలు ఆయా అకారాది శీర్షికలలో చూడనగును- కోస్తా ప్రాంతం, రాయలసీమ, తెలంగాణా)

## ఆకాశ హర్మ్యం

నగరాలు త్వరిత గతిని విస్తరిస్తూ ఉన్నందువల్ల పలు అంతస్తులున్న మేడలు అవసరం అవుతున్నాయి. పలు అంతస్తులున్న ఒక భవనంలో కొన్ని వందల కుటుంబాలు




జీవించ గలగడం వల్ల వారికి తాము పనిచేసే చోటికి దగ్గరలో ఉండే అవకాశం లభిస్తూంది. ఈ భవనాలు ఆకాశంలోకి చొచ్చుకు పోతూ ఉండడం వల్ల వీటిని 'ఆకాశహర్మ్యాలు' అంటున్నారు. ప్రపంచంలో మిక్కిలి ఎత్తయిన 'ఆకాశహర్మ్యం' అమెరికా లోని చికాగో నగరంలో ఉంది. 110 అంతస్తులలో 1454 అ. ఎత్తుగా ఉన్న ఈ భవన నిర్మాణం 1974లో పూర్తిచేశారు. దీనిలో 103 లిఫ్టులూ, 16 వేల కిటికీలూ ఉన్నాయి. 'సియర్స్ టవర్' అనబడే ఈ హర్మ్యం నివాసులకు సౌకర్యాలు చూడడానికి 16,700 మంది పని చేస్తున్నారు. చికాగోలోనే 169 అంతస్తులతో ఇంతకంటె ఎత్తయిన మరో భవనాన్ని నిర్మించే ప్రయత్నాలు జరుగు తున్నాయి. అమెరికాలోని ఇతర ఎత్తయిన భవనాలు న్యూయార్కులో ఉన్న 'వరల్డ్ ట్రేడ్ సెంటరు', ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ పేర్కొనదగినవి.

## ఆగష్టు 15

చూ. జాతీయ పండుగలు

## ఆజ్‌టెక్ నాగరికత

మధ్య అమెరికాలోని మెక్సికోలో వర్ధిల్లిన ఒక ప్రాచీన నాగరకత. 12వ శతాబ్దం చివర ఉత్తరం నుంచి ఆజ్‌టెక్‌లు మెక్సికోకు వచ్చి 1325లో అక్కడ 'టెనోక్‌టిట్లాన్' రాజధానిగా ఉజ్జ్వలమైన నాగరికత స్థాపించారు. స్పెనిష్ దండయాత్ర వరకూ ఆ నాగరికత నిలిచివుంది. వారి భాష: 'యూఫో – ఆజ్‌కన్' భాషా కుటుంబానికి చెందింది.

## ఆదిభట్ల

చూ. నారాయణదాస్

## ఆదిలాబాదు జిల్లా

ఆంధ్రప్రదేశ్ లోని 23 జిల్లాలలో ఇది ఒకటి. రాష్ట్రంలో వాయవ్యదిశగా ఉన్న ఆదిలాబాదు జిల్లా (18° 45', 19° 45' ఉ.; 77° 50', 80° తూ.) వాయవ్యాన, పశ్చిమాన మహా రాష్ట్రం, దక్షిణాన నిజామాబాదు, కరీంనగరం జిల్లాలు ఉన్నాయి. దీని విస్తీర్ణం: 16,133 చ.కి.మీ; జనాభా: 16,39,003 (1981). జిల్లా కేంద్రం: ఆదిలాబాదు.




జిల్లాలోని ఉట్నూరు ప్రాంతంలో గిరిజనులలో గోందు తెగవారు ఉన్నారు. ఈ జిల్లాలో అటవీ సంపద ఎక్కువ. గోదావరి నది పశ్చిమం నుంచి తూర్పుగా ఈ జిల్లాకు దక్షిణ సరిహద్దుగా ప్రవహిస్తూంది. పెన్‌గంగ తూర్పు దిశగా ప్రవహిస్తూ 'ప్రాణహిత'గా పేరు మార్చుకుంది. పెద్దవాగు దీనిలో కలుస్తుంది. గోదావరికి కడం నది మరొక ఉపనది. దీని మీద డామ్ కట్టారు. ముఖ్యమైన పంట జొన్న. ప్రత్తి, నువ్వులు వాణిజ్యపు పంటలు. మందమర్రి, బెల్లంపల్లి నేలబొగ్గు త్రవ్వకానికికేంద్రాలు.

జిల్లాలో సిమెంటు పరిశ్రమ మంచిర్యాలలోనూ, సిర్పూర్‌లో, కాగితపు పరిశ్రమ కాగజ్‌నగర్ (సిర్పూర్) లోనూ ఉన్నాయి. నిర్మల్ బొమ్మల పరిశ్రమకు ప్రసిద్ధి. అందమైన ప్రకృతి దృశ్యాలకు కుంతల జలపాతం పరస్పు, బాసరలో సరస్వతీదేవి ఆలయం ఉంది. ఇది గొప్ప యాత్రా స్థలం.

## ఆనీబిసెంట్ 1847–1933

భారత జాతీయోద్యమంలో పాల్గొన్న ఆంగ్ల మహిళ. మద్రాస్‌లోని దివ్యజ్ఞాన సమాజంలో (తియసాఫికల్ సొసైటీ) ప్రముఖ సభ్యురాలు. 1847 అక్టోబర్ 1న లండన్‌లో జన్మించింది. తండ్రి విలియం పేజ్‌వుడ్. తల్లి ఎమిలీ మారిస్. ఆంగ్లదేశంలో పుట్టి భారతదేశ ఔన్నత్యానికి పాటుపడిన మహిళ ఈమె. 1893 నవంబరు 16న భారతదేశంలో ఈమె అడుగుపెట్టింది.1913లో భారతదేశ రాజకీయాలను పరిశీలించడానికి బ్రిటిష్ పార్లమెంట్‌లో శాశ్వతమైన ఉపసంఘం ఒకటి ఉండాలని వాదించింది. 'హోమ్‌రూల్' ఉద్యమం ప్రారంభించి దానిని సమర్థంగా నడిపింది. కాశీలో ఒక విద్యాసంస్థను స్థాపించింది. భగవద్గీతను ఇంగ్లీషులోకి అనువదించింది. ప్రముఖ భారతీయ విద్యావేత్త పండిత మదన్ మోహన్ మాళవీయతో కలిసి భారతీయ విద్యారంగానికి సేవ చేసింది. హూమ్‌రూల్ ఉద్యమం సాగుతున్నప్పుడు అప్పటి మద్రాసు గవర్నరు 'లార్డ్ పెంట్లెండ్' ఆమెను భారతదేశం వదిలి వెళ్ల వలసిందిగా పంపిన ఉత్తర్వులను ఆమె ఉల్లంఘించినందుకు 1917 జూన్‌లో ఉదకమండలం (ఊటీ)లో ఆమెను నిర్బంధించారు. ఆగస్ట్ 1917లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ సమావేశానికి బిసెంట్ అధ్యక్షత వహించింది.



1925లో ఇంగ్లండ్ వెళ్ళి బ్రిటిష్ పార్లమెంట్‌లో జార్జ్ లాన్స్‌బరీ ద్వారా భారతదేశ స్వాతంత్ర్యాన్ని గూర్చిన బిల్లును ప్రవేశపెట్టింది. భారతీయ బాలభట సంస్థను స్థాపించింది. భారత స్త్రీ జనాభ్యుదయానికై 1917 నుంచి విశేషంగా పాటుపడుతూ వచ్చింది.

దివ్యజ్ఞాన సమాజానికి ఆమె చేసిన సేవ గణనీయమైంది. 1915లో దివ్యజ్ఞాన సమాజం తరఫున మదనపల్లెలో ఒక కళాశాల స్థాపించింది. 'నేషనల్ రిఫార్మర్' అనే పత్రికలో చాలా వ్యాసాలు వ్రాసింది. సమాజ సేవకోసం బెర్నార్డ్ షా, సిడ్నీవెబ్ కలిసి స్థాపించిన ఫేబియన్ సొసైటీలో ప్రముఖ సభ్యురాలై సంఘ సేవ చేసింది. చిత్తూరు జిల్లాలోని జిడ్డు నారాయణయ్య కుమారుడు జిడ్డు కృష్ణమూర్తి(చూ.)ని బాల్యంలోనే చేరదీసి అతనిని మహాప్రవక్తగా మలచడానికి చేసిన కృషి ఫలించలేదు.

1933 సెప్టెంబర్ 21న ఆమె స్వర్గస్థురాలయింది.

## ఆపస్తంబుడు

భారతీయ సూత్రకర్త. ఈయన జీవించిన కాలం స్పష్టంగా తెలియదు. క్రీ.పూ. 300 కంటె పూర్వుడు కాడని పాశ్చాత్య పండితుల అభిప్రాయం. ఆపస్తంబుడు ఆంధ్రుడని కొందరి ఊహ. ఈయన గొప్ప సంఘ సంస్కర్త. ఈయన శ్రౌత సూత్రాలనూ, గృహ్య సూత్రాలనూ, ధర్మ సూత్రాలనూ రచించారు. 'శ్రుతులు' అనగా వేదాలు చెప్పిన కర్మలు శ్రౌతాలు. వాటిని గురించిన సూత్రాలు శ్రౌత సూత్రాలు. గృహ్యసూత్రాలు గృహస్థుల విధులకు సంబంధించినవి. ఆపస్తంబుడు రచించిన ధర్మ సూత్రాలలో ఆయన సంఘ సంస్కరణాభిలాష బాగా వ్యక్తం అవుతుంది.

## ఆఫ్ఘనిస్తాన్

పాకిస్తాన్‌కు వాయవ్య దిశలో ఉన్న స్వతంత్ర రాజ్యం. పఠాన్‌లు, పుఖ్తాన్ జాతులవారు అక్కడ ఎక్కువ. ఇక్కడ మాట్లాడు భాషలు: పుస్తూ, పారసీకం. విస్తీర్ణం: 6,52,225 చ.కి.మీ., జనాభా: 1,44,81,000 (1988) రాజధాని: కాబూలు.

ఆమూ – దర్యానది, సరస్సులు ఈ దేశంలో జలవనరులు. పంటలు: వరి, జొన్న, ప్రత్తి, సుగంధ



ద్రవ్యాలు, బీటు (పంచదార), గోధుమ, పొగాకు.

ఉన్ని పరిశ్రమకు ఈ దేశం ప్రసిద్ధి, తివాచీల నేత, సిమెంట్, నూలు, ఆహారోత్పత్తులు ఈ దేశపు ఇతర పరిశ్రమలు. నేల బొగ్గు, బంగారం, ఇనుము, లాపిస్ లాజువా ఖనిజం ఇక్కడ లభిస్తాయి.

## ఆఫ్రికా

పెద్ద ఖండాలలో ఇది ఒకటి. ఒకప్పుడు యూరోపియన్ వలసలకు లోనై చీకటి ఖండంగా ప్రతీతి పొందింది. దాదాపు 50 స్వతంత్ర రాజ్యాలున్న భూభాగం ఇది. ప్రాచీన నాగరికతగల ఈజిప్ట్ ఆఫ్రికాలో ఉత్తర భాగాన ఉంది. ప్రజలలో అధికశాతం ఆటవిక జాతులు, నీగ్రో వర్గానికి చెందినవారు. విస్తీర్ణం: 3,03,21,000 చ.కి.మీ., జనాభా: 40,00,00,000. ఉత్తరాన అట్లాసు పర్వతశ్రేణి ఉంది. సరస్సులు: విక్టోరియా, టాంగన్యీకా, న్యాసా. సహారా, కలహారీ ఎడార్లు ప్రసిద్ధి పొందాయి. ఆఫ్రికాలో ప్రవహించే నదులలో నైలు, కాంగో, నైజర్, జాంబియా ముఖ్యమైనవి. విక్టోరియా జలపాతం చూడ దగింది. జంతు సంపదలో ముఖ్యమైనవి: హిపోపొటమస్, ఆఫ్రికా ఏనుగు, జిరాఫీ, సింహం, బబూన్ కోతి, ఇంపాలాజింక. ద.ఆఫ్రికా, ఈజిప్టు తప్ప మిగతా దేశాలు ఆర్థికంగా వెనుకబడి ఉన్నాయి.

## ఆముక్తమాల్యద

కృష్ణదేవరాయలు రచించినట్టు చెప్పబడుతున్న తెలుగు ప్రబంధకావ్యం. ఇది ఏడు ఆశ్వాసాల ప్రౌఢ కావ్యం. ఇందలి ప్రధాన ఇతివృత్తం గోదాదేవి అను శ్రీవైష్ణవి యొక్క పుణ్యజీవిత గాథ. గోదాదేవి తండ్రి వైష్ణవాలయంలో వేంచేసిన దేవతా విగ్రహానికి పూల మాలలు కట్టేవాడు. నిత్యమూ తండ్రి కట్టిన తోమాలెలను ముందుతాను కొప్పులో ధరించి అద్దంలో చూచుకుని ఆనందించి పిమ్మట ఆ పూమాలలను మన్నారు స్వామికి సమర్పించుట పరిపాటి. అందుచేతనే గోదాదేవికి ఆముక్తమాల్యద అనిపేరు సార్థకమైంది. 'ఆముక్తమాల్యద' అంటే తాను ధరించిన మాలలను ఇచ్చునది అని అర్థం. ఈ గ్రంథమున గోదాదేవి చరిత్రతో పాటు ఆమె తండ్రి విష్ణుచిత్తుని (పెరియాళ్వార్) కథ, మాలదాసరి కథ, యామునా చార్యుల కథ, కేశిధ్వజోపాఖ్యానం కూడా ఇందు ప్రస్తావింప బడినాయి. ఈ గ్రంథమును 'విష్ణు చిత్తీయ' మని కూడా అంటారు.

## ఆరిస్టాటిల్ క్రీ.పూ. 384–322

జగత్ ప్రసిద్ధి పొందిన గ్రీక్ తత్త్వవేత్త, దార్శనికుడు. క్రీ.పూ. 384లో ఏజియన్ సముద్రపు ఉత్తరపు కొనను ఉన్న ఒక గ్రామంలో ఈయన జన్మించాడు. ఈయన తండ్రి ప్రపంచ విజేత అయిన అలెగ్జాండర్ తాత గారి దగ్గర ఆస్థాన వైద్యుడు. చిన్నతనం నుంచీ ప్రకృతి విజ్ఞానంపట్ల ఆసక్తి అధికంగా వుం ది. ఈయన తన 17వ ఏట ఉన్నత విద్యకోసం ఏథెన్స్ నగరానికి వెళ్లాడు. అక్కడ ప్రపంచ ప్రఖ్యాతి గన్న ప్లేటో (చూ.) అనే గ్రీక్ తత్త్వవేత్త వద్ద విద్యార్థిగా చేరాడు. త్వరలోనే ఆరిస్టాటిల్ గొప్ప తత్త్వవేత్త గాను, ఉపదేశకుడు గాను పేరుపొందాడు. ఈయన ఖ్యాతి విని అలెగ్జాండర్ అతనిని గురువుగా వరించాడు. అప్పటికి అలెగ్జాండర్ వయస్సు కేవలం 14 ఏళ్లు మాత్రమే. ఇతనికి గురువు పట్ల చాలా గౌరవం. ఆయనకు శాస్త్రీయ పరిశోధనలు చేసుకోడానికి అవసరమైన నిధులను సమకూర్చేవాడు.



ఆరిస్టాటిల్ వేదాంతి మాత్రమే కాదు, గొప్ప శాస్త్రవేత్త కూడా! జంతువులపై ఆయన విశేషమైన పరిశోధనలు చేశాడు. వాటిని వర్గీకరించడంలో ఆయన రూపొందించిన పద్ధతులే ఇప్పటికీ శాస్త్రవేత్తలు అనుసరిస్తున్నారు. జంతువుల దేహాలను కోసి పరీక్షలు జరిపే పద్ధతులు కూడా ఆయన రూపొందించినవే! ఆరిస్టాటిల్ ఎన్నో గ్రంథాలు వ్రాయడమే కాకుండా సుమారు 1,000 గ్రంథాలు గల గొప్ప గ్రంథాలయాన్ని కూడా నిర్మించాడు. క్రీ.పూ. 322లో ఆయన మరణించాడు.

## ఆర్కిటికా

ఉత్తర ధ్రువ ప్రాంతం ; ఆర్కిటిక్ మహా సముద్రం. విస్తీర్ణం: 1,40,90,000 చ.కి.మీ. నార్వే, కెనడా ఉత్తర ప్రాంతం, అలాస్కా ఆర్కిటిక్ వలయంలోని భాగాలు. అంతా గ్లేసియర్‌తో కూడిన

హిమ శిలామయం. ఆర్కిటికాను అన్వేషించిన వారిలో నిల్స్ అడాల్ఫ్ ఎరిక్ (1878 – 79), రీనాల్డ్ ఆముండ్సన్ (1903–1906) ప్రముఖులు. ఎస్కిమో జాతులు 'ఇగ్లూ' అనబడే మంచు ఇళ్ళలో నివసిస్తారు. 'అరోరియా బొరియాలిస్' అని ప్రసిద్ధికెక్కిన అర్ధరాత్రి వెలుగులు అప్పుడప్పుడు కనిపిస్తూ వుంటాయి. తిమింగలం, ఎల్క్, సీల్, యాక్ మొదలైన జంతువులు ఈ ప్రాంతంలో ఎక్కువ. కుక్కలు లాగే స్లెడ్జ్ బండి ఇక్కడి ప్రధాన ప్రయాణ సౌకర్యం.

## ఆర్జెంటీనా

దక్షిణ అమెరికా దక్షిణ భాగాన ఉన్న ఒక స్వతంత్ర రాజ్యం. వెండి ఖనిజం లభించడం చేత ఆ దేశానికి ఈ పేరు వచ్చింది. (అర్జెం అంటే వెండి) విస్తీర్ణం: 27,80,092చ.కి.మీ;జనాభా: 3,19,63,000 (1988), రాజధాని: బ్యూనస్ ఐరిస్. అధికార భాష: స్పానిష్. ప్రజలలో యూరపియన్ జాతులు 85 శాతం, మెస్టిజోలు 15 శాతం. ప్రజలు క్రైస్తవం పాటిస్తారు. వెండి పుష్కలంగా లభిస్తుంది.బంగారం,యురేనియం, ఆంటిమనీ, జింకు ఆర్జెంటీనాలో లభించే ఇతర ఖనిజాలు. పంపా మైదానాలు మిక్కిలి సారవంతమైనవి కావడం వల్ల రైతాంగం రాసాయనిక ఎరువులు ఉపయోగించవలసిన పనిలేదు.




ఆర్థిక సంపద: ఆల్ఫాల్ఫా, నిమ్మ, నారింజ, మొక్కజొన్న, చెరకు, సోయా, పొద్దుతిరుగుడు, ద్రాక్ష, జొన్న, బంగాళదుంపలు, రైధాన్యం, గోధుమ, గొర్రెల పెంపకం.

పరిశ్రమలు: జవుళీ, మాంసం, తోలు, ఉన్ని, ధాతుసాధన, కలపసామగ్రి, గాజు. ఖనిజసంపద: ఇనుము, బొగ్గు, పెట్రోలు, ఉప్పు, టంగ్‌స్టన్, వెండి, బంగారం, యురేనియం, సీసం.

## ఆర్యసమాజం

ఆర్యసమాజం బ్రహ్మసమాజం లాగ ఏకేశ్వరోపాసనను బోధించే మతం. దీనిని దయానంద సరస్వతి (చూ.) 19వ శతాబ్దం చివరి భాగంలో బొంబాయి ప్రాంతంలో ప్రారంభించారు. ఇస్లాం, క్రైస్తవ మతాలలో చేరిన హిందువులను వైదిక మంత్రాలతో పవిత్రులను చేస్తూ, మళ్లీ హిందూ మతంలో చేర్చుకోడం అనే సంఘసంస్కరణాన్ని ప్రధానంగా ఉద్దేశించి ఈ మతం స్థాపించబడింది. హిందువుల మతాంతరీకరణం ఎక్కువగా సాగుతున్న ప్రాంతంలో ఆర్యసమాజం చురుకుగా పని చేస్తూంది. ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా ప్రాంతాలలో ఆర్యసమాజ ప్రభావం ఎక్కువగా కన్పిస్తుంది.

## ఆల్జీరియా

ఉత్తర ఆఫ్రికాలోని స్వతంత్ర రాజ్యం. ఒకప్పుడు ఫ్రెంచ్ వారి వలస ప్రాంతం. 1962 లో తీవ్రమైన విప్లవం జరిపి స్వాతంత్ర్యం సాధించింది. విస్తీర్ణం: 23, 81,741 చ.కి.మీ; జనాభా: 2, 38,49,000 (1988), అధికార భాష: అరబిక్, ఆర్థిక సంపద: పండ్లు, ధాన్యం, ద్రాక్ష సారాయి. ఖనిజ సంపద: పెట్రోలు, ఇనుము, ఫాస్ఫేటు, బొగ్గు, చమురు వాయువు.




రాజధాని: ఆల్జీర్స్. జలసంపద: అట్లాస్‌శ్రేణి నుంచి బయలుదేరే చెల్ఫ్‌నది పెద్దది. ఇది ఉత్తరదిశగా 720 కి.మీ. ప్రవహించి మధ్యధరా సముద్రంలో కలుస్తుంది. కెబిర్, సాకెల్, సెబేస్, సిగ, పిఫ్నా ఇతర జలాధారాలు. ప్రజలు ఎక్కువ మంది సున్నీ ఇస్లాం మతస్థులు.

## ఆల్ బుకర్క్ అల్ఫాన్సో

గోవాకు మొదటి పోర్చుగీస్ గవర్నరు. ఈయన భారతదేశాన్ని పోర్చుగల్ సామ్రాజ్యంలో భాగంగా చేయాలని కలలు కనేవాడు. ఈ కలలు ఆల్బుకర్క్ 1515లో మరణించడంతో కల్లలుగానే మిగిలిపోయాయి. అయితే గోవా, డామన్, డయ్యూమాత్రం పోర్చుగల్

ఏలుబడిలోనే ఉండిపోయి 1961లో స్వాతంత్ర్యం పొంది, భారతదేశంలో విలీనం అయ్యాయి.

## ఆల్ బేనియా

దక్షిణ యూరప్‌లో యుగోస్లావియా, గ్రీస్ దేశాలకు మధ్యనున్న చిన్న స్వతంత్ర రాజ్యం. ఇది ఒక కమ్యూనిస్టు రాజ్యం. విస్తీర్ణం: 28,748 చ.కి.మీ., జనాభా: సుమారు 31,49,000 (1988), రాజధాని: టిరానే. ఇక్కడి ప్రజల ప్రధానవృత్తి: వ్యవసాయం, ప్రజలలో ఏ మతమును నమ్మనివారు 55 శాతం, ముస్లిములు 21 శాతం, నాస్తికులు 19 శాతం.

## ఆలిగ్జాండర్ క్రీ.పూ 356–323

గ్రీక్ ప్రపంచ విజేత. క్రీ.పూ 356లో ఇతడు జన్మించాడు. తండ్రి ఫిలిప్స్ మరణానంతరం క్రీ.పూ. 336లో తన 20వ ఏట గ్రీస్ దేశంలోని మాసిడోనియా రాజ్యానికి ప్రభువు అయ్యాడు. ఇతనికి రాజ్యకాంక్ష ఎక్కువ. ఆ రోజులలో పర్షియా సామ్రాజ్యం అతి బలవత్తరంగా ఉండేది. ఇది యూరప్‌లోని డాన్యూబ్ నది నుంచి ఆఫ్ఘనిస్తాన్ వరకూ విస్తరించి ఉండేది. ఇటువంటి మహా సామ్రాజ్యాన్ని ఆలిగ్జాండర్ మూడు యుద్ధాలు చేసి జయించాడు. అంతటితో ఆగకుండా భారతదేశాన్ని జయించే ఉద్దేశ్యంతో సింధు నదిని దాటి పంజాబ్‌లో



ప్రవేశించాడు. అక్కడ స్వార్థపరుడైన తక్షశిల ప్రభువు అతనికి స్వాగతం పలికాడు. అయితే తూర్పు దిశగా సాగుతున్న ఆలిగ్జాండర్ సేనలను పంజాబ్‌లోని జీలం — చీనాబ్ నదుల మధ్య ఉన్న రాజ్యాన్ని ఏలుతూ ఉండిన పురుషోత్తముడు అడ్డగించాడు. దేశభక్తి పూరితుడైన ఆ రాజు 200 ఏనుగులు, అసంఖ్యాకమైన రథాలు, అశ్వబలం, వేలాది మంది సుశిక్షితులైన కాల్బలాలతో ఆలిగ్జాండర్‌ను ఎదుర్కొన్నాడు. భీషణంగా జరిగిన యుద్ధంలో అంతిమ విజయం ఆలిగ్జాండర్‌కే దక్కింది. పురుషోత్తముడి సైన్యంలో వేలాది మంది చనిపోయారు. ఎందరో క్షతగాత్రులయ్యారు. గాయాలతో పడి ఉన్న పురుషోత్తముడు శత్రువుకి బందీగా చిక్కాడు 'మిమ్మల్ని ఏ విధంగా సత్కరించాలి?' అన్న ఆలిగ్జాండర్ ప్రశ్నకు పురుషోత్తముడు 'రాజుగా' అని సమాధానం ఇచ్చాడు. ఆయన ధైర్య సాహసాలను మెచ్చుకుని జయించిన రాజ్యాన్ని తిరిగి ఇచ్చి గౌరవించాడు ఆలిగ్జాండర్. ఆ తర్వాత మగధను జయించాలనుకున్నాడు. కాని, నిరంతరం యుద్ధాలతో అలసిపోయి ఉన్న గ్రీకు సైనికులు ముందుకు సాగడానికి ఇష్ట పడలేదు. దానితో తిరుగు ప్రయాణం కట్టాడు. కాని దారిలో బాబిలోనియాలో విష జ్వరం వచ్చి, తన 33వ ఏటనే క్రీ.పూ. 323లో ఆలిగ్జాండర్ మరణించాడు.

## ఆల్ప్స్ పర్వతశ్రేణి

యూరప్‌లోని ఆగ్నేయ ఫ్రాన్స్, ఉత్తర ఇటలీ, స్విట్జర్లాండ్ దేశాలలో వ్యాపించివున్న పెద్ద పర్వతశ్రేణి. వినోదయాత్రికులను విశేషంగా ఈ పర్వతశ్రేణి ఆకర్షిస్తూంది. ఎత్తయిన శిఖరం: 4,800 మీటర్ల ఎత్తుగల మౌంట్ బ్లాంక్. ఈ పర్వత శ్రేణిలో సుదీర్ఘమైన సొరంగాలు· సెయింట్ బర్నార్డ్, సింప్లన్. ఇవి ఫ్రాన్స్, ఇటలీ దేశాల మధ్య ఉన్నాయి. స్విట్జర్లాండ్‌లో ఉండే సొరంగ మార్గం సెయింట్ గోతార్డ్. మౌంట్ బ్లాంక్ సొరంగ మార్గం అన్నిటి కంటే పొడవైంది. దీని పొడవు 11 కిలోమీటర్లు.

## ఆళ్వార్లు

సుప్రసిద్ధ వైష్ణవ భక్తులు. వారు పన్నెండు మంది. దక్షిణ భారతదేశంలో ప్రజలు భగవంతుని మరచి ఐహిక సుఖపరాయణులుగా ఉండటం చూసి శ్రీమన్నారాయణుడు తన శ్రీవత్సవ, కౌస్తుభ, వైజయంతీ, వనమాల పంచాయుధ, అనంత, గరుడాదులను చూసి "మీరు భూమి మీద కావేరి, తామ్రపర్ణి, వేగవతి, బాహుద నదుల తీరాలలో అవతరించి ప్రజలను ఉద్ధరించండి" అని ఆదేశించాడనీ, ఆ ప్రకారం ద్రావిడ దేశంలో ఈ పన్నెండు మంది అవతరించారనీ ఐతిహ్యం. ఆళ్వార్‌ల పేర్లు: 1. పోయ్ గై ఆళ్వార్, 2. పూదత్తాళ్వార్, 3. పెయాళ్వార్, 4. పెరియాళ్వార్, 5. తిరుమళిశ యాళ్వార్, 6. కులశేఖరాళ్వార్, 7. తిరుప్పాణాళ్వార్, 8. తొండర

డిప్పొడియాళ్వార్, 9. తిరుమంగయాళ్వార్, 10. ఉడయ వరులనబడు రామానుజులు 11. నమ్మాళ్వార్, 12. మధురకవియాళ్వార్. ఈ ఆళ్వారులు ద్రవిడ భాషలో రాసిన నాలుగు వేల పాశురాలకు 'నాలాయిర దివ్యప్రబంధం' అని పేరు.

## ఆసియా

ప్రపంచంలోని 5 ఖండాలలోను మిక్కిలి పెద్ద ఖండం. తూర్పున యూరప్ మొదలుకొని పశ్చిమాన పసిఫిక్ మహాసముద్రం వరకు 9700 కి.మీ. వ్యాపించి ఉంది. శీతలమైన మంచుమయమైన ఉత్తర ధ్రువం నుంచి ఉష్ణమండలమైన భూమధ్య రేఖ వరకు 8790 కి.మీ. వరకు ఉంది. ఆసియా ఖండంలో నివసించే జనాభా దాదాపు 250 కోట్ల మంది. చీనా, ఇండియా, ఇండోనేషియా, బర్మా, మలేషియా, తాయిలాండ్ ఇత్యాది 40 దేశాలు ఈ ఖండంలో ఉన్నాయి. ప్రపంచంలో అత్యున్నతమైన ఎవరెస్ట్ (చూ) శిఖరం ఈ ఖండం (నేపాల్)లోనే ఉంది. ఈ శిఖరం ఎత్తు: 8,848 మీ. సముద్ర మట్టానికి 400 మీ. దిగువన ఉన్న మృత సముద్రం (డెడ్ సీ) ఆసియాలోనే ఉంది. హిమాలయాలు, హిందూకుష్, కారకోరమ్, కునల్లాక్, నాన్‌షాన్, తిన్‌షాన్ ఈ ఖండంలోని ప్రముఖ పర్వత శ్రేణులు. బ్రహ్మపుత్ర, సింధూ, గంగా, ఐరావతి, మీకాంగ్, టైగ్రీస్, ఒబ్, గోదావరి, కృష్ణా, కావేరీ ప్రధాన నదులు. గోబీ ఎడారి ఇక్కడే వుంది.

## ఆస్ట్రియా

మధ్య యూరప్‌లోని ఒక చిన్న గణ రాజ్యం. ప్రాచీన చరిత్ర ఉన్న దేశం. రోమన్‌లు (క్రీ.పూ.15), షార్లమాన్ (8వ శతాబ్దం), ఓటో I, IIల పవిత్ర రోమన్ రాజ్యం (క్రీ.శ. 10వ శతా.), హేప్స్ బర్గులు (13వ శతా. నుంచి 18వ శతా.) మొదలైన వారు ఈ దేశాన్ని పాలించారు. మెట్టెర్నిక్ నాయకత్వంలో విప్లవం జరిగింది. ఆ తరువాత ఆస్ట్రియా హంగేరీ సమాఖ్యలో చేరడం, 1918లో మళ్లీ విడిపోవడం జరిగి, స్వతంత్ర గణ రాజ్యంగా అవతరించింది.

ఆస్ట్రియా దేశం వాస్తు, శిల్ప సంపదలకు ప్రసిద్ధి చెందిన దేశం. వియెన్నాలోని శిల్పకళా సంపద జగత్ప్రసిద్ధి గాంచింది. ఆల్ప్సు పర్వతాలు ఉన్న ఈ ప్రాంతం కొండలమయం. ఖనిజ సంపద ఎక్కువ. కాని, నాణ్యత




తక్కువ. లిగ్నైట్, నేలబొగ్గు దొరుకుతాయి. రాగి, గ్రాఫైట్, ఇనుపరాయి, సీసం, మాగ్నసైట్, తైలం, చమురు వాయువు, జింకు, ఉప్పు ముఖ్య ఖనిజాలు. ఆస్ట్రియా జలసంపద ఎక్కువగా గల దేశం. జల విద్యుత్తును పొరుగు దేశాలకు ఈ దేశం సరఫరా చేస్తూంది. పంటలు బార్లీ, రై—ఓట్ ధాన్యాలు, బీటు పశువుల పెంపకం ఎక్కువ. పారిశ్రామిక ప్రగతి కూడా చెప్పుకోదగిందే! సిమెంటు, రాసాయనిక ద్రవ్యాలు, విద్యుత్ పరికరాలు, క్షర సామాను, గాజు, ఇనుము—ఉక్కు, తోలు సామగ్రి, యంత్ర సామగ్రి, పనిముట్లు, మోటారు కార్లు, చాక్షుష పరికరాలు, కాగితం, కాగితపు గుజ్జు, డబ్బాలలో నిల్వచేసిన పానీయాలు, వస్త్ర పరిశ్రమలు ప్రధాన మైనవి.

విస్తీర్ణం: 83,857 చ.కి.మీ. జనాభా: 75,57,000 (1988), రాజధాని: వియెన్నా; అధికార భాష: జర్మన్; ప్రజలు క్రైస్తవులు.

ఆస్ట్రియా సుప్రసిద్ధ పాశ్చాత్య వాగ్గేయకారులు మొజర్ట్, షాన్‌బెర్గ్, షూబర్ట్ వంటివారికి జన్మ స్థానం.

## ఆస్ట్రేలియా

దక్షిణార్ధ గోళంలోని ఒక భూఖండం. దీనిలోని ఆరు రాష్ట్రాలు: క్వీన్స్‌లాండ్, న్యూ సౌత్‌వేల్స్, విక్టోరియా, దక్షిణ ఆస్ట్రేలియా, నార్తర్న్ టెరిటరీ, పశ్చిమ ఆస్ట్రేలియా. దక్షిణాన టాస్మేనియా దీవి ఉంది. 1770లో కెప్టెన్ జేమ్స్‌కుక్ యాత్రలు సాగించిన పిమ్మట ఆస్ట్రేలియా బ్రిటిష్ వారికి వలస రాజ్య

మయింది. అంతకు ముందు ఈ ఖండంలో ఆదిమ వాసులు ఉండేవారు. నేడు కామన్‌వెల్త్‌లో స్వతంత్ర ప్రతిపత్తిగల సభ్య రాజ్యం ఇది. ప్రభుత్వాధి నేత ప్రధాని. రాజధాని కాన్‌బెర్రా. మెల్‌బోర్న్, సిడ్నీ, పెర్త్, డార్విన్, బ్రిస్బేన్ ఇతర ప్రధాన నగరాలు. విస్తీర్ణం: 76,82,300 చ.కి.మీ., జనాభా: 1,64,70,000, ఎక్కువ మంది (86 శాతం) పట్టణ వాసులు. ఆర్థిక సంపద: బార్లీ, ఓట్ ధాన్యం, పండ్లు, గోధుమ, ద్రాక్ష, చెరకు, ప్రత్తి, జొన్న, నారింజ, అరటి, ఆపిల్, వరి, అనాస, వేరుసెనగ, పొద్దుతిరుగుడు, బంగాళ దుంపలు, పంచదార, పాడి పరిశ్రమ, ఉన్ని.

పరిశ్రమలు: ఉక్కు, జవుళి, కార్లు, విమానాలు, కాగితం. ఖనిజ సంపద: బాక్సైట్, నేలబొగ్గు, రాగి, బంగారం, ఇనుప రాయి, సీసం, చమురు వాయువు, వెండి, తగరం, యురేనియం, జింకు.

ముర్రేనది, ముర్రంబిడ్జినది, డార్లింగ్ నది ప్రధానమైన నదులు. బుగ్గ బావులు పంట నీటిని సరఫరా చేస్తాయి. పశు సంపద, పాల ఉత్పత్తి ప్రధానమైన ఆర్థిక వనరులు. రెండు వేల కి.మీ. నిడివి గల గ్రేట్ బేరియర్ రీఫ్ పగడాల ఉత్పత్తికి ప్రసిద్ధి చెందడమే గాక వినోద యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తూంది. ఆస్ట్రేలియాలో ప్రజలు మాట్లాడే భాష: ఇంగ్లీషు. జంతువులలో కంగారు మృగం పేర్గాంచదగింది. ప్లాటిపస్ అనే ప్రాచీన జంతు శేషం దక్షిణాదిన కనిపిస్తుంది.

## ఇంగ్లండు

చూ. గ్రేట్ బ్రిటన్

## ఇండియా

చూ. భారతదేశం

## ఇండోనేషియా

ఆగ్నేయాసియాలోని ద్వీపరాజ్యం. హిందూ మహా సముద్రంలో మొత్తం 13, 600 చిన్న, పెద్ద దీవులు కలసి ఇండోనేషియాగా వ్యవహరింప బడుతున్నది. సుందా దీవులనబడే సుమత్రా, జావా, కాలిమాంటన్ (బోర్నియో), సూలవెసి, పశ్చిమ ఇరియాన్ ద్వీప కల్పం వీటిలో ప్రధానమైనవి.

విస్తీర్ణం: 19,19,443 చ.కి.మీ., జనాభా: 17,59, 04,000 (1988) అత్యధిక జనాభా చిన్న చిన్న దీవులలో సంప్రదాయ పద్ధతిలోనే జీవనం గడుపుతున్నారు. ఆర్థిక సంపద: కొబ్బరి, కాఫీ, కర్ర పెండలం, మొక్కజొన్న, పామ్‌నూనె, వేరుసెనగ, రబ్బరు, సుగంధ ద్రవ్యాలు, పంచదార, పొగాకు, తేయాకు, మత్స్య పరిశ్రమ భారీగా సాగుతున్నాయి. ఎబనీ, టేకు కలప విరివిగా లభిస్తుంది. ఖనిజ సంపద: నేలబొగ్గు, చమురు వాయువు, పెట్రోలు, తగరం, నికెల్, బాక్సైట్. ఒకప్పుడు (క్రీ.శ. 700 ప్రాంతం) హిందూ, బౌద్ధ రాజ్యాలు ఇక్కడ వర్ధిల్లాయి. బోరు బదూరులోని బౌద్ధ శిల్పాలు మనోహరమైనవి. రాజధాని: జకార్తా. ఇక్కడ అధికార భాష: భాషా ఇండోనేషియా. జావాలో జావనీస్ భాష వాడుకలో ఉంది.

## ఇందిరాగాంధీ 1917–1984

ఒకటిన్నర దశాబ్దం పాటు భారతదేశానికి ప్రధానిగా ఉండి జగద్విఖ్యాతి గాంచిన భారత మహిళ. ప్రథమ భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఏకైక పుత్రిక. నవంబర్ 19న 1917లో అలహాబాదులో

జన్మించింది. అక్టోబర్ 31 నాడు 1984లో తన రక్షక సిబ్బంది తుపాకీ గుండుకు గురియై హఠాన్మరణం చెందింది. పూర్తి పేరు ఇందిరా ప్రియదర్శినీ నెహ్రూ. 1942లో ఫెరోజ్ గాంధీని వివాహమాడగా ఆమెపేరు ఇందిరాగాంధీగా మారింది. భారత స్వాతంత్ర్య సమరంలో తండ్రి, తాతలతో పాటు ఈమె కూడ చిన్నప్పుడు వానరసేనను కూడగట్టి బ్రిటిష్‌వారిని ఎదిరించింది. శాంతినికేతన్‌లోని విశ్వభారతి, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ (ఇంగ్లండ్)లలో విద్య నభ్యసించింది. 1934లో తల్లి కమలా నెహ్రూ మరణించగా తండ్రి స్వతంత్ర పోరాటంలో జైలుపాలుకాగా ఈమె స్వయం కృషితో తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ ఎదిగింది. నెహ్రూ భారత ప్రధానిగా (1947–64) ఉన్నంత కాలం ఆయనకు తోడునీడగా ఉంటూ రాజనీతి మెళుకువలను ఒంట బట్టించుకుంది. లాల్‌బహదూర్ శాస్త్రి మంత్రి వర్గంలో చేరి ఆయన మరణానంతరం 1966 జనవరిలో భారత ప్రధాని అయి 1977 వరకూ ఉవ్వెత్తున రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టి ప్రజాదరణ చూరగొన్నది. ఆ సంస్కరణలలో పేర్కొన దగినవి— సంస్థానాధీశులకు ఇస్తున్న భరణాల (ప్రీవీపర్సులు)కు స్వస్తి చెప్పడం, వాణిజ్య బ్యాంకుల జాతీయకరణ, బంగ్లాదేశ్ విమోచనకు ధైర్యంగా సహాయం చేయడం. అత్యవసర పరిస్థితి (ఎమర్జన్సీ) విధింపు ఆమె రాజకీయ జీవిత చరిత్రలో మాయని మచ్చ. ఫలితంగా 1977 ఎన్నికలలో ఘోర పరాజయం చెందింది. కాని, తరువాత మళ్లీ రాజకీయంగా పుంజుకుని, 1980 ఎన్నికలలో విజయం సాధించి తిరిగి ప్రధాని కావడం ఆమె రాజకీయ చతురతకు తార్కాణం. 'గరీబీ హఠావో' అనే నినాదాన్నిచ్చి బీదజనుల ఉద్ధరణకు అనేక కార్యక్రమాలను రూపొందించి అమలు జరిపింది. ప్రధానిగా ఈమె అవలంబించిన విదేశ నీతి తండ్రి వేసిన బాటనే అనుసరించింది. అలీనోద్యమానికి ఇందిరా గాంధీ నాయకత్వం వహించింది.



భారత జాతీయ కాంగ్రెసుకు 1959 లోనూ, 1960లోనూ రెండు సార్లు అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. తండ్రి మరణానంతరం ఏర్పడిన శాస్త్రి మంత్రి వర్గంలో సమాచార, ప్రసార శాఖలను నిర్వహించింది. ఆమె మరణానంతరం 1984లో భారత ప్రధాని అయిన రాజీవ్ గాంధీ ఇందిరా గాంధీ పెద్ద కుమారుడు. రెండవ కుమారుడు సంజయ గాంధీ 1980లో మరణించినప్పటికీ అకుంఠిత కార్యదీక్షతో భారత దేశ ప్రజలకు నిరుపమానమైన సేవలను ఆమె అందించింది. 1971లో 'భారతరత్న' పురస్కారమును అందుకుంది.

## ఇంద్రప్రస్థం

కౌరవులు, పాండవులకు సగం రాజ్యం ఇచ్చిన తర్వాత ఖాండవ ప్రస్థంలో పాండవులు కొత్తగా నిర్మించుకొన్న పట్టణం. కృష్ణుడు ఇంద్రుని ద్వారా విశ్వకర్మచేత నిర్మింప చేసిన పట్టణం గనుక ఇంద్రప్రస్థం అనే పేరు వచ్చింది. నేటి ఢిల్లీయే పాండవుల కాలంలో రాజధాని అయి గణుతికెక్కిన ఇంద్రప్రస్థపురం అని చెప్తారు.

## ఇంద్రుడు

ఇంద్రుడు స్వర్గానికి అధిపతి. అష్టదిక్పాలకులలో ఒకడు. తూర్పు దిక్కుకు ఈయన పాలకుడు. ఇంద్రుడు అదితి, కశ్యపుల పుత్రుడు. విష్ణువు అదితి, కశ్యపులకు వామనుడు అనే పుత్రుడుగా జన్మించినందువలన ఇంద్రుడికి తమ్ముడు అవుతాడు. అందుచేతనే విష్ణువును ఉపేంద్రుడు అని అంటారు. ఇంద్రుని భార్య శచీదేవి. ఈయనకు జయంతుడు అనే కుమారుడు, జయంతి అనే కుమార్తె ఉన్నారు. ఇంద్రుని వాహనం ఐరావతం అనే తెల్లని ఏనుగు. ఈయన గుర్రం ఉచ్చైశ్శ్రవం. ఈ రెండూ పాలసముద్రం నుంచి ఉద్భవించాయి. ఇంద్రుడి ఆయుధం వజ్రాయుధం. ఆయన రాజధాని అమరావతి.

## ఇక్బాల్, మహమ్మద్ 1875–1933

ఉర్దూ, పారసీక సాహిత్య రంగాలలో సుప్రసిద్ధుడయిన మహాకవి. మహమ్మద్ ఇక్బాల్ పంజాబు (ఇప్పటి పాకిస్తాన్)లోని సియాల్ కోటలో జన్మించాడు. భారతదేశ ఔన్నత్యాన్ని ఉగ్గడిస్తూ 'సారే జహాఁసే అచ్ఛా హిందుస్థాన్ హమారా అనే సుప్రసిద్ధ దేశభక్తి గేయాన్ని రచించింది ఈ మహాకవే! ఇక్బాల్ పారసీక రచనలలో పేర్కొన దగినవి: 1. 'ఫయామే మషరిఖ్', 2. 'అసరా రెఖుదీ', 3. 'రమూజే బెఖుదీ', 4. జఖూర్ అజంద్, 5. పస్ చే బాయద్ కర్ద్ అఖ్వామే మషిరిఖ్. ఇక ఉర్దూలో 1.బాంగెదిరా, 2. బాలెజ్రబీల్, 3. జరబెకలీం, 4. ఇర్మాగానే వాజాజ్ ప్రసిద్ధిపొందాయి. ఇక్బాల్ స్మారక స్తూపం ఆంధ్రప్రదేశ్ సచివాలయం సమీపాన హైదరాబాద్‌లో ఉంది.



## ఇజ్రాయెల్

మధ్యధరా సముద్రం తూర్పు తీరాన్ని ఆనుకుని ఉన్న యూదుల ప్రత్యేక రాజ్యం. ప్రపంచంలో ఎక్కడెక్కడ ఉన్న యూదులూ కలసి ఒక చోటికిచేరి 1948లో ఈ ఇజ్రాయెల్ రాజ్యాన్ని స్థాపించుకున్నారు. బైబిలు నాటి (క్రీ.శ.200) యూదుల కేంద్రమైన పాలస్తీనా పలుదాడులకు గురియై యూదులు చెల్లాచెదరై ప్రపంచం నాలుగు మూలలకూ వెళ్లిపోయారు. మత ద్వేషానికి గురియై హింసింపబడ్డారు. 1800 నుండి తమ పవిత్ర జన్మ భూమికి పునరాగమం ప్రారంభించి తీవ్ర విప్లవం సాగించి చివరకు 1948లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించ గలిగారు. దేశభక్తి జాతీయ భావాలతో ప్రతి ఒక్క యూదుపౌరుడు కష్టించి పనిచేసి ఇప్పుడు తమ రాజ్యపు ఆర్థికస్థాయిని పెంచుకోవడమే కాక తత్ఫలితంగా ప్రపంచం లోనే అత్యధిక జీవన ప్రమాణాన్ని అందుకో గలిగారు. కృషితో నాస్తి దుర్భిక్షం అని ప్రపంచానికి చాటి చెప్పారు. మృత సముద్రం (డెడ్ సీ) ఇజ్రాయెల్‌లోనే ఉంది. ఇజ్రాయెల్ విస్తీర్ణం: 20,700 చ.కి.మీ. జనాభా: 45,12,000 (1988). రాజధాని: జెరూసలెం. ఇతర ప్రధాన పట్టణాలు: టెల్ అవీవ్, యఫో, హైఫా, హొలాన్, బట్‌యావ్. ఆర్థిక సంపద: నీటి ఎద్దడి ఉన్నప్పటికీ శాస్త్ర విజ్ఞానాన్ని వినియోగించు కుంటూ ఉప్పు నీటిని శుద్ధి చేసి మంచి నీరుగా మార్చి నారింజ జాతి పండ్లు పండించి ఎగుమతి చేస్తున్నారు. పాడి పరిశ్రమ, కోళ్ల పరిశ్రమ ఎక్కువ. జవుళీ, వజ్రాలు రవాణా చేస్తున్నారు. రాగి ఖనిజం, రసాయనిక లవణాలు త్రవ్వితీసే పరిశ్రమలు కూడా ఉన్నాయి.




అధికార భాష: హీబ్రూ, అరబిక్. ప్రజలలో యూదు మతస్థులు 82 శాతం, ముస్లిం (సున్నీ) మతస్థులు 14 శాతం ఉన్నారు. ప్రజలలో కొందరు 'కుబిట్జ్' అనే సామూహిక వసతి గృహాలలో జీవయాత్ర సాగిస్తూ ఉంటారు.

## ఇటలీ

దక్షిణ యూరప్‌లోని స్వతంత్ర రాజ్యం. ఒకప్పుడు పవిత్ర రోమన్ సామ్రాజ్యంలో అంతర్భాగం జూలియస్ సీజరు, పోప్‌లు, షార్ల్‌మాన్ వంటి మహా నాయకులు ఏలిన ప్రాంతం. శిల్పకళా సంపదకు ఇటలీ ప్రసిద్ధి. మైఖేల్ ఏంజిలో, డా విన్సీ వంటి ప్రముఖ చిత్ర కారులు ఇటలీ దేశస్థులే! ప్రజలలో 83 శాతం రోమన్ కేతలిక్కులు. నాస్తికులు 15 శాతం.

విస్తీర్ణం: 3,01,277 చ.కి.మీ. జనాభా: 5,74, 01, 000(1988); రాజధాని: రోమ్. పో నది ముఖ్యమైన జలాధారం. ప్రధాన పట్టణాలు: వెనిస్, మిలాన్, ట్యూరిన్, జినోవా, పాలెర్మో, బోల్గోనా, ఫ్లారెన్స్, కటానియా, బారీ



నేపిల్స్. ఆల్ప్సుపర్వత సానువులలో ద్రాక్షను విరివిగా పండిస్తారు. చెరకు, బాదం, నిమ్మ, నారింజ, ఆలివ్, మల్బరీ, బీటు పంచదార, పొగాకు, టోమాటో కూడా పండుతాయి. ఖనిజ సంపద: బాక్సైట్, మార్బిల్, గంధకం, జింకు, పాదరసం. పరిశ్రమలు: మోటారు కార్లు, తోలు సామగ్రి, జవుళి, పెట్రోలియం రసాయనికాలు, ద్రాక్షసారాయి, నౌకా నిర్మాణం, ఉక్కు, టైప్ రైటర్‌లు.

## ఇత్సింగ్ క్రీ.శ. 635–713

క్రీ.శ 673–692 మధ్య, భారతదేశమును పర్యటించిన బౌద్ధయాత్రికులలో ప్రసిద్ధుడు. అసలు పేరు చాంగ్ వెన్–మింగ్. శ్రీ విజయ రాజధాని పాలెంబాగ్‌లో సంస్కృతమును అభ్యసించి నలందా సమీపాన ఉన్న తామ్రలిప్తిని చేరెను. భారతదేశంలోని బౌద్ధ సన్యాసుల విహారములందు పదిఏళ్ళు అధ్యయనం గావించి పెక్కు బౌద్ధ గ్రంథములను సేకరించి 695లో స్వదేశమునకు పోయి మరల ఒకసారి శ్రీ విజయ రాజ్యమునకు వచ్చి బౌద్ధమును గూర్చి అధ్యయనం కొనసాగించి 56 గ్రంథములను చీనాభాషలో ప్రచురించెను. వాటిలో నాడు వివిధ దేశాలలో అమలులో ఉండిన బౌద్ధ ధర్మ సంప్రదాయాలనూ, సాంఘికాచారాలనూ, నౌకాయాన సంబంధ విషయాలనూ పొందుపరిచెను.

## ఇబ్న్ బతూతా క్రీ.శ. 1304–1378

అసలు పేరు అబ్దుల్లా మహమ్మద్ ఇబ్న్ బతూతా. 1325–55 మధ్య దేశాలు పర్యటించి తన అనుభవాల్ని గ్రంథస్థం చేసిన ముస్లిం యాత్రికుడు. భారతదేశమును దర్శించినప్పుడు ఢిల్లీలో మహమ్మదు–బిన్–తుఘ్లక్ రాజ్యపాలన చేయుచుండెను. అప్పుడు తుఘ్లక్ ఈ ఇబ్న్ బతూతాను ఢిల్లీ కాజీగా నియమించెను. తన ప్రపంచ పర్యటన ఉత్తర ఆఫ్రికా, పశ్చిమ ఆసియాలోని ప్రముఖ రాజ్యాలు, మెక్కా, మదీనా, భారతదేశం, జావా, సుమత్రా, చీనా,, శ్రీలంక, మాల్దీవులు, ఆఫ్రికా తూర్పు రేవుపట్టణాలు దర్శించి ప్రత్యక్షానుభవాల్ని అరబ్బీలో యాత్రాచరిత్రగా వ్రాశాడు. అవి ఆనాటి చరిత్రకు ఆధారాలయ్యాయి.

## ఇరాక్

పర్షియన్ సింధుశాఖ ముఖ ద్వారంలోని అరబ్బీ స్వతంత్ర రాజ్యం. అరబ్బీ భాషలో ఇరాక్‌ను అల్–జుమ్హూరియా అల్–ఇరాఖియా అని అంటారు. టైగ్రీస్, యూఫ్రెటీస్ నదీ లోయలలో క్రీ.పూ. 3000 నాడు వెలసిన బాబిలోనియా, అస్సీరియా, సుమేరు నాగరికతల చేత ప్రభావితమైన ప్రాంతం. ఈ ప్రాంతాన్నే ప్రాచీన కాలంలో 'మెసపొటేమియా' అనేవారు. విస్తీర్ణం: 4,38,317 చ.కి.మీ., జనాభా: 1,66,30,000 (1988). రాజధాని: బాగ్దాద్. అధికార భాష: అరబ్బీ. షియాలు 54 శాతం, సున్నీలు 42 శాతం.
నీటి వనరులు: టైగ్రీస్, యూఫ్రెటీస్ నదులు. బార్లీ, వరి, చిరుధాన్యాలు, గోధుమ, ప్రత్తి, ఖర్జూరం, పొగాకు ఇక్కడ పండుతాయి. పరిశ్రమలు: ఉన్ని, నూలు బట్టలు. ఖనిజ సంపద: పెట్రోలు. ఇది మహమ్మదీయ రాజ్యం.




## ఇరాన్

ఒకప్పుడు అస్సీరియా నాగరకత వర్ధిల్లిన ప్రాంతం. పారసీక భాషలో ఇరాన్‌ను కేష్వారే షా ఇన్ షాయే అంటారు. రాజుపాలన పద్ధతిలో ఇక్కడ ప్రభుత్వం నడుస్తూంది. అధికార భాష: పారసీకం, కుర్దిష్ కూడా అక్కడక్కడా మాట్లాడతారు. విస్తీర్ణం:16,43,503 చ.కి.మీ., జనాభా: 5,12,25,000 (1988), రాజధాని: టెహ్రాన్. ప్రజలు: షియా ముస్లిములు 93

శాతం. ముఖ్యమైన వీటి నదులు: షాట్ ఆల్ అరబ్ నది, దాని ఉపనది కారూన్, సెఫిడ్ నది, అట్రెక్ నది. ఉప్పు పరప్పులు ఉప్పు నీటివి. పెట్రోల్ నిధులు ఖుజిస్తాన్ ప్రాంతంలో ఎక్కువ. బార్లీ, గోధుమ, నల్లమందు, తేయాకు, పొగాకు, మొక్కజొన్న, ట్రగాకాంత్ జిగుర్లు, ఖర్జూరం మొదలయినవి పంట దినుసులు. ఖనిజ సంపద: నేల బొగ్గు, ఆర్సనిక్, రాగి, ఇనుము, పెట్రోల్, గంధకం. పరిశ్రమలు: తివాచీ నేత, సిమెంట్, సిగరెట్టు, పట్టు, జవుళీ.

## ఇలంగో అడిగళ్




దక్షిణాదిని పాండ్యదేశంలో క్రీ.శ. 2వ శతాబ్దానికి చెందిన ఇలంగో అడిగళ్ తమిళ సాహిత్యంలో పేరొందిన శిలప్పది కారం (కడియం కథ) అనే ప్రాచీన కావ్యాన్ని రచించాడు (చూ. శిలప్పదికారం.).

## ఇలియెట్, టి.ఎస్. 1888–1965

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఇంగ్లీషు కవి. విమర్శకుడు. అమెరికాలోని మిస్సోరీ రాష్ట్రంలోని సెయింట్ లూయీలో ఈయన జన్మించాడు. 1915లో ఇంగ్లండ్‌లో వివాహం చేసుకుని అప్పటి నుంచి ఆంగ్ల పౌరుడుగా ఇంగ్లండ్‌లోనే స్థిరపడ్డాడు. ఇలియెట్ రచించిన ప్రసిద్ధ కావ్యాలు: ది వేస్ట్‌లాండ్ (1922), యాష్ వెడ్నెస్‌డే (1930), ఫోర్ క్వార్టర్స్ (1935–41). ఆయన వ్రాసిన పద్యనాటికలలో స్వీనీ అగానిస్టిస్ (1926), మర్డర్ ఇన్ ది కేథెడ్రల్ (1935), ది కాక్‌టైల్ పార్టీ (1949), ది ఫామిలీ రీయూనియన్ (1939) చెప్పుకోదగ్గవి. సాహిత్య విమ ర్శకుడుగాను, పత్రికా సంపాదకుడుగాను కూడా ఇలి యెట్ సుప్రసిద్ధుడు. 1948లో ఇలియెట్ నోబెల్ బహుమతి పొందాడు.

## ఇలియెడ్ కావ్యం

క్రీ.పూ. 700 ప్రాంతంలో గ్రీక్ మహాకవి హోమర్ రచించిన పురాణకావ్యం. ప్రాచీనకాలం (క్రీ.పూ. 1100)లో గ్రీస్ దేశానికీ, ట్రాయ్ నగరానికి మధ్య జరిగిన ట్రోజన్ సంగ్రామం ఈ మహాకావ్యానికి కథావస్తువు.

## ఇస్లాం

మహమ్మద్ (చూ.) ప్రవక్త స్థాపించిన మతం. ఈ మతం వారిని ముస్లిములు అనీ మహమ్మదీయులు అనీ అంటారు. ఖొరాన్ వీరి పవిత్ర గ్రంథం. అల్లా వీరి దైవం. అల్లాయే శరణ్యమని ఈ మతం బోధిస్తుంది. మసీదు వీరి దేవళం. శుక్రవారం వీరికి పవిత్ర దినం. వీరి ప్రధానమైన పండుగ: రంజాన్. మెక్కా వీరి పుణ్యక్షేత్రం. మెక్కా(చూ.)కు హాజీ యాత్ర జరిపి పరమ పవిత్రమైన కాబా శిలచుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణంచేసి దానిని చుంబించడం వల్ల జన్మ చరితార్థం అవుతుందని వీరి విశ్వాసం.

## ఈక్వడార్

దక్షిణ అమెరికాలో వాయవ్యదిశలో ఉన్న స్వతంత్ర గణరాజ్యం. 15వ శతాబ్దిలో ఇన్కా జాతుల ఏలుబడిలో ఉన్న ఈ ప్రాంతానికి 1534 నాటికి స్పెనిష్‌వారు వలసరావడం మొదలయింది. 1822లో ఫ్రెంచ్ వారి ఆధీనమయినా, 1830లో ఈ దేశం స్వాతంత్ర్యం సాధించుకుంది. ఆ తరువాత రాజకీయ అస్థిరతకులోనై ఆర్థికంగా అభివృద్ధి కాలేక పోయింది.




1966లో రూపొందించుకున్న రాజ్యాంగం ప్రకారం ప్రస్తుతం ఈదేశంలో పాలన కొనసాగు తూంది. విస్తీర్ణం: 2,69,178 చ.కి.మీ., జనాభా:1,02,03,000 (1988). రాజ ధాని: క్విటో. దేశం మధ్య ఆండీస్ పర్వతశ్రేణి, దానికి అటూ ఇటూ అమెజాన్ నదీలోయలు, మైదానాలు ఉన్నాయి. పరిణామ సిద్ధాంతాన్ని ప్రవచించిన ప్రసిద్ధ జీవశాస్త్రజ్ఞుడు ఛార్లెస్ డార్విన్ పరిశోధనలు జరిపిన 'గాలపగోస్' దీవులు ఈక్వడార్‌కి చెందినవే! వరి, గోధుమ, కాఫీ, బార్లీ, అరటి, కోకో, చెరకు, ప్రత్తి ముఖ్యమైన పంటలు. రాగి, బంగారం, పెట్రోలు, గంధకం, ఖనిజాలు ఇక్కడ దొరుకుతాయి. సిమెంటు, నూలు వస్త్రాలు, ఔషధాలు, టాగ్వా గింజలు ఈ దేశం నుంచి ఎగుమతి అవుతున్నాయి. మత్స్యసంపద, కలప లభిస్తున్నాయి.

## ఈక్వెటోరియల్ గినీ

ఒకప్పుడు స్పేనిష్ గినీ అనబడే ఈ దేశం 1957లో ఈక్విటోరియల్ గినీ గణరాజ్యంగా రూపొందింది. ఇందులో ఫెర్నాండోపో, కార్సిస్కో, గ్రేట్ ఎలోబే, అన్నోబాన్ దీవులతో పాటు పశ్చిమ ఆఫ్రికా భూఖండంలో ఉన్న రియోమునీ ఉన్నాయి.

విస్తీర్ణం: 28,051 చ.కి.మీ; జనాభా: 3,35, 000 (1988), రాజధాని: మలాబో (శాంతా ఇజాబెల్); అధికార భాష: స్పేనిష్, ఫాంగ్ భాషను కూడా మాట్లాడతారు. ఫాంగ్, బూబీ, దౌలా, ఇబిబొయో, మాకా ఆదిమ తెగల ప్రజలున్నారు. ఇక్కడి ప్రజలు క్రైస్తవులు.

కోకో, కాఫీ ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. ఇవిగాక అరటిపండులు ఎబనీ, ఓక్ కలప, పామ్ గింజలు ఎగుమతి అవుతున్నాయి. కర్రపెండలం, చిరుగడం ప్రజల ఆహార దినుసులు. ఇనుపరాయి, సీసం, జింకు, మోలిబ్డినమ్, వజ్రాలు, రేడియో ధార్మిక ఖనిజ నిక్షేపాలు ఉన్నట్లు తెలుస్తూంది.

## ఈజిప్టు

ఆఫ్రికాలో ఉత్తర భాగాన, మధ్యధరా సముద్రాన్ని ఆముకొని ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యం. ఇది బహు ప్రాచీన చరిత్రగల దేశం. పిరమిడ్‌లు, మమ్మీలు ఈ దేశానికి సంబంధించినవే!

విస్తీర్ణం: 10,01,449 చ.కి.మీ. జనాభా: 4,24, 49,000 (1980), రాజధాని: కెయిరో, అధికార భాష: అరబ్బీ.

ఈజిప్టు నాలుగు సహజ మండలాలుగా ఉంది.
1. నైలు నదీలోయ డెల్టా 2. పశ్చిమ ఎడారి, 3. తూర్పు ఎడారి, 4. రెడ్‌సీ, సూయజ్ కాలువను ఆనుకోని ఉన్న సీనై ద్వీపకల్పం.

1540 కి.మీ. నిడివిగల నైలునదీ లోయలో పంటలు విరివిగా పండుతాయి. ఇక్కడ నేల మిక్కిలి సారవంతమైంది. పశ్చిమ ఎడారి కూడా ఇందులోదే! సీనై ద్వీపకల్పం పర్వతమయమైన ఎడారి. అక్కడక్కడ పచ్చ పట్టాలు(ఒయాసిస్‌లు) కనిపిస్తాయి. నైలునది అందించే పంటనీటితో ప్రత్తిని విరివిగా పండిస్తున్నారు. ఈజిప్ట్ ప్రత్తి జగత్ప్రసిద్ధి పొందింది. ఇదిగాక మొక్కజొన్న, ఉల్లి, బంగాళా దుంపలు, వరి, చెరకు, గోధుమ, చిరుధాన్యాలు పండుతాయి. గొర్రెలు, మేకల పెంపకం ముమ్మరంగా సాగుతూంది. ఈ దేశంలో నైలునదీ మీద ఆస్వాన్




డాము ఇటీవలనే నిర్మించారు. కెయిరో, ఆలెగ్జాండ్రియా, నగరాలలో బృహత్ పరిశ్రమలు ఉన్నాయి. ఖనిజ సంపద నామ మాత్రం! స్వల్పంగా ఇముపరాయి, తూర్పు ఎడారిలో పెట్రోలియం దొరుకుతాయి. ప్రాచీన ఈజిప్ట్ నాగరకతావశేషాలైన పిరమిడు(చూ.) మమ్మీలు, విదేశీ యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. 'గాజా' దగ్గర ఉన్న గ్రేట్ స్ఫింక్స్ ముఖ్యంగా దర్శించదగింది. లుకాజరు వద్ద ఉన్న మహారాజుల గోరీలు కూడా వినోద యాత్రికులను ఆకర్షిస్తున్నాయి.

## ఈశ్వర చంద్ర విద్యాసాగర్

సుప్రసిద్ధ బెంగాలీ పండితుడు, సంఘ సంస్కర్త. బహుభాషా కోవిదుడు. కొన్నాళ్ళు ఫోర్ట్ విలియం కాలేజీలోనూ సంస్కృత కళాశాలలోనూ వ్యాకరణాచార్యుడుగా పని చేశాడు. శకుంతల నాటకం, సీతవనవాసం, బోధోదయం, సత్పురుషుల జీవిత చరితలు, విర్థల పంచవింశతి మున్నగునవి ఈయన రచనలలో ఎన్నదగినవి. కందుకూరి వీరేశలింగం గారి లాగ స్త్రీ పునర్వివాహాలను ప్రోత్సహిస్తూ గొప్ప సంఘ సంస్కర్తగా ఈయన ప్రసిద్ధి పొందాడు. ఆడ



మహాకావ్యాలకు కూడా కార్యరంగం ఈ ప్రాంతమే. క్రీ.పూ. 6వ శతాబ్దిలో అవతరించిన జైన, బౌద్ధమతాల స్థాపకులు — మహావీరుడు, గౌతమ బుద్ధుడు ఈ ప్రాంతంలోనే మొదట తమ మత బోధనలు ప్రారంభించారు. దక్షిణాదికి చెందిన అద్వైత మత స్థాపకుడు ఆది శంకరాచార్యులవారు బదరీనాథ్‌లో ఆశ్రమం ఏర్పాటు చేశారు. మధ్య యుగంలో ముస్లింపాలనలో కబీరు, తులసీదాసు వంటి మహాభక్తులు వెలసింది ఈ ప్రాంతంలోనే! అంతకు ముందు ఆగ్రా, అయోధ్య అని వేరుగా ఉన్న ప్రాంతాలు బ్రిటిష్ పాలనలో ఏకం అయ్యాయి. 1935లో యునైటెడ్ ప్రావిన్సెస్ (సంయుక్త రాష్ట్రాలు) ఏర్పడి, 1950లో ఉత్తర ప్రదేశ్‌గా రూపొందింది. ప్రప్రథమ భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జన్మస్థలం (అలహాబాద్). ఈ రాష్ట్రంలో ప్రస్తుతం (1990) 57 జిల్లాలున్నాయి. రాష్ట్ర విస్తీర్ణం: 2,94,411 చ.కి.మీ. జనాభా: 11,08,62,813 (1981) రాజధాని: లక్నో. అధికార భాష: హిందీ; వ్రజ భాష, భోజ్‌పూరీ వంటి మాండలిక భాషలు కూడా ప్రజలు మాట్లాడుతూ ఉంటారు. ఉత్తరాన హిమాలయ పర్వతాలుగా గాద్వాల్ శ్రేణులు దక్షిణాన పీఠభూమి, మధ్య సారవంతమైన గంగానదీ మైదానం ఉన్నాయి. వరి, చెరకు, గోధుమ పంటలకు ఈ రాష్ట్రం ప్రసిద్ధి. రాష్ట్రంలో యమునా, గంగా, రామ్‌గాంగా, ఘాఘ్రా నదులు ప్రవహిస్తున్నాయి. గోమతి మరొక నది.

అపరాలు, మొక్కజొన్న, బార్లీ, ఆవాలు, జూట్‌నార ఇతర సాగు పంటలు. సిమెంట్, జవుళీ, యంత్ర సామగ్రి, తోలు పరిశ్రమ, వంటనూనె ప్రధాన పరిశ్రమలు.

యమునోత్రి, గంగోత్రి, కేదారినాథ్, బదరీనాథ్, హేమకుండం, వారణాసి (కాశీ), ఆగ్రా (తాజ్‌మహల్), మధుర, ప్రయాగ చూడదగిన స్థలాలు. కాన్పూర్, అలహాబాదు, వారణాసి, ఝాన్సీ ఇతర పట్టణాలు.

## ఉన్నవ లక్ష్మీనారాయణ

ప్రముఖాంధ్ర నవలారచయిత, స్వాతంత్ర్య సమర యోధుడు, సంఘ సంస్కర్త. గుంటూరు జిల్లా సత్తెన పల్లి తాలూకా వేములూరుపాడు గ్రామంలో 1873 డిసెంబరు 4న లక్ష్మీ నారాయణ జన్మించారు. ఎఫ్.ఎ. పరీక్ష వరకూ గుంటూరులోని క్రిస్టియన్ కాలేజీలో చదివి తరువాత ఏదో చిన్న చిన్న ఉద్యోగాలు చేసి, అనంతరం ప్లీడర్ పరీక్ష పాసై 1903లో గుంటూరులో న్యాయవాద వృత్తి చేపట్టారు. 1913లో ఐర్లాండ్‌కు పోయి డబ్లిన్ నగరంలో చదివి బారిస్టర్ పట్టం పొందారు. ఐర్లాండ్ స్వాతంత్ర్యోద్యమ నాయకుడు డీవెలరా తో పరిచయం ఏర్పడడంతో ఆయనలోని దేశభక్తి భావం మరింత ఉత్తేజితమైంది. 1920లో గాంధీ పిలుపు మేరకు బారిస్టర్ వృత్తికి స్వస్తి చెప్పి సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. అన్ని సత్యాగ్రహ ఉద్యమాలలోనూ పాల్గొని మొత్తం మూడు సంవత్సరాల కాలం వేర్వేరు జైళ్లలో గడిపారు. 1905లో గుంటూరులో ఆయన వితంతు శరణాలయం నెలకొల్పారు. స్త్రీ విద్యాభివృద్ధి కోసం 1922లో గుంటూరులో ఆయన 'శారదా నికేతనం' స్థాపించారు.



సాహిత్య పరుడుగా కూడా శ్రీ లక్ష్మీనారాయణ చేసిన సేవ గణనీయమైనది. ఆయన రచించిన 'మాలపల్లి' అనే తెలుగు నవల తరువాత తెలుగులో వచ్చిన స్వతంత్ర సాంఘిక నవలలకు ఒరవడి పెట్టింది. గొప్ప దేశభక్తుడు గానూ, సంఘ సంస్కర్తగానూ మాత్రమే కాక గొప్ప నవలా రచయితగా కూడా ఉన్నవ లక్ష్మీనారాయణ తెలుగువారికి ప్రాతఃస్మరణీయుడు.

## ఉపనిషత్తులు

అరణ్యాలలో గురుశిష్యులు జరిపిన ఆధ్యాత్మిక చర్చలే ఉపనిషత్తులు. క్రీ.పూ. 14వ శతాబ్ది ప్రాంతంలో లిఖిత రూపంలోకి వచ్చినట్లు చెబుతున్నారు. వీటి సంఖ్య ఒక లెక్క ప్రకారం 108. అందులోనూ మరీ ప్రధానమైనవి పది: 1. ఈశావాస్యోపనిషత్తు; 2. కేనోపనిషత్తు; 3. కఠోపనిషత్తు; 4. ప్రశ్నోపనిషత్తు; 5. ముండకోపనిషత్తు; 6. మాండూక్యోపనిషత్తు; 7. తైత్తిరీయఉపనిషత్తు; 8. ఐతరేయోపనిషత్తు: 9. ఛాందోగ్యోపనిషత్తు: 10. బృహదారణ్యకోపనిషత్తు.

## ఉపాధ్యాయ దినోత్సవం

సమాజంలో ఉపాధ్యాయుని స్థానం గౌరవంతో కూడింది. బాల బాలికలను ఉత్తమ పౌరులుగా మలచడంలో, వారి ఉజ్జ్వల భవిష్యత్తును తీర్చిదిద్దడంలో ఉపాధ్యాయుని పాత్ర ప్రముఖమైంది. ఉపాధ్యాయుని గౌరవించడానికిగాను భారత రాష్ట్రపతి (1962–67) సర్వేపల్లి రాధాకృష్ణన్ (చూ.)జన్మదినాన్ని (సెప్టెంబర్ 5) ప్రతి ఏటా ఉపాధ్యాయదినంగా ప్రకటించారు. రాధాకృష్ణన్ ఉత్తమోత్తమ ఉపాధ్యాయుడుగా కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించిన వాడు. ఈ ఉత్సవంనాడు బాలబాలికలు 'గురు పూజ' జరుపుతారు. రాష్ట్ర స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ ఉత్తమ ఉపాధ్యాయులను ఎంపిక చేసి ప్రభుత్వం వారికి పురస్కారాలు అందజేస్తుంది.

## ఉప్పు సత్యాగ్రహం

1930లో గాంధీజీ జరిపిన జగత్ ప్రసిద్ధమైన 'దండి' సత్యాగ్రహయాత్ర. నాడు భారత దేశాన్ని పాలిస్తున్న బ్రిటిషు ప్రభుత్వం ఉప్పు మీద పన్ను విధించింది. పేద ప్రజలకు కూడా నిత్యావసరమైన ఉప్పుపై పన్ను వేయడం గాంధీజీకి ఆగ్రహం కలిగించింది దానికి తమ నిరసన తెలియజేయడానికి ఆయన 1930లో ఉప్పు సత్యాగ్రహం ద్వారా శాసనోల్లంఘనను తలపెట్టారు. 1930 మార్చి 12వ తేదీన సబర్మతీ ఆశ్రమం నుంచి గుజరాత్ సముద్ర తీరాన ఉన్న 'దండి'కి మూడు వందల కిలోమీటర్లు దూరం కాలినడకను ఆయన బయలుదేరారు. ఆయన వెంట ఎంపిక చేసిన 78 మంది సత్యాగ్రహులు వెళ్లారు. వీరిలో తెలుగు వారైన ఎర్నేని సుబ్రహ్మణ్యం ఒకరు. దారి పొడవునా ప్రజలు మహాత్మునికి స్వాగతం పలుకుతూ ఆయన వెంట నడవసాగారు. ఈ బృందం ఏప్రిల్ 6వ తేదీన దండి చేరింది. అక్కడ సముద్ర స్నానం చేసి ఉప్పు వండడం మొదలు పెట్టారు. తను సత్యాగ్రహం చేయనున్నట్టు గాంధీజీ ముందుగానే వైస్రాయికి తెలియజేశారు. అందువల్ల బ్రిటిషు ప్రభుత్వం సత్యాగ్రహులపై దారుణంగా లాఠీచార్జీ చేసింది. సత్యాగ్రహులు దళాలు దళాలుగా వస్తూ ఉండడంతో దెబ్బలు తిని పడి పోతున్నవారు పడి పోతూఉండగా వారి స్థానాలలోకి క్రొత్తవారు రాసాగారు. అంత మందిని కొట్టడానికి పోలీసుల చేతుల నొప్పిపెట్టాయి. గాంధీజీ తాను దండి తర్వాత దర్శన పోయి సత్యాగ్రహం చేస్తామని ప్రకటించడంతో ప్రభుత్వం ఆయనను అరెస్ట్ చేసింది. తెలుగు దేశంలో మైపాడు, బందరు, మట్లపాలెం, చొల్లంగి, విశాఖపట్టణాలలో ఉప్పు సత్యాగ్రహం జరిగింది. దీనికి దేశభక్త కొండా వెంకటప్పయ్య నాయకత్వం వహించారు. మద్రాసులో కాశీనాథుని నాగేశ్వరరావు, గద్దె రంగయ్య, దుర్గాబాయి ఈ మహోద్యమం నడిపించారు. బ్రిటిష్ పాలకులను ఒక ఊపు ఊపిన ఈ ఉప్పు సత్యాగ్రహం మన స్వాతంత్ర సమర చరిత్రలో ఒక ఉజ్జ్వల ఘట్టం. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం)


ఉప్పుసత్యాగ్రహం

## ఉమర్ ఖయ్యాము

ప్రపంచ ప్రసిద్ధి పొందిన పారసీక కవి. అసలు పేరు అబుల్ ఫత్ ఉమర్ బిన్ ఇబ్రహీమ్. నేటి ఇరాన్‌లో ఈయన జీవితం గడిచింది. వృత్తిరీత్యా ఈయన గణిత శాస్త్రవేత్త. ఈయన గణిత శాస్త్ర వైదుష్యం విశ్వవిఖ్యాతమైంది. ఈయన రుబాయత్‌లను ఫిట్‌జరెల్డ్ కవి ఇంగ్లీషులోకి అనువదించారు. వీటికి ప్రసిద్ధమైన తెలుగు అనువాదాలు దువ్వూరి రామి రెడ్డి 'పానశాల' రాయప్రోలు సుబ్బారావు 'మధుకలశం' ఆదిభట్ల నారాయణదాసు మొదలైన వారింకను ఎందరో ఈ రుబాయిత్‌లను తెలుగు చేసిన వారున్నారు.

## ఉరుగ్వే

దక్షిణ అమెరికా ఖండంలోని ఒక చిన్న స్వతంత్ర రాజ్యం. 1680 నుంచి పోర్చుగల్, స్పెయిన్ దేశాల

అధీనంలో వలస రాజ్యంగా ఉండేది. 1828లో స్వాతంత్ర్యం పొందింది. 1830లో ఒక ప్రత్యేక రాజ్యాంగాన్ని తయారు చేసుకుంది. విస్తీర్ణం: 1,76, 215 చ.కి.మీ. జనాభా: 29,81,000 (1988). రాజధాని: మాంటివీడియో. అధికార భాష: స్పేనిష్. ప్రజలలో స్పేనిష్—ఇటాలియన్ సంకరజాతులు 86 శాతం, మెస్టిజోలు 3




శాతం విస్తారమైన పచ్చిక బయళ్లు పుష్కలంగా ఉండడం వల్ల పశువుల పెంపకం, గొర్రెల పెంపకం ప్రజలకు ప్రధాన వృత్తులు. ఈ రాజ్యం దక్షిణ ప్రాంతంలో గోధుమ పండిస్తారు. గోధుమ, వరి, బీటు (పంచదార), మొక్కజొన్న, జొన్న, ఆల్ఫాల్ఫా, బార్లీ, నారింజ, ఓట్ ధాన్యం కూడా ఇక్కడ పండుతాయి. ఉరుగ్వేలో లభించే ముఖ్యమయిన ఖనిజ సంపదలో గ్రానైట్, సున్నపురాయి పేర్కొనదగినవి.

## ఊర్ధ్వలోకాలు

మరణానంతరం పుణ్యాత్ములైనవారు మీద వున్న ఊర్ధ్వలోకాలకూ, పాపాత్ములు దిగువను ఉన్న అధోలోకాలకూ పోతారని భారతీయుల విశ్వాసం. మొత్తం 14 లోకాలలోనూ ఉర్ధ్వలోకాలు ఏడు. అవి: 1. భూలోకం 2. భువర్లోకం 3. సువర్లోకం 4.. మహర్లోకం 5. జనలోకం 6. తపోలోకం 7. సత్యలోకం, (చూ. అధోలోకాలు).

## ఎతియోపియా

ఆఫ్రికాలో ఈశాన్య దిశలో ఉన్న పర్వతమయమైన, ప్రజాస్వామ్య గణ రాజ్యం. ఉత్తర, దక్షిణ, సరిహద్దు ప్రాంతాలు ఎక్కువ ఉష్ణోగ్రతతో వాతావరణం పొడిగా ఉండే ఎడారి ప్రదేశాలు. ఈ రాజ్యానికి 2,000 ఏళ్ల చరిత్ర ఉంది.

విస్తీర్ణం: 12,23,500 చ.కి.మీ. జనాభా: 4,75, 01,000 (1988). రాజధాని: అడిస్ అబాబా. అధికార భాష: అంబారిక్. ప్రజలు 40కి పైగా గిరిజన మాండలిక భాషలు మాట్లాడుతారు. సుందర దృశ్యాలతో పర్వత సానువులతో ఈ దేశం చూడ ముచ్చటగా ఉంటుంది. చర్చిలు, రాతి కట్టడాలతో వినోద యాత్రికులను ఈ దేశం ఎక్కువగా ఆకర్షిస్తోంది. ఏనుగు, జిరాఫీ, చిరుతపులి (లెపర్డ్), సింహం, ఖడ్గమృగం, కంచర గాడిద




ఇక్కడి వన్యమృగాలు. నదులు అగాధములయిన లోయల గుండా ప్రవహిస్తూ ఉంటాయి. ప్రధానమైన నది బ్లూనైలు; టానా సరస్సులో పుట్టి దక్షిణ పశ్చిమాలుగా ప్రవహించి నైలు నదిలో ఇది కలుస్తుంది. రైతాంగం లేక సేద్యం అభివృద్ధి చెందలేదు. పశ్చిమాన మధ్యప్రాంతాలలో పండుతున్న కాఫీని ప్రధానంగా ఈ దేశం ఎగుమతి చేస్తుంది. తైల దినుసులు, చెరకు, బార్లీ, అపరాలు, కాఫీ, గోధుమ, ప్రత్తి, బంగాళదుంప, మొక్కజొన్న, చిరు ధాన్యాలు, బఠానీలు ఇక్కడ పండుతాయి. తోళ్లు కూడా ఎగుమతి చేస్తున్నారు. బంగారం, ప్లాటినం వంటి ఖరీదైన ఖనిజ సంపదగల దేశం ఎతియోపియా.

## ఎన్నికలు

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలు తమ వోటు ద్వారా ప్రభుత్వంలో తమ ప్రతినిధులను ఎంపిక చేసుకొంటారు. భారతదేశంలో రాజ్యాంగం ప్రకారం లోక్‌సభకు, రాష్ట్ర శాసన సభకు 5 ఏళ్లకొకసారి సాధారణ ఎన్నికలు నిర్వహించి, ప్రజాప్రతినిధులను ఆయా నియోజక వర్గాలనుంచి ఎన్నుకుంటారు. ఏ రాజకీయ పక్షానికీ పూర్తి మెజారిటీ రాక, ప్రభుత్వ నిర్వహణ సాధ్యం కానప్పుడు రాష్ట్రపతి శాసన సభ, లోక్‌సభను రద్దు చేసి మధ్యంతర ఎన్నికలు జరుపుమని ఎన్నికల అధికారిని ఆదేశిస్తారు.

## ఎర్రాప్రగడ

14 వ శతాబ్ది

ఆంధ్ర మహా భారతం రచించిన కవిత్రయంలో చివరి వాడు. తక్కిన ఇద్దరు: నన్నయ, తిక్కన (చూ). ఎర్రనకు 'శంభుదాసు'డనీ, 'ప్రబంధ పరమేశ్వరు'డనీ బిరుదులు ఉన్నాయి. భారతంలో విరాటపర్వం మొదలు



తిక్కన వ్రాసిన తరువాత కూడా భారతం అసంపూర్ణం గానే ఉండి పోయింది. నన్నయ ఆది, సభాపర్వాలు, అరణ్య పర్వంలో 3 ఆశ్వాసాల 142 పద్యాలు మాత్రమే వ్రాశాడు. అరణ్య పర్వం చివర భాగం పూరించ డానికి తిక్కన పూనుకోలేదు. ఆ కార్యం ఎర్రాప్రెగడ పూర్తిచేసి కవిత్రయంలో మూడోవాడుగా ప్రసిద్ది పొందాడు.భారతంలో అరణ్య పర్వశేషాన్నే కాకుండా నరసింహావతారం (నృసింహపురాణం), హరివంశం అనే మరో రెండు గ్రంథాలు కూడా ఎర్రన రచించాడు. ఈయన రచించినట్లు చెప్పబడుతున్న రామాయణం లభించలేదు. హైదరాబాదులోని తెలుగువెలుగులు మూర్తి నిక్షిప్త కళా ప్రాంగణంలో ఎర్రాప్రెగడ శిల్పవిగ్రహం ప్రతిష్ఠించారు.

## ఎల్ సాల్వడార్

మధ్య అమెరికాలోని ఒక స్వతంత్ర రాజ్యం. 1841లో స్వాతంత్ర్యం వచ్చే వరకూ ఇది స్పెయిన్ అధీనంలో వలస రాజ్యంగా ఉండేది. ఇప్పుడు ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడి పరిపాలన సాగిస్తూంది. విస్తీర్ణం: 21,041 చ.కి.మీ. జనాభా: 50,83,000 (1988). రాజధాని: సాన్ సాల్వడార్. ప్రజలు మాట్లాడే భాష: స్పేనిష్.

పర్వత సానువులలో కాఫీ పండుతుంది. వరి, మొక్కజొన్న, చెరకు, చిక్కుడు, ప్రత్తి, హెనెక్విన్ అనే నార ఈ దేశంలోని ఇతర పంటలు. పశువుల పెంపకం ప్రజల ప్రధాన జీవనోపాధి. అటవీ సంపదలో పెరూ బాల్సం ప్రధానమైంది. నేల బొగ్గు, రాగి, ఇనుము, సీసం, జింకు మొదలైన ఖనిజాలు త్రవ్వితీస్తారు. పరిశ్రమలలో ఆల్కహాల్, సిగరెట్టు, సిమెంటు, నూలువస్త్రాలు, హెనెక్విన్‌నార, కాఫీ సంచులు, తోలు సామగ్రి చెప్పుకోతగ్గవి.

## ఎవరెస్టు శిఖరం

ప్రపంచంలో అత్యున్నతమయిన పర్వత శిఖరం. హిమాలయ రాజ్యం నేపాల్‌లో టిబెట్‌కు సమీపంలో ఇది ఉంది. దీని ఎత్తు: 8,848 మీటర్లు (29,028 అడుగులు.) 1953లో టెన్సింగ్ నార్కే, ఎడ్మండ్ హిల్లరీ మొదటిసారి ఈ శిఖరాన్ని అధిరోహించి, చరిత్ర సృష్టించారు.





ఎవరెస్ట్ శిఖరం

# ఎస్కిమోలు

ఆర్కిటికా (చూ.)ప్రాంతంలో ఉండే ఒక జాతివారు. ఈశాన్య రష్యా(సైబీరియా), అలాస్కా, కెనడా, గ్రీన్‌లాండ్ ప్రాంతాలలో ఈ జాతివారు ఎక్కువగా ఉన్నారు. వీరు సముద్రం మీదనే ఆధారపడి జీవయాత్ర సాగిస్తూ ఉంటారు. సీల్ చేప, తిమింగలం మొదలైన వాటిని పట్టి తింటారు. కారిబో అనే ధ్రువపు జింక 'మెల్క్ ఆక్సెన్' ధ్రువ ప్రాంతపు ఎలుగుబంట్లు (పోలార్ బేర్స్), కుందేళ్లు, నక్కలు ఇక్కడి ఇతర జంతువులు. ధ్రువపు కుక్కలను వీరు స్లెడ్జ్ బండ్లు లాగేందుకు ఉపయోగిస్తారు. 'ఇగ్లూ' అనే మంచు గుడిసెలలో వీరి కాపురం. వేసవిలో చర్మపు గుడారాలలో ఉంటారు. ఎస్కిమో అన్న మాట అమెరికన్ ఇండియన్ భాషా పదం. తమనుతాము 'ఇన్యుట్' అని 'యూయిట్' అని వీరు పిలుచు కుంటారు. ఇన్యుట్ అంటే ప్రజలు అని అర్థం. శీతాకాలంలో ఉష్ణోగత '–29°' నుండి –34°' సెంటీగ్రేడు వరకు పడిపోతుంది. ఇచ్చటి మైదాన ప్రాంతాలను 'టండ్రాలు' అంటారు. పొచివంటి చిన్న చిన్న మొక్కలు అక్కడక్కడ కానవస్తాయి. చెట్లు అసలు పెరగవు. ఎస్కిమోలు ఉమ్మడి కుంటుంబంగా జీవిస్తారు. ఒక్కొక్క కుటుంబంలోని వారి సంఖ్య 20 దాకా ఉంటుంది. వీరిలో ప్రత్యేక వివాహ వ్యవస్థ ఏదీ లేదు. ఇద్దరు యువతీ యువకులు కలిసి కాపురం ప్రారంభించి జీవయాత్ర సాగిస్తారు. పిల్లల పెంపకంలో బహుజాగ్రత్త వహిస్తారు. మొత్తం ఎస్కిమో జనాభా దాదాపు ఒక లక్ష. సైబీరియాలో 2,000 మంది, అలాస్కాలో 37,000 మంది, కెనడాలో 19,000 మంది, గ్రీన్‌లాండ్‌లో 41,500 మంది ఉన్నారు. గ్రీన్‌లాండ్‌లోని ఎస్కిమోలు పట్టణాలలో పని చేస్తారు. వీరికి ప్రత్యేకంగా ఒక ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థ లేదు.






ఎస్కిమోలు

## ఏక్‌నాథ్

16వ శతాబ్దికి చెందిన ప్రముఖ మరాఠీ కవి. ఒక్కొక్క దానిలో 20,000కు మించిన పద్యపాదాలు గల 'ఏకనాథ్ భగవత్', భావర్థ రామాయణ్ ఈయన రచనలలో ప్రసిద్ధి పొందాయి. 'రుక్మిణీ స్వయంవర్' అనే ఒక లఘు కావ్యం కూడా ఈయన వ్రాశారు. 'భారుద'లను పేరు గల గీతికలలో ఆధ్యాత్మిక భావాలను వ్యంగ్యంగా ఈయన చిత్రించారు.

## ఏషియాడ్

ఈ "ఏషియాడ్" క్రీడలనే ఆసియా క్రీడలని కూడ అంటారు.

ఆసియా దేశాల మధ్య సత్సంబంధాలను గూర్చిన సమావేశం 1947లో జరిగినప్పుడు ఒలింపిక్ క్రీడల పద్ధతిలో ఆసియా దేశాలలోని ఔత్సాహిక క్రీడాకారులకు ప్రోత్సాహ జనకంగా ఉండే విధంగా 'ఏషియాడా' క్రీడలను నిర్వహించాలని పలువురు ప్రతినిధులు ప్రతిపాదించారు. ఆ ప్రతిపాదన ఆమోదించబడి, 1951లో మొదటి ఏషియాడ్ క్రీడలు న్యూఢిల్లీలో జరిగాయి. ఆ తరువాత 4 ఏళ్ళ కొకసారి చొప్పున ఈ క్రింది దేశాలలో ఆసియా క్రీడలు జరిగాయి.

1954 మనీలా, ఫిలిప్పీన్స్
1958 టోక్యో, జపాన్
1962 జకార్తా, ఇండోనీషియా
1966 బాంకాక్, తాయిలాండ్
1970 బాంకాక్, తాయిలాండ్
1974 టెహ్రాన్, ఇరాన్
1978 బాంకాక్, తాయిలాండ్
1982 న్యూఢిల్లీ, ఇండియా
1986 సియోల్, దక్షిణ కొరియా
1990 సెప్టెంబరులో చీనాలోని బీజింగ్



## ఏసుక్రీస్తు

క్రైస్తవ మతం స్థాపించిన ప్రవక్త. ప్రపంచ వ్యాప్తంగా విస్తరించిన ఈ మతస్థులు ఏసుక్రీస్తు (జీసస్) దేవుని బిడ్డ అని విశ్వసిస్తారు. మానవులను ఐహిక బాధల నుంచి విముక్తులను చేయడానికి క్రీస్తు అవతరించాడని వారి విశ్వాసం. జీసస్ అంటే హీబ్రూ భాషలో 'రక్షకుడు' అని అర్థం. నేటి ప్రజాస్వామ్యం, సమ సమాజం వంటి భావాలకు బీజాలు క్రీస్తు ప్రవచించిన ప్రేమ, సౌభ్రాతృత్వం వంటివి ఉపదేశాలలో కనిపిస్తాయి. వర్జిన్‌మేరీ ఏసుక్రీస్తు తల్లి. వడ్రంగి జోసెఫ్ మేరీ భర్త. పాలస్తీనాలోని నాజరత్



వారి నివాస స్థలం. ఒకసారి ఏదో పని మీద జోసెఫ్ దంపతులు బెతల్హాం వెళతారు. అక్కడ ఒక గొడ్లశాలలో విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఏసు పుడతాడు. తల్లి ఒక దాలిగుంటలో ఆ బిడ్డకు పడక ఏర్పాటు చేస్తుంది. అదే సమయంలో గొడ్ల కాపరులకు ఆకాశంలో ఏదో దివ్యజ్యోతి గోచరించింది. చిన్నప్పుడే ఏసు తన ప్రతిభా పాటవాలను చూపుతూ ఆధ్యాత్మిక చింతనతోనే తండ్రికి వడ్రంగంలో సాయం చేస్తూ ఉంటాడు. పెద్దవాడై సుమేరియా, జెరుసలెమ్ మొదలైన పట్టణాలలో పర్యటిస్తూ తన ప్రవచనాలను ప్రజలకు అందజేస్తూ ఉంటాడు. అట్టి వాటిలో ప్రధానమైంది 'సెర్మన్ ఆన్ ది మౌంట్'. ప్రజలకు తన మహత్తును రుజువు చేయడానికి 36 అద్భుతాలను ఆయన ప్రదర్శించారు. జెరుసలెమ్‌లోనే తన బోధనలను ప్రజలకు అందజేస్తూ చివరకు ఒక గురువారం రోజు రాత్రి, తన పన్నెండు మంది శిష్యులతో పంక్తి భోజనం 'లాస్ట్ సపర్' చేయడం ఆయన జీవితంలో ప్రముఖ ఘట్టం. ఆ తరువాత శుక్రవారం ఉదయం ఆయనపై దేశ ద్రోహపు అభియోగం ఆరోపించి ఎర్రటి దుస్తులు ధరింపజేసి ముళ్ల కిరీటం పెట్టి 'సిలువ' మీద ఎక్కించి ఆయన శరీరానికి మేకులు కొట్టారు. మూడు గంటల తరువాత భౌతికంగా ఆయన మరణించడం జరిగింది. మూడవ రోజున ఆదివారం ఏసు పునరుత్థానం చెందినట్లు చెబుతారు. తరువాత 40 రోజుల పాటు తనకు విశ్వాస పాత్రులుగా ఉన్న 12 మంది శిష్యులకు బోధనలు చేసి బొందెతోనే స్వర్గం చేరారని క్రైస్తవ మత గ్రంథాలు చెబుతున్నాయి. (చూ. క్రైస్తవమతం).

# ఐక్యరాజ్యసమితి

160 ప్రపంచ దేశాల (1990) సభ్యత్వంతో కూడిన ఐక్యరాజ్య సమితి (ఐరాస.) ప్రపంచ వ్యాప్తంగా శాంతి-భద్రతల పరిరక్షణకు చర్యలు తీసికొంటూ విశ్వ మానవ కళ్యాణానికి కృషి చేస్తుంది. ప్రపంచంలో ఏ మూల అయినా రెండు దేశాల మధ్య సంఘర్షణలు చెలరేగి నప్పుడు ఐ.రా.స. జోక్యం చేసికొని శాంతిసేనలను హుటాహుటిని పంపి, శాంతిని స్థాపించడానికి ప్రయత్ని స్తుంది. ఐక్యరాజ్యసమితి (యునైటెడ్ నేషన్స్ యు.ఎన్.) 1945లో స్థాపించబడింది. 1944 ఆగస్టు–అక్టోబరు నెలల మధ్యకాలంలో గ్రేట్ బ్రిటన్, చీనా, యునైటెడ్ స్టేట్స్, రష్యా దేశాల ప్రతినిధులు వాషింగ్‌టన్ సమీపంలోగల డంబార్టన్ ఓక్స్ అనే చోట సమావేశాలు జరిపి ప్రపంచ శాంతి భద్రతలను కాపాడడానికి తీసికోవలసిన చర్యలను గూర్చి చర్చలు జరిపారు. పిమ్మట రెండవ ప్రపంచ యుద్ధం (1939–45) యూరపు రంగంలో మరి 12 రోజులకు జర్మనీ లొంగుబాటు జరుగుతుందనగా శాన్‌ఫ్రాన్సిస్కోలో 50 ప్రపంచ దేశాల మహాసభ జరిగింది. ప్రపంచ శాంతి పరిరక్షణకై వారు చర్యలు కొనసాగించి, ఐక్యరాజ్యసమితి అనే సంస్థను ఏర్పాటు చేయడానికి నిర్ణయం తీసు కొన్నారు. తత్ఫలితంగా 1945 జూన్ 26న మళ్లీ ఆ 50 దేశాల ప్రతినిధులూ సమావేశమై ఐ.రా.స. నియమావళి (ఛార్టర్) మీద సంతకాలు చేసి ఐ.రా.స.కు రూపకల్పన చేశారు. అలా ఆనాడు సంతకాలు చేసిన వారిలో భారతదేశ ప్రతినిధి కూడా ఉన్నారు. ఆ తరువాత మరొక 110 ప్రపంచ దేశాలు చేరడంతో ఐ.రా.స. మరింత పటిష్టమై మొత్తం సభ్యదేశాల సంఖ్య ఇప్పుడు (1990లో)160కి చేరింది. ఇందులో మాల్దీవులు వంటి మరీ చిన్న దేశాలూ ఉన్నాయి; చీనా, యునైటెడ్ సేట్స్ వంటి మరీ పెద్ద దేశాలూ ఉన్నాయి. పూర్వం మొదటి ప్రపంచ యుద్ధం (1914–1919) తరువాత 1919 లో ఏర్పడిన నానాజాతిసమితి (లీగ్ ఆఫ్ నేషన్) ఆశయాలే చాలా వరకూ ఐ.రా.స నియమావళిలోకూడా చోటు చేసుకున్నాయి.

ప్రపంచంలో శాంతి-భద్రతలకు ముప్పు వాటిల్లి నప్పుడు శాంతి స్థాపన ఐ.రా.స. ప్రధాన లక్ష్యం. ఈ ప్రపంచ సంస్థ ఆశయ సిద్ధికి కార్యక్రమాలు నిర్వహించ డానికి ఐ.రా.స.కు ఆరు ముఖ్య అంగాలు ఉన్నాయి. అవి: 1. సాధరణ సభ (జనరల్ అసెంబ్లీ); 2. భద్రతా సమితి (సెక్యూరిటీ కౌన్సిల్); 3. సచివాలయం (సెక్రెటేరి యేట్); 4. ఆర్థిక సాంఘిక సమితి (ఎకనామిక్ & సోషల్ కౌన్సిల్); 5. అంతర్జాతీయ న్యాయస్థానం; 6. ధర్మకర్తృత్వ సమితి (ట్రస్టీషిప్ కౌన్సిల్). ఇవి గాక విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక వ్యవహారాల నిర్వహణకు యునె స్కో, ఆహార, వ్యవసాయాలకు ఫుడ్ & అగ్రికల్చరల్ ఆర్గనైజేషన్, ప్రపంచ ఆరోగ్యసంస్థ (డబల్‌యు.ఎచ్.ఓ), వార్తా ప్రసారాల సంస్థ, అంతర్జాతీయ కార్మిక సంస్థ (చూ.) (ఐ.ఎల్.ఓ.) అంతార్జాతీయ బాలల నిధి (యూనిసెఫ్), అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐ.ఎమ్.ఎఫ్) వంటి ఉపాంగాలు కూడా కల్పించబడ్డాయి. ఐ.రా.స. కేంద్ర కార్యస్థానం న్యూయార్కు మహానగరంలో ఈస్ట్


యు.ఎన్.ప్లాజా

రివర్ ఒడ్డున ఉన్న ఒక మహా ప్రాసాదం. దీనిని యుఎన్‌ప్లాజా అంటారు. సభ్య దేశాలన్నీ జాతీయ పతాకాలూ భవన ప్రాంగణానికి ముందు ఎంతో వైభవోపేతంగా ఎగురవేయబడి ఉంటాయి. ప్రతి సభ్య దేశం తన ప్రతినిధిని సాధరణ సభకు పంపుతుంది. కొరియా యుద్ధం (1947–53), సైప్రస్ (1954) సంఘర్షణ, ఇండియా పాకిస్తాన్ సంఘర్షణ (1948), అరబ్బీ–ఇజ్రాయెల్ యుద్ధాలు (1947–1973), ఇండోనీషియా వివాదం (1947), లెబనాన్‌లో ఆందోళనలు (1958), కాంగో అత్యవసర పరిస్థితి (1960), క్యూబాలో క్షిపణి ఉపద్రవం (1963), నమీబియాలో శాంతి స్థాపన (1990)దక్షిణ ఆఫ్రికాలో వర్ణవైషమ్య సమస్య వంటి ప్రపంచ శాంతికి భంగం వాటిల్లబోతున్న సందర్భాలలో ఐ.రా.స. ప్రధాన పాత్ర నిర్వహించింది. మారణాయుధాల నియంత్రణ, రోదసినీ, సముద్ర గర్భాన్నీ శాంతి యుత ప్రయోజననాలకోసం వాడుకచేయడం ఐ.రా.స. చేపట్టి నిర్వహిస్తున్న ఇతర పధాన కార్యక్రమాలు.

## ఐర్లాండ్

గ్రేట్‌బ్రిటన్‌కు పశ్చిమ దిశను ఉన్న చిన్న స్వతంత్ర రాజ్యం. 26 కౌంటీలు (జిల్లాలు) గల ఐర్లాండ్ ఒక ప్రజాస్వామ్య రాజ్యం. చారిత్రకంగా దీనిని 1921 వరకూ గ్రేట్ బ్రిటన్ పరిపాలించింది.

విస్తీర్ణం: 70,285 చ.కి.మీ. జనాభా: 35,53,000 (1988). రాజధాని: డబ్లిన్ అధికార భాషలు: ఇంగ్లీషు, ఐరిష్ అనబడే గేలిక్ భాష. ప్రజలు రోమన్ కేథలిక్ క్రైస్తవం పాటిస్తారు.

360 కి.మీ. నిడివిగల షన్నాన్ నది ప్రధానమైన జలధారం. లిఫీ, బారో, నోరే, సుయిర్, బొయ్నా,మోయ్ ఇతర నదులు; పశ్చిమ భాగంలో అనేక సరస్సులు ఉన్నాయి. వీటిని లాఫ్కాలు అని అంటారు. నేల సారవంతం కాకపోయినా బార్లీ, ఓట్ ధాన్యం, బీటు (పంచదార) దుంపలు, క్యాబేజీ, గోధుమ పండుతాయి. పాడిపరిశ్రమ, కోళ్ల పెంపకం ఎక్కువ. ఆల్కహాల్ పానీయాలు, పండ్ల నిల్వ, జవుళీ, కాగితం, పొగాకు పరిశ్రమలు దేశ ఆర్థిక స్థాయిని పెంచుతున్నాయి.

## ఐవరీ కోస్ట్

ఆఫ్రికా ఖండం పశ్చిమ తీరంలో గినీ సింధు శాఖానానుకుని ఉన్న స్వతంత్ర రాజ్యం. ఐవరీ కోస్ట్ రాజ్యానికి సాధికారిక నామం 'కోటేడీ ఐవరీ'.ఫ్రెంచ్ వారు 14వ శతాబ్దం నుంచి ఈ ప్రాంతంతో వర్తక




వ్యాపారాలు కొనసాగిస్తూ 1893లో దీనిని తమ వలస రాజ్యంగా చేసుకున్నారు. 1960లో ఈ దేశానికి స్వాతంత్ర్యం లభించింది. విస్తీర్ణం: 3,20,763 చ.కి.మీ. జనాభా: 1,16,34,000 (1988)రాజధాని: అబిజాన్. అధికార భాష: ఫ్రెంచ్. నీగ్రో వర్గానికి చెందిన అనేక తెగలవారు సుమారు 60 మాండలిక భాషలు మాట్లాడుతారు. బండామా, కావల్లీ, కోమో, ససాంద్ర నదులు ప్రధానమైన నీటి వనరులు. ఇందులో 800 కి.మీ. నిడివి గల బండామా నది కొండలలో ప్రవహించడం వల్ల 60 కి.మీ దూరం మాత్రమే పడవ ప్రయాణానికి వీలుగా ఉంటుంది. ఉష్ణమండలం అడవులు మెండు. 1960కి పూర్వం కాఫీ, కోకో మాత్రం ఎగుమతి అయేవి. ఇటీవల పామ ఆయిల్ ఎగుమతి ఎక్కువ అయింది. అరటి, అనాస, రబ్బరు కూడా ఈదేశం నుంచి ఎగుమతి అవుతున్నాయి. కలప పరిశ్రమ, వ్యాపారం ఉధృతంగా సాగుతూంది. వజ్రాలు లభిస్తున్నాయి.

## ఐస్‌లాండ్

ఉత్తర అట్లాంటిక్‌లో ఆర్కటిక్ వలయం దిగువను ఉన్న ఒక ద్వీపరాజ్యం. నార్వేకు సుమారు 1000 కి.మీ. దూరంలో ఇది ఉంది. ప్రజాస్వామ్య

విధానంలో పరిపాలన జరుగుతూంది. విస్తీర్ణం: 1,03, 000 చ.కి.మీ.; జనాభా: 2,48,000 (1988). రాజధాని: రైక్జావిక్. అధికార భాష: ఐస్లాండిక్ భాష. లూథరిన్ క్రైస్తవం పాటిస్తున్నారు.

నార్వే నుంచి దాదాపు 1100 ఏళ్ల క్రితం వలస పోయినవారు ఇక్కడి ప్రజలు. ఐస్‌లాండ్‌లో వివాహ మాడిన స్త్రీలు పేరు మార్చుకోరు. పూర్వపు తండ్రి పేరే జీవితాంతం ఉంచుకుంటారు.

అప్పుడప్పుడు అగ్నిపర్వతాలు ప్రేలుతూ ఉంటాయి. వేడినీటి బుగ్గబావులు ఎక్కువ. గెయిజర్ అన్నబడే బుగ్గబావి నుండి 60 మీటర్ల పైకి వేడి నీరు చిమ్ముతుంది. గ్లేషియర్ (మంచు బండ)లు కూడా ఈ దేశంలో ఎక్కువే. 240 కి.మీ. నిడివిగల త్జోర్సా నది దక్షిణాదిని ప్రవహిస్తూంది. లాక్సా, సోగ్ నదుల మీద జల విద్యుత్కేంద్రాలు నిర్మించారు. దక్షిణాదిని ఉన్న 'గుల్ఫాస్', ఉత్తరాన ఉన్న దెత్తిఫాస్ అతి సుందరమైన జలపాతాలు. పచ్చికను పండిస్తారు.

ప్రధాన వృత్తులు: పశువులు, గొర్రెలు పెంపకం, మత్స్య పరిశ్రమ. ఇక్కడ దొరికే హెరింగ్, కాడ్ చేపలకు మంచి గిరాకీ వుంది. కలప పరిశ్రమ, ముద్రణ, ఎరువులు, సిమెంటు దేశ ఆర్థిక పరిస్థితిని మెరుగుపరుస్తున్నాయి.

## ఒడిస్సీ నాట్యం

ఒరిస్సా రాష్ట్రంలోని శాస్త్రీయ నృత్య సంప్రదాయం. ఖారవేలుని (క్రీ.పూ. 2వ శతా.) కాలం నుంచి ఈ నాట్యసంప్రదాయం కొనసాగుతూందనడానికి ఆధారాలున్నాయి. అయితే 17వ శతాబ్దం నుంచి ప్రధానంగా బాలురు ఈ సంప్రదాయాన్ని అవలంబిస్తూ వచ్చారు. భంగీలు, కరణాలు ఆలయాలలో ప్రదర్శనలిచ్చేవారు. ఇప్పుడు స్త్రీలు కూడ ఈ నాట్య సంప్రదాయాన్ని అభ్యసించి ప్రదర్శనలిస్తున్నారు.



జయదేవుని అష్టపదులు, భూమి పురాణం, బతూ, పల్లవి ప్రదర్శనలు నేటి ఒడిస్సీ నృత్య ప్రదర్శనలలో ప్రముఖంగా కన్పిస్తాయి. సంయుక్త పాణిగ్రహి చేసినవిశేష కృషి ఫలితంగా ఆధునిక ఒడిస్సీ నృత్య సంప్రదాయం ప్రపంచ ప్రసిద్ధి పొందింది. కేలూచరణ్ మహాపాత్రా ప్రముఖ ఒడిస్సీ నాట్యాచార్యులు.

## ఒడెస్సీ కావ్యం

ప్రాచీన గ్రీక్ పురాణ కావ్యం. హోమర్ కవి క్రీ.పూ. 700 ప్రాంతంలో ఈ ఒడెస్సీ కావ్యాన్ని రచించాడు. ట్రోజెన్ యుద్ధంతో ట్రాయ్ నగరం ముట్టడిలో పాల్గొని ఒడెసియస్ ఇంటికి తిరిగి వస్తున్నప్పుడు జరిగిన సాహసోపేత కార్యం వర్ణన దీనిలోని ప్రధాన ఇతివృత్తం. ఇలియెడ్ (చూ.) ఇదే కథకు సంబంధించిన మరొక గ్రీక్ పురాణ కావ్యం.

## ఒరిస్సా రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. బంగాళాఖాతం తీరాన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఉత్తరాన ఈ రాష్ట్రం ఉంది. దీనికి కళింగదేశం అని ప్రాచీన నామం. చారిత్రికంగా అశోకుడు, ఖారవేలుడు, గాంగులు మొదలైనవారు ఏలిన ప్రాంతం ఇది. బ్రిటిషు పాలన క్రిందికి (1803) వచ్చిన తరువాత 1936లో ప్రత్యేక ఒరిస్సా రాష్ట్రం ఏర్పడే వరకూ ఈ ప్రాంతం బెంగాల్ రాష్ట్రంలో కొంత భాగం, నాటి మదరాసు రాష్ట్రంలో కొంత భాగం చేరి ఉండేది. విస్తీర్ణం: 1,55,707




చ.కి.మీ. జనాభా: 2,63,70,271. రాజధాని: భువనేశ్వర్. (పూర్వపు రాజధాని కటకం). పారదీప్ రేవు పట్టణం. ప్రజలు మాట్లాడే భాష, అధికార భాష కూడా ఒరియా. జగన్నాథదేవాలయం (పూరీ) గొప్ప పుణ్య క్షేత్రం. భువనేశ్వర్‌లో అనేక ప్రాచీన శిల్పకళాఖండాలుగల

దేవళాలు ఉన్నాయి. దీనికి 65 కిలోమీటర్ల దూరంలో వున్న కోణార్క్(చూ.) సూర్యదేవాలయం జగత్ ప్రసిద్ధమైంది. పెద్ద నది మహానది. బ్రాహ్మణి, వైతరణి చిన్న నదులు. మహా నది మీద హిరాకుడ్ వద్ద డామ్‌ను కట్టి పంటలకు నీటిని సరఫరా చేస్తున్నారు. చిలక సరస్సు పెద్దది. ఈ సరస్సులో సుందర దృశ్యాలు గల రెండు దీవులు కూడా ఉన్నాయి. అన్సుపా, సార చిన్న సరస్సులు.

సముద్రతీరంలో ఉండడం వల్ల రాష్ట్రం తరుచు తుఫాను (సైక్లోన్)లకు, ప్రచండవాయువు (టార్నెడో) లకు గురి అవుతూ ఉండడం కద్దు. బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడినప్పుడల్లా ఈ ప్రాంతం ప్రకృతి వైపరీత్యాలకులోనై తీవ్ర నష్టాలు సంభవిస్తూ ఉంటాయి. సాగుపంటలలో ప్రధానమైనవి: వరి, అపరాలు, తైలదినుసులు, జనుము, మెస్తా, చెరకు, కొబ్బరి, పసుపు. అడవులు ఆధారంగానూ, ఖనిజ సంపద ఆధారంగానూ రాష్ట్రంలో అనేక పరిశ్రమలు వెలిశాయి. కోరాపుట్‌లోని అల్యూమినియం ధాతుసాధన ప్రముఖ పరిశ్రమ. రూర్కేలాలో ఉక్కు కర్మాగారం ఉంది.

## ఒలింపిక్ క్రీడలు

ప్రతినాలుగు సంవత్సరాలకూ ఒకసారి ప్రపంచ దేశాలలో ఔత్సాహిక క్రీడాకారులు ఆటల పోటీలలో పాల్గొనే సంఘటనే ఒలింపిక్ క్రీడలు. ప్రపంచ క్రీడాకారులలో ఆరితేరినవారు పోటీ ద్వారా శాంతి, స్నేహం పరస్పరం పెంపొందించుకోవడమే ఈ ఒలింపిక్ క్రీడల లక్ష్యం. ఒలింపిక్ క్రీడలు జరిగే క్రీడాంగణమంతా వైభవోపేతంగా క్రీడలలో పాల్గొనే అన్ని జాతుల వారి పతాకాలతోనూ కన్నుల పండువుగా అలంకరించబడుతుంది. ప్రముఖ క్రీడా కారుడు ఒకడు మండుతున్న దివ్వె పట్టుకొని పరుగున వచ్చి క్రీడాంగణంలో ఉన్న ఒలింపిక్ జ్వాలను అంటించడంతో ఒలింపిక్ క్రీడలకు ప్రారంభం జరుగుతుంది. పోటీలలో పాల్గొనే వివిధ జాతుల క్రీడాకారులు విన్యాసం జరుపుతూ వారి వారి జాతీయ పతాకాలతో జాతీయమైన ఉడుపులు ధరించి క్రీడాంగణంలో ప్రవేశించి "ఒలింపిక్ నియమావళికి బద్ధులమై ఉంటామని" ప్రతిజ్ఞ చేసి బారులు తీరి నిల్చుంటారు. ఈ క్రీడలు పదిరోజులపాటు జరుగుతాయి. ఒలింపిక్ క్రీడల పతాకం తెల్లగా ఉంటుంది. దానిమీద నీలం, పసుపు, నలుపు, ఆకుపచ్చ, ఎరుపు రంగులలో ఐదు వలయాలు ఒకదానికొకటి అనుసంధింపబడి ఉంటాయి. చారిత్రకంగా దాదాపు 2,700 ఏళ్ళ క్రితం క్రీ.పూ. 776లో ఒలింపిక్ క్రీడలు గ్రీస్‌లో మొదట ప్రారంభమయినట్లు తెలుస్తోంది. 1500 ఏళ్ళ తరువాత క్రీ.శ. 1896లో 8 దేశాలు పాల్గొనడంతో ఆ క్రీడలు తిరిగి ప్రారంభమయి, అప్పటి నుంచి ప్రతి నాలుగు ఏళ్ళకూ ఒకసారి ఇవి జరుగుతున్నాయి. ప్రపంచ యుద్ధాలు జరిగిన 1916, 1940, 1944 సం.లలో మాత్రం ఈ క్రీడలు జరుగలేదు. ఈ క్రింది సంవత్సరాలలో ఆ నగరాలలో ఒలింపిక్ క్రీడలు జరిగాయి. వివరాలు:



1896 – ఏథెన్స్, గ్రీస్
1900 – పారిస్, ఫ్రాన్స్
1904 – సెం.లూయీస్, లండన్
1908 – లండన్, ఇంగ్లండు
1912 – స్టాక్‌హోమ్, స్వీడెన్
1920 – ఏంట్వార్ప్, బెల్జియమ్
1924 – పారిస్, ఫ్రాన్స్
1928 – ఆమ్‌స్టర్‌డామ్, నెదర్లాండ్స్
1932 – లాస్ ఏంజిల్స్, అమెరికా
1936 – బెర్లిన్, జర్మనీ
1948 – లండన్, ఇంగ్లండు
1952 – హెల్సింకీ, ఫిన్‌లాండ్
1956 – మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా
1960 – రోమ్, ఇటలీ
1964 – టోక్యో, జపాన్
1968 – మెక్సికోసిటీ, మెక్సికో

1972 – మ్యూనిచ్, జర్మనీ
1976 – మాంట్రియల్, కెనడా
1980 – మాస్కో, రష్యా
1984 – లాస్ ఏంజిల్స్, అమెరికా
1988 – సియోల్, కొరియా

ఈ సారి క్రీడలు 1992లో జూలై 25న స్పెయిన్ లోని బార్సిలోనాలో జరుగనున్నాయి.

## ఓమ్

'అ'కార, 'ఉ'కార, 'మ'కారాలతో కూడిన ఒక ఏకాక్షర పదం. 'ఓం'కారాన్ని 'ప్రణవం' అనీ 'ఉద్గీతం' అనీ కూడా అంటారు. వైదిక మతానుసారం ప్రణవం పరబ్రహ్మ స్వరూపం. ఒక గొప్ప మంత్రంగా కూడా ప్రణవాన్ని భావిస్తారు. అన్ని మంత్రాల ఆరంభంలోనూ ఈ ప్రణవం ఉచ్చరించ బడుతుంది. ఉదా:పంచాక్షరి:ఓం నమశ్శివాయ;అష్టాక్షరి:ఓం నమోనారాయణాయ.



## ఓమన్

అరేబియా ద్వీప కల్పంలో ఆగ్నేయ భాగంలో ఉన్న ఒక సుల్తాన్ రాజ్యం. 1970కి పూర్వం 'మస్కాట్– ఓమన్' అనేవారు. ఈ దేశ జనాభాలో భారతీయులు 15 శాతం ఉన్నారు. విస్తీర్ణం: 3,00,000 చ.కి.మీ.; జనాభా:13,72,000 (1988); రాజధాని: మస్కాట్; అధికార భాష: అరబ్బీ; ప్రజలు ముస్లిములు.

జలసంపద ఉన్న చోట నేల సారవంతమయింది. బతీనా తీర ప్రాంతం వ్యవసాయయోగ్యమయి పంటలు పుష్కలంగా పండుతున్నాయి. గోధుమ, పుచ్చకాయలు, అరటి, మామిడి, ఉల్లి, ఖర్జూర, పొగాకు, కంద మూలాలు ఈ దేశంలోని పంట దినుసులు. పశుపోషణ, కోళ్ళ పెంపకం ప్రజల జీవనోపాధులు.

ఓమన్‌లో పెట్రోలు తైల నిక్షేపాలు ఎక్కువగా ఉన్నాయి. పెట్రోల్‌ను త్రవ్వితీసి తైల శోధన చేసి ఎగుమతి చెయ్యడం వల్ల విదేశీ ద్రవ్యాన్ని ఈ దేశం అపారంగా ఆర్జించగలుగుతూంది.

## ఔరంగజేబ్ 1618–1707

చిట్టచివరి మొగలాయీ చక్రవర్తి. 1618లో ఔరంగజేబ్ ఢిల్లీలో జన్మించాడు. షాజహాన్ నలుగురు పుత్రులలో ఇతడు మూడవవాడు. ఇతనికి రాజ్యకాంక్ష ఎక్కువ. పెద్దఅన్న దారాని, తమ్ముడు మురాద్‌ని చంపించాడు. రెండవ అన్న అడవులు పట్టేట్టు చేశాడు. తండ్రి షాజహాన్‌ను బంధించి 1658లో సింహాసనం అధిరోహించాడు. వ్యక్తిగతంగా ఔరంగజేబ్ చాలా నిరాడంబర మైన జీవితం గడిపేవాడు. టోపీలను కుట్టి ఎంబ్రాయిడరీ చేసి ఆ సొమ్ముతో తన అవసరాలను తీర్చుకునేవాడు. ఇతడు సమర్థుడైన పరిపాలకుడే కాని విపరీతమైన హిందూమత ద్వేషి. కాశీనగరంలోని విశ్వనాథ ఆలయాన్ని ధ్వంసం చేసి ఆ రాళ్లతో అదే చోట పెద్ద మసీదును కట్టించాడు. ఇదే విధంగా రాజ్యమంతటా వేలాది హిందూ దేవాలయాలను నాశనం చేశాడు. హిందువులను పలు విధాలుగా హింసించాడు. ఇతని పాలనలో హిందు వులు గుర్రాలపై సవారీ చేయరాదు. వాహనాల మీద తిరుగ కూడదు. వారి జుట్టు మీద కూడా జిజియా పన్ను విధించాడు.హిందువుల విద్యాలయాలను మూయించాడు. దీనితో అంతకు ముందు మొగలాయీ ప్రభువులతో సఖ్యంగా ఉండి, వారికి ఎంతో అండగా ఉన్న రాజ పుత్రులు, ఇతర హిందువులు ఇతనికి విరోధులు అయ్యారు. ఇది చాలదన్నట్లు మేవాడ్ రాజు రాజా జస్వంత్ సింగ్ భార్యను, బిడ్డలను బంధించి వారిని బలాత్కారంగా మహమ్మదీయులను చేయడానికి ప్రయత్నించాడు. దీనితో రాజపుత్రులు రాణా రాజ్‌సింగ్ నాయకత్వంలో తిరుగుబాటు చేసి కొండ ప్రాంతాలను విడిపించుకున్నారు. ఇంతలో ఛత్రపతి శివాజీ రంగంలోకి వచ్చి ఔరంగజేబును ముప్పుతిప్పలు పెట్టాడు. ఔరంగజేబ్ తన రాజ్యాన్ని దక్షిణాన గోల్కొండ, బిజాపురాల వరకూ విస్తరింపజేశాడు. కాని, ఎవరినీ నమ్మక అందరితోనూ విరోధం



కొనితెచ్చుకోడంతో 1707లో అతడు చని పోగానే మొగల్ సామ్రాజ్యమంతా ఛిన్నా భిన్నమై పతనమయి పోయింది.

## ఋగ్వేదం

భారతీయులకు పరమ పవిత్రమైన నాలుగు వేదాలలో మొదటిది. తక్కినవి: యజు, సామ, అథర్వణవేదాలు. ఋగ్వేదాన్ని రెండు విధాలుగా విభజించారు. ఒక పద్ధతి ప్రకారం దీనిలో మొత్తం 1028 సూక్తాలు ఉన్నాయి. వీటిలో 11 వాలఖిల్య సూక్తాలు. మొత్తం సూక్తాలను 'అష్టకాలు' లేదా 'ఖండాలు' గానూ వాటిని తిరిగి అధ్యాయాలుగాను, ఋక్‌లుగానూ ఈ పద్ధతిలో విభజిస్తారు. మరో పద్ధతి ప్రకారం ఋగ్వేదం 10 'మండలాల' గ్రంథం. ఈ మండలాలను తిరిగి 85 అనువాకాలుగా విభజించారు. ఋగ్వేదం ప్రధానంగా యజ్ఞ యాగాదులలో పఠించే మంత్రాలతో కూడి ఉంటుంది.

## ఋతువులు

భారతీయ కాలవిభజన ప్రకారం రెండు మాసాలు కలిసి ఏర్పడిన కాలాన్ని 'ఋతువు' అంటారు. సంవత్సరంలో ఇలాంటి ఋతువులు 6 వస్తాయి. అవి:

వసంతం: చైత్ర, వైశాఖ మాసాలు;
గ్రీష్మం: జ్యేష్ఠ, ఆషాఢ మాసాలు;
వర్షర్తువు: శ్రావణ, భాద్రపద మాసాలు;
శరదృతువు: ఆశ్వయుజ, కార్తికాలు;
హేమంత ఋతువు: మార్గశిర, పుష్యమాసాలు;
శిశిర ఋతువు: మాఘ, ఫాల్గుణాలు.

## ఋత్విజుడు (ఋత్విక్కు)

డబ్బు తీసుకుని యజ్ఞం చేయించే వేద పండితుణ్ణి ఋత్విజుడు లేక ఋత్విక్కు అంటారు. యజ్ఞంలో ఋత్విజులు 16 మంది ఉంటారు. 1. అచ్ఛావాకుడు; 2. అధర్వుడు; 3. అగ్నీధ్రుడు; 4. ఉద్గాత; 5. ఉన్నేత; 6. గ్రావస్తుదు; 7. నేష్టుడు; 8. పోతుడు; 9. ప్రతి ప్రస్థాతుడు; 10. ప్రతి హర్తుడు; 11. ప్రస్తోతుడు; 12. బ్రహ్మ; 13. బ్రాహ్మణాచ్ఛాంసుడు; 14. మైత్రా వరుడు; 15. సుబ్రహ్మణ్యుడు; 16. హోత.

## కంచి

భారతీయుల సప్తమహా పుణ్యక్షేత్రాలలో ఒకటి. ఈ నగరం పేరు ప్రస్తుతం కంజీవరం. ఇది మద్రాసు నగరానికి ఆగ్నేయంగా సుమారు 70 కి.మీ. దూరంలో ఉంది. 'కాచ్చి' అని కూడా ఒకప్పుడు ఈ పట్టణానికి వ్యవహారం ఉన్నట్టు తెలుస్తూంది. కరికాల చోళుని (4వ శతాబ్దం) రాజ్యం ఈ పట్టణందాకా విస్తరించింది. ఆయన ఈ పట్టణాన్ని పెంచి, మరింత అందంగా తీర్చి దిద్దినట్టు శిలప్పదికారం (చూ.) వల్ల తెలుస్తూంది. వరదరాజస్వామి దేవాలయం, కామాక్షీ దేవాలయం, ఏకామ్రేశ్వర నాథాలయం, త్రివిక్రమాలయం వంటి సుప్రసిద్ధమైన వైష్ణవ, శైవ ఆలయాలనేకం ఈ పట్టణంలో ఉండడం వల్ల 'ఆలయాల పట్టణం'గా ఇది ప్రసిద్ధి పొందింది. ప్రాచీన కాలంలో కంచి గొప్ప విద్యాకేంద్రంగా కూడా ప్రసిద్ధి చెందింది. రామానుజులు, వేదాంతదేశికులు మొదలైన వైష్ణవ ప్రవక్తల విద్యాభ్యాసం ఈ పట్టణంలోనే జరిగింది. కంచిలో శంకరాచార్యుల వారి మఠం ఉంది. కంచి పట్టు నేత చీరలకు ప్రసిద్ధిగాంచినది.

## కంపూచియా

ఆగ్నేయ ఆసియాలోని ఒక చిన్న స్వతంత్ర రాజ్యం. దీనికి మరోపేరు 'క్మెర్ రిపబ్లిక్'. 'కాంభోజ' అనేది ఇంకో పేరు. ఇటీవలి వరకూ దీనిని 'కాంబో




డియా' అనే వారు. దీని ప్రాచీన చరిత్ర భారతదేశ చరిత్రతో ముడిపడి ఉంది. ఫూనాన్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండి ఒకప్పుడు—అంటే క్రీ.శ. 7 వ శతాబ్ది వరకూ ఆగ్నేయ ఆసియాలో కంపూచియా గొప్పవైభవం అను భవించింది. 8వ శతాబ్ది నుంచి 14వ శతాబ్దివరకూ భారత దేశంతో సత్సంబంధాలు కలిగి, 'హిందూ—బౌద్ధ' రాజ్యంగా వర్ధిల్లింది. నాటి రాజధాని

'అంగ్కోర్ వాట్'. నాడు 'క్మెర్' చక్రవర్తులు నిర్మించిన దేవాలయాలు, వాస్తు శిల్పసంపద నేటికీ కన్నులపండు వుగా ఉన్నాయి. 1100 ప్రాంతంనాటికి నేటి లావోస్, థాయిలాండ్, వియత్నామ్‌లు ఈ సామ్రాజ్యంలో భాగంగా ఉండేవి తరువాత సామ్రాజ్యం పతనమైనప్పుడు రాజధానిని నామ్‌పెన్‌కు తరలించారు. 19వ శతాబ్దంలో ఇది ఫ్రెంచ్‌వారి వశమైంది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ఫ్రెంచ్ ఆధిపత్యం నుంచి విముక్తి పొంది, 1953లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించింది.

విస్తీర్ణం: 18,035 చ.కి.మీ. జనాభా: 78,92,000 (1980). రాజధాని: నామ్‌పెన్. అధికార భాష: 'క్మెర్' అనబడే కాంబోడియా భాష. కంపూచియాకు మికాంగ్ నది పెన్నిధివంటిది. భూమి సారవంతమైనది. వరి, రబ్బరు, సోయాచిక్కుడు ప్రధానమైన పంటలు. పశుసంపద ఎక్కువ. పరిశ్రమలలో సిమెంట్, కాగితం, ప్లైవుడ్, జవుళీ, మత్స్యపరిశ్రమ పేర్కొనదగినవి.

ఈ దేశంలో బౌద్ధమతం ప్రచారంలో ఉంది. జనాభాలో 90 శాతం హీనయాన బౌద్ధ శాఖకు చెందినవారే.

## కంబమహాకవి

12 వ శతాబ్ది

ప్రముఖ తమిళకవి 'రామావతారం' అనే పేరుతో తమిళంలో రామాయణం వ్రాసిన మహాకవి. సంస్కృతంలో 24,000 శ్లోకాలలో వాల్మీకి వ్రాసిన రామాయణాన్నే కంబమహాకవి, తమిళంలో 12,000 వృత్తాలలో చెప్పాడు. అయితే ఇది సంస్కృతానికి మక్కీకిమక్కీ అనువాదం కాదు. కంబకవి స్వతంత్రంగా వర్ణనలు చేశాడు. కథా సన్నివేశాలలో కూడా స్వల్పమైన మార్పులు చేసి, మూలానికి మెరుగులు దిద్దాడు. కంబ కవికి చోళరాజులతో ఏ కారణంచేతనో వైమనస్యం ఏర్పడి, కొంతకాలం పాటు ఆయన తెలుగుదేశంలోని కాకతీయ ప్రభువు మొదటి ప్రతాపరుద్రుని(1162–1197) ఆస్థానంలో గడిపినట్టు ఒక ఐతిహ్యం! కంబరామాయణంలో 'తల్లి', 'అక్కడ' మొదలైన తెలుగుపదాలు దొర్లడానికి ఇదే కారణం కావచ్చును. 'కవ్వియిర్ పెరియవన్ కంబర్' (కవులలో పెద్ద కంబకవి), 'కంబన్ వీట్టు కట్టుత్తరియుం కవి సొల్లుం' (కంబన్ ఇంట్లో కట్టుకొయ్య కూడా కవిత్వం చెబుతుంది) వంటి తమిళ సామెతలను బట్టి తమిళులకు కంబకవి అంటే ఎంత గౌరవమో మనకు తెలుస్తుంది.

## కడప జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 23 జిల్లాల్లో ఒకటి. రాయలసీమకు చెందిన ఈ జిల్లా విస్తీర్ణం 15,356 చ.కి.మీ., జనాభా: 19,27,682 (1981). జిల్లా కేంద్రం: కడప. చెయ్యేరు, పాపఘ్ని, పెన్నానది మొదలైనవి నీటివనరులు. ఈ జిల్లాలో నల్లమల అడవులు, లోయలు, కొండలు ఉన్నాయి. కర్నూలు—కడప కాలువ ఈ జిల్లాగుండా ప్రవహిస్తుంది. వరి, జొన్న, రాగులు, సజ్జ, వేరుసెనగ ఇక్కడ పండుతాయి.




నిమ్మ, నారింజ, మామిడి తోటలు ఎక్కువ. అనంతరాజు పేట (కోడూరు)లో పండ్ల పరిశోధన కేంద్రం ఉంది. పైరిటీస్ ఖనిజం త్రవ్వకానికి ఈ జిల్లా ప్రసిద్ధి. కడప నాపరాళ్ళు, ముగ్గురాయి, చీనాబంకమన్ను, ఆస్బెస్టాస్, బెరైటీస్ ఖనిజాలు ఇక్కడ విరివిగా దొరుకుతాయి.

జిల్లాలో చూడదగిన స్థలాలు: పుష్పగిరి, పోతన జన్మస్థలం అని చెప్పబడుతున్న ఒంటిమిట్ట, సిద్ధవటం కోట, అన్నమాచార్యుల జన్మస్థలమైన తాళ్లపాక.

## కథక్ నృత్యం

ఉత్తర భారతదేశంలోని ప్రముఖ శాస్త్రీయ నృత్యసంప్రదాయం. ఈ సంప్రదాయంలో పురాణకథలు ప్రధానంగా ప్రదర్శింపబడతాయి. కథలతో కూడిన నృత్యం కనుకనే 'కథక్' అయింది. రాధాకృష్ణుల పాత్రలున్న కథలకు ఈ సంప్రదాయంలో ప్రాముఖ్యం

ఎక్కువ. ముస్లిం పాలన అంతరించిన తరువాత ఈ నృత్యసంప్రదాయం 15వ, 16వ శతాబ్దాలలో రాజుల, నవాబుల ఆస్థానాలలో వర్ధిల్లింది. జయపూరు,లక్నో,వారణాసి ప్రముఖ కథక్ కేంద్రాలుగా ప్రసిద్ధిచెందాయి.జయపూర్ సంప్రదాయంలో లయ ఆధారంగా శాస్త్రీయ నాట్యాన్నిపోషించారు.అయితే లక్నో సంప్రదాయంలో మాత్రం శృంగారంపాలుఎక్కువ. కాగా, వారణాసి సం ప్రదాయంలో శాస్త్రీయతకు ప్రాధాన్యంఇస్తూ, రాధాకృష్ణుల శృంగారకలాపాలను ప్రదర్శిస్తారు.



లక్నో పాలకుడు వజీర్ అలీషా కథక్‌ను పోషించిన మహారాజులలో పేర్కొనదగినవాడు. లయ ప్రధానమైన ఈ శాస్త్రీయ నృత్య సంప్రదాయాన్ని పారణ అనీ, అయద్ అనీ, తాత్కార్ అనీ తోరా అనీ కూడా వ్యవహరిస్తారు. గోపీకృష్ణ, బిర్జూ మహారాజ్ ఈ కథక్ సంప్రదాయానికి చెందిన సుప్రసిద్ధ నాట్యాచార్యులు.

## కథకళి

కేరళ రాష్ట్రంలోని శాస్త్రీయ నృత్య సంప్రదాయం. ఈ సంప్రదాయానికి 300 ఏళ్ల చరిత్ర ఉన్నట్లు తెలుస్తూంది. సంస్కృతం పాలు ఎక్కువగా ఉన్న మలయాళ పద్యాలతో కూడిన భారతం మొదలైన పురాణకథలు ఈ నృత్యంలో అభినయిస్తారు.



శరీరంలోని ప్రతిభాగం కళాకారుని అధీనంలో ఉంటుంది. ముద్రలద్వారా అత్యంత ఉద్వేగభరితంగా ప్రదర్శన సాగుతుంది. కళాకారుల ఆహార్యం ముదురు రంగులలో ఉంటుంది. ధరించే దుస్తులు, ముఖానికి వేసుకునే రంగులు కొట్టవచ్చినట్టుకనిపిస్తాయి.నడుము చుట్టూ మిక్కిలి పొడవైన గుడ్డ చుట్టుకుని లావుగా కనిపిస్తారు. వీరు ధరించే రంగులకు కూడా ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. ఆకుపచ్చ ముఖం ఉదాత్తత, గౌరవం, ధైర్యం వంటి గుణాలను సూచిస్తుంది. దుర్యోధనుడు, రావణుడు మొదలైన దుష్టపాత్రలు వేసేవారు 'కట్టి' అనబడే ఆహార్యాన్ని ధరిస్తారు. వీరికి ఆకుపచ్చ, ఎరుపు రంగులు వేస్తారు. 'తాడి' పాత్రలకు ఎరుపు, తెలుపు, నలుపు గడ్డాలు పెడతారు. శూర్పణఖ, హిడింబ వంటి పాత్రలకు నలుపు పూస్తారు. ప్రాచీన పురాణ కథలతోపాటు జర్మన్ కవి 'గోతే' రచించిన ఫాస్ట్ వంటి పాశ్చాత్యకథలు, అట్టి ఇతర కథలు కూడా కథకళి నాట్యంలో ప్రదర్శించడం నేడు పరిపాటి అయింది. ప్రముఖ మలయాళ మహాకవి వల్లతోల్ నారాయణ మీనన్ కథకళి నృత్య సంప్రదాయాన్ని పునరుద్ధరించిన వారిలో ప్రముఖుడు. భారతపుఝా ఒడ్డున ఉన్న చేరుతురుత్తిలో ఈయన స్థాపించిన కథకళి పీఠం కేరళ కళామండపం ప్రపంచ ప్రసిద్ధి పొందింది.

## కన్‌ఫ్యూషియస్

చైనా తత్త్వవేత్త, దార్శనికుడు, సంఘ సంస్కర్త. కన్‌ఫ్యూషియస్ క్రీ.పూ. 551లో జన్మించాడు. తండ్రి షులియాంగ్ హే. 3 ఏళ్ల ప్రాయంలోనే అతని తండ్రి మరణించడంతో తల్లి,కుమారుడు మిక్కిలి దారిద్ర్యం అనుభవించారు.17వ ఏట చదువు పూర్తి చేసుకుని పన్నులువసూలుచేసే అధికారిగా ఉద్యోగంలో ప్రవేశించాడు.బాలురను పోగుచేసి వారికి విద్య నేర్పడం ప్రారంభించాడు. 22వ ఏట ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పి సత్ప్రవర్తనను, న్యాయమైన ప్రభుత్వ విధానాలను గురించిన సిద్ధాంతాలను బోధిస్తూ ఉండేవాడు. క్రీ.పూ. 517లో యాన్ రాజధానిని సందర్శించి అక్కడ సంగీతం, పురావస్తు చరిత్ర అభ్యసించాడు. ఈ పర్యటనలోనే తన సమకాలికుడు, ప్రఖ్యాత తత్త్వవేత్త



అయిన లియోసీను కలుసుకున్నాడు. యాన్ రాజధాని నుండి తిరిగి వచ్చిన తర్వాత తన రాజ్యంలో విప్లవం చెలరేగగా రాజ్యాధిపతి, ప్రక్క రాజ్యానికి పలాయనం చిత్తగించాడు. కన్‌ఫ్యూషియస్ కూడా రాజుతో పాటు దేశం వదిలి ప్రవాస జీవితం గడుపవలసి వచ్చింది. వెళ్లిన చోటల్లా ఆయన ధర్మబోధ చేస్తూ వచ్చాడు.

క్రీ.పూ. 501లో చంగ్ టూ పట్టణానికి గవర్నర్ అయ్యాడు. ఒక్క సంవత్సరం వ్యవధిలో అనేక సంస్కరణలను రాజ్యంలో ఆయన ప్రవేశపెట్టాడు. అవినీతిని చాలావరకు నిర్మూలించాడు. ధర్మజీవనానికి తగిన ఎన్నో పాటలూ, పదాలూ వ్రాసి ప్రజలచేత పాడించేవాడు. తన 73వ ఏట కన్‌ఫ్యూషియస్ కాలధర్మం చెందాడు.

## కనిష్కుడు క్రీ.శ. 78–105

ప్రముఖ భారతదేశ చక్రవర్తి. ఆయన కుషాన్ జాతివాడు. కుషానులు మధ్య ఆసియా నుంచి వచ్చారు. హిందూ కుష్ పర్వతాలు దాటి ఆఫ్ఘనిస్తాన్‌ను జయించి భారతదేశంలో ప్రవేశించి, పంజాబ్‌ను, కాశ్మీర్‌ను వారు స్వాధీనపరుచుకున్నారు. కుషాన్ వంశం రాజులలో ప్రముఖుడు కనిష్కుడు. ఈయన సామ్రాజ్యం పశ్చిమాన వాయవ్య సరిహద్దు రాష్ట్రం నుంచి తూర్పు మధుర వరకు వ్యాపించింది. విదేశస్థుడైనా అతిత్వరలోనే భారతీయ ప్రభావానికి లోనై భారతీయులలో ఒకడుగా కనిష్కుడు కలిసిపోయాడు. అంతేకాదు, తాను బౌద్ధమతం స్వీకరించి ఆ మతవ్యాప్తికి ఎంతగానో సాయపడ్డాడు. ఈయన మూలంగానే బౌద్ధమతం చీనా, టిబెట్ వంటి దేశాలలో వ్యాపించింది. కనిష్కుడు కాశ్మీర్‌లో బౌద్ధ సదస్సును ఏర్పాటుచేసి మహాయాన బౌద్ధశాఖను అనుసరించే ఉత్తరాది బౌద్ధులకూ, హీనయానాన్ని అనుసరించే దక్షిణాది బౌద్ధులకూ మధ్య ఉన్న భేదాలను తొలగించాడు.


కనిష్కుని విగ్రహం
కనిష్కుని నాణాలు.

క్రీ.శ. 78లో కనిష్కుడు రాజ్యానికి వచ్చాడు. పురుషపురంలో ఆయన తన రాజధానిని నిర్మించుకున్నాడు. ప్రస్తుతం పెషావర్ అని పిలువబడే ఈ నగరం పాకిస్తాన్‌లో ఉంది. కనిష్కుడు కాబుల్‌ను (ఆఫ్ఘనిస్తాన్) కూడా పాలించడమే కాకుండా తన రాజ్యాన్ని మధ్య భారతంలోని నర్మదానది వరకూ విస్తరింపజేశాడు.

## కన్నెగంటి హనుమంతు

చూ. హనుమంతు, కన్నెగంటి

## కన్యాకుమారి

భారతదేశానికి దక్షిణపు కొసన ఉన్న పుణ్యక్షేత్రం. బంగాళాఖాతం, హిందూమహాసముద్రం, అరేబియా సముద్రం ఈ మూడు జలనిధులూ కలిసేచోటు! కన్యాకుమారి అమ్మవారి దేవళం అశేష భక్త జనాన్ని ఆకర్షిస్తూంది. సమీపంలోనే నీటిమధ్య ఉన్న ఒక పెద్దశిల మీద వివేకానంద స్మారక కేంద్రాన్ని నిర్మించారు (1963)



## కన్యాశుల్కం

తెలుగుభాషలో వెలసిన, మొట్టమొదట విజయవంతంగా ప్రదర్శింపబడిన సాంఘిక రంగస్థల నాటకం. రచయిత గురజాడ అప్పారావు(చూ.). సంఘంలోని దురాచారాలను ఖండించడానికి ముఖ్యంగా ఈ నాటకం వ్రాయ బడింది. ఆనాడు విశాఖ జిల్లాలో బ్రాహ్మణ కుటుంబాలలో 'కన్యాశుల్క' దురాచారం ఎక్కువగా ఉండేది. డబ్బుకోసం తల్లిదండ్రులు ముక్కుపచ్చలారని తమ కుమార్తెలను కాటికి కాళ్లు జాచుకున్న వృద్ధులకు ఇచ్చి వివాహం చేస్తూ ఉండేవారు. ఆ దురాచారాన్ని నిరసిస్తూ వ్రాసిన నాటకం 'కన్యాశుల్కం'. దీనిలోని గిరీశం, రామప్ప పంతులు, మధురవాణి, అగ్నిహోత్రావధానులు వంటి పాత్రలు సజీవమూర్తులుగా ప్రేక్షకుల, పాఠకుల మనస్సులను ఆకట్టుకున్నాయి.

## కబీరుదాసు

గొప్ప రామభక్తుడైన ఒక మహమ్మదీయ మతస్థుడు; హిందీ భాషలో మహాకవి. విగ్రహారాధన లేని భక్తితత్త్వాన్ని కబీరు ప్రబోధించాడు. క్రీ.శ. 1443లో వారణాసి (కాశి) వద్ద ఉన్న ఒక సరస్సు ఒడ్డున ఒక శిశువు పడివుండగా సంతానం లేని నూర్ ఆలీ అనే ముస్లిం ఆ శిశువును చేరదీసి పెంచి, కబర్ అని నామకరణం చేశాడు. నూర్ ఆలీ బట్టలు నేసే సాలెవాడు.



చిన్నతనంనుంచే దైవ చింతనాపరుడై అప్పుడప్పుడు ఒకవిధమైన భక్తిపార వశ్యంలో నిమగ్నుడవుతూ కబీరు తల్లిదండ్రులను ఆశ్చర్యంలో ముంచెత్తేవాడు. తనవద్ద ఏదుంటే అది దానధర్మాలు చేస్తూ,తండ్రివృత్తినే తానూ అవలంబించాడు. నిరంతర దైవ చింతనతో కాలంగడుపుతూ ఉండేవాడు. రామానుజుని భక్తుడైన రామానందుణ్ణి తన గురువుగా కబీరు స్వీకరించాడు. శరీరాన్ని శుష్కింపజేసుకుని అడవులలో తపస్సు చేయడంవల్ల ముక్తి లభిస్తుందనే విశ్వాసం గలవాడు కబీరుదాసు.

చదువు రాకపోయినా భక్తిగీతాలు అల్లి పాడేవాడు. భక్తి వ్యక్తిగతమైందనీ, మతం దానిని ఒక సంస్థగా రూపొందించిందనీ కబీర్ భావించేవాడు. దానికి పర్యవసానంగా మహమ్మదీయ చక్రవర్తి సికిందర్‌లోడీ ముందు ఆయన దోషిగా నిలబడవలసి వచ్చింది. తన 60వ ఏట ఆయన కాశీ నుంచి తరిమి వేయబడి ఉత్తరదేశంలో అనేక ప్రాంతాలలో శిష్యులతో సహా పర్యటించాడు. చివరకు కబీరు గోరఖ్‌పూర్ సమీపాన ఉన్న ఒక గ్రామంలో 1518లో కాలధర్మం చెందాడు. ఆయన సమాధి కాశీలో ఉంది. నేటికీ అక్కడ కబీరు పంథాను, ఆయన శిష్యులు ప్రచారం చేస్తున్నారు.

## కమ్యూనల్ అవార్డు

చూ. రౌండ్ టేబిల్ సమావేశాలు

## కమ్యూనిజం

పంటనేల, ఖనిజ నిక్షేపాలు, సంపదలను ఉత్పత్తి చేసే యాంత్రిక సాధనాలు, ఆదాయం — అన్నీ సంఘంలోని ప్రజలందరికీ చెందాలని ప్రతిపాదించే రాజకీయవాదం. దీనినే సామ్యవాదం అని కూడా అంటారు. ఈ సిద్ధాంతం ప్రకారం జాతి సంపదను అందరూ సరిసమానంగా అనుభవించాలి. ఈ ఉదార భావాన్ని మొదట ప్రతిపాదించిన వాడు రాబర్ట్ ఓవెన్ (1771–1858), కార్ల్‌మార్క్స్ (1818–1863) 'దాస్ కాపిటల్' అనే తన ఉద్గ్రంథం ద్వారా ఈ వాదానికి శాస్త్రీయ ప్రతిపత్తిని కలిగించాడు. హెగెల్, ఎంజెల్స్ పండితులతో కలిసి ఈయన 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో' ద్వారా ఈ వాదానికి భాష్యం చెప్పాడు.

వర్గ సంఘర్షణ నిర్మూలనకూ, సమసమాజ స్థాపనకు ఈ వాదం సాయపడుతుందని కమ్యూనిస్టుల విశ్వాసం. 1917 విప్లవానంతరం రష్యాలో లెనిన్ ఈ వాదానికి అనుగుణంగా రాజ్యాంగాన్ని రూపొందించి అమలు జరిపాడు. ప్రస్తుతం తూర్పు యూరప్ దేశాలు, పోలండ్, హంగేరీ, రుమేనియా, యుగోస్లోవియా, ఆస్ట్రియా, చీనా మున్నగు దేశాల ప్రభుత్వాలు కమ్యూనిస్ట్ సిద్ధాంతాన్నే ప్రాతిపదికగా గ్రహించి పరిపాలన సాగిస్తున్నాయి. ఈ దేశాలలోనూ, రష్యాలోనూ ఉత్పత్తినిచ్చే నేల, కర్మాగారాలు వ్యక్తిస్వామ్యానికి చెందక సమిష్టిగా ప్రభుత్వ స్వామ్యంలోనే ఉంటాయి.

## కరీంనగరము జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. 17° 59′ & 19° 5′ ఉ.అక్షాంశ, 78° 32° & 80° 28′ తూ. రేఖాంశాల మధ్యఉన్న ఈ జిల్లాకు ఉత్తరాన ఆదిలాబాద్ జిల్లా తూర్పున మధ్యప్రదేశ్‌లోని బస్తరు, దక్షిణాన వరంగల్లు, మెదక్ జిల్లాలు, పశ్చిమాన నిజామాబాద్ జిల్లా ఉన్నాయి. ఈ జిల్లా విస్తీర్ణం: 11,824 చ.కి.మీ.; జనాభా: 24,36,075 (1981); జిల్లా కేంద్రం: కరీంనగరము.




1905కు ముందు 'సర్కార్ ఎలగండల్' అని పిలువబడే ఈ జిల్లా అంతా కొండలమయం. కొంత పీఠభూమి ప్రాంతం కూడా ఉంది. గోదావరి నదిలోయ అడవులమయం. మంచి కలప ఈ జిల్లాలో లభిస్తుంది. పెద్ద పులులు, చిరుత పులులు కానవస్తాయి. గోదావరి నది, మున్నేరునది ముఖ్యమైన నీటి వనరులు. పెద్దవాగు, చెల్లవాగు గోదావరిలో కలిసే ఏరులు.

ఈ జిల్లాలో పండించే వరి, జొన్న, చిరుధాన్యాలు ముఖ్యమయిన పంట దినుసులు. ఇనుపరాయి ప్రధానమయిన ఖనిజం. నేలబొగ్గు విస్తారంగా లభిస్తుంది. రామగుండం వద్ద ఈ జిల్లాలో లభించే నేలబొగ్గు ఆధారంగా ఒక పెద్ద విద్యుదుత్పత్తి కేంద్రాన్ని రామగుండం వద్ద స్థాపించారు. దాని పరిసరాలలోనే ఎరువుల కర్మాగారం కూడా ఉంది. వేములవాడ, కాళేశ్వరం, ధర్మపురి, మంథెని ప్రధానమయిన పుణ్య క్షేత్రాలు.

## కర్జన్ 1859–1925

పూర్తి పేరు జార్జ్‌నతేనియల్ కర్జన్. ఈయన 1899 – 1905ల మధ్య బ్రిటిష్ రాజప్రతినిధి (వైస్రాయి)గా ఇండియాలో పనిచేశాడు. రాజకీయ ధురంధరుడని, పరిపాలనా దక్షుడని ప్రసిద్ధిపొందాడు. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను అమలు జరిపాడు. విద్యావిధానాన్ని సంస్కరించాడు. పంటనీటి వనరులు మెరుగుపరిచాడు. రైల్వే వ్యవస్థను పెంపొందించడంలో నిర్విరామంగా కృషి చేశాడు. ఆస్క్విత్, లాయిడ్ జార్జ్ బ్రిటన్‌కు ప్రధాన మంత్రులుగా ఉన్న కాలంలో వారి మంత్రి వర్గాలలో సభ్యుడుగా కూడా కర్జన్ పనిచేశాడు.

## కర్ణుడు

ప్రముఖ మహాభారత వీరులలో ఒకడు. కుంతీదేవి కన్యగా ఉన్నప్పుడే దుర్వాస మహర్షి ఆమెకు ఉపదేశించిన మంత్ర ప్రభావం వల్ల సూర్యభగవానుడు ఆమె పట్ల ప్రసన్నుడై ఆమెకు పుత్రుణ్ణి ప్రసాదించాడు. ఆ పుత్రుడే కర్ణుడు. పుడుతూనే సహజ కవచకుండలాలతో కర్ణుడు జన్మించాడు. అపవాదుకు భయపడి కుంతీదేవి శిశువుగా ఉన్న కర్ణుణ్ణి ఒక మందసంలో పెట్టి గంగానదిలో వదిలి పెట్టింది. ఆ పెట్టె ఒక సూతునికి దొరికింది. ఆ సూతుని భార్య రాధ కర్ణుణ్ణి పెంచి పెద్ద చేసింది. అందుకే కర్ణుడు నిజానికి కౌంతేయుడే. అయినా రాధేయుడుగా లోకంలో ప్రసిద్ధి పొందాడు. యువకుడుగా ఉన్న కర్ణుణ్ణి చేరదీసి దుర్యోధనుడు అతనిని అంగ రాజ్యానికి అధిపతిని చేశాడు. పరశురాముని వద్ద కర్ణుడు అస్త్రవిద్యాభ్యాసం చేశాడు. అర్జునునితో సరితూగే మహాధానుష్కుడుగా కర్ణుడు రూపొందాడు. మహాభారత యుద్ధానికి ముందు కుంతి కర్ణుని జన్మ రహస్యం అతనికి తెలిపినా ఆది నుంచి తనను ఆదరించి అభిమానించిన దుర్యోధనుని పట్ల ప్రభుభక్తితో ఆ మహాసంగ్రామంలో అతడు దుర్యోధనుని పక్షమే వహించి పాండవులతో యుద్ధం చేశాడు. కుంతికి ఇచ్చిన మాట ప్రకారం ఆ యుద్ధంలో ధర్మజుడు, భీముడు, నకులుడు, సహదేవుడు వీరిని సంహరించే అవకాశం తనకు లభించినా అతడు వారిని ప్రాణాలతో విడిచిపెట్టాడు. తనకు ప్రధాన ప్రతిస్పర్థి అయిన అర్జునునితో యుద్ధం చేసేటప్పుడు గురువు పరశురాముని శాపం పని చేయనారంభించి సమయానికి బ్రహ్మాస్త్రం ప్రయోగం అతనికి గుర్తుకు రాలేదు. అంతలో కర్ణుని రథం భూమిలో క్రుంగిపోవడం, ఆ అదను చూసుకుని కృష్ణుని ప్రోద్బలంతో అర్జునుడు కర్ణుని శిరస్సు ఖండించడం జరిగింది. శల్యుని తప్పుడు

సారథ్యం కూడా కర్ణుని పతనానికి కొంతవరకు దారి తీసింది.

కర్ణుడు గొప్పదాతగా ప్రసిద్ధి పొందాడు. యుద్ధానికి ముందు ఇంద్రుడు తన కుమారుడైన అర్జునుణ్ణి కర్ణుని బారి నుంచి కాపాడుకోవడానికి వృద్ధ బ్రాహ్మణుని రూపంలో వచ్చి కర్ణుని కవచకుండలాలను అర్థించాడు. కర్ణుడు నిస్సంకోచంగా ఇంద్రునికి వాటిని దానం చేశాడు.

## కర్నాటక రాష్ట్రం

భారత దేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. ఒకప్పుడు మైసూరు రాష్ట్రం అని వ్యవహరింపబడేది. 1973లో కర్నాటక రాష్ట్రంగా పేరు మార్చబడింది. మౌర్య, సాతవాహన, గాంగా, చాళుక్య (6వ శతా.),




హోయసల రాజవంశాలవారు ఏలిన చారిత్రాత్మకమైన ప్రాంతం. తళ్లికోట యుద్ధం (1565) వరకూ విజయనగర రాజవంశీయులు ఈ ప్రాంతాన్ని పాలించారు. ఒడయారు 1578 నుండి శ్రీరంగపట్నం రాజధానిగా చేసుకుని పరిపాలిస్తూ ఉండగా ఈ ప్రాంతం ముస్లిం సేనాని హైదర్ఆలీ వశమైంది. తర్వాత ఆయన తనయుడు టిప్పుసుల్తాన్ (చూ.)ఓటమితో ఈ ప్రాంతాన్ని ఒడయారు రాజులు తిరిగి చేజిక్కించుకోగలిగారు. బ్రిటిష్ వలస ప్రభుత్వానికి లోబడిన ఒక సంస్థానంగా 1947 వరకూ ఒడయార్లే ఇక్కడ పరిపాలన సాగించారు. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన (1956) జరిగినప్పుడు మద్రాస్ రాష్ట్రంలోని కన్నడం మాట్లాడే ప్రాంతాలు, నిజాం రాష్ట్రంలోని కన్నడం మాట్లాడే ప్రాంతాలు మైసూరు రాష్ట్రంలో చేర్చారు.

ఈ రాష్ట్రం విస్తీర్ణం: 1,91,291 చ.కి.మీ. జనాభా: 3,71,35,714 (1981), రాజధాని: బెంగుళూరు. ఇతర ప్రధాన పట్టణాలు: మైసూరు, మంగుళూరు, ధార్వాడ, రాయచూరు, గుల్బర్గా. అధికార భాష: కన్నడం. కన్నడంతో పాటు పశ్చిమ కర్ణాటకంలో తుళు, కొంకణీ భాషలు కూడా మాట్లాడుతారు. కావేరినది, కృష్ణ, దాని ఉపనది తుంగభద్ర ఈ రాష్ట్రంలో ప్రవహించే ప్రధాన నదులు. జోగ్, జెరుసప్ప జలపాతాల వల్ల విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది. కృష్ణ రాజసాగర్ డాముసు కావేరి నది మీద నిర్మించారు. పంట ధాన్యాలలో రాగులు ప్రధానమైనది. ఇతర చిరుధాన్యాలూ వరీ కూడ పండుతాయి. వాణిజ్య పంటలలో కాఫీ చెప్పుకోదగింది. ఇతర పంటలు ఏలకులు, పోక, కుసుమ, కొబ్బరి, ప్రత్తి, వేరుసెనగ, మిర్చి, ఆముదం, చెరకు. బెంగుళూరు భారతదేశంలోని ప్రముఖ పారిశ్రామిక కేంద్రాలలో ఒకటి. యంత్రపు పనిముట్లు (మెషిన్ టూల్స్), ఎలక్ట్రానిక్ సామగ్రి, చేతి గడియారాలు, టెలిఫోన్ సామాను, విమాన నిర్మాణం, ఉక్కు (భద్రావతి) వంటి అనేక చిన్న, పెద్ద పరిశ్రమలు ఇక్కడ ఉన్నాయి. కుదెరిముఖ్ ఇనుపఖనిజం ప్రాజెక్ట్ ఈ రాష్ట్రంలోనే ఉంది. మైసూరు పట్టు ప్రశస్తమైంది. మంచి గంధం నుంచి నూనె తీసి సబ్బుల తయారీలో ఉపయోగిస్తున్నారు.

చూడదగిన స్థలాలు: గాంగ రాజవంశాలు శ్రావణ బెళగోళాలో నిర్మించిన ఏకశిల గోమటేశ్వర విగ్రహం, బెంగుళూరులోని లాల్‌బాగ్, హాలీబెడ్‌లోని శిల్పసంపద, కృష్ణసాగరు డాము వద్ద బృందావనం, శ్రీరంగ పట్టణంలో టిప్పుసుల్తాన్ నిర్మాణాలు, హోస్పేట్‌లోని హంపీ శిధిలాలు.

## కర్నూలు జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. రాయలసీమకు చెందిన ఈ జిల్లా ఒకప్పుడు తెలుగు చోళుల పాలనలో ఉండేది. తరువాత పశ్చిమ చాళుక్యులు (8వ శతాబ్దం), కాకతీయులు (13వ శతాబ్దం), కొండవీటిరెడ్లు, విజయనగర రాజవంశీయులు గోల్కొండ నవాబులు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. మొగలాయీల ఆధిపత్యం నుంచి ఈ ప్రాంతం అసఫ్‌జాహీల అధీనంలోకి వచ్చినప్పుడు (1800) ఆ నవాబు ఈ ప్రాంతాన్ని ఈస్ట్

ఇండియా కంపెనీ వారికి దత్తం చేశాడు. అప్పటినుంచీ కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాలకు 'దత్తమండలాలు' అని పేరు వచ్చింది. 1953లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు ఆ రాష్ట్రానికి కర్నూలు తాత్కాలిక (1953–56) రాజధాని అయింది.




విస్తీర్ణం: 18,794 చ.కి.మీ., జనాభా: 24,04,358 (1981), జిల్లా కేంద్రం: కర్నూలు. ఇతర ప్రముఖ పట్టణాలు: నంద్యాల, ద్రోణాచలం (డోన్), ఆదోని, ఎమ్మిగనూరు. ప్రజలలో చెంచు ఆదిమతెగ వారున్నారు. జిల్లాలో అటవీసంపద ఎక్కువ. నల్లమల్ల-ఎర్రమల కొండలలోయలోని సుందర దృశ్యాలు చూడ దగినవి. కుందూ లోయగుండా ప్రవహించే కుందూనది, కర్నూలు – కడప కాలువ, కృష్ణా, దాని ఉపనది తుంగభద్ర, హంద్రీ నది ఈ జిల్లాకు ప్రధాన జలాధారాలు. కృష్ణానదిపై శ్రీశైలం వద్ద జలవిద్యుత్కేంద్రం నిర్మించారు (1982). ప్రస్తుతం తెలుగు గంగ నిర్మాణంలో ఉంది. ఈ జిల్లాలో జొన్న, వరి, చిరుధాన్యాలు, వేరుసెనగ ప్రత్తి ముఖ్యంగా పండుతాయి.

బెరైటీస్, ఇనుపఖనిజం, బంగారం ముఖ్యమైన ఖనిజ సంపదలు. జొన్నపురి వద్ద ఒకప్పుడు వజ్రాలు లభించేవని చెబుతారు. ఎమ్మిగనూరులో జవుళీపరిశ్రమ, కర్నూలులో కాగితపు పరిశ్రమ, పాణ్యంలో సిమెంటు, కాల్షియం కార్బైడ్ పరిశ్రమ పేర్కొనదగినవి. శ్రీశైల మల్లికార్జున స్వామిగుడి, అహోబిల నృసింహక్షేత్రం, మంత్రాలయంలోని రాఘవేంద్ర క్షేత్రం, మహానంది శైవక్షేత్రం ఈ జిల్లాలో, ఇవికాక ఓంకారం, సంగమేశ్వరం, త్రిపురాంతకం అనునవి కూడ యాత్రాస్థలములుగా ప్రసిద్ధి చెందాయి.

## కలకత్తా

భారతదేశంలోని ప్రధాన నగరాలలో ఒకటి. ఇది పశ్చిమ బెంగాల్ రాష్ట్ర రాజధాని. పెద్దరేవు పట్టణం. హుగ్లీనదీ ముఖ ద్వారానికి దాదాపు 100 కి.మీ. దూరంలో ఆ నదీ తీరంలోనే ఉంది. కలకత్తా మహానగరం, హౌరా నగరం రెండూ హుగ్లీనది మీద వంతెన ద్వారా కలుపబడుతున్నాయి. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ 1690లో కలకత్తాలో తమ స్థావరాన్ని ఏర్పరచుకొని 1773 నాటికి దానిని ఒక పరిపాలనా రాజధాని కేంద్రంగా అభివృద్ధి పరచుకొంది. 1912లో భారత రాజధాని ఢిల్లీ నగరానికి తరలించబడింది. కలకత్తా నగరం జనాభా: 32,88,148 (1981); శివార్లతో కలుపుకొని 1036 చ.కి.మీ. జనాభా: 91,94,018 ఉంది.

## కల్పవృక్షం (కల్పవల్లి)

కోరిన కోరికలు తీర్చే చెట్టు, లేదా తీగె. మహాభారతంలో కల్పవృక్షం ఇలా వర్ణించబడింది: "మహారాజా! కొన్ని వృక్షాలు మనం ఏ పండ్లు కోరితే ఆ పండ్లు ఇస్తాయి. మరికొన్ని చెట్లు క్షీరం వర్షిస్తాయి, అమృతం, వస్త్రాలు, ఆభరణాలు మొదలైన ఆరువిధాలైన సంపదలను తమ పండ్ల ద్వారా అవి మనకు అందిస్తాయి. దంపతులను, దాసదాసీ జనాలను కూడా అవి సృష్టిస్తాయి. ఆ వృక్షాల క్షీరం అమృతం వంటిది. దానిని అందరూ సేవిస్తారు" క్షీర సాగర మథనం (చూ.) సమయంలో హాలాహలం తరువాత క్షీరసాగరం నుంచి వెలువడిన వాటిలో కల్పవృక్షం ఒకటి. భారత కాలం నుంచీ భారతీయ శిల్పాలలో కల్పవృక్షాన్ని చెక్కడం ప్రారంభమైంది. క్రీ.పూ. 3వ శతాబ్దంలో శిల్పాలలో కల్ప వృక్ష శిల్పం మొదటిసారి కనిపిస్తుంది. చెట్టు నిండా కొమ్మలూ, ఆకులూ మధ్య మధ్య స్పష్టాస్పష్టంగా కనిపించే దేవతా స్త్రీ మూర్తులూ ఆ శిల్పంలో గోచరిస్తున్నాయి. బార్హుత్, సాంచీ శిల్పాలలో ఇది 'కల్పవల్లి' (తీగె) రూపంలో మలచబడింది. కాళిదాసు తన మేఘసందేశంలో 'సకల మిబలా మండనం కల్పవృక్షః" అని కల్ప వృక్షాన్ని స్మరిస్తాడు. దేవలోకంలో మందార, పారిజాత, సంతాన, హరిచందన కల్పవృక్షాలున్నాయని పురాణాలలో పేర్కొన్నారు.

## కల్హణుడు 11వ శతాబ్ది

సుప్రసిద్ధ సంస్కృత చారిత్రక కావ్యం 'రాజ తరంగిణి' కర్త. ఈ గ్రంథం ప్రాచీన కాశ్మీర్ దేశం చరిత్రనూ, ఆ ప్రాంతాన్ని పాలించిన రాజవంశాల చరిత్రనూ తెలుపుతూంది.

కల్హణుని తండ్రి చంపకుడు. ఇతడు హర్షుని (1089 – 1101) మంత్రి. ఎనిమిది తరంగాలుగా విభక్తమైన 'రాజతరంగణి' లో కాశ్మీర రాజుల చరిత్ర, ప్రసక్తాను ప్రసక్తంగా సుప్రసిద్ధులైన అశోకుడు మొదలైన భారతీయ చక్రవర్తుల చరిత్ర కూడా వర్ణించబడింది.

## కవిత్రయం

మహాభారతాన్ని తెలుగులోకి అనువదించిన నన్నయ, తిక్కన, ఎర్రన అనే ముగ్గురు కవులనూ కలిపి కవిత్రయం అని వ్యవహరిస్తారు. (చూ. నన్నయ, తిక్కన, ఎర్రన)

## కస్తూర్బా గాంధీ

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ(చూ.) సతీమణి కస్తూర్బా. తండ్రి గోకుల్‌దాస్ మాకంజీ, గాంధీ తండ్రి కాబా గాంధీ సన్నిహిత మిత్రులు వియ్యమందారు.



12వ ఏటనే కస్తూర్బాకు గాంధీజీతో వివాహమయింది. ఆమె ఏమీ చదువుకోలేదు. గాంధీ గుజరాతీ చదవడం,వ్రాయడం నేర్పి ఆమెను విద్యావంతురాలిని చేశారు.దక్షిణాఫ్రికాలో ఇంటి పని అంతా తానేస్వయంగా చేసుకునేది.గాంధీజీకి ఇతరులచేత పనిచేయించుకోడం అంటే గిట్టేదికాదు. ఆఖరికి పాయిఖానాలు కూడ ఆమె చేతనే శుభ్రం చేయించేవారు. దక్షిణాఫ్రికా విడచి వచ్చేటప్పుడు ఆమె స్నేహితులు బంగారు నగలు కానుకగా ఇచ్చారు. వాటిని తన కోడళ్ళకు పెట్టుకుందామని ఆమె కోరిక. అయితే గాంధీ అది పడనివ్వలేదు. గాంధీజీ రాజకీయ జీవితంలో పాలుపంచుకుంటూ కష్టాలకు ఓర్చి ఆమె జీవయాత్ర సాగించింది. 1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమ సమయంలో గాంధీజీని బ్రిటిషువారు నిర్బంధంలోకి తీసికొన్నప్పుడు వేదికనెక్కి ఆమె ప్రసంగం కొనసాగించింది. ఆమెను కూడా పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారు. మార్చి 1943లో గుండెపోటు రాగా 1944 ఫిబ్రవరి 22న నిర్బంధంలోనే ఆగాఖాన్ భవనంలో ఆమె మరణించింది. అక్కడే ఆమెకు అంత్యక్రియలు జరిగాయి.

## కాంగో

ఆఫ్రికా ఖండంలోని ఒక గణతంత్ర రాజ్యం. 1969లో స్వతంత్ర రాజ్యంగా రూపొందక పూర్వం కాంగో ఫ్రెంచ్ ఈక్విటోరియల్ ఆఫ్రికాలో ఒక భాగంగా ఉండేది.




విస్తీర్ణం: 3,42,000 చ.కి.మీ.; జనాభా: 22, 66,000(1988), రాజధాని: బ్రజ్జవిల్లీ; అధికార భాష: ఫ్రెంచ్. ప్రజలు కోంగో, తేకే,మ్బోషీ, సాంగా,పూనూ,మాక,పిగ్మీ ఆది మజాతులకు చెందిన వారు. ప్రాణంఉన్నా లేకపోయినా వస్తుజాలానికి ఆత్మ ఉందని వీరి విశ్వాసం. ప్రజలలో ఎక్కువ మంది క్రైస్తవులు. ముస్లిములు కూడా కొందరు ఉన్నారు. నైరానది, శ్టాన్లీ మడుగు (కృత్రిమ సరస్సు), కాంగోనది, దాని ఉపనదులు, సనగానది, ముబాంగీనదుల పరిసర ప్రాంతాలు సారవంతమై సాగులకు అనుకూలంగా ఉన్నాయి.

వరి, మొక్కజొన్న, అరటిపండ్లు, కర్రపెండలం, కాఫీ, పామ్‌నూనెగింజలు, చిరుగడదుంప, కంద మూలాలు ఈ దేశంలో ఎక్కువగా పండిస్తారు. ఈ దేశంలోని సహజసంపదలో పొటాష్ ఖనిజం, అడవుల నుంచి వచ్చే 'ఒకావ్‌' 'మహోగనీ' 'లింబా' కలప పేర్కొనదగినవి.

## కాంగ్రెసు, భారత జాతీయ

ఆధునిక భారత రాజకీయ చరిత్రలోనూ, భారత స్వాతంత్ర్యోద్యమంలోనూ ప్రధాన పాత్ర వహించిన భారత

జాతీయ కాంగ్రెసు (ఇండియన్ నేషనల్ కాంగ్రెసు)ను 1885లో ఆనాటి జాతీయ నాయకుల సహకారంతో ఏ.ఓ హ్యూమ్ స్థాపించాడు. 1985లో ఈ సంస్థ శతవార్షికోత్సవం జరిగింది. ఆనాడు (27–12–1885) బొంబాయిలో డబ్ల్యూ.సి.బొనర్జీ అధ్యక్షతన జరిగిన 72 మంది ప్రతినిధుల సమావేశంలో ఈ సంస్థకు, ఇండియన్ నేషనల్ కాంగ్రెసు అని పేరు పెట్టారు.

ముఖ్యంగా యువకులలో దేశభక్తిని ఇనుమడింపజేసేందుకు కాంగ్రెసు అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహించింది. అమెరికన్ స్వాతంత్ర్యసమరం, ఫ్రెంచ్ విప్లవం వంటి ప్రపంచ ఉద్యమాల వలన ప్రభావితమై కాంగ్రెసులోని బిపిన్ చంద్రపాల్, సురేంద్రనాథ్ బెనర్జీ, జిన్నా, లాలా లజపతిరాయ్, మోతీలాల్ నెహ్రూ, వల్లభాయి పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, మోహన్ దాస్ కరంచంద్ గాంధీ, దాదాభాయ్ నౌరోజీ, నేతాజీ సుభాష్‌చంద్రబోస్, బాలగంగాధర తిలక్, రనడే, టంగుటూరి ప్రకాశం, రాజాజీ, రాజేంద్రప్రసాద్, ఫిరోజ్ షా మెహతా, ఆనందాచార్లు, అనిబిసెంటు, ఆజాదు, చిత్తరంజన్‌దాస్, సరోజినీ నాయుడు, కృపలానీ, సత్యమూర్తి, పట్టాభి వంటి స్వాతంత్ర్య సమరయోధులు ఆవిర్భవించారు. 'స్వరాజ్యం నా జన్మహక్కు' (1909) అని గర్జించిన తిలక్, 'సైమన్ గోబాక్' అంటూ తుపాకీకి తన గుండె చూపిన ఆంధ్రకేసరి ప్రకాశం వంటి మహానాయకులు ఉద్భవించారు. 1905లో బెంగాల్ విభజనను వ్యతిరేకించడంలో కాంగ్రెస్ ప్రధాన పాత్ర వహించింది. బ్రిటిష్ పాలన నుండి విముక్తి సాధించడానికి 1915లో కాంగ్రెస్ గాంధీజీ నాయకత్వాన్ని వరించింది. ముఖ్యంగా జలియన్ వాలాబాగ్ (1919) దురంతం (చూ.) జరిగిన పిమ్మట గాంధీజీ నాయకత్వంలో సహాయనిరాకరణ ఉద్యమం (చూ.)సాగింది. ఆ తరువాత గాంధీజీ అహింసా మార్గాన్ని అనుసరించి అనేక సత్యాగ్రహ ఉద్యమాలు నడిపారు. ఆయన నాయకత్వంలోనే 1930 లో ఉప్పు సత్యాగ్రహం (చూ.) 1942లో క్విట్ ఇండియా (చూ.) ఉద్యమం జరిగాయి. ప్రముఖ నాయకులందరూ కారాగారాల్లో నిర్బంధితులయ్యారు. చివరకు 1947 ఆగస్టు 15న బ్రిటిషు పాలన నుండి భారతదేశానికి విముక్తి లభించింది. స్వతంత్ర భారతదేశానికి జవహర్‌లాల్ నెహ్రూ ప్రథమ ప్రధాని , వల్లభాయి పటేల్ ఉపప్రధాని అయ్యారు. ఆ తరువాత దేశంలో భారతజాతీయ కాంగ్రెస్ ఒక ప్రముఖ రాజకీయ పక్షంగా రూపుదాల్చి దేశాభ్యుదయ కృషిలో పాల్గొంటూంది. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం)

## కాంచన గంగా శిఖరం

భారతదేశంలో ఈశాన్య హిమాలయాలలో ఉన్న పర్వతశిఖరం దీని ఎత్తు 8585 మీ.(25,755 అడుగులు) ప్రపంచంలోని పర్వత శిఖరాలలో మిక్కిలి ఎత్తయిన వాటిలో ఇది మూడవది. మొదటిది: ఎవరెస్ట్ శిఖరం (చూ.) రెండవది: కె – 2 (చూ.)

## కాకతీయులు

ఆంధ్రదేశ చరిత్రలోని ఒక ప్రముఖ రాజవంశం. 11వ శతాబ్దం చివర ఆంధ్రదేశంలో తూర్పు చాళుక్యుల పాలన అంతరించింది. ఫలితంగా ఓరుగల్లు (నేటి వరంగల్లు) రాజధానిగా ఏలుతున్న కళ్యాణి చాళుక్య రాజైన రెండవ ప్రోలరాజు కాకతీయ సామ్రాజ్యాన్ని స్థాపించాడు. కాకతి అన్న దేవత పేరున ఈ వంశస్థులకు 'కాకతీయులు' అని పేరు వచ్చింది. ప్రోలరాజు తర్వాత రుద్రదేవుడు అధికారానికి వచ్చి, 1158 నుంచి 1198 వరకూ పాలించాడు. ఈతడు తన రాజ్యాన్ని ఉత్తరాన గోదావరి వరకూ విస్తరింపజేయడమే కాకుండా సర్వస్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. 1198లో రాజ్యానికి వచ్చిన గణపతి దేవుడు దక్షిణాన నెల్లూరు, కడప ప్రాంతాలవరకు రాజ్యాన్ని విస్తరింపజేశాడు. తర్వాత రెండు శతాబ్దాల పాటు అనగా 1323 వరకూ ఈ కాకతీయ మహాసామ్రాజ్యం అభివృద్ధి పొందింది. గణపతి దేవుని కుమార్తె రుద్రమదేవి (చూ.) తండ్రి తర్వాత 1262లో


కాకతీయ కీర్తి

రాజ్యానికి వచ్చి 1292 వరకూ ప్రజారంజకంగా పరిపాలించింది. ఈమె తర్వాత ఈమె మనుమడు ప్రతాపరుద్రుడు (చూ.)సింహాసనం అధిష్టించి 1323 వరకూ పరిపాలించాడు. ఈయన కాలంలో కాకతీయ సామ్రాజ్యం పశ్చిమాన ఆదోని, రాయచూరు వరకూ, దక్షిణాన కంచి వరకూ విస్తరించింది. సాతవాహనుల తర్వాత తెలుగు మాట్లాడే ప్రాంతాలన్నీ ఒకే గొడుగు క్రిందికి వచ్చింది, ఈ కాకతీయుల కాలంలోనే! ఇంతటి గొప్ప సామ్రాజ్యం చివరకు ఢిల్లీ సుల్తాన్ తుగ్లక్ జరిపిన దారుణమైన దాడులకు గురిఅయి, 1323లో అంత రించింది.

## కాటన్, సర్ ఆర్థర్

గోదావరి మీద ధవళేశ్వరం ఆనకట్ట కట్టించి ఆంధ్ర ప్రాంతాన్ని సస్యశ్యామలం చేసిన బ్రిటిష్ ఇంజనీరు. 1803 మే 15వ తేదీన ఇంగ్లండులో సర్‌లించ్ కాటన్, క్వాల్‌వెలీ కామన్ దంపతులకు కుమారుడుగా ఆర్థర్ కాటన్ జన్మించాడు. చిన్నప్పటి నుంచీ కాలువలలో నీటి ప్రవాహాన్ని పరీక్షిస్తూ అడ్డు ఉంటే తొలగిస్తూ ఉండేవాడు. 15 సంవత్సారాల వయస్సు ఛాగానే ఆర్థర్ కాటన్ క్యాడెట్‌గా ఎన్నిక అయ్యాడు. ఈస్టిండియా కంపెనీవారు ఇంజనీరింగ్ సర్వీస్‌కి శిక్షణ ఇప్పించే 'అడ్డిస్ కాంబ్'లో చేరి శిక్షణ పొందాడు. 18 నెలలకే ఆయన అసమాన ప్రతిభ ప్రదర్శించి పరీక్ష వ్రాయకుండానే రాయల్ ఇంజనీర్స్ సర్వీసులో నియమింపబడ్డారు. ప్రారంభంలో ఆయనకు రెండవ లెఫ్టినెంట్ హోదా ఇవ్వబడింది. 1821 మే నెలలో భారతదేశంలో పనిచేయడానికి వచ్చాడు. మదరాసు ప్రెసిడెన్సీ ఛీఫ్ ఇంజినీరు కార్యాలయంలో ఒక ఉద్యోగిగా సంవత్సరకాలం పని చేసి కొంత అనుభవం గడించాడు. తర్వాత భారత దేశం,సింహళం(శ్రీలంక) ల మధ్యగల పాంబన్ కాలువను పరిశీలించి ఇరుకుగా ఉండే ఈకాలువనువెడల్పుగా చేసి కొన్నివందల టన్నుల బరువుగలపడవలు కూడా



వెళ్లడానికి వీలుకలిగించారు. కోయంబత్తూరు, తంజావూరులలోని చెరువులు, మరమ్మతులు చేయించారు. కావేరి నదీజలాలు వృధా కాకుండా ఒక పథకం తయారుచేసి వాటిని వరిసాగుకు వినియోగపడేట్టు చేశారు. మదరాసులో రోడ్లు వేయించడం, రైలుమార్గం నిర్మించడం, విశాఖ పట్నంలో ఒక చర్చి నిర్మించడం, అక్కడ బీచ్‌కి మరమ్మతులు చేయించడం, 1836లో కోలెరూన్ ఆనకట్ట కట్టించడం ముదలైన కార్యాలవల్ల ఈయన ఖ్యాతి దశదిశలా వ్యాపించింది.

గోదావరి డెల్టాలోని భూములను సాగులోకి తీసుకు రావడానికి రాజమండ్రికి 10 కి.మీ. దూరంలో రాతిప్రదేశంలో ఒక పూరిల్లు వేసుకుని కుటుంబంతో సహా అక్కడ నివసిస్తూ ఆ రోజులలో 2 కోట్ల 20 లక్షల రూపాయల వ్యయంతో 1857లో ధవళేశ్వరం వద్ద గోదావరి నదిపై ఆయన ఆనకట్ట నిర్మించాడు. దీనివల్ల ఉభయ గోదావరి జిల్లాలలోనూ 10 లక్షల ఎకరాల భూమి సాగులోనికి వచ్చింది. విజయవాడ వద్ద కృష్ణానదిపై కూడా ఆనకట్ట నిర్మించారు. చివరికి మదరాసు ప్రెసిడెన్సీ ఛీఫ్ ఇంజనీరు అయ్యారు. 40 సంవత్సరాలు భారతదేశానికి ఆయన మరపురాని సేవచేసి పదవీవిరమణ చేశారు. 1980లో పునర్నిర్మించిన గోదావరి బరాజ్‌కు కాటన్ బరాజ్ అని పేరు పెట్టారు. ఆయన శిల్ప విగ్రహాన్ని హైదరాబాదులోని టాంక్‌బండ్ మీద తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో వెలయింప చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు 1860లో 'నైట్' హోదాను ప్రదానం చేసింది. 1899 జూలై 14న ఇంగ్లండ్‌లో ఆయన శాశ్వతంగా కన్నుమూశారు.

## కాటార్

పర్షియన్ సింధు శాఖలోకి చొచ్చుకుని ఉన్న రాజ్యం. 1971 లో బ్రిటిష్ పాలననుంచి విముక్తి పొందింది. ప్రస్తుతం రాజవంశీయులు పాలిస్తూన్న ఒక స్వతంత్ర రాజ్యం ఇది.

విస్తీర్ణం: 11,400 చ.కి.మీ; జనాభా: 4,20,000 (1988); రాజధాని: దోహా; అధికార భాష: అరబ్బీ; దోహా పరిసరాలలోనే జన సాంద్రత ఎక్కువ. ఇక్కడి ప్రజలలో పాకిస్తాన్ నుంచి, ఓమన్ దేశం నుంచి వలస

వచ్చిన వారే ఎక్కువ. పెట్రోల్, దేశ ఆర్థిక వ్యవస్థకు పుష్టిని చేకూరుస్తోంది.

ఖర్జూరం, కూరగాయలు, పండ్లు ప్రధానమయిన పంటలు. ఒంటె, జింక, గొర్రె, మేక వంటి జంతువుల పోషణ ఎక్కువ. మత్స్య పరిశ్రమ అధికం. సిమెంటు, యూరియా ఎరువుల ఫాక్టరీలు ప్రధాన పరిశ్రమలు.

## కామధేనువు

కోరిన కోరికలన్నీ తీర్చే దివ్యశక్తులుగల గోవు. దేవదానవులు క్షీరసముద్రాన్ని మథించినప్పుడు పుట్టిన వాటిలో ఈ కామధేనువు ఒకటి. అమృత మథన సమయంలో పౌరోహిత్యం వహించినందుకుగాను దక్షిణగా కామధేనువును వశిష్ఠునకు ఇచ్చారు. తెల్లని ఈ కామధేనువు దూడ పేరు నందిని అనీ, రోహిణి అనీ, శబల అనీ, కామదుప్ అనీ పలు విధాలుగా పురాణాలలో పేర్కొనబడింది.

కౌశిక మహారాజు విశ్వామిత్రుడు(చూ.) బలవంతంగా వశిష్ఠుని వద్ద నుంచి కామధేనువును కొనిపోప్రయత్నించగా ఈ ఆవు శరీరంనుంచి అసంఖ్యాకులైన సైనికులు ఉద్భవించి కౌశికుని సైన్యాన్ని మట్టుపెట్టారు. తరువాత ఈ ఆవు జమదగ్ని వద్ద ఉండగా కార్తవీర్యార్జునుడు వచ్చి బలవంతంగా దీనిని తోలుకొని పోవయత్నించగా జమదగ్ని మనుమడు పరశురాముడు కార్తవీర్యార్జునుణ్ణి సంహరించి, కామధేనువును తిరిగి తోలుకొని వచ్చాడు. తరువాత కామధేనువు కొన్నాళ్లు తారకాసురుని వద్దను, కొన్నాళ్లు ఇంద్రుని వద్దను ఉండి ప్రస్తుతం సప్తర్షి మండలం వద్ద ఉందని ఐతిహ్యం.

## కామరాజ్ నాడార్ 1902–75

ప్రముఖ తమిళ జాతీయ నాయకుడు. పూర్తిపేరు కామాక్షి కామరాజ్ నాడార్. 1902 జూలై 15 వ తేదీన ఒక వెనుకబడిన కులంలో అతి పేదకుటుంబంలో పుట్టిన కామరాజ్ కాంగ్రెస్‌లో సాధారణ కార్యకర్త స్థాయి నుంచి అంచెలంచెలుగా క్రమంగా తమిళనాడు ముఖ్యమంత్రి స్థాయికీ, భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుని స్థాయికి పెరిగాడు. భారతదేశానికి 'కింగ్ మేకర్' (నాయక నిర్ణేత) అనే పేరు తెచ్చుకున్నాడు.



కామరాజ్ నాడార్ నిరాడంబరుడు. అవినీతికి ఆమడదూరంలో ఉండేవాడు. అధికార పదవులపై మోజులేనివాడు. మిత భాషి. ప్రతి విషయం లోనూ 'చూద్దాం' అని అర్థం వచ్చే 'పార్కలామ్' అంటూ చాకచక్యంగా తప్పించుకునేవాడు. 1963లో దేశంలో మంత్రులలో వయోవృద్ధులయిన వారిని తప్పించడానికి పన్నిన 'కామరాజ్ ప్లాన్', ఆయని రాజనీతి చతురతకు ఒక మచ్చుతునక. నెహ్రూ(చూ.) తర్వాత భారతదేశ ప్రధాని ఎవరు? అన్న ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు కామరాజ్ నాడార్ ఏకాభిప్రాయం (కాన్‌సెన్సస్)అనే కొత్త పద్ధతిని ప్రవేశపెట్టాడు. ఈ పద్ధతివల్ల ప్రధాని అయిన లాల్‌బహదూర్ శాస్త్రి (చూ.) కామరాజ్ నిర్ణయం సరియైందని నిరూపించాడు. 'లాల్‌బహదూర్ (చూ.) తర్వాత తిరిగి ఎవరు?' అన్న సమస్యను కూడా ఆయన ఎంతో నేర్పుతో పరిష్కరించి, ఇందిరా గాంధీని (చూ.) ప్రధాన మంత్రిని చేశాడు.

కాంగ్రెస్ అధ్యక్షపదవిని స్వీకరించిన అనంతరం ఆ పార్టీకి కొత్త అర్థాన్నీ, క్రొత్త ధ్యేయాన్నీ కల్పించడానికి కృషి చేసేవాడు. తమిళనాడు ముఖ్యమంత్రిగా కూడా ఆయన ఉత్తమ సంప్రదాయాలను నెలకొల్పాడు. 1975 అక్టోబర్ 2 వ తేదీన మద్రాసులో కామరాజ్ నాడార్ పరమపదించారు.

## కామెరూన్

ఆఫ్రికా పశ్చిమ తీరాన ఉన్న స్వతంత్ర గణరాజ్యం. 1960లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకుంది. 1961లో బ్రిటిష్ కామెరూన్ దీనిలో విలీనమయినపుడు 'ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ కామెరూన్' రూపొందింది.

విస్తీర్ణం: 4,75,458 చ.కి.మీ., జనాభా: 1,12, 06,000 (1988), రాజధాని:యవాన్‌డా, అధికార భాషలు: ఇంగ్లీష్, ఫ్రెంచి. ప్రజలలో నీగ్రో ఆదిమ జాతులవారూ, బంటూజాతివారూ అధికం. సనగానది, బెన్యూనది ప్రధాన మయిన నీటి వనరులు. కోకో, కర్ర పెండలం, అరటిపండ్లు, కాఫీ, ప్రత్తి, మొక్కజొన్న,

పామ్ నూనె గింజలు, జొన్న, తేయాకు, పొగాకు, వేరుసెనగ, ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. కలప, రబ్బరు అడవులనుంచి లభిస్తాయి. అల్యూమినియం తయారీ, రసాయనిక ద్రవ్యాలు ముఖ్యమయిన పరి శ్రమలు.

## కార్ల్‌మార్క్స్

చూ.మార్క్స్,కార్ల్

## కార్వే డి.కె 1858–1962

స్త్రీ జనాభ్యుదయం జీవితాశయంగా చేసుకొని అపారకృషి సల్పిన గొప్ప సంఘ సేవకుడు, సంస్కర్త, విద్యావేత్త. ఈయన పూర్తి పేరు ధోన్‌డోకేశవకార్వే. అనాథలపై అపారమైన కరుణచూపి వారి సంక్షేమానికై ఆయన అవిరళమైన కృషి చేశాడు. మహారాష్ట్రంలోని షేర్ వలిలో 1958లో కార్వే జన్మించాడు. బొంబాయిలో విద్యాభ్యాసం ముగించి, దక్కన్ విద్యా సంఘంలో అధ్యాపకుడుగా చేరాడు (1892–1912). బొంబాయిలో రమాబాయి స్థాపించిన శారదా సదన్‌లోని ఒక వితంతువు గోదుబాయిని ఆయన వివాహమాడారు (1893). ఇది ఆ రోజులలో సంచలనం కలిగించిన సంఘటన. అప్పటి నుంచి మహారాష్ట్రలో వితంతు వివాహ ఉద్యమం క్రమంగా అభివృద్ధి చెందింది. 1916లో శ్రీమతి నాధిబాయ్ దామోదర్ తేకరస్ మహిళా కేంద్రాన్ని కార్వే స్థాపించాడు. రాష్ట్ర ప్రభుత్వం ఈ సంస్థకు 1951లో యూనివర్సిటీ ప్రతిపత్తిని కల్పించింది. భారతదేశంలో మొట్టమొదటి మహిళా విశ్వవిద్యాలయంగా ఈ ఎస్.ఎన్.డి.టి మహిళా యూని వర్శిటీ ప్రసిద్ధిగాంచింది.

## కాళి

పార్వతి అవతారం. చండ, ముండలను సంహరించడానికి వచ్చిన చండికకు కోపం వచ్చి ఆమె ముఖం



నల్లబడింది. ఆ నల్లని ముఖంతో చేతిలో కత్తి, పులితోలు చీర ధరించి దేవి అవతరించింది. ఆమెనే 'కాళి' అంటారు. ఈమె శుంభ, నిశుంభాది రాక్షసులను సంహరించింది. కలకత్తా, మైసూరు మొదలైన స్థలాలలో నవరాత్రులకు, దసరాకు కాళీపూజలూ, ఉత్సవాలూ పెద్ద ఎత్తునచేస్తారు.దసరాపండగ సమయంలోనే దేవినవరాత్రులు అని 9రోజులు దేవిని పార్వతిదేవి అంశలయిన ఉమ,కాత్యాయిని,గౌరి,ఈశ్వరి,భవాని,దుర్గ,సర్వమంగళ,చాముండి వంటి రూపములలోఅలంకరించి పూజలుజరుపుతారు.

## కాళిదాసు మహాకవి

సంస్కృత భాషలో కవికుల గురువు. ప్రపంచంలోనే అగ్రశ్రేణి కవులలో ఒకడుగా పరిగణించబడుతున్న మహాకవి. క్రీ.శ. ప్రథమ శతాబ్దం వాడని కొందరూ, క్రీ.శ. 4వ శతాబ్దం వాడని మరికొందరూ అంటున్నారు. ఉజ్జయినిలోని విక్రమార్కుని ఆస్థానంలోని వాడని కొన్ని కథలూ, భోజరాజు ఆస్థానంలోనివాడనీ మరికొన్ని కథలూ చెబుతున్నాయి. ఉజ్జయినిలోని విక్రమాదిత్యుని ఆస్థానంలోని నవరత్నాలలో కాళిదాసు ఒకడని చారిత్రకులు భావిస్తున్నారు. కాళిదాసు రచించిన కావ్యాలలో ప్రధానమైనవి: ఋతుసంహారం, రఘువంశం, కుమార సంభవం, మేఘసందేశం. ఆయన వ్రాసిన నాటకాలు: అభిజ్ఞాన శాకుంతలం (చూ.) మాళవికాగ్ని మిత్రం, విక్రమోర్వశీయం.

పురాకవీనాం గణన ప్రసంగే
కనిష్ఠికా ధిష్ఠిత కాళిదాసః
అద్యాపి తత్తుల్య కావే రభావాత్
అనామికా సార్ధ వతీ బభూవ

మన చేతివ్రేళ్ళలో ఉంగరపు వ్రేలును సంస్కృతంలో 'అనామిక' (పేరులేనిది) అంటారు. ఆ వ్రేలు 'అనామిక' అనడానికి కారణం పూర్వం మహాకవులను లెక్కపెడుతూ మొదట 'కాళిదాసు' అని చిటికిన వ్రేలు ముడిచారట. అంత గొప్ప కవి మరి కనిపించక పోవడం వలన ఆ ప్రక్కనున్న ఉంగరపు వ్రేలును ముడవడం కుదరలేదట. అందుచేత ఆ వ్రేలు 'అనామిక' అయింది. భారతీయులు కాళిదాసు మహాకవికి ఇచ్చే గౌరవస్థానాన్ని ఈ శ్లోకం చాటుతుంది.

## కాళేశ్వరం

కరీంనగరము జిల్లాలో గోదావరీ నదీతీరాన ఉన్న ప్రముఖశైవ క్షేత్రం. శిల్ప సంపదకు ఇది ప్రసిద్ధి. కాళేశ్వరం, ద్రాక్షారామ, శ్రీశైలాలలోని మూడు లింగాల మధ్యగల దేశమే 'త్రిలింగ' దేశం అయిందని చారిత్రకులు భావిస్తున్నారు.

## కావేరినది

దక్షిణ భారతదేశంలోని ప్రముఖ నదులలో ఒకటి. కర్ణాటక రాష్ట్రంలోని పడమటి కనుమలలో 'తలకావేరి' అనే చోట ఆవిర్భవించి, ఆగ్నేయదిశగా పయనించి తమిళనాడు రాష్ట్రంలో కావేరినది ప్రవేశిస్తుంది. అంతవరకు అఖండ కావేరిగా ప్రవహించే ఈ నది తిరుచిరాపల్లి సమీపంలో శ్రీరంగం వద్ద పాయలు పాయలుగా విడిపోయి డెల్టా ఏర్పడి, చివరికి బంగాళా ఖాతంలో కలుస్తుంది. కావేరినది పొడవు 560 కి.మీ. కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలకు ప్రధానమయిన పంటనీటి వనరు కావేరీనది. దాదాపు 1800 ఏళ్ళనాడు కరికాల చోళరాజుల పాలనలో (క్రీ.శ. 2వ శతాబ్ది) కొల్లడం (గ్రాండ్ అనకట్ట) అనకట్టను నిర్మించి పంటనీటిని సరఫరా చేసేవారు. గత శతాబ్దిలో ఆర్థర్ కాటన్ ఈ అనకట్టను (1836) పునర్నిర్మించారు. కర్నాటకలో ఎగువను కృష్ణరాజ సాగరు వద్ద దిగువను శివసముద్రం వద్ద డాములు కట్టి, పంటనీటిని సరఫరా చేయడమేగాక జల విద్యుత్తును కూడా ఉత్పత్తి చేస్తున్నారు. షింషానది, భవానీ నది మొదలైనవి కావేరీ నదికి ఉపనదులు. తులా సంక్రమణం సమయంలో తల కావేరీ దగ్గర పెద్ద జాతర జరుగుతుంది. మైసూరుకు దగ్గరలో ఉన్న శ్రీ రంగ పట్టణం చారిత్రక ప్రసిద్ధిగల (టిప్పు సుల్తాన్) వినోద యాత్రాస్థలం. తిరుచిరాపల్లి సమీపంలో కావేరీ నదీ తీరాన శ్రీ రంగం వద్ద శ్రీ రంగనాథుని సన్నిధి ఉంది. అది భారతదేశంలోని ప్రముఖ పుణ్యక్షేత్రాలలో ఒకటి. శివసముద్రం, కుంభకోణం కావేరి నదీతీరాన ఉన్నవి ఇతర పుణ్యక్షేత్రాలు. తమిళనాడులోని సేలం జిల్లాలో మెట్టూరు జలపాతం వద్ద డామును కట్టి, జలవిద్యుత్తును ఉత్పత్తిచేసి అల్యూమినియం పరిశ్రమలకు సరఫరా చేస్తున్నారు. కృష్ణరాజసాగరం వద్ద ఉన్న సుందర ఉద్యానవనం (బృందావనం) వినోద యాత్రికులకు భూతల స్వర్గంగా ప్రసిద్ధిగాంచింది. చూ. కర్నాటకరాష్ట్రం

## కాశీ

చూ. వారణాసి

## కాశ్మీర్

చూ. జమ్మూ & కాశ్మీర్

## కిప్లింగ్, రుడ్‌యార్డ్

భారతదేశంలో పుట్టిపెరిగిన ప్రముఖ ఆంగ్ల రచయిత. 'బాబా బ్లాక్ షీప్', 'రిక్కీ—టిక్కీ—టావీ' (పాము— ముంగిస పోరాటం), ది జంగిల్ బుక్, కిమ్ వంటి కిప్లింగ్ వ్రాసిన బాలసాహిత్య రచనలు విశేష ప్రశస్తిపొందాయి. ఇవిగాక ఇంకా ఎన్నో గ్రంథాలు ఈయన వ్రాశారు. 1907లో నోబెల్ సాహిత్య బహుమతి పొందారు.




## కుంతీదేవి

మహాభారతంలోని ధర్మరాజు, భీముడు, అర్జునులకు తల్లి. యదువంశపు రాజైన శూరసేనుని కుమార్తె. కుంతీ భోజుని పెంపుడు కుమార్తె. శ్రీ కృష్ణుని తండ్రి అయిన వసుదేవుని సోదరి. అందుచేతనే కృష్ణునికి ఆమె మేనత్త. కుంతీదేవి కన్యగా ఉండగా ఒకనాడు దుర్వాస మహర్షి కుంతీభోజుని దర్శించుటకురాగా కుంతి భక్తితో ఆయనకు సపర్యలు చేసింది. ఆమె భక్తికి మెచ్చి దుర్వాసుడు ఆమెకు ఒక మంత్రం ఉపదేశించాడు. ఆ మంత్రం జపించి ఆమె ఏ దేవతను ప్రార్థిస్తే ఆ దేవత వచ్చి ఆమెకు ఒక కుమారుణ్ణి అనుగ్రహిస్తాడు. బాల్యచాపల్యం వల్ల కుంతి ఆ మంత్ర మహిమను పరీక్షించడం కోసం ఆ మంత్రాన్ని జపించి సూర్యుణ్ణి ప్రార్థించగా సూర్యుడు ఆమెకు 'కర్ణుణ్ణి' ప్రసాదించాడు (చూ.కర్ణుడు). కన్య అయిన కుంతి భయపడి ఆ శిశువును ఒక పెట్టెలో పెట్టి గంగానదిలో విడిచింది. ఆ పెట్టె ఒక సూతునికి దొరకగా అతని భార్య రాధ కర్ణుణ్ణి పెంచి పెద్ద చేసింది.

కుంతికి కురువంశరాజైన పాండురాజుతో వివాహం జరిగింది. సంతానం కలుగకుండానే పాండురాజుకు కిందముడనే ఋషి 'భార్యతో సంగమిస్తే వెంటనే చనిపోయేట్టు' శాపం ఇచ్చాడు. అందువల్ల కుంతి భర్త అనుమతితో యమ, వాయు, ఇంద్ర దేవతల నారాధించింది. వారి వలన వరుసగా ఆమెకు ధర్మజ, భీమ, అర్జునులు కలిగారు. ఆమె సపత్ని మాద్రి యందుకూడా సంతానం కలిగేట్టు చేయమని భర్త ఆదేశించగా ఆమె ఆ మంత్రం ఆమెకు ఉపదేశించింది. ఆమె అశ్వనీ దేవతలను అర్థించగా వారి వలన ఆమెకు నకుల, సహదేవులు జన్మించారు. కుంతికి పృథ, పార్ష్ణి అనే రెండు పేర్లు కూడా ఉన్నాయి.

## కుంభమేళ

పూర్వం దేవాసుర సంగ్రామం జరిగింది. దానిలో దేవతల పక్షం బలహీనపడగా బృహస్పతి రాక్షసులు జయం సాధిస్తే అమృతాన్ని ఆస్వాదించి వారు అమరులవుతారనే భయంతో అమృత కలశాన్ని తీసికొని పారిపోసాగాడు. రాక్షసులు ఆయనను వెంబడించారు. గంగా, గోదావరి నదుల ఒడ్డున ఆ అమృత కలశాన్ని లాగుకోవడానికి పెనగులాడినప్పుడు అక్కడ కొన్ని అమృత బిందువులు క్రింద పడ్డాయి. అందుచేత ఈ ప్రదేశాలలో కుంభోత్సవం చేస్తారు. ఆ షమయంలో ఈ నదుల్లో స్నానం చేస్తే అమరత్వం సిద్ధిస్తుందని ఒక నమ్మకం.

భారతదేశంలో ప్రయాగ, హరిద్వార్, ఉజ్జయిని, నాసిక్ ఈ నాలుగు ప్రదేశాలలో ప్రతి 12 సంవత్సరాలకోసారి కుంభమేళా జరుగుతుంది. గురుడు కుంభరాశిలో ఉన్నప్పుడు హరిద్వారంలోనూ, వృషభ రాశిలో ఉన్నప్పుడు ప్రయాగలోనూ, సింహరాశిలో ఉన్నప్పుడు ఉజ్జయినిలోనూ ఈ ఉత్సవం జరుగుతుంది. గోదావరి, కృష్ణా తీర ప్రాంతాలలో ఇది పుష్కరం అనే పేర పిలువబడుతూంది. గురుడు ఒక రాశిని వదిలి మరల ఆ రాశి చేరుకోడానికి 12 సంవత్సరాల కాలం పడుతుంది. ఆరు సంవత్సరాలకు కూడా అర్ధ కుంభోత్సవమని, హరిద్వార, ప్రయాగలలో చేస్తారు. కుంభమేళ సందర్భంలో దేశంలోని పరివ్రాజకు లందరూ ప్రయాగ (అలహాబాదు)లో సమావేశం అవుతారు.

## కుతుబ్ మినార్

ఢిల్లీలో ప్రధానంగా దర్శింపదగిన గొప్ప చారిత్రక నిర్మాణం. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన కుతుబ్ మినార్ అనే ఈ స్తంభం ఎత్తు 69 మీ. (228 అడుగులు). ఈ నిర్మాణం భారతదేశంలోని మినార్ లన్నిటిలోకి ఎత్తైనది. దీనిని కుతుబుద్దీన్ ఐబెక్ నిర్మించి 1189లో పూర్తి చేశాడు. ఆ తర్వాత ఫిరోజ్ షా తుగ్లక్, సికందర్ షా లోడీలు దీనికి మరమ్మత్తులు చేయించారు. స్వతహాగా కుతుబ్ మినార్ కి ఏడు అంతస్తులు ఉండేవట. అయితే ఇప్పుడు అయిదు అంతస్తులు మాత్రమే ఉన్నాయి. ఎర్రని రాతితో కట్టబడిన ఈ కుతుబ్ మినార్ చక్కని శిల్పంతో చాలా ఆకర్షకంగా ఉంటుంది.

19వ శతాబ్దం మొదట్లో వచ్చిన ఒక భూకంపం వల్ల దీని మీది అంతస్తు కొంత దెబ్బతిన్నది. ఈ మినార్ ఉన్నచోట ఒకప్పుడు ఢిల్లీని ఏలిన పృథ్వీరాజ్ కోట ఉండేదని చెబుతారు. ఆ రోజులలో ఈ కోట ఉన్న పట్టణ భాగాన్ని రాయ్‌పిథురా అనే వారు. అయితే మహమ్మదీయుల దాడిలో ఆ కోట ధ్వంసం అయింది. కుతుబ్బుద్దీన్ ఐబెక్ అక్కడ ఉన్న దేవాలయాన్ని పడగొట్టి మసీదు కట్టించాడు. మధ్యలో ఈ మినార్‌ను నిర్మించాడు. ఇప్పటికీ అక్కడ హిందూ శిల్ప చిహ్నాలు కన్పిస్తాయి. కుతుబ్ మినార్ సమీపంలోనే ఇనుప స్తంభం ఒకటుంది.


కుతుబ్ మినార్

దీనిలోని ఉక్కు 99.5 శాతం స్వచ్ఛమైంది. ఇంతటి స్వచ్ఛమైన తుప్పుపట్టని ఉక్కును ఏ విధంగా తయారు చేశారో ఇప్పటికీ శాస్త్రజ్ఞులకు అంతుపట్టడం లేదు.

## కుబ్లాయ్ ఖాన్ 1216–94

చెంఘిజ్ ఖాన్ (చూ.) మనుమడు. 1260లో మంగోల్ సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. బౌద్ధాన్ని స్వీకరించి చీనా సంస్కృతి పట్ల మక్కువ చూపసాగాడు. మత సహనం ప్రదర్శించాడు. కుబ్లాయ్ ఖాన్ ఏలుబడిలో చీనా ప్రగతి సాధించింది. పేదవారికి అన్నవస్త్రాలు సరసమైన ధరలకు లభించేట్లు చేసి ఆయన ప్రజల మన్ననలు పొందాడు. మేధావులను పండితులను పోషిం చాడు. సుప్రసిద్ధ ఇటలీ దేశస్థుడు మార్కోపోలో (చూ.) ఈతని కొలువులో కొన్నాళ్లుండి తన యాత్ర చరిత్రలో కుబ్లయిఖాన్‌ను ప్రశంసించాడు. ప్రసిద్ధ ఇంగ్లీషు కవి కోల రిడ్జ్ కుబ్లయిఖాన్ మీద కవితను అల్లి అందించాడు.

## కుమారిల భట్టు క్రీ.శ. 8వ శతాబ్ది

ప్రముఖ భారతీయ తర్కమీమాంసా శాస్త్రవేత్త. కొన్నాళ్ళు బౌద్ధం అవలంబించి ఆ మత రహస్యాలు తెలుసుకొని మరల హిందూ మతంలోకి వచ్చి, అనేక బౌద్ధుల హత్యకు కారణ భూతుడయాడని ప్రతీతి. ధర్మకీర్తి ఈయనకు బౌద్ధ దీక్ష ఇచ్చాడట. జైమిని వ్రాసిన పూర్వ మీమాంసా సూత్రాల మీద శబరస్వామి రచించిన భాష్యానికి కుమారిలభట్టు విపుల వ్యాఖ్య వ్రాశాడు. ఇది శ్లోకవార్తికం, తంత్ర వార్తికం, టిప్‌టీక అని మూడు భాగాలుగా ఉంది. మధ్వాచార్యులు తన 'ఆప్త మీమాంసపాలం కృతి అనే గ్రంథంలో కుమారిలభట్టు తార్కిక ప్రతిభను ప్రశంసిస్తాడు. కుమారిలభట్టు తెలుగువాడని వాడుక. జీవితం చివరి రోజులలో ఈయన ఒక కన్నును కోల్పోవడాన్ని గురించీ, తిరిగి హిందూ మతం స్వీకరించడాన్ని గురించీ అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. శంకరాచార్యులవారు కుమారిలభట్టును దర్శిం చాలని వెళ్ళగా అప్పటికే బౌద్ధ గురువులకు అన్యాయం చేశాననే పశ్చాత్తాపంతో కుమారిలభట్టు 'తుషాగ్ని' (ఊకతో చేసిన నిప్పు)లో దగ్ధుడు అవుతున్నాడట! శంకరాచార్యులవారి ప్రార్థనను కూడా మన్నించకుండా, తన శిష్యుడైన మండన మిశ్రుని వద్ద పూర్వ మీమాంసా సిద్ధంతాలను గ్రహించవలసిందని ఆయనను ఆదేశించి కుమారిలభట్టు దేహత్యాగం చేశాడట.

## కురళ్ చూ. తిరుక్కురళ్

## కురుక్షేత్రం

మహాభారత కావ్యమున యుద్ధపర్వమున పేర్కొనబడిన సుప్రసిద్ధ ఐతిహాసిక రణరంగము. నేటి హర్యానా రాష్ట్రంలో పానిపట్టు సమీపమున ఉంది. క్రీ.పూ. 900 (?)నాడు కౌరవులకు, పాండవులకు మధ్య హోరాహోరీ పోరాటం జరిగిన సంఘటనను కురుక్షేత్ర సంగ్రామముగా పేర్కొంటారు. అంతకుముందు కొన్నివేల సంవత్సరాల నాడు ఈ ప్రాంతాన్ని రాజధాని స్థావరంగా చేసికొని పాలించిన మహారాజ వంశీయులు కురురాజులు ఈ క్షేత్రాన్ని సాంస్కృతిక, విద్యా, వైజ్ఞానిక కేంద్రంగా తీర్చిదిద్దారు. వ్యాసమహర్షి మహాభారతాది ఇతిహాస పురాణాలను కూర్చింది ఇచ్చటనే. కురుక్షేత్ర సంగ్రామ సమయాన శ్రీకృష్ణుడు తన బావమరిదీ, ప్రియశిష్యుడూ అయిన పార్థుడు (అర్జునుడు), తన ప్రియబంధువులూ, గురువులు ఎంతోమందిని యుద్ధంలో సంహరించవలసి వస్తుందని మొరాయించినప్పుడు, 'గీతోపదేశం (భగవద్గీత)' ద్వారా కర్తవ్యబోధ చేసిందీ ఈ పుణ్యస్థలి (జ్యోతిసార్) వద్దనే అని విజ్ఞుల భావనం. జ్యోతిసార్ సరోవరంలోని జలం పవిత్రమైందనీ అలా సృజనాత్మక శక్తులకు ఆలవాలంగా ఉన్న కురుక్షేత్రంలోనే సుప్రసిద్ధ సంస్కృత వ్యాకరణకర్త పాణిని తన అష్టాధ్యాయిని వ్రాశాడని ప్రసిద్ధి.

ఋగ్వేదం, జాబాలి ఉపనిషత్తు శతపథ బ్రాహ్మణాలూ - కురుక్షేత్ర ప్రాముఖ్యాన్ని, ప్రాశస్త్యాన్ని పేర్కొన్నాయి. గంగా, మందాకినీ, సరస్వతి, వైతరణి, కౌశికి, హిరణ్యవతి, మధుస్రవ, అప్క, ద్రిషద్వతి అను తొమ్మిది పవిత్ర నదులతో కురుక్షేత్రం విరాజిల్లేదని వామన పురాణంలో ఉంది. బ్రహ్మచే సృష్టి నిర్మాణమంతా కురుక్షేత్రంలోనే జరిగిందని అందుచేత ఇది 'బ్రహ్మావర్త'మని ఒక పురాణగాథ ఉంది. ఉత్తరవేది, బ్రహ్మవేది, బహుధాన్యక, ధర్మక్షేత్ర, ల్యాండ్ ఆఫ్ ప్లెంటీ అని కురుక్షేత్రాన్ని పిలిచేవారు. హర్షవర్ధనుడు ఈ ప్రాంతంలోనే స్థాన్‌విష్వర్ (ఇప్పటి థానేశ్వర్) రాజధానిగా సరిపాలన సాగించాడు.

సూర్యగ్రహణ సమయంలో కురుక్షేత్రం పుణ్య క్షేత్రంగా మారి దేశవ్యాప్తంగా పదిలక్షల మందికిపైగా భక్తులను ఆకర్షిస్తుంది. ఆనాడు అచ్చట పవిత్ర నదులలో స్నానాదులు ముగించి పూజలు చేయుట అనూచానంగా వస్తున్న ఆచారం. ఇచ్చట ఉన్న బ్రహ్మ సరోవరం పవిత్ర తటాకమని ప్రసిద్ధి. ఒకేసారి లక్షమంది స్నానం చేయడానికి వీలున్నంత పెద్ద సరోవరం (1318 × 640 మీటర్లు). ఈ బ్రహ్మ సరోవరానికి సమీపంలోనే ఉన్నది'బాన్‌గంగ' భీష్ముడు అంపశయ్యమీద పడుకుని ఉత్తరాయణానికై ఎదురుచూసిందీ, అర్జునుడు తన శరపరంపరతో భూమి నుండి జలాన్ని పుట్టించిందీ, మరణశయ్య మీదఉన్న తాతగారి తాపాన్ని తీర్చిందీ ఇదే అని పురాణాలద్వారా తెలుస్తుంది. 1922లో స్పూనర్ కనుగొన్న థానేశ్వర సమీపమునన్న'అమీన్'లో రాతి నిర్మాణాల ప్రాంతమే భారత యుద్ధ 'చక్రవ్యూహ' స్థలమని చెప్పుతారు.

ఇటీవల కురుక్షేత్ర సమీపమున పొలార్‌లో కుషాణ కాలంనాటి నాణాలు దొరికాయి. 7వ శతాబ్దంనాటి శేషశయన శిల్పం కురుక్షేత్రానికి అతి సమీపంలోనే ఫరీద్‌కోట వద్ద ఒకటి బయటపడింది. సిక్కుల మొదటిగురువు నానక్‌దేవ్ (1469–1538) నివ సించిన పుణ్యస్థలి 'గురుద్వార సిద్దబతి' విశేష ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. రెండవ గురువు అన్నదేవతప్ప మిగతా సిక్కు గురువులు అందరూ సందర్శించారు.

## కులీకుతుబ్ షా 1550–1580

గోల్కొండ రాజ్య సంస్థాపకుడు. బహమనీ సుల్తాన్ అయిన మహమ్మద్ షా 1496లో కులీకుతుబ్ షాను గోల్కొండ గవర్నర్‌గా నియమించాడు.

1513లో మహమ్మద్ షా చనిపోవడంతో కులీ కుతుబ్ షా స్వాతంత్ర్యం ప్రకటించి గోల్కొండ రాజ్యాన్ని



స్వతంత్రంగా పరిపాలింప సాగాడు. ఈయన కాలంలో గోల్కొండ సామ్రాజ్యం తూర్పున మచిలీపట్నంవర కూ దక్షిణాన మద్రాసు వరకూ విస్తరించింది. ఈయ న పరిపాలనఅత్యంత ఆదర్శ ప్రాయంగాసాగింది. ఈయన హిందూ మహమ్మదీయులను సమదృష్టితో చూశాడు. తెలుగుకవులను ఆదరించాడు. తాను స్వయంగా పారసీక భాషలోనే కాకుండా తెలుగులో కూడా కవిత్వం చెప్పాడు. ఈయన పూర్తిపేరు మాలిక్ ఇబ్రహీం కులీ కుతుబ్‌షా.

మాలిక్ ఇబ్రహీం అన్న పేరును మల్కిభరామ్‌గా మార్చి తెలుగు కవులు ఆయనతో ఆత్మీయత పెంచుకున్నారు. ఈయన ఇష్టపత్ని భాగ్‌మతి. ఆమెపేరు మీదుగానే ఆయన భాగ్యనగరం అన్న పట్టణం కట్టడానికి పథకాలు వేశాడు; 1589లో దీనిని నిర్మించారు. ఇదే ఈనాటి ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదు.

ఈయన కాలంలోనే అనేక పారసీక కుటుంబాలు వచ్చి హైదరాబాద్‌లోను, మచిలీపట్నంలోనూ స్థిరపడ్డాయి. 1550లో జన్మించిన కులీకుతుబ్‌షా ప్రజారంజకంగా పరిపాలిస్తూ ఉండగా 1572 అబుల్ హసన్ తానీషా ఆయనను పారద్రోలి, గోల్కొండ సింహాసనాన్ని ఆక్ర మించాడు. కులీకుతుబ్‌షా 1580లో తనువు చాలిం చాడు.

## కువాయిట్

నైరుతి ఆసియాలో పర్షియా సింధుశాఖనాను కుని ఉన్న చిన్న అరబ్బీ రాజ్యం. ఈ ఎడారి దేశం పెట్రో లియం ఉత్పత్తికి ప్రసిద్ధిపొందింది. ప్రపంచ తైలనిక్షేపాలలో నూటికి 10 వంతులు ఈ దేశంలోనే ఉన్నాయి. పెట్రోలియం తైలమే ఈ దేశాభ్యున్నతికి కీలకమైంది. తత్ఫలితంగా సంపన్న దేశాలలో ఈ దేశం ఒకటి అయింది. 1961 వరకు బ్రిటిషువారి అధీనంలో ఉండి ఆ తర్వాత స్వతంత్ర ఎమిరేట్ అయింది. అమీర్ పరిపాలన సాగిస్తూ ఉంటాడు.

విస్తీర్ణం: 17,818 చ.కి.మీ.; జనాభా: 19,38, 000 (1988); రాజధాని: కువాయిట్ సిటీ.సమీపంలో ఉన్న హవాలీ మరో పెద్ద నగరం. అల్ అహ్మదీ తైల పరిశ్రమ కేంద్రం. అధికార భాష: అరబ్బీ.

1930 వరకూ అంతగా జనాభాలేని కువాయిట్‌లో ఆ తర్వాత జనాభా 16 రెట్లు పెరిగింది. భారతదేశం, పాకిస్తాన్, ఇరాన్, అరబ్ దేశాలనుంచి చాలామంది జీవనోపాధి కోసం కువాయిట్ వలస వెళ్లారు.

వేసవిలో ఎండలు మరీ హెచ్చు. కార్యాలయాలన్నీ ఉదయం 7 గంటలకే పని ప్రారంభిస్తాయి.

వయోజనులలో పురుషులు మాత్రమే తమ ప్రతినిధులను ఎన్నుకుంటారు. స్త్రీలకు ఓటు హక్కు లేదు. పోలీసు, రక్షణ శాఖలలో పనిచేసే వారికి కూడా ఈ దేశంలో ఓటు హక్కు లేదు. అమీర్ (చక్రవర్తి) ప్రధానిని నియమిస్తాడు. ప్రధాని మంత్రివర్గాన్ని ఏర్పాటు చేస్తాడు. అందరికీ విద్య ఉచితం. కువాయిట్ యూనివర్సిటీని 1966లో నెలకొల్పారు. చమురు వాయువు, తైలసంబంధమైన సరుకులు తప్ప ఇతర ఆర్థిక సంపదలు లేవు. ఆహార పదార్థాలు, నిత్యావసర వస్తువులు విదేశాల నుంచి దిగుమతి అవుతాయి.

## కూచిపూడి నాట్యం

ఆంధ్రప్రదేశ్‌లోని శాస్త్రీయ నృత్యసంప్రదాయం. భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రమే ఈ సంప్రదాయానికి కూడా మూలం. ఈ సంప్రదాయంలో తాండవం, అభినయాలతోపాటు లాస్యంపాలు కూడా ఎక్కువగా గోచరిస్తుంది. ఈ సంప్రదాయానికి మూల పురుషుడు 15వ శతాబ్దానికి చెందిన సిద్ధేంద్రయోగి. కృష్ణాజిల్లాలోని మొవ్వ సమీపంలో ఉన్న కూచిపూడి గ్రామం— ఈ సంప్రదాయానికి పుట్టినిల్లు. అందుకే ఇది కూచిపూడి నాట్యంగా ప్రసిద్ధి పొందింది.

గోల్కొండ నవాబులు-కుతుబ్‌షాహీల కాలంలో ఈ నాట్యం ఎక్కువగా పోషింపబడి ఉన్నత స్థితిలో ఉండేది. కాలక్రమేణా రాజాదరణ కరువై కళాకారులు ఉదర పోషణకు పగటివేషాలు వేస్తూ ఉండేవారు. దాదాపు ఈ కళ అడుగంటిపోయే స్థితిలో 1960 ప్రాంతంలో విస్సా అప్పారావు, బందా కనకలింగేశ్వరరావు ప్రభృతులు నడుం కట్టుకుని కూచిపూడి నాట్యానికి మళ్లీ జీవం పోసి పునరుద్ధరించారు. ఇప్పుడు ఇది అంతర్జాతీయంగా ప్రసిద్ధి పొందింది. ఒకప్పుడు పురుషులు మాత్రమే ఈ నాట్య సంప్రదాయాన్ని అభ్యసించి ప్రదర్శించే వారు.ఇప్పుడు దీనిని స్త్రీలే ఎక్కువగా అభ్యసించి ప్రదర్శనలిస్తున్నారు. సిద్ధేంద్ర యోగిరచన సంగీతరూపకం భామాకలాపం యక్షగానం, గొల్ల కలాపంతో పాటు రామకథ, ఉషాపరిణయం, ప్రహ్లాద చరిత్ర, హరిశ్చంద్ర కథ వంటి నృత్యనాటికలు కూడా వీరు ప్రదర్శిస్తున్నారు.



ప్రముఖ వాగ్గేయకారులు నారాయణ తీర్థుల తరంగాలను, క్షేత్రయ్య పదాలను కూచిపూడి భాగవతులు మనోహరంగా అభినయిస్తారు.

నేటి ప్రముఖ నాట్యాచార్యులలో వెంపటి చినసత్యం, వేదాంతం సత్యనారాయణ శర్మ, నటరాజ రామకృష్ణ, ఉమా రామారావు, శోభానాయుడు పేర్కొనదగిన వారు. సంప్రదాయ సిద్ధమైన రచనలతోపాటు వీరు కొత్తకొత్త ప్రయోగాలు కూడా చేస్తున్నారు. చండాలిక, పద్మావతీ శ్రీనివాసం, హరవిలాసం, క్షీరసాగరమథనం వంటి నృత్యనాటికలను కొత్తగా తయారు చేసి ప్రదర్శిస్తున్నారు.

## కృపలానీ, జె.బి. 1888–1982

ప్రముఖ భారత స్వాతంత్ర్య సమరయోధుడు. కాంగ్రెస్ అధ్యక్షుడు (1946). గొప్ప దేశభక్తుడు. పూర్తిపేరు జీవన్‌లాల్ భగవాన్ దాస్ కృపలానీ.



తనజీవితంలో ముఖ్యభాగాన్ని కాంగ్రెస్ సేవకే అంకితం చేసినా, ఎట్టి అధికార పదవినీ ఆశించని నిస్వార్థపరుడు కృపలానీ. అతి క్లిష్టమైన సమయంలో 1934 నుంచి 1946వరకూ కాంగ్రెస్ సంస్థ ఆయన ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు.

1951లో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీని నెలకొల్పారు. 1952లో ఈ పార్టీని సోషలిస్ట్ పార్టీతో కలిపి ప్రజా సోషలిస్ట్ పార్టీని ఏర్పాటు చేసి, దానికి ప్రథమ అధ్యక్షులు అయ్యారు. ఆ పార్టీతో పొత్తు కుదరక ఆయన వెలుపలికి వచ్చి అప్పటినుంచి వేరుగానే ఉంటూ వచ్చారు.

కృపలానీని బ్రిటిషు ప్రభుత్వం 9 సార్లు అరెస్టు చేసింది. కృపలానీ అచ్చమైన జాతీయవాది. ఆయన భార్య సుచేతా కృపలానీ కూడా రాజకీయాలలో పాల్గొని ఉత్తర

ప్రదేశ్ ముఖ్యమంత్రి అయింది. 1982, మార్చి 19వ తేదీన తన 94వ ఏట కృపలానీ మరణించారు.

## కృశ్చేవ్, నికితా 1894–1971

ప్రముఖ రష్యన్ రాజనీతివేత్త. సోవియెట్ రష్యాకు ప్రధానమంత్రి (1958–64). కమ్యూనిస్ట్ పార్టీ కార్యకర్త. శాస్త్రవిజ్ఞాన పరిశోధనలకు ప్రాధాన్యం ఇచ్చి రోదసీ పరిశోధనా కార్యక్రమాన్ని ఇతోధికం చేశాడు. కమ్యూనిజం తత్త్వంలోనే కొత్త పోకడలను ప్రవేశపెట్టిన రాజకీయ ధురంధరుడు. నాటి అమెరికా అధ్యక్షుడు కెనెడీ (చూ.)తో సత్సంబంధాలకు కృషి చేసి అంతకుముందున్న పరస్పర ద్వేషాలకు స్వస్తిచెప్పిన శాంతికాముకుడు.

## కృష్ణదేవరాయలు 1489–1530

1323లో కాకతీయ సామ్రాజ్యం అంతరించిన తర్వాత తెలుగుదేశంలో వివిధ రాజ్యాలు ఏర్పడ్డాయి. వాటిలోప్రధానంగా చెప్పుకోవలసింది విజయనగర సామ్రాజ్యం.1336లో తుంగభద్రా నదీతీరంలో విద్యారణ్యస్వామి ఆశీస్సులతో కాకతీయ ప్రతాపరుద్రుని కింద సుబేదారుగా ఉండిన హరిహరరాయలు దీనిని స్థాపించారు. ఈ సామ్రాజ్యకాలంలో ప్రముఖంగా చెప్పుకోవలసిన చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు. తుళువ వంశానికి చెందిన ఈయన 1509 నుంచి 1530 వరకూ పరిపాలించాడు. ఈయన కాలంలో ఆంధ్రదేశం అష్టయిశ్వర్యాలతో తులతూగింది. కళలకూ, సాహిత్యానికీ మంచి ప్రోత్సాహం లభించింది. అష్టదిగ్గజాలనే (చూ.) పేరుగల అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, పింగళి సూరన, రామరాజ భూషణుడు, తెనాలి రామకృష్ణుడు వంటి మహాకవులు ఈయన ఆస్థానంలోనివారే! ఈయన తన రాజధాని అయిన హంపీలో ఎన్నో దేవాలయాలను నిర్మించాడు. వీటిలో ముఖ్యంగా చెప్పుకోవలసింది — విరూపాక్షాలయం.



శ్రీకృష్ణదేవరాయలు జన్మతః కన్నడిగే అయినా 'దేశభాషలందు తెలుగులెస్స' అంటూ తెలుగుని అభిమానించి తెలుగు సాహిత్యాభివృద్ధికి ఎంతగానో దోహదం చేశాడు. ఈయన కవులను పోషించడమే కాకుండా తాను కూడా స్వయంగా గొప్పకవి. ఆముక్తమాల్యద (చూ.)అన్న గొప్ప కావ్యాన్ని ఈయన వ్రాశారు.

శ్రీకృష్ణదేవరాయల సామ్రాజ్యంలో మొత్తం దక్షిణ భారతదేశం అంతా చేరి ఉండడమే కాకుండా ఉత్తరాన మహానది వరకు ఆ సామ్రాజ్యం విస్తరించింది. ఈయన పాలనను గురించి న్యూనిజ్, ప్యాజ్ వంటి పోర్చుగీస్ యాత్రా చారిత్రుకులు ఘనంగా కీర్తించారు.

## కృష్ణశాస్త్రి, దేవులపల్లి వేంకట

తెలుగులో భావకవిత్వోద్యమానికి మూల స్తంభం. పిఠాపురం సమీపంలోగల చంద్రంపాలెంలో 1897 నవంబరు 15న కృష్ణశాస్త్రి జన్మించాడు. తండ్రి తమ్మన శాస్త్రి (వెంకట కృష్ణశాస్త్రి–1856–1912). పెద తండ్రి సుబ్బరాయశాస్త్రి (1853–1909). వారిరువురూ పిఠాపురం ఆస్థానకవులు. 'దేవులపల్లి సోదర కవులు'గా సుప్రసిద్ధులు.

కృష్ణశాస్త్రి కాకినాడ పి.ఆర్.కళాశాలలో పట్టభద్రుడై, ఆ కళాశాలలోనే కొంతకాలం తెలుగు ట్యూటర్‌గా పనిచేశారు. శాంతినికేతనం, విశ్వభారతి సందర్శించి రవీంద్రుణ్ణి గురువుగా స్వీకరించారు. ఆయన కృతులలో 'కృష్ణపక్షం', 'ఊర్వశి ప్రవాసము' ప్రధానమైనవి. మహావక్తగా, తెలుగు చలన చిత్రాలలో లలిత గీతాలు వ్రాసిన మధురకవిగా కృష్ణశాస్త్రి సుప్రసిద్ధులు. కొన్నాళ్ళు ఆయన హైదరాబాద్ రేడియో కేంద్రంలో కార్యక్రమ ప్రయోక్తగా కూడా పనిచేశారు.

'కళాప్రపూర్ణ', 'పద్మభూషణ' ఇత్యాది బిరుద విరాజితుడు, కేంద్రసాహిత్య అకాడెమీ అవార్డు గ్రహీత అయిన కృష్ణశాస్త్రి సహస్ర చంద్రదర్శన శాంతి జరిగిన కొద్ది రోజులకు 1980 ఫిబ్రవరి 24న భౌతికయాత్ర చాలించారు.



# కృష్ణా జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాల్లో ఒకటి. 15° 43′ & 17° 10′ ఉ. అక్షాంశలు, 80° & 81° 33′ తూర్పు రేఖాంశాలు మధ్య ఈ జిల్లా ఉంది. విస్తీర్ణం: 8,734 చ.కి.మీ. జనాభా: 30,41,949 (1981), జిల్లా కేంద్రం చిలకలపూడి (మచిలీపట్నం).

ప్రాచీన కాలంలో బౌద్ధం విరివిగా వ్యాపించిన ప్రాంతం ఇది. కృష్ణానది ఒడ్డున జగ్గయ్యపేట, ఘంటసాల మున్నగు చాలా స్థలాల్లో బౌద్ధ ఆరామాలు, చైత్యాలు, నిక్షేపాలు లభించాయి.




క్రీ.శ. 4వ శతాబ్ది తరువాత ఈ ప్రాంతం పల్లవుల ఆధిపత్యంలోకి వచ్చింది. ఆ తరువాత శాలంకాయనులు, విష్ణుకుండినులు ఈ ప్రాంతాన్ని పాలించారు. క్రీ.శ. 7వ శతాబ్ది మొదలు 11వ శతాబ్ది వరకు ఈ ప్రాంతం తూర్పు చాళుక్యుల పాలనలో ఉంది. పిమ్మట వెలనాటి చోళుల కైవసమై 13వ శతాబ్ది నాటికి కాకతీయ పాలన క్రిందికి వచ్చింది. కొండవీటి రెడ్లు (1328–1424) పాలన తర్వాత ఓఢ్రగజపతులు కూడా కొంతకాలం ఈ ప్రాంతాన్ని పాలించారు. శ్రీకృష్ణదేవరాయలు 1515లో ఈ ప్రాంతాన్ని చేజిక్కించుకున్నారు. పిదప కొంతకాలం గోల్కొండ నవాబుల పాలనలో ఉంది. నిజాం ఏలుబడి (17వ శతా.)లో ఉన్నప్పుడే ఇంగ్లీషు వారు మచిలీపట్నం లో ఒక ఫ్యాక్టరీ నిర్మించి (1671) ఒక స్థావరం ఏర్పరచుకోగలిగారు. ఈ ప్రాంతాన్ని మొదట నిజాం నుంచి ఫ్రెంచ్ వారు తీసికొన్నారు. చివరకు 1765 నాటికి ఇది ఈస్టిండియా కంపెనీ పాలన క్రిందికి వచ్చింది. అప్పటి నుంచి 1947 వరకూ బ్రిటిషు పాలనలో ఉంది. పాలనా సౌలభ్యం కోసం జిల్లా సరిహద్దులు అప్పుడప్పుడు ప్రక్క జిల్లాలతో సర్దుబాట్లు చేయవలసి వచ్చింది.

రాష్ట్రంలో అత్యంత సారవంతమైన ప్రాంతంగా ఈజిల్లా పరిగణించబడుతుంది.కృష్ణానది(చూ.)ఈ జిల్లా కుపశ్చిమసరిహద్దుగా ప్రవహించి సాగరసంగమం వద్దపెద్ద డెల్టాగా ఏర్పడి పల్లపు పంటలు బాగా పండుతున్నాయి. ఈ జిల్లా తరచు గాలివానలకు, అతివృష్టికి, వరదలకు గురికావడం కద్దు. 1–11–1864లోనూ, మళ్లీ సుమారు వందేళ్లకు 19–11–1977లోనూ కృష్ణా జిల్లాలో సముద్రతీర వాసులు పెనుఉప్పెనకు గురి అయ్యారు. భారీ ప్రాణ నష్టం, పంటనష్టం జరిగాయి.

రాష్ట్రంలో ఆర్థిక ప్రగతి సాధించిన జిల్లాలలో ఈ జిల్లా అగ్రస్థానంలో ఉంది. వరి, చెరకు, అపరాలు విరివిగా పండుతాయి. సేద్యంలో కొమ్ములు తిరిగిన రైతాంగం ఈ జిల్లాలోనే ఉంది. పాడిపరిశ్రమ కూడా ఇక్కడ అధికం. శ్వేతవిప్లవం కారణంగా పాలశీతలీకరణ కేంద్రాలు చాలా చోట్ల ఉన్నాయి. కృష్ణానది మీద 1855లోనే విజయవాడ (అప్పటి బెజవాడ) వద్ద ఆనకట్ట నిర్మించారు. కృష్ణానది మీద ఆ పక్కనే 1956లో ప్రకాశం బారేజ్ కట్టారు. ఇందువల్ల సాగునేల ఆయకట్టు పెరగడమే గాక ప్రతి ఏడాదీ రెండు పంటలు పండించడానికి వీలవుతుంది. సముద్రమట్టం కంటే దిగువగా ఉండే కొల్లేరు సరస్సు ఈ జిల్లాలో ఉంది. ఈ ప్రాంతం నీలివిప్లవాని (చేపల పెంపకం)కి గురి అయ్యింది. ఇంకా చక్కటి నీటివనరులు గల ఈ జిల్లాలో చక్కని కాలువల వ్యవస్థ ఉంది. పడవ ప్రయాణీకులకూ సరకుల రవాణాకూ కూడా వీలుగా కాలువల మీద లాకుల వ్యవస్థ ఉంది. జిల్లా ఆర్థిక సంపదలో కాకిరాయి (ఇనుము) జగ్గయ్యపేటలోనూ, క్రోమైట్ కొండపల్లి వద్ద దొరుకుతాయి. మంగళగిరిలో సున్నపురాయి లభిస్తుంది. ప్రసిద్ధికెక్కిన 'పిట్టు' వజ్రం పరిటాల గనిలో లభించినట్టు తెలియ వస్తూంది.

జిల్లా ప్రధాన నగరం: విజయవాడ. ఇది పెద్ద రైల్వే జంక్షన్. ప్రతిరోజూ 500 బస్సులు విజయవాడ బస్ స్టేషన్‌కు వస్తాయి. జాతీయ రహదారి రద్దీవలన లారీ రవాణా వాణిజ్యం కూడా ఎక్కువే.

సిమెంటు, పంచదార, శాస్త్రీయ పరికరాలు, గిల్టు బంగారు ఆభరణాల తయారీ, ఔషధాలు, పచ్చళ్లు, ఐస్‌క్రీమ్, డబ్బాలలో పండ్ల నిల్వ ఈ జిల్లాలోని ప్రధాన పరిశ్రమలు. బందరు కలంకారీ, కొండపల్లి బొమ్మలు ప్రసిద్ధిగాంచిన హస్తకళలు.

విజయవాడలోని కనకదుర్గ గుడి, చిలకలపూడి పాండు రంగ దేవాలయం, ఒకప్పుడు శ్రీకృష్ణదేవరాయలు దర్శించిన శ్రీకాకుళం ఆంధ్ర మహావిష్ణు దేవాలయం ప్రధాన పుణ్యక్షేత్రాలు. విజయవాడలో ప్రకాశం బారేజ్, గాంధీకొండ, ప్లానెటేరియం ముఖ్యంగా చూడదగినవి. శాస్త్రీయ నాట్యసంప్రదాయ కేంద్రం కూచిపూడి (చూ) ఈ జిల్లాలోనే ఉంది.

## కృష్ణానది

భారత దేశంలోని ప్రధాన నదులలో ఒకటి. దక్షిణ భారతదేశంలో పడమటి కనుమలలో సముద్ర మట్టానికి 1230 మీ. ఎత్తున మహబలేశ్వరం వద్ద పుట్టి, దక్షిణంగా మహారాష్ట్రలో కొంత దూరం ప్రవహించి, భీమా ఉపనదిని కలుపుకుని తూర్పుగా ప్రవహించి కర్నాటక రాష్ట్రం ద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఈ నది ప్రవేశిస్తూంది. పిదప తుంగభద్ర, మూసీ ఉపనదులు చేరగా, నల్లమలై అడవులలో ఒక సన్నని లోయ ద్వారా ప్రవహించి, కొండలూ, మిట్టలూ దాటుకుంటూ వచ్చి విజయవాడ వద్ద తీరమైదానం చేరుకుంటూంది ఇక్కడ కృష్ణా డెల్టా ఏర్పడి మరో 64 కి.మీ. ప్రవహించి పులిగడ్డపాయ వేరవుతూంది. ఇక్కడే దివిసీమ లంక ఏర్పడుతూంది. ఇంకొక 24 కి.మీ. ప్రవహించి మూడు పాయలుగా విడిపోయి బంగాళా ఖాతంలో కలుస్తూంది. కృష్ణానదీ పరీవాహ ప్రాంతం 2,51,000 చ.కి.మీ. అతివృష్టిసమయంలోవర్షపునీటికి ఈనది జలనిర్గమన సాధనం అవుతూంది. మొత్తం కృష్ణానదిపొడవు 1220 కి.మీ.

కృష్ణానది పొడవునా అనేక పుణ్యక్షేత్రాలు వెలిశాయి. 2,000 ఏళ్ళ క్రిందట శాతవాహనులు, ఇక్ష్వాకుల పాలనలో నాగార్జున కొండ వద్ద బౌద్ధారామాలు, హిందువుల దేవాలయాలు నిర్మించబడ్డాయి. అలంపురం వద్ద శ్రీశైలం వద్ద శైవ క్షేత్రాలు అవతరించాయి. విజయవాడ వద్ద ఉన్న కనకదుర్గగుడి అశేష భక్త జనాన్నీ ఆకర్షిస్తూంది. కృష్ణానది మీద విజయవాడ వద్ద ప్రకాశం బరాజ్, శ్రీశైలం వద్ద విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే డాము, విజయపురి వద్ద నాగార్జున సాగర డాము కట్టి కృష్ణా, గుంటూరు, ప్రకాశం, రాయలసీమ జిల్లాలకు పంటనీటిని అందిస్తున్నారు. రాయలసీమలో కర్నూలు, కడప కాలువకు కూడా కృష్ణానది జలాలే ఆధారం. కృష్ణాజిల్లాలో కాలువ లకు లాకులు ఏర్పాటు చేయడం వల్ల పడవ రవాణా సౌకర్యం కూడా చక్కగా ఏర్పడింది. తెలుగుగంగ ప్రణాళిక ప్రస్తుతం నిర్మాణంలో ఉంది (1990).

## కృష్ణారావు, ముట్నూరి

చూ. ముట్నూరి కృష్ణారావు

## కె—2 పర్వత శిఖరం

ఉత్తర కాశ్మీరులో కారకోరం పర్వత శ్రేణిలోని పర్వతశిఖరం. దీనిఎత్తు 8,616 మీ. (25,838') ప్రపంచ శిఖరాల్లో ఎత్తయిన వాటిలో ఇది రెండవది. దీనిని గాడ్విన్ ఆస్టిన్‌శిఖరమనికూడ అంటారు. (చూ. ఎవరెస్ట్ శిఖరం.). దేశియో 1954లో ఆరోహించాడు.

## కెనడా

ఉత్తర అమెరికా ఖండంలోని ఒక ప్రముఖరాజ్యం. సోవియెట్ రష్యా తర్వాత చెప్పుకోదగిన పెద్ద దేశం కెనడా. యునైటెడ్ స్టేట్స్‌కి ఉత్తరాన ఆర్కిటిక్ వలయాన్ని ఆను



కొని ఈ దేశం ఉంది. ఒకప్పుడు అమెరికన్ ఇండియన్‌లూ, ఎస్కిమో జాతులూ మాత్రమే ఇక్కడ నివసిస్తూ ఉండేవారు. ఫ్రాన్స్, బ్రిటన్‌ల నుండి వలస వెళ్లినవారి సంఖ్య ఇప్పుడు ఎక్కువ. అసలు కెనడా పేరు ఇరోకీ. అమెరికన్ ఇండియన్ భాషలోని 'కనటా' అనే పదం నుండి కెనడా వచ్చింది. 'కనటా' అంటే గుడిసెల సముదాయం. 17వ శతాబ్ది నుంచి ఫ్రెంచ్‌వారు రావడం ప్రారంభించి క్విబెక్ ప్రాంతంలో వలసలు నిర్మించుకున్నారు. ఆ రోజులలో ఈ దేశాన్ని 'న్యూఫ్రాన్స్' అనేవారు. తరువాత బ్రిటిషువారు వలస వచ్చి న్యూఫౌండ్‌లాండ్, నోవాస్కోషియా ప్రాంతాలలో నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. 1763లో ఫ్రాన్స్ నుంచి ఈ దేశం బ్రిటిషువారి హస్తగతమైంది. అప్పటి నుంచి బ్రిటిషువారి ఆధీనంలోనే ఉండి, లార్డ్ దరహమ్ నాయకత్వంలో 1867లో అధినివేశ ప్రతిపత్తిని సాధించింది. అప్పుడు బ్రిటిష్ ప్రధాని జాన్ మెక్డొనాల్డ్. ఇప్పటికీ బ్రిటిషు అధినివేశంగానే కెనడా కొనసాగుతుంది.

రాజ్యాంగం ప్రకారం ఇప్పటికీ బ్రిటిషు రాణీయే కెనడాకు గవర్నర్ — జనరల్‌ను నియమిస్తుంది.

విస్తీర్ణం: 99,76,139 చ.కి.మీ.; జనాభా: 2,58,08,000 (1980), రాజధాని: ఒట్టావా. ఇతర ప్రముఖ పట్టణాలు — టొరంటో, మాంట్రియల్, వాంకోవర్.

అధికార భాష: ఇంగ్లీష్, ఫ్రెంచ్. ఎస్కిమోలు, ఇతర ఆదిమజాతులు తమతమ భాషలు మాట్లాడతారు. కెనడా అభివృద్ధి పొందిన దేశంగానే పరిగణింపబడుతుంది. దేశం పెద్దది. జనసంఖ్య తక్కువ. దేశ ఆర్థిక వనరులు ఎక్కువ. వ్యవసాయోత్పత్తులు ఎగుమతి అవుతూ ఉంటాయి. వాటిలో గోధుమ, బార్లీ, ఆవాలు, రైధాన్యం, ఓట్‌ధాన్యం, రేప్‌సీడ్, ఉల్లి, బంగాళదుంప, పీచ్‌పండు, ఆపిల్‌పండు, ద్రాక్ష, సోయాచిక్కుడు, స్ట్రాబెర్రీ, ఆపిల్ ఉత్పత్తులు, బీట్ పంచదార, పొగాకు, టొమోటో, కారెట్ ముఖ్యమైనవి. పాడిపరిశ్రమ, కోళ్ల పరిశ్రమ ఎక్కువ. మత్స్యపరిశ్రమలో గండుమీను, హెర్రింగ్, పెద్దరొయ్య (లాబ్స్టర్), పెర్చ్, హాలిబట్, ఫ్లౌండర్, సాల్మన్, సార్క్‌ఫిష్, వైట్‌ఫిష్, రెడ్‌ఫిష్, పికిరెల్, స్కేలప్స్, సొరే మొదలైన చేపల జాతులు పట్టి డబ్బాలలో నిల్వచేసి ఎగుమతి చేస్తారు. పందుల పెంపకం, తేనెటీగల పెంపకం రైతులు చేపట్టే ఇతరవ్యాపకాలు. అటవీ సంపదలో కలప, కలపగుజ్జు భారీస్థాయిలో ఉత్పత్తి అవుతాయి. బీవర్, నక్క, మింక్, మస్క్‌రేట్‌ల బొచ్చుతో దుస్తులు తయారుచేసి విదేశాలకు పంపుతారు. ఖనిజసంపదలో చెప్పుకోదగ్గవి — ఆస్బెస్టాస్, రాగి, ఇనుపరాయి, సీసం, నికెల్, జింకు, ఇసుక — గ్రావెల్, చమురు వాయువు, పెట్రోలియం నిక్షేపాలు. దేశం పారిశ్రామికాభ్యుదయం సాధించింది. రసాయనిక ద్రవ్యాలు, యంత్రసామగ్రి, ధాతుపరిశ్రమ, విద్యుత్, కలపసామగ్రి, అనేక రకాల కాగితాల తయారీ, పుస్తక ముద్రణ, రవాణా వాహనాలు, ఆహార పదార్థాలనూ పానీయాలనూ డబ్బాలలో నిల్వచేసి ఎగుమతి చేయడం ముఖ్యమైన పరిశ్రమలు. ప్రపంచ ప్రఖ్యాతమయిన నయాగరా జలపాతం వినోద యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తూ ఉంటుంది.

# కెనడీ, జాన్ ఫిడ్జెరాల్డ్

హత్యకు గురి అయిన అమెరికా (యునైటెడ్ స్టేట్స్) దేశపు 35వ అధ్యక్షుడు. గొప్ప శాంతి కాముకుడు. కెనడీ హార్వర్డు యూనివర్సిటీ పట్టభద్రుడు. రెండవ ప్రపంచ యుద్ధంలో నౌకాదళంలో చేరాడు.



పసిఫిక్ రంగంలో పనిచేస్తూ వుండగా 1943లో తన టార్పెడోనౌక జపాన్‌వాడికి గురిఅయి, తునాతునకలయినప్పుడు తనతోటిసిబ్బందిని సురక్షిత ప్రాంతానికి తరలించి ప్రశంసలు అందుకొన్నాడు. 1946లో రాజకీయాలలో ప్రవేశించి డెమాక్రాట్‌గా కాంగ్రెస్ సభ్యుడై (1946, 1948, 1950), 1952లో సెనేటరు అయ్యాడు. 1960లో అమెరికన్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయ్యాడు. క్రుశ్చేవ్ (సోవియట్ రష్యా)తో చెలిమి నెరపి రెండు దేశాల మధ్య సత్సంబంధాలు నెలకొల్పడానికి ప్రయత్నించాడు. క్యూబా క్షిపణి ఉపద్రవాన్ని పరిష్కరించడంలో రాజనీతిజ్ఞతను

ప్రదర్శించి చాకచక్యంతో వ్యవహరించాడు. నీగ్రోల పౌర హక్కుల సమస్యను పరిష్కరించడానికి ఒక వినూత్న రాజకీయ వైఖరిని రూపొందించి కాంగ్రెసుకు సమర్పించాడు. దురదృష్టవశాత్తు 1963 నవంబరు 22న డల్లాస్ నగరంలో హంతకుల తుపాకీ గుండ్లకు గురియై మరణించాడు. 'ప్రొఫైల్స్ ఇన్ కరేజ్' అనే ఈయన వ్రాసిన గ్రంథం ఈయన రాజకీయ పరిణతికి అద్దం పడుతూంది.

## కెన్యా

ఆఫ్రికా ఖండంలో తూర్పున హిందూ మహాసముద్రాన్ని ఆనుకుని భూమధ్యరేఖ మీద ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యం. 1963లో స్వాతంత్ర్యం పొంద డానికి ముందు బ్రిటిష్ వలస రాజ్యంగా ఉండేది.

విస్తీర్ణం: 5,82,646 చ.కి.మీ., జనాభా: 2,29, 19,000 (1988); రాజధాని: నైరోబీ; అధికారభాష: స్వాహిలీ, ఇంగ్లీషు. ప్రజలు కెన్యా ఆదిమ జాతులలోని కికూయూ, లూహ్, లూమో, కంబా, కాలెంజన్, తెగలకు చెందినవారు. క్రైస్తవులు ఎక్కువ, వారు 73 శాతం ఉన్నారు. ఆదిమ మతాలను అనుసరించేవారు 18 శాతం, ముస్లిములు 6 శాతం. మొంబాసా ప్రధాన రేవు పట్టణం. కిసుమూ, నాకూరూ మచాకోస్ ఇతర ప్రధాన పట్టణాలు.




అతినది, టానానది, న్జిరోనది, టుక్వాతీవ్‌నది పెద్దవి. రుడాల్ఫ్ సరస్సు కూడా పెద్దది. మాగదే సరస్సు, విక్టోరియా సరస్సు ఇతరజలాధారాలు. కోస్తాతీరప్రాంతం సారవంతమయింది. ఆ భూములలో జీడిమామిడి, కొబ్బరితోటలుఉన్నాయి.

కెన్యా వ్యవసాయ ప్రధానమయిన దేశం. కాఫీ, తేయాకు, సిసాల్‌నార, వాటిల్ బెరడు, పైరెత్రమ్, కర్రపెండలం, మొక్కజొన్న, ప్రత్తి, గోధుమ, వరి, చెరకు పండుతాయి. పాడి పరిశ్రమ, పశువుల పెంపకం ఇతర జీవనోపాధులు. రాగి, సోడాయాష్, ఉప్పు, సున్నపురాయి ఖనిజ నిక్షేపాలు. అడవుల నుండి కలప లభిస్తుంది. సిమెంటు, చర్మాలు, తోళ్ళు, వాటిల్ ఎక్స్‌ట్రాక్ట్, పెట్రోలియం ప్రధాన పరిశ్రమలు. అభయారణ్యాలలో ఉన్న ఏనుగులు, జీబ్రా, గాజిల్‌వంటి వన్యప్రాణి సంపద విదేశీ వినోద పర్యాటకులను ఆకర్షిస్తూంది.

## కేదారినాథ్

భారతదేశంలోని సుప్రసిద్ధ శైవ క్షేత్రాలలో ఇది ఒకటి. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఇది 9వది. హిమాలయ పర్వతాలలో సముద్రమట్టానికి 350 మీ. (1151′) ఎత్తున ఈ క్షేత్రం ఉంది. ఏడాదిలో ఎక్కువ కాలం ఇది మంచుతో కప్పబడి ఉంటుంది. కొద్దినెలలు మాత్రమే యాత్రికులు సందర్శించుకోడానికి వీలవుతుంది. ఈ క్షేత్రంలోని స్వయం భూలింగ 8 × 4 × 4 మీటరుల పరిమాణంగల ఒక శిలమీద నిలిచి ఉంది. ఈ క్షేత్రంలో రాత్రిపూట తగినంత ప్రాణవాయువు లభించక పోవడం వల్ల యాత్రికులు 'రాంబారా చట్టీ' లో మకాం చేసి. ఉదయమే కేదారనాథ్ వెళ్లి స్వామిని దర్శించుకుని రాత్రికి మళ్లీ రాంబారా చట్టీకి చేరుకుంటారు.

పంచ కేదార తీర్థాలలో కేదారనాథ్ క్షేత్రం ఒకటి. తక్కినవి: మధ్య మహేశ్వరీ, తుంగనాథ్, రుద్రనాథ్, కపిలేశ్వర్ క్షేత్రాలు. కేదారనాథ్‌లో కూడా ఒక ఉష్ణకుండం ఉంది.

## కేప్‌వర్డే

అట్లాంటిక్ మహాసముద్రంలో ఆఫ్రికాకు పశ్చిమాన ఉన్న కేప్‌వర్డ్ ఒకప్పుడు పోర్చుగీసు వలస రాజ్యం. 1975 లో స్వాతంత్ర్యం సాధించుకుంది. దీనిలో 10 పెద్ద దీవులు, 5 చిన్న దీవులు ఉన్నాయి. భూమి నిస్సారమయింది. ఆహార దినుసులు పూర్తిగా దిగుమతి చేసుకోవలసిందే!

విస్తీర్ణం: 4,033 చ.కి.మీ; జనాభా: 3,59,000 (1988); రాజధాని: ప్రాయా; అధికార భాష: పోర్చుగీసు. ప్రజలలో సంకర తెగలకు చెందిన వారు ఎక్కువ. నీగ్రో జాతులు 28 శాతం, తెల్లవారు 1 శాతం మాత్రమే! అందరూ క్రైస్తవ మతాన్నే అనుసరిస్తున్నారు. అధిక శాతం రోమన్ కేథలిక్కులు.

కాఫీ, వేరుసెనగ పండించి ఎగుమతి చేస్తారు. చేపలు, ఉప్పు, కూడా ఎగుమతి అవుతున్నాయి. కొబ్బరి, చెరకు, మొక్కజొన్న, చిరుగడం, అరటి ఇతర వ్యవసాయో త్పత్తులు.

## కేరళ రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. దక్షిణ భారతదేశంలో నైరృతి దిశను, అరేబియా సముద్ర తీరాన్ని ఆనుకొని ఈ రాష్ట్రం ఉంది. తూర్పున కర్నాటక, తమిళనాడులోని పడమటి కనుమలు ఈ రాష్ట్రానికి సరిహద్దుగా ఉన్నాయి. ఈ రాష్ట్రంలో జనసాంద్రత చాలా ఎక్కువ.




కేరళలో పడవల పోటీ

దీని విస్తీర్ణం: 38,863 చ.కి.మీ.; జనాభా: 2,54,53,680 (1981); రాజధాని: తిరువనంతపురం (త్రివేంద్రము); అధికార భాష: మలయాళం. ఇతర ప్రధాన పట్టణాలు: క్విలాన్, కొట్టాయం, ఎర్నాకుళం, పాలఘాట్, త్రిచూర్, కోజికోడు, కొచ్చి

పడమటి కనుమల సగటు ఎత్తు 900 మీ. 1800 మీ. ఎత్తు వరకు ఉండే పర్వత శిఖరాలు కూడా అక్కడక్కడ కనిపిస్తాయి. ఈ ఎత్తయిన కొండనేలల్లోనే తేయాకు, కాఫీ, రబ్బరు, ఏలకులు, ఇతర సుగంధ ద్రవ్యాలు వంటి తోట పంటలసాగు విరివిగా జరుగుతూంది. చూ. పడమటికనుమలు; తిరువనంతపురం.

ఒక మాదిరి ఎత్తయిన కొండ నేలల్లోనూ, పల్లపు నేలల్లోనూ, లోయల్లోనూ అరటి, అల్లం, మిరియం, చెరకు, కర్ర పెండలం, పోక, జీడి మామిడి, కొబ్బరి తోటలు కానవస్తాయి. పల్లపు నేలలో వరి, కాయగూరలు పండుతాయి. అయినా తిండిగింజలు ముఖ్యంగా బియ్యం, ఇతర రాష్ట్రాల నుంచి దిగుమతి చేసుకోవలసి వస్తూంది. కేరళలో ఉప్పుటేరులు ఎక్కువ. వీటిని ఆధారంగా చేసుకుని మత్స్య పరిశ్రమ, కొబ్బరి పీచు పరిశ్రమ పెంపొందాయి. 44 చిన్న చిన్న ఏరులు, వాగులు ఉప్పుటేర్లు కేరళ అంతటా అల్లుకుపోయి ఉన్నాయి. ఇవి పడవ రవాణాకు అనుకూలంగా ఉన్నాయి. భారత స్వాతంత్ర్యానికి (1947) పూర్వం ఈ ప్రాంతం తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాధీశుల ఏలుబడిలో ఉండేది. 1949లో ఆ సంస్థానాలు భారతదేశంలో విలీనమైనప్పుడు ఈ రాష్ట్రం ఏర్పడింది. భాషాప్రయుక్త రాష్ట్రాలు రూపుదిద్దుకున్న (1956) సమయంలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్న మలబారు జిల్లాకూడా కేరళ రాష్ట్రంలో అంతర్భాగమైంది. భారతదేశంలో అక్షరాస్యత (69.1 శాతం 1981)ఎక్కువగల రాష్ట్రం. ముఖ్యంగా స్త్రీ విద్యావంతుల సంఖ్య అధికం. ఈ రాష్ట్రం ఆర్థిక వ్యవస్థ సామాన్యమైంది. తిండిగింజల కొరత 50 శాతం వరకూ ఉంది. భారత దేశంలో పండే రబ్బరు పంటలో 92 శాతం ఈ రాష్ట్రంలోనే పండుతూంది. అలాగే ఏలకులు 70 శాతం కేరళలో పండుతాయి. కొబ్బరి పంట కూడ చాలా ఎక్కువ. పోక 60 శాతం, మిరియం 70 శాతం, కర్ర పెండలం 80 శాతం ఇక్కడ పండుతున్నాయి. ఇక భారత దేశంలో పండే నిమ్మగడ్డి అంతా ఈ రాష్ట్రంనుంచే వస్తూంది. కోవలన్ బీచ్, పద్మనాభ పురం రాజప్రాసాదం, పెరియార్ అభయారణ్యం, తెక్కాడి అభయారణ్యం, శంకరాచార్యుల జన్మస్థలం అయిన కాలడి ఈ రాష్ట్రంలో ప్రధానంగా చూడదగినవి. గురువాయూర్ క్షేత్రం (శ్రీ కృష్ణ దేవాలయం), కథకళి కేంద్రం కళామండలం, వైనాడ్‌లోని ఎదక్కాల్ గుహ, కొచ్చిన్, కాలికట్ పట్టణాలు కూడా కేరళలో పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. రాష్ట్ర రాజధాని తిరువనంతపురంలోని అనంతపద్మనాభ స్వామి సన్నిధి పుణ్యక్షేత్రం.

## కోటే డీ ఐవరీ

చూ. ఐవరీకోస్ట్

# కొమర్రాజు వెంకటలక్ష్మణరావు

చూ. లక్ష్మణరావు కొమర్రాజు

## కొమోరోస్

ఆఫ్రికా ఖండానికి మడగాస్కర్‌కు మధ్యనున్న మొజాంబిక్ ఛానల్‌కు ఉత్తరాన ఉన్న ద్వీపరాజ్యం ఒకప్పుడు ఫ్రెంచి వలసరాజ్యంగ ఉండేది. అరబ్బీలో దీనిని జమ్హూరియాత్–అల్–కుమూర్ అల్–ఇత్తిహాదియాహ్ అల్–ఇస్లామియాహ్ అనిపేరు. ఈ రాజ్యంలో నాలుగు ప్రధానమైన దీవులు ఉన్నాయి. గ్రాండ్ కొమోరో, అన్జవుల్, మాయొట్టే, మోహేవీ. ఇవిగాక చిన్న దీవులు, పగడపు దీవులు ఉన్నాయి. గ్రాండ్ కొమోరోస్‌లోని కార్తాలా పర్వత శిఖరం 2361 మీటర్ల ఎత్తుగల అగ్నిపర్వతం జ్వలిస్తూనే ఉంటుంది. మిగతా దీవులు అరణ్యమయం.

విస్తీర్ణం: 1862 చ.కి.మీ., జనాభా: 4,33,000 (1988), రాజధాని: మోరోనీ, అధికార భాషలు: అరబ్బీ, ఫ్రెంచి. ప్రజలు బంటూ, అరబ్బీ, మలగాసీ తెగలకు చెందినవారు. యూరోపియన్ సంస్కృతి కానవస్తుంది. ప్రజలలో 99శాతం సున్నీ ముస్లిము సంప్రదాయాన్ని పాటిస్తారు.

కర్ర పెండలం, కొబ్బరి, అరటి, చిరుగడం, వరి, మొక్కజొన్న, అపరాలు, లవంగాలు, వనిల్లా, ఎలాంగ్, ఎలాంగ్ పరిమళ ద్రవ్యం ప్రధానమయిన పంట దినుసులు. మత్స్య పరిశ్రమ, పశుపోషణ ప్రజలకు జీవనాధారం.

## కొరియా

ఉత్తరకొరియా, ద.కొరియా అని రెండు ప్రత్యేక రాజ్యాలతో కూడిన తూర్పు ఆసియా దేశం. జపాన్‌కు పశ్చిమాన ఉన్న ఈ దేశంలో ఉత్తర కొరియా కమ్యూనిస్టుల పాలనలోనూ, దక్షిణ కొరియా ప్రజాస్వామ్య రాజ్యంగానూ ఉన్నాయి.

కొరియాకు అతిప్రాచీన చరిత్ర ఉంది. 30 వేల ఏళ్ల నాటి నాగరకత ఉన్నట్టు తెలుస్తోంది. కొంతకాలం అంటే క్రీ.పూ. ఈ ప్రాంతం చీనా, జపాన్ దేశాల ఏలుబడిలో ఉండేది. 1945లో రెండో ప్రపంచ సంగ్రామం ముగిసే సమయానికి ఇది జపాన్ ఆధీనంలోకి వచ్చింది. 1948లో 38వ అక్షాంశం సరిహద్దుగా దక్షిణ కొరియా, ఉత్తర కొరియాలుగా విభజింపబడింది. 1950లో కొరియా యుద్ధం ఆరంభమైంది. 1953లో యుద్ధం ముగిసి శాంతియుత పరిస్థితులు ఏర్పడ్డాయి. 1972లో రెండు కొరియాలూ కలిసి సమిష్టిగ శాంతియుత సహజీవనం కొనసాగించడానికి ఒక ఒప్పందం చేసుకున్నాయి.

ఉత్తర కొరియా: దాదాపు 790 కి.మీ. నిడివిగల పెద్ద 'యాలూ' నది ప్రవహిస్తున్న దేశం. విస్తీర్ణం: 1,21,400 చ.కి.మీ.; జనాభా: 2,19,03,000 (1988), రాజధాని: ప్యాంగ్ యాంగ్, అధికార భాష: కొరియన్. పేర్కొనదగిన వ్యవసాయపు పంటలు: బార్లీ, మొక్కజొన్న, చిరుధాన్యాలు, వరి, గోధుమ; ఖనిజ సంపద: గ్రాఫైట్, మెగ్నీషియం, టంగ్‌స్టన్. తీర ప్రాంతంలో మత్స్య సంపద పుష్కలంగా ఉంది. ఇనుము – ఉక్కు, రాసాయనిక ద్రవ్యాలు, యంత్రసామగ్రి, జవుళీ ప్రధాన పరిశ్రమలు.

దక్షిణ కొరియా: జపాన్‌తో పోటీపడి అభివృద్ధి సాధించిన ఈ ప్రజాస్వామిక రాజ్యాన్ని తైహాన్ మిన్కుక్ అని కొరియన్ భాషలో అంటారు. విస్తీర్ణం: 99,173 చ.కి.మీ., జనాభా: 4,25,93,000 (1988). రాజధాని: సియోల్; అధికార భాష: కొరియన్.

వ్యవసాయోత్పత్తులు: బార్లీ, గోధుమ, వరి, బంగాళాదుంప, చిక్కుడు. మత్స్యసంపదలో ఆంబోనీ, హెర్రింగ్ చేప, రొయ్యలు ప్రధానమైనవి. ఆంత్రసైట్, ఫ్లోరైట్ గ్రాఫైట్, ఇనుపఖనిజం, ఉప్పు, టంగ్‌స్టన్ ఖనిజాలు దొరుకుతాయి. రాసాయనిక ద్రవ్యాలు ఎలక్ట్రానిక్ పరికరాలు, యంత్రసామగ్రి, ఆహార పదార్థాలు, జవుళీ, ముఖ్యపరిశ్రమలు. నేడు పారిశ్రామికాభ్యుదయంలో జపాన్‌తో పోటీపడి జీవితావసర వస్తువుల్ని భారీ రాసుల్లో తయారు చేసి విదేశాలకు ఎగుమతి చేసి విదేశీ ద్రవ్యాన్ని ఆర్జిస్తోంది.



## కొలంబస్, క్రిస్టొఫర్



అమెరికా ఖండాన్ని కనుగొన్న సుప్రసిద్ధ ఇటాలియన్ నావికుడు. క్రిస్టొఫర్ కొలంబస్ స్పెయిన్ ప్రభుత్వపుకొలువులో పనిచేసేవాడు. 1492లో ఇజబెల్లారాణినిఒప్పించిమూడు నౌకలకుఅధిపత్యం వహించిఅన్వేషణలకై పశ్చిమానికి పోయిమొదటక్యూబా, బహామా వంటి వెస్టిండీస్ దీవుల ఉనికిని కనుగొని స్వదేశం తిరిగి వచ్చాడు. రెండవసారి 1495లో వెళ్లి ఎలాంటి ఫలితం లేకుండా తిరిగి వచ్చాడు. ఇక మూడవసారి 1498–1500 సంవత్సరాలలో దక్షిణ అమెరికాను, నాలుగోసారి (1502–04) మధ్య అమెరికాను కనుగొన్నాడు. స్పెయిన్ రాణి భారతదేశానికి నూతన సముద్రమార్గం కనుగొనడానికి పంపగా కొలంబస్ అమెరికా ఖండపు ఉనికిని కనుగొన్నాడు.

## కొలంబియా

దక్షిణ అమెరికాలో వాయవ్యంగా ఉన్న స్వతంత్ర గణరాజ్యం. ఒకప్పుడు స్పెయిన్ ఆధిపత్యంలో ఉన్న కొలంబియా 1886లో స్వతంత్రమై స్వంత రాజ్యంగాన్ని సిద్ధపరచుకుంది.

విస్తీర్ణం: 11,41,748 చ.కి.మీ., జనాభా: 3,06, 61,000 (1988); రాజధాని: బొగోటా; అధికార భాష: స్పెనిష్. ప్రజలు మెస్టిజోలు 58 శాతం. ప్రధానంగా క్రైస్తవులు.

మాగ్దలీనానది ప్రధానమయిన జలాధారం. ఆత్రాతో నది, కేక్వేటానది, కేకానది, మేతానది ఇతర నీటి




వనరులు. అరటిపండ్లు, కోకో, కాఫీ, కర్రపెండలం, (స్పెనిష్ భాషలో 'మెనిమెక్' అంటారు). ప్రత్తి, పొగాకు, గోధుమ, వరి, బంగాళ దుంపలు, చెరకు, మొక్కజొన్న ప్రధానమయిన సాగుపంటలు. ఉత్తరాన పెట్రోలు నిక్షేపాలు భూమి అడుగున మడుగులుగా ఉన్నాయి. బంగారం, వెండి, ప్లాటినమ్, నేలబొగ్గు, ఇనుపరాయి, సున్నపురాయి ఈ దేశంలో లభించే ఖనిజ సంపద. మూజో, చివోర్ నగరాల సమీపంలో ఉన్న గనులలో విలువయిన మరకతా (ఎమరాల్డ్)లు దొరుకుతాయి. నికెల్, నేలబొగ్గు ఖనిజాలు, చమురు వాయువు, పుష్కలంగా ఉన్నాయి. సిమెంటు, తోలు పరిశ్రమ, ఆహార పానీయాలు, ఉక్కు, పంచదార, జవుళీ, పొగాకు ప్రధానమయిన పరిశ్రమలు. కాఫీ, మరకతాలు, ప్లాటినమ్ కూడా విశేషంగా ఎగుమతి అవుతున్నాయి.

## కోణార్క్

సుప్రసిద్ధమైన ప్రాచీన సూర్యదేవాలయం. ఒరిస్సాలో భువనేశ్వర్‌కు 60 కిలోమీటర్ల దూరంలో సముద్ర



కోణార్క్ - సూర్యదేవాలయ శిల్పం

తీరాన నల్లరాతితో చెక్కి ఈ దేవాలయాన్ని రూపొందించారు. నరసింహదేవుని (1238–64) కాలంలో ఈ దేవాలయ నిర్మాణం ఒక భారీ పథకంతో ఆరంభమైంది. కాని, ఆ పథకం ప్రకారం నిర్మాణం పూర్తికాలేదు.

గర్భగుడి, దాని ముందరి సభామండపం మాత్రమే

ప్రస్తుతం అక్కడ మనకు కనిపిస్తాయి. సూర్యుని రథం 24 చక్రాలు కలిగి, ఏడు గుర్రాలచేత లాగబడుతున్నట్లు మలచబడింది. దీని శిల్పసంపద వలన ఆకర్షితులై దేశదేశాల నుంచి యాత్రికులువచ్చి నేటికీ ఈ ఆలయాన్ని సందర్శిస్తున్నారు.

## కోనసీమ

గోదావరి పాయలైన గౌతమీ, వశిష్ట నదుల మధ్య భాగం. ఇది తూర్పు గోదావరి జిల్లా (చూ.)లో ఉంది. గోదావరి డెల్టా కావడంవల్ల ఇది సారవంతమైన నేల. కొబ్బరి తోటల పెంపకం ఎక్కువ. అమలాపురం, అంబాజీపేట ముఖ్య మైన కొబ్బరి వ్యాపార కేంద్రాలు. పేరూరు, వాడపల్లి, పొడగట్లపల్లి, నరేంద్రపురం, ముంగండ వేదపండితుల నిలయాలుగాను, సంస్కృతా ధ్యయన కేంద్రాలు గానూ ప్రసిద్ధిపొందాయి. ధవళేశ్వరం, కాటన్ బరాజ్ నుంచి బయలుదేరిన తూర్పు డెల్టా కాలువ గన్నవరం వద్ద గోదావరి నదిమీద నిర్మితమైన ఆక్విడక్టు ద్వారా కోన సీమకు పంటనీరు అందిస్తూంది. రాజోలు, కొత్తపేట, ముమ్మిడివరం, ఉప్పలగుప్తం ఇతర ప్రధాన మైన పట్టణాలు. రాజోలు, తాటిపాక, సఖినేటిపల్లి ప్రాంతాల్లో చమురువాయువు, తైలనిక్షేపాలు బయట పడ్డాయి. అంతర్వేదిలో లక్ష్మీనరసింహస్వామి క్షేత్రం, అప్పన పల్లిలో శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధి ముఖ్యంగా దర్శించదగ్గవి.



## కోస్టారికా

మధ్య అమెరికాలోని ఒక చిన్న స్వతంత్ర గణరాజ్యం. దీనికి ఉత్తరాన నికరాగ్వా, దక్షిణాన పనామా దేశం ఉన్నాయి. మూడు శతాబ్దాలపాటు స్పెయిన్ వలస రాజ్యంగా ఉంది. 1821లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకుంది.

విస్తీర్ణం: 51,100 చ.కి.మీ., జనాభా: 26,72, 000; రాజధాని: శాన్ జోన్స్; అధికార భాష: స్పేనిష్, ఇంగ్లీషు కూడా మాట్లాడుతారు. ప్రజలు అధికశాతం స్పెయిన్ నుంచి వచ్చినవారి సంతతి; క్రైస్తవ మతస్థులు. రెడ్ ఇండియన్‌లతో సంకరమయిన యూరోపియన్ ప్రజ లను 'మెస్టిజో'లు అంటారు. రెవాన్టా, జోన్‌నది, శాన్ జోన్‌నది, శానాపిక్వీనది, కగూనా డా ఆరెవల్ సరస్సు ప్రధానమయిన సాగునీటి వనరులు. కోకో, కాఫీ, అరటిపండ్లు ఈ దేశంలో అధికంగా పండిస్తున్నారు. అబాకా, హెంప్‌నార, రబ్బరు, ప్రత్తి, చెరకు ఇతర వాణిజ్యపు పంటలు. వరి, మొక్కజొన్న దేశావసరాలకు సరిపోయే ప్రమాణంలో పండిస్తున్నారు. పశువుల పెంపకం కూడా దేశ ఆర్థిక వ్యవస్థకు దోహదం చేస్తూంది. బంగారం, ఉప్పు ఇక్కడ లభించే ప్రముఖ ఖనిజ నిక్షేపాలు.

## కోస్తా ప్రాంతం

ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రధాన విభాగాలలో ఒకటి. మిగతావి తెలంగాణా, రాయలసీమ. 1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడే వరకూ ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఇది అంతర్భాగంగా ఉండేది. 1947లో భారత స్వాతంత్ర్యం రావడానికి ముందు బ్రిటిషు ఇండియాలోని మద్రాసు ప్రెసిడెన్సీలో ఉండేది. కోస్తా ప్రాంతంలో 9 జిల్లాలు ఉన్నాయి. అవి: శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలు. ఈ తొమ్మిది జిల్లాలూ 1000 కి.మీ నిడివిగల బంగాళాఖాత తీరాన్ని ఆనుకొని ఉన్నాయి. అందుకే ఈ ప్రాంతాన్ని కోస్తా ప్రాంతం అంటారు. గోదావరి, కృష్ణా, పెన్నానదుల సాగరసంగమ స్థానాల్లో ఉన్న ఈ ప్రాంతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అంతటిలోను మిక్కిలి సారవంతమైంది. వరి, చెరకు, పొగాకు పంటలకు ప్రసిద్ధి గాంచినది.

## కోహినూరు వజ్రం

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన భారతీయ వజ్రం. దీని పూర్వ చరిత్ర అస్పష్టంగా ఉంది. ఒకప్పుడిది కొన్ని వందల ఏళ్లపాటు మాళవదేశపు రాజుల దగ్గర ఉండేదట.

1304లో అల్లాఉద్దీన్ ఖిల్జీ మాళవదేశాన్ని జయించినప్పుడు ఆయన దీనిని ఢిల్లీకి తీసికొనిపోయాడు. 1526లో ఈ వజ్రం గ్వాలియరు మహారాజు స్వాధీనమైంది. మళ్లీ అది ఢిల్లీకి ఎప్పుడు చేరిందీ తెలియదు. 1739లో నాదిర్ షా ఢిల్లీని కొల్లగొట్టినపుడు కోహినూరు వజ్రం ఆయనకు చేజిక్కింది. 1850లో డల్‌హౌసీ ప్రభువు లాహోర్‌ను జయించినపుడు ఈ వజ్రం బ్రిటిష్ వారి వశమైంది. ఇప్పటికీ బ్రిటిష్ రాజుల ఆభరణాలలో ఒకటిగా ఇది ఉన్నట్లు తెలుస్తూంది.

కోహినూరు వజ్రం ఆంధ్రదేశంలోని సత్తెనపల్లి తాలూకా కోళ్లూరులో దొరికినట్లు 'బాల్' అనే భూగర్భ శాస్త్రజ్ఞుడు నిరూపించాడు. మొదట దీని తూకం $737\frac{1}{3}$ కారెట్లు ఉండేదని సానబెట్టిన తరువాత 280 కారెట్లకు తగ్గిందని తెలుస్తూంది.

## కౌటిల్యుడు

చూ. చాణక్యుడు.

## కౌరవులు

కురువంశపు రాజులు కౌరవులు. నిజానికి కురువంశంలో జన్మించిన రాజులందరికీ ఈ పదం వర్తించవలసి ఉండగా, భారతంలో దుర్యోధనాదులైన ధృతరాష్ట్రుని నూరుగురు కుమారులకే ఈ మాట రూఢిగా వాడుకచేయబడింది. కౌరవ, పాండవు(చూ.)ల మధ్య జరిగిన యుద్ధమే భారత కురుక్షేత్ర(చూ.) సంగ్రామంగా ప్రసిద్ధి పొందింది.

## క్యూబా

ఉత్తర అమెరికాకు ఆగ్నేయ దిశలోఉన్న వెస్ట్ ఇండీస్ దీవులలోని ఒక సుందర ద్వీప సముదాయం. దీనిలో క్యూబాకాక చిన్న, పెద్ద దీవులు 1600 దాకా ఉన్నాయి. 400 ఏళ్లు స్పెయిన్ ఆధీనంలో ఉండి తరువాత 1898లో అమెరికన్‌ల ఆసరాతో స్వాతంత్ర్య




పోరాటం జరిపింది. 1902 వరకూ అమెరికన్ సైనిక ప్రభుత్వం ఏర్పడింది. 1930 ప్రాంతంలో మళ్లీ బాటిస్టా అనే నియంతపాలనకులోనై, 1959లో ఫిడెల్ కాస్ట్రో నాయకత్వంలో విప్లవం చెలరేగి సోషలిస్ట్ ప్రభుత్వం ఏర్పడింది. కాస్ట్రో ప్రధాని అయ్యాడు. దేశంలోఉన్న ఒకే ఒక రాజకీయపక్షం క్యూబా కమ్యూనిస్ట్ పార్టీ. అలీన దేశాల ప్రముఖ నాయకులలో ఒకడు కాస్ట్రో! విస్తీర్ణం: 1,10, 861 చ.కి.మీ. జనాభా: 1,04,21,000 (1988), రాజధాని: హవానా, అధికార భాష: స్పేనిష్.

## క్రిప్స్

చూ. క్విట్ ఇండియా

## క్రిస్టమస్ పండుగ

ప్రపంచంలోని క్రైస్తవులందరికీ పెద్ద పండుగ. ఏసుక్రీస్తు (చూ.)జన్మించిన రోజు. మొట్టమొదట ఈ పండుగ ఎప్పుడు ఆరంభించిందీ ఎవరికీ తెలియదు. క్రీ.శ. 400 ప్రాంతంలో క్లిమెంట్ ఆఫ్ అలెగ్జాండ్రియా మొదటిసారి ఈ పండుగను గూర్చి ప్రస్తావించాడు. 354లో రోమ్ బిషప్ లైబీరియస్ డిసెంబరు 25న ఈ పండుగ జరుపుకోవాలని ఆదేశించాడు. మొట్టమొదటి క్రైస్తవ రాజ్యం స్థాపించుకున్న ఆర్మీనియన్లు జనవరి 6న ఆరంభించి మూడురోజులపాటు ఈ పండుగను జరుపుకుంటారు. 'ఆస్ట్రియన్'లు, బెల్జియన్‌లు మొదలైన చాలా దేశాలవారికి డిసెంబర్ 6నే సుదీర్ఘమైన క్రిస్టమస్ పండుగ (లాంగ్ క్రిస్టమస్) ఆరంభమవుతుంది. క్రొత్త దుస్తులు ధరించి ఇంటింట ఉత్సవాలతో, వేడుకలతో పరస్పరం ఇచ్చుకునే బహుమతులతో క్రైస్తవులు ప్రపంచం అంతటా ఈ పండుగను వైభవంగా జరుపుకుంటున్నారు. (చూ. క్రైస్తవమతం).

## క్రైస్తవ మతం

ఏసుక్రీస్తు (చూ.) తాను ఎన్నుకున్న ద్వాదశ శిష్యబృందానికి చేసిన బోధనలు ఆధారంగా వెలసిన మతం. పశ్చిమార్ధ గోళంలోని దేశాలలో సుమారు వందకోట్ల మంది ఈ మతాన్ని అవలంబించేవారున్నారు. దాదాపు 2,000 ఏళ్ల నుండి ఈ మత ప్రభావం ప్రభుత్వాలపైన, సృజనాత్మక కళలపైన, మేధావుల ఆలోచనల పైన పడుతూవచ్చింది. సర్వమానవ సౌభ్రా

తృత్వం, కరుణ, ప్రేమ వంటి ఉదాత్త భావాలు ఈ మతానికి ప్రాతిపదికలు. ఈ మతానికి పవిత్ర గ్రంథం బైబిల్ (చూ.) క్రిస్టమస్ (చూ.) వారి ముఖ్యమయిన పర్వదినం.

ఆంధ్ర ప్రదేశ్‌లోని మెదక్ పట్టణంలోవున్న వెస్లియన్ చర్చ్ మిక్కిలి పెద్దది. రోమ్‌నగరంలోని సెంట్ పీటర్స్ చర్చ్ జగత్ప్రసిద్ధి గాంచింది. రోమన్ కేథలిక్కులకు రోమ్‌నగరంలోని 'పోప్ పీఠాధిపతి. క్రైస్తవులు బైబిల్‌లోని న్యూటెస్ట్‌మెంట్ అనుసరిస్తారు. ప్రాటస్టెంట్, బాప్టిస్ట్, పెంటెకోస్ట్, ఆర్థడాక్స్ చర్చ్, సెవెన్త్ డే ఎడ్వెన్టిటిస్ట్ చర్చ్ మొదలైనవి క్రైస్తవంలో ఉన్న ప్రధానమైన శాఖలు.

## క్లియోపాత్రా క్రీ.పూ. 69–30

ఈజిప్ట్ సామ్రాజ్యాన్ని పాలించిన (క్రీ.పూ. 51–31) మహారాణి. 300 ఏళ్ళు ఈజిప్ట్‌ను పాలించిన టాలెమీ రాజవంశీయులలో చివరివ్యక్తి. అందకత్తె కాకపోయినా తెలివి, చమత్కారం, రాజకీయజ్ఞత, ఉన్నతాశయాలు ఆమె సొత్తు. నాటి రోమన్ చక్రవర్తులనెంతమందినో ఆకర్షించి ఆమె లోబరుచుకుంది. క్రీ.పూ. 51లో 10 ఏళ్ళ తమ్ముడు 12వ టాలెమీతో పాటు సంయుక్తంగా సింహాసన మధిష్ఠించి, క్రీ.పూ. 49లో టాలెమీ సంరక్షకులచే పదవీభ్రష్టురాలు చేయబడింది. పాంపే దండయాత్ర ముగించుకుని, క్రీ.పూ. 48లో జూలియస్ సీజర్ ఆలెగ్జాండ్రియా దర్శించినపుడు క్లియోపాత్రా రహస్యంగా అతణ్ణి కలుసుకుంది. సీజర్ ఆమెను మోహించాడు. టాలెమీని ఓడించి 13వ టాలెమీతో సంయుక్తంగా మళ్ళీ ఆమె గద్దె ఎక్కింది. తరువాత క్రీ.పూ. 46లో రోమ్ నగరానికి వెళ్ళి సీజర్ మరణ పర్యంతం (క్రీ.పూ. 44) ఆయనతో పట్టమహిషిగా కాపురం చేసింది. ఈజిప్ట్‌కు తిరిగివచ్చి తన సోదరుణ్ణి సంహరించి తన కుమారుడు (సీజరు వలన కలిగినవాడు) 'సీజేరియన్'ను 14వ టాలెమీగా ప్రకటించి అతనితో పాటు సంయుక్తంగా రాజ్యపాలన తిరిగి ప్రారంభించింది. క్రీ.పూ. 41లో ఫిలిప్పీ దండయాత్రతో టార్కస్ వచ్చిన (ఆసియా మైనర్) మార్క్ ఆంటోనీని కలుసుకోవడం తటస్థించింది. అప్పుడు క్లియోపాత్రా గ్రీస్ కామదేవత 'అఫ్రోడైట్' వలె సింగారించుకొని ఉండడంతో ఆంటోనీ ఆమె పట్ల మోహితుడై తన భార్య ఆక్టేవియాను వదలిపెట్టి క్రీ.పూ. 37లో ఆమెను వివాహమాడాడు. అయితే ఆ వివాహం ఆక్టేవియస్‌లతో పోరాటానికి కారణం (క్రీ.పూ. 31) అయింది. చివరకు క్లియోపాత్రా పాముచేత కరిపించుకొని ఆత్మహత్య చేసుకుంది (క్రీ.పూ. 30). క్లియోపాత్రా రసవత్తర గాథను రోమన్ కవులు హేరేస్, వర్జిల్ తమ కావ్యాలలో వర్ణించారు. షేక్స్పియర్ (ఆంటోనీ అండ్ క్లియో పాత్రా), బెర్నార్డ్ షా (సీజర్ అండ్ క్లియోపాత్రా) కూడా ఈమె కథను నాటకాలుగా వ్రాశారు.

## క్లైవ్, రాబర్ట్ 1725–1774

భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యానికి గట్టి పునాదులు వేసిన బ్రిటిష్ యోధుడు. ఆదిలో మద్రాసులోని ఈస్టిండియా కంపెనీలో గుమస్తాగా చేరాడు (1744). ఫ్రెంచ్‌వారు ఫోర్ట్‌సెంట్ జార్జ్‌ని కైవసం చేసుకొన్నప్పుడు 1746లో క్లైవ్ వారికి బందీగా చిక్కాడు. అయితే నిర్బంధంలో నుంచి ఎలాగో తప్పించుకొని, 1747లో ఈస్ట్ ఇండియా కంపెనీవారి సైన్యంలో చేరాడు. తంజావూరు దాడిలో తన అసమాన సైనిక పాటవాన్ని ప్రదర్శించి కెప్టెన్ హోదా సంపాదించాడు. 1751లో ఆర్కాటు ముట్టడిలో క్లైవ్ ఎత్తుగడ ఫలించింది.



బెంగాల్ పాలకుడు సిరజ్–ఉద్–దౌలా కలకత్తాను ముట్టడిస్తున్న సమయానికి క్లైవ్‌వెళ్లి ప్లాసీయుద్ధంలో 1757లో అతనిని ఓడించి బెంగాల్ గవర్నరు అయ్యాడు. 1760లో బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడై, 1764లో తిరిగి బెంగాల్ గవర్నరుగా నియమితుడయ్యాడు. ఈతని అకుంఠిత దీక్షవల్ల, బ్రిటిషు ఈస్టిండియా కంపెనీ భారత దేశంలో తన రాజకీయ ప్రాబల్యాన్ని నిలద్రొక్కుకుని సుస్థిరత్వాన్ని సాధించగలిగింది.

## క్విట్ ఇండియా ఉద్యమం

భారత స్వాతంత్ర్యోద్యమంలో ఒక ప్రధానమయిన ఘట్టం ఈ క్విట్ ఇండియా ఉద్యమం. జాతిపిత మహాత్మాగాంధీ బ్రిటిష్‌వారికి (ఇండియా వదిలి వెళ్ళిపొండి) 'క్విట్ ఇండియా' అనే పిలుపును ఇచ్చారు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ, 1942 ఆగస్టు 8వ తేదీన బొంబాయిలో సమావేశమై 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని ఆమోదించింది. తత్ఫలితంగా ఆ మరునాడు ఆగస్టు 9న దేశవ్యాప్తంగా ఉద్యమం ప్రజ్వరిల్లింది. దేశంలో నలుమూలలా కాంగ్రెస్ నాయకులను ప్రభుత్వం బంధించింది. నాయకుల అరెస్టుల వలన ప్రజలు దిగ్భ్రాంతి చెంది, కోపోద్రిక్తులయ్యారు. ప్రతి పౌరుడూ ఒక స్వాతంత్ర్య సమర వీరుడుగా రూపొందాడు. ప్రజలలో తిరుగుబాటు ధోరణి వ్యక్తం అయింది. ప్రజాజీవితం స్తంభించిపోయింది. దేశ వ్యాప్తంగా ప్రతి నగరంలోనూ, ప్రతి పట్టణంలోనూ పూర్తి బంద్‌లు, హర్తాళ్‌లు జరిగాయి. ప్రతి చోటా ప్రదర్శనలూ, ఊరేగింపులూ జరిగాయి. ''సామ్రాజ్యవాదం నశించాలి'' ''విప్లవం వర్థిల్లాలి'' వంటి నినాదాలు సర్వత్రా మిన్నుముట్టాయి. బ్రిటిష్ ప్రభుత్వం ఇలా జరుగుతుందని ఊహించలేదు. ప్రజలు శాంతియుతంగానే ఉద్యమం సాగించారు. హింసకు దిగలేదు. ముఖ్యంగా విద్యార్థులు, కార్మికులు, రైతులు ఈ ఉద్యమాన్ని నిర్వహించారు. తెలుగు దేశంలో తెనాలి రైలు స్టేషన్ దగ్ధమయింది. టెలిగ్రాఫ్, టెలిఫోన్ తీగలు ధ్వంసం అయ్యాయి. ఢిల్లీ నగరంలో ఆగస్టు 11, 12 తారీకులలో 47సార్లు పోలీసులు కాల్పులు జరుపవలసి వచ్చింది. అరుణా అసఫ్ అలీ, జయప్రకాశ్ నారాయణ్, రామ మనోహర్ లోహియా వంటి నాయకులు అజ్ఞాతవాసంలోకి పోయి ఉద్యమాన్ని కొనసాగించారు. ఈ ఉద్యమం ఒక్క బ్రిటిష్ ఇండియాలోనేగాక స్వదేశ సంస్థానాలకు కూడా ప్రాకింది. గాంధీజీని ఆగాఖాన్ భవనంలో నిర్బంధించారు. ఆయనతో జైలులో ఉన్న కస్తూర్బా జైలులోనే మరణించింది. అయితే ప్రజలు నిరాయుధులు కావడం వల్ల విప్లవం వీగిపోయింది. విప్లవకారులను 60 వేల మందిని కారాగారాలలో నిర్బంధించారు. ఒకదేశ ప్రజ తమ స్వాతంత్ర్యంకోసం ఎంతమేరకు కష్టాలు, బాధలు అనుభవించగలరో, ఎన్ని త్యాగాలు చేయగలరో 'క్విట్ ఇండియా' ఉద్యమం వల్ల ప్రపంచానికి వెల్లడి అయింది. భారతదేశ స్వాతంత్రోద్యమంలో ఈ ఉద్యమమే తుది పోరాటం. ఈ ఉద్యమం ఫలితంగానే 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.



క్విట్ ఇండియా ఉద్యమం

## క్షీరసాగర మథనం

ఒకప్పుడు దానవులు (రాక్షసులు) విజృంభించి దేవతలను నానా యాతనలకూ గురిచేశారు. దేవతలు



బ్రహ్మతో సహా విష్ణుమూర్తి వద్దకు పోయి ప్రార్థించగా ఆయన **దైత్యులతో** మంచిగా ఉండి, వారి సాయంతో మందర పర్వతాన్ని తెచ్చి క్షీరసాగరాన్ని మథించండని వారిని ఉద్బోధించాడు. దేవతలు ప్రార్థించగా మందర పర్వతం కవ్వంగా ఉండటానికి, వాసుకి కవ్వపు త్రాడుగా ఉండటానికి అంగీకరించాయి. రాక్షసులు వాసుకిని తలవైపున పట్టుకోగా, దేవతలు తోకవైపున పట్టుకొని క్షీరసాగరాన్ని మథించబోగా, మంధర పర్వతం సముద్రంలో క్రుంగి మునిగిపోసాగింది. అప్పుడు విష్ణుమూర్తి కూర్మావతారం (తాబేలురూపు) ధరించి ఆ పర్వతం అడుగున చేరి అది క్రుంగిపోకుండా చేశాడు. క్షీరసాగర మథనం ఫలితంగా మొదట హాలాహలం పుట్టగా దేవతల ప్రార్థనపై శివుడు దానిని తన కంఠంలో ధరించాడు. తరువాత క్షీరసాగరం నుంచి వరుసగా లక్ష్మి, అమృతం, చంద్రుడు,

కల్పవృక్షం (చూ.), ఐరావతం (దేవతల ఏనుగు తెల్లనిది) **ఉచ్చైశ్రవం** (దేవతల గుర్రం—తెల్లనిది) మొదలైనవి ఉద్భవించాయి. చివరికి అమృత కలశంతో ధన్వంతరి ఆవిర్భవించాడు. దానవుల చేతికి చిక్కిన అమృతాన్ని దేవతలకు ఇప్పించడానికి విష్ణుమూర్తి మోహినీ అవతారం ధరించాడు.

## క్షేత్రయ్య 1590–1675

సుప్రసిద్ధ వాగ్గేయకారుడు, శృంగార పదకర్త. క్షేత్రయ్య తన పదాలలో సంగీత సాహిత్యాలకే కాక అభినయానికి కూడా సమానమైన ప్రాధాన్యం ఇచ్చారు.



ఇటీవలి వరకూ దేవదాసీల కంఠాలలోనూ, అభినయం లోనూ ప్రాచుర్యం వహించిన క్షేత్రయ్య పదాలు ఆంధ్ర రసికులను విశేషంగా అలరిస్తూ వచ్చాయి. క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య. అనేక పుణ్యక్షేత్రాల సందర్శనంవల్ల వరదయ్య క్షేత్రయ్య అయ్యాడు. క్షేత్రయ్య నివాసం కృష్ణాజిల్లాలో కూచిపూడి సమీపంలో ఉన్న మొవ్వ. మొవ్వలో వెలసిన మువ్వ గోపాలస్వామిపై భక్తితో శృంగార రసభావాలతో రచించిన పదాలే మువ్వ గోపాల పదాలు.

చిన్నతనంలో క్షేత్రయ్య గొడ్లకాపరిగా ఉంటూ అల్లరి చిల్లరిగా తిరుగుతూ ఒక యోగివల్ల గోపాల మంత్రోపదేశం పొందాడనీ తర్వాత సంస్కృతాంధ్ర భాషలలోనూ, సంగీతాభినయాలంకార శాస్త్రాలలోనూ పాండిత్యం సంపాదించాడని ఐతిహ్యం. తంజావూరు నాయకరాజుల ఆస్థానాన్ని క్షేత్రయ్య దర్శించి వారిచే సన్మానాలు పొందాడు. విజయ రాఘవ నాయకుడు క్షేత్రయ్యను ఘనంగా సత్కరించాడు. గోలకొండ పాదుషాను దర్శించి అక్కడ పోటీపడి 40 రోజులలో 1500 పదాలుచెప్పి పాదుషా సత్కారానికి పాత్రుడయ్యాడు. ఆంధ్రదేశంలోనే కాక దక్షిణ దేశ మంతా తిరిగాడు. సందర్శించిన ప్రతి దేవుడి మీదా ఆ దేవుడి ఉపముద్రతోనూ మువ్వగోపాల ప్రధాన ముద్ర తోనూ పదరచన చేశాడు. 1590లో జన్మించిన క్షేత్రయ్య 1675 వరకూ జీవించి ఉన్నట్లు తెలుస్తోంది. ఈయన శిల్పవిగ్రహాన్ని హైదరాబాదులోని తెలుగువెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ప్రతిష్ఠించారు.

## ఖజురహో

మధ్యప్రదేశ్‌లోని బుందేల్‌ఖండ్ ప్రాంతమున ముస్లిం రాజుల దండయాత్రలకు బలికాకుండా వేయి సంవత్సరాల పాటు భద్రంగా ఉన్న దేవాలయ వాస్తు శిల్ప సంపదతోనూ, ఆలయాలతోనూ కూడిన ప్రాచీన పట్టణం. చుట్టుప్రక్కల ఖర్జూరం చెట్లు విస్తారంగా ఉండడం వల్ల, అప్పట్లో ఈ పట్టణ సింహద్వారాలను వీటితో అలంకరించడం వల్లా ఈ నగరానికి 'ఖజురహో' అని పేరు వచ్చినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. 10 శతాబ్దాల క్రితం 'చందేల' అనే రాజపుత్ర వంశీయులకు 'ఖజురహో' ముఖ్య పట్టణంగా ఉండేది. ప్రస్తుతం ఇది ఒక చిన్న పల్లె. విదేశీ పర్యాటకుల కోసం ప్రత్యేకంగా విమానాశ్రయ సౌకర్యాలు కూడా ఏర్పరచబడిన ఒక పల్లెటూరు ఇది. ఝాన్సీ నుంచి 175 కిలో మీటర్ల దూరంలో 'ఖజురహో' ఉంది. దేశదేశాలనుంచి ఎంతో మంది పర్యాటకులు ప్రతిరోజూ ఇక్కడికి వస్తూ ఉంటారు. పూర్వం సుమారు 85 ఆలయాలతో విరాజిల్లిన ఈ పట్టణంలో ప్రస్తుతం (శృంగార)శిల్పకళానిలయాలయిన లక్ష్మణ దేవాలయం, పార్శ్వనాథ దేవాలయం(జైన), చిత్రగుప్త(సూర్య)దేవాలయం, ఆదినాథాలయం (జైన), కథాహీ దేవాలయం, శాంతినాథాలయం,ఘంటా దేవాలయం (జైన), శుక్రాలయం మున్నగు 22 ఆలయాలు మాత్రమే ఉన్నాయి.వాటిలో కూడా కొన్ని శిథిలావస్థలో ఉన్నాయి. మధ్యప్రదేశ్ పర్యాటక శాఖవారు మహాశివరాత్రి సందర్భంగా ఇక్కడ ఖజురహో నృత్యోత్సవాలు నిర్వహిస్తూ ఉంటారు.



## ఖమ్మం జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. తెలంగాణా ప్రాంతంలో చేరిఉన్న ఈ జిల్లా 16° 40′, 18° ఉత్తర అక్షాంశాలకూ, 79° 50′, 81° 40′ తూర్పు రేఖాంశాలకూ మధ్య ఉంది. మొట్టమొదటి సారిగా 1953లో ఈ జిల్లా ఏర్పాటైంది. అంతకుముందు వరంగల్లు జిల్లాలో ఇది అంతర్భాగంగా ఉండేది. 1959లో తూర్పు గోదావరి జిల్లా నుంచి భద్రాచలం, నూగూరు




తాలూకాలు ఖమ్మం జిల్లాలో కలిశాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఖనిజ నిక్షేపాలు పుష్కలంగా ఉన్న జిల్లా ఇది. నేలబొగ్గు గనులు దాదాపు 100 ఏళ్ల నుంచి పనిచేస్తున్నాయి. బేరియం సల్ఫేట్, గ్రాఫైట్, ఇనుపరాయి, మైకా, క్రోమైట్ ఖనిజాలు ఇక్కడ లభిస్తాయి. సింగరేణిలోని నేలబొగ్గు ఆధారంగా ఏర్పాటైన విద్యుదుత్పత్తి కేంద్రం, కొత్తగూడెం సమీపంలోని పాల్వంచలో స్పాంజ్ ఐరన్ ఈ జిల్లాలోని ప్రముఖ పారిశ్రామిక కర్మాగారాలు.

గోదావరీ నది 180 కిలోమీటర్లమేర ఈ జిల్లాలో ప్రవహిస్తూంది. కిన్నెరసాని వాగు ఇక్కడే గోదావరిలో కలుస్తూంది. మున్నేరు, వైరా, కట్టలేరు, పాలేరు మున్నగు చిన్నఏర్లు జిల్లాలో జలనిర్గమనానికి తోడ్పడుతున్నాయి. ఈ జిల్లా అడవులకు ప్రసిద్ధి (51 శాతం). వరి, జొన్న, వేరుసెనగ ముఖ్యమైన పంటలు.

విస్తీర్ణం: 16,029 చ.కి.మీ.; జనాభా: 17,44,966 (1981); జిల్లా కేంద్రం: ఖమ్మం, ఇతర పట్టణాలు: కొత్తగూడెం, పాల్వంచ, భద్రాచలం, ఇల్లెందు.

తానీషా(చూ.) హయాంలో రామదాసు (కంచర్ల గోపన్న) భద్రాచలం(చూ.)లో నిర్మించిన రామాలయం ఆంధ్ర దేశంలోని ముఖ్య పుణ్యక్షేత్రాలలో ఒకటి.

## ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్

సరిహద్దు గాంధీ (ఫ్రాంటియర్ గాంధీ)గా సుప్రసిద్ధుడైన ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ 'హస్తనగర ఉత్మాన్ జై' అనే చోట 1890లో జన్మించారు. బ్రిటిషు పాలకులు ఆ రోజులలో ఫక్తూనిస్థ్‌లకు విద్యనభ్యసించే అర్హత లేకుండా చేశారు. గఫర్‌ఖాన్ అయిదో ఏటనే ముల్లా వద్ద శుశ్రూష చేసి ఖొరాన్ పఠించడం ప్రారంభించాడు. తరువాత కేంబెల్, పెషావర్ విద్యాసంస్థలలో ఉన్నత విద్యను అభ్యసించాడు. ఉత్మాన్ జైల్లో ఫక్తూనిస్థ్‌లకు విద్యను బోధించే లక్ష్యంతో అక్కడ 1910లో ఒక ప్రాథమిక పాఠశాలను నడిపాడు. 1921లో ఆజాద్ హైస్కూలును ప్రారంభించాడు. తాను జన జాగృతి ఉద్యమాలు నిర్వహించడం పాలకులకు ఇష్టంలేక గఫర్ ఖాన్‌ను 3 ఏళ్ళు నిర్బంధించారు. 1928లో తన 'జన జాగృతి' ఉద్యమాన్ని కొనసాగించడానికి 'ఫక్తూన్' అనే పత్రికను ఆయన ప్రచురించడం మొదలుపెట్టాడు. అదే సంవత్సరం లక్నోలో ఒక కాంగ్రెసు సమావేశం జరుగుతుండగా గఫర్‌ఖాన్ జాతీయ నాయకులయిన గాంధీ, నెహ్రూల దృష్టి నాకర్షించాడు. 'ఖుదాయీ ఖిద్మత్' అనే రాజకీయ పార్టీని అప్పుడే ఏర్పాటుచేసి దానికి తాను నాయకుడయ్యాడు. ఆ మరుసటి సంవత్సరం కాంగ్రెసులో చేరి, 1934లో భారత జాతీయ కాంగ్రెసుకు అధ్యక్షుడయ్యాడు. బ్రిటిష్ వారు అనేకసార్లు ఆయనను నిర్బంధంలోకి తీసికొన్నారు. ఆయన మొత్తం 15 ఏళ్ళు కారాగారంలో గడిపాడు. పాకిస్తాన్ ప్రభుత్వం మరొక 15 ఏళ్ళు ఆయనను జైలుపాలు చేసింది. 1964లో పాకిస్తాన్ ఆయనను విడిచిపెట్టింది. గాంధీజీ శత జయంతి సందర్భంలో 1969లో ఆయన భారత దేశాన్ని సందర్శించాడు. భారత ప్రభుత్వం 1987 లో ఆయనకు 'భారతరత్న' పురస్కారం ఇచ్చి సత్కరించింది. 1988లో 98వ ఏట దివంగతులైన ఖాన్ ఇండియాకు మిత్రుడుగా ప్రసిద్ధి చెందారు.



## ఖిలాఫత్ ఉద్యమం

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం బ్రిటిష్ వారు 'ఖలీఫాల' పదవి రద్దుకు పూనుకోగా, అందుకు నిరసనగా ఇండియన్ ముస్లిములు 1920లో కొనసాగించిన ఉద్యమం. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఈ ఖిలాఫత్ ఉద్యమం ప్రముఖ పాత్ర వహించింది. (చూ.అజాద్).

## ఖొరాన్

ముస్లిముల పవిత్ర ప్రామాణిక మతగ్రంథం. 'ఖొరాన్' అంటే ప్రార్థనా సమయంలో పఠించే స్తోత్రాలు అని అర్థం. తన 40వ ఏట మహమ్మద్ ప్రవక్త (క్రీ.శ. 570-632) మెక్కాకు సమీపంలో ఉన్న ఒక పర్వతగుహలో ధ్యానంలో నిమగ్నుడై ఉన్నప్పుడు ఆయనకు కలిగిన దివ్యానుభూతికి ఫలితంగా రాత్రి సమయంలో ఆకాశవాణి ఆయన చేత ఈ స్తోత్రాలు పలికించింది. ఆ దివ్యవాణి 'గేబ్రియల్'ది అంటారు. ఈ పలుకులే ఖొరాన్‌లోని ప్రప్రథమ ప్రవచనాలు. అబూబకర్ అనే ఇస్లాం పీఠాధిపతి ఖలీఫాగా ఉన్నప్పుడు ఈ ప్రార్థనలను సేకరించి క్రోడీకరించి లిఖిత రూపంలో భద్రపరిచారు. ఇందులో 'సుర'లు అనబడే అధ్యాయాలు 114 ఉన్నాయి. ఇవి 'అల్లా' (భగవంతుని) ప్రవచనాలే కాని మహమ్మద్ ప్రవచించినవి కావని ముస్లిములు విశ్వసిస్తారు. పద్యపాదాలు ఒక్కొక్కసారి 100దాకా ఉంటాయి. కొన్ని చిన్న పద్యాలు ఉన్నాయి. ఖొరాన్ పద్యపాదాలు అరబ్బీ భాషలో తాళయుక్తంగా కూర్చబడ్డాయి. ముస్లిములు చాలామందికి ఇవి కంఠస్థం. నిత్యదేవతార్చన (నమాజ్), ధార్మికబుద్ధి, సర్వమానవ సౌభ్రాత్రం మొదలైన సూత్రాలు ఖొరాన్‌లో పొందుపరచబడ్డాయి. ప్రతి వ్యక్తి ఇతరుల పట్ల వినయవిధేయతలూ, అవసరమైనప్పుడు ధైర్యసాహసాలు ప్రదర్శిస్తూ జీవయాత్ర సాగించాలని ఖొరాన్ ప్రధానంగా బోధిస్తూంది. చూ. మహమ్మద్

## గంగానది

హిమాలయాలలో పుట్టి ఉత్తర భారతదేశంలో ప్రవహిస్తున్న ఈ మహానది హిందువులకు అతి పవిత్రమైనది. దీని పొడవు 2,478 కి.మీ. హిమాలయ పర్వతాలో సముద్ర మట్టానికి 3,139 మీ ఎత్తున ఒక హిమగుహలో పుట్టి ఆగ్నేయంగా ఉత్తరప్రదేశ్, బీహార్, ప.బెంగాల్ రాష్ట్రాలగుండాను బంగ్లాదేశ్‌లోనూ ప్రవహించి సంగమ స్థానంలో భారీ డెల్టా ఏర్పడి బంగాళా ఖాతంలో ఈ నది కలుస్తూంది. బంగ్లాదేశ్‌లో ఫరాకా వద్ద బరాజు నిర్మించారు. రామ్‌గంగా, గోమతీ, ఘాఘ్రా, శోణ్, సప్తకోసీ నదులు గంగానదికి ఉపనదులు. సాగర సంగమస్థానంలో బ్రహ్మపుత్రానది, దాని ఉపనదులు కూడా కలిసి పెద్ద డెల్టా ఏర్పడింది. గంగానది ఒడ్డున మహానగరాలూ, పుణ్యక్షేత్రాలూ ఎన్నో ఉన్నాయి. వాటిలో కలకత్తా (హౌరా), పాట్నా (పాటలీ పుత్రం), వారణాసి (కాశీ), కాన్పూరు పేర్గొనదగినవి. భారతదేశపు రాజధాని న్యూఢిల్లీ నగరం గంగకు ఉపనది అయిన యమునా నది ఒడ్డున ఉంది. పురాణకాలంలో భరద్వాజ, వశిష్ఠ, వాల్మీకి, విశ్వా మిత్రాది మహర్షులు గంగానది ఒడ్డున ఆశ్రమాలు నిర్మించుకొని తపస్సు చేస్తూ ఉండేవారని పురాణాలు చెబుతున్నాయి. గంగాజలాన్ని భారతీయులు అతి పవిత్రంగా భావిస్తారు. కాశీలో మరణించడం బొందెతో కైలాసం చేరుకోడమే అని హిందువుల విశ్వాసం. గంగానదీ పరీవాహప్రాంతం విస్తృతమైంది, మిక్కిలి సారవంత మైనది. ఈ ప్రాంతంలో పంటలుపుష్కలంగాపండుతాయి. చూ.ఉత్తరప్రదేశ్;వారణాసి

## గజనీ మహమ్మద్

భారతదేశంమీద 17సార్లు దండయాత్రలు చేసి హిందూ దేవాలయాలను కొల్లగొట్టిన ఆఫ్ఘనిస్తాన్‌లోని గజనీ సుల్తాన్ క్రీ.శ. 970 ప్రాంతంలో ఆఫ్ఘనిస్తాన్‌లోని స్వతంత్ర రాజ్యాలలో ఒకటి అయిన గజనీ సింహాసనాన్ని సబక్తగీన్ అనే తుర్కీదేశపు బానిస ఆక్రమించాడు. క్రీ.శ. 997లో ఆయన మరణించగా ఆయన కుమారుడు మహమ్మద్ గజనీ (గజనీ మహమ్మద్) సింహాసనం ఎక్కాడు. ఆ సమయంలో భారతదేశం భోగభాగ్యాలతో తులతూగుతూ ఉండేది. ఈ సంపదనంతా కొల్లగొట్టాలన్నది మహమ్మద్ ఆరాటం. దీనికిగాను 17సార్లు భారతదేశం మీదికి ఆయన దండయాత్రలు సాగించాడు. అనేక దేవాలయాలను నేలమట్టంగావించి ఎంతో ధనం, బంగారం, రత్నాలు తన దేశానికి తరలించుకొని వెళ్ళాడు.

ఇతని దాడుల వలన అపార జననష్టం కలగడమేకాక గొప్పగొప్ప దేవాలయాలు నాశనమైపోయాయి. వాటిలోని కళాసంపద ధ్వంసం చేయబడింది. అయితే భారతీయ విజ్ఞానం పరదేశాలకు వ్యాపించడానికి ఈ దండయాత్రలు కొంతవరకు తోడ్పడ్డాయి. గజనీ మహమ్మద్ ధ్వంసం చేసిన ఆలయాలలో సౌరాష్ట్రంలోని సోమనాథ దేవాలయం ప్రధానమైంది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్‌వంటి వారు పూనుకొని జీర్ణావస్థలో ఉన్న సోమనాథ దేవాలయాన్ని పునరుద్ధరించారు.

## గజేంద్రమోక్షం

భాగవత పురాణంలోని ఒక గాథ. ఇంద్రద్యుమ్నుడు అను ఒక మహారాజు ఒక అడవిలో తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఒకసారి అగస్త్య మహర్షి ఆ దారిని వెళ్లడం సంభవించింది. ఇంద్రద్యుమ్నుడు ఘోర తపస్సులో మునిగి ఉండడంవల్ల మహర్షి రాకను గమనించలేక పొయ్యాడు. అందులకు అగస్త్యమహర్షి కోపోద్రిక్తుడయి వెయ్యేళ్లు గజరూపం అనుభవించ వల్సిందిగా ఇంద్రద్యుమ్న మహారాజుని శపించాడు. తత్ఫలితంగా ఆ మహారాజు గజరూపం దాల్చాడు. ఆ ఏనుగు ఇతర ఏనుగుల మందలో కలిసి త్రికూట పర్వత సానువుల్లో ఉన్న వనంలో విహరిస్తూ ఉండేది. త్రికూట పర్వత సానువుల్లోనే దేవలుడు అనే ముని ఆశ్రమం కూడ ఉంది. ఒకసారి హూహూ అను గంధర్వుడు దేవకన్యలతో ఆశ్రమ సమీపంలో విహారానికి వచ్చాడు. అక్కడే ఉన్న ఒక కొలనులో ఆ సుందరాంగులతో నగ్నంగా జలక్రీడలాడడం ప్రారంభించేడు. ఆ దృశ్యం చూసిన దేవలుడు, హూహూ అలక్ష్య ప్రవర్తన పట్ల కోపించిన వాడై గంధర్వుని మొసలి రూపం దాల్చుమంటూ శపించాడు.



ఒకనాడు ఆ ఏనుగు (ఇంద్రద్యుమ్నుడు) దాహం తీర్చుకొనడానికి గాను ఆ కొలనులో కాలుపెట్టెను. మకరం వెంటనే ఏనుగు కాలును కరచిపట్టింది. అట్లు ఇద్దరూ (ఏనుగు రూపంలో ఉన్న ఇంద్రద్యుమ్నుడు మకర రూపంలో ఉన్న హూహూ) కొన్ని వందల ఏళ్లు పెనుగులాడి విసిగి పోయారు. చివరకు గజేంద్రుడు దైవాన్ని ప్రార్థించగా వైకుంఠంలో ఉన్న విష్ణుమూర్తి గరుడవాహనారూఢుడై దివి నుండి భువికి ఏతెంచి తన చక్రాన్ని మొసలిపై ప్రయోగించగా ఇద్దరూ శాపంనుండి విముక్తులయిరి. ఈ గాథను పోతనకవి ఆంధ్ర మహా భాగవతంలో చక్కగా వర్ణించాడు.

## గణపతిదేవుడు

కాకతీయ చక్రవర్తి (పరిపాలనా కాలం 1199–1262) మహా పరాక్రమ వంతుడు. వెలనాటి పృథ్వీశ్వరుణ్ణి, నెల్లూరు నేలుచున్న తమ్ముసిద్దినీ, తూర్పు గాంగరాజైన అనియంక భీముణ్ణి, కంచి పాలకుడైన ముమ్మడి రాజేంద్ర చోళుణ్ణీ జయించి తెలుగు దేశాన్నంతటినీ తన ఏలుబడి క్రిందికి తెచ్చుకున్నాడు. రుద్రుడు ప్రారంభించిన ఓరుగల్లు కోట నిర్మాణాన్ని గణపతిదేవుడు పూర్తి చేశాడు. గణపతి దేవుని భార్య సోమలదేవి. ఈయనకు పుత్ర సంతతిలేరు. గణపాంబ, రుద్రాంబ అని ఇద్దరు కుమార్తెలు మాత్రమే ఉన్నారు. వీరిలో గణపాంబను కోటచేత రాజుకిచ్చి వివాహం చేశాడు. రుద్రాంబను తన అనంతరం రాజ్యాధికారిణిని చేశాడు. ఆమెకు రాజకీయ వ్యవహారా లలో శిక్షణ ఇచ్చాడు. ఈమె భర్త చాళుక్య వంశానికి చెందిన వీరభద్రుడు.

గణపతిదేవుడు గొప్ప కవిపండిత పోషకుడు. ఈయన ఆస్థానంలో 'కవి చక్రవర్తి', 'విద్యా చక్రవర్తి' వంటి బిరుద నామాలు గల అనేక విద్వాంసులుండేవారు. ఈయన సేనాని అయిన జాయపసేనాని గొప్ప కళావేత్త. గీత రత్నావళి, వాద్య రత్నావళి, నృత్త రత్నావళి అనే సుప్రసిద్ధ గ్రంథాల రచయిత. గణపతిదేవుడు పాలంపేట, ఘనా పురం, పిల్లల మర్రి వంటి ప్రదేశాలలో దేవాలయాలు కట్టించాడు. రామప్ప, పాకాల మొదలైన తటాకాలు త్రవ్వించాడు.

## గఫర్ ఖాన్

చూ. ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్

## గయ

హిందువులకు పవిత్రమైన పుణ్యక్షేత్రం. కలకత్తా నుంచి మొగల్ షరాయ్ పోయే రైలు మార్గంలో ఈ పట్టణం ఉంది. పితృదేవతలకు ప్రీతికరమైన క్షేత్రం ఇది. గయశ్రాద్ధం చేయడంవల్ల పితృదేవతలకు సద్గతులు కలుగుతాయని హిందువుల విశ్వాసం. ఇక్కడ ఉన్న ఒక వటవృక్షచ్ఛాయలో హిందూ యాత్రికులు తమ పితృ దేవతలకు తర్పణాలు వదులుతారు. గయాసురుడు సంహారింపబడిన స్థలం గనుక 'గయ' అయిందని పురాణాలు చెబుతున్నాయి. ఈ క్షేత్రం ఫల్గునీ నదీతీరాన ఉంది.

## గయానా

దక్షిణ అమెరికాలో ఈశాన్య భాగాన ఉన్న చిన్న గణరాజ్యం. పశ్చిమార్ధ గోళంలో కొలంబస్ మొదటి సారిగా కాలూనిన ప్రదేశం ఇదే. డచ్‌వారు, ఫ్రెంచ్‌వారు పాలించిన ఈ ప్రాంతం 1831 నుంచి బ్రిటిషు గయానాగా ఇంగ్లండ్ పాలనలో ఉండి, 1966లో స్వతంత్రరాజ్యంగా రూపొందింది. ఎస్సెక్విబోనది, డెమెరారానది, బెర్బీసే, కొరంటైనేనది ఈ దేశంలో ప్రవహించే ముఖ్యనదులు. ఇవి ఉత్తరదిశగా ప్రవహించి అట్లాంటిక్ మహసముద్రంలో కలుస్తున్నాయి. మిక్కిలి ఎత్తునుంచి పడే జలపాతాలు ఈ దేశంలో ఎక్కువగా ఉన్నాయి.




దేశం విస్తీర్ణం: 2,15,000 చ.కి.మీ; జనాభా: 7,57,000; రాజధాని: జార్జ్‌టౌన్; అధికార భాష: ఇంగ్లీషు. కొబ్బరి, వరి, చెరకు, నారింజ, అరటి, అనాస ముఖ్యమైన పంటలు. బాక్సైట్ ఖనిజ నిక్షేపాలు ఎక్కువగా ఉన్నాయి. వజ్రపు గనులు, బంగారం, మాంగనీసు కూడా లభిస్తున్నాయి. కలప, పంచదార ప్రధాన పరిశ్రమలు.

## గరిమెళ్ళ సత్యనారాయణ

చూ. సత్యనారాయణ, గరిమెళ్ళ

## గవర్నరు

రాష్ట్ర పాలకుడు. భారతదేశంలో దేశాధినేత అయిన రాష్ట్రపతికి నిర్దేశింపబడిన అధికారాలూ, విధులే దాదాపుగా రాష్ట్రంలో గవర్నరుకు నిర్దేశించబడ్డాయి. ప్రధాన మంత్రి సలహా మేరకు రాష్ట్రపతి గవర్నర్లను నియమిస్తారు. గవర్నర్ నియామకంలో ప్రధాని రాష్ట్ర ముఖ్యమంత్రిని సంప్రదిస్తారు.

ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న రాష్ట్రాలయితే రెండు లేదా అంతకు మించిన రాష్ట్రాలకు కలిపి ఒకే గవర్నరును నియమిస్తారు. సాధారణంగా గవర్నరు రాష్ట్రపతి ఇష్టాయిష్టాలను బట్టి 5 సం.లపాటు పదవిలో కొనసాగుతారు. గవర్నరు పదవీకాలం ముగియకుండానే రాష్ట్రపతి ఆయనను తొలగించవచ్చు లేదా వ్యక్తిగత కారణాలవల్ల గవర్నరు తానే రాజీనామా చేసి పదవి నుంచి వైదొలగవచ్చు.

గవర్నరు ఉండే నివాసాన్ని 'రాజ్‌భవన్' అంటారు. గవర్నర్‌కి నెలజీతం కాక, అనేక అలవెన్సులు, అధికారాలూ ఉంటాయి.

గవర్నర్‌గా నియమించబడాలంటే భారతదేశ పౌరుడై ఉండి, 35 సంవత్సరాలపైబడిన వయస్సుకలవాడై ఉండాలి.

రాష్ట్రంలో కార్యనిర్వాహక చర్యలన్నీ గవర్నర్ పేరు మీదుగానే జరుగుతాయి. రాష్ట్ర ముఖ్యమంత్రిని, ముఖ్యమంత్రి సలహా మేరకు ఇతర మంత్రులను గవర్నరే నియమిస్తారు. వారి చేత గవర్నరే పదవీ ప్రమాణ స్వీకారం చేయిస్తారు. ముఖ్యమంత్రి తీసుకునే నిర్ణయాలన్నిటినీ గవర్నర్‌కి తెలియజేస్తారు. గవర్నర్ ప్రతి విషయం తెలుసుకొని ఉండడమేకాక, కొన్ని విషయాలను నిశితంగా పరిశీలించవచ్చు. ఏవైనా ప్రభుత్వ పత్రాలు కావాలంటే గవర్నర్ ప్రభుత్వాన్ని అడుగవచ్చు. రాష్ట్ర శాసన సభ సమావేశం గవర్నర్ ఆదేశంతోనే జరుగుతుంది. రాష్ట్ర శాసన సభ ఆమోదించిన బిల్లులను గవర్నర్ పరిశీలనకు తప్పనిసరిగా పంపాలి. రాష్ట్ర శాసన సభ సమావేశమే లేనప్పుడు అత్యవసరమైన శాసనాన్ని గవర్నర్ ఆర్డినెన్స్‌గా జారీ చేయవచ్చు. దాని అవధి ఆరు మాసాలు. శాసన సభ తిరిగి సమావేశమైనప్పుడు అట్టి ఆర్డినెన్స్‌ను ఆమోదించవలసి ఉంటుంది. ఆర్డినెన్స్‌ను నిరాకరించే అధికారం కూడా శాసన సభకు ఉంటుంది.

సాధారణంగా ముఖ్యమంత్రి, మంత్రివర్గం సలహాల మేరకే గవర్నర్ నడువ వలసి ఉన్నా, కొన్ని వివేచనాధికారాలు కూడా గవర్నర్‌కు ఉంటాయి. రాష్ట్రంలోని కోర్టులలో ఏ వ్యక్తికైనా విధించిన శిక్షను తగ్గించడానికి గాని, సస్పెండ్ చేయడానికి గాని లేదా క్షమించి విడిచి పెట్టడానికి గాని గవర్నర్‌కి అధికారం ఉంది.

రాష్ట్ర విధాన సభలో ఏ పార్టీకీ తగినంత మెజారిటీ రాక పోవడమో లేదా రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడే అవకాశం లేకపోవడమో, లేదా రాజ్యాంగబద్ధంగా రాష్ట్ర పరిపాలన సాగించలేని పరిస్థితి ఏర్పడడమో జరిగినపుడు గవర్నర్ అసెంబ్లీని, లేదా రాష్ట్ర మంత్రివర్గాన్ని, లేదా రెండింటిని రద్దు చేసి రాష్ట్రపతి పాలన విధించమని రాష్ట్రపతికి సలహా ఇవ్వవచ్చును. అలాంటి సందర్భంలో తిరిగి ప్రజాప్రభుత్వం ఏర్పాటయేవరకూ గవర్నర్ కొందరు సలహాదారుల సాయంతో రాష్ట్రపరిపాలన నిర్వహిస్తారు.

## గాంధీ, మోహన్‌దాస్ కరమ్‌చంద్

ఈయనను గాంధీజీ అని పిలుస్తారు. గాంధీజీ ఉదాత్త భావాలచే ప్రభావిత అయిన ఆనిబిసెంట్ ఆయనను 'మహాత్మా' అని పిలువనారంభించింది. భారత స్వాతంత్ర్య సంగ్రామనేత. భారత జాతిపిత. మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధి 1869 అక్టోబర్ 2న గుజరాత్‌లోని పోర్‌బందరులో జన్మించారు. తన 13వ ఏటనే కస్తూర్బాను వివాహమాడారు. అయితే, తరువాత బాల్య వివాహ దురాచార నిర్మూలన కోసం ఆయన తీవ్రంగా కృషి చేశారు.

17వ ఏట న్యాయ విద్య అభ్యసించడానికి గాంధీజీ లండన్ వెళ్లారు. విద్యాభ్యాసం ముగించి స్వదేశం తిరిగి వచ్చిన (1891) తర్వాత ఆయన దక్షిణాఫ్రికా (1893) వెళ్లారు. అక్కడ ఉండగానే మేధావులైన సి.ఎఫ్. ఆండ్రూస్ మొదలైనవారితో ఆయనకు పరిచయం ఏర్పడింది. అక్కడ తెల్లవారి ఆధిక్యభావనకు నిరసన తెలుపుతూ గాంధీజీ ఒక ఉద్యమం నడిపారు. 'ఇండియన్ ఒపీనియన్' అనే వారపత్రికను స్థాపించి దాని ద్వారా దక్షిణ ఆఫ్రికాలో గనులలో పనిచేసే భారతీయులకు జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టడానికి ప్రయత్నించాడు. అహింసా సిద్ధాంతాన్ని అనుసరిస్తూ సత్యాగ్రహ సమరాలు సాగించి బ్రిటిష్ వారిచేత నిర్బంధించబడ్డారు. అక్కడ కొన్ని సంస్కరణలు తీసుకురావడానికి ఆయన కారకులయారు. బోయర్ యుద్ధం (1899–1902) జూలూ తిరుగుబాటు (1906) సమయాలలో తాను చేసిన విశేష కృషికి సన్మానాలను అందుకున్నాడు.

1915లో స్వదేశానికి తిరిగి వచ్చి భారత రాజకీయాలలో రంగప్రవేశంచేసి అనతికాలంలోనే అగ్ర కాంగ్రెస్ నాయకులు అయారు. గుజరాత్‌లో సబర్మతీ ఆశ్రమం స్థాపించి తన రాజకీయ కార్యక్రమం నిర్వహించాడు. రౌలట్ చట్టం ప్రవేశపెట్టడంతో దేశంలో కలకలం ప్రారంభమయి (ఏప్రిల్ 13,1919) జలియన్ వాలాబాగ్ (చూ.) దురంతానికి దారి తీసింది. గాంధీజీ దానికి తీవ్ర నిరసనను తెలియ పరచడానికి అహింసా యుతంగా సత్యాగ్రహం ఆరంభించారు.

గాంధీజీ నడిపించిన ఉద్యమాలు నిర్మాణాత్మకంగా ఉండేవి. 1920లో చరఖా తిప్పుతూ ఖద్దరు తయారు చెయ్యడం ఒక ఉద్యమంగా ఆయన సాగించారు. దీని వలన అందరికీ చేతినిండా పని ఉంటుందనీ, ఆర్థికంగా ఎవరి కాళ్ల మీద వారు నిలబడవచ్చుననీ ఆయన ప్రకటించారు. ఇలా సమాజమంతా కార్యోన్ముఖం అయితే దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత స్వపరిపాలనకు అవసరమైన ఆత్మస్థైర్యం వారికి సిద్ధిస్తుందని గాంధీజీ భావన.

1921లో సహాయనిరాకరణోద్యమం ముమ్మరంగా సాగింది. కాకినాడ కాంగ్రెసు సభలకు గాంధీజీ ఆంధ్రప్రాంతానికి వచ్చారు. ఉప్పు శాసనాలను ఉల్లంఘిస్తూ 1930 ఏప్రిల్‌లో గాంధీజీ ఉప్పు సత్యాగ్రహం (చూ.) నడిపారు. 320 కి.మీ. కాలినడకన పోయి 'దండి' చేరుకుని అక్కడ ఉప్పు తయారు చేశారు.



1932, 1934 సంవత్సరాలలో లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశా(చూ.)లకు హాజరయ్యారు. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో కూడా తన అహింసాయుత పోరాటానికి ఆయన స్వస్తి చెప్పలేదు. 'బ్రిటిష్ ప్రభువులారా భారతదేశాన్ని వదిలిపోండి అని 1942 ఆగస్టు 9 నాడు 'క్విట్ ఇండియా' నినాదమిచ్చి దేశవ్యాప్తంగా ఉద్యమం నడిపారు. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం).

గాంధీజీని ఆగాఖాన్ ప్యాలెస్‌లో బంధించారు. 1945లో యుద్ధం ముగిసిన పిమ్మట అందరినీ విడుదల చేశారు. స్వాతంత్ర్యానంతరం 1947లో భారతదేశ విభజన జరిగి పాకిస్తాన్ విడిపోయినప్పుడు తీవ్ర మత కలహాలు చెలరేగాయి. అప్పుడు గాంధీజీ నౌకాళీ శాంతి యాత్ర సాగించారు. చివరకు తన 78వ ఏట 1948 జనవరి 30న హిందూమత దురభిమాని నాథూరామ్ గాడ్సే తుపాకీ గుండ్లకు గురియై 'హేరామ్' అంటూ గాంధీజీ తుది శ్వాస విడిచారు.

గుజరాతీలోనూ, ఇంగ్లీషులోనూ గాంధీజీ అనేక గ్రంథాలు వ్రాశారు. 'హరిజన' పత్రిక ద్వారా సమాజంలో దిగువ స్థాయిలో ఉంటూ అంటరానివారుగా భావించ బడుతున్న హరిజనులను ఉద్ధరించడానికి అనేక వ్యాసాలు వ్రాసి ప్రకటించారు.

'నా సత్యాన్వేషన్' (మై ఎక్స్పెరిమెంట్స్ విత్ ట్రూత్) అనే పేరుతో గాంధీజీ వ్రాసిన 'ఆత్మకథ' జగత్ ప్రసిద్ధి పొందింది.

## గాంబియా

ఆఫ్రికా పశ్చిమ తీరాన ఉన్న కడు చిన్న గణరాజ్యం. ఇది నిరుపేద దేశం. విస్తీర్ణం: 10,689 చ.కి.మీ. జనాభా: 8,11,000 (1988), రాజధాని: బాన్జూల్. ఈ దేశంలోని నీగ్రో ప్రజలలో అయిదు




తెగలవారున్నారు. ఆ తెగలు: ఫులానీ, డిమోలా, మాలిన్కే, వూలోఫ్, సోనిన్కే. ప్రజ ఆదిమ భాషలు మాట్లాడినా ఈ దేశంలో అధికార భాష: ఇంగ్లీషు. 475 కి.మీ నిడివిగల గాంబియా నది ఈ దేశానికి ప్రధాన జలధారం, నౌకా మార్గం. వరి, వేరుసెనగ, బొప్పాయి, పామ్ గింజలు, అరటి, క్రరపెండలం, మొక్కజొన్న ఇక్కడ పండుతాయి. పశువులు, మేకలు, గొర్రెలు ఎక్కువ. చెప్పుకోదగ్గ ఖనిజ సంపందగానీ పరిశ్రమలు గానీ ఈ దేశంలో లేవు.

## గాథా సప్తశతి

700 ప్రాకృత పద్యాలతో కూడిన ఒక ప్రాచీన సంకలిత గ్రంథం. ఆంధ్ర సాతవాహన రాజులలో ఒకడైన హాల సాతవాహనుడు ఈ గ్రంథాన్ని సంకలితం చేశాడు. 'గాథ' అనేది ఒక మాత్రాచ్ఛందస్సు. కందపద్యం వంటిది. ఈ గాథలలో దేనికదే ఒక మధురమైన, శృంగార భరితమైన సన్నివేశాన్ని అభివర్ణిస్తుంది. వివిధ కవులచేత వ్రాయ బడిన ఈ గాథలలో హాలుడు స్వయంగా వ్రాసినవి కూడా కొన్ని ఉన్నాయి. రెండువేల ఏళ్ళ క్రిందట తెలుగు దేశంలోని గ్రామీణ జీవిత సౌందర్య ప్రతిబింబాలు ఈ గాథలలో మనకు కనిపిస్తాయి. 'పిల్ల', 'అత్త' మొదలైన ఎన్నో తెలుగు మాటలు కూడా ఈ ప్రాకృత గాథలలో చేరాయి. గాథా సప్తశతిని తెలుగులో పలువురు కవులు అనువదించారు. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ 'గాథా సప్తశతిసారం' ఆ అనువాదాలలో ఒకటి. చూ. శాలివాహనుడు.

## గాలిబ్ కవి

ఉర్దూ మహాకవి. పూర్తి పేరు మిర్జా అసదుల్లా ఖాన్ గాలిబ్. పారసీక భాషలో కూడా రసవత్కవి. మహామేధావిగా పేరుపొందాడు. సుమారు 4 వేల పద్య పాదాలు గల గేయసంపుటం ఉర్దూ భాషలో గాలిబ్ ప్రముఖ రచన. పారసీకంలో ఒక దివాన్, గద్య కావ్యాలూ వ్రాశారు. ఉద్–ఎ–హిందీ, ఉర్దూ–ఎ–మొ అల్లా, మకతిబ్–ఎ గాలిబ్, నవాదిరాత్–ఎ–గాలిబ్ (జాబుల సంపుటం) పేర్కొనదగిన ఉర్దూ గద్య రచనలు. మొగల్ పాదుషా రెండవ బహదూర్ షా ఈతనికి 'నిజాముద్దౌలా', 'దబీర్ ఉల్ ముల్క్', 'నిజాం జంగ్' అనే బిరుదులు ఇచ్చి సత్కరించారు.

## గిడుగురామమూర్తి చూ. రామమూర్తి, గిడుగు

## గినీ

పశ్చిమ ఆఫ్రికాలో అట్లాంటిక్ సముద్రతీరాన ఉన్న స్వతంత్ర రాజ్యం. సుందర దృశ్యాలతో నిండిన లోయలు, జలపాతాలతో చూడ ముచ్చటైన దేశం ఇది. నైజర్‌నది ప్రవహిస్తున్న ఈ దేశంలో వరి, పామ్ గింజలు, చిరుధాన్యాలు, మొక్కజొన్న, వేరుసెనగ, అనాస, చిరుగడ దుంపలు, టారో కందమూలం, అరటి, కర్రపెండలం, నిమ్మజాతి పండ్లు బాగా సాగవుతాయి. బంగారం, ఇపపరాయి, వజ్రపు గనులు, బాక్సైట్, మొదలైన ఖనిజనిక్షేపాలు పుష్కలంగా ఉన్నాయి. అల్యూమినయం పరిశ్రమ ప్రధానమైంది.

విస్తీర్ణం: 2,45,857 చ.కి.మీ, జనాభా: 65,40, 000 (1988), రాజధాని: కోనాక్రీ, అధికార భాష: ఫ్రెంచ్. ఆదిమజాతులు ఫులానీ, మాలిన్కే మొదలైన తమతమ స్థానిక మాండలిక భాషలు మాట్లాడతారు.

ఒకప్పుడు ప్రక్క దేశాలతో కలిసి ఉన్న గినీ దేశం 1849లో ఫ్రెంచ్ వారి వశమైంది. 1958లో స్వతంత్ర ప్రతిపత్తిగల గణరాజ్యంగా ఏర్పడింది. 1966లో శరణు అర్థిస్తూ వచ్చిన పొరుగు రాజ్యం ఘానా అధ్యక్షుడు క్వామేన్క్రుమాకు గినీ ఆశ్రయం ఇచ్చింది.

## గినీ — బిస్సౌ

పశ్చిమ ఆఫ్రికాలో సెనెగల్, గినీ దేశాల మధ్య ఉన్న స్వతంత్ర్య గణరాజ్యం. ఒకప్పుడు పోర్చుగీసు వలస రాజ్యంగా ఉండేది.

విస్తీర్ణం: 36,125 చ.కి.మీ., జనాభా: 9,31,000 (1988), రాజధాని: బిస్సౌ, అధికారభాష: పోర్చుగీసు. ప్రజలు బలాంటే, ఫులానీ, మాలిన్కే, మాండ్యాకో, పేపిల్ మొదలైన ఆదిమ జాతులకు చెందినవారు.

దేశం మైదాన, పీఠభూమి ప్రాంతాలతో నిండి ఉంది. వరి, చిరుగడం, కర్ర పెండలం, జొన్న, వేరుసెనగ, కొబ్బరి, అరటిపండ్లు, చిరుధాన్యాలు, మొక్కజొన్నలు, పామ్‌నూనె గింజలు, జీడి మామిడి, చెరకు, బొప్పాయి పండ్లు, అపరాలు విరివిగా పండించి ఎగుమతి చేస్తున్నారు. (చూ. గాంబియా పటం.)

## గిరి, వి.వి.

భారత దేశానికి 4వ రాష్ట్రపతి. పూర్తిపేరు వరాహగిరి వేంకటగిరి. గిరి గొప్ప కార్మిక నాయకుడు. స్వాతంత్ర్య సమరయోధుడు. రాజనీతిజ్ఞుడు. 1894, ఆగస్ట్ 10వ తేదీన నేటి ఒరిస్సాలోని బరంపురంలో గిరి జన్మించాడు. ఆయనతండ్రి వరాహగిరిజోగయ్య పంతులుకూడా గొప్ప జాతీయనాయకుడు. కాంగ్రెసులోచేరి సహాయ నిరాకరణోద్యమంలో గిరి పెక్కుమార్లు జైలుకి వెళ్ళాడు. ఎన్.ఎమ్. జోషీ వంటి భారతకార్మికోద్యమ పితామహునితో చేతులుకలిపి ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో చేరారు. అఖిల భారత రైల్వే కార్మికుల సమాఖ్య స్థాపకులలో గిరి ఒకరు. ఈ సమాఖ్యకు 1926, 1942లో రెండుసార్లు ఆయన అధ్యక్షులు అయ్యారు. 1937లో మద్రాసులో కాంగ్రెసులో కాంగ్రెస్ రాజాజీ మంత్రి వర్గంలో కార్మిక, పారిశ్రామిక శాఖలకు మంత్రిగా ఉన్నారు.



1946లో మద్రాసు ప్రకాశం మంత్రివర్గంలో గిరి కార్మిక మంత్రి. తర్వాత కొంతకాలం సిలోన్, (శ్రీలంక)లో భారత హైకమీషనర్‌గా పని చేశారు. 1952లో కేంద్ర కార్మిక మంత్రిగా నియుక్తులయ్యారు. 1957లో ఉత్తర ప్రదేశ్ గవర్నర్‌గాను, తర్వాత కేరళ, మైసూరు రాష్ట్రాల గవర్నర్‌గాను పనిచేశారు. అనంతరం ఆయన భారత ఉపరాష్ట్రపతిగా ఎన్నిక అయ్యారు. జాకీర్ హుసేన్ మరణానంతరం రాష్ట్రపతి (1969) పదవికి ఎనుకోబడ్డారు. యజమాని–కార్మిక సంబంధాలమీద ఆయన అనేక గ్రంథాలు, వ్యాసాలూ వ్రాశారు.

1980, జూన్ 24న తన 86వ ఏట మద్రాసులో వరాహగిరి వెంకట గిరి పరమపదించారు.

## గుంటూరు జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా జిల్లాలలో ఒకటి. 15° 21′ మరియు 16° 50′ ఉత్తర అక్షాంశాలకు, 79° 13′

మరియు 80° 55′ తూర్పు రేఖాంశాలకూ మధ్య ఈ జిల్లా ఉంది. ఒకప్పుడు ధాన్యకటకం రాజధానిగా శాతవాహనులు ,విజయపురి (నాగార్జున కొండ) రాజధానిగా ఇక్ష్వాకులు పాలించిన ప్రాంతం ఇది. 1176–1182ల మధ్య పల్నాటి యుద్ధం కారెంపూడిలోనే జరిగింది. కాకతీయులు, కొండపాటిరెడ్లు, విజయనగర




రాయల వంశీయులు ఏలిన ఈ ప్రాంతం కడకు గోలకొండ నవాబుల ద్వారా 1788లో బ్రిటిషువారి కైవసమైంది. అప్పుడు ఈ జిల్లాపేరు ముర్తాజానగరం. అయితే 1859లో జిల్లాను చీల్చి కొంత కృష్ణా జిల్లాలోను శేషభాగం అప్పటి రాజమండ్రి సర్కారులోను కలిపారు. 1904లో మళ్లీ గుంటూరు జిల్లాను ఏర్పాటు చేశారు. తరువాత ప్రకాశం జిల్లా ఏర్పడినప్పుడు (1970) తిరిగి ఈ జిల్లా సరిహద్దులు మారాయి.

విస్తీర్ణం: 11,377 చ.కి.మీ. జనాభా: 34,27,081 (1981); జిల్లాకేంద్రం: గుంటూరు; తెనాలి, బాపట్ల, నరసారావుపేట ఇతర ప్రధాన పట్టణాలు. మార్కోపోలో (చూ.) సందర్శించిన మోటుపల్లి రేవు ప్రాచీనమైంది. నిజాంపట్నం ఇప్పటి రేవు. మత్స్య కేంద్రంగా వుంది. జిల్లాలో ముఖ్యమైన నది కృష్ణానది. గుండ్లకమ్మ, చంద్రవంక, నాగిలేరు ఈ జిల్లా గుండా ప్రవహించి కృష్ణలో కలుస్తున్నాయి. కృష్ణాడెల్టా కాలువ వ్యవస్థకు చెందిన కొమ్మమూరు కాలువ జిల్లాలో ప్రధానమైన పంట నీటివనరు. అంతర్ రాష్ట్రీయ నీటి మార్గంగా ఉన్న బకింగ్‌హాం కాలువలో ఈ కాలువ కలుస్తుంది. పడవ ప్రయాణానికి, సరకు రవాణాకూ ఇది అనువైంది.

వరి, జొన్న, అపరాలు ఆహారపు పంటలుకాగా, ప్రత్తి, పొగాకు వాణిజ్యపు పంటలు. గుంటూరు పొగాకు జగత్ప్రసిద్ధి. అగ్నిగుండాలలో రాగి ఖనిజం దొరుకుతుంది. సుప్రసిద్ధమైన కోహినూరు వజ్రం (చూ.) కొల్లూరులో లభించినట్లు చెబుతారు. పొగాకు పరిశ్రమకు ఈ జిల్లా ప్రసిద్ధి. సిమెంటు పరిశ్రమ తాడేపల్లిలోనూ, మాచెర్ల లోనూ కేంద్రీకృతం అయింది. కోటప్పకొండ జాతర, మంగళగిరి (పానకాలస్వామి), అమరావతి, భట్టిప్రోలులోని బౌద్ధావశేషాలు, ఎత్తిపోతల జలపాతం చూడదగిన ప్రదేశాలు. గుంటూరు ఉన్నత విద్యాకేంద్రం. నాగార్జునా యూనివర్శిటీ, వైద్యకళాశాల ఉన్నాయి.

## గుజరాత్ రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. వాయవ్య దిశను అరేబియా సముద్రాన్ని ఆనుకున్న వున్న ఈ రాష్ట్రం 1960 లో బొంబాయి రాష్ట్రాన్ని పునర్వ్యవస్థీకరించినపుడు ప్రత్యేక రాష్ట్రంగా అవతరించింది.

రాష్ట్ర విస్తీర్ణం: 1,95,984 చ.కి.మీ; జనాభా: 3,40,86,000 (1981), రాజధాని: గాంధీనగరం (అహ్మదాబాద్); అధికార భాష: గుజరాతీ. వదోదోరా, (బరోడా) సూరత్ ఇతర ప్రధాన నగరాలు. మహాత్మా గాంధీ జన్మించిన రాష్ట్రం. ఆయన స్థాపించిన సబర్మతీ ఆశ్రమం కూడా ఇక్కడే వుంది. కర్కాటక రేఖ ఈ




రాష్ట్రానికి ఉత్తర సరిహద్దుగా ప్రసరిస్తూంది. నర్మదా నది, సబర్మతీ నది, తపతీ నది ఈ రాష్ట్రానికి జలాధారాలు. చిన్ననీటి వనరులు బనాస, మాహీ, దామన్‌గంగా సరస్వతి నదులు. ముఖ్య పర్వతశ్రేణి ఆరావళి. గుజరాత్ ప్రజలు వర్తక వాణిజ్య కార్యకలాపాల్లో ఆరితేరినవారు. రాష్ట్రంలో వాణిజ్యపు పంటలు ఎక్కువ. ప్రత్తి పంటకు దేశంలో అగ్రతాంబూలం గుజరాత్ రాష్ట్రానిదే; పొగాకు పంటలో ద్వితీయ స్థానం. వంటనూనె ఉత్పత్తికి అవసరమయిన

వేరుసెనగ పుష్కలంగా పండుతుంది. నూలువస్త్ర కర్మాగారాలు, సబ్బుల తయారీ వంటి వ్యవసాయాధార పరిశ్రమలు రాష్ట్ర ఆర్థిక స్థాయిని పెంపొందించాయి. వరి, గోధుమ, అరటి, మామిడి, సజ్జ, జొన్న, మొక్కజొన్న మొదలగునవి ఇతర పంటలు. పారిశ్రామికాభ్యుదయం ఎక్కువగా కన్పిస్తుంది. రసాయనాలు, పెట్రోకెమికల్స్, ఎరువులు, ఔషధాలు, బట్టలకు వేసే రంగులు వంటి నూతన పరిశ్రమలు ఇప్పుడిప్పుడు రాష్ట్రంలో స్థాపింప బడుతున్నాయి. సోడా ఆష్, కాస్టిక్ సోడా, సల్ఫ్యూరిక్ ఆసిడ్ భారీఎత్తున ఉత్పత్తి అయి ఇతర ప్రాంతాలకు పంపబడుతున్నాయి. రాష్ట్రంలో పాడి పరిశ్రమ శాస్త్రీయ పద్ధతులలో సాగుతూ దేశానికే ఆదర్శప్రాయంగా ఉంది. కెయిరా, ఆనంద్ పాడి పరిశ్రమకు ప్రధాన కేంద్రాలు. అంకాలేశ్వర్, కాంబే, కాలోల్ ప్రాంతాలలో చమురు వాయువు, తైల నిక్షేపాలు ఉన్నాయి. కొయిలీ వద్ద తైలశుద్ధి కర్మాగారం ఉంది. ఉప్పు పరిశ్రమలో గుజరాత్ ముందంజ వేసింది. 60 శాతం దేశం ఉప్పు అవసరాలను ఈ రాష్ట్రమే తీరుస్తోంది. సింహాలు స్వేచ్ఛగా తిరిగేందుకు నిలైన గిర్ అభయారణ్యం ఇక్కడ వుంది. ద్వారకా, పాలిటానా, సోమనాథ దేవాలయాలు సందర్శించదగినవి. షెత్రుంజయా కొండలో 650 మీ. ఎత్తున ఉన్న జైన ఆలయాలు యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. లోతాల్‌లో 5,000 ఏళ్ళనాటి నాగరకత కనిపిస్తుంది. ఉద్వాడ్‌లోని పార్సీల అగ్నిదేవళం అతి ప్రాచీనమయింది. మొధేరాలోని సూర్య దేవాలయం గొప్పది. గాంధీజీ సంస్మరణార్థం సబర్మతీలో నిర్మించిన జాతీయ స్మారక నిర్మాణం కూడా దర్శించదగింది.

## గురజాడ అప్పారావు

ఆధునికాంధ్ర కవితా పితామహుడు. ''దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్'' అని ఎలు గెత్తి చాటిన 'దేశ'భక్తి గీత రచయిత.

అప్పారావు 1861లో విశాఖపట్నంజిల్లాలోని రాయవరం గ్రామంలో జన్మించారు. విజయనగరంలో చదివి పట్టభద్రులు కావడమే కాకుండా అక్కడి మహారాజావారి ఆస్థానంలో ఉద్యోగం చేశారు. ఆ రోజులలో గంజాం జిల్లాలోని పర్లాకిమిడిలో గిడుగు వెంకట రామమూర్తి పంతులు తెలుగు పుస్తకాలలో వాడుక భాష ఉండాలని ఒక ఉద్యమాన్ని నడిపారు. ఈ ''వ్యావహారిక భాషోద్యమం'' అప్పారావుగారికినచ్చింది. అందువల్ల ఆయనతాను వ్రాసినపుస్తకాలలోవాడుక భాష నేవ్రాశారు.అవన్నీ బాగాప్రచారం పొందాయి. ఆ రోజులలోడబ్బు తీసుకొ నిపసిపిల్లలను వృద్ధులకిచ్చి పెళ్ళిచేసే'కన్యాశుల్కం' దురాచారం ఉండేది.ఈ దురాచారాన్నివ్యతిరేకిస్తూ



అప్పారావు ''కన్యాశుల్కం''(మా.) అనే గొప్ప నాటకాన్ని వాడుక భాషలో వ్రాశారు. ఇది అప్పటికీ ఇప్పటికీ తెలుగులో వెలసిన గొప్ప నాటకాలలో ఒకటిగా పేరు పొందింది. బాల్య వివాహాలను వ్యతిరేకించే ''పూర్ణమ్మ కథ'' అన్న గేయకథ కూడా అప్పారావు రచనలలో గొప్పది. ఆయన ఇతర రచనలు: ''ముత్యాల సరాలు'', ''లవణ రాజుకథ'', డామన్—పితియస్ అన్న గేయ కథలు, ''మీ పేరేమిటి?'', ''దిద్దుబాటు'' మొదలైన చిన్న కథలు. ఇవన్నీ గొప్పవే! తెలుగు బాలబాలికలు అందరూ విధిగా చదివి తీరవలసినవే! తెలుగునాట అంతటా నవ్యాంధ్ర కవితావైతాళికుడుగా ప్రసిద్ధి పొందిన మహాకవి గురజాడ అప్పారావు 1915 నవంబరు 30న పరమపదించారు.

## గురు గోవింద్ సింగ్

సిక్కుమత ప్రవక్త. గ్రంథసాహెబ్ రచయిత. 1666 లో ఈయన పాట్నాలో జన్మించారు. మొగలాయీ వంశీకులు భారతదేశాన్ని పాలిస్తున్న కాలంలో ఔరంగజేబు వంటి ముస్లిం తీవ్రవాదులు పరమతస్థుల పట్ల అనుకరిస్తున్న తీవ్ర వైఖరిని ఈయన తండ్రి గురుతేజ్ బహదూర సింగ్ వ్యతిరేకించాడు. తేజ బహదూరును ఔరంగజేబు తన దర్బారుకు పిలిపించి సిక్కుధర్మాన్ని విడనాడమని ఆజ్ఞాపించాడు. తేజ్ బహదూర్ ఆ ఆజ్ఞను తిరస్కరించగా ఔరంగజేబు ఆయనను అంతమొందించాడు. అప్పుడు గురు గోవిందుసింగ్ 9 ఏళ్ల ప్రాయంవాడు. ఔరంగజేబు దుశ్చర్యపట్ల కోపోద్రిక్తుడయి,

సిక్కుధర్మ సంస్థాపనకై శపథం చేశాడు. దీక్షతో సంత్ సైనిక సింగ్ (ఖాల్సా) పవిత్ర దళాన్ని సమీకరించి వారికి ఉత్తేజం కలిగించాడు. 'జపనామా' విజయ పత్రాన్ని మొగల్ చక్రవర్తి ఔరంగజేబుకు వ్రాయగా గురు గోవింద్ సింగ్‌ను తన దర్బారుకు రమ్మని ఆయన కబురు పంపాడు. అయితే ఆయన కోటకు చేరేలోపుగానే ఔరంగజేబు ఊపిరి వదిలాడు. గురుగోవింద్ సింగ్ 'చిత్రనాటక' అనే ఖండకావ్యం, 'గ్రంథసాహెబ్' అనే సిక్కు పవిత్ర గ్రంథం వ్రాశాడు. ఇవి సిక్కులకు శిరోధార్యాలు. 1708లో గురు గోవింద్ సింగ్ సిద్ధి పొందాడు.

## గురునానక్ 1469–1538

సిక్కుమత స్థాపకుడు. నేటి పాకిస్తాన్‌లోని లాహోరు సమీపంలో ఈయన జన్మించారు. చిన్నప్పటి నుంచి ఆధ్యాత్మిక చింతన గలవాడు. ఒకరోజున రావీ నదిలో స్నానంచేస్తూ ఉండగా ఏదో దివ్యానుభూతి ఆయనకు కలిగింది.ఒక భగవత్సందేశం వినిపించింది.అది''నానక్ నేనునీకు తోడుగాఉన్నాను. నేటి నుంచి నీవునా మాహాత్మ్యాన్ని లోకానికివెల్లడి చెయ్యి సంసార దోషాలకు దూరంగా ఉండు. సర్వకాల సర్వావస్థల యందు నా నామమునందే నీ మనస్సును లగ్నం చెయ్యి''. ఆ తర్వాత నానక్ గృహస్థాశ్రమం త్యజించి తన శేషజీవితాన్ని సిక్కుమత ప్రచారానికి వెచ్చించాడు (చూ. సిక్కు మతం).



## గుర్రం జాషువా చూ. జాషువా,గుర్రం

## గెబన్

పశ్చిమ ఆఫ్రికాతీరాన ఉన్న ఒక చిన్న గణరాజ్యం. దేశంలో ఆర్థిక సంపద పుష్కలంగా ఉన్నప్పటికీ ప్రజల జీవన ప్రమాణం తక్కువ స్థాయిలోనే వుంది. 1900 ప్రాంతం వరకూ ఫ్రెంచ్ అధీనంలో ఉండి 1960లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకుంది.

విస్తీర్ణం: 2,67,667 చ.కి.మీ; జనాభా: 12,19,000 (1988), రాజధాని: లైబర్‌విల్లీ, అధికార భాష: ఫ్రెంచ్. ప్రజలు షాంగ్ మొదలైన మాండలిక భాషలను కూడా మాట్లాడతారు.




ఓగూలే నది ముఖ్యమైన జలాధారం, ప్రధాన జలమార్గం. దేశంలో మహోగనీ,ఎబనీ వంటి నాణ్యమైన కలప, ప్లైవుడ్‌కు పనికి వచ్చే కలప లభిస్తుంది. కోకో, అరటి, కర్రపెండలం, కాఫీ, పెండలం వంటి కందమూలాలు ఎక్కువగా పండుతాయి. తిమింగలం వేట, సముద్రపు చేపల వేట ప్రధానమైన వృత్తులు. పెట్రోలియం, బంగారం, యురేనియం వంటి ఖనిజ నిక్షేపాలున్నాయి. నాణ్యమైన ఇనుపరాయి, మాంగనీసు ఖనిజం పుష్కలంగా దొరుకుతాయి. అయినా పారిశ్రామికాభివృద్ధికి ఇంకా గెబన్ నోచుకోలేదు.

## గొబ్బి ఆట

ధనుర్మాసంలో ఆంధ్రదేశంలో బాలికలు ప్రాంగణాలలో చిత్రవిచిత్రాలైన ముగ్గులు పెట్టి, గోధుమ పిండితో గాని, గోమయంతోగాని చిన్న కందుకాలంత ప్రమాణంలో ముద్దలు చేసి, పసుపు—కుంకుమలతోనూ, పుష్పాలతోనూ వాటిని సింగారించి, ధూపదీప నైవేద్యాలతో పూజిస్తారు. రంగవల్లులలో వాటిని ఉంచి అందరూ కలిసి వాటిచుట్టూ తిరుగుతూ పాటలు పాడతారు. (వీటినే గొబ్బిపాటలంటారు) ధనుర్మాసం నెలరోజులూ ఈ గొబ్బిదేవత పూజలతో బాలికలకు తీరిక ఉండదు.

## గోఖలే, గోపాలకృష్ణ 1866–1915

ఆధునిక ప్రజాస్వామ్య సంక్షేమ రాజ్యానికి స్వేచ్ఛ ప్రాతిపదిక అని చాటి చెప్పిన భారత రాజనీతివేత్త. 48 సంవత్సరాలు జీవితంలో ఎందరినో ప్రభావితులను చేసి గాంధీజీ అంతటి వానికే 'నా గురువు' అనిపించుకున్న మేధావి, దేశభక్తుడు గోఖలే.

మహారాష్ట్రలోని కొల్హాపూర్‌లో 1866 మే 9న గోఖలే జన్మించాడు. బొంబాయి ఎల్ఫిన్‌స్టన్ కళాశాలలో చదివి, తన 18వ ఏట పట్టభద్రుడై, 1886 నుంచి దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీ సభ్యుడుగా ఉంటూ, పూనా ఫెర్గూసన్ కళాశాలలో చరిత్ర, ఆర్థిక శాస్త్ర అధ్యాపకుడుగా పనిచేశాడు. 'సుధాకర్' అనే సార్వజనిక సభాపత్రికకు సంపాదకత్వం వహించాడు. 1889 నుంచి కాంగ్రెస్ రాజకీయాలలో ప్రవేశించి, ఇండియన్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడయాడు. 1905లో గోఖలే కాంగ్రెస్ అధ్యక్షుడయాడు.

రాజ్యాంగబద్ధంగా ఆందోళన చేయడాన్నీ, స్వదేశీ ఉద్యమాన్నీ గోఖలే సమర్థించాడు. ఎన్నికలలో కులం, మతం ఆధారంగా ప్రాతినిధ్యం ఉండరాదనీ, ఎన్నికలలో ప్రాతినిధ్యం లేని జాతులకు జనాభా ప్రాతిపదికపై కొన్ని స్థానాలు కేటాయించవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు. విద్యార్థులు రాజకీయ చైతన్యం కలిగి ఉండాలే తప్ప ప్రత్యక్షంగా కార్యరంగంలోకి దూకరాదని ఆయన సలహా ఇచ్చాడు.

ప్రజలందరూ అక్షరాస్యులు కావాలంటూ 1912లో ప్రాథమిక నిర్బంధ విద్యబిల్లు ఆయన ప్రవేశపెట్టాడు. బిల్లు ఓడిపోయినా గోఖలే ప్రతిపాదన ప్రజామోదం పొందింది. పాశ్చాత్య విద్యావిధానంలోని అత్యుత్తమమైన అంశాలన్నీ భారతీయ విద్యావిధానంలో పొందుపరచాలనీ బ్రిటిష్‌పాలన భారతీయులకు స్వయంపాలనలోశిక్షణ వంటి దనీ ఆయనఅభిప్రాయం.భారతప్రజల సమస్యల పరిష్కారానికై 1905లో'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ'ని ఆయనస్థాపించాడు.రాజకీయాలలోకి మతాన్ని



చేరనీయకూడదంటూ సెక్యులర్ ధోరణిని గోఖలే సమర్థించాడు. భారతీయుల ఆర్థిక దుస్థితికి పరిష్కారాలు సూచిస్తూ, శిస్తు తగ్గించాలనీ, ధరలను బట్టి శిస్తును నిర్ణయించే విధానాన్ని ప్రవేశపెట్టాలనీ, వ్యవసాయ బ్యాంకులను స్థాపించాలనీ, తక్కువ వడ్డీలకు రైతులకు ఋణాలు ఇవ్వాలనీ ఆయన అన్నారు. 1915లో గోపాలకృష్ణ గోఖలే కీర్తిశేషులయ్యాడు.

## గోతే

చూ. ఫౌస్ట్

## గోదావరి నది

భారతదేశంలోని నదులలో ప్రధానమైనది అరేబియా సముద్రానికి 80 కి.మీ. దూరంలో మహారాష్ట్రలోని పడమటి కనుమలలో సముద్రమట్టానికి సుమారు 650 మీటర్ల ఎత్తున నాసిక్‌త్ర్యంబకం వద్ద చిన్న ఊటగా ఆవిర్భవించి, నిజామాబాదు జిల్లాలో ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రవేశించి, రాజమండ్రికి ఎగువన పాపికొండ కనుమల ద్వారా మైదానంలో అడుగుపెట్టిన అఖండ గోదావరి ధవళేశ్వరం వద్ద రెండు పాయలుగా చీలింది. తూర్పు దిశగా ప్రవహించేపాయ 'గౌతమీనది'. మరొక పాయ 'వశిష్ట' పశ్చిమానికి మళ్ళింది. గౌతమి తిరిగి పాయలై కోరింగనది, కాకినాడవద్ద పశ్చిమానికి మళ్ళి కోన సీమలో ప్రవేశించి గోదావరి పాయింటువద్ద సముద్రంలో కలుస్తూంది. వశిష్టనది పశ్చిమంగా ప్రవహించి నర్సాపురం సమీపంలో బంగాళాఖాతంలో కలుస్తుంది. నాసిక్ నుంచి నర్సాపురం వరకూగల గోదావరి నది పొడవు 1440 కి.మీ. గోదావరి నదికి ఉపనదులలో మంజీరనది, కడంనది, పెన్‌గంగా, వెయిన్‌గంగా, ఇంద్రావతి, శబరి, మత్స్యకందం, (మాచికుండ) ప్రధానమయినవి. గోదావరినదీ పరీవాహకప్రాంతం మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో వ్యాపించి ఉన్నది.

గోదావరి నదీజలాలను సముద్రం పాలుకాకుండా సద్వినియోగ పరచడానికి డాములు, ఒక ఆనకట్ట, ఒక బరాజ్ నిర్మించారు. కాటన్ బరాజ్ (ధవళేశ్వరంవద్ద) ఎగువ, దిగువ సీలేరు డాములు, నిజాంసాగర్ డాము, పోచంపాడు డాము (శ్రీరాం సాగర్ డాము), కడం డాము ముఖ్యంగా పేర్కొన దగినవి. ఇచ్చంపల్లి జలవిద్యుత్

ప్రణాళిక ఇంకా చేపట్టవలసి ఉంది. ఆంధ్రప్రదేశ్‌లోని కాటన్ బరాజ్ సమీపంలో 1852లో ఆర్థర్ కాటన్ నిర్మించిన ఆనకట్టను పునర్నిర్మించారు (1982). దీనివల్ల ఉభయ గోదావరి జిల్లాలకూ పంటనీరు పుష్కలంగా లభించడమేగాక కాలువల వ్యవస్థ పడవల రాకపోకలకు సౌకర్యంగా ఉంది.

## గోపాలకృష్ణయ్య, దుగ్గిరాల

ప్రముఖ జాతీయ నాయకుడు. మహావక్త. గ్రంథకర్త. కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పెనుగంచి ప్రోలులో 1889 జూన్ 20వ తేదీన గోపాలకృష్ణయ్య జన్మించారు. పుట్టిటిలోనే తల్లి, మూడో ఏట తండ్రి మరణించడంతో పినతండ్రి శివరామయ్య వద్ద పెరిగాడు.



ఇంగ్లండ్‌వెళ్ళి విద్యాభ్యాసంచేసినప్పటికీ పాశ్చాత్య ఆచారాలపట్ల వ్యామోహితుడు కాలేదు.మహాత్మాగాంధీ ప్రభావానికి లోనై దేశసేవలోసర్వస్వం త్యాగంచేశారు.చీరాల,పేరాలగ్రామాలలో ప్రభుత్వం మునిసిపాలిటీని స్థాపించే ప్రయత్నంచేయగా దానిని నిరోధించడానికి అహింసా,సత్యాగ్రహ సూత్రాలపై 'రామదండు' పేరున ప్రజలను కూడగట్టి ఊరిబయట డేరాలలో ఏడాది పాటు జీవించేట్టు చేశారు. తరువాత చిరాపల్లి జైలులో ఒక ఏడాదిపాటు కఠిన శిక్ష అనుభవించారు.

మధ్యమధ్య సంస్కృత శ్లోకాలు, తెలుగు పద్యాలు పాటలు మధురమైన కంఠంతో ఆలపిస్తూ అనర్గళంగా ఆయన ఉపన్యసించి ఆకట్టుకునేవారు. ఆనంద కె. కుమార స్వామితో కలిసి 'అభినయ దర్పణం' ఆంగ్లీకరించారు. భారతజాతీయ కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు. 'రామదాసు' అనే బిరుదు పొంది శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠి అనే జాతీయ విద్యాలయం స్థాపించిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య క్షయవ్యాధి పీడితుడై, 1928 జూన్ 10వ తేదీన పరమపదించారు.

## గోమతేశ్వరం

కర్నాటక రాష్ట్రంలో శ్రావణ బెలగోళావద్ద ఉన్న జైన క్షేత్రం. ఇక్కడ కొండమీద చెక్కబడిన దిగంబర గోమతేశ్వరుని శిలావిగ్రహం సుప్రసిద్ధమైంది. ఈ ఏక శిలా విగ్రహం ఎత్తు 18 మీటర్లు.

## గోర్కీ, మాగ్జిం 1869–1939

సుప్రసిద్ధ రష్యన్ నవలా రచయిత. అసలు పేరు విలెక్జే నికొలాబ్ విచ్ ప్యేష్‌కోవ్;మాగ్జిమ్‌గోర్కీ ఆయన కలంపేరు. చాలా కష్టపడి ఆయన పైకి వచ్చాడు. ఆత్మస్థైర్యం కలవాడు. లెనిన్‌కు మిత్రుడు. తన రచనల మూలంగా బహిష్కృతుడై అమెరికా వెళ్లి అక్కడివారితో సరిపడక ఇటలీలోని క్రేపీ నగరం చేరాడు. 1907లో స్వీయచరిత్ర రచించాడు. 1913లో రష్యా తిరిగివచ్చి 'లెటోపిస్' అనే పత్రికను స్థాపించాడు. అక్టోబర్ విప్లవం (1917) తర్వాత సోవియెట్ రష్యా ప్రభుత్వానికి సాంస్కృతిక వ్యవహారాల సలహాదారుగా ఉన్నాడు. ఇతని ప్రసిద్ధ రచన 'అమ్మ'. ఇది తెలుగులోకి కూడా అనువదించబడింది. గోర్కీ కథానికలు కూడా బహుళ ప్రచారం పొందాయి.

ఈయన జన్మస్థలం అయిన 'నిజ్‌నీ నవ్గాగ్రోడ'కు 'గోర్కీ పట్టణం' అని పేరుపెట్టి గౌరవించారు.

## గోర్బచెవ్

రష్యన్ రాజకీయ నాయకుడు. నేటి ప్రపంచ రాజకీయాలలో అత్యధిక ప్రాధాన్యం సాధించిన రాజనీతి చతురుడు. పూర్తిపేరు మిఖాయిల్ సరీవిచ్ గోర్బచెవ్. బ్రెజ్‌నెవ్ అనుచరుడు. 1985 నుంచీ సోవియట్ రష్యాకు ప్రధానిగా ఉన్నాడు. 1988 నుంచీ సోవియట్ అధ్యక్షుడు.రష్యారాజకీయాలను ప్రజాస్వామ్యప్రాతిపదిక మీద నడిపిద్దామనే ఉద్దేశ్యంతో రాజ్యపాలనలో పునర్వ్యవస్థీకరణ (పెరిస్త్రోయికా), బహిరంగ రాజనీతి (గ్లాస్‌నాత్)అనేనూతన విధానాలను ప్రవేశపెట్టి ప్రపంచ దృష్టిని



ఆకర్షించాడు. ఈ రాజకీయ సంస్కరణలు రష్యా రాజకీయ ఆర్థిక విధానాలకు క్రొత్తరూపును ఇవ్వగలవని భావిస్తున్నారు. ఇతర దేశాలతో పెట్టుకోవలసిన సంబంధాల విషయంలో కూడా కొత్త పుంతలు తొక్కి అపరచాణక్యుడనే ప్రఖ్యాతి ఆర్జించుకొన్నాడు. మంచివక్త. అందరినీ ఆకట్టుకునే శక్తిగల ధీమంతుడు.

గోర్బచెవ్ రష్యన్ రైతుబిడ్డ. ఉత్తర కాల్‌సస్ పర్వత శ్రేణుల ప్రాంతంలో ఉన్న ప్రేవూల్నో లోయలో 1931 మార్చి 2న జన్మించాడు. మాస్కో యూనివర్శిటీలో 1950–55 మధ్య న్యాయవిద్యనభ్యసించాడు. 1952 లోనే సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. కొన్నాళ్ళు కోమ్సోమోల్‌లో యువ కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొని 1963 నాటికి పార్టీ వ్యవహారాలు చేపట్టి స్ట్రావ్రోపోల్ కార్యదర్శి అయ్యాడు (1970). 1971లో కమ్యూనిస్టు కేంద్ర సంఘానికి ఎన్నుకోబడ్డాడు. 1978లో వ్యవసాయ మంత్రిత్వశాఖ చేపట్టడంతో ఆయన రాజకీయ ఉన్నతి ప్రారంభమయింది. 49వ ఏటనే 1979లో పోలిట్‌బ్యూరోలో సభ్యత్వం పొంద గలిగాడు. బ్రెజ్నెవ్ మరో ఇద్దరు వృద్ధనేతలు మరణించిన తర్వాత చెర్నెంకోకు వారసుడుగా గోర్బచెవ్ రష్యా అధినేత అయ్యాడు (1985).

# గోల్కొండ కోట

తానీషా రామదాసును బంధించిన కోట. హైదరాబాదుకు పశ్చిమంగా పది కిలోమీటర్ల దూరంలో వున్న చారిత్రక దుర్గం. 1518–1687ల మధ్య ఈ ప్రాంతాన్ని ఏలిన కులీకుతుబ్ షాహీ రాజవంశీయులకు రాజప్రాసాదంగా ఉండిన గ్రానైట్ రాతి నిర్మాణం. కోట చుట్టుకొలత 11 కిలోమీటర్లు. 8 ద్వారాలూ, 70 బురుజులూగల ఈ కోట లోపల ఎత్తయిన కొండమీద రాజమహల్ ఉంది. ఈ కోట నిర్మాణంలో ఇమిడి ఉన్న ప్రతిధ్వని సూత్రం విశిష్టమైంది. క్రింద ప్రధాన గోపుర ద్వారం వద్ద నిలబడి చప్పట్లు కొడితే అవి సుమారు 60 మీటర్ల ఎత్తునఉన్న రాజమహల్‌లో వినబడుతాయి. అక్కడక్కడ ధ్వని తరంగాల్ని గ్రహించి మరల ప్రతిధ్వనించే సున్నిత స్ఫటికాలు పొదిగినట్లు చెబుతారు. మట్టిగొట్టాల ద్వారా పర్షియన్ చక్రాలు ఉపయోగించి నీటిని రాజమహలుకు ఎత్తిపోస్తూ శీతలీకరణం (ఎయిర్ కండిషనింగ్) ఏర్పాటు కూడా చేశారు.

రామదాసును తానీషా బంధించి ఉంచిన బందిఖానా భక్తులైన యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తూ ఉంటుంది.


గోల్కొండ కోట

# గోవా రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. అరేబియా సముద్ర తీరాన బొంబాయికి దక్షిణంగా ఈ రాష్ట్రం ఉంది. వాస్కోడగామా రాకతో 1534 నుంచి పోర్చుగీసు వలసపాలనలో ఉన్న గోవా, డయ్యూ, డామన్‌లు 1961లో భారతదేశంలో విలీనమయి, 1987 వరకూ కేంద్రపాలిత ప్రాంతాలుగా ఉంటూ వచ్చాయి. 1987లో గోవాకు రాష్ట్రస్థాయిని కల్పించారు. డయ్యూ, డామన్(చూ.) కేంద్రపాలిత ప్రాంతాలుగానే ఉండిపోయాయి.




విస్తీర్ణం:3,702 చ.కి.మీ.; జనాభా: 10,07,749(1981);రాజధాని: పానాజీ; అధికారభాష: కొంకణి, మరాఠీ, సహ్యాద్రి పర్వతశ్రేణి ఉత్తర భాగం గోవాకు తూర్పుగా ఉంది. పశ్చిమానికి ప్రవహించి అరేబియా సముద్రంలో పడే చపోరానది, మాన్డోనది, జూఆరీనది, టెరిఖోల్‌నది, బీతులునది గోవాకు జలాధారాలు. వరి, రాగి, జీడిమామిడి, కొబ్బరి ప్రధానమైన పంటలు. ప్రజలు కష్టపడి పనిచేసే శ్రమజీవులు. గోవా రాష్ట్రం బయటి వారిపై ఆధారపడకుండా స్వయంసమృద్ధి సాధించింది. తమ కాళ్ళమీద తాము నిలబడాలనే పట్టుదల ప్రతి పౌరుని లోనూ కనిపిస్తుంది. గోవా ప్రజల తిండిలో వరి, చేపలు ప్రధానం. ఇక్కడ చేపలు పుష్కలంగా లభిస్తాయి. చేపలను

వేటాడడానికి మర పడవలను విరివిగా వాడు తారు. ఇనుపరాయిని త్రవ్వి జపానుకు ఎగుమతి చేస్తున్నారు. కోల్వా, కాలంగూట్, వాగారువంటి బీచ్‌లతో గోవా సముద్రతీరపు ప్రకృతి సౌందర్యం, అనుకూలమైన వాతావరణం వినోదపర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తు న్నాయి. ఏడాదికి 10 లక్షలకుపైగా పర్యాటకులు గోవాను సందర్శిస్తున్నారు. బామ్ జీసస్ బాసిలికాలో సెయిడూ ఫ్రాన్సిస్ జేవియర్ రక్షిత మృతశరీరపేటిక ఉంది. ఇతర క్రైస్తవ పుణ్యక్షేత్రాలు, సెకోతేడ్రల్, అస్సీసీచర్చ్, 'పోండా'లో 'మాన్దువా'నది సంగమ స్థానంలో హిందువుల దేవళం మంగ్వేషీ శివాలయం ఉంది. 'ఆరవేలం' జలపాతం, మయేం సరస్సు, బోందియా అభయారణ్యం, మార్మగోవా హార్బరు, అగేడాకోట ఈ రాష్ట్రంలో ప్రధానంగా దర్శించదగ్గవి.

## గోవింద వల్లభ పంత్

ప్రముఖ జాతీయ కాంగ్రెసు నాయకుడు, రాజనీతిజ్ఞుడు. 1887 సెప్టెంబరు 10న గోవింద వల్లభ పంత్ జన్మించాడు. అలహాబాదు యూనివర్శిటీలో న్యాయవిద్య అభ్యసించి అలహాబాదు హైకోర్టులోనే న్యాయవాద వృత్తి చేపట్టాడు. భారత స్వాతంత్ర్యానికి పూర్వమే ల్యాండ్ ట్రిబ్యునల్‌కు అధ్యక్షుడుగాపదవీ బాధ్యతలను కడుసమర్థంగా ఆయననిర్వహించాడు. సైమన్ కమీషన్ రాకను వ్యతి రేకి స్తూప్రచారంచేశాడు. 1934 లోవైస్రాయి ఎక్జిక్యూటివ్ కౌన్సిల్‌లోసభ్యుడుగా ఎన్నికఅయ్యాడు. 1935లో భారతీయచట్టం ప్రకారంరాష్ట్రాలలో ఏర్పడినకాంగ్రెసు మంత్రివర్గాలలో సంయుక్త రాష్ట్రాల (యునైటెడ్ ప్రావిన్సెస్, అనగా నేటి ఉత్తర ప్రదేశ్) మంత్రి వర్గానికి నాయకుడుగా ప్రీమియర్ పదవిని చేపట్టి నిర్వహించాడు. స్వాతంత్ర్యానంతరం కేంద్ర ప్రభుత్వంలో మంత్రివర్గ సభ్యుడై ఆంతరంగికశాఖ (హోమ్)ను దక్షతతో నిర్వహించాడు. పంత్ చేసిన ప్రజాసేవలకు గుర్తింపుగా ఆయనకు 'భారతరత్న' పురస్కారం (1957) లభించింది. ఉత్తమ ప్రజా సేవ లందించి ఘన కీర్తి గడించిన గోవింద వల్లభ పంత్ 1961 లో పరమ పదించాడు.



## గౌతమ బుద్ధుడు క్రీ.పూ. 567–489(?)

బౌద్ధమతం స్థాపించిన మహామహనీయుడు. క్రీ.పూ. 567వ సంవత్సరంవైశాఖ పూర్ణిమనాడు గౌతమ బుద్ధుడు జన్మించాడు. నేపాల్‌లోని కపిలవస్తు పురాన్ని పాలించిన శుద్ధోధన మహారాజు, మాయాదేవి దంపతులకు లుంబినీలో ఆయన జన్మించాడు. బుద్ధుడు పుట్టిన ఏడో రోజునే తల్లి స్వర్గస్థురాలు కావడంతో పినతల్లి ఆయనను పెంచి పెద్ద చేసింది. ఆయన శాంత స్వభావుడు, మితభాషి. సమస్త ప్రాణికోటిపట్లా అపారమైన ప్రేమ ప్రదర్శించేవాడు. తండ్రి అభీష్టాన్ని మన్నించి యశోధరను ఆయన వివాహమాడాడు. క్రమంగా ఆయనలో ఐహిక


గౌతమ బుద్ధుడు ప్రథమ ప్రవచనంచేయుట

సుఖాలపట్ల వైముఖ్యం ఏర్పడి, శారీరక సుఖం స్థిరం కాదనే అభిప్రాయం బలపడింది. తన 29వ ఏట భార్యను, 7 రోజుల ప్రాయంగల కుమారుడు రాహులుణ్ణే వదలి, ఒక అర్ధరాత్రి సమయంలో రహస్యంగా బయలుదేరి అరణ్యం చేరాడు. ఇదియే మహాభినిష్క్రమణ. అక్కడ తపస్సు చేయసాగాడు. ఇంద్రియాలను అరికట్టి తనను తాను తెలుసుకోవాలనే కఠిన సాధనలో కృతార్థుడయ్యాడు. బోధివృక్షం కింద ఆసీనుడై ఉండగా ఆయనకు నిర్వాణమార్గం గోచరించింది. అప్పటినుంచే ఆయన 'బుద్ధు'డయ్యాడు. అనాటి నుంచి తాను కనుగొన్న నూతన ధర్మాన్ని ప్రపంచంలో ప్రబోధింప సాగాడు.

శుద్ధోధనుడు, బుద్ధుని భార్య యశోధర, కుమారుడు రాహులుడు కూడా ఆయనకు శిష్యులయారు. బుద్ధుని బోధనలు 'త్రిపిటకాల' (చూ.)లో పొందుపరచబడ్డాయి. బౌద్ధమతం క్రమేణ దేశదేశాలకు ప్రాకి ప్రపంచంలో మరి ఏ మత ధర్మానికీ లభించనంత వ్యాప్తిని సాధించింది. బౌద్ధ ధర్మంలో హృదయ పారిశుద్ధ్యం, విశ్వప్రేమ ప్రధాన సూత్రాలు. బుద్ధునికి సిద్ధార్థుడనీ, తథాగతుడనీ పేర్లు ఉన్నాయి. బుద్ధుడు జ్ఞానోదయం పొందిన తరవాత మహాపరి నిర్వాణం (అరిషడ్వర్గాల్ని పరిహరించుకొనుట) స్థితిని పొందుతాడు. ధర్మప్రచారం చేస్తూ క్రీ.పూ. 480 లో కుశినగరంలో సిద్ధి పొందుతాడు.

## గౌతమీపుత్ర శాతకర్ణి 62–86

ఆంధ్ర సాతవాహన వంశరాజులలో ఈయన 28వ వాడు. వాయవ్య దిశనుంచి వచ్చిన కుషాణులు అనబడే మధ్య ఆసియా తెగవారు. శక, పహ్లవులును వేధిస్తూ ఉండగా గౌతమీ పుత్ర శాతకర్ణి తన పశ్చిమ శత్రువులను జయించి, తన విజయానికి చిహ్నంగా వెనుకటి నహపానుని శాసనాల మీద తన ముద్ర తిరిగి వేయించాడు. ఈయన తల్లి అయిన గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక్ శాసనంలో 'సాతవాహన కీర్తి వైభవ పునరుద్ధారకుడు' అనీ, క్షత్రియ గర్వాపహారి అయిన అసమాన బ్రాహ్మణుడు అనీ ఈయన కీర్తించబడ్డాడు. ఈయన రాజ్యం తూర్పు, పడమర సముద్రాలవరకూ వ్యాపించి ఉన్నట్లు తెలుస్తూంది. 24 సంవత్సరాలు రాజ్యం ఏలి క్రీ.శ. 86లో ఈయన పరమ పదించాడు.

## గౌతమ సూత్రాలు

గౌతమ మహర్షి ప్రోక్తమైన ధర్మశాస్త్రం. గౌతముడు భారతీయ సప్త మహర్షులలో ఒకడు. హిందువులకు ప్రధానమైన 18 స్మృతులలో 'గౌతమ స్మృతి' ఒకటి. త్రేతాయుగం నాటి ధర్మాలను 'గౌతమ స్మృతి' ప్రతిపాదించిందని పురాణాలు చెబుతున్నాయి. గౌతమ ధర్మ సూత్రాలను దూషించిన వ్యాసుణ్ణి తన కన్నులతో చూడనని ప్రతిజ్ఞ చేసి ఈ గౌతమ మహర్షి తన పాదంలో కన్నును కల్పించుకొని దానితో లోకాన్ని దర్శించ సాగాడని పద్మపురాణంలో ఉంది.

## గ్రంథ సాహెబ్

సిక్కు మతానికి ప్రామాణికమైన పవిత్ర గ్రంథం. దీనిలో 1.అధిగ్రంథ్, 2.దశమ్ పాదుషా హీదాగ్రంథ్ అని రెండు భాగాలు. అధిగ్రంథ్ ను ఐదవ సిక్కు పీఠాధిపతి అర్జున్ (1581–1606) సంకలనం చేశారు. దీనిలో గురునానక్ ప్రబోధాలు, ప్రార్థనలు ఉన్నాయి. వాటితో పాటు కబీరు, రామానంద్, నామదేవ్ వంటి మహాభక్తుల గీతాలను, సూఫీ వేదాంతి షేక్ ఫరీద్ రచనలను కూడా కొన్నింటిని చేర్చారు. సిక్కుల కట్టకడపటి (10వ) పీఠాధిపతి గురుగోవింద్ సింగ్ రచన జాప్‌జీ, అకాల్ ఉస్తాద్ అనే భగవత్ప్రార్థన, గురుగోవింద్ ఆత్మకథ 'విచిత్రనాటక్' రెండవ భాగం అయిన దశమ్ పాదుషా హీదాలో ఉన్నాయి. దీనిలో మార్కండేయ పురాణంలోని దేవీ మహాత్మ్యం, జ్ఞాన ప్రబోధ, హజర్‌దేశబ్ద్, శాస్త్ర నామమాల మొదలైనవాటిని కూడా చేర్చారు. గ్రంథ సాహెబ్‌ను గానం చేయడంలో ఉపయోగించే 31 రాగాలూ భారతీయ సంగీత శాస్త్రానుగుణమైనవే.

## గ్రిమ్ సోదరులు

జాకబ్ గ్రిమ్ (1785–1863), విల్‌హెల్మ్ గ్రిమ్ (1786–1859) జర్మనీకి చెందిన బాలసాహిత్య నిర్మాతలు. స్నోవైట్ అండ్ సెవెన్ డార్ఫ్స్, గూస్ గర్ల్, గ్రెబెర్ వంటి పిల్లల కథలు రచించిన వారు. వారు పురాణ కథలు, అద్భుత కథలు, జానపద కథలు రచించగా వాటికి జార్జ్ క్రుయింక్ షాన్క్ చిత్రాలు వేయగా అవి జగత్ప్రసిద్ధి పొంది, ప్రపంచంలోని పలుభాషలలోకి అనువదింప బడ్డాయి.

# గ్రీనిచ్ కాలమానం

ఇంగ్లండులోని లండన్ నగర సమీపంలో ఉన్న 'గ్రీనిచ్' ద్వారా ఉత్తర, దక్షిణాలుగా పోయే ఊహారేఖను ప్రధాన రేఖాంశం (మెరిడియన్)గా ప్రమాణీకరించారు. ఈ రేఖను '0°' ప్రధాన రేఖాంశంగా గుర్తించారు. ఈ ప్రధాన రేఖాంశానికి ఇరువైపులా అంటే తూర్పున, పశ్చిమాన వివిధ రేఖాంశాలను గుర్తించారు. ఇలా భూమండలాన్ని 23 పూర్తి కాల మండలాలుగాను, రెండు అర్ధకాల మండలాలుగాను మొత్తం 25 కాల మండలాలుగా చేశారు. ఒక్కొక్క కాల మండలం పరిమాణం 15°, అర్ధ కాలమండలం పరిమాణం $7\frac{1}{2}°$. గ్రీనిచ్‌లో మిట్టమధ్యాహ్నం 12 గంటలు అయినప్పుడు భారత దేశంలో సాయంకాలం 5 గం. 30ని. అవుతుంది. భారతదేశం కాలమండలాన్ని గుర్తించే 81°–50' తూర్పు రేఖాంశం అలహాబాదు ద్వారా పోతుంది.

గ్రీనిచ్ కాలమానం 1884లో జరిగిన ఒడంబడిక ప్రకారం ఏర్పాటయింది. (చూ.అంతర్జాతీయ తేదీ రేఖ).

# గ్రీస్

పాశ్చాత్య నాగరకతకు మూలస్తంభం అయిన గ్రీస్ రాజ్యం 1974లో స్వతంత్రం గణ రాజ్యమయింది. దీనికి 4,000 ఏళ్ళ ఉజ్జ్వల చరిత్ర ఉంది. ప్లేటో(చూ.) అరిస్టాటిల్, అలెగ్జాండర్ (చూ.) యూరిపిడీస్, హెరోడోటస్, హోమర్, సోక్రటీస్ (చూ.) యూక్లిడ్, ఆర్కిమెడీస్, పైతాగరస్, హిపోక్రేటిస్, పెరిక్లీజ్, తేల్స్ వంటి ఎందరో మహా మేధావులకు జన్మస్థానం గ్రీస్. క్రీస్తుకు పూర్వం ఇది స్వతంత్ర దేశం. తరువాత రోమన్‌ల ప్రాబల్యానికి లోనైంది. అనంతరం బైజాంటైన్, ఓటోమన్ సామ్రాజ్యాలలో చేరింది. కొన్నాళ్ళు రాజవంశాలు పాలించాయి. ఒలింపిక్ క్రీడలు (చూ.)ఆదిలో గ్రీస్‌లోనే ప్రారంభమయ్యాయి.

విస్తీర్ణం:1,31,957 చ.కి.మీ.;జనాభా:1,00,55,000 (1988); రాజధాని: ఏథెన్స్, అధికార భాష: ఆధునిక గ్రీక్. ప్రజలు క్రైస్తవులు. దాదాపు 437 దీవులు కలిసి గ్రీస్ దేశం ఏర్పడింది. వీటిలో పిండస్, క్రీట్, పెలోపొన్నెసస్, ఏజియన్ ముఖ్యమయిన దీవులు. బాల్కన్ పర్వతాలు ఈ దీవులలో కానవస్తాయి. అఖెలూస్ నది, అలియామన్ నది, అరక్ తోస్ నది, మారిట్సా నది, నెస్టోస్ నది, పినియోస్ నది, స్ట్రూమానది, వర్దార్ నది గ్రీస్‌కు ప్రధాన జలాధారాలు. ప్రత్తి, ద్రాక్ష, నిమ్మ, ఆలివ్, పొగాకు, గోధుమ, కాయగూరలు ఇక్కడి సాగు పంటలు. ఖనిజ నిక్షేపాలలో పేర్కొనదగినవి: లిగ్నైట్, బాక్సైట్, క్రోమైట్, సీసం, మాగ్నసైట్, బెరైటిస్, ఇనుపరాయి, మేకలు, గొర్రెల పెంపకం ఎక్కువ. నౌకా వాణిజ్యంలో గ్రీస్ జగత్ప్రసిద్ధిపొందింది. జవుళీ, ఆహార పానీయాలు, చెప్పుకోదగ్గ పరిశ్రమలు. ప్రాచీన నాగరకతా శిథిలావశేషాలు విదేశీ వినోద పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి. ప్రాచీన నగర రాజ్యాలు, ఏథెన్స్, కోరింత్, డోడోనా, డెల్ఫీ, మాసిడోనియా, ఒలింపియా, స్పార్టాలు, తీబ్జ్ మున్నగు ప్రాంతాలు ప్రాచీన చారిత్రక స్థలాలు. 'ఇలియడ్'(చూ.) 'ఒడిస్సే'(చూ.) అనే మహాకావ్యాలు, ఈసప్ కథలు, గ్రీస్ ప్రపంచానికి అందించిన సంప్రదాయ సాహితి. గణితంలో మహా మేధావులైన పైతాగరస్,యూక్లిడ్ గ్రీసు దేశీయులే.






## గ్రెనడా

దక్షిణ అమెరకాకు ఉత్తరంగా కారీబియన్ సముద్రంలో ఉన్న ద్వీపరాజ్యం. కారియాక్ దీవి అన్నిటికంటే పెద్దది. సెంట్‌జార్జ్ దీవిలో జనాభా ఎక్కువ. 1974లో ఈ రాజ్యం స్వాతంత్ర్యం పొందింది.

విస్తీర్ణం: 345 చ.కి.మీ., జనాభా: 1,06,000 (1988). రాజధాని: సెంట్‌జార్జిస్, అధికారభాష: ఇంగ్లీషు. ప్రజలు ఫ్రెంచ్, ఆఫ్రికన్ పేష్యో భాషలు కూడా మాట్లాడతారు. ఎక్కువ మంది నీగ్రోలు (84 శాతం). మిశ్రమ జాతులు 12 శాతం. ప్రజలు ప్రధానంగా క్రైస్తవ మతానుయాయులు. ఈ రాజ్యం వ్యవసాయ ప్రధానమయింది. కొబ్బరి, నారింజ జాతులు, ప్రత్తి, సుగంధ ద్రవ్యాలు, చెరకు, అరటి పండ్లు, మామిడి, కందమూలాలు, అవకాడో పండ్లు, జాజికాయ, జాపత్రి, కోకో, సవర్ సాప్‌పండ్లు, సపోటిల్లా ప్లమ్ పండ్లు ఎక్కువగా పండించి ఎగుమతి చేస్తున్నారు.

## గ్రేట్ బ్రిటన్

యూరప్‌లో పశ్చిమ దిశను ఉన్న ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఒక ద్వీప రాజ్యం ఇది. బ్రిటిషు దీవులనీ, యునైటడ్ కింగ్‌డమ్ అనీ కూడా దీనిని వ్యవహరిస్తారు. ఫ్రాన్స్‌కు, ఈ బ్రిటిషు దీవులకు మధ్య ఇంగ్లీషు ఛానెల్ ఉంది. గ్రేట్ బ్రిటన్ (ఇంగ్లండు), వేల్స్, స్కాట్లండ్, ఐర్లాండ్, మాన్ దీవి, ఛానల్ దీవులు చేరి 'యునైటడ్ కింగడమ్' గా వ్యవహరించ బడుతున్నాయి. బ్రిటిషు వారు ఆరితేరిన నావికులు. సుదూర ప్రాంతాలకు సాహస సాగర యాత్రలు జరిపి యునైటడ్ స్టేట్స్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, కెనడా వంటి ప్రాంతాలలో తమ రాజ్యం స్థాపించారు. ఆఫ్రికా, ఆసియా ఖండాలలో అనేక వలస రాజ్యాలు స్థాపించి ఒకప్పుడు రవి అస్తమించని మహాబ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేశారు. మూడు శతాబ్దాల (17వ శతాబ్ది మొదలు 20వ శతాబ్ది వరకు) పాటు ఆ సామ్రాజ్యం అలా కొనసాగింది. అందులో భారతదేశం కూడా ఉంది. క్రమంగా ఆ సామ్రాజ్యంలోని వేర్వేరు ప్రాంతాలు స్వాతంత్ర్యాన్ని స్థాపించుకోడంతో నేడు ఆ సామ్రాజ్యం నామ మాత్రంగా మిగిలింది. వివిధ దేశాల మీద బ్రిటిష్ వారి రాజకీయ ఆధిపత్యం అంతం అయినా, ఆ దేశాలన్నిటి మీదా ఇంగ్లీషు భాషా సంస్కృతులు చెరగని ముద్ర వేశాయి.

1215లో 'మాగ్నకార్టా' ద్వారా ప్రజాస్వామిక పార్లమెంటరీ విధానానికి నాంది పలికి, ప్రపంచంలో ప్రజాప్రభుత్వ సూత్రావళికి ప్రాతి పదికలు అందించిన దేశం గ్రేట్‌బ్రిటన్. ఎలిజబెత్తు 1, విక్టోరియా వంటి మహారాణుల కాలాలలో సామ్రాజ్య విస్తరణ బాగా జరిగింది. ప్రధాన మంత్రులు డిజ్రేలీ, గ్లాడ్‌స్టన్, చాంబర్లేన్, లాయిడ్ జార్జ్, విన్‌స్టన్ చర్చిల్ వంటి ప్రతిభావంతులైన రాజకీయ ధురంధరులు గ్రేట్ బ్రిటన్‌ను ప్రధాన మంత్రులుగా పాలించారు. షేక్స్‌పియర్, మిల్టన్ వంటి మహా కవులు ఈ దేశంలో పుట్టారు. ఆవిరి యంత్రం ఆవిష్కరణతో 18వ శతాబ్దిలో పారిశ్రామిక విప్లవానికి బీజం వేసింది ఈ దేశమే. ప్రపంచానికి గ్రీనిచ్



కాలమానం (చూ.) ఈ దేశమే ప్రసాదించింది!

విస్తీర్ణం: 2,44,110 చ.కి.మీ; జనాభా: 5,70,06,000 (1988); రాజధాని: లండన్. అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు క్రైస్తవులు. ఎక్కువ మంది ఆంగ్లికన్ చర్చి సంప్రదాయం పాటిస్తారు. బర్మింగ్‌హామ్, గ్లాస్గో, లీడ్స్, షెఫీల్డ్, లివర్‌పూల్, బ్రాడ్‌ఫర్డ్, మాంచెస్టర్, ఎడిన్‌బరో, బ్రిస్టల్ ప్రధాన నగరాలు.

గ్రేట్‌బ్రిటన్‌లో తేమ్స్ నది పెద్దది. దీని నిడివి 346 కి.మీ. సెవెర్న్ నది, ఉత్తర ఐర్లండ్‌లోని లఫ్‌నీగ్ సరస్సు పేర్కొన దగినవి. బార్లీ, ఓట్ ధాన్యం, బంగాళ దుంపలు, గోధుమ, మొక్కజొన్న, బీట్ (పంచదార) దుంపలు పండుతాయి. కోళ్ళ పరిశ్రమ, పశు పోషణ పందుల పోషణ, గొర్రెల పెంపకం సాగుతూంది.

ప్లెయిసీ, షెల్‌ఫిష్ బ్రిటిషు దీవులలోని మత్స్య సంపద. నేల బొగ్గును 300 ఏళ్ళ నుంచి త్రవ్వి తీస్తున్నారు. ఇనుపరాయి, సుద్ద, బంకమన్ను (చీనాక్లే), సున్నపురాయి, ఉప్పు ఈ దేశపు ఖనిజ నిక్షేపాలలో పేర్కొన దగినవి. మోటారు కార్లు, విమానాలు, నౌకలు, జవుళీ, కాగితం, ధాతు పరిశ్రమలు, విద్యుద్యంత్రాలు, కంప్యూటర్లు, శాస్త్రీయ పరికరాలు, ప్లాస్టిక్స్, ఎలక్ట్రానిక్ పరికరాలు, గాజు, ఆహార పదార్థాలు, రాసాయనిక ద్రవ్యాలు, యంత్ర సామగ్రి, ముద్రణ యంత్రాలు మొదలైన వాటికి అంతర్జాతీయ వాణిజ్య కేంద్రం లండన్ నగరం. ప్రపంచంలో బ్యాంకింగ్‌కు కేంద్రం కూడ లండన్. బర్మింగ్‌హామ్, షెఫీల్డు, లివర్‌పూల్, మాంచెస్టరు, లీడ్స్, బ్రిస్టల్ ప్రధానమైన పారిశ్రామిక కేంద్రాలు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ, కేంబ్రిడ్జ యూనివర్శిటీ, లండన్ యూనివర్శిటీ ఉన్నత విద్యా వైజ్ఞానిక కేంద్రాలు. బ్రిటిష్ మ్యూజియం జగత్ ప్రసిద్ధి గాంచినది. చూ. లండన్ మహానగరం

## గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా చూ చీనా

## గ్వాతెమాలా

మధ్య అమెరికాలోని స్వతంత్ర గణ రాజ్యం. 'మాయన్' ఇండియన్ నాగరకతకు చెందిన దేశం.

విస్తీర్ణం: 1,08,889 చ.కీ.మీ. జనాభా: 86,81,000 (1988), రాజధాని: గ్వాతెమాలాసిటీ; అధికార భాష: స్పేనిష్; ప్రజలు క్రైస్తవులు. మాయన్ ఇండియన్‌లు 'మాయన్' భాషలు మాట్లాడుతారు. అట్టిలాన్(చూ.) సరస్సు, ఇజాబల్ సరస్సు, రియోడలా పాశన్ నది, రియో యూసుమాసింటా నది, రియో మొగాటాగా నది, రియోగ్వాసలాటే నది, సాలినాస్ నది, సమాలా నది, పోలో చిక్ నది, అమాటిన్ సరస్సు, పెట్లిన్ సరస్సు ముఖ్యమైన జలాధారలు. కాఫీ ప్రధాన వాణిజ్యపు పంట. పొరుగున ఉన్న యునైటెడ్ స్టేట్స్‌కి దానిని ఎగు మతి చేస్తుంది. వరి, ప్రత్తి, అరటి పండ్లు, చెరకు, పొగాకు, గోధుమ, మొక్కజొన్న ఇతర పంట దినుసులు, పశువుల పెంపకం, పసిఫిక్ తీరంలోని పల్లపు ప్రాంతాలలో కేంద్రీకృతమయింది. ఆహార పానీయాల తయారీ, జవుళీ, హస్తకళలు ప్రజల బ్రతుకు తెరువుకు ఆధారాలు.

## ఘనా

పశ్చిమ ఆఫ్రికాలోని స్వతంత్ర గణరాజ్యం. ఒకప్పుడు బ్రిటిష్ వలస దేశంగా ఉన్న టోగోలాండ్, గోల్డ్‌కోస్ట్ కలిసి 1957లో న్క్రుమా నాయకత్వం క్రింద స్వతంత్ర ప్రతిపత్తిని పొంది 'ఘనా' రాజ్యం అవతరించింది.




విస్తీర్ణం: 2,38,533. చ.కి.మీ., జనాభా: 1,37,54,000; రాజధాని: అక్రా; అధికార భాష: ఇంగ్లీష్, ప్రజలు నీగ్రోలు. క్రైస్తవ (62 శాతం), ఇస్లామ్ మతావలంబకులు. గినీ సింధు శాఖ నుంచి క్వాహూ పీఠభూమి వరకూ వ్యాపించి ఉన్న పెద్ద మైదానం జనసమ్మర్దంగల ప్రాంతం. పీఠభూమికి ఇరువైపులా వైట్

వోల్టానది, బ్లాక్ వోల్టానది ప్రవహిస్తున్నాయి. ప్రానది, టానో నది, వోల్టా సరస్సు, ప్రధాన జలాధారాలు. వోల్టా సరస్సు సహజమైంది కాదు; కృత్రిమమైంది. కోకో పంటకు ఘనా జగత్ప్రసిద్ధి చెందింది. రబ్బరు, కాఫీ, కొబ్బరి, కోలాకాయలు, అరటి, పామ్ నూనె గింజలు షీ గింజలు ప్రధానమయిన పంటలు. ప్రపంచంలో బంగారు ఖనిజం త్రవ్వి శుద్ధి చేసి ఎగుమతి చేసే దేశాల్లో ఘనా ప్రధానమైంది. బాక్సైట్, మాంగనీస్, వజ్రాలు ఇతర ఖనిజోత్పత్తులు. కలప ఇక్కడ సమృద్ధిగా దొరుకుతుంది.

## చండీఘడ్

భారతదేశంలోని కేంద్రపాలిత ప్రాంతాలలో ఒకటి (యూనియన్ టెరిటరీ). 1966 నుంచీ ఈ పట్టణం పంజాబు, హర్యానా అనే రెండు రాష్ట్రాలకూ ఉమ్మడి రాజధానిగా ఉంటూంది. రెండింటికీ హై కోర్టులు, రాష్ట్ర ప్రభుత్వ కార్యప్రాంగణాలు ఇక్కడే ఉన్నాయి. ఇది ఘగ్గ్రానదీ తీరాన్ని నిర్మించబడింది.

జవహర్‌లాల్ నెహ్రూ కళాత్మక దృష్టికి 'చండీఘడ్' ఒక నిదర్శనం. భారత స్వాతంత్ర్యం వచ్చిన మరుసటి సంవత్సరం 1948లో నెహ్రూ ప్రత్యేకంగా లాకర్బు సియర్ (ఛార్లెస్ ఎడ్వర్డ్ జెనారెట్) అనే ప్రఖ్యాత వాస్తు శిల్పి (ఫ్రాన్స్ నివాసి)ని నియోగించగా, ఆయన ఈ నగరాన్ని ఒక కళా ఖండంగా తీర్చి దిద్దారు.

విస్తీర్ణం: 114 చ.కి.మీ., జనాభా: 4,51,610; అధికార భాషలు: హిందీ, పంజాబీ. గోధుమ, వరి, మొక్కజొన్న ప్రధానమయిన పంటలు. భారీ పరిశ్రమలూ చిన్నతరహా పరిశ్రమలూ కూడా అనేకం ఈ నగరంలో ఉన్నాయి.

## చంద్రగుప్త (మౌర్య)

నంద వంశానికి చెందిన మహాపద్మనందునికి 'ముర' అనే శూద్ర స్త్రీ వలన జన్మించిన కుమారుడు చంద్రగుప్త మౌర్యుడు. 'ముర' పుత్రుడు కావడం వల్లనే 'మౌర్యుడు' అనే పేరు వచ్చింది. క్రీ.పూ. 313లో పట్టాభిషిక్తుడై అతడు మౌర్య సామ్రాజ్యాన్ని స్థాపించాడు.

మహాపద్మనందునికి తొమ్మిదిమంది కుమారులు. వీరే నవనందులుగా ప్రసిద్ధిపొందారు. నంద వంశంలో చివరి రాజు ధననందుడు. ఇతడు క్రూరుడు కావడం వలన ప్రజలితనిని అసహ్యించుకునేవారు. నందుల వల్ల అవమానింపబడిన చంద్రగుప్తుడు తల్లితోసహా రాజ్యం వదలి వెళ్ళాడు. తక్షశిలలో అధ్యాపకుడుగా ఉన్న చాణక్యుడు (చూ.) అనే బ్రాహ్మణ్ణి కూడా నందరాజు అవమానించడంతో నంద వంశం నిర్మూలన గావిస్తానని ఆయన ఘోర ప్రతిజ్ఞ చేసి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవ డానికి చంద్రగుప్తుణ్ణే సాధనంగా గ్రహించాడు. అలెగ్జాండరు దండయాత్ర సమయంలో చంద్రగుప్తుడు మగధపై దండెత్తి నంద వంశాన్ని నాశనం చేసి, మౌర్య సామ్రాజ్యాన్ని పాటలీ పుత్రం రాజధానిగా స్థాపించాడు.

చంద్రగుప్తుడు మహా పరాక్రమశాలి. రాజనీ విశారదుడు. చరిత్ర ప్రసిద్ధిపొందిన "ఇండికా" అనే గ్రంథాన్ని రచించిన మెగస్తనీస్ క్రీ.పూ. 302లో చంద్రగుప్తుని దర్బారులో ఉండేవాడు. వంగదేశం మొదలుకొని ఆఫ్ఘనిస్తాన్ వరకూగల ప్రాంతం, పశ్చిమాన మాళవ, సౌరాష్ట్రాలు, దక్షిణ భారత దేశంలో చాలా భాగం చంద్రగుప్తుని సామ్రాజ్యంలో భాగాలుగా ఉండేవి.

క్రీ.పూ. 298 సంవత్సరంలో మైసూరు సమీపమున శ్రావణ బెళగొలలో మౌర్య చంద్రగుప్తుడు మరణించినట్లు చరిత్రకారులు భావిస్తున్నారు.

## చంద్రగుప్త విక్రమాదిత్యుడు

భారతీయ మహాచక్రవర్తులలో ఒకడు. భారత దేశ చరిత్రలో స్వర్ణ యుగంగా పేరుగాంచిన గుప్త సామ్రాజ్యాన్ని స్థాపించిన మొదటి చంద్రగుప్తుని కుమారుడు సముద్ర గుప్తుడు. ఆ సముద్ర గుప్తుని కుమారుడైన రెండవ చంద్ర గుప్తుడే చంద్రగుప్త విక్రమాదిత్యుడు. 38 సంవత్సరాలపాటు(క్రీ.శ. 375–413) ఈయన పరిపాలన కొనసాగింది.

ఈయన రాజ్యం పశ్చిమాన అరేబియా సముద్రం వరకూ వ్యాపించి ఉండడంతో విదేశాలతో సంబంధాలు పెంపొందాయి. చంద్రగుప్తుని రాజ్యకాలంలో గుప్త సామ్రాజ్యం అత్యున్నత దశ అనుభవించింది.

ప్రఖ్యాత చీనా యాత్రికుడు ఫాహియాన్(చూ.) ఈయన కాలంలోనే భారతదేశాన్ని సందర్శించాడు. క్రీ.శ.

405 నుండి 411 వరకు బౌద్ధుల పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ, దేశ సంచారం చేసి, తాను చూసిన విషయాలన్ని ఆయన గ్రంథస్థం చేశాడు.

మహాకవి కాళిదాసు (చూ.) ఈయన ఆస్థానంలోని వాడే! ఈయన ఆస్థానంలో నవరత్నాలనబడే తొమ్మిది మంది మహా విద్వాంసులూ, కవులూ ఉండేవారు. విక్రమాదిత్యుడు సంస్కృతాన్ని రాజభాషగా చేసి భారతీయ సంస్కృతికి విశేషదోహదం చేశాడు.

## చంద్రశేఖర్ ఆజాద్ 1906–1931

అమరజీవి అయిన భారత స్వాతంత్ర్య సమర యోధుడు. మధ్యప్రదేశ్‌లోని భోరా గ్రామంలో 1906 జూలై 6 న ఈయన జన్మించాడు. 14 వ ఏట బ్రిటిష్ వారిని ఎదిరించి పోరాడటం మొదలుపెట్టాడు. అందుకు 15 లాఠీదెబ్బలు శిక్ష విధించారు. ఒళ్ళంతా రక్తం కారుతున్నా, 15 వ దెబ్బ పడగానే మళ్ళీ 'భారత మాతాకీ జై' అని బిగ్గరగా అరిచాడు. తన 16 వ ఏట



క్రాంతికారీపార్టీ తరఫున 'హిందూస్థాన్‌సోషలిస్టు రిపబ్లిక్‌ఆర్మీ'ని సమీకరించి బ్రిటిష్‌వారితోపోరాటానికి తలపడ్డాడు.'ఝాన్సీ'పట్టణం కేంద్రకార్యస్థానంగాఉన్న తనపార్టీలో చేరమని పలువురి నిప్రోత్సాహపరిచాడు.అమర వీరులుభగత్‌సింగ్(చూ.), రాజగురు (చూ.) వంటి యోధులతో 1929 ఏప్రిల్ 8 నాడు కేంద్రశాసన (పార్లమెంట్)సభామండపంలో బాంబు విసిరి అజ్ఞాత వాసంలోకి జారుకున్నాడు. పోలీసుల అరెస్టుకు దొరక లేదు. ఆజాద్ ఆచూకీ తెలిపిన వారికి రు. 30,000/–లు బహుమతిని నాటి ప్రభుత్వం ప్రకటించింది. చివరకు 1931 ఫిబ్రవరి 27న తన అనుచరుడే పోలీసులకు తెలియపర్చగా, పోలీసుల తుపాకి దెబ్బలు తీవ్రంగా తగిలి మరణానికి గురి అయ్యాడు. ఆ రోజున ఆయన చేతిలో ఉన్న పిస్టల్‌ను ఇప్పటికీ 'లక్నో'లోని ఒక మ్యూజియంలో జాగ్రత్తగా భద్రపరచి ఉంచారు.

## చంపూ కావ్యం

చూ. వేంకటాధ్వరి

## చతురాశ్రమాలు

హిందూ సంప్రదాయం ప్రకారం ప్రతివాడూ నాలుగు ఆశ్రమ పద్ధతులను పాటించాలి. అవి వరుసగా: 1.బ్రహ్మచర్యం;2.గృహస్థు;3.వానప్రస్థం;4. సన్యాసం. ఇందు మొదటి ఆశ్రమంలో బాలుడు ఉప నయనమయిన తరువాత బ్రహ్మచర్యవ్రతమును పాటిస్తూ ఇంద్రియ నిగ్రహంతో ఎంచుకున్న గురువు దగ్గర శిష్యరికం చేస్తూ అధ్యయనం చేస్తూ శిక్షణపూర్తి చేసుకోవాలి. తరువాత రెండవ దశ గృహస్థాశ్రమంలో ఇష్టమయిన స్త్రీని భార్యగా పరిగ్రహించి ధర్మార్థ కామ కార్యాలను నిర్వహిస్తూ అతిథుల్ని ఆదరిస్తూ సంసార యాత్ర ప్రయోజనకరముగా గడపాలి. ఈ విధంగా సంసార బాధ్యతలను నిర్వహించిన పిదప మూడవ దశలో వయోవృద్ధుడవడంతో వానప్రస్థాశ్రమం స్వీకరించి కోరికల్ని చంపుకుని జీవయాత్ర సాగించాలి. ఇక నాలుగవ ఆశ్రమం సన్యాసాశ్రమంలో ధర్మార్థ కామాలను పరిత్యజించి కామక్రోధ, లోభ, మద(గర్వ), మోహ మాత్సరాలను విడనాడి సర్వసంగ పరిత్యాగియై విరాగియై మోక్షమునకై వేచి ఉండాలి.

## చతుర్దశ విద్యలు

భారతీయ సంస్కృతిలో ప్రధానమైన విద్యలు 14. అవి: 1.ఋగ్వేదం, 2.యజుర్వేదం, 3.సామ వేదం, 4.అధర్వణ వేదం, 5.శిక్ష, 6.వ్యాకరణం, 7.ఛందస్సు, 8.నిరుక్తం, 9.జ్యోతిషం, 10.కల్పం, 11.మీమాంస, 12.న్యాయ శాస్త్రం, 13.పురాణాలు, 14.ధర్మశాస్త్రాలు.

ఇంకొక లెక్క ప్రకారం విద్యలు 4. చతుర్విద్యలు. అవి: 1.ఆన్వీక్షకి (విజ్ఞాన బోధకం); 2.త్రయి (ధర్మాధర్మాలను తెలిపేది); 3.వార్త (అర్థానర్థాలు తెలిపేది);4.దండనీతి (నయానయాలు బోధించేది).

## చతుర్విధోపాయములు

భారతీయ సంస్కృతి ననుసరించి ఒక కార్యాన్ని సాధించడానికి నాలుగు విధాలైన ఉపాయాలున్నాయి. అవి 1.సామం, 2.దానం, 3.భేదం, 4.దండం. ఈ నాలుగు ఉపాయాలనూ వరుసగా ప్రయోగించాలి. మొదట

సామోపాయంతో నచ్చజెప్పి కార్యం సాధించుకోడానికి చూడాలి. అది పని చేయకపోతే దానోపాయం. ఏదైనా ఆశ చూపించి పని చక్క పెట్టుకోవాలి. అదీ విఫలం అయితే భేదోపాయం ప్రయోగించాలి. అంటే ఒకరి మీద ఒకరికి ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పి భేదాభిప్రాయాలు కలిగించి కార్యసాధన చేసుకోడానికి ప్రయత్నించాలి. అదీ ఫలించక పోతే అప్పుడు దండోపాయం దండనకు పూనుకోవాలి.

## చతుర్విధ పురుషార్థాలు చూ.పురుషార్థాలు

## చతుష్షష్టికళలు

'కళ' అనగా కేవలం నేర్పు. ప్రధానమైన లలిత కళలు నాలుగే! అవి సంగీతం, సాహిత్యం, నృత్యం, చిత్రలేఖనం. ఇవికాక చిరకాలంగా భారతదేశంలో ప్రతిభాపాటవాలు ప్రదర్శింపబడుతూ వచ్చిన 'కళలు' (నైపుణులు) మొత్తం 64 ఉన్నాయని ప్రాచీన గ్రంథాలు పేర్కొన్నాయి. వీటినే 'చతుష్షష్టి కళలు' అంటారు అయితే కామసూత్రం మొదలైన వివిధ గ్రంథాలలో చతుష్షష్టి కళలు వేరు వేరు విధాలుగా పేర్కొనబడ్డాయి. 'కామసూత్రం'లో వివరించిబడిన ప్రకారం భారతీయుల చతుష్షష్టి కళలలో కొన్ని: 1 గీతం, 2 వాద్యం, 3 నృత్యం, 4 ఆలేఖ్యం (చిత్రలేఖనం), 5 విశేషకచ్ఛేద్యం (తిలకపత్ర భంగాది రచన), 6 కందుల కుసుమబలివి కారాలు (ముగ్గులు), 7 పుష్పాస్తరణం (పూల సెజ్జ అమర్చడం), 8 దశనవసనాంగరాగం (రంగులు వేయ డం), 9 మణి భూమికా కర్మ (మణులతో బొమ్మలు చేయడం), 10 శయన రచన, 11 ఉదకవాద్యం (జల తరంగిణి), 12 ఉదకాఘాతం (పిచ్చికారీతో నీళ్లు చిమ్మడం), 13 చిత్రయోగాలు (పగటి వేషాలు), 14 మాల్యగ్రథనవికల్పాలు (పూల దండలు కట్టడం), 15 శేఖరవాడ్యో జనం (పూలతో కిరీటం మొదలైన శీర్షాలంకారాలు కూర్చడం)పేర్కొనదగినవి.

## చాణక్యుడు

మౌర్య సామ్రాజ్య స్థాపనలో కీలకపాత్ర వహించిన మహా మేధావి. ఈయన నైష్ఠికుడు బ్రాహ్మణుడు, మహా విద్వాంసుడు, రాజనీతి చతురుడు. కౌటిల్యుడని, విష్ణుగుప్తుడని ఈయనకు మరి రెండు పేర్లు ఉన్నాయి. నందరాజుచే నిండు సభలో అవమానింపబడి, నందవంశ నిర్మూలన అయ్యేవరకు, తన జుట్టును ముడి వేసికోనని చాణక్యుడు శపథం చేశాడు. ఇదే 'చాణక్య శపథం'! చంద్రగుప్తుడు తన కార్యానికి అనుకూలమైన వాడని గుర్తించి, అతనికి అండగా నిలచి ఆయన తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు.

చాణక్యుడు వ్రాసిన 'అర్థశాస్త్రం' భారతీయ రాజనీతిని వివరించే ఉదాత్త గ్రంథం. దీనిలో చాణక్యుడు చర్చించని అంశం లేదు. ఇది భారతీయ విజ్ఞానానికి నిధివంటిది. ''నిష్కారణంగా ఎవరినీ శిక్షించకూడదు. అయితే శత్రువుపట్ల దయాదాక్షిణ్యాలకు తావులేదు. శత్రు నిర్మూలన చేయడంలో ఎట్టి సాధనాన్నైనా ఉపయోగించ వచ్చు'' అని కౌటిల్యుని రాజనీతి చెబుతుంది.(చూ. చంద్రగుప్తమౌర్య)

## చాద్

ఆఫ్రికా ఖండం మధ్య ఉన్న ఒక స్వతంత్ర గణ రాజ్యం. ఒకప్పుడు కానెం సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. 19 వ శతాబ్ది ఆరంభంలో యూరప్ దేశీయులు ఆఫ్రికాకు రావడం ఆరంభమైంది. 1897 నాటికి 'చాద్' ఫ్రెంచ్ వారి అధీనంలోకి వచ్చింది. 1958 లో స్వపరిపాలన సిద్ధించింది. 1960 నాటికి సర్వసత్తాక గణరాజ్యంగా రూపొందింది. విస్తీర్ణం: 12,84,000 చ.కి.మీ. జనాభా: 53,95,000 (1988) రాజధాని: నజమేనా: ఇస్లాం 4.4 శాతం, క్రైస్తవం 33 శాతం పాటిస్తారు. ప్రజలలో ఆదిమ తెగలు బాగిర్మి, సారా, క్రీష్, తేడా, తూబూ, సుడానీ అరబ్బు తెగలు ఉన్నారు.

చారీ, లోగోనే నదులు చాద్ సరస్సులో కలుస్తున్నాయి. దేశంలో ఉత్తర భాగం ఎడారిప్రాంతం. ఆర్థికంగా ఇది చాలా వెనుకబడి ఉన్న దేశం. వరి, చిరుధాన్యాలు, చిక్కుడు, కర్రపెండలం, ఖర్జూర, వేరుసెనగ, గోధుమ, జొన్న, ప్రత్తి ఇక్కడ పండుతాయి. చాకలి సోడాకు పనికి వచ్చే నేట్రన్‌ఖనిజం, టంగ్స్టన్ దొరుకుతాయి. సరస్సులోని పచ్చి చేపలుపట్టి ఎండుచేపలు తయారుచేయడం ఇక్కడిప్రజలలో కొందరికి జీవనోపాధి.



## చార్మినారు

భారతదేశంలోని అందమైన కట్టడాలలో ఒకటి. హైదరాబాదు నగరం నడిబొడ్డున (ఇప్పటి పాత నగరంలో) ఈ అందమైన నిర్మాణం ఉంది. నలుదిక్కులా 15 మీటర్ల ఎత్తున్న ఆర్చీలుగల చార్మినార్ 'హిందూ-



ఇస్లాం', 'ఇండో సారసెనిక్' వాస్తుశిల్ప సంప్రదాయాలనను సరించి నిర్మించ బడింది. ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని ప్లేగ్ వ్యాధి పట్టి పీడుస్తూ ఉండేది. పెక్కుమంది ఈ వ్యాధివాతపడి మరణిస్తూ ఉండేవారు. అలా ఆ జాఢ్యానికి గురియై మరణించినవారి స్మారక చిహ్నంగా 1581లో అప్పటి గోల్కొండ నవాబు కులీకుతుబ్ షాహీ చార్మినార్‌ను నిర్మింప జేశాడని అంటారు. దానికి నాలుగు మూలలా నాలుగు మినార్లు అనబడే నాలుగు గుల్ల స్తంభాలున్నాయి. వాటిలో ప్రతి స్తంభం ఎత్తు 30 మీటర్లు. సందర్శకులు ఈ గుల్ల స్తంభాలలో ఉన్న మెట్ల ద్వారా పైకి ఎక్కి చుట్టుపక్కల ఉన్న సుందర దృశ్యాలను తిలకించవచ్చును. హైదరాబాదులో దర్శనీయమైన స్థలాలలో ఈ చార్మినార్ ఒకటి.

## చార్లమాన్

చూ. షార్లమాన్

## చాళుక్యులు

దక్షిణ భారతదేశంలో పరిపాలన సాగించిన ఒక ప్రఖ్యాత రాజ వంశీయులు. బీజాపూర్ జిల్లాలోని వాతాపి నగరాన్ని (బాదామీ నగరం) రాజధానిగా చేసుకొని శాఖోపశాఖలుగా వర్ధిల్లి భారతదేశంలో అనేక ప్రాంతాలను వీరు పాలించారు. ఆంధ్రదేశాన్ని దాదాపు 5 శతాబ్దాల పాటు పాలించిన చాళుక్య వంశానికి తూర్పు చాళుక్యులు అనీ, బాదామీ కల్యాణీ నగరాల నుంచి పాలన కొనసాగించిన చాళుక్య శాఖను పశ్చిమ చాళుక్యులు అనీ అంటారు. తూర్పు చాళుక్యులనే వేంగీ చాళుక్యులనీ, వేములవాడ చాళుక్యు లనీ, ముదిగొండ చాళుక్యులనీ కూడా వ్యవహరించడం కద్దు.

ఆదిలో పల్లవుల చేతిలో చాళుక్యులు దెబ్బతిన్నా, పట్టుదలతో వారు పశ్చిమాన మహారాష్ట్రంవైపు సాగి, బాదామిని రాజధానిగా చేసుకొని సత్యాశ్రయ ప్రథమ పులకేశి నాయకత్వంలో మరో రాజ్యాన్ని నిర్మించారు. రెండో పులకేశి క్రీ.శ. 609 లో సింహాసన మధిష్టించాడు. పిఠాపురాన్ని పాలిస్తూన్న పృథ్వీ మహారాజును, కొల్లేటిపై జరిగిన యుద్ధంలో వేంగీ రాజులను, ఓడించి వారి దుర్గాలను స్వాధీనం చేసుకొన్నాడు. పల్లవులను కృష్ణా ప్రాంతంనుంచి తరిమివేసి ఆంధ్ర దేశంలో చాళుక్య రాజ్యస్థాపన చేశాడు. ఇతడు తన తమ్ముడైన కుబ్జ విష్ణు వర్ధనుణ్ణి ఆంధ్ర ప్రాంతానికి పాలకుడుగా నియ మించాడు.

ఉత్తరాన చీపురుపల్లినుంచి, దక్షిణాన నెల్లూరువరకు. క్రీ.శ. 625 నుండి 753 వరకూ చాళుక్యుల రాజ్యం విస్తరించింది. చాళుక్య రాజులపాలన తెలుగుభాషాభివృద్ధికి దోహదం చేసింది. పూర్వ చాళుక్యులు మొదటిసారిగా తెలుగు భాషను రాజభాషగా చేశారు.

## చిత్తరంజన్ దాస్, దేశబంధు

ప్రముఖ దేశభక్తుడు. అగ్రశ్రేణికి చెందిన భారత జాతీయ నాయకుడు. భారత దేశానికి స్వయం పరిపాలన చేసుకునే హక్కు, అందుకు అవసరమైన శక్తి ఉన్నాయని మొదట చాటిన మహానాయకుడు దేశబంధు చిత్తరంజన్ దాస్. ఆ రోజులలో బెంగాలు రాష్ట్రానికి ఆయన తిరుగులేని



నాయకుడు. 1870లో భువనమోహన్, నిస్తరిణీ దేవి దంపతులకు ఆయన జన్మించాడు. 1893లో కలకత్తా హైకోర్టులో న్యాయవాదవృత్తి ప్రారంభించాడు. బెంగాల్ లో ముమ్మరంగాసాగుతున్న

జాతీయ విప్లవం సందర్భంగా కొన్ని కేసులలో చిత్తరంజన్ పేరు ప్రఖ్యాతులు గడించాడు. అందులో అరవింద్ ఘోష్ (చూ.) కేసు ముఖ్యమైనది. అనిబిసెంట్ (చూ.) ప్రారంభించిన 'హోంరూల్ లీగ్'లో చేరి చిత్తరంజన్ రాజకీయ రంగంలో అడుగుపెట్టాడు. బెంగాల్ రాష్ట్ర సభకు అధ్యక్షత వహించాడు.'మాంటెగ్యూ–చెమ్స్‌ఫర్డ్' సంస్కరణలను ఆయన వ్యతిరేకించాడు. గాంధీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమాన్ని 1920లో కలకత్తా కాంగ్రెస్ సభలో ఆదిలో వ్యతిరేకించినప్పటికీ, తర్వాత నాగపూర్‌లో గాంధీతో జరిగిన చర్చల ఫలితంగా ఇద్దరూ ఒక ఒప్పందానికి వచ్చారు. తరువాత బాహాటంగా చిత్తరంజన్ దాస్ గాంధీజీ ఉద్యమాన్ని బలపరిచాడు.

అప్పటివరకూ విలాసాలకు అలవాటు పడిన చిత్తరంజన్ అన్నింటినీ వదిలి, రాజకీయ మహర్షిగా జీవింపసాగాడు. 1923లో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఆయన ఎన్నికయ్యాడు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారికి ఆత్మీయుడైన భారత జాతీయ నాయకులలో చిత్తరంజన్ ఒకరు. 1925 జూన్ 16న డార్జిలింగ్‌లో ఆయన పరమపదించారు.

## చిత్తూరు జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. ఇది 12° 37′ 14° 0′ ఉత్తర అక్షాంశలకూ 78° 4′ 79° 55′ తూర్పు రేఖాంశాలకూ మధ్య ఉంది. ఈ జిల్లాకు ఉత్తరాన నెల్లూరు, కడప, అనంతపురం జిల్లాలూ, తూర్పున, దక్షిణాన తమిళనాడు రాష్ట్రం, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం ఉన్నాయి. రాయలసీమ (చూ.)లోని నాలుగు జిల్లాలలో చిత్తూరు ఒకటి.

విస్తీర్ణం: 15,152 చ.కి.మీ., జనాభా: 27,46, 847; జిల్లా కేంద్రం: చిత్తూరు; తిరుపతి, మదనపల్లి, శ్రీకాళహస్తి ఇతర ప్రముఖ పట్టణాలు. పొరుగునవున్న తమిళనాడు, కర్నాటక సరిహద్దులలో నివసించు ప్రజలు తమిళం, కన్నడం మాట్లాడతారు.

చిత్తూరు జిల్లాలో జీవనది ఏదీలేదు. వర్షాకాలంలో మాత్రమే నీరు ఉండే నదులు: పాపఘ్నినది, పింఛానది, కౌండిన్యనది, బాహుదానది, చినేరునది, పెద్దేరునది, పాలారునది, పోయ్యానది, గొడ్డువంకనది, సువర్ణముఖి నది. వరి, రాగి, సజ్జ, జొన్న, వేరుసెనగ, చెరకు ముఖ్యమయిన పంటలు. మామిడి తోటలు, చీనీ, నారింజ తోటలు మెండు. నీలం, తోతాపురి, రుమానీ మామిడి పండ్లు, సాతుక్కుడి నారింజ పండ్లు ఇక్కడ విరివిగా పండుతాయి.బెల్లం, వేరుసెనగ ఇతర చోట్లకు ఎగుమతి అవుతాయి. అనంతరాజు పేట (కోడూరు)లోని ఫలపరిశోధనా కేంద్రంలో సంకర మామిడిజాతుల




పరిశోధనలు జరుగుతున్నాయి. ఇనుపరాయి (శివసాంబాడు) బంగారు, మైకా, స్టీటైట్ ఈ జిల్లాలోని ఖనిజ నిక్షేపాలు. రేణిగుంట వద్ద పారిశ్రామికవాడ వుంది. శ్రీకాళహస్తి కలంకారీ హస్తకళకు ప్రసిద్ధి. తిరుపతిలో కొయ్యబొమ్మలు చేస్తారు. చందనం, ఎర్రచందనం విరివిగా లభించే జిల్లా ఇది. విలువైన చందనపు నూనె ఇక్కడ తయారవుతూంది.

పుణ్యక్షేత్రం అయిన తిరుమల కొండ, తిరుపతి (చూ.) ఈ జిల్లాలోనే ఉన్నాయి. ఇది శ్రీవైష్ణవ పుణ్యక్షేత్రం. హిందువుల ఆరాధ్యదైవం శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధికి నిత్యం భక్తులు వేల సంఖ్యలో వస్తూ ఉంటారు. భక్తుల సౌకర్యార్థం దిగువ తిరుపతిలోనూ, ఎగువ తిరుపతిలోనూ సత్రాలూ ఇతర వసతులూ కల్పించారు. ధర్మదర్శనానికి వీలుగా క్యూ కాంప్లెక్స్ ఆలయ ప్రాంగణంలో నిర్మించారు. బస్సుల రాకపోకలకు వీలుగా రెండు ఘాటు రోడ్డులను ఏర్పాటు చేశారు. దిగువ తిరుపతిలో గోవింద రాజస్వామివారి సన్నిధి ఉంది. తిరుపతికి సమీపంలోనే తిరుచానూరులో ఉన్న, అలివేలు మంగ తాయారు పద్మావతి అమ్మవారి సన్నిధులు దర్శించదగ్గవి. ఆకాశగంగ, పాపనాశం, తిరుమల కొండ సమీపంలో ఉన్నాయి.

శ్రీకాళహస్తిలోని శైవక్షేత్రం దక్షిణ కాశీగా ప్రసిద్ధి గాంచింది. మదనపల్లిలో ఆరోగ్యకేంద్రం ఉంది. పుత్తూరు నాటుఅస్థి చికిత్సకు ప్రసిద్ధి. చంద్రగిరిలో చారిత్రాత్మక మైన కోట ఉంది.

## చిదంబరం

దక్షిణాదిన ఉన్న ఒక గొప్ప శైవ క్షేత్రం. దక్షిణ భారతదేశంలో సుప్రసిద్ధములైన పంచ లింగాలలో ఆకాశలింగం ఇక్కడ ఉంది. ఇక్కడి స్వామి నటరాజ స్వామి. ఈ మందిర ప్రాకారానికి నాలుగు వైపులా 9 అంతస్తులు గల 4 గోపురాలు ఉన్నాయి. ఈ గోపురాల మీద అనేక విగ్రహాలున్నాయి. నటరాజ మందిరం, శివగంగ సరోవరం, ఇంకా చాలా మందిరాలూ, మండపాలూ ఇక్కడ ముఖ్యంగా చూడదగినవి. నటరాజ మందిరంలో రెండు ద్వారాలు దాటిన తరువాత నృత్య భంగిమలో నటరాజస్వామి మనోహరమైన విగ్రహం దర్శనమిస్తుంటుంది. విగ్రహానికి వెనుక ఆకాశలింగం అదృశ్యరూపంలో ఉంటుంది. (చూ. నటరాజు)

ఇచ్చట మణిలింగం, స్ఫటికలింగం కూడా ఉన్నాయి. నటరాజ మందిరానికి ఉత్తరాన పార్వతీ మందిరం ఉంది. ఇది చాలా సుందరమైంది. ఇక్కడ శివగంగ సరోవరం చాలా పవిత్రమైన తీర్థం. ఈ ఆలయం 9 వ, 10 వ శతాబ్దాలలో నిర్మింపబడింది. ఇక్కడి శిల్పాలూ, నాట్య భంగిమలు 108 ముద్రలతో మిక్కిలి మనోహరంగా మలచబడ్డాయి.

డిసెంబర్—జనవరి నెలల్లో ఆర్ద్రోత్సవం, జూన్—జూలై నెలల్లో జరిగే తిరుమంజనం తిరునాళ్లు భక్త జనాన్ని విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

## చిన్నయసూరి, పరవస్తు 1809–62

సుప్రసిద్ధ ఆంధ్ర వ్యాకర్త; బాల వ్యాకరణ కర్త; సంస్కృతాంధ్ర పండితుడు. శ్రీపెరుంబదూరులో శ్రీనివాసాంబ, వేంకటరామానుజా చార్యులు దంపతు లకు 1809 లో ఈయన జన్మించారు. చెన్నపట్నంలో చిన్నయసూరి విద్యాభ్యాసం చేశాడు. ఆయన గురువు కంచి రామానుజా చార్యులు. సంస్కృతాంధ్ర ప్రాకృత ద్రవిడ భాషలలోనూ, వ్యాకరణ, తర్క, మీమాంసా, అలంకార శాస్త్రాలలోనూ అసాధారణమైన పాండిత్యాన్ని చిన్నయసూరి సంపాదించాడు. స్వల్పంగా ఆంగ్ల భాషా పరిచయం కూడా ఉంది.

1844 నుండి 47 వరకు పచ్చయప్ప కళాశాలలో ఆంధ్ర పండిత పదవిని ఆయన నిర్వహించారు. ఆ సమయంలోనే 'పచ్చయప్ప నృపయశోమండనం' అనే పేరుతో కొన్ని పద్యాలనూ, శ్లోకాలనూ చిన్నయ్య రచించాడు. 1847 లో మదరాసు రాజధాని కళాశాల (ప్రెసిడెన్సీ కాలేజీ)లో ఆంధ్ర పండితుడుగా నియమింప బడ్డాడు. అప్పుడు కళాశాల అధ్యక్షుడు (ప్రిన్సిపాల్) ఆర్బత్‌నాట్. ఆయన చిన్నయ పాండిత్యాన్ని మెచ్చుకొని 'చిన్నయసూరి' అని ఆంగ్లాక్షరాలతో చెక్కిన సువర్ణ కంకణాన్ని సీమనుంచి తెప్పించి ఆయనకు బహూకరించాడు.

ఒక వంక కళాశాలలో పండిత పదవిని నిర్వహిస్తూనే మరొకవంక ప్రాచీన గ్రంథపరిశీలన, భాషా ప్రయోగాల సేకరణ చేస్తూ, తెలుగులో ఒక ప్రామాణికమైన వ్యాకరణాన్ని రచించడానికి పూనుకున్నాడు. 'వాణీ దర్పణ ముద్రణ శాల'ను స్థాపించి 'సుజన రంజని' అనే సారస్వత మాసపత్రికను నడిపాడు. నీతిచంద్రిక, శబ్దలక్షణ సంగ్రహం, ఆంధ్ర శబ్దాను శాసనము, పద్యాంధ్ర వ్యాకరణం, సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం, బాల వ్యాకరణం, చిన్నయసూరి నిఘంటువు, విశ్వ నిఘంటువు, అక్షర గుచ్ఛము, విభక్తిబోధిని, నీతి సంగ్రహం, ఆంధ్ర శబ్దచింతామణి ఆయన రచనలలో ముఖ్యమైనవి.

## చిలీ




దక్షిణ అమెరికాలోని ఒకస్వతంత్ర గణరాజ్యం. ఆ ఖండంలోని పశ్చిమ భాగాన పసిఫిక్‌మహాసముద్రతీరాన్నిఆనుకొని పొడుగాటి పీలికగా ఆండీస్‌పర్వతశ్రేణి నిఆనుకుని ఈ గణరాజ్యం వ్యాపించివుంది. లాటిన్ అమెరికన్‌దేశాలన్నింటిలో నూ అత్యంత పారిశ్రామికాభ్యుదయం సాధించిన దేశం ఇది. స్పేనిష్‌వారు 15వ

శతాబ్దిలో ఈ దేశం రావడం ప్రారంభించారు. కాలక్రమేణ తరతరాలుగా అక్కడ ఉన్న 'ఇన్కా' జాతి వారిని జయించి వారా దేశాన్ని ఆక్రమించుకున్నారు. 300 ఏళ్ళపాటు స్పేనిష్ వారు ఈ దేశాన్ని పాలించారు. చివరకు 1818లో స్పెయిన్‌వారిని ఎదిరించి చిలీ ప్రజలు ఓహిగిన్స్ నాయకత్వాన స్వాతంత్ర్యం సంపాదించుకున్నారు. 1893లో సిద్ధపరచిన రాజ్యాంగానికి 1925 లో సవరణలు చేసి ప్రభుత్వ పాలన కొనసాగిస్తున్నారు. ఇనుపరాయి, రాగి, నైట్రేట్ ఖనిజ సంపద పుష్కలంగా ఈ దేశంలో లభిస్తూంది. అందుచేత ఈ దేశం ఆర్థిక ప్రగతి సాధించింది. చిలీ రాగి ఖనిజం జగత్ప్రసిద్ధి పొందింది. అలాగే సోడియం నైట్రేట్ విషయం కూడ **ప్రపంచావసరాన్నంతటికీ** చిలీ దేశం తీరుస్తూంది. నేలబొగ్గు ఈ దేశంలో ఎక్కువగా లభిస్తూంది. ఇక్కడ అయిడిన్ సాధనకు అవసరమైన ఖనిజం దొరుకుతుంది. బంగారం, సీసం, వెండి, జింకు, పెట్రోలియం లభిస్తాయి. అకోన్కాగ్వా నది, బయోబయో నది జలాధారాలు. రైతాంగం మధ్యలోయ ప్రాంతంలోనే కేంద్రీకృతమై ఉంది. పెద్ద కమతాల్ని ఫూండ్స్ అంటారు. బార్లీ, వరి, రైధాన్యం, ప్రొద్దు తిరుగుడు, గోధుమ, పొగాకు, బఠాణీ, చిక్కుడు, బంగాళదుంప, మొక్కజొన్న, నారపంటలు, ఓట్ ధాన్యం బాగా పండుతాయి. పచ్చిక బయళ్ళు పుష్కలంగా ఉండడం చేత పశువుల పెంపకం, పందుల పెంపకం, గొర్రెల పెంపకం వల్ల రైతాంగం ఆర్థికస్థితి మెరుగయింది. ఫైన్‌ఫుడ్, కలపగుజ్జు, పిండి, తోలు పరిశ్రమ, కాగితం, రబ్బరు సామగ్రి, దుస్తులు, డబ్బాలలో నిల్వ, పాడిపరిశ్రమ, బిస్కట్లు తయారీ, సబ్బులు మున్నగునవి **పేర్కొనదగిన** పరిశ్రమలు. విస్తీర్ణం: 7,56,945 చ.కి.మీ. జనాభా: 1,27,50,000 (1988), రాజధాని: సాంటియాగో; అధికార భాష: స్పేనిష్. ప్రజలు క్రైస్తవులు 86 శాతం.

## చీనా

తూర్పు ఆసియాలో ఒక విస్తృతమైన పెద్ద గణరాజ్యం. చీనా కంటె పెద్దరాజ్యాలు సోవియట్ రష్యా, కెనడా మాత్రమే. ప్రపంచంలో జనాభా ఎక్కువగా ఉన్న దేశం ఇది. ప్రస్తుతం కమ్యూనిస్టు పాలనలో ఉంది.

క్రీ.పూ. 1500 నుంచీ ఉజ్వల చరిత్ర గలది చీనా. ఆ కాలంలో ఈ దేశాన్ని షాంగ్ రాజవంశీయులు పాలించేవారు. హాన్ రాజవంశీయుల కాలంలో (క్రీ.పూ. 202–క్రీ.శ. 220) చీనా శక్తివంతమయిన రాజ్యమయింది. క్రీ.శ. 7వ శతాబ్దంలో టాంగ్ రాజుల పాలనా కాలంలో చైనీయులు ముద్రణ పద్ధతిని కనిపెట్టారు. ఆ కాలంలోనే చీనా యాత్రికుడు ఇత్సింగ్ (క్రీ.శ. 671 ప్రాంతంలో) భారతదేశాన్ని సందర్శించాడు. తరువాత క్రమంగా సుంగ్ రాజవంశం (క్రీ.శ. 960–1279),




కుబ్లయి ఖాన్ స్థాపించిన యాన్ రాజవంశం (1279–1368), మింగ్ రాజవంశం (1368–1644), మంచూ రాజవంశం (1644–1912) పాలించగా 1912 లో చీనా స్వతంత్ర రాజ్యమైంది.

చాంగ్–కై–షేక్ 1928 లో చీనాలోని అన్ని ప్రాంతాలనూ ఏకం చేశాడు. 1946–49 మధ్య ప్రజానాయకుడు మావో నాయకత్వంలో కమ్యూనిస్టు అంతర్యుద్ధం జరిగి నియంతృత్వ ప్రభుత్వం ఏర్పడింది. 1949 అక్టోబరులో 'పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చీనా' స్థాపించబడింది. చౌ–ఎన్–లై ప్రధాని అయాడు. పార్టీ అధ్యక్షుడు మావో. వీరి తదనంతరం కూడా కమ్యూనిస్టు పాలన ఇప్పటికీ కొనసాగు తూంది.

విస్తీర్ణం: 95,72,900 చ.కి.మీ.; జనాభా: 1,08,82,00,000(1988) రాజధాని: బీజింగ్ (పెకింగ్), అధికార భాష: చైనీసు (మాండరిన్). ప్రజలు

మంగోలాయిడ్ వర్గానికి చెందిన వారు. ఈ దేశంలో మతప్రచారం చట్టరీత్యా నిషేధం. ప్రజలు కన్‌ఫ్యూషియస్, బౌద్ధ, టావోబోధనలను అనుసరి స్తూంటారు. బౌద్ధం భారతదేశంనుండి క్రీ.శ. 4 వ శతాబ్దంలో చీనాకు విస్తరించింది. (చూ. ఫాహియాన్, హుయాన్ స్యాంగ్)

చీనాలో కాన్సూ రాష్ట్రంలో 2,410 కి.మీ. పొడవైన కోట గోడ ఉంది. 'గ్రేట్ వాల్ ఆఫ్ చైనా'గా ఇది ప్రసిద్ధి పొందింది. ఇది హాన్‌ల పాలనలో నిర్మించబడింది. ఉత్తరాన హుయాంగ్ హూ (పసుపు)నది, యాంగ్‌ట్జూ నది, గ్రాండ్ కెనాల్, సికియాంగ్‌నదీ, పెక్కు సరస్సులు చీనాకు ప్రధానమయిన జలాధారాలు. గోబీ ఎడారి చీనా ఉత్తర భాగంలో ఉన్నది.

చీనాలో ప్రధానమయిన ఆహారపు పంట వరి. ఆ తరువాత గోధుమ. ఇతర వ్యవసాయోత్పత్తులలో సోయా చిక్కుడు, పొగాకు, చెరకు, చిరుగడం, చిరు ధాన్యాలు, వేరుసెనగ, మొక్కజొన్న, ప్రత్తి పేర్కొనదగినవి. గొర్రెలను, పందులను పెంచుతారు. పశువుల పెంపకం తక్కువ. అటవీ సంపదలో టంగ్ నూనె, టేకు, వెదురు ప్రధానమయినవి. బాస్‌చేప, బొమ్మిడాయి, హెర్రింగ్, మేకరెల్, పారచేప, రొయ్యలు ప్రధానమైన **మత్స్యసంపద**లు. వీటిని సముద్రంలోనూ, సరస్సులలోనూ నదుల లోనూ, కాలువలలోనూ పడతారు. నేలబొగ్గు, ఇనుపరాయి, తగరం, సీసంవంటి ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. పెట్రోలు తైలనిక్షేపాలు కూడా ఉన్నాయి. జవుళీ మిల్లులు, ఉన్ని మిల్లులు, ఉక్కు, తోలు, విద్యుత్ పరికరాలు, పట్టు పరిశ్రమ, పింగాణీ, రాసాయనిక ద్రవ్యాలు ప్రధాన పరిశ్రమలు. చీనాలో పరమాణు విద్యుత్ కేంద్రాలు ఉన్నాయి. రోదసీ పరిశోధనలో చీనా ముందడుగు వేసింది.


గ్రేట్ వాల్ ఆఫ్ చైనా

## చెంఘిజ్ ఖాన్ 1167–1227

మంగోల్ జాతికి చెందిన మహావిజేత. అసలు పేరు తెమూజిన్. జెంఘిజ్‌ఖాన్ అని కూడా అంటారు. తార్తారుల కోవకు చెందిన ఈ మహావీరుడు చరిత్ర ప్రసిద్ధి పొందాడు. తూర్పున చీనా, పశ్చిమాన కాస్పియన్ సముద్రం, ఉత్తరాన సైబీరియా, దక్షిణాన హిమాలయాలు హద్దులుగా ఈయన మంగోల్ సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు. కారకోరమ్ రాజధానిగా దాదాపు 4 దశాబ్దాలు ఈయన పాలించాడు. మహాఖాన్‌గా తనను తాను ప్రకటించుకున్నాడు. మార్కోపోలో (చూ.) తన యాత్రా చరిత్రలో ప్రస్తావించిన కుబలయ్‌ఖాన్ ఈయన మనుమడు.

## చైతన్య ప్రభువు

కృష్ణుని అపరావతారంగా తన భక్తులచే భావింపబడే మహాభక్తుడు. క్రీ.శ. 1485లో చైతన్యుడు జన్మించాడు. అసలు పేరు 'నిమాయి'. తండ్రి జగన్నాథ మిశ్రా. తల్లి షాచీ. భారతీయ సంస్కృతికి ఆటపట్టయిన నవద్వీపం (పశ్చిమ బెంగాల్) ఆయన స్వగ్రామం. నవద్వీపంలోని సంస్కృత వ్యాకరణ, తర్క పాఠశాలలో ఆయన ప్రాథమిక విద్యనభ్యసించాడు. తర్వాత గొప్ప సంస్కృత విద్వాంసుడయ్యాడు.

గయలో తారసిల్లిన ఈశ్వరపురి అనే వైష్ణవ సన్యాసి దర్శనంతో ఆయనలో కృష్ణభక్తి అంకురించింది. 24వ ఏటనే సన్యసించి భోగభాగ్యాలను వదిలి 'కృష్ణ చైతన్యుడు' అనే పేరుతో భక్తి ప్రచారం చేస్తూ దేశాటనం చేశాడు. సమాజంనుంచి బహిష్కరింపబడిన నిమ్న జాతివారితోను, దరిద్రులతోనూ కలిసి మెలిసి ఉంటూ వారితో కలిసి భోజనం చేస్తూ, ఆడుతూ పాడుతూ భక్తి మార్గాన్ని ఆయన ప్రబోధించాడు. 'ఒక్కొక్కసారి భక్త్యావేశంతో తన్మయత్వం పొంది ఒళ్ళు తెలియకుండా పడిపోతూ ఉండేవాడు. పరిశుద్ధమైన ప్రేమే భగవంతుని స్వరూపం' అని, 'మానవ సేవయే మాధవ సేవ' అనీ నమ్మిన మహాభక్తుడు చైతన్యుడు. 1533 జూన్ 14న ఆయన సిద్ధిపొందాడు.

## చైనా

చూ. చీనా

## జగజీవన్‌రావ్ 1908–1986

ప్రముఖ భారత రాజకీయవేత్త. హరిజన కుటుంబంలో పుట్టి హరిజనుల కోసం జీవితాంతం పాటుపడి భారత కేంద్ర ప్రభుత్వంలో అత్యున్నత పదవులను అధిష్ఠించిన మహనీయుడు. బీహార్ రాష్ట్రం సాహారం జిల్లా చాంద్వాలో 1908 ఏప్రిల్ 5వ తేదీన జగ్‌జీవన్‌రావ్ జన్మించారు.

బీహార్ హరిజన సేవక్ సంఘం కార్యదర్శిగా కొంత కాలం పనిచేశారు. 1937లో బీహార్ అసెంబ్లీకి కాంగ్రెస్ అభ్యర్థిగాఎన్నికై పార్లమెంటరీ కార్యదర్శిగాపనిచేశారు. 1939లో ఆ పదవికి రాజీనామాచేసి ప్రదేశ్ కాంగ్రెస్‌కమిటీ కార్యదర్శిగాఎన్నికఅయారు. 1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమంలోపాల్గొని జైలుకివెళ్లి తిరిగి వచ్చినతర్వాతదేశమంతటా పర్యటించి దళితజాతుల స్థితిగతులను గురించి తెలుసుకున్నారు. 1946లో బీహార్ మంత్రి వర్గంలో పార్లమెంటరీ కార్యదర్శిగా ఉండగా, కేంద్రంలో ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వంలో జవహర్ లాల్ నెహ్రూ ఆయనను మంత్రి వర్గంలో ఒక మంత్రిగా నియమించారు. కేంద్ర ప్రభుత్వంలో కమ్యూనికేషన్లు, రవాణా, రైల్వే, కార్మిక శాఖ, ఉపాధి, పునరావాసం, వ్యవసాయం, సహకారం, రక్షణ, నీటి పారుదల తదితర మంత్రిత్వ శాఖలను 1952 నుంచి 1980 మధ్య నిర్వహించారు.



హరిజన సభ్యులలో అధిక సంఖ్యాకుల మద్దతు ఉన్నందున కేంద్ర రాజకీయాలలో జగజీవన్‌రావ్ ఎప్పుడూ కీలక స్థానంలోనే ఉండేవారు. 1986వ సంవత్సరం జూలై 8వ తేదీన ఢిల్లీలో జగజీవన్‌రావ్ కన్నుమూశారు.

## జగన్నాథ పండితరాయలు

అఖిల భారత ఖ్యాతిని ఆర్జించిన ఆంధ్ర దేశానికి చెందిన-సంస్కృత విద్వాంసుడు. 15వ శతాబ్దికి చెందిన జగన్నాథ పండితుడు కోనసీమలోని ముంగండ గ్రామంలో సర్వ శాస్త్రాలను అభ్యసించాడు. కాశీ పట్టణంలో శేషవీరేశ్వరుని శిష్యుడై వ్యాకరణ శాస్త్ర పరాయణుడయ్యాడు. రాజస్థాన్‌లోని జయపుర ప్రభువు ఆహ్వానం మీద అచ్చటికి వెళ్ళి ఆ ఆస్థానంలో కొంతకాలం విద్యాధికారిగా ఉన్నాడు. అనంతరం ఢిల్లీ పాదుషా జహంగీరు ఆహ్వానం మీద ఢిల్లీ వెళ్ళి షాజహాన్ చేత 'పండితరాజ' బిరుదం పొందాడు. షాజహాన్ కుమారుడు దారాషుకోకు జగన్నాథుడు గురువుగా ఉండేవాడు. జగన్నాథుని సహాయంతోనే దారాషుకో ఉపనిషత్తులను పర్షియన్ భాషలోకి అనువదించాడు. రసగంగాధరం, గంగాలహరి, భామినీ విళాసం వంటి ఉద్గ్రంథాలను అనేకం జగన్నాథ పండితుడు సంస్కృత భాషలో రచించాడు.

## 'జనగణమన' గీతం చూ.జాతీయగీతం

## జనాభా లెక్కలు

'సెన్సస్' అంటే జనాభా లెక్కలు తయారు చేయ డం. ఈ పదం లాటిన్ భాషలోని 'సెన్సర్' అనే పదం నుంచి వచ్చింది. ఈపదానికి 'అంచనా కట్టడం' అని అర్థం. క్రీ.పూ. 3వ శతాబ్దంలో మౌర్యరాజుల కాలంలో కౌటిల్యుడు రచించిన అర్థ శాస్త్రంలో జనాభా వివరాల ప్రాధాన్యం వివరించబడింది. 1881లో భారత దేశం అంతటా మొదటిసారిగా ఒకే రకమైన జనాభా గణన జరిగింది. అప్పటినుంచి ప్రతి 10ఏళ్లకూ ఒకసారి ఈ గణన జరుగుతూ వచ్చింది. స్వతంత్ర భారతదేశం ఏర్పడిన మరుసటి సంవత్సరమే అంటే 1948లో భారతదేశ జనాభా గణన చట్టం ఆమోదించబడింది.

ఏ విధమైన అంచనాల తయారీకైనా జనాభా వివరాలు అవసరం. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకూ, ఎన్నికల నియోజక వర్గాల నిర్ణయాలు, విద్య, ఆరోగ్యం, విజ్ఞానం, నిరుద్యోగ నిర్మూలన మొదలైన ప్రణాళికలకూ అభివృద్ధి కార్యక్రమాలకూ ఈ సమాచారమే ఆధారం.

పేరు, స్త్రీ పురుష వివక్ష, వయస్సు, మతం, కులం మొదలైన 17 ప్రశ్నలతో భారతదేశంలో జనాభా గణన జరుపబడుతూంది.

## జపాన్

తూర్పు ఆసియాలోని ద్వీపరాజ్యం. ఇది పసిఫిక్ మహా సముద్రంలో ఉంది. రాజ్యాంగానికి లోబడి

వంశీయులు పాలిస్తున్న రాజ్యం ఇది. కుబ్లయిఖాన్ సామ్రాజ్యంలో (క్రీ.శ. 13వ శతాబ్దం) ఇది కూడా అంతర్భాగంగా ఉండడంవల్ల జపాన్ సంగతి మార్కోపోలో (చూ.) వ్రాతల ద్వారా యూరోపియన్లకు తెలిసింది. జపాన్‌వారు ఇతరదేశాలతో వర్తక వాణిజ్యాలు జరుపుతూ ఉండేవారు. క్రైస్తవ ప్రచారానికి దేశంలో ప్రోత్సాహం లేకపోయింది. ముట్సు హిటో పరిపాలనా కాలం (1867)లో జపాన్ 'మెయిజీ' పునరుద్ధరణకు లోనై పురోగతి చెందుతూ వచ్చింది.




జపాన్ హూన్షూ, హుక్కియాడో, క్యూషూ, షికోకో అనే నాలుగు దీవుల రాజ్యం. జపాన్ తరచు భూకంపాలకు గురి అవుతూ ఉంటుంది. ఏడాదికి సుమారు 1500 సార్లు ఇక్కడ భూమి కంపిస్తూ ఉంటుంది. 1923, 1964 సంవత్సరాలలో పెద్ద భూకంపాలు వచ్చి అపారమైన (1,40,000 చనిపోయారు) ప్రాణనష్టం సంభవించింది.

విస్తీర్ణం: 3,77,815 చ.కి.మీ.; జనాభా: 12, 26,20,000 (1988), రాజధాని: టోక్యో (చూ.) అధికార భాష: జపానీస్ (నిప్పన్). జపాన్ ప్రజలు మంగోలాయిడ్ వర్గానికి చెందినవారు. షింటో బౌద్ధం, జెన్ బుద్ధిజమ్, టావూ మతాలను ఇక్కడి జనం అనుసరిస్తారు. టోక్యో, యోకహోమా, ఒసాకా (26,48, 621), నాగోయా, సపోరా, క్యోటూ, కోబే, ఫూకొకా, కవసాకీ, హిరోషిమా, కిటా క్యూషూలు జపాన్‌లో మహా నగరాలు.

జపాన్‌లో ఉన్న పెద్దనది 'షినానో'. దాని పొడవు 369 కి.మీ. ఏరులు, వాగులు, గెడ్డలు ప్రవహిస్తూ ఉంటాయి. పర్వతాల మధ్య, చల్లారిన అగ్ని పర్వతాలలో సరస్సులు ఏర్పడ్డాయి. హూన్షూ దీవిలోఉన్న బివా సరస్సు (విస్తీర్ణం 686 చ.కి.మీ.) చుట్టూ వినోద పర్యాటకులకు విహార స్థలాలు రూపొందించారు. జపాన్ నాలుగు దీవుల తీరప్రాంతం సుమారు 9,000 కి.మీ. పొడవు ఉంటుంది.

జపాన్‌లో రైతాంగం బాగా అభివృద్ధి చెందింది. సాగుకు అనుకూలమైన నేల తక్కువ. కమతాలు ఒక హెక్టారుకు మించకుండా చిన్న చిన్నవిగా ఉంటాయి. వరి ప్రధానమయిన పంట. బార్లీ, క్యాబేజి, పండ్లు, ఉల్లి, బంగాళ దుంపలు, ముల్లంగి, సోయా చిక్కుడు, గోధుమ, తేయాకు, పొగాకు ఇతర వ్యవసాయోత్పత్తులు. మత్స్య సంపదలో సాల్మన్, సార్డీన్, షెల్‌ఫిష్, టూనా, ఫ్లౌండర్, మేకరెల్, తిమింగలం పేర్కొనదగినవి.

ఖనిజ సంపదలో రకాలు ఎక్కువేగాని తగినంత రాశిలో అవి లభించడం లేదు. పరిశ్రమల్లో వినియోగపడే ఖనిజాల్లో సీసం, జింకు, గంధకం మాత్రం తగినంత ప్రమాణాల్లో లభిస్తున్నాయి. నేలబొగ్గు, ఇనుపరాయి తక్కువ. కావలసిన ఖనిజాలు విదేశాల నుంచి దిగుమతి చేసుకుంటారు. జల విద్యుత్తు లభించుటవలన దేశావసరాలలో సగం విద్యుత్తు లభిస్తున్నది. పారిశ్రామికంగా ప్రగతినొందిన దేశాలలో ప్రముఖమయిన దేశం జపాన్. మోటారు కార్లు,ఇనుము—ఉక్కు,రసాయనిక ద్రవ్యాలు, జవుళీ (నూలు, ఉన్ని, కృత్రిమ), పింగాణి, అతి సున్నిత పరికరాలు, ఎరువులు, యంత్ర సామగ్రి, నౌకా నిర్మాణం; జెరాక్స్ సామగ్రి, కంప్యూటర్‌లు, డి.టి.పి., లేజర్ ప్రింటర్‌లు, ఎలక్ట్రానిక్ పరికరాలు, ఫోటోగ్రాఫిక్ పరికరాలు, మైక్రోవేవ్ ఓవెన్‌లు, వి.సి.ర్.లు, ఎలక్ట్రానిక్ కేలిక్యులేటర్స్ ఫిల్ములు ప్రముఖ మయిన పరిశ్రమలు.

## జమైకా

వెస్టిండీస్ దీవులలో గ్రేటర్ ఆంటిల్లిస్‌లో జమైకా దీవులు చేరి ఉన్నాయి. ఇవి క్యూబాకు 144 కి.మీ. దూరంలో ఉన్నాయి. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలించే దేశం. పూర్వం క్రిస్టఫర్ కొలంబస్ 1494 లో ఈ దీవులను ఆవిష్కరించాడు. 1655 వరకు స్పెయిన్ అధీనంలోనే ఉండి తరువాత

బ్రిటిషువారి వశమయ్యాయి. 1962 లో బ్రిటిషు పాలన నుండి విముక్తి పొంది ప్రస్తుతం బ్రిటిషు కామన్ వెల్త్‌లో జమైకా ఒక దేశంగా ఉంది.

విస్తీర్ణం: 10,991 చ.కి.మీ; జనాభా: 24,07,000 (1988); రాజధాని: కింగ్స్‌టన్; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలలో నీగ్రో జాతులు 76 శాతం. ఆఫ్రో—యూరపియన్ సంకర జాతులు 15 శాతం; రెడ్ ఇండియన్ జాతులు 3 శాతం, తెల్లవారు 3 శాతం. క్రైస్తవులు, రాస్తాఫారియన్ మతస్థులు ఎక్కువ.

చెరకు, అరటి, నారింజ, కొబ్బరి, కూరగాయలు, కోకో, కాఫీ పుష్కలంగా పండుతాయి. పశుపోషణ, మత్స్య పరిశ్రమ భారీ ఎత్తున సాగుతున్నాయి. బాక్సైట్, జిప్సమ్, అల్యూమినియమ్ ప్రధానమైన ఖనిజనిక్షేపాలు. సిమెంటు, పంచదార మద్యపానీయాలు, సిగరెట్లు ప్రముఖ పరిశ్రమలు. ప్రకృతి రామణీయకత ప్రసిద్ధిజెంది విదేశీ వినోద పర్యాటకులను జమైకా విశేషంగా ఆకర్షిస్తూంది.

## జమ్మూ — కాశ్మీర్

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. భారత దేశానికి ఉత్తరాన హిమాలయాలలో ఉన్న రాష్ట్రం ఇది. టిబెట్, చీనా, పాకిస్తాన్ దీనికి అంతర్జాతీయ సరిహద్దులు. ఒకప్పుడు హిందూ రాజవంశీయులు పాలించిన ఈ ప్రాంతం ముస్లిమ్ సుల్తానుల కైవసమై అక్బర్ కాలం నుండి మొగలాయి పాలన క్రిందికి వచ్చింది. 1756లో ఆఫ్ఘన్ పాలనలో చేరి 1819 నాటికి పంజాబ్‌లోని అమృతసర్ సంధి ఫలితంగా రంజిత్‌సింగ్ ఈ ప్రాంతాన్ని మహారాజా గులాబ్‌సింగ్‌కు అప్పగించవలసి వచ్చింది.




భారత స్వాతంత్ర్య సమయం (1947) వరకు బ్రిటిష్ ఆధిపత్యం క్రిందనే ఒక స్వతంత్ర సంస్థానంగా ఇది కొనసాగింది.

భారతదేశ విభజన అనంతరం 1947 అక్టోబరు 26వ తేదీన జమ్మూ—కాశ్మీరు సంస్థానాలను సంస్థానాధీశులు భారత దేశంలో విలీనం చేశారు. అయితే ఇక్కడి ముస్లిం జనాభా ఎక్కువ కావడం వల్ల దీనిమీద పాకిస్తాన్ తన హక్కును వదులుకోవడానికి ఇష్ట పడక పేచీపెట్టి కొంత ప్రాంతాన్ని ఆక్రమించింది. 1965లో పాకిస్తాన్—భారత యుద్ధానంతరం తాష్కెంట్ ప్రకటన ప్రకారం ఒక ఒప్పందం కుదిరింది. భారత రాజ్యాంగరీత్యా (1957 సవరణ) జమ్మూ—కాశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకుంది.

సింధునది, దాని ఉపనది జీలం కాశ్మీరు లోయగుండా ప్రవహిస్తున్నాయి. వరి, గోధుమ, మొక్కజొన్న ఇక్కడి ముఖ్యమైన పంటలు. బార్లీ, జొన్న, సజ్జ కొన్నిచోట్ల పండుతాయి. లడక్‌లో అపరాలు పండుతాయి..

కాశ్మీరు దేశం హస్తకళలకు జగత్ప్రసిద్ధి పొందింది. చేనేత వస్త్రాలు, తివాచీలు, దారుశిల్ప సామగ్రి, పేపరు మాషీ కళ,ఉన్ని శాలువలు విదేశీ మారకాన్ని ఆర్జించి పెడుతున్నాయి. భారత దేశంలో కాశ్మీరు యూరప్‌లో సిట్జర్లాండ్ దేశం అంత సుందర ప్రాంతం అని ప్రసిద్ధి గాంచినది.

అంతర్జాతీయ వినోద పర్యాటక బృందాలను శ్రీ నగర్, పహల్గాం, గుల్‌మార్గ్, దాల్‌లేక్, సోనా మార్గ్ వంటి వినోద యాత్రా కేంద్రాలు విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఇవి స్కేటింగ్, ఐస్ స్కేటింగ్ వంటి మంచు క్రీడలకు అనువుగా ఉంటాయి. అమర్‌నాథ్, వైష్ణోదేవి ప్రసిద్ధ మయిన పుణ్యక్షేత్రాలు.


శ్రీనగర్‌లో జలగృహాలు

## జయదేవుడు

సుప్రసిద్ధ సంస్కృత గేయకావ్యం 'గీత గోవింద' కర్త, గొప్ప కృష్ణభక్తుడు. మాధుర్య భక్తి సంప్రదాయానికి మూలస్తంభం వంటివాడు. క్రీ.శ. 12వ శతాబ్దంలో ఉత్కళ దేశంలో పూరీ జగన్నాథం సమీపంలోని 'కేందుబిల్వ' గ్రామంలో జయదేవుడు జన్మించాడు. తండ్రి భోజదేవుడు, తల్లి రాధాదేవి. లక్ష్మణసేన మహారాజు ఆస్థానంలోని ఒక ప్రముఖకవి జయదేవుడు.

జయదేవుడు అనేక రచనలు చేసినట్లు చెప్పబడుతున్నా, వాటిలో 'గీత గోవిందం' ఒక్కటే ఇప్పుడు లభిస్తూంది. సంస్కృత సాహిత్యంలో గీతగోవిందానికి ప్రత్యేక స్థానం ఉంది. అతిమధురమైన పదాలతో శృంగార రసబంధురమై గానానుకూల్యం కలిగి ఉన్న ఈ అష్టపదులు సంస్కృతం తెలియని వారిని సైతం ఆనంద సాగరంలో ఓలలాడిస్తాయి. జయదేవుని భార్య పద్మావతి. వీరిది మిక్కిలి అనుకూలమైన దాంపత్యం. 'పద్మావతి చరణచారణ చక్రవర్తి' అని జయదేవుని బిరుదు.తన పాటలలో పద్మావతిని ఆయన నాట్యం చేయించేవాడు.

పద్మావతికి జయదేవుడిపై ఎంత ప్రేమ ఉందో తెలుసుకోవాలనే తలంపుతో రాణి ఆమె చెలికత్తెచేత పద్మావతితో 'రాజుగారివెంట అరణ్యానికి వెళ్లి నీ భర్త అకస్మాత్తుగా ఒక క్రూరమృగం దాడికి గురిఅయి మరణించాడు' అని చిన్న అబద్ధం ఆడించింది.ఆ వార్త విన్న వెంటనే పద్మావతి నేలమీద పడి మరణించింది. ఇంతలో జయదేవుడు తిరిగి వచ్చి మరణించిన భార్యను చూసి దుఃఖితుడై శ్రీ కృష్ణపరమాత్మను ప్రార్థించాడు. జయదేవుని ప్రార్థనను మన్నించిన కృష్ణపరమాత్మ పద్మావతికి ప్రాణదానం చేశాడని ఐతిహ్యం. పద్మావతి పునర్ జీవితయై 'స్వామి కంటిముందే నన్ను మరణించ నివ్వండి' అని కోరుకుంది. దానిలోని మర్మం తెలియని జయధేవుడు 'నీ యిష్టం' అన్నాడు. పద్మావతి అప్పటి కప్పుడే శాశ్వతంగా కన్ను మూసింది. దుఃఖసాగరంలో మునిగిన జయదేవుడు రాజాస్థానం విడిచి తన ఊరు 'కేందుబిల్వ' గ్రామానికి చేరుకున్నాడు. అక్కడే ఆయన సిద్ధి పొందాడు. నేటికీ జయదేవుని సమాధిని వేలాది మంది భక్తులు దర్శిస్తు న్నారు.

## జయపూర్

రాజస్థాన్ రాష్ట్రానికి రాజధాని. వెనుకటి రాజపుత్ర సంస్థానాధీశులు ఈ నగర వీధులను మహాసౌధాలతో కళాత్మకంగా తీర్చిదిద్దారు. మహారాజ ప్రాసాదం పురానికి నడుమున ఉంది. హవామహల్ ఆకాశ హర్మ్యం— గులాబీరంగు రాతి కట్టడం. ఇతర కట్టడాలు కూడా గులాబీరంగులోనే ఉంటాయి. అందుకే దీనికి పింక్‌సిటీ అని పేరు వచ్చింది. 'స్టుకో' పని చేసినవి కొన్ని భవనాలు. హస్త కళలకు ప్రసిద్ధి. జయసింహుడు (18వ శతాబ్ది) నిర్మించిన జంతర్ మంతర్ వేధశాల ప్రాంగణంలోని నిర్మాణాలు శాస్త్రీయ పద్ధతిలో కట్టినవి ఉన్నాయి.

## జయప్రకాశ్ నారాయణ్

త్యాగధనుడైన భారత స్వాతంత్ర్యయోధుడు, గొప్ప రాజకీయ నాయకుడు. భారతదేశంలో సోషలిస్టు పార్టీకి వ్యవస్థాపక కార్యదర్శి. సర్వోదయోద్యమ నాయకుడు. విద్యాభ్యాసం బీహారులోను, యునైటెడ్ స్టేట్స్ లోను జరిగింది. భారత స్వాతంత్ర్య సమర సమయంలో కాంగ్రెసువాదిగా అనేకసార్లు కారాగార శిక్షకు గురి అయాడు. కార్మికుల సంక్షేమం పట్ల శ్రద్ధ వహించడానికి కాంగ్రెసులోని కార్మిక విభాగం నిర్వహించాడు (1931). కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడుగా ఉన్నప్పుడు ఇతర సభ్యులతో ఏకాభిప్రాయం కుదరక ఆ కార్యవర్గ సభ్యత్వానికి రాజీనామా చేశాడు. అనంతరం, గాంధీజీ హత్య తరువాత కాంగ్రెసు నుంచి వైదొలిగాడు (1948). పిదప జయప్రకాశ్ నారాయణ్ సోషలిస్ట్ పార్టీ కార్యదర్శిగాను, అఖిల భారత రైల్వే ఫెడరేషన్ అధ్యక్షుడుగాను పనిచేశాడు. 1957 అక్టోబరు నుంచి క్రియాశీల రాజకీయాలకు దూరంగా ఉంటూ తన సర్వశక్తియుక్తులను సర్వోదయోద్యమం కోసం వినియో గించాడు. అయితే 1974 నుంచి రాజకీయాలలో ప్రాకిన అవినీతి నిర్మూలనకు నడుంకట్టుకొని ప్రజాస్వామిక వ్యవస్థను పటిష్ఠం చేయడానికి దీక్ష వహించి 'సిటిజన్స్ ఫర్ డెమోక్రసీ' ఉద్యమం చేపట్టి నిర్వహించాడు. 1975లో అత్యవసర పరిస్థితి సమయంలో 'టోటల్ రెవల్యూషన్' నినాదం ప్రకటించి, ప్రతి పక్షాలను సమీకరించి జనతాపార్టీకి మద్దతు ఇచ్చాడు. 1977 సార్వత్రిక



ఎన్నికలలో ఇందిరాగాంధీ నాయకత్వంలోఉన్న కాంగ్రెసుప్రభుత్వాన్ని ఓడించి జనతాపార్టీప్రభుత్వాన్ని కేంద్రంలోఏర్పాటుచేయడానికి దోహదంచేశాడు.మళ్ళీరాజకీయాలకుదూరంగాఉండాలని నిర్ణయించుకున్నాడు. 1979డిసెంబర్ 8న జయప్రకాశ్‌నారాయణ్ బొంబాయిలోపరమపదించారు.

## జయవిజయులు

భాగవత పురాణంలోని పాత్రలు. జయవిజయులు ఇద్దరూ వైకుంఠంలోని శ్రీ మహావిష్ణువు ద్వారపాలకులుగా ఉండేవారు. ఒకనాడు సనకాది మహామునులు శ్రీ మహావిష్ణువు దర్శనానికి రాగా సింహద్వారం వద్దనే జయవిజయులు వారిని లోనికి పోకుండా అడ్డుకున్నారు. శనక మహర్షి కోపోద్రిక్తుడయి భూలోకంలో మూడు జన్మలలో అసురులుగా పుట్టమని వారిని శపించాడు. శాపవిముక్తి తెలియజేయమని జయవిజయులు ప్రాథేయ పడ్డారు. అప్పుడు మొదటి జన్మలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా పుట్టగా విష్ణువు సంహరించినప్పుడు శాప విమోచనం కలుగుతుందన్నాడు. అటులనే రెండవ జన్మలో రావణ, కుంభకర్ణులుగా పుట్టగా విష్ణువు శ్రీరామావతారమెత్తగా రావణ యుద్ధంలో శాపవిమోచనం కలుగుతుందనీ, మూడవ జన్మలో శిశుపాలుడుగాను దంతవక్త్రుడుగాను పుట్టగా విష్ణువు శ్రీ కృష్ణావతారమెత్తి సంహరించగా శాపవిముక్తులవుతారనీ, ఈ మూడు జన్మలూ ఎత్తి శాపవిమోచనం పొంది చివరకు వైకుంఠం చేరుకుంటారని పురాణగాథ.

## జరతుష్ట్ర

జరతుష్ట్రను 'జోరాస్టర్' అని కూడా అంటారు. నైతిక, ఆధ్యాత్మిక ఆదర్శాల పట్ల విశ్వాసంతో జీవించడమే నిజమైన మతమని జరతుష్ట్ర సిద్ధాంతం. క్రీ.పూ. 6వ శతాబ్ది ప్రాంతంలో జరతుష్ట్ర ప్రవక్త దీనిని స్థాపించాడు. 'అహూరా, మజ్దా' అను మంచి ఆత్మలకు 'ఆంగ్రా, మెయినల్లా' అను చెడు ఆత్మలకు మధ్య సంఘర్షణ ఫలితాలే ఈ మతంలోని సారాంశం. పర్షియా దేశీయుడైన జరతుష్ట్ర జన్మించేనాటికి ఆ ప్రాంతాలలో బలులతో, మాయా మంత్ర తంత్రాలతో కూడిన దురాచారాలు ప్రబలంగా ఉండేవి. అవి మానవకోటికి వినాశ కరాలని జరతుష్ట్ర గట్టిగా వాటిని ఖండించాడు. అంతకాలం అజ్ఞాతంగా భగవద్ధ్యానంలో కాలం గడిపిన జరతుష్ట్ర 30వ ఏట ధర్మ ప్రచారానికి పూనుకొన్నాడు. ఇరాన్ ప్రజలు అతని ఘనతను గుర్తించి అతని ధర్మాన్ని అవలంబించారు. క్రీ.శ. 2వ శతాబ్దిలో జోరాస్టర్ మతం ఉచ్చదశలో ఉంది. ఇస్లాం వచ్చిన తరువాత దీని ప్రభావం తగ్గసాగింది. నేటి పార్శీలు జొరాస్ట్రియన్ మతావలంబకులు. వీరు అగ్ని ఆరాధకులు. 'అవెస్తా' వీరి పవిత్ర గ్రంథం.

## జర్మనీ, పశ్చిమ

మధ్య యూరప్‌లోని స్వతంత్ర గణరాజ్యం. రెండవ ప్రపంచ యుద్ధం (1939–1945) తరువాత మిత్రపక్షాలలో బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, ఫ్రాన్స్ రాజులు తమ ఆక్రమణలోఉన్న జర్మనీ ప్రాంతాన్ని 1949 మే 23న 'పశ్చిమ జర్మనీ' గా రూపొందించారు (చూ. జర్మనీ, తూర్పు).

విస్తీర్ణం: 2,48,709 చ.కి.మీ జనభా: 6,07, 82,000 (1988); రాజధాని: బాన్ అధికార భాష: జర్మన్. ప్రజలు సగం మంది ప్రొటస్టెంట్ క్రైస్తవులు. గాటింగెన్ యూనివర్సిటీ, హైడెల్ బర్గ్ యూనివర్సిటీ లలో సంస్కృతం అధ్యయనం జరుగు తూంది.

దేశంలో దక్షిణాన బవేరియా, ఆల్ప్సు పర్వత శ్రేణులు, డాన్యూబ్‌నది, రైన్‌నది, దాని ఉపనదులు, మెయిన్‌నది, నెకర్‌నది ప్రవహిస్తున్నాయి. దట్టమైన కీకారణ్యం అయిన 'బ్లాక్ ఫారెస్ట్' దేశం నైరృతి మూల ఉంది. ఉత్తరాన ఎల్బ్‌నది, ఎమ్స్‌నది, ఓడర్‌నది, రైన్‌నది, వీజర్‌నది ప్రవహిస్తున్నాయి. ఇవి నౌకాయానానికి కూడ అనువుగా ఉన్నాయి. మిట్టలాండ్ కాలువ హనోవర్ ప్రాంతానికి తూర్పుగా పారుతోంది.

పశ్చిమ జర్మనీలో బంగాళదుంపలు ముఖ్యమైన ఆహారపు పంట. బార్లీ, రైధాన్యం, బీటు (పంచదార) దుంప, గోధుమ, పండ్లు కొద్దిగా పండుతాయి. ఆహారపు దినుసులు దిగుమతి చేసుకోవలసి వస్తూంది. నేలబొగ్గు, ఇనుపరాయి, సీసం, పెట్రోలియం, జింకు, రాతి ఉప్పు

పశ్చిమ జర్మనీలోని ప్రధాన ఖనిజ నిక్షేపాలు. ప్రపంచంలో పారిశ్రామికాభ్యుదయం సాధించిన దేశాల్లో పశ్చిమ జర్మనీకి ప్రముఖ స్థానం వుంది. వాణిజ్య నౌకలు, మోటారు కార్లు, వస్త్రాలు, విద్యుత్ పరికరాలు, ఇనుము, ఉక్కు, రాసాయనిక ద్రవ్యాలు, సిమెంట్ యంత్రపరికరాలు, సున్నితమయిన సాంకేతిక పరికరాలు పశ్చిమ జర్మనీలో విరివిగా తయారయి విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి.




## జర్మనీ, తూర్పు

రెండవ ప్రపంచ యుద్ధం (1939–45) తరువాత మిత్రపక్షాలలో ఒకటయిన సోవియట్ రష్యా ఆక్రమణలో ఉన్న జర్మనీ భాగాన్ని 1949 అక్టోబర్ నెలలో జర్మనీ డెమోక్రటిక్ రిపబ్లిక్(జి.డి.ఆర్.)గా రూపొందించారు. అంతకు ముందు 19వ శతాబ్దిలో ప్రష్యా ప్రధాని బిస్మార్క్(చూ.) జర్మనీ భాష మాట్లాడే ప్రాంతాలన్నీ ఏకంచేసి ఐక్యజర్మనీని స్థాపించాడు. 1930–40 దశాబ్దంలో నాజీ నియంత హిట్లర్(చూ.) జర్మనీని సైనికంగా ప్రపంచంలోనే ఒక బలమైన రాజ్యంగా తీర్చిదిద్దాడు. ప్రస్తుతం (1990) తూర్పు జర్మనీ కమ్యూనిస్టు పాలనలో ఉంది. (చూ. జర్మనీ, పశ్చిమ) ఎల్బ్‌నది, స్ప్రీనది, ఓడర్‌నీస్ నది, వార్నేనది, సాలానది, మిట్టలాండ్ కాలువ, మూరిట్జ్ సరస్సు ఈ దేశానికి ప్రధాన జలాధారాలు.

విస్తీర్ణం: 1,08,333 చ.కి.మీ.; జనభా 1,65,88,000 (1988), రాజధాని: తూర్పు బెర్లిన్; అధికార భాష: జర్మన్; ప్రజలు హై–జర్మన్ భాష, లో–జర్మన్ భాషలు మాట్లాడ తారు. ప్రొటెస్టెంట్ క్రైస్తవ మతాన్ని పాటిస్తారు. బార్లీ, రైధాన్యం, ఓట్‌ధాన్యం, గోధుమ, బంగాళాదుంపలు ప్రధానమైన వ్యవసాయోత్పత్తులు. ఇనుపరాయి, రాగి, తగరం, రాతి ఉప్పు, పొటాష్, లిగ్నైట్ ముఖ్యమయిన ఖనిజసంపద. కాడ్, హెర్రింగ్ చేపలు విరివిగా లభిస్తాయి. పారిశ్రామికంగా ఎక్కువ ప్రగతిగాంచిన దేశం. విద్యుత్తు పనిముట్లు, ఉక్కు యంత్రసామాగ్రి, రాసాయనిక ద్రవ్యాలు, వస్త్రాలు, చాక్షుష (ఆప్టికల్) పరికరాలు, రవాణా వాహనాలు, ఆహారపదార్థాలు, ధాతువులు మున్నగునవి పారిశ్రామికోత్పత్తులు..

## జలియన్‌వాలా బాగ్ దురంతం

భారత స్వాతంత్ర్య సమరచరిత్రలో ఒక మరపురాని దుర్ఘటన! భారత రక్షణ చట్టం క్రింద పౌరుల వ్యక్తి గత స్వేచ్ఛకు నాటి బ్రిటిష్ ప్రభుత్వం తీవ్రంగా భంగం కలిగించింది. మొదటి ప్రపంచ యుద్ధం (1914–1919) తరువాత కూడా ఈ వైఖరిని కొనసాగించడానికి బ్రిటిషు ప్రభుత్వం రౌలట్ చట్టాన్ని అమలు పరచింది. దీని ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూల ద్రోయడానికి ప్రయత్నిస్తున్నాడని ఏ వ్యక్తి నైనా అనుమానం మీద అరెస్టు చేసి ప్రత్యేకమైన కోర్టులో విచారణ చేసి కఠిన శిక్ష విధించ వచ్చును. భారత దేశానికి స్వాతంత్ర్య సంపాదన కోసం ఉద్యమాలు కొనసాగిస్తున్న జాతీయ నాయకుల కార్యకలాపాలను ఈ చట్టం ద్వారా నిరోధించడమే పాలకుల ప్రధానమైన ఉద్దేశం. గాంధీజీ సబర్మతిలో రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం ప్రారంభించారు. దేశ వ్యాప్తంగా హర్తాళ్‌లు జరిగాయి. ఈ నేపథ్యంలో రౌలట్ సత్యాగ్రహ సందర్భంలోనే పంజాబు గవర్నరు కఠినమైన ఉత్తర్వులు జారీ చేశాడు. దేశంలోని ఇతర ప్రాంతాల నుంచి జాతీయ భావాలూ, రాజ ద్రోహాన్ని ప్రేరేపించే సిద్ధాంతాలు ఆ రాష్ట్రంలోకి రాకుండా నిరోధించడమే ఈ ఉత్తర్వుల లక్ష్యం. దీనికి కారణం నాటి బ్రిటిష్ ఇండియన్ రక్షణ సేనలో ఎక్కువ మంది పంజాబీలే ఉండేవారు. వారిలో తీవ్ర జాతీయ భావాలు

రేకెత్తించకుండా చేయాలని ఆ గవర్నరు భావించాడు. భారతీయులను సైన్యంలోకి చేర్చుకునే విషయంలో గవర్నరు కఠిన నియమావళిని ప్రవేశ పెట్టాడు. తత్ఫలితంగా పంజాబు ప్రజలలో అలజడి, ఆందోళన తల ఎత్తాయి. దీనికి తోడు సత్యపాల్, సైపుద్దీన్ కిచ్లూ వంటి జాతీయ నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసింది.

అమృతసర్ పట్టణంలో ప్రజలు ఆగ్రహావిష్టుల యారు. అల్లర్లు చెలరేగాయి. పోలీసులు కాల్పులు జరిపారు. అమాయక ప్రజలు కొందరు చనిపోయారు. దానిని ప్రత్యక్షంగా చూసిన జనం రెచ్చిపోయి అయిదుగురు ఇంగ్లీషు ఉన్నతోద్యోగులను ఆఫీసులోనే చంపివేశారు. ఈ సంఘర్షణలో ఇద్దరు బ్రిటిష్ మహిళలు తీవ్రంగా గాయపడ్డారు. పట్టణంలో బహిరంగ సభలను ప్రభుత్వం నిషేధించింది. 1919 ఏప్రిలు 13 వ తేది ఉత్తర భారత దేశంలో సంవత్సరాది పండుగ. ఆరోజున అమృతసర్ పట్టణంలో జలియన్‌వాలాబాగ్ అనేచోట బహిరంగ సభను ఏర్పాటు చేశారు. ఆ సభలో 20 వేల మంది పైగా ప్రజలు గుమిగూడారు. ప్రభుత్వ ఉత్తర్వులను ధిక్కరించి అక్కడ సమావేశమయిన స్త్రీ పురుషులకు గట్టిగా గుణపాఠం చెప్పాలని పంజాబు గవర్నరు అయిన డయ్యర్ సేనాని హుటాహుటిన తన సైనిక బలగంతో అక్కడికి వచ్చి ముందు హెచ్చరిక లేకుండానే కాల్పులు జరిపించాడు. ఆ బాగ్ నుంచి బయటికి పారి పోవాలంటే




ఒక వైపు మాత్రమే దారి ఉంది. మూడు వైపులా పెద్ద గోడలు. సుమారు వెయ్యి మంది ప్రజలు అక్కడికక్కడే మరణానికి గురి అయ్యారు. కొన్ని వేల మంది గాయ పడ్డారు. మందు గుండు సామగ్రి అయిపోయేవరకూ ఎడ తెరిపి లేకుండా బ్రిటిష్ సైనికులు కాల్పులు జరిపారు. ఇంకా మందు గుండు సామగ్రి ఉంటే ఇంకా ఎక్కువ మందిని చంపి ఉండేవాడినని డయ్యర్ ప్రగల్భాలు పలికాడు. భారతదేశ చరిత్రలో అత్యంత దారుణమైన సంఘటన ఇది! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, ఆనాడు ప్రాణాలు కోల్పోయిన అమర వీరులకు ఒక స్మృతి చిహ్నాన్ని అమృతసర్‌లోని ఆ జలియన్‌వాలా బాగ్‌లో నిర్మించారు. (చూ. భారతస్వాతంత్ర్యపోరాటం).

## జవహర్‌లాల్ నెహ్రూ

నవభారత నిర్మాత. ప్రప్రథమ భారత ప్రధాని (1947–1964). మోతీలాల్ నెహ్రూ కుమారుడు. తరువాత భారత ప్రధానులైన ఇందిరాగాంధీ (చూ.)కి తండ్రి; రాజీవ్ గాంధీకి మాతామహుడు. గాంధీజీకి రాజకీయ వారసుడు. నవభారత రాజకీయ రంగంలో విశిష్ట పాత్ర నిర్వహించిన మహనీయుడు. ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడానికి అనేక ప్రణాళికలు ఆయన అమలు జరిపారు. సమసమాజ స్థాపనకు సోషలిస్టు పేటర్న్ ఆఫ్ సొసైటీ పథకానికి రూపకల్పన చేసి భారతదేశంలో మిశ్రమ ఆర్థిక వ్యవస్థను (మిక్స్‌డ్ ఎకనమీ) ప్రవేశ పెట్టి ప్రభుత్వ పరంగా అనేక పరిశ్రమలు స్థాపించి పారిశ్రామికంగా భారతదేశం ముందడుగు వేయడానికి కారకుడయ్యాడు. పంచవర్ష ప్రణాళికలు(చూ.) రూపొం దించి పారిశ్రామిక ప్రగతి ద్వారా దేశ ఆర్థికాభివృద్ధి సాధించడానికి తోడ్పడ్డాడు. దేశవ్యాప్తంగా భారీ డాములు నిర్మించి రైతులకు పంట నీటిని అందించడానికి దోహదం చేశాడు. ఇతని దౌత్య నీతిని 'చైతన్యవంతమయిన తటస్థ విధాన'మని (డైనమిక్ న్యూట్రా లిటీ) విజ్ఞులు పేర్కొంటారు. ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ ఇటీవల స్వతంత్రమైన బడుగు దేశాలకు నాయకుడయి ఆయా రాజ్యాధినేతలను సమీకరించి వాటి అభివృద్ధికి కృషి చేశాడు. రక్షణ బలం మిక్కుటంగా ఉన్న భారీ రాజ్యాల బారినుండి బడుగు దేశాలను కాపాడడానికి అలీనోద్యమం (చూ.) చేపట్టి దానికి నాయకత్వం వహించాడు.



జవహర్‌లాల్ నెహ్రూ శాంతికాముకుడు. ప్రపంచశాంతికై పంచశీల ఒడంబడికను చీనాతో చేసుకున్నారు (1954).

అలహాబాదులో 1889 నవంబరు 14న నెహ్రూ జన్మించాడు. ఇంగ్లండులో హారో పాఠశాలలో విద్యనభ్యసించి కేంబ్రిడ్జి యూనివర్సిటీ నుండి పట్టభద్రుడయ్యాడు. స్వదేశానికి తిరిగి వచ్చి రాజకీయాలలో ప్రవేశించి ప్రముఖ కార్యకర్తలలో ఒకడు అయాడు. గాంధీజీ 1920లో నిర్వహించిన సహాయ నిరాకరణోద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించాడు. భారత జాతీయ కాంగ్రెసుకు కార్యదర్శి అయి, తరువాత దానికి అధ్యక్షుడు కూడా అయాడు, (1929). తిరిగి 1936, 1937, 1947 సంవత్సరాలలో కూడా అధ్యక్షపదవిని చేపట్టి కాంగ్రెస్‌కు మార్గ నిర్దేశం చేశాడు. ఉప్పు సత్యాగ్రహం (1930), క్విట్ ఇండియా ఉద్యమం (1942) వంటి అనేక ఉద్యమాలలో ప్రధాన పాత్ర వహించి, అరెస్టయి జవహర్‌లాల్ నెహ్రూ కారాగార వాసంలో చాలా కాలం గడిపాడు. ఒకవైపు రాజకీయ జీవితంతో సతమతమవు తుండగా ఈయన భార్య కమలా నెహ్రూ తీవ్ర అనారోగ్యానికి గురియై స్విట్జర్లాండ్‌లో విశ్రాంతి తీసుకుంటు ఉండగా మరణానికి గురి అయింది. జైలులో ఉన్నప్పుడు 'భారత స్వరూపావిష్కరణ'(డిస్కవరీ ఆఫ్ ఇండియా) అనే గ్రంథం వ్రాశాడు (1943–44). ఇంగ్లీషులో పేరెన్నిక గన్న రచయిత నెహ్రూ. కారాగారంలో ఉండగా తన ఏకైక కుమార్తె ఇందిరాప్రియదర్శిని పేర ఆయన వ్రాసిన లేఖలు బాలబాలికలు తప్పక చదవ దగ్గవి. సరళ భాషలో ప్రపంచ చరిత్రలోని ముఖ్య ఘట్టాలను ప్రస్తావిస్తూ పిల్లలకు చారిత్రక అవగాహనను కలిగించే చక్కని రచన అది. జాబులను క్రోడీకరించి 'గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ' పేర అందించాడు. 'స్వీయ చరిత్ర' నెహ్రూ రచించిన మరొక సుప్రసిద్ధ రచన. జవహర్‌లాల్ నెహ్రూ చేసిన అసంఖ్యాకమైన ప్రసంగాలు అనేక మంది యువతీ యువకులకు ఉత్తేజాన్ని కలిగించాయి. శాస్త్ర వైజ్ఞానిక పరిశోధనలు కొనసాగించడానికి ప్రయోగ శాలలు ఉన్నత విద్యా సంస్థ (ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ) లు స్థాపించాడు. జవహర్‌లాల్ నెహ్రూకు పిల్లలంటే చాల ఇష్టం. బాలబాలికలు 'చాచా' నెహ్రూ అని ముద్దుగా పిలుస్తూ ఆయన పుట్టిన రోజు (నవంబరు 14) బాలల దినోత్సవం(చూ.) వేడుకగా దేశవ్యాప్తంగా జరుపుకుంటూ ఉంటారు. జవహర్‌లాల్ నెహ్రూ మొత్తం జీవితకాలం (1889–1964) 75 ఏళ్లలో 52 ఏళ్లు రాజకీయాల్లోనే గడిచింది. ఇందులో చాలాకాలం కారాగారాల్లోనే గడపవలసి వచ్చింది. 1946లో తాత్కాలిక భారతప్రధాని పదవిని చేపట్టి భారత స్వాతంత్ర్యానంతరము (1947) ప్రధాని గానే కొనసాగాడు. 1952లో ప్రథమ సార్వత్రిక ఎన్నికలు జరిగిన పిమ్మట మరల ప్రధానియై మొత్తం 18 ఏళ్లు ప్రధాని పదవిని దక్షతతోనూ, రాజనీతిజ్ఞతతోనూ నిర్వహించి 1964 మే 27న పరమ పదించారు. న్యూఢిల్లీలోని శాంతివనంలో ఉన్న ఈయన సమాధి జాతీయ స్మారక చిహ్నంగా వెలుగుతున్నది. చూ. భారతస్వాతంత్ర్య పోరాటం

## జవహర్‌లాల్ నెహ్రూ పురస్కారం

అంతర్జాతీయ అవగాహన రంగంలో కృషిచేసిన వారికి ప్రదానం చేయబడే ఈ పురస్కారం విలువ పదిహేను లక్షల రూపాయలు.

ఇప్పటివరకూ ఈ పురస్కారమును అందుకున్నవారు: ఇందిరాగాంధీ, మార్టిన్ లూథర్ కింగ్ (చూ.), ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, మదర్ తెరిసా, కెన్నెత్ కౌండా,

మార్షల్ టిటూ, జూలియస్ నైరేరీ, ఓలాఫ్ పామే, నెల్సన్ మండేలా.

## జహంగీర్ 1569–1627

నాలుగవ మొగలాయి చక్రవర్తి అక్బర్ (చూ.) కుమారుడు. 1605లో ఈయన పరిపాలన ప్రారంభ మయింది. నూర్జహాన్ ఇతని భార్య. ఈయన హయాములో పోర్చుగీసువారితో వర్తకవ్యాపారాలు అభివృద్ధి చెందాయి. ఆర్థికంగా దేశం అభివృద్ధి సాధించింది. న్యాయపాలనకు, కళాపోషణకు,మతసహనానికి జహంగీర్ కీర్తిపొందాడు. రాజు కాకపూర్వం ఈయన సలీమ్; అనార్కలీ అనే దాసీ కన్యను ప్రేమించి, భగ్న ప్రేమికుడైన ఈయన కథ, సాహిత్య జగత్తులో సుప్రసిద్ధమైంది.



## జాంబియా

ఆఫ్రికాలో దక్షిణాన ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యం. జాంబెజీనది ఈ దేశంగుండా ప్రవహిస్తూ ఉండడం చేత ఈ దేశానికి 'జాంబియా' అనే పేరు వచ్చింది. ఒకప్పుడు దీనిని 'ఉత్తర రొడీషియా' అనేవారు. 1964లో స్వతంత్ర రాజ్యమయింది. ఇక్కడ రాగి పుష్కలంగా లభిస్తూండడం వల్ల ఈ దేశం సుసంపన్నమైంది.




విస్తీర్ణం: 7,52,614 చ.కి.మీ; జనాభా: 73, 84,000 (1988); రాజధాని: లుసాకా; అధికార భాష: ఇంగ్లీషు; బంటూ భాష. ప్రజలలో 70 శాతం ఆదిమ జాతులకు చెందిన నీగ్రోలు. వీరు 8 మాండలిక భాషలు మాట్లాడ తారు. ప్రధానమయిన నీటివనరు జాంబెజీనది. దీని మీద నిర్మించిన కరీబాడాము ప్రపంచంలోని పెద్దడాములలో ఒకటి. ఇది జల విద్యుదుత్పత్తి కూడ చేస్తూంది. జాంబియా, జింబాబ్వే ఉమ్మడి నిర్వహణలో ఉన్న కరీబా జలాశయం రెండు దేశాలకూ పంట నీటిని అంది స్తూంది. దీనికి ఎగువను విక్టోరియా జలపాతం ఉంది. కాంగోనది, కఫూయానది, లౌపూలా నది, మేట్వారు సరస్సు, టాంగన్యీకా సరస్సు ఇతర జలాధారాలు. పొగాకు, ప్రత్తి, మొక్కజొన్న, కర్ర పెండలం, వేరుసెనగ, చిరుధాన్యాలు, చెరకు వ్యవసాయోత్పత్తులు. జెయిరీ—జాంబియా సరిహద్దులో ఉన్న రాగి క్షేత్రంలోని నాలుగు పెద్ద రాగి గనుల నుంచి రాగి ఖనిజాన్ని త్రవ్వి తీస్తున్నారు. ఇంకా చిన్నగనులు చాలా ఉన్నాయి. కాబ్వేవద్ద సీసం, జింకు గనులు ఉన్నాయి. మాంగనీసు, కోబాల్టు, యురేనియం నిక్షేపాలు ఉన్నాయి. కరీబా సరస్సు ప్రాంతంలో నేలబొగ్గు నిక్షేపాలు ఉన్నాయి. కఫూయా జాతీయ పార్కు పర్యాటకులకు చక్కని విహారస్థలం.

## జాకీర్ హుస్సేన్ 1897–1969

భారతీయ రాష్ట్రపతులలో 3వ వాడు. మహాత్మా గాంధీ బేసిక్ విద్యావిధానానికి భాష్యకారుడు డాక్టర్ జాకీర్ హుస్సేన్. 1962లో భారతదేశ ఉపరాష్ట్రపతిగాను, 1967లో రాష్ట్రపతిగాను ఆయన ఎన్నికయ్యారు.

హిందూ ముస్లిమ్ సామరస్యాన్ని బోధించే మహాత్మా గాంధీ సిద్ధాంతం పట్ల ఆకర్షితులై ఆయన మహాత్ముని అనుయాయులయ్యారు.

1957లో బీహార్ గవర్నర్‌గా నియమితులై రాజకీయ రంగంలో ప్రవేశించారు. మాట్లాడడంకన్నా వినడానికే ఆయన ఎక్కువ మక్కువ చూపేవారు. తన జీవితంలో అధిక భాగాన్ని విద్యాసేవకే ఆయన అంకితం చేశారు. పుస్తకాలు చదవడం, వ్రాయడం ఆయన సరదాలు. 'ఛిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్'కు ఆయన అధ్యక్షులుగా ఉండేవారు.



5 ఏళ్ల వయస్సులో చనిపోయిన తన కుమార్తె రుకయ్యా రెహనా పేరుతో డాక్టర్ జాకీర్ హుస్సేన్ కథలు వ్రాసేవారు. డాక్టర్ హుస్సేన్ ఆధ్వర్యంలో రాష్ట్రపతి భవన్ వెనుక ఉన్న మొఘల్ గార్డెన్స్ క్రొత్త శోభను సంతరించుకుంది. 1969 మే 3వ తేదీన జాకీర్ హుస్సేన్ దేహయాత్ర చాలించారు.

## జాతీయగీతం

**భా**రతదేశానికి జాతీయ గీతాలు రెండు. ఒకటి: 'జనగణమన'. రెండు: 'వందేమాతరం' రవీంద్రనాథ టాగూర్(చూ.) ఆయన సంపాదకత్వంలో వెలువడుతున్న 'తత్త్వబోధిని' అనే పత్రికలో 'భారత విధాతా!' అనే శీర్షికతో ఐదు చరణాలు గల 'జనగణమన' గీతాన్ని 1911లో వ్రాశారు.



జనగణమన అధినాయక జయహే!
భారత—భాగ్యవిధాతా
పంజాబ సింధు గుజరాతమరాఠా
ద్రావిడ ఉత్కళవంగా
వింధ్య, హిమాచల, యమునా, గంగా
ఉచ్ఛల జలధితరంగా
తవశుభనామేజాగే
తవశుభ ఆశిషమాగే
గాహే తవజయ గాథా.
జనగణ మంగళ దాయక జయహే!
భారత—భాగ్యవిధాతా
జయ హే! జయ హే! జయ హే!
జయ! జయ! జయ! జయ హే!

ఆ సంవత్సరమే (1911) ఈ పాటను కలకత్తా కాంగ్రెస్ సమావేశంలో పాడారు. దీనిని జాతీయగీతంగా 1950 జనవరి 24వ తేదీన భారత రాజ్యాంగ పరిషత్తు స్వీకరించింది. దీనిని పాడడానికి 52 సెకనుల కాలం పడుతుంది.

బంకించంద్ర చటర్జీ (చూ.) తన నవల 'ఆనంద మఠం'లో 1882 లో 'వందేమాతరమ్' అనే పాటను వ్రాశారు. ఆ పాట సంక్షిప్త రూపాన్ని కూడ జాతీయ గీతంగా పరిగణించారు.



వందేమాతరమ్ వందేమాతరమ్
సుజలామ్ సుఫలామ్ మలయజ శీతలామ్
సస్య శ్యామలామ్ మాతరమ్, వందేమాతరమ్
శుభ్రజ్యోత్స్నా—పులకితయామినీమ్
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీమ్
సుహాసినీమ్ సుమధుర భాషిణీమ్
సుఖదామ్ వరదామ్ మాతరమ్ వందేమాతరమ్

1896లో అఖిల భారత కాంగ్రెస్ మహాసభలో ఈ పాటను పాడడం, అది దేశం అంతటా ప్రచారంలోకి రావడం జరిగింది.

'జనగణమన' జాతీయగీతంతో సమానమైన గౌరవాన్ని 'వందేమాతరం' అనే గేయానికి కూడా భారత ప్రభుత్వం కల్పించింది. సాధారణంగా సభ ఆరంభంలో 'వందేమాతరం' గీతాన్నీ, సభ చివర 'జనగణమన' గీతాన్నీ ఆలాపిస్తారు.

## జాతీయ చిహ్నం

**భా**రత రాజ్యాంగ నిర్ణయ సభలో 1950 జనవరి 26న ప్రభుత్వం అశోకుని స్తంభం మీది నాలుగు సింహాల శిల్పాన్ని ప్రభుత్వ అధికార చిహ్నంగా స్వీకరించింది.

దీనిలో నాలుగు సింహాలు కూర్చొని నాలుగు దిక్కులనూ పర్యవేక్షిస్తూ ఉంటాయి. సింహం నేతృత్వానికి ప్రతీక. ప్రతిమ క్రింది భాగంలో ధర్మచక్రం, పక్కనే గుర్రం, ఎద్దు చెక్కబడి ఉన్నాయి. ధర్మచక్రానికి 24 ఆకులుంటాయి. ఈ సంఖ్య 24 తత్త్వాలను సూచిస్తుంది. ధర్మచక్రంలో మూడుభాగాలుఉన్నాయి. ఒకటి కేంద్రం,రెండు చక్రవాళం,మూడు ఆకులు లేక **ఆరావళి.** ఈ 24 ఆకులూ చక్రవాళానికి కేంద్రంతోసంబంధాన్నికలిగిస్తాయి. ఈరూపకల్పనభిన్నత్వంలో



భారత ప్రభుత్వ ముద్రిక

ఏకత్వాన్ని సూచిస్తుంది. ఈ చక్రభ్రమణం అనంతం. ఈ చిహ్నం క్రింద దేవనాగర లిపిలో 'సత్యమేవ జయతే' అనే సంస్కృత వాక్యం మలచబడింది. ఈ వాక్యం ముండకోపనిషత్తు నుంచి గ్రహించబడింది. 'జయం సాధించడానికి సత్యమే సరియైన మార్గం' అని ఈ వాక్యానికి అర్థం.

## జాతీయ పండుగలు

భారత ప్రభుత్వం మూడు జాతీయ పండుగలను ప్రకటించింది. అవి రిపబ్లిక్ దినోత్సవం జనవరి 26; స్వాతంత్ర్యదినోత్సవం, ఆగస్టు 15, గాంధీ జయంతి అక్టోబరు 2. వీటిని కులమత వర్గ విచక్షణలేకుండా దేశ వ్యాప్తంగా జాతి అంతా జాతీయ పండుగలుగా పరిగణించి వేడుకలు జరుపుకుంటున్నారు. ఈ మూడు రోజులూ జాతీయ పర్వదినాలుగా పరిగణింపబడి అన్ని ప్రభుత్వ కార్యాలయాలను మూసి వేస్తారు.

*రిపబ్లిక్ దినోత్సవం:* భారతదేశం ప్రజాసత్తాక గణరాజ్యం అయిన రోజు. 1950లో రాజ్యాంగ పరిషత్తు సిద్ధపరచిన భారత రాజ్యాంగం అమలులోకి వచ్చి 'రిపబ్లిక్' రాజ్యంగా అవతరించిన రోజు జనవరి 26. ఈ రోజున భారత రాజధాని న్యూఢిల్లీలో రాష్ట్రపతి భవనప్రాంగణానికి ముందున్న రాజపథలో నిర్దిష్ట సమయంలో జాతీయ పతాకాన్ని భారత రాష్ట్రపతి ఎగురవేస్తారు. పిమ్మట అదేచోట ఆహూతులయిన పురప్రముఖులు, భారత మంత్రి వర్గ సభ్యులు, వివిధ దేశాల దౌత్యాధికారులు, పార్లమెంట్ సభ్యుల ముందు బారులు తీరిన భారత రక్షణ (వాయుసేన, నౌకాసేన, పదాతి దళాలు) సిబ్బంది చేసే సైనికకవాతు ప్రదర్శనలను, విన్యాసాలను రాష్ట్రపతి ప్రత్యేక వేదిక మీద నిలబడి తిలకిస్తూ సైనిక వందనం స్వీకరిస్తారు. తరువాత వివిధ రంగాలలో దేశ ప్రగతిని సూచిస్తూ వివిధ ఆయుధ శకటశ్రేణి కన్నుల పండుగగా రాష్ట్రపతి ఎదుట కదలి పోతూఉంటుం ది. ఆయా రాష్ట్ర రాజధానులలో గవర్నర్లు గౌరవ వందనం స్వీకరిస్తారు. ప్రభుత్వ భవనాలు ప్రత్యేకంగా విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా అలంకరిస్తారు. దేశ వ్యాప్తంగా ప్రజలు, పాఠశాలలలో బాలబాలికలు తమతమ భవనాల మీద జాతీయ పతాకను ఎగురవేసి వేడుకలు జరుపుకుంటూ ఉంటారు.

*స్వాతంత్ర్యదినోత్సవం ఆగస్టు 15:* బ్రిటిషు పాలన నుంచి విముక్తి చెంది భారతదేశం స్వాతంత్ర్యం పొందిన పర్వదినం 1947 ఆగస్టు 15. ప్రతి ఏటా ఢిల్లీలోని చారిత్రాత్మక మయిన ఎర్రకోట (రెడ్‌ఫోర్టు) బురుజు మీద భారతదేశ ప్రధాని జాతీయ పతాకను ఆవిష్కరించి, అక్కడనే ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన వేదిక మీద నిలబడి ఆహూతులయిన పురప్రముఖులను, మంత్రి వర్గ సహచరులను, పార్లమెంటు సభ్యులను, జాతిని ఉద్దేశించి జాతీయ సమస్యలను గురించి ప్రసంగిస్తారు. ఆయా రాష్ట్రాలలో ముఖ్యమంత్రులు జాతీయ పతాక ఆవిష్కరణ గావించి, రాష్ట్ర ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తారు. దేశ వ్యాప్తంగా ప్రజలు వేడుకలు జరుపుకుంటారు. ప్రభుత్వ భవనాలను విద్యుద్దీపాలతో అలంకరిస్తారు.

గాంధీ జయంతి అక్టోబరు 2: జాతిపిత మహాత్మా గాంధీ జన్మదినం అక్టోబర్ 2: దీనిని జాతీయ దినోత్సవంగా జరుపుకుంటున్నారు. జాతిని ప్రబోధించడానికి గాంధీజీ అనుసరించిన నిర్మాణాత్మక కార్యక్రమాలలో ఒకటైన రాట్నం మీద నూలు తీసే ఖాదీయజ్ఞంలో జాతీయ నాయకులు పాల్గొంటారు. పాఠశాలలో గాంధీ తత్వాన్ని వివరిస్తూ ప్రముఖులు ప్రసంగిస్తారు.

## జాతీయ పక్షి / జంతువు

నాట్యానికి పేరుమోసిన 'నెమలి'ని భారత జాతీయ పక్షిగా ఎన్నుకున్నారు. దీనిని సంస్కృతంలో 'మయూరం' అంటారు. మగనెమలి భారతీయ జాతీయ పక్షి. దీని మెడ, ఛాతీ, అందాల విసనకర్రవంటి రంగురంగుల పింఛం, పొడుగ్గా తోక చూడముచ్చటగా ఉంటాయి. ఆడపక్షి మీద మనస్సు పడినప్పుడు మగనెమలి పురివిప్పి చక్కగా నాట్యం చేస్తుంది. భారతీయ సంప్రదాయ సాహిత్యంలోనూ, జానపద సాహిత్యంలోను



జాతీయ పక్షి - నెమలి    జాతీయ జంతువు - పెద్దపులి

కూడా మబ్బులుపట్టి, ఉరుములు వినిపిస్తే నెమలి నాట్యం చేస్తుందనే కవిసమయం ఉంది. కుమారస్వామికి నెమలి వాహనం. భారతదేశం అంతటా కనిపించినా, ముఖ్యంగా ఉత్తరభారత దేశంలోని పొడిగా ఉండే మైదానాలలో ఎక్కువగా కనిపిస్తుంది. దక్షిణాదిన ముఖ్యంగా ఆంధ్ర ప్రదేశ్‌లో నల్లమలై అడవులలో నెమలి ఎక్కువగా కని పిస్తుంది. సింధునది మైదానంలోనూ, జమ్మూ–కాశ్మీర్, అస్సాం ప్రాంతంలోనూ, తూర్పున మిజోరాంలోనూ దక్షిణాన ఉన్న అడవులలోనూ నెమలి కనిపిస్తుంది. భారతీయ వన్యప్రాణి రక్షణ చట్టం (1972) క్రింద 'నెమలి'కి అభయహస్తం ప్రసాదించబడింది.

జాతీయ జంతువు

భారత జాతీయ జంతువు పెద్దపులి. మంచిరంగు, రూపురేఖలు కలిగి శీవికి మారుపేరుగా ఉంటుంది. పెద్దపులులలో ప్రపంచం మొత్తం మీద ఎనిమిది జాతులు ఉన్నాయి. అందులో బెంగాలు బెబ్బులి భారతదేశం అంతటా విరివిగా కనిపిస్తుంది. 1972లో భారతదేశం లోని పెద్దపులుల సంఖ్య 1827కి దిగజారిపోగా, దాని పరిరక్షణకు తీసుకున్న చర్య ఫలితంగా 1973నుంచి ప్రాజెక్టు టైగర్ అమలు ఫలితంగా 1986నాటికి వీటి సంఖ్య 4230కి పెరిగినట్టు తెలుస్తోంది.



## జాతీయపతాకం

మహాత్మాగాంధీకి సుపరిచితులైన బందరు నివాసి పింగళి వెంకయ్య (చూ.) 20కి పైగా జాతీయపతాక సమూనాలను వివిధ భావాలు స్ఫురించేట్టుగా తయారు చేశారు. 1921లో బెజవాడ లో (నేటి విజయవాడ) జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సమావేశంలో కాంగ్రెస్‌కు ఒక పతాకను ఏర్పరచుకోడాన్ని గురించిన ప్రస్తావన వచ్చింది. మహాత్ముడు పింగళి వెంకయ్యతో మూడు గంటల పాటు చర్చించి భారతదేశ గౌరవానికి సరిపోయే పతాకను ఆయన చేత తయారు చేయించారు. పింగళి వెంకయ్య సూచించిన పతాకలో ఎరుపు, ఆకుపచ్చ రంగులు రెండే అడ్డంగా చిత్రించబడి ఉన్నాయి. మహాత్ముడు ఆ రెండు రంగుల మధ్య తెలుపును కూడా చేర్చమని, దానిమీద రాట్నాన్ని చిత్రించమనీ **అన్నాడు. ఆ విధంగా తయారైన పతాకమే అఖిలభారత జాతీయకాంగ్రెస్ పతాకగా ప్రసిద్ధిపొందింది.**

స్వరాజ్యం సిద్ధించిన అనంతరం ప్రభుత్వాధికారం చేపట్టిన కాంగ్రెస్ కొద్ది మార్పులతో కాంగ్రెస్ పతాకనే జాతీయ పతాకంగా స్వీకరించింది. జాతీయ పతాకలో ఎరుపు బదులు కాషాయపు రంగుగా మార్చారు. అది ఉత్సాహానికీ, ధైర్యానికీ, త్యాగానికీ గుర్తు. మధ్యలో ఉన్న తెలుపు శుద్ధ సత్వగుణానికీ, సత్యానికీ, శాంతికీ గుర్తు. కాంగ్రెస్ పతాకలోని రాట్నానికి బదులు జాతీయ పతాకలో 24 ఆకులుగల అశోకచక్రాన్ని(సార్నాథ్) ముదురు నీలిరంగు(నేవీబ్లూ)లో మధ్యఉన్న తెలుపు భాగం మీద చిత్రించారు. పతాకలో క్రింది భాగంలో ఆకుపచ్చ రంగు ఉంటుంది. పతాక పొడవు, వెడల్పు 3:2 నిష్పత్తిలో ఉంటాయి.

1947 జూలై 22నాడు పతాకాన్ని రాజ్యాంగ పరిషత్తు ఆమోదించింది. జాతీయ పతాకానికి సంబంధించి ఈ క్రింది నియమావళిని ప్రభుత్వం రూపొందించింది.

. 1. జాతీయపతాకను ఒకే వ్యక్తి గౌరవం కోసం ఎగురవేయరాదు. 2. మరే చిహ్నాన్నీ దీనికంటే ఎత్తుగా ప్రదర్శించరాదు. 3. దీనిని ఎగురవేసినపుడు కాషాయ రంగుపైన ఉండేటట్లు చూడాలి. 4. ఉత్సవాలలోనూ ఊరేగింపులలోనూ తీసుకొని వెళ్ళేటప్పుడు జెండాదండం కుడివైపున ఉండేటట్లు చూడాలి. 5. ప్రభుత్వకార్యాలయాన్నిటి మీద దీనిని నిత్యమూ పగలు ఎగురవేయాలి. సాయంకాలం దింపివేయాలి. సంతాపాన్ని సూచించవలసి వచ్చినపుడు జెండాను ధ్వజానికి మధ్య భాగానికి అవనతం చేయాలి.

## జాతీయ పురస్కారాలు

భారతదేశంలో ఆయా రంగాలలో ఉత్తమ కృషి చేసిన పౌరులకు ప్రతిఏడాది జనవరి 26 నాడు రాష్ట్రపతి

నాలుగు విధాలయిన పురస్కారాలను ప్రకటిస్తారు. అవి:

1. భారతరత్న; 2. పద్మవిభూషణ్; 3. పద్మ భూషణ్; 4. పద్మశ్రీ.

'భారత రత్న' అనే అత్యున్నతమైన పురస్కారాన్ని కళ, సాహిత్యం, శాస్త్రవిజ్ఞానం, ప్రజాసేవ వంటి రంగాలలో అద్వితీయమైన కృషి చేసిన వారికి మాత్రమే ప్రదానం చేస్తారు.

'పద్మవిభూషణ్' ఏ రంగంలోనైన అపూర్వమయిన కృషిచేసిన వారికి ఇస్తారు. ప్రభుత్వోద్యోగులుకూడ ఈ పురస్కారానికి అర్హులు.

'పద్మభూషణ్' ఏ రంగంలోనైనా విశిష్టమైన కృషి చేసినవారికి ఇస్తారు. దీనికి కూడా ప్రభుత్వోద్యోగులు అర్హులు.

'పద్మశ్రీ' ఏ రంగంలోనైనా గణనీయమైన కృషిచేసిన వారికి ఇస్తారు. ప్రభుత్వోద్యోగులు దీనికి కూడా అర్హులే.

ఇవి గాక దేశ రక్షణలో అపూర్వమయిన విశిష్టసేవలు అందించిన సైనిక శ్రేష్ఠులకు ఈ క్రింది పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు.

1. అశోకచక్ర, 2. కీర్తిచక్ర, 3. శౌర్యచక్ర.

దేశ రక్షణ సేవల్లో గౌరవ పురస్కారపతకాలు అందిస్తున్నారు.

1. పరమ విశిష్ట సేవాపతకం, 2. అతివిశిష్ట సేవాపతకం, 3. బార్తో అతి విశిష్ట సేవా పతకం, 4. విశిష్ట సేవాపతకం, 5. సేనాపథకం, 6. నౌకాసేనా పతకం, 7. వాయుసేనా పతకం, 8. బార్తో సేనా పతకం, 9. బార్తో వాయుసేనా పతకం.

సంగీత, సాహిత్యాల వంటి సృజానాత్మక రంగాల్లో విశేష కృషి చేసిన భారతీయ పౌరులకు లలితకళా అకాడమీ, సంగీత్– నాటక అకాడమీ, సాహిత్య అకాడమీ గౌరవపురస్కారలను అందిస్తూంది. సాహిత్యరంగంలో ఆయా భాషలలో అస్సామీ, బెంగాలీ, డోగ్రీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడం, కాశ్మీరీ, కొంకణి, మైథిలీ, మలయాళం, మణిపురీ, మరాఠీ, నేపాలీ, ఒరియా, పంజాబీ, రాజస్థానీ, సంస్కృతం, సింధీ, తమిళం, తెలుగు, ఉర్దూ సారస్వతాలకు ఏటేటా ప్రత్యేక పురస్కారాలు అంద జేస్తున్నారు.

'భారతరత్న' పురస్కారాన్ని అందుకున్నవారు

| | | |
|---|---|---|
| 1954 | సర్వేపల్లి రాధాకృష్ణన్ | 1888–1975 |
| 1954 | చక్రవర్తి రాజగోపాలచారి | 1878–1972 |
| 1954 | చంద్రశేఖర వెంకటరామన్ | 1888–1970 |
| 1955 | భగవాన్ దాస్ | 1869–1958 |
| 1955 | మోక్షగుండం విశ్వేశ్వరయ్య | 1861–1962 |
| 1955 | జవహర్ లాల్ నెహ్రూ | 1889–1964 |
| 1957 | గోవింద వల్లభ్ పంత్ | 1857–1961 |
| 1958 | డోండో కేశవ్ కార్వే | 1858–1962 |
| 1961 | బిధాన్ చంద్రరాయ్ | 1882–1962 |
| 1961 | పురుషోత్తమదాస్ టాండన్ | 1882–1962 |
| 1962 | రాజేంద్రప్రసాద్ | 1884–1963 |
| 1963 | జాకీర్ హుస్సేన్ | 1897–1969 |
| 1963 | పాండురంగవామన్ కాణే | 1880–1972 |
| 1966 | * లాల్ బహదూర్ శాస్త్రి | 1904–1966 |
| 1971 | ఇందిరాగాంధీ | 1917–1984 |
| 1975 | వరాహగిరి వెంకటగిరి | 1894–1980 |
| 1976 | * కుమారస్వామి కామరాజ్ | 1903–1975 |
| 1980 | మేరి తెరీసా బొజాక్సియా (మదర్ తెరిసా) | (జ. 1910) |
| 1983 | ఆచార్య వినోబాభావే | 1895–1982 |
| 1987 | ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ | 1890–1988 |
| 1988 | * ఎమ్.జి. రామచంద్రన్ | |
| 1990 | * బి.ఆర్. అంబేద్కర్ | 1893–1951 |
| 1991 | *** వల్లభాయి పటేల్** | **1875–1950** |
| | *** రాజీవ్‌గాంధి** | **1944–1991** |

* గుర్తుకలవారికి వారి మరణానంతరం ప్రదానం చేయబడినది.

## జాతీయ భాషలు

భారత రాజ్యాంగం 8వ షెడ్యూల్‌లో సంస్కృతంతో సహా పదిహేను భాషలకు రాజ్యాంగ ప్రతిపత్తి కలిగించారు. అవి. 1.అస్సామీ; 2.ఉర్దూ; 3.ఒరియా; 4.కన్నడం; 5.కాశ్మీరీ; 6.గుజరాతీ; 7.తమిళం; 8.తెలుగు; 9.పంజాబీ; 10.బెంగాలీ; 11.మరాఠీ; 12.మలయాళం; 13.సంస్కృతం; 14.సింధీ; 15. హిందీ. ముఖ్యంగా పట్టణప్రాంతాలలో గత 200 ఏళ్ళుగా ఇంగ్లీషు ప్రచారంలో ఉంది. రాజ్యాంగం 343 వ

అధికరణం ప్రకారం దీనికి అనుబంధ భాష (అసోసియేట్ లాంగ్వేజి) ప్రతిపత్తిని కల్పించారు. ఈ 16 భాషలలోనూ కాశ్మీరీ, సంస్కృతం, సింధీ, ఇంగ్లీషు భాషలు తప్ప తక్కిన 12 భాషలూ ఆయా రాష్ట్రాలలో అధికార భాషలుగా వ్యవహరించబడుతున్నాయి. అయితే జనాభా లెక్కలను (1961–71)బట్టి భారతదేశంలో వివిధ ప్రాంతాలలో వాడుకలో ఉన్న మాండలిక భాషల మొత్తం సంఖ్య 1652.

భారతీయ భాషలను ప్రధానంగా 6 వర్గాలుగా విభజించారు. 1.ఇండో—ఆర్యన్; 2.ద్రావిడ; 3.సైనో—టిబెటన్; 4.ఆస్ట్రిక్; 5.నీగ్రోయిడ్; 6.ఇతరాలు. వీటిలో ఇండో—ఆర్యన్ భాషలు ఆర్యుల రాకతో భారతదేశంలో ప్రవేశించాయి. భారతప్రజలలో 74 శాతం ఈ ఇండో—ఆర్యన్ భాషలు మాట్లాడతారు. వీటిలో ప్రముఖమయినవి: అస్సామీ, ఒరియా, కాశ్మీరీ, గుజరాతీ, పంజాబీ, బీహారీ, బెంగాలీ, మరాఠీ, రాజస్తానీ, సంస్కృతం, సింధీ, భోజపురీ, హిందీ (ఖడీబోలీ)ఉన్నాయి. ఇండో—ఆర్యన్ భాషలకు మూలాధారమైన భాష-భారతీయ సంస్కృత భాష. 25 శాతం మాట్లాడే ద్రావిడ భాషలు అటు తరువాత పేర్కొనదగినవి. వాటిలో కన్నడం, కొంకిణి, కొడగు, తమిళం, తెలుగు, తోడా, మలయాళం, తుళు చేరిఉన్నాయి. వీటిలో ఆంధ్రప్రదేశ్‌లో మాట్లాడే తెలుగు ద్రావిడ భాషలన్నింటిలో ఎక్కువమంది మాట్లాడే భాష.

తెలుగు మాట్లాడేవారు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే గాక పొరుగున ఉన్న తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్ర, ఒరిస్సా రాష్ట్రాలలో కూడ సరిహద్దు జిల్లాలలో ఎక్కువగా మాట్లాడుతున్నారు. హొసూరు, శ్రీవిల్లిపుత్తూరు, బళ్లారి, బస్తరు ప్రాంతాలలో తెలుగు మాతృభాషగా కలవారు ఉన్నారు. తెలుగు మాట్లాడేవారు మారిషస్ దీవులలోనూ, మలేసియా దేశంలోనూ, బర్మాదేశంలోనూ ఫిజీ దీవుల్లోనూ ఉన్నారు.

అధికారికమైన లెక్కల ప్రకారం ఇండియాలోని వివిధ భాషలు మాట్లాడుతున్న ప్రజల సంఖ్యల వివరాలు ఈ దిగువ పట్టికలో చూడవచ్చును. 10 లక్షల ప్రజలకు పైగా మాట్లాడే భాషలే ఈ పట్టికలో ఇవ్వబడ్డాయి.

| భారతీయ భాషలు: | మాట్లాడే వారి సంఖ్య |
|---|---|
| అస్సామీ * | 89,58,977 |
| ఉర్దూ * | 2,86,00,428 |
| ఒరియా * | 1,97,26,745 |
| కన్నడం * | 2,15,75,019 |
| కాశ్మీరీ * | 24,21,760 |
| కుమౌనీ | 12,34,939 |
| కురుఖ్ | 12,40,395 |
| కొంకిణి | 15,22,684 |
| గాఢ్వాలీ | 12,27,151 |
| గుజరాతీ * | 2,56,56,274 |
| గోర్ఖాలీ నేపాల్ | 12,86,524 |
| గోండీ | 15,48,070 |
| చత్తీస్ గఢ్ | 66,93,445 |
| డోగ్రీ | 12,98,855 |
| తమిళం * | 3,75,92,794 |
| తుళు | 11,56,950 |
| తెలుగు * | 4,47,07,797 |
| పంజాబీ * | 1,39,00,202 |
| పహాడీ | 12,69,651 |
| బగ్డీ | 10,55,607 |
| బెంగాలీ * | 4,45,21,533 |
| భిల్లు—బిలోడీ | 12,50,312 |
| భోజపూరీ | 1,43,40,564 |
| మరాఠీ * | 4,17,23,893 |
| మళయాళం * | 2,19,17,480 |
| మాగధీ—మాగహీ | 66,93,445 |
| మ్హార్వారీ | 47,14,094 |
| మైథిలీ | 61,21,922 |
| లంబాడీ—లమానీ | 12,03,338 |
| సంతాలీ | 36,93,558 |
| సింధీ * | 12,04,678 |
| హిందీ * | 15,37,29,533 |

* ఈ గుర్తు గల భాషలకు భారత రాజ్యాంగం 8వ షెడ్యూలులో స్థానం కల్పించబడింది.

*అస్సామీ:* ఇండో—ఆర్యన్ భాష. అస్సామ్ రాష్ట్రంలో అధికార భాష. 57 శాతం రాష్ట్రప్రజలకు అస్సామీ మాతృ భాష. క్రీ.శ. 13 వ శతాబ్దం నుంచీ అస్సామీ భాషలో సారస్వతం వెలువడుతూంది.

*ఉర్దూ:* జమ్మూ—కాశ్మీర్ రాష్ట్రంలో అధికార భాష. ఢిల్లీని (13 వ శతాబ్ది) ఏలిన ఢిల్లీ సుల్తానుల రాజ భాష. 1817–1898 మధ్య జీవించిన సయ్యద్ అహ్మద్ ఖాన్ ఉర్దూ భాషను పునరుద్ధరించగా ఆధునిక ఉర్దూ ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్‌లో పూర్వపు నైజాం పాలనలో ఉర్దూ రాజ భాషగా ఉండేది. 'దక్కనీ ఉర్దూ' అనేవారు.

*ఒరియా:* ఇండో—ఆర్యన్ భాషా కుటుంబానికి చెందింది. ఒరిస్సా రాష్ట్రంలో అధికార భాష. క్రీ.శ. 10 వ శతాబ్ది నుంచీ శాసనాలు ఉన్నప్పటికీ 14 వ శతాబ్ది నుంచి మాత్రమే సారస్వతం కనిపిస్తోంది. ప్రజలలో 82 శాతం ఈ భాష మాట్లాడతారు.

*కన్నడం:* కర్నాటక రాష్ట్రానికి అధికార భాష. ద్రావిడ భాషా కుటుంబానికి చెందింది. 65 శాతం ప్రజలు ఈ భాషను మాట్లాడుతున్నారు. క్రీ.శ. 9 వ శతాబ్దం నుంచీ కన్నడానికి సారస్వత సంప్రదాయం ఉంది.

*కాశ్మీరీ:* ఈ భాషను జమ్మూ—కాశ్మీర్ రాష్ట్ర ప్రజలలో 55 శాతం మాట్లాడతారు. అయితే ఇది అధికార భాషాస్థాయిని అందుకోలేదు. క్రీ.శ. 1200 నుంచి కాశ్మీరీకి సారస్వత సంప్రదాయం ఉన్నా, ఇది ఇటీవలనే ఎక్కువగా అభివృద్ధి చెందింది. కాశ్మీరీ భాషను పారసీక—అరబ్బీ లిపులలో వ్రాస్తారు.

*గుజరాతీ:* ఇండో—ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినది. గుజరాతీ రాష్ట్రంలో అధికార భాష. క్రీ.శ. 1200 ప్రాంతంలో ప్రత్యేక భాషగా రూపు దాల్చిన గుజరాతీ ప్రస్తుతం మంచి సారస్వత సంప్రదాయంగల భాషగా గౌరవింపబడుతూంది.

*తమిళ భాష:* ద్రావిడ భాషలలో అతి ప్రాచీనమైంది. తమిళ నాడు రాష్ట్రంలో అధికార భాష. క్రీ.పూ. కొన్ని శతాబ్దాల నాడే తమిళానికి ఉత్కృష్టమైన సారస్వత సంప్రదాయం ఉన్నట్లు తెలుస్తూంది. శ్రీలంకలోను, మలేషియాలోనూ కూడా తమిళం మాట్లాడేవారున్నారు.

*తెలుగు:* ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని అధికార భాష. భారతదేశంలో హిందీ తరువాత అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే భాష తెలుగే! క్రీ.శ. 7 వ శతాబ్దంలోనే తెలుగులో వ్రాయబడిన శాసనాలు లభించాయి. అయితే 11 వ శతాబ్దం నుంచే, అంటే నన్నయ్య కాలం నుంచే సారస్వత సంప్రదాయం కనిపిస్తూంది.

*పంజాబీ:* పంజాబు రాష్ట్రంలో అధికార భాష. ఇండో—ఆర్యన్ భాషా కుటుంబానికి చెందిన ప్రాచీన భాష అయినప్పటికీ క్రీ.శ. 15 వ శతాబ్దం నుంచే సారస్వత సంప్రదాయం వర్ధిల్లుతూంది. 19 వ శతాబ్దం నుంచి ఆధునిక సారస్వత ప్రక్రియలన్నిటిలోనూ ఉత్తమ ప్రమాణం సాధించింది. పంజాబీని గురుముఖి లిపిలో వ్రాస్తారు. దీనికి ప్రాతిపదిక నాగరిలిపితో సంబంధంగల 'శర్దా' లిపి. సిక్కు మత గురువు 'గురు అంగద్' పేర గురుముఖి లిపి అని వ్యవహరించబడుతూంది.

*మరాఠీ:* మహారాష్ట్రంలో అధికార భాష. ఇండో—ఆర్యన్ భాషా కుటుంబానికి చెందిన మరాఠీకి క్రీ.శ. 13 వ శతాబ్దంలో సారస్వత సంప్రదాయం ఆరంభమైంది.

*బెంగాలీ:* పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో అధికార భాష. బంగ్లాదేశ్‌లో కూడా అధికార భాష బెంగాలీయే! ఇది ఇండో—ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినది. క్రీ.శ. 1000 నుంచి బెంగాలీ భాషకు సారస్వత సంప్రదాయం ఉంది.

*మలయాళం:* ద్రావిడ భాషా కుటుంబానికి చెందింది. కేరళ రాష్ట్రానికి ఇది అధికార భాష. క్రీ.శ. 10 వ శతాబ్దం నుంచీ మలయాళ భాషకు సాహిత్య సంప్రదాయం కనిపిస్తూంది.

*సంస్కృతం:* ప్రపంచ భాషలలోనే అత్యంత ప్రాచీనమైంది. లిఖిత భాషలలో మిక్కిలి ప్రాచీనమయిన భాష కూడా సంస్కృతమే! క్రీ.పూ. 2000 నాడు వెలసిన ఋగ్వేదంతో సంస్కృత చరిత్ర ప్రారంభం అవుతూంది. క్రీ.పూ. 2000 కాలం నాటి ఆది సంస్కృతాన్ని 'వేద సంస్కృతం' అంటారు. క్రీ.పూ. 500 నుంచి క్రీ.శ. 1000 వరకూగల మధ్య కాలంలో సంస్కృతం కావ్య భాషాస్థాయిని సంతరించుకుంది. సంస్కృతం జీవద్ భాష కాదు. వేద పండితులు మాత్రం సంస్కృతంలో

సంభాషిస్తారు. ప్రజలు ఏ ప్రాంతంలోనూ సంస్కృతం మాతృ భాషగా మాట్లాడరు.

*సింధీ:* ఇండో--ఆర్యన్ భాషా కుటుంబానికి చెందిన అతి ప్రాచీన రూపాలుగల ఈ సింధీ భాషను పంజాబులో కొందరు మాట్లాడతారు. సింధీ ఎక్కువగా మాట్లాడు తున్న పాకిస్తాన్‌లో ఈ భాషకు 'పారసీక—అరబ్బీ' లిపిని వాడుక చేస్తూ ఉండగా, భారతదేశంలో దేవనాగరి లిపి వాడుకలో ఉంది. సింధీలో మంచి సాహిత్య సంప్రదాయం ఉంది.

*హిందీ:* భారతదేశానికి అధికార భాషగా పరిగణించ బడుతూన్న హిందీ ఇండియాలో ఎక్కువ మంది మాట్లాడే భాష. ఇది ఇండో—ఆర్యన్ భాషాకుటుంబానికి చెందింది. లిపి దేవనాగరి. పెక్కు మాండలిక భేదాలు గల హిందీలో ఖడీబోలీ అనే మాండలికాన్ని ప్రామాణిక రూపంగా స్వీకరించారు. 'ఖడీబోలీ'ని ఎక్కువగా ఢిల్లీ పరిసరాల లోనూ, ఉత్తరప్రదేశ్ పశ్చిమ ప్రాంతంలోనూ వాడుక చేస్తున్నారు. హిందీ సారస్వతంలో ఖడీబోలీతో పాటు వ్రజభాష (ఉత్తరప్రదేశ్)అవధి, మార్వారీ(రాజస్తాన్), మైథిలీ, భోజపురీ (బీహార్) మాండలికాలలోని సారస్వతాలు కూడా చేరుతాయి. జాతీయ భాషగానే కాకుండా హిందీ ఢిల్లీ కేంద్ర పాలిత ప్రాంతం, హర్యానా, ఉత్తరప్రదేశ్, హిమాచలప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థానీ, బీహార్ రాష్ట్రాలలో అధికార భాషగా కూడా వ్యవహరింప బడుతూంది.

## జాన్సన్, సామ్యూల్ చూ. సామ్యూల్ జాన్సన్

## జామినీ రాయి 1887–1972

చిత్రకళలో సుమారు నాలుగు దశాబ్దాల పాటు ప్రయోగాలు జరిపి భారత చిత్రకారుల్లోనే కాక ప్రపంచ చిత్రకారుల్లో విశిష్ట స్థానాన్ని సంపాదించిన ప్రముఖ చిత్రకారుడు. పశ్చిమ బెంగాల్ బాకుండా జిల్లాలో 1887లో జామినీరాయ్ జన్మించారు. మొదట్లో



కొంతకాలం బెంగాల్ కలకత్తాలోని స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్‌క్రాఫ్ట్స్‌లోపనిచేశారు.అయితే బెంగాల్ స్కూల్ పద్ధతిలోచిత్రాలు వేయడంతో సంతృప్తి చెందక సొంతప్రయోగాలు చేయడం ప్రారంభించారు. తన చిత్రాల్లో పొరబాటున కూడా పాశ్చాత్య చిహ్నాలను చిత్రీకరించే వాడుకాదు. ఆయన చిత్రాల్లో అనిర్వచనీయమైన శాంతి స్వభా వము, చల్లదనం కనిపిస్తుంది. రాయ్ చిత్రాలు జానపద రూపురేఖలు



జామినీరాయ్ చిత్రాలు

ఆధారంగా తయారైనవి. జామినీరాయ్ ఎన్నో మట్టి బొమ్మలు, చెక్కబొమ్మలు కూడా తయారు చేశారు. యునెస్కో చిత్రకళా ప్రదర్శనలో జామినీరాయ్ చిత్రాల్ని న్యూయార్క్ టైమ్స్, లండన్ టైమ్స్ విపరీతంగా శ్లాఘించాయి.

1955లో భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' ప్రదానంచేసి రాయ్‌ని సత్కరించింది. 1956లో లలితకళా అకాడమీ ఫెలోషిప్పు పొందారు. 1967లో గౌరవ డాక్టరేట్ అవార్డు పొందారు. 1972లో జామినీ రాయ్ స్వర్గస్థులైరి.

## జాషువ, గుర్రం 1895–1971

ఆధునిక తెలుగు కవులలో అగ్రశ్రేణికి చెందిన వారిలో ఒకరు. జాషువా బాల్యం దుర్భరంగాను, దయనీయంగాను గడిచింది. తండ్రి వీరయ్య క్రైస్తవ మతాన్ని స్వీకరించిన యాదవుడు. తల్లి లింగమ్మ హరిజన. చిన్నప్పుడు జాషువాను అంటరానివాడిగా భావించి తన ఈడు పిల్లలు వెలివేశేవారట. దానితో అతని మనస్సు గాయపడింది.

జాషువాకి గురువుగా ఉండడానికి పండితులెవ్వరూ ముందుకు రాలేదు. అందువల్ల స్వయం కృషితోనే పురాణాలు, ఇతిహాసాలు చదవడం మొదలు పెట్టాడు. సమాజానికి ఎదురీది అష్టకష్టాలు పడి 'ఉభయ భాషా ప్రవీణ' అయ్యారు. తన సోదరుడు ఇజ్రాయిల్‌తో కలిసి

కష్టతరమైన నేత్రావధానాన్ని అభ్యసించి ప్రదర్శించారు.

ఆయన కవిత్వాన్ని విని 'భేష్' అన్నవారు 'మీదేం కులం' అని ప్రశ్నించి జవాబు విని చివాలున లేచిపోయేవారట. అటువంటి సంఘటనలు ఆయన హృదయానికి బాకులా గుచ్చుకునేవి. సాంఘిక అసమాన తలపై తిరుగుబాటు చేశారు. జాషువా కవి అయినారు. ఫిరదౌసి, గబ్బిలం, ముంతాజ్ మహల్, స్వప్నకథ, బాపూజీ, నేతాజీ, ముసాఫరులు, క్రీస్తు చరిత్ర, కొత్తలోకం ఖండకావ్యాలు ఆయన ప్రముఖ రచనలు.



అప్పటి ఆస్థానకవి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి జాషువాకి స్వయంగా గండపెండేరం తొడిగి సత్కరించారు.

1970లో ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు 'కళాప్రపూర్ణ' భారత ప్రభుత్వం 'పద్మ భూషణ' బిరుదుల్ని ఇచ్చి సత్కరించాయి. గుంటూరు జిల్లా వినుకొండ గ్రామంలో 1895లో జన్మించిన జాషువ 1971 జూలై 24న కీర్తిశేషులయారు. హైదరాబాదులోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ఈయన శిల్పవిగ్రహాన్ని ప్రతిష్ఠించి రాష్ట్ర ప్రభుత్వం సత్కరించింది.

## జింబాబ్వే

ఆఫ్రికాలో దక్షిణాన ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యం. ఒకప్పుడు దీనిని 'దక్షిణ రోడీషియా' అనేవారు. **పటం. పుట:109. చూ. జాంబియా**

విస్తీర్ణం: 3,90,754 చ.కి.మీ., జనాభా 88, 78,000 (1988); రాజధాని: హరారే (వెనుకటి పేరు శాలిస్బరీ); అధికార భాష ఇంగ్లీషు ప్రజలు షోనీ, న్డెబెలా వంటి ఆదిమమాండలిక భాషలు మాట్లాడతారు. ప్రజలు అటు క్రైస్తవ మతాన్నీ, ఇటు ఆదిమజాతి విశ్వాసాలనూ కూడా పాటిస్తారు.

ఉమ్నియాటీనది, టాండీనది, లింపోపోనది, షాషీ నది, సాబీనది, షాంగానీనది, జాంబెజీనదిమీద నిర్మించిన కరీబాడాము ప్రధాన జలాధారాలు. జింబాబ్వేలో ఖనిజ నిక్షేపాలు పుష్కలంగా ఉన్నాయి. రాగి, నికెల్, క్రోమియం, నేలబొగ్గు, రత్నాలు, తగరం, బంగారం, ఆస్బెస్టాస్ పేర్కొనదగిన ఖనిజ సంపద. ప్రపంచంలోనే వాన్‌కీలీ గనులు పెద్దవి. మొక్కజొన్న, పొగాకు, ప్రత్తి, వేరుసెనగ ప్రధాన వ్యవసాయోత్పత్తులు. వీటిలో పొగాకు ప్రముఖమయింది. ఆహారపదార్థాల తయారీ, జవుళీ, ధాతువులు(మెటల్స్) ఇంజనీరింగ్ యంత్రాలు కలపసామగ్రి,రవాణావాహనాలు,దుస్తులు,పాదరక్షలు,కాగితం, రాసాయనికద్రవ్యాలు,ముద్రణ,పుస్తకప్రచురణ, పానీయాలు, ధాతుసామగ్రి,పెట్రోలుఉత్పత్తులు ముఖ్యమైన పరిశ్రమలు.

## జి.డి. నాయుడు 1893–1974

వ్యాపార, పారిశ్రామిక, సాంకేతిక విద్యారంగాలలో గణనీయమైన ప్రతిభ ప్రదర్శించిన ఆంధ్రమహాపురుషుడు. స్వదేశంలో తగినంత గుర్తింపు, ప్రోత్సాహం లభించకపోయినా క్రుంగి పోక, విదేశాలనుండి ఆహ్వానాలు వచ్చినందుకు పొంగిపోక తన నైపుణ్యాన్ని భారతదేశానికే పరిమిత చేసిన గొప్ప దేశభక్తుడు. ఈయన పూర్తిపేరు గోపాల్ దొరస్వామి నాయుడు.

జి.డి. నాయుడు పరిశ్రమల ప్రాంగణం అద్భుతాలకు పుట్టినిల్లు. దానిలో పనిచేసేవారు అత్యంత నిపుణులు. సోమరితనం అనేది తెలియని వారు. నాడు ఆధునిక యంత్ర నిర్మాణాలను స్థాపించడంకోసం దేశవిదేశాలలో **పర్యటించి** అక్కడి విలక్షణ సాంకేతిక విజ్ఞానాన్ని స్వాయత్తం చేసుకొని కొయంబత్తూరులో వాటిని ప్రవేశ పెడుతూ ఉండేవారు.

చిన్నప్పుడు తన గ్రామానికి ఒక ఆంగ్లేయుడు మోటారు సైకిల్ పై రాగా, అటువంటి బండిని తయారు చేయాలనే ఆసక్తితో అతని వద్ద ఆ బండిని కొని నూతనంగా అలాటి బండిని స్వయంగా ఆయనే సృష్టించాడట. ప్రత్తిని ఏకడానికి ఫ్యాక్టరీని నిర్మించాడు. తర్వాత మోటారు కార్ల వ్యాపారాన్ని బహు నైపుణ్యంతో ప్రారంభించి అనేక మందికి జీవనోపాధి కల్పించారు. భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయడమే నాయుడి ధ్యేయం. ఎంతో మంది బీద విద్యార్థులకు గుప్తంగా ఆయన సహాయం చేశాడు. వారి సాంకేతిక విద్యావిజ్ఞాన సాధనకు తోడ్పడ్డాడు. ఎలెక్ట్రికల్ రేజర్ కనిపెట్టారు. అందులో ఇమిడేలా బ్లేడ్లను తయారు

చేశారు. సాంకేతిక కళాశాలను స్థాపించారు. వ్యవసాయ రంగంలో కూడా అనేక అద్భుతాలను ఆయన సృష్టించాడు.

1893 మార్చి 23న జన్మించిన జి.డి. నాయుడు 1974 జనవరి 4న పరమపదించారు.

## జిడ్డు కృష్ణమూర్తి 1895–1986

అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన ఆంధ్ర దార్శనికుడు, విద్యావేత్త, రచయిత, కవి. చిత్తూరుజిల్లా మదనపల్లిలో జిడ్డు కృష్ణమూర్తి 1895, మే 11న జన్మించాడు. తండ్రి నారాయణయ్య, తల్లి సంజీవమ్మ. వారికి ఆయన ఎనిమిదవ సంతానం. నారాయణయ్య మద్రాసులోని దివ్యజ్ఞాన సమాజంలో ఉద్యోగం చేస్తూ ఉండేవాడు. దివ్యజ్ఞాన సమాజంలో అధ్యక్షురాలు ఆనిబిసెంటు, లెడ్‌బీటర్ వంటి ప్రముఖులు ఒకనాడు దివ్యజ్ఞానసమాజ ప్రాంగణంలో ఆడుకుంటున్న కృష్ణమూర్తిని చూసి, అతడు కానున్న జగద్గురువుగా నిర్ధారించుకొని తండ్రి నారాయణయ్యను ఒప్పించి కృష్ణమూర్తి, అతని తమ్ముడు నిత్యానంద్‌ల పోషణ భారం స్వీకరించారు. వారిని ఉన్నతవిద్యాభ్యాసం కోసం ఇంగ్లండుకు పంపారు. అయితే అక్కడ ఏ విద్యాసంస్థలోనూ కృష్ణమూర్తి ఎక్కువ కాలం ఉండలేక పోయాడు. స్వయంగానే పాండిత్యం సంపాదించి తన 15వ ఏట 'ఎట్ ది ఫీట్ ఆఫ్ ది మాస్టర్' అనే గ్రంథాన్ని ఇంగ్లీషు భాషలో రచించాడు. ఆ గ్రంథం అటు తర్వాత 27 ప్రపంచ భాషలలో అనువదించబడింది. తన 16వ ఏట ప్రప్రథమ దార్శని కోపన్యాసం ఆయన ఇచ్చాడు. అతని ప్రతిభా వైభవం చూసి ఆనిబిసెంటు 'ఇతడే జగద్గురువు' అని నిర్ధారించుకుంది. కృష్ణమూర్తి సందేశాలకు వ్యాప్తి కలిగించ డానికి 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్' అనే వ్యవస్థను దివ్యజ్ఞాన సమాజంలో భాగంగా ఆనిబిసెంట్ నెలకొల్పింది. 1922లో యునైటెడ్ స్టేట్స్‌లోని కాలిఫోర్నియాలో ఉండగా ఒక ఆధ్యాత్మికానుభవానికి లోనై



కృష్ణమూర్తి సత్య సందర్శనం చేశాడు. అప్పటినుంచి ఆయన బోధనలు క్రొత్త త్రోవ పట్టాయి. 1926లో 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్'ను ఆయన రద్దు చేశారు. జాతి, దేశ, మత, రాజకీయ భావాలకు అతీతమైన విద్య బాలబాలికలకు అందించడమే నూతన ప్రపంచ నిర్మాణానికి మార్గమని ఆయన నమ్మి భారతదేశం (ఋషి వ్యాలీ, బెంగుళూరు, వారణాసి) ఇంగ్లాండ్, అమెరికాలలో ఆరు ఆదర్శ పాఠశాలలు నెలకొల్పి వాటి నిర్వహణకై తగు చర్యలు తీసుకున్నారు. ఆయన తన జీవిత కాలంలో 712 గ్రంథాలు రచించారు. కాలిఫోర్నియాలోని ఓజై అనే ప్రాంతంలో ఒక కుటీరంలో తన 90 ఏట 1986 ఫిబ్రవరి 17న కృష్ణమూర్తి సిద్ధిపొందారు.

## జిన్నా

చూ. మహమ్మద్ ఆలీ జిన్నా

## జీబౌటీ

పూర్తిపేరు 'జుమ్హురియాహ్ జీబౌటీ'. దీనిని 'రిపబ్లిక్ జీబౌటీ' అనీ అంటూ ఉంటారు. ఇది ఎతియోపియా, సోమాలియాకు, రెడ్‌సీ, ఏడెన్ సింధు శాఖలకూ మధ్య కీలకమయిన స్థానంలో ఉంది.

విస్తీర్ణం: 23,200 చ.కి.మీ; జనాభా: 4,84,000 (1988); రాజధాని: జీబౌటీ; అధికార భాషలు: అరబ్బీ, ఫ్రెంచ్. ప్రజలు అధికంగా ఇస్సా, ఆఫార్ తెగలకు చెందినవారు. యెమెన్ అరబ్బులు 6 శాతం ఉన్నారు, ప్రజలలో అధికంగా (94 శాతం) సున్నీ ముస్లిం సంప్రదాయాన్ని అనుసరిస్తున్నారు. కేతలిక్‌లు 6 శాతం మాత్రమే.

అగ్ని పర్వతమయమయిన ఎడారి ప్రదేశం కావడం వల్ల నేల వ్యవసాయ యోగ్యం కాదు. నీటి వసతి ఉన్న చోట కూరగాయలు. పుచ్చకాయలు పండిస్తారు. పశుపోషణ ప్రజల బ్రతుకు తెరువుకు ప్రధాన ఆధారంగా ఉంది. వినోద పర్యాటకులవల్ల విదేశీద్రవ్యం లభిస్తుంది.

## జీలం నది

కాశ్మీర్‌లోయలోనూ, పశ్చిమ పంజాబు(పాకిస్తాన్)లోనూ ప్రవహిస్తున్న ఒక హిమనది. సింధు నదికి ఉపనదియైన చీనాబ్ నదిలో ఇది కలుస్తుంది. ఈ జీలం నది నిడివి 720 కి.మీ. 1967లో జీలం నది మీద మంగళాడాము (పాకిస్తాన్)నిర్మించారు.

## జెకొస్లోవాకియా

మధ్య యూరప్‌లోని సోషలిస్టు రిపబ్లిక్ రాజ్యం. ఒకప్పుడు బొహేమియాగా వ్యవహరింపబడిన ఈ ప్రాంతం 15వ శతాబ్దివరకు పవిత్ర రోమన్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. ఆస్ట్రియా రాజరికం హేప్స్‌బర్గ్ పాలన క్రిందకు వచ్చిన తర్వాత 1916లో మేజరిక్ నాయకత్వం క్రింద జెక్‌లకూ, స్లోవ్‌లకూ సమిష్టిగా జెకొస్లోవాకియా అనే ఒక స్వతంత్ర రాజ్యం ఏర్పడింది. ఇందులో బొహేమియా, మొర్దేవియా, స్లోవాకియా అని మూడు అంతర్భాగాలయాయి. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో హిట్లర్ ధాటికి తట్టు కోలేక 1939లో జెకొస్లోవాకియా లొంగిపోయింది. యుద్ధానంతరం రష్యా అండతో ఇక్కడ కమ్యూనిస్టు ప్రభుత్వం స్థాపించబడింది. దూబెక్ నాయకత్వంలో దేశం పారిశ్రామిక ప్రగతిని సాధించింది. జెకొస్లోవాకియాలో బొహేమియా కొండలు, సూడెటేస్ పర్వత శ్రేణి, కార్పేతియన్ పర్వతశ్రేణి ఉన్నాయి. జెకొస్లోవాకియా ఉత్తరాన ఉన్న బొహేమియాలోయ సారవంతమైన ప్రాంతం. దీనికి ఎల్బ్ నది పంటనీటిని అందిస్తూంది. దక్షిణాన డాన్యూబ్ నదీలోయలో హాప్ బంగాళదుంప, (సారాయికి పనికి వచ్చేది) బీటుదుంప (పంచదారకు పనికి వచ్చేది) ముఖ్యమైన పంటలు పండుతాయి. పశువుల పెంపకం, పందుల పెంపకం ప్రజల జీవనాధారాలు. నేలబొగ్గు పుష్కలంగా దొరుకుతుంది. యురే నియం ఖనిజాలు కూడా దొరుకుతాయి. భారీ పరిశ్రమ లనేకం నెలకొని విదేశీ ద్రవ్యాన్ని ఆకర్షిస్తున్నాయి. ముద్రణ యంత్రాలూ, యంత్రపు పనిముట్లు, సైనిక యంత్ర సామగ్రి, రవాణా వాహనాలు, గాజు సామగ్రి, రాసాయనిక ద్రవ్య పరిశ్రమలు ఆర్థికాభ్యుదయానికి దోహదం చేస్తున్నాయి. విస్తీర్ణం: 1,27,869 చ.కి.మీ., జనాభా: 1,29, 50,000, రాజధాని: ప్రాహ్ (ప్రేగ్) అధికార భాషలు: జెక్ , స్లోవక్. ప్రజలలో జెక్‌లు 63 శాతం, స్లోవక్‌లు 32 శాతం. ప్రజలలో రోమన్ కేతలిక్‌లు 66 శాతం. నాస్తికులు 20 శాతం ఉన్నారు. యంత్రసామగ్రి ఎగుమతి చేయడంవల్ల విదేశీ ద్రవ్యాన్ని ఆర్జించగలుగుతూంది. ప్రజల జీవనం అత్యధిక ప్రమాణాన్ని అందుకుంది.

## జెఫర్సన్, తామస్ 1743–1826

యునైటెడ్ స్టేట్స్ మూడవ ప్రెసిడెంట్. వరుసగా రెండుసార్లు ఆయన అధ్యక్షుడుగా ఎన్నికయాడు (1801–1809). విప్లవానంతరం అమెరికా ప్రజలకు ఉత్తేజాన్ని కలిగించి ప్రభావితం చేసిన మేధావి. అమెరికా స్వాతంత్ర్య ప్రకటన (డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్) తయారు చేసినవాడు. 'భూమండలం మీద కష్టపడి కృషి చేసే ప్రతివాడూ దేవుని ముద్దుబిడ్డ' అన్న సూక్తిని నమ్మినవాడు. ప్రజాస్వామికానికి ప్రాతిపదికలు అయిన అనేక సూత్రాలను రూపొందించి, 'డెమోక్రసీకి మారు పేరు జెఫర్సన్' అని ప్రసిద్ధి పొందాడు. వర్జీనియా జన్మస్థలంగా ఉన్న జెఫర్సన్, న్యాయవిద్యను అభ్యసించి రాజకీయాలలో ప్రవేశించి, 'అమెరికన్ డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్' పత్రాన్ని సిద్ధపరచి (1776) వర్జీనియాకు గవర్నరుగా ఎన్నుకోబడి (1779), శాసన (కాంగ్రెసు) సభ్యుడై (1783) ఫ్రాన్స్‌లో అమెరికన్ దౌత్య ప్రతినిధిగా (1784) వ్యవహరించి, 1787 నాటికి జాతీయ నాయకుడై, జార్జి వాషింగ్‌టన్ మంత్రివర్గ సభ్యుడై (1789), ఆ తరువాత ఉపాధ్యక్షుడై (1796) చివరకు 1801లో అమెరికన్ అధ్యక్షు డయ్యాడు. వర్జీనియా యూనివర్శిటీని స్థాపించి (1819) విద్యావేత్తగా కీర్తి గడించాడు. 1808లో ఆఫ్రికా నుంచి బానిసల దిగుమతిని నిషేధిస్తూ శాసనం చేశాడు. వర్తక వ్యాపారాలలో అవినీతిని అరికట్టే నియమ నిబంధనావళిని (1807) రూపొందించాడు.

## జెయిరీ

ఆఫ్రికాలో భూమధ్యరేఖ మీద ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యం. ఒకప్పుడు బెల్జియమ్ వలస రాజ్యం.



దీనిని రిపబ్లిక్ఆఫ్సెంట్రల్ఆఫ్రికా అంటారు.ఇది1960లో స్వాతంత్ర్యం సాధించింది. దీనిని 1971 వరకూ 'డెమోక్రాటిక్ రిపబ్లిక్ ఆఫ్ కాంగో'(కిన్షాసా) అనేవారు.

విస్తీర్ణం: 23,44,885 చ.కి.మీ. జనాభా: 3,25, 59,000; రాజధాని: కిన్షాసా; అధికార భాషలు: ఫ్రెంచి, కిస్వాహిలీ. ప్రజలు లూబా, స్వాహిలీ వంటి 200కు పైగా ఆదిమ మాండలిక భాషలు మాట్లాడుతూ వుంటారు.

మాటాడీ ముఖ్యమయిన రేవు పట్టణం. పడవ రవాణాకు వీలయిన జెయిరీ నది, దాని ఉపనదులు ప్రధానమయిన నీటి వనరులు. ఈ నదికి పూర్వం కాంగో నది అని పేరుండేది. బోమూనది, షెషెనది, కశైనది, కాంగోనది, ఎడ్వర్డు సరస్సు, ట్యాంగన్యీకా సరస్సు, మేవరు సరస్సు ఇతర జలాధారాలు. కోకో, కాఫీ, క్రపెండలం, తేయాకు, వరి, రబ్బరు, పామ్‌నూనె గింజలు, ప్రత్తి జెయిరీలో ప్రధాన వ్యవసాయోత్పత్తులు. కటాంగా లోని రాగిగనులు, 'కశై' లోని వజ్రనిక్షేపాలు జెయిరీలోని ప్రముఖ ఖనిజసంపదలు. నేలబొగ్గు, బంగారం, కోబాల్ట్, జింకు, కాడ్మియమ్, మాంగనీస్, యురేనియం, తగరం జెయిరీలో లభించే ఇతర ఖనిజసంపదలు. నాణ్యమయిన మహోగనీ,ఎబనీ, టేకు కలప సమృద్ధిగా ఈ దేశంలో లభిస్తూంది.

## జైనమతం

క్రీ.పూ. 6వ శతాబ్ది ప్రాంతంలో వర్ధమాన మహావీరుడు స్థాపించిన మతం. వేదాల ప్రామాణికతను లెక్కచేయదు. ఋషభుడు మొదట తీర్థంకరుడు. మహావీరుడు 24వ తీర్థంకరుడు. ఈ 24 మంది తీర్థంకరులూ రాగద్వేషాలనూ, అరిషడ్వర్గాల్నీ జయించి 'జిను'లు అయారనీ, వారి ప్రబోధాలే జైనమత సారమనీ అంటారు. వర్ణవ్యవస్థను త్యజించి కర్మ, పునర్జన్మను అనుసరిస్తుంది. అహింసా ధర్మాన్ని ప్రాతిపదికగా తీసికొని జైనమత విశ్వాసాన్ని రూపొందించారు. ప్రాణం ఉన్న ప్రతి జీవరాశి (వృక్షాలతో సహా)మానవాళితో సమానమని జైన సిద్ధాంతం. చిన్న కీటకాల్ని కూడ చంపడానికి జైనమతం విరుద్ధం. ప్రాణంగల సర్వజీవుల పట్ల అహింసా ధర్మం పాటించి, సంయమనంతో మెలగుతూ త్రికరణ (మనో వాక్కాయ కర్మలు) శుద్ధిగా ప్రవర్తించడం వీరి మతంలోని ప్రధాన కర్తవ్యం. శారీరక వాంఛలకూ, ఐహిక సుఖాలకూ వశం కాకుండా ఇంద్రియ నిగ్రహం పాటించి, నిష్ఠతో జీవయాత్ర కొనసాగించడం ఉత్తమమని జైనుల విశ్వాసం. మోక్షం, పునర్జన్మలనే భావాలను, హిందువులవలె వీరూ నమ్ముతారు. దిగంబరులు, శ్వేతాంబరులు అని జైనులలో రెండు తెగలవారున్నారు. దిగంబరులు దిక్కు (ఆకాశం, నలుదిక్కులు)లే అంబరం (వస్త్రం)గా కలవారు. వస్త్ర ధారణ చెయ్యక నగ్నంగానే వారు జీవిస్తారు. శ్వేతాంబరులు మాత్రం తెల్లటి వస్త్రాలు ధరిస్తారు. అర్ధమాగధి భాషలో వ్రాసిన 11 అంగాలు గల జైన ఆగమం వీరికి పవిత్ర ప్రామాణిక గ్రంథం. రాజస్థాన్, గుజరాత్‌లలో జైన్‌లు ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని కొలనుపాక ఒక జైన పుణ్యక్షేత్రం. నేడు జైనమతావలంబకుల సంఖ్య 20 లక్షలు ఉంటుంది. వీరు వర్తక వ్యాపారాల్లోనూ, బ్యాంకింగ్‌లోనూ నిమగ్నమయి ఉంటారు. (చూ.గోమటేశ్వరం, వర్ధమాన మహావీరుడు)

## జైల్ సింగ్

భారతదేశానికి ఏడవ రాష్ట్రపతి (1982–87) 1916 మే 5వ తేదీన జన్మించారు. సిక్కు మత సంప్రదాయంలో 'జ్ఞాని' బిరుదాంకితులు. ఫరీద్‌కోట సంస్థాన నిరంకుశ పాలనను నిరసిస్తూ పోరాటం సాగించాడు (1938). తరువాత జాతీయ పతాక ఉద్యమం నిర్వహించారు. 1946–48 మధ్య రాష్ట్ర ప్రజా మండల అధ్యక్షుడయ్యాడు. 1948లో ఫరీద్‌కోట ప్రవాస ప్రభుత్వాన్ని నిర్వహించారు. పెప్సూరాష్ట్ర ప్రభుత్వంలో రెవిన్యూమంత్రి (1946–48), పబ్లిక్ వర్క్సుమంత్రి (1951–52)నిర్వహించాడు. 1955–56 మధ్య పెప్సూరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్నాడు. 1956–62 మధ్య రాజ్యసభ సభ్యుడుగాఉన్నాడు. 1962లో పంజాబుశాసన సభ్యుడై కైరాన్ మంత్రి



వర్గంలో సభ్యుడయ్యారు. 1942–71 మధ్య పంజాబు ముఖ్య మంత్రి అయ్యారు. తరువాత కేంద్ర ప్రభుత్వంలో 1980–82 మధ్య దేశీయాంగ మంత్రిత్వశాఖ నిర్వహించారు. 1982 లో రాష్ట్రపతిగా ఎన్నిక అయ్యారు.

## జోన్ ఆఫ్ ఆర్క్

ఫ్రెంచి జాతీయ వీరనారి. రోమన్ కేథలిక్ భక్తురాలు. పేద ఇంటి రైతుబిడ్డగా జోన్ ఆఫ్ ఆర్క్ (ఫ్రెంచిలో ఆమె పేరు) జన్మించి ఫ్రెంచ్ సైన్యానికి నాయకత్వం వహించి, 1429లో ఆర్లియన్స్ ముట్టడి సందర్భంలో ఆమె ప్రదర్శించిన ధైర్య సాహసాలు, సైనిక వ్యూహరచనాసామర్థ్యం బ్రిటిష్ వారిని దిగ్భ్రాంతి కలిగించాయి. అప్పటినుండి ఆమెను 'ఆర్లియన్స్ వీర వనిత'గా వ్యవహరించడం పరిపాటి అయింది. డెమే మీలో1412లో పుట్టిన ఆమెకు చదవడం గాని, వ్రాయడం గాని రాదు. తల్లి దగ్గరే ఆధ్యాత్మిక విషయాలేకాకుండా లోకనీతిని కూడా బాగా అభ్యసించింది. దైవభక్తి, కరుణ, ఉదార స్వభావం, దయార్ద్రగుణం ఆమెకు జన్మతః అబ్బిన గుణాలు. ఫ్రాన్స్ యువరాజు ఛార్లెస్ ఆమెను సేనాధిపతిని చేసినపుడు జోన్ నాలుగు సార్లు ఇంగ్లీషు వారిని పరాజితులను చేసింది. క్షతగాత్రురాలయినప్పటికిని, ఆమె ఓరిమితో తన శౌర్యపరాక్రమాల్ని ప్రదర్శించి ప్రతిసారీ విజయం సాధించేది. చివరకు ఆమె విజయాల ఫలితంగా యువరాజు ఛార్లెస్ పట్టాభిషిక్తుడయాడు. అయితే ఇంగ్లీషు వారి పారిస్ ముట్టడి సందర్భంలో జోన్ తీవ్రంగా గాయపడి బ్రిటిష్‌వారికి పట్టుబడింది. ఇంగ్లీషు వారు ఆమెను బహిరంగంగా కాల్చి చంపివేశారు. దానితో ఆమె అమరజీవిని అయిన వీరనారిగా ప్రసిద్ధి పొందింది.

## జోరాస్టర్

చూ. జరతుష్ట్ర

## జోర్డాన్

రాచరికం క్రింద ఉన్న ఒక అరబ్బీరాజ్యం. ఇజ్రాయెల్‌కు పొరుగుదేశం. మానవుని పుట్టుకకు ఇదే ఆదిమ స్థానం అంటారు. జోర్డాన్ నది పశ్చిమ తీరాన జ్యూడ్, ఇజ్రాయెల్ వెలిశాయి. ఫిలిస్టీన్, అస్సీరియన్‌లు, చాల్డియన్‌లు, ఈజిప్షియన్‌లు, పర్షియన్‌లు దాడులు జరిపి ఈ ప్రాంతంలో ఏలుబడి సాగించారు. క్రీ.పూ. 332లో అలిగ్జాండర్(చూ.) ఈ దేశాన్ని జయించాడు. తరువాత రోమన్‌ల పాలనలో ఏసుక్రీస్తు(చూ.) అవతరించాడు. పిదప అరబ్బుల పాలన ప్రారంభమయింది. ఆ కాలంలోనే మహమ్మద్(చూ.) ప్రవక్త స్వర్గారోహణ జెరూసలెమ్‌లోనే జరిగింది. 1099 ప్రాంతంలో క్రైస్తవులు జెరూసలెమ్‌పై దాడి జరిపారు. 1517 తరువాత ఓటమన్‌లు ఈ ప్రాంతాన్ని పాలించారు. 1946లో దానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. అంతకుమందు 1916లో మెక్కాకు చెందిన షెరిఫ్ హుస్సేన్ ఈ ప్రాంతాన్ని పాలించేవాడు. ప్రస్తుతం ఒక రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలిస్తున్నారు.

విస్తీర్ణం: 89,206 చ.కి.మీ; జనాభా: 29,65, 000(1988); రాజధాని: అమ్మాన్; అధికార భాష: అరబ్బీ. ప్రజలు సున్నీశాఖ ముస్లిములు. జోర్డాన్‌లో ఎడారి భాగం ఎక్కువ. పశ్చిమ జోర్డాన్ నది లోయప్రాంతం సారవంతమయింది. గోధుమ, బార్లీ, నారింజ జాతులు, చిక్కుడు జాతులు ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. గొర్రెల పెంపకం, మేకల పెంపకం ప్రజల బ్రతుకు తెరువుకు తోడ్పడుతున్నాయి. పోటాష్ ఫాస్ఫేట్ ఖనిజాలు దేశపు ఎగుమతులలో ప్రధానమైనవి. వినోద పర్యాటకులను ఆకర్షించి ఈ దేశం విదేశీద్రవ్యాన్ని ఆర్జించి, ఆర్థిక వ్యవస్థకు పుష్టి చేకూర్చుకొంటూంది.

## జ్యోతిర్లింగాలు

కరుణామయుడయిన పరమశివుడు ద్వాదశ జ్యోతిర్లింగాల రూపంలో భక్తులననుగ్రహించడానికి భారత దేశంలో వెలిశాడని ఐతిహ్యం. 1. సౌరాష్ట్రంలో సోమనాథుడు 2. శ్రీశైలంలో మల్లికార్జునుడు 3. ఉజ్జయినిలో మహాకాళుడు, 4. 'డాకిని'లో భీమశంకరుడు 5. వారణాసిలో విశ్వేశ్వరుడు. 6. గోదావరి తీరంలో త్ర్యంబకేశ్వరుడు 7. చితా భూమిలో వైద్యనాథుడు. 8. దారుకావనంలో నాగ నాథుడు 9. సేతుబంధంలో రామేశ్వరుడు 10. శివా లయంలో భస్మేశ్వరుడు 11. కేదారనాథ్‌లో కేదార లింగం 12. ఘుసృంగం. పంచ లింగాలలో 1.భీమ; 2.విశ్వేశ్వర ; 3.విరూప; 4.మల్లికార్జున; 5.రామేశ్వర అతిముఖ్యమైనవి

## జ్ఞాన పీఠ పురస్కారం

భారతదేశంలో మిక్కిలి ప్రతిష్ఠాకరమైన వార్షిక సాహిత్య పురస్కారం. భారతీయ భాషలలో ఉత్తమమైనదిగా ఎంపిక అయిన సాహిత్య రచనకు ఢిల్లీలోని ఒక ధర్మ కర్తృత్వ సంస్థ 1965 నుంచి ప్రతి ఏడాదీ ఈ పురస్కారాన్ని ప్రదానం చేస్తుంది. 1988వ సంవత్సరానికి తెలుగుకవి సింగిరెడ్డి నారాయణ రెడ్డి(సి.నా.రె.)కి ఆయన రచించిన 'విశ్వంభర' అనే తెలుగు కావ్యానికి ఈ పురస్కారం లభించింది. అంతకు ముందు ఈ పురస్కారం అందుకున్న తెలుగు కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. జ్ఞానపీఠ పురస్కారం నగదు విలువ ఒక లక్షా ఏభయివేల రూపాయలు, సన్నదు, వాగ్దేవి ప్రతిమ ఉంటాయి.

## జ్ఞానేశ్వర్

ప్రసిద్ధ మహారాష్ట్ర సిద్ధుడు, భక్తుడు. పూనే సమీపాన 1275లో విఠల్‌పంత్ జ్ఞానదేవ్ జన్మించాడు. జ్ఞానేశ్వర్‌ను జ్ఞానదేవ్ అని కూడా అంటారు. జ్ఞానేశ్వర్ అసలు పేరు నివృత్తినాథుడు. 1290లో తన 15వ ఏట మహారాష్ట్రలో ఆయన భగవద్గీతకు వ్యాఖ్యానం వ్రాశాడు. ఇది మొదట 'భావార్థ దీపిక' అనీ తరువాత 'జ్ఞానేశ్వరీ' అనీ దేశంలో ప్రసిద్ధి పొందింది. గీతలోని 700 శ్లోకాలూ మరాఠీ భాషలో 10 వేల పద్యాలుగా పొందుపరచబడ్డాయి. జ్ఞానేశ్వర్ మరో రచన 'అమృతానుభవం'. హిందూ మతంలోని వివిధ సంప్రదాయాల మధ్య సామరస్యం సాధించడానికి జ్ఞానేశ్వర్ విశేషంగా కృషి చేశాడు. 1296లో జ్ఞానేశ్వర్ సిద్ధిపొందాడు.

## ఝాన్సీలక్ష్మీబాయి 1835–1858

సుప్రసిద్ధ భారతీయ వీరనారి. దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడడంలో ధైర్యసాహసాలలో పురుషులకు స్త్రీలు ఏమాత్రం తీసిపోరని ప్రపంచానికి చాటిచెప్పిన పౌరుషశాలిని ఝాన్సీలక్ష్మీబాయి.

బ్రిటిష్‌వారి మరతుపాకులకు బెదరక యుద్ధరంగంలో దూకి శత్రువులను ఆమె ఊచకోత కోసింది.

1835 నవంబరు 19న మోరో పంత్‌కి, భగీరథీబాయికి జన్మించిన లక్ష్మీబాయి మొదట పేరు మనూబాయి. చూ. భారతస్వాతంత్ర్య పోరాటం.

### జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు

1965–1988 మధ్య

ఈ పురస్కారాన్ని అందుకున్న భారతీయ మహాసాహితీవేత్తలు

| సం. | రచయిత | రచన | భాష |
|---|---|---|---|
| 1965 | శంకర కురూప్ | ఒటక్కుషల్ | మలయాళం |
| 1966 | తారాశంకర బందోపాధ్యాయ | గణదేవత | బెంగాలీ |
| 1967 | కె.వి.పుట్టప్ప; | రామాయణ దర్శనం | కన్నడం |
| | ఉమాశంకర జోషీ | నిశీథ్ | గుజరాతీ |
| 1968 | సుమిత్రానందన్ పంత్ | చిదంబర | హిందీ |
| 1969 | ఫిరాక్ గోరక్‌పురీ | గుల్–ఎ–నగ్మా | ఉర్దూ |
| 1970 | విశ్వనాథ సత్యనారాయణ | శ్రీమద్రామాయణ కల్పవృక్షం | తెలుగు |
| 1971 | బిష్ణు దే | స్మృతిసత్తా భవిష్యత్ | బెంగాలీ |
| 1972 | రామ్‌ధారీ సింహదినకర్ | ఊర్వశి | హిందీ |
| 1973 | డి.ఆర్.బేంద్రే | నాకు తంతి | కన్నడం |
| | గోపీనాథ మహంతి | మాటిమటాల్ | ఒరియా |
| 1974 | విష్ణుసఖారాం ఖాండేకర్ | యయాతి | మరాఠీ |
| 1975 | పెరంగమూర్ వైద్యనాథన్ అకిలాండన్ (అకిలన్) | చిత్రప్పావై | తమిళం |
| 1976 | ఆశాపూర్ణాదేవి | ప్రథమ ప్రతిశ్రుతి | బెంగాలీ |
| 1977 | కె.శివరామ కరంత్ | మూకజ్జియ కనసుగళు | కన్నడం |
| 1978 | సచ్చిదానంద హీరానంద్ వాత్స్యాయన్ | కిత్నీ నావోఁమేఁ కిత్నీ బార్ | హిందీ |
| 1979 | బీరేంద్రకుమార్ భట్టాచార్య | మృత్యుంజయ్ | అస్సామీ |
| 1980 | ఎస్.కె. శంకరన్ కుట్టి పొట్టెక్కాట్ | ఒరుదేశత్తింటె కథ | మలయాళం |
| 1981 | అమృతాప్రీతమ్ | కాగజ్–తె–కన్‌వాస్ | పంజాబీ |
| 1982 | మహాదేవి వర్మ | యామా | హిందీ |
| 1983 | మాస్తి వేంకటేశ అయ్యంగార్ | చిక్కవీర రాజేంద్ర | కన్నడం |
| 1984 | తకిజి శివశంకరపిళ్లే | కోయర్, ఇతర రచనలు | మలయాళం |
| 1985 | పన్నాలాల్ పటేల్ | మానివీ భావయి | గుజరాతీ |
| 1986 | సచ్చిదానంద రౌత్రే | కవిత, బాజీరౌత్ | ఒరియా |
| 1987 | వి.షిర్వాడ్కర్; 'కుసుమాగ్రజ్' | కవితలు | మరాఠీ |
| 1988 | సింగిరెడ్డి నారాయణరెడ్డి | విశ్వంభర, కవితలు | తెలుగు |

బాజీరావు పీష్వా మోరోపంత్‌పై గల అభిమానంతో అతణ్ణి బ్రహ్మావర్తానికి పిలిపించి తన ఆస్థానంలో ఉద్యోగం ఇవ్వడమే కాకుండా, తన దత్త పుత్రులు నానాసాహెబ్, రావుసాహెబ్‌లతో సమంగా అతని పుత్రిక లక్ష్మీబాయి చేత కూడా విద్యాభ్యాసం చేయించారు. లక్ష్మీబాయికి యుద్ధమన్నా కత్తిపట్టడమన్నా ఎంతో ఇష్టం. ఆ ఇష్టంతోనే ఆమె కత్తి తిప్పడంలో గొప్ప నేర్పును, మెళకువలను సాధించింది. గుర్రపుస్వారీ, యుద్ధరంగంలో శత్రువుల వ్యూహాలను ఛేదించే ఒడుపు అభ్యసించింది.



ఝాన్సి రాజధానిగా బుందేల్‌ఖండ్ రాజ్యం పాలిస్తున్న గంగాధరరావుకు ఇచ్చి మనూబాయికి చిన్నతనంలోనే వివాహం చేశారు. అప్పటి ఆచారం ప్రకారం మనూబాయికి అత్తమామలు లక్ష్మీబాయి అని పేరు పెట్టారు. లక్ష్మీబాయికి ఒక కుమారుడు కలిగినప్పటికీ మూడు నెలలు దాటకుండానే మరణించడంతో లక్ష్మీ బాయి, గంగాధరరావు ఆ బాధనుండి కోలుకోలేక పోయారు. గంగాధరరావు మంచం పట్టాడు. ఐదు సంవత్సరాల వయస్సుగల ఆనందరావుని దత్తత తీసు కున్నారు. ఈ దత్తతకై బ్రిటిష్‌వారికి పిటిషన్ పెట్టుకున్నారు. ఈ లోగా గంగాధరరావు మరణించడంతో లక్ష్మీబాయికి చిక్కులు ప్రారంభమయ్యాయి. ఝాన్సీ కోటను డల్‌హౌసీ ప్రభువు ఆక్రమించడంతో భర్త, కుమారుడు పోయి అశాంతితో ఉన్న లక్ష్మీబాయి ఆంగ్లేయులమీద ధ్వజం ఎత్తింది.

1857లో సిపాయిల తిరుగుబాటు ప్రారంభమై ఝాన్సీకి ప్రాకింది. ఝాన్సీలో ఇంగ్లీషువారి పాలన అంతమైంది. లక్ష్మీబాయి పాలన ప్రారంభమైంది. కాని ఝాన్సీపై ఎన్నాళ్లనుంచో కసి పెంచుకొన్న శత్రురాజులు ఇదే అదును అనుకొని ఝాన్సీ పైకి దండెత్తి వచ్చారు. తన సైన్యాలతో వెళ్ళి వారిని ఆమె తరిమి కొట్టింది. తర్వాత ఇంగ్లీషు వారు లక్ష్మీబాయిపై యుద్ధం ప్రకటించారు. లక్ష్మీబాయికి నానాసాహెబు అండగా నిలిచాడు.

1857 మార్చి 22న ఆంగ్ల సైనికులకు, లక్ష్మీబాయి సైనికులకూ మధ్య యుద్ధం ప్రారంభమైంది. మరుసటి సం. 1858 జూన్‌లో 18 రోజులపాటు అతి భయంకరంగా ఆ యుద్ధం సాగింది. లక్ష్మీబాయి ఒక్కతే సైన్యంతో సంబంధం లేకుండా 15 రోజులు యుద్ధం చేసింది. జూన్ 17న ఫిరంగి దెబ్బలకు శరీరం తూట్లుపడి రక్తంకారుతున్నా ఆమె ధైర్యం వీడలేదు. చివరికి ఒక యోధుడు దొంగదెబ్బతీసి ఆమె కుడిభుజం నరుకగా మరొకడు కత్తితో ఆమె గుండెలో పొడిచాడు. ఆ సమయంలో కూడా ఆమె తనకత్తితో ఆ ఇద్దరినీ నరకానికి పంపి మరీ కన్ను మూసింది.

## టంగుటూరి ప్రకాశం

చూ. ప్రకాశం టంగుటూరి

## టర్కీ

యూరప్‌కు ఆగ్నేయ దిశలో ఉన్న స్వతంత్ర గణ రాజ్యం. బొస్ఫరస్ జలసంధి ద్వారా ఆసియా—యూరప్ దేశాలను కలిపే కీలక దేశం టర్కీ.

విస్తీర్ణం: 7,79,452 చ.కి.మీ, జనాభా: 5,41,76,000 (1988); రాజధాని: అంకారా; అధికార భాష: తుర్కీ. ప్రజలు సున్నీశాఖకు చెందిన ముస్లిములు. ఇస్తాంబుల్ ఇజ్మార్, అదానా, బుర్సా ఇతర నగరాలు.



ప్రాచీన నాగరకత విరాజిల్లిన ప్రాంతం. వెనుకటి రాజధాని బైజాంటియమ్. ఇప్పటి ఇస్తాంబుల్ కు **పూర్వపు** నామం కాన్ స్టాంటినోపిల్. ఒటోమాన్ టర్క్ లు 15వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని ఆక్రమించి టర్కీ సామ్రాజ్యాన్ని స్థాపించారు. 1923లో ఇది సర్వ స్వతంత్రమైన రాజ్యం అయింది.

టర్కీ వ్యవసాయ ప్రధానమయిన దేశం. పొగాకు, ప్రత్తి, ఆలివ్, చెరకు, రైధాన్యం, వరి, గోధుమ, తేయాకు, నారింజ, మొక్కజొన్న ముఖ్యమయిన పంటలు. సుల్తానారెయిజన్ అను ఎండు ద్రాక్షకు టర్కీ ప్రసిద్ధి. అంటోలియా పీఠభూమిలో గొర్రెల పెంపకం, పశువుల పెంపకం ఎక్కువ. మొహేయిర్ రోమాలకు టర్కీ ప్రసిద్ధిగాంచింది. ఇనుపరాయి, రాగి, క్రోమియం, బాక్సైట్, నేలబొగ్గు ఈ దేశపు ఖనిజసంపదలో పేర్కొనదగినవి.

## టాంజేనియా

తూర్పు ఆఫ్రికాలోని టాంగన్యీకా, జాంజి బార్, పెంబాదీవులు కలిసి టాంజేనియా గణరాజ్యంగా 1964 నుంచి వ్యవహరించబడుతున్నది.




విస్తీర్ణం:9,45,037 చ.కి.మీ.; జనాభా:2,39, 96,000(1988); రాజ ధాని: దార్–ఇస్–సలామ్; అధికార భాషలు: ఇంగ్లీషు, క్స్వాహిలీ భాష.

టాంజేనియా వ్యవసా య ప్రధానమయిన దేశం. వేరుసెనగ,చెరకు,సిసాల్, కిత్తనార, మొక్కజొన్న, ప్రత్తి, కాఫీ మొదలైనవి పండుతున్నాయి. పెంబా దీవులలో లవంగాలు కొబ్బరి విరివిగా పండుతాయి. పశువుల పెంపకం ఎక్కువ. వజ్రాల ఎగుమతి ప్రధానమైంది. బంగారం, తగరం, ఉప్పు ఇతర ఖనిజోత్పత్తులు.

## టాగూర్, రవీంద్రనాథ్

జగత్ ప్రసిద్ధి పొందిన బెంగాలీ మహాకవి. భారతదేశంలో సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందిన ఒకే ఒక మహాకవి. 'జనగణమన' జాతీయగీత రచయిత. 'విశ్వకవి', 'గురుదేవ' అని ప్రజలు ఆయనను గౌరవంగా వ్యవహరించేవారు. 1861 మే 6వ కలకత్తాలో రవీంద్ర నాథ్ టాగూర్ జన్మించాడు. తండ్రి మహర్షి దేవేంద్ర నాథ్, తాత ద్వారకానాథ్ వీరిద్దరి సుగుణాలూ రవీంద్రునిలో మేళనం పొందాయి. 1898లో బారిష్టరు చదువుకు ఇంగ్లండు వెళ్ళాడు. మొదటి నుంచి రవీంద్రుడు ప్రకృతి ఆరాధకుడు. చిన్నతనంలోనే కవితాశక్తి



రవీంద్రునిలో కనిపించింది. 15వ ఏట 'కవిగాథ'అనే రచన చేశాడు.తరువాత 'అ డవిపూలు'పలువురిదృష్టిని ఆకర్షించింది. 1881 నా టికి'ప్రఖ్యాతగీతికలు','సం ధ్యాగీతికలు'ఆలపించాడు. ఈతని'ప్రకృతిప్రతీకారం', 'మనస్విని' కూడా ఈకోవ కు చెందినవే. 1895– 1900 మధ్యలో ఈయన కవిత్వంకొత్త పుంత తొక్కింది. టాగూర్ కృతి 'గీతాంజలి'కి 1913లో నోబెల్ బహుమతి పురస్కారం లభించింది. టాగూర్ కవితా వైదుష్యాన్ని గుర్తించి బ్రిటిష్ వారు 'సర్' బిరుదుతో ఈయనను గౌరవించారు. అయితే 1919లో జలియన్ వాలా బాగ్ దురంతం (చూ)పట్ల నిరసనగా ఆ 'సర్' బిరుదును రవీంద్రనాథ్ టాగూర్ త్యజించారు. 1920లో యూరప్ దేశాలలో పర్యటించాడు. తరువాత చీనా, జపాన్ వెళ్ళి అంతర్జాతీయ అవగాహన, సర్వమానవ శుభావహమని ప్రసంగాలిచ్చారు.

రవీంద్రుడు వ్రాసిన నవలలో 'నౌకా భంగం', 'గోరా' రెడ్ ఓలియాండర్స్ సుప్రసిద్ధమైనవి. ఇవి ఏడు భాషలలోకి అనువాదం పొందాయి. కాబూలీ వాలా, శుభా వంటి మానవతా దృష్టిగల కథానికలు కూడా ఆయన రచించారు. 'గీతాంజలి'లో మానవత, ప్రకృతి శోభ, తాత్విక చింతన ఉట్టిపడుతూ ఉంటాయి. 'విసర్జన', 'వాల్మీకి ప్రతిభ', 'పోస్టాఫీసు', 'ప్రాయశ్చిత్త' మొదలైనవి ఆయన వ్రాసిన నాటకాలు. 'చిత్రాంగద'

ప్రసిద్ధమైన సంగీతనాటకం. 'చండాలిక' లోని కథావస్తువు బౌద్ధం నుంచి గ్రహింపబడింది. కొత్త పద్ధతులలో పిల్లలకు విద్యను బోధించడానికి 'శాంతి నికేతన్', 'శ్రీనికేతన్' సంస్థలను బోల్పూర్‌లో రవీంద్రుడు స్థాపించాడు. శాంతి నికేతన్ నేడు 'విశ్వ భారతి యూనివర్సిటీ'గా ప్రసిద్ధిగాంచింది. 80 ఏళ్ళు తాత్త్విక దృష్టితో ఉజ్జ్వల ప్రపంచ సాహితీ జ్యోతిగా ప్రకాశించి, 1941 ఆగస్టు 7న రవీంద్రనాథ్ టాగూర్ కలకత్తాలో ఐహిక యాత్ర చాలించారు.

## టాల్‌స్టాయి 1828–1910

జగత్ ప్రసిద్ధి గాంచిన రష్యన్ రచయిత. మహామేధావి. సంఘసంస్కర్త. పూర్తిపేరు లియో నికొలెవిక్ టాల్ స్టాయి. ఈయన కాల్పనిక రచనలో 1869లో వ్రాసిన 'యుద్ధం—శాంతి' (వార్ అండ పీస్) గొప్ప నవల. 'అనాకరెనీనా' టాల్‌స్టాయికి కీర్తి గడించిపెట్టిన ప్రేమ గాథ (1877). ఈయన మొదటి రచనలు 'పసితనం (చైల్డ్‌హుడ్ 1852), బాల్యం (బాయ్ హుడ్ 1854), యౌవనం (యూత్ 1857) వెలుగు చూశాయి. 1855లో వ్రాసిన 'సెవాస్టీపూల్ గాథలు' అందించాడు. 1862లో వ్రాసిన 'కోసానిక్, యుద్ధం—శాంతి'లో రష్యాపై నెపోలియన్ చేసిన దండ యాత్ర ప్రధాన కథావస్తువు. 1880లో ఆధ్యాత్మికచింత నకు లోనైనప్పటినుండి కాల్ప నిక రచనా వ్యాసంగానికి టాల్‌స్టాయి స్వస్తిపలికాడు. అప్పటి నుంచీ నైతికవిలువల మీద, ధార్మిక చింతన మీద సమాజ పరమయిన ఇతివృత్తాల మీద ఆయన తన దృష్టిని కేంద్రీకరించాడు. వాటిలో 'ఏ కన్ఫెషన్(1882), వాట్ ఐ బిలీవ్ (1884), 'వాట్‌దే మస్ట్ డూ' (1886), కింగడమ్ ఆఫ్‌గాడ్ ఈజ్ విదిన్‌యూ (1894)' ముఖ్యమైనవి. అయితే మళ్ళీ1896లో ఆ యనదృష్టి కాల్పనిక రచనల వైపుమళ్ళింది. 'ది పవర్ ఆఫ్‌డార్క్‌నెస్'అనేనాట కం(1886),నిక్రెట్జర్ సొనాటా(1891),రిసరెక్షన్ (1899) అనే నవలలూ ఈ విధమైన రచనలలో పేర్కొనదగినవి. 'లివింగ్‌కార్ప్స్' (బ్రతికిఉన్న శవం) టాల్‌స్టాయి మరణానంతరం వెలుగుచూసిన రచన.



1828 సెప్టెంబర్ 9న తులా రాష్ట్రంలో జన్మించిన టాల్‌స్టాయి కజాన్ యూనివర్సిటీలో విద్యను అభ్యసించాడు. రష్యన్ సైన్యంలో స్వచ్ఛంద సైనికుడుగా చేరి క్రిమియా యుద్ధం (1855)లో సెవాస్టిపోల్ ముట్టడిలో ధైర్యసాహసాలతో పోరాడాడు. జీవితధ్యేయాన్ని మార్చి నైతిక విలువలను గూర్చి ఆలోచించడం మొదలు పెట్టాడు. మంచిచెడ్డ అనే వివేకం, ఇహలోక జీవిత పరమావధిని తెలుసుకోనే విచక్షణాజ్ఞానం భూమిమీద జీవించే ప్రతివ్యక్తిలోను స్వభావసిద్ధంగా ఉంటుందని టాల్‌స్టాయి భావన. 1890 నాటికి మానసిక పరిపక్వతను సాధించి, ఆస్తిపరుడుగా ఉండడానికి ఇష్టపడక, తన యావదాస్తినీ భార్యకూ, 9 మంది సంతానానికీ పంచి ఇచ్చాడు. తన రచనలమీద స్వామ్యాన్ని కూడా త్యాగం చేశాడు. ఆతని రచనల ప్రచురణ బాధ్యతను ఆయన భార్య చేపట్టి నిర్వహించింది. ఆయన మాత్రం తన కంటూ ఒక పైసా ఉంచుకోకుండా జీవింప నారంభించాడు. ఏ రూపంలో ఉన్న హింసనయినా టాల్ స్టాయి తీవ్రంగా ఖండించే వాడు. పొగత్రాగడం, మద్య పానం విడనాడి శాకాహారిగా జీవనయాత్ర సాగించాడు. నిరా డంబరంగాను, కష్టజీవి గాను జీవింపసాగాడు. రైతు కూలీలతో కలిసి శ్రమించేవాడు. తన కాళ్ళమీద తాను నిలబడడానికి ప్రయత్నించేవాడు. ఔదార్యం గురించి బోధించే వాడు. దుస్థితిలో ఉన్న వారిని ఆదుకునేవాడు. సమాజంలో ఆడా, మగా ప్రతివాడూ తమతమ వ్యక్తిగత జీవితాలలో కర్తవ్యనిష్ఠతో జీవిస్తూ పరస్పరం గౌరవాభి మానాలను ప్రదర్శించమని టాల్‌స్టాయి బోధించాడు. అయితే ఒక్కొక్కప్పుడు ఇటువంటి అసాధరణ భావనలు ఆయన ఆత్మీయులతోనే వివాదాలకు కారణమయ్యేవి. చివరకు తన 82వ ఏట స్వజనాన్ని విడిచిపెట్టి విరాగిగా తిరుగనారంభించి ఆస్తాపోవూ అనే రైల్వే స్టేషన్‌లో 1919 నవంబరు 22న దిక్కులేని మరణానికి టాల్‌స్టాయి గురిఅయాడు. ప్రపంచం అంతా ఆయనకు శ్రద్ధాంజలి ఘటించి ఆయన మానవతా దృక్పథానికి జోహారులర్పించింది.

## టాలమీ

'టాలమీ' అనేది ఒక రాజవంశం పేరు. అలెగ్జాండర్ (చూ.) తరువాత ప్రాచీన ఈజిప్టును పాలించిన మాసిడోనియా రాజవంశం ఇది. ఈ రాజవంశం క్రీ.పూ. 323 నుంచి క్రీ.పూ. 30 వరకు ఈజిప్టును పాలించింది. ఈ వంశంలో జగత్ప్రసిద్ధి చెందిన క్లియోపాత్రారాణి (చూ.) పాలన చిట్ట చివరిది. టాలమీ రాజులు నాగరకతాభిలాషులు.గ్రీక్ నాగరకతను ఈజిప్టులో వీరు వ్యాపింపచేశారు. అలెగ్జాండ్రియా లైబ్రేరీని, మ్యూజియంను స్థాపించిన వాడు మొదటి టాలమీ (క్రీ.పూ 323–283 పాలన), రెండవ టాలమీ (క్రీ.పూ. 308–240) తన సోదరినే వివాహమాడి 'లైట్‌హౌస్' నిర్మాణం పూర్తి చేశాడు. ఇది ప్రపంచంలోని ఏడు వింతలలో ఒకటి.

## టిప్పు సుల్తాను 1753–1799

దక్షిణ భారతదేశమును ఏలిన ముస్లిం ప్రభువులలో చారిత్రక ప్రసిద్ధి కలవాడు. మైసూరును పాలించిన హైదరాలీ కుమారుడు. 1783లో సింహాసనమధిష్ఠించాడు. ఇతని రాజధాని నగరం మైసూరుకు సమీపంలో ఉన్న శ్రీరంగపట్నం. బ్రిటిషు వారితో సంధిచేసుకుని కెనరా, మలబారు ప్రాంతములను తన రాజ్యమున చేర్చాడు. ప్రజలను క్రైస్తవంలోనికి మార్పిడి చేస్తున్న పోర్చుగీసు వారిని బంధించాడు. పుంగనూరు, మదనపల్లి తన రాజ్యమున కలుపుకొన్నారు(1785). కూర్గును వశపరచుకుని 'పాదుషా' అని ప్రకటించుకొన్నారు. మహారాష్ట్రులు నైజాంతో కుమ్మక్కై మైసూరు మీదికి దండెత్తగా మహారాష్ట్ర భద్రతాదళాన్ని యుక్తిగా లొంగదీసుకుని వారిని తరిమికొట్టారు. తిరోగమనంలో మహారాష్ట్ర సేనలు తమ స్త్రీలను విడిచిపెట్టిపోవలసి వచ్చింది. అప్పుడు టిప్పు ఉదారంగా ఆదరణ చూపి గౌరవ సన్మానములు చేసి పంపాడు. తత్ఫలితంగా మహారాష్ట్రులతో సంధి కుదుర్చుకొనగ రాయదుర్గం, హర్పనహల్లి తన రాజ్యమున కలిశాయి. మూడవ మైసూరు యుద్ధం (1790) బ్రిటిషు వారికి టిప్పుకి మధ్య జరిగింది. 1792లో జరిగిన శ్రీరంగ పట్నం సంధి ప్రకారం మైసూరు రాజ్యంలోని సగం భాగాన్ని మహారాష్ట్రులు,నైజాం,బ్రిటిషు వారు పంచుకొనిరి. యుద్ధపు ఖర్చుల నిమిత్తం టిప్పు మూడు కోట్ల రూపాయలు చెల్లించాల్సి వచ్చింది. అప్పటివరకు టిప్పు కుమారులిద్దరూ బ్రిటిషువారి తాకట్టులో ఉండవలసి వచ్చింది. 1794 లో డబ్బు చెల్లించి వారిని విడిపించుకొన్నాడు.దానితో టిప్పు కక్షకట్టి బ్రిటిషువారిని ఓడించడానికి పూనిక వహించగా ఇది తెలిసి వెలెస్లీ నాలుగవ మైసూరు యుద్ధం ప్రకటించి (1798–99) శ్రీరంగపట్నాన్ని ముట్ట డించగా టిప్పు వీరమరణమును అందుకొన్నాడు. టిప్పును తండ్రి హైదరాలీ ప్రక్కనే రాజలాంఛనాలతో సమాధి చేశారు.



## టిబెట్

ప్రపంచానికి పై కప్పు అని ప్రసిద్ధి పొందిన హిమాలయా రాజ్యం. క్సిజాంగ్ జిఝిక్వా అని చీనా భాషలో పిలుస్తారు. భారతదేశానికీ, నేపాలుకీ ఉత్తర సరిహద్దు. భారతదేశానికి ఉత్తరంగా ఇది ఉంది. టిబెట్‌కు దక్షిణ సరిహద్దును ఆనుకుని మిక్కిలి ఎత్తయిన మౌంట్ ఎవరెస్ట్ (చూ) శిఖరం ఉంది. టిబెట్ ప్రస్తుతం చీనా భూభాగంలో చేరింది. 'లాసా' రాజధాని.

టిబెట్ విస్తీర్ణం: సుమారు 12,00,000 చ.కి.మీ. మొత్తం దేశమంతా పర్వతమయం. హిమశిలామయం. సముద్ర మట్టానికి దాని సగటు ఎత్తు 4880 మీ. ఉంటుంది. వందల కొద్దీ సరస్సులు ఉన్నాయి. అయితే ఇవి చలికి గడ్డకట్టి ఉంటాయి. పైగా వీటిలోని నీరు ఉప్పునీరు. బ్రహ్మపుత్రానది, మీకాంగ్‌నది, సింధునది, సాల్వీనది, యాంగ్‌ట్జీ నది వంటి ఆసియాలోని పెద్ద నదులు టిబెట్ లోని హిమశిలల మధ్యనే ఆవిర్భవించాయి. ఇనుపరాయి, మాంగనీసు, నేలబొగ్గు, జిప్సమ్, పెట్రోల్ తైల నిక్షేపాలు ఉన్నట్టు సర్వేలనుబట్టి తెలుస్తోంది. టిబెట్ ప్రజలు మంగోలాయిడ్ వర్గానికి చెందినవారు. బర్మీస్ భాషా కుటుంబానికి సంబంధించిన మాండలికాలు మాట్లాడతారు. వీరు పొట్టిగా ఉన్నా దృఢకాయులు.

బహు భర్తృత్వం టిబెట్టు వారిలో ప్రబలంగా కన్పిస్తుంది. అన్నదమ్ములు ఒకే స్త్రీని వివాహమాడి కలిసి పనిచేసు కుంటూ సమష్టి కుటుంబంగా జీవిస్తూ వుంటారు. అయితే ఏకపత్నీ వ్రతులే ఎక్కువ. టిబెట్‌న్లలో దైవభక్తి


టిబెట్టులో ఒక దృశ్యం

మెండు. నిష్ఠగా జీవితం గడుపుతారు. వీరు బౌద్ధంలో ఒక శాఖ అయిన 'లామా' మతాన్ని అనుసరిస్తారు. 'లామా' మతాధిపతులు ఇద్దరు. 'పాంచెన్‌లామా' ఆధ్యాత్మ పీఠాధిపతి, మత విషయాలలో ఆయన పెద్ద. దేశానికి సంబంధించిన రాజకార్యాలు చక్కబెట్టేపని 'దలైలామా' (చూ.)చూస్తారు. ప్రజల్లో 20 శాతం లామా మతాధిపతులు. లాసాకు సమీపంలోనే దేశంలోని మూడు పెద్ద మఠాలు ఉన్నాయి. కుటుంబపోషణ కష్టసాధ్యమని చాలా మంది 'లామా'లు అయి మఠాలలోనే గడిపివేయ టానికి ఇష్ట పడతారు. 1950 నుంచీ చీనా ప్రభుత్వం టిబెట్ పాలనలో ఆంక్షలు విధిస్తూ వచ్చింది. చివరకి 1959లో దలైలామా దేశం విడిచి పెట్టి భారతదేశంలో తలదాచుకోవలసి వచ్చింది. కొన్నాళ్ళు చీనా ప్రభుత్వానికి లోబడి స్వయం పాలక రాష్ట్రంగా టిబెట్ ఉండేది. ఇప్పుడు పూర్తిగా చీనాలో అంతర్భాగమైంది.

## టునీసియా

ఉత్తర ఆఫ్రికాలో మధ్యధరా సముద్రాన్ని ఆనుకొని ఉన్న ఒక స్వతంత్రరాజ్యం. ఒకప్పుడు ఫ్రెంచ్‌వారి అధీనంలో ఉండేది. 1955లో స్వాతంత్ర్యం పొంది19 57లో గణరాజ్యం అయింది. విస్తీర్ణం: 1,54,550 చ.కి.మీ. జనాభా: 78,77,400 (1988), రాజధాని: ట్యూనిస్; అధికార భాష: అరబ్బీ; ఫ్రెంచ్ కూడా మాట్లాడతారు. ప్రజలు ప్రధానంగా ఇస్లాం సున్నీశాఖ మతావలంబ కులు.

టు నీసియా వ్యవసాయ ప్రధానమైన దేశం. గోధుమ, బార్లీ, ఓట్ ధాన్యం, ఖర్జూర, ఆలివ్, అప్రికాట్, బాదం, అత్తి, పీచ్, నారింజపండ్లు, కాయగూరలు, టోమాటో, బీటు, బంగాళదుంప, ఆల్ఫా గడ్డి ముఖ్యమయిన పంటలు. ఇనుము, సీసం, జింకు, ఫాస్ఫేట్ ఈ దేశంలో లభించే ప్రధాన ఖనిజాలు. ఆలివ్‌నూనె, ద్రాక్ష సారాయి, ఫాస్ఫేట్‌లు, తిండిగింజలు ప్రధానమయిన ఎగుమతి సరుకులు.

## టోక్యో

జపాన్ దేశపు రాజధాని. హోన్షూ దీవిలో తూర్పు దిశగా ఇది ఉంది. జపాన్‌లో ఇదే ప్రధానమైన వాణిజ్యకేంద్రం కూడా. పాశ్చాత్య మహానగరాలలోని జీవనశైలి టోక్యోనగరంలో కూడా కానవస్తుంది (చూ. జపాన్). దీని విస్తీర్ణం 578 చ.కి.మీ. (నగరం మాత్రమే) శివార్లు కలుపుకుంటే 2,142 చ.కి.మీ., జనాభా 83,54, 539 (1987) ప్రజలు షింటో మతం, బౌద్ధమతం (జెన్ శాఖ) అనుసరిస్తారు. ఇతర మతస్థులు బహుతక్కువ. క్రైస్తవులు 2 శాతం మాత్రమే ఉన్నారు. జపాన్ చక్రవర్తి నివసించే రాజప్రసాదం నగరంలో నడిబొడ్డున ఉంది. జాతీయ శాసనసభ (పార్లమెంట్)ను 'డైయెట్' అంటారు. ఇది రాజప్రాసాదానికి వాయవ్య దిశలో ఉంది. డైయెట్ భవన సముదాయం మధ్య ఆకాశ హర్మ్యంలాంటి నిర్మాణం ఉంది. రాజప్రసాదానికి నైరృతి దిశలో ఉన్న మెయిజీ క్షేత్రం ఈ దేశంలోని పుణ్యక్షేత్రాలన్నింటిలోను మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. అమరవీరుల స్మృతి చిహ్నంగా నిర్మించిన 'యాసుకి


మియాజిమాలోని టోరి (షింటో)

మండపం' విదేశీ పర్యాటకులను ఎక్కువగా ఆకర్షిస్తూంది. ఇంకా బౌద్ధ పుణ్యక్షేత్రాలు అక్కడక్కడ ఉన్నాయి. టోక్యో జాతీయ క్రీడాంగణం స్టేడియంలో 72,000 మంది ప్రేక్షకులు కూర్చుండటానికి వసతి వుంది.

టోక్యో నేషనల్ మ్యూజియమ్ జపాన్‌లోని మ్యూజియమ్‌లలో పెద్దది. 'నేషనల్ మ్యూజియమ్ ఆఫ్ మోడర్న్ ఆర్ట్' ఔత్సాహిక కళాకారులను ప్రోత్సహిస్తుంది. రంగస్థల ప్రక్రియలలో 'కబూకీ' ప్రముఖమైంది. ఇకబానా ఓహేరా అనే పుష్పాలతో అలంకరణ, 'బొన్సయి' అనే వామన వృక్షాల పోషణ, తేయాకు సేవించడంలో (టీ సెరిమనీ) ప్రత్యేకత టోక్యో నగరంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంటాయి. పారిశ్రామికాభ్యుదయ ఫలితంగా జపాన్ సాధించిన ప్రగతి టోక్యో నగరం చూస్తేనే అవగతమవుతుంది.

## టోగో

ఆఫ్రికా పశ్చిమ తీరాన ఉన్న ఒక గణ రాజ్యం. ఒకప్పుడు దీనిని 'టోగో లాండ్' అనేవారు. విస్తీర్ణం: 56,785 చ.కి.మీ. జనాభా: 34,86,000 (1988); రాజధాని: లోమే; అధికార భాష: ఫ్రెంచ్. ప్రజలు ఆదిమ భాషలు మాట్లాడతారు. కాఫీ, కోకో, ప్రత్తి, పామ్ నూనె గింజలు, వేరుసెనగ, అపరాలు, జొన్న కర్రపెండలం, పెండలం, వరి ప్రధానమైన పంట దినుసులు. ఫాస్ఫేట్‌లు ముఖ్యమయిన ఖనిజ సంపద.

## ట్రాట్‌స్కీ 1879–1940

రష్యన్ విప్లవ నాయకుడు. లెనిన్ ప్రధాన సహచరుడు. అసలు పేరు లియోన్ ట్రాట్‌స్కీ. బోల్షివిక్ విప్లవ సమరయోధుడు. లెనిన్ జీవించి ఉన్నంత కాలం రష్యన్ రాజకీయాలలో ట్రాట్‌స్కీ కీలక పాత్ర నిర్వర్తించాడు. లెనిన్ మరణానంతరం (1924) రష్యాలో గద్దె ఎక్కిన స్టాలిన్ ఈర్ష్యకు గురి అయి, కమ్యూనిస్ట్ పార్టీ నుంచి ట్రాట్‌స్కీ బహిష్కృతుడయాడు. మరుసటి సంవత్సరం సైబీరియాకు, ఆ తరువాత టర్కీకి పంపబడ్డాడు (1929). అక్కడ నుంచి తప్పించుకొని మెక్సికో చేరగా అక్కడ హత్య చేయబడ్డాడు (1940 ఆగస్టు 21).

రష్యన్ జార్ చక్రవర్తిని ఎదిరించి పోరాడిన మహాయోధుడు ట్రాట్‌స్కీ. 1879లో డేవిడోవిక్ బ్రాన్స్‌హన్ (యుక్రెయిన్)లో ఒక సంపన్న కుటుంబంలో జన్మించాడు. సోషల్ డెమోక్రాట్ విప్లవ వీరుడుగా 1899లో అరెస్టయి సైబీరియాలో నిర్బంధం నుంచి పారిపోయాడు. 1902లో లండన్‌లో లెనిన్‌ను కలుసుకున్నాడు. 1905లో రష్యాకు తిరిగి వచ్చినప్పుడు మళ్ళీ నిర్బంధించబడి మళ్ళీ తప్పించుకున్నాడు. 10 ఏళ్లపాటు విప్లవ రచయితగా పశ్చిమ యూరప్‌లో గడిపాడు. మొదటి ప్రపంచయుద్ధ (1914–19) సమయములో ఫ్రాన్స్, స్పెయిన్ దేశాల నుంచి బహిష్కృతుడయాడు. న్యూయార్క్ చేరినప్పుడు (1917) జార్ పతనం సంగతి తెలుసుకొని రష్యావచ్చి, లెనిన్‌తో చేతులు కలిపి బోల్షివిక్‌లు ప్రభుత్వాన్ని (నవంబరు 17)కైవసం చేసికొనడంలో తోడ్పడ్డాడు. వెనువెంటనే విదేశాంగ శాఖకు 'కమీసార్' అయి తరువాత రక్షణశాఖకు 'కమీసార్' అయాడు. 1918–20 మధ్య జరిగిన అంతర్యుద్ధంలో రెడ్ ఆర్మీని సమాయత్తం చేయడంలో తన ప్రతిభను ప్రదర్శించి, రష్యన్ చరిత్రలో అమరజీవి అయిన మహాయోధుడు ట్రాట్‌స్కీ.

## ట్రినిడాడ్ , టుబాగో

వెస్టిండీస్ దీవులలోని ఒక ప్రధానమైన ద్వీప రాజ్యం. ఒకప్పుడు బ్రిటిష్ వలస రాజ్యంగా ఉండేది. 1962లో స్వాతంత్ర్యం పొంది 1976లో గణరాజ్యం అయింది.

విస్తీర్ణం: 5,124 చ.కి.మీ., జనాభా: 12,58, 000 (1988); రాజధాని: పోర్ట్–ఆఫ్–స్పెయిన్, అధికార భాష: ఇంగ్లీషు; ప్రజలు నీగ్రో జాతికి చెందిన వారు ఎక్కువ. రెడ్ ఇండియన్‌లు కూడా ఉన్నారు.

పలు రకాల పక్షులకు ఈ ద్వీపం నిలయం. చెరకు, నిమ్మ, కోకో, ప్రధానమయిన పంటలు. వినోద పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్న మనోహరమైన ప్రకృతి దృశ్యాలతో కూడిన రాజ్యం ఇది.

## డయ్యూ & డామన్

భారతదేశంలో పశ్చిమ గుజరాత్ తీరాన డామన్ ఉంది. డయ్యూ కతియవాడ్ ద్వీపకల్పానికి కొసన కాంబే సింధుశాఖ చేరువలో ఒక చిన్న దీవి. డామన్‌కు ఉత్తరాన

స్వతంత్ర ప్రతిపత్తిని సాధించింది. విస్తీర్ణం: 48,443 చ.కి.మీ., జనాభా: 67,07,710 (1988); రాజధాని: శాంతో డొమినింగో; అధికార భాష: స్పేనిష్; చెరకు, కాఫీ, ఎక్కువగా పండించి ఎగుమతి చేస్తారు.

ప్రజలు ములత్తో జాతికి చెందినవారు 74 శాతం ఉన్నారు. తెల్లవారు 16 శాతం, నీగ్రోలు 11 శాతం. ఎక్కువమంది రోమన్ కేతలిక్ క్రైస్తవం పాటిస్తారు.

## డొమినికా

వెస్టిండీస్ దీవులలోని ఒక కామన్ వెల్త్ ద్వీప రాజ్యం. ఒకప్పుడు బ్రిటిష్‌వారి అధీనంలో ఉండి, 1978 నుండి స్వతంత్రం రాజ్యం అయింది. పర్వతమయమయిన ఈ చిన్న ద్వీపంలో అగ్ని పర్వతాలు ఎక్కువ. దీని విస్తీర్ణం: 750 చ.కి.మీ., జనాభా: 73,795 (1988), రాజధాని: రోసై, అధికార భాషలు: ఇంగ్లీష్, ఫ్రెంచ్. ప్రజలు నీగ్రో జాతులు. క్రైస్తవం పాటిస్తారు.

అరటిపండ్లు, కోకో, కొబ్బరి, ఇతర రకాల పండ్లు విరివిగా పండించి ఎగుమతి చేస్తారు.

## డోస్టోవిస్కీ 1821–81

ప్రపంచ ప్రసిద్ధి పొందిన రష్యన్ నవలా రచయిత. 'క్రైమ్ అండ్ పనిష్‌మెంట్' (నేరము—శిక్ష) నవలా రచయిత. ఫ్యాదోర్ మికెయిలోవాచ్ డోస్టోవిస్కీ సైబీరియాలో ప్రవాస శిక్ష అనుభవిస్తూ 'విలేజ్ ఆఫ్ స్టెఫన్చికొమో'అనే నవలను వ్రాయడం ప్రారంభించాడు (1860). మానసిక నిర్బంధం అనే విషయం దానిలోని ఇతివృత్తం. మరో రెండు నవలలను అక్కడే పూర్తి చేశాడు. వాటి పేర్లు 'మెమోయిర్స్ ఫ్రమ్ ది అండర్ గ్రౌండ్', 'క్రైమ్ అండ్ పనిష్‌మెంట్'. ఇంగ్లండ్ మొదలైన ఇతర దేశాలకు వెళ్ళి (1867) 'ది ఇడియట్', 'ది ఎటర్నల్ హజ్బండ్', ది పొజేస్' అనే మరొక మూడు రచనలు చేశాడు. ఈయన వ్రాసిన ఆఖరి నవల 'ది బ్రదర్స్ కారమ్‌జోవ్'

## డ్జిబౌటీ చూ. జీబౌటీ

## ఢిల్లీ మహానగరం టెరిటరీ

కేంద్రపాలిత ఢిల్లీ భారత రాజధాని. న్యూఢిల్లీ మహా నగరం. యమునా నదీ తీరాన ఉన్న పురాతన మహానగరం. పురాణేతిహాసాల కాలం నుంచి హస్తినాపురి, ఇంద్రప్రస్థం అని ప్రసిద్ధి గాంచిన ప్రాంతం. ఇప్పటి ఢిల్లీ 1639లో షాజహన్ పాలనలో నిర్మితమైంది. చాందినీ చౌక్, మసీదులు, ఎర్రకోట, దర్బారు మండపం, మొగల్ పాలనలో కట్టబడినవే. ఢిల్లీ సమీపంలో కుతుబ్‌మీనార్ ఉంది (చూ). జయసింగ్ మహరాజు 18వ శతాబ్దంలో నిర్మించిన ఖగోళ వేధశాల 'జంతర మంతర ప్రాంగణం' ఢిల్లీలో ముఖ్యంగా దర్శించదగింది.



బహాయి దేవళం

బ్రిటిష్ పాలనలో కేంద్ర ప్రభుత్వం రాజధానిని 1912లో కలకత్తా (చూ.) నుంచి ఢిల్లీకి తరలించారు. అప్పటినుంచి న్యూఢిల్లీ అనే నూతన నగరం వెలసింది. అయితే 1931 నుంచి మాత్రమే ఇక్కడ కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలు జరుగుతున్నాయి. భారత స్వాతంత్ర్యానంతరం (1947) భారత రిపబ్లిక్ (1950)కు ఢిల్లీ రాజధానిగా కొనసాగుతూంది లోక్‌సభ, రాజ్యసభల పార్లమెంటు భవనం అద్భుతమైన వాస్తు శిల్ప కల్పన. అసలు న్యూఢిల్లీ నగర రూపకల్పనే ప్రపంచ వాస్తు శిల్పుల దృష్టిని ఆకర్షిస్తూంది. చక్కటి రాజమార్గాలతో మంచి పరిసర కల్పనతో నగరం నేత్రపర్వంగా ఉంటుంది. ఇండియా గేట్ మృతవీరుల స్మారక చిహ్నం. రాష్ట్రపతి భవనం సుమారు మూడు వందల గదులు గల మహా ప్రాసాదం. అందులోని మొగల్ గార్డెన్స్ చూడముచ్చటగా ఉంటాయి. ఇటీవల (1985) నిర్మితమయిన బహాయి దేవళం ఢిల్లీ వాస్తు సంపదకు శోభనిస్తూంది. 1982లో ఏషియాడ్ (చూ.) క్రీడలు నిర్వహించినప్పుడు జవహర్ లాల్ నెహ్రూ స్టేడియమ్, ఇంద్రప్రస్థ ఇండోర్ స్టేడియమ్, టల్కాటోరా ఈతకొలను శివాజీస్టేడియం వంటి క్రీడా ప్రాంగణాలు క్రొత్తగా నిర్మించడంతో న్యూఢిల్లీకి మరింత శోభ చేకూరింది.

కేంద్రపాలిత ఢిల్లీ వివరాలు విస్తీర్ణం: 1483 చ.కి.మీ, జనాభా: 62,20,406(1981); అధికార భాష: హిందీ; ప్రజలు ఉర్దూ, పంజాబీ భాషలు మాట్లాడతారు.

ఈ నగరంలో కేంద్ర ప్రభుత్వకార్యాలయాలన్నీ-శాస్త్రి భవన్, నిర్మాణభవన్, కేంద్ర సచివాలయం, కృషి భవన్, ఉద్యోగ్ భవన్, రెయిల్ భవన్-ఒకే చోట సందర్శించ వచ్చును. నేషనల్ మ్యూజియమ్‌లో పురావస్తువులు, నేషనల్ ఆర్కైవ్స్‌లో చారిత్రక లేఖాసామగ్రిని భద్ర పరిచారు. చాందినీ చౌక్, కన్నాట్ సర్కిల్‌లోని పాలికా బజారులోని నేలమాళిగ అంగళ్ళు చూడదగినవి.

రిపబ్లిక్ దినోత్సవం(చూ.) జనవరి 26వ రాష్ట్రపతి భవన ప్రాంగణానికి ఎదురుగా ఉండే రాజపథ ప్రతి ఏడాది చక్కగా అలంకరించబడుతుంది. ఢిల్లీని ఒక కేంద్ర పాలిత ప్రాంతంగా ఏర్పాటు చేశారు. తీన్ మూర్తి భవన్ (నెహ్రూ మ్యూజియం) సఫ్దర్ జంగ్ రోడ్డులోని ఇందిరాగాంధి స్మారక మందిరం వినోద పర్యాటకుల్ని ఆకర్షించే స్థలాలు. రాజఘాట్‌లో గాంధీజీ సమాధి, శాంతివనంలో జవహర్ లాల్ సమాధి, శక్తివనంలోని ఇందిరా గాంధీ సమాధి ఉన్నాయి.

## తక్కర బాపా చూ. బాపా, అమృతలాల్ తక్కర్

## తక్షశిల

నేటి పాకిస్తాన్‌లోని రావల్పిండి సమీపంలోఉన్న ఒక చారిత్రక స్థలం. క్రీ.పూ. 7వ శతాబ్దం మొదలు క్రీ.శ. 7వ శతాబ్దందాకా ఈ ప్రదేశంలో ఒక మహానగరం ఉండేది. ఆ కాలంలో ఈ నగరం ప్రపంచ ప్రసిద్ధమైన విద్యాకేంద్రం. క్రీ.పూ. 326లో తాత్కాలికంగా ఈ నగరం అలెగ్జాండర్ స్వాధీనమైంది. అశోకుని కాలంలో ఈ నగరం సర్వోచ్చస్థితిలో ఉంది. క్రీ.శ. 1వ, 2వ శతాబ్దాలలో కుషానులు ఈ నగరాన్ని ఆక్రమించారు. బౌద్ధుల విద్యాకేంద్రంగా ఉన్న ఈ తక్షశిల నగరాన్ని క్రీ.శ. 7వ శతాబ్దంలో చైనా యాత్రికుడు హ్యుయాన్ త్స్యాంగ్ సందర్శించాడు. ఆనాటి ఈ నగర వైభవాన్ని ఆయన వర్ణించాడు. బౌద్ధస్తూపాలు, ఆరామాలు ఒకప్పుడు ఇక్కడ ఉన్నట్లు తెలియజేసే శిథిలావశేషాలూ, గాంధార శిల్పకళా ఖండాల అవశేషాలూ ఎన్నో తక్షశిలలో దొరికాయి. తక్షశిలలో ఉన్న బౌద్ధ విద్యాపీఠానికి సుదూర ప్రాంతాలనుండి విద్యార్థులు వస్తూఉండేవారు

## తపతీనది

తూర్పున సాత్పురా పర్వతశ్రేణిలో ఉద్భవించిన జీవనది. దీని నిడివి 720 కి.మీ. తపతీనది 'తాపీ' 'తాప్తి' అని కూడ అంటారు. 'ఖాన్' ప్రాంతంలో గుజరాత్ రాష్ట్రంలో ప్రవేశించి సూరత్ దగ్గిర అరేబియా సముద్రంలో ఈ నది సంగమిస్తూంది. ఈ నదీ తీరంలో అనేక పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. ఆషాఢమాసంలో ఉత్సవాలు జరుగుతాయి. సూరత్‌కు ఎగువను తపతీనది మీద 'కాక్రపారా' వద్ద ఒక డామును నిర్మించి దాదాపు 6 లక్షల ఎకరాల పంటనేలకు సాగునీటిని అందిస్తున్నారు. యూకై గ్రామం వద్ద మరొక డామును నిర్మించడం వల్ల గుజరాత్‌లో దాదాపు 4 లక్షల ఎకరాల భూమికి పంటనీరు అందుతూంది. దీనివల్ల జలవిద్యుచ్ఛక్తి కూడా ఉత్పత్తి అవుతూంది. ఈ రెండు డాములను నిర్మించడంవల్ల సూరత్‌కు తరచు సంభవించే వరద ప్రమాదకి అరికట్టబడింది. తూర్పుగా ప్రవహించి బంగాళాఖాతంలో కలిసే జలప్రవాహాన్ని 'నది' అని, పడమటి దిక్కుగా ప్రవహించి అరేబియా సముద్రలో కలిసేదాన్ని 'నదం'అని సంస్కృతంలో అంటారు. ఆ అర్థంలో పశ్చిమాన అరేబియా సముద్రంలో కలిసే 'తపతీ'నీ, 'నర్మద' నీ నిజానికి 'నదులు అనడం కంటె 'నదాలు' అనడం ఉచితం.

## తమిళనాడు

ఒకప్పుడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఉండి కేరళ, కర్నాటక, ఆంధ్ర రాష్ట్రాలు విడిపోయిన తరవాత కేవలం తమిళం మాట్లాడేప్రాంతాలతో ఏర్పాటైన ఒక దక్షిణాది రాష్ట్రం. విస్తీర్ణం:1,30,000 చ.కి.మీ.;జనాభా:4,84,08,077(1981);అధికార భాష: తమిళం; రాజధాని: మద్రాసు. దీనికి తూర్పున బంగాళాఖాతం,దక్షిణాన హిందూమహాసముద్రం,పశ్చిమాన కేరళ, ఉత్తరాన కర్నాటక, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రాలు



ఉన్నాయి. ఈ రాష్ట్రంలో పారే ప్రధానమైన నదులు: కావేరి, పాలార్, పొన్నైయ్యార్, తామ్రపర్ణి, వైఘై. ప్రజలలో ఎక్కువ మందికి వ్యవసాయం ప్రధానమైన వృత్తి. వరి, వేరుసెనగ, చెరకు, ప్రత్తి మొదలైన పంటలు పండుతాయి. తోటపంటలలో కాఫీ పండుతుంది. జవుళీ పరిశ్రమకు, రైలు పెట్టెలు, కార్లు, బస్సులు, మోటారు సైకిళ్ల ఉత్పత్తికి తమిళనాడు రాష్ట్రం ప్రసిద్ధి చెందింది.


తిరుచిరాపల్లి కోట

తమిళనాడుకు ఆరువేల ఏళ్ల ఘన చరిత్ర ఉన్నట్లు చరిత్రకారుల భావన. ద్రావిడ సంస్కృతికి తమిళనాడు కేంద్రంగా వర్ధిల్లినది. క్రీ.పూ. 4వ శతాబ్దం నాడు చోళ, పాండ్య, చేర రాజ వంశీయులు ఈ ప్రాంతాన్ని పాలిస్తూ ఉండేవారు. క్రీ.శ. 850 ప్రాంతంలో చోళులు తంజావూరు, తిరుచిరాపల్లి ప్రాంతాన్ని పాలించారు చేర వంశీయులు నేటి కేరళకు ఉత్తర ప్రాంతాన్ని పాలించేవారు. పల్లవులు క్రీ.శ. 4వ శతాబ్ది నుంచి కాంచీపురం రాజధానిగా పాలించేవారు. 13వ శతాబ్దిలో పాండ్య రాజవంశీయులు పాలించి అంతర్జాతీయ వాణిజ్యం సాగించారు. తరువాత క్రీ.శ. 1336–1565 మధ్య విజయ నగర సామ్రాజ్యంలో భాగమై ఉండేది. విజయనగర రాజ్య పతనం (1565) తరువాత ముక్కలై చిన్న చిన్న రాజవంశాల ఆధిపత్యంలో ఉండి చివరకు 1639లో బ్రిటిషువారి రాకతో 1947 వరకు బ్రిటిషు పాలనలో ఉండినది. ప్రస్తుత రాష్ట్రం, ప్రత్యేక భాషా రాష్ట్రపునర్వ్యవస్థీకరణ సందర్భంలో ఏర్పడింది. అంతకు ముందు 'మద్రాస్' లేదా 'చెన్నై' అనబడే ఈ రాష్ట్రం 1969 నుంచి 'తమిళనాడు' అయింది. వైష్ణవమత, ప్రవక్తలు,ద్వాదశాళ్వార్లు హిందూ మతపునరుద్ధరణకు ఈ ప్రాంతంలోనే కృషి చేశారు. రామానుజులు వారి జన్మస్థలం మద్రాసుకు సమీపంలో ఉన్న శ్రీపెరంబదూర్. శైవమత ప్రవక్తలు అరువత్తి మూవరు (63) నాయన్మార్లు ఈ ప్రాంతంలోనే హిందూ మత ఉద్ధరణకు కృషి చేశారు. తమిళనాడు అనేక పుణ్యక్షేత్రాలకు ప్రసిద్ధి. కాంచీపురం, మద్రాసు (కపాలీ శైవ క్షేత్రం, పార్థసారధి వైష్ణవ క్షేత్రం), చిదంబరం (నటరాజ), కుంభకోణం, మాయవరం, శ్రీరంగ పట్టణ (శ్రీరంగ నాథ సన్నిధి), తిరుత్తని, పళని, మధుర (మీనాక్షి), తంజావూరు, రామేశ్వరం, కన్యా కుమారి సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు. పూంపుహర్ ప్రాచీన చారిత్రక ప్రాంగణం. మద్రాసు, దక్షిణాదిని ఉన్న ప్రముఖ రేవు పట్టణం, వాణిజ్య కేంద్రం. కోయంబత్తూరు, మద్రాసు, తిరుచిరాపల్లి ప్రధాన పారిశ్రామిక కేంద్రాలు. మద్రాసులోని వళ్లువరు కూటం ఇటీవలి కట్టడం దర్శనీయ స్థలం. తమిళనాడు శాస్త్రీయ సంగీత (కర్నాటక), నృత్య (భరత నాట్య)సంప్రదాయాలకు నిలయం. తమిళభాషా సారస్వాతాలు బహు ప్రాచీనం. సంగం (2000 ఏళ్ళ)కాలంనాటి వాఙ్మయ సంప్రదాయం కలదు.

## తళ్ళికోట

దక్షిణ భారతదేశంలో విజయనగర సామ్రాజ్య పతనానికి కారణభూతమైన తళ్ళికోట యుద్ధం 1565లో జరిగింది. ఆ యుద్ధంలో దక్కన్‌లో ఉన్న ముస్లిం పాలకులంతా ఏకమై విజయనగర పాలకులను ఓడించారు.

## తాంతియా తోపే



ప్రథమ భారతస్వాతంత్ర్య సమరయోధుడు. నానాసాహెబ్‌కు బాల్యమిత్రుడు. భారతదేశం నుంచి బ్రిటిష్ వారిని తరిమికొట్టడానికి సాగిన యుద్ధంలో నానాసాహెబ్‌కు అన్నివిధాల సహాయపడ్డాడు.తాంతియాతోపే ప్రతిభాపాటవాలు కాన్పూరు తిరుగుబాటులో అభివ్యక్తం అయ్యాయి. ఝాన్సీలక్ష్మీబాయి (చూ.)తో కలసి

ఆయన పన్నిన ఎత్తుగడలు విప్లవకారులకు ఉత్తేజాన్ని కలిగించాయి. యుద్ధతంత్రంలో అసమాన ప్రజ్ఞాపాటవాలను ఆయన ప్రదర్శించాడు. అయితే మిత్రద్రోహానికి గురి అయి బ్రిటిష్ వారికి పట్టుబడి, 1859లో తాంతియా తోపే ఉరితీయబడ్డాడు.(చూ.భారతస్వాతంత్ర్య పోరాటం).

## తాజ్ మహలు

ఆధునిక ప్రపంచంలోని ఏడు వింతలలో ఒకటిగా పరిగణించబడుతున్న పాలరాతి మందిరం. మొగల్ చక్రవర్తి షాజహాన్ (చూ.) ప్రియసతి ముంతాజ్ మహల్ స్మృతికి చిహ్నంగా ఈ తాజ్‌మహల్ నిర్మించబడింది. 'ముంతాజ్—ఇ—మహల్' అంటె రాజప్రాసాదాల్లో మిన్న అని అర్థం. ఉత్తరప్రదేశ్‌లోని యమునా నది తీరాన ఆగ్రా పట్టణంలోఈ కట్టడం నిర్మించబడింది. 1632—1653 మధ్య కాలంలో సుమారు 20,000 మంది కార్మికులు, శిల్పులు శ్రమించి దీనిని రూపొందించారు. తాజ్‌మహల్ నిర్మాణంలో తెల్లని పాలరాతిని మాత్రమే ఉపయోగించారు. పునాది పైన వేదికకు మాత్రం ఎర్ర రాయి వాడారు. ఒక్కొక్క భుజం 40 మీటర్లు పొడవు ఉండే ఒక చతురస్రాకార వేదిక మీద ఈ సౌధాన్ని నిర్మించారు. నాలుగు మూలలా నాలుగు ప్రార్థనా గోపురాలు (మినారెట్‌లు) ఉన్నాయి. వీటి ఎత్తు సుమారు 40 మీ. మధ్య డోమ్ ఉంది. దాని ఎత్తు 36 మీ. వ్యాసం 21 మీ. ముస్లిమ్‌ల పవిత్ర గ్రంథమైన ఖొరాన్ నుంచి గ్రహింపబడిన ఖండికల్ని పాలరాతి మీద చెక్కారు. తాజ్‌మహల్ ప్రాంగణంలో సుందరమైన వనాలు


తాజమహల్

ఉన్నాయి. షాజహాన్, అతని ప్రియసతి—ఇద్దరి భౌతిక కాయాలనూ ఇక్కడే సమాధి చేశారు.

## తాతా, జె.ఆర్.డి.

ప్రముఖ పారిశ్రామిక వేత్త. సాహిత్యోపాసకుడు. కళాపోషకుడు, విజ్ఞానాభిలాషి. పూర్తిపేరు జహంగీర్ రతన్‌జీ దాదాబాయ్ తాతా. పారిస్‌లో(ఫ్రాన్స్) 1904 జూలై 29న తాతా జన్మించారు. తండ్రి పార్శీ. తల్లిఫ్రాన్స్ దేశస్థురాలు. తాతా విద్య ఫ్రాన్స్, జపాన్ భారతదేశాలలో జరిగింది.



1922లో తన 18వ ఏట తాతాసన్స్ లిమిటెడ్‌లో ఒక ఉద్యోగిగా చేరాడు. నాలుగేళ్ళ తర్వాత ఆ సంస్థ డైరెక్టరయ్యాడు. 1938లో తాతాస్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌కు ఛైర్మన్‌గా; న్యూ ఇండియా అష్యూరెన్స్ కంపెనీ లిమిటెడ్ వైస్ ఛైర్మన్ అయ్యాడు.1946లో తాతా ఎయిర్ ఇండియా లిమిటెడ్‌కి, 1948లో ఏర్పడిన ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్‌కి ఛైర్మన్, మేనేజింగ్ డైరక్టర్ పదవులను అధిష్ఠించారు. భారతదేశంలో ప్రైవేట్ లైసెన్స్ పొందిన ప్రథమ వ్యక్తి తాతా. 1930లో ఒంటరిగా భారత, ఇంగ్లండుల మధ్య విమానం నడుపుతూ ప్రయాణం సాగించారు.

ఎయిర్ ఇండియా, ఇండియన్ సివిల్ ఏవియేషన్ గోల్డెన్ జూబిలీ సందర్భంగా 1982 అక్టోబరు 15న తాతా తన 78 ఏళ్ళ వయస్సులో కరాచీ—బొంబాయి విమానాన్ని స్వయంగా నడిపి తన మొదటి విమాన యాత్రను మరల ప్రదర్శించారు.

భారతదేశంలో ఇతర కంపెనీలకంటే తాతా కంపెనీలోని సిబ్బందికి అధిక వేతనాలేకాక అనేక సౌకర్యాలు కూడా ఉన్నాయి. తాతా తన కృషికి అనేక అవార్డులను అందుకున్నాడు. కోట్లాది ఆస్తి కలిగిన సంపన్నుడయినప్పటికీ ఆయన బొంబాయిలో సామాన్య జీవితాన్ని గడుపుతున్నారు (1990).

## తానీషా

హైదరాబాదు సమీపమున ఉన్న గోలకొండను రాజధానిగా చేసుకొని తెలుగు దేశమును పాలించిన కుతుబ్‌షాహీ రాజ వంశీయులలో ఆఖరివాడు, ప్రముఖుడు. అసలు పేరు అబుల్ హసన్ కుతబ్‌షాహీ. ఈయన కవితానామం 'తాన్‌శాహ్'; తెలుగులో 'తానీషా' అయింది. ఈయన పరిపాలనా కాలం 1672–1687. హిందూ—ముస్లిము మత సహనమును ప్రోత్సహించి ఆదరించిన మహా చక్రవర్తి. న్యాయాన్యాయం నిర్ణయాలను నిశితంగా చేసేవాడని ప్రసిద్ధి. ఈయన ప్రదర్శించిన మతసహనం కొందరికి నచ్చక ద్రోహచర్యకారణంగా గోలకొండ మొగలాయి వశంకాగా తానీషా దౌలతాబాదులో తలదాచు కుని కొన్నాళ్లకు మరణించాడు. తన కొలువులో ఉన్న కంచర్ల గోపన్న (రామదాసు) అనుమతి లేకుండ భద్రాచల రామాలయ నిర్మాణానికి ప్రభుత్వ ఖజానాలో సొమ్మును వ్యయపరిచినందుకు శిక్షించాడు. ఖర్చు చేసిన డబ్బు తిరిగి చెల్లించగానే రామదాసు (చూ.) భక్తి ప్రవత్తులకు మెచ్చి బందిఖానా నుండి విముక్తి చేశాడు. అక్కన్న, మాదన్న ఈ తానీషా కొలువులో సేనాపతి, ప్రధాని పదవులు నిర్వహించేవారు.

## తాన్సేన్ 1506–1585

సుప్రసిద్ధ హిందుస్తానీ గాయకుడు, వాగ్గేయకారుడు. మొదట గ్వాలియర్ మహారాణి సంస్థానంలో ఆయన సంగీత విద్వాంసుడుగా ఉండేవాడు. హిందుస్తానీ సంగీత సంప్రదాయంలో ఒక కొత్త బాణీని స్థాపించడం తాన్సేన్ ప్రత్యేకత. 1556లో అక్బరు దర్బారులో ఆయన ఆస్థాన సంగీత విద్వాంసుడుగా చేరాడు. అక్కడ ఆయన తన్మయత్వంతో దీపకరాగం ఆలపించి, అందరి ప్రశంసలను అందుకున్నాడు. దర్బారీ, మియాకే తోడి, మియాకే స్వరకల్పనలు సుప్రసిద్ధాలు. గ్వాలియర్ లోని ఆయన సమాధివద్ద నేటికీ పటోడీ ఆరాధనోత్సవాలు జరుగు తున్నాయి.

## తాపత్రయం

భారతీయ సంప్రదాయానుసరించి ధార్మిక వ్యవస్థ మూడు విధాలు. అవి: 1. ఆధ్యాత్మికం; 2. ఆధిభౌతికం. 3. ఆధి దైవికం; ఆధ్యాత్మికం తన దేహేంద్రియాలకు కలిగినది; అధిభౌతికం—తనకంటె ఇతరులైన భార్యా పుత్రులకు కలిగినవిపత్తు; ఆధి దైవికం—అతివృష్టి, అనావృష్టి వంటివి దైవం వలన కలిగినచేటును తనపైనవేసుకొనుట.

## తామర్లేన్ 1336–1405

'కుంటి తైమూర్' అనే మరో పేరుగల మహమ్మదీయ విజేత. యుద్ధాలు చేసి ఆయన ఒక మహాసామ్రాజ్యాన్ని స్థాపించాడు. తార్తార్ మంగోల్ టర్కీ శాఖకు చెందిన చెంఘిజ్‌ఖాన్ వంశీయుడు తామర్లేన్. ఇస్లామ్ మతం పట్ల గట్టి విశ్వాసం కలవాడు. 1369లో సామర్ ఖండ్ సింహాసనం అధిష్ఠించడానికి పూర్వం నుంచే 1358 నుంచి తాను దండయాత్రలు చేయడం ప్రారంభించాడు. ఆయన దాడులకు ఆఫ్ఘనిస్తాన్, పర్షియా, ఆసియా మైనర్ ప్రాంతాలు గురి అయాయి. 1398లో భారతదేశం మీదకు దండయాత్ర చేసి ఢిల్లీని ముట్టడించాడు. తరువాత బాగ్దాద్, డమాస్కస్ ఆయనకు కైవసం అయాయి. ఆ తరువాత చీనా వైపు తన దృష్టిని మళ్ళించాడు. కాని ఆ దాడి ప్రారంభించడానికి ముందే జ్వరపీడితుడై తామర్లేన్ మరణించాడు (1405).

## తాయిలాండ్

ఆగ్నేయాసియాలో తాయి లాండ్ సింధుశాఖ తీరాన ఉన్న రాజ్యం. దీనికి పడమట, వాయవ్యాన బర్మా, తూర్పున, ఈశాన్యాన లావోస్, ఆగ్నేయాన కంపూచియా, దక్షిణాన మలేషియా దేశాలు ఉన్నాయి. 'తాయిలాండ్'అంటే స్వతంత్రదేశం అని అర్థం. 1939 లో ఈ దేశం ఏర్పడింది. రబ్బరు ఉత్పత్తికీ, ఖనిజాలకూ ఈ దేశం ప్రసిద్ధి.




విస్తీర్ణం: 5,13,115 చ.కి.మీ.; రాజధాని నగరం: బాంకాక్; జనాభా: 5,48, 62,000(1988); అధికార భాష: తాయి, ఇంగ్లీష్, చైనీస్, మతో కూడా ఇక్కడ

ప్రజలు మాట్లాడతారు. ప్రజలు పాటించే ప్రధాన మతం బౌద్ధం. క్రైస్తవం, ఇస్లాంకూడ కొద్దిమంది పాటిస్తారు.

వరి, జొన్న, రబ్బరు, చెరకు, ఉష్ణ మండలఫలాలు, కొబ్బరి విస్తారంగా పండుతాయి. పశుసంపద ఎక్కువ. జనపనార పరిశ్రమ ఉంది. జవుళీ, సిమెంటు, పొగాకు, చమురు ఉత్పత్తులు, కాగితం పరిశ్రమ ప్రధాన పరిశ్రమలు. టంగ్‌స్టన్, ఇనుపరాయి, తగరం, మాంగనీస్, ఫ్లోరైట్, జిప్సమ్ మొదలైన ఖనిజాలు ఇక్కడ లభిస్తున్నాయి.

## తిక్కన కొట్టరువు 13వ శతా.

తెలుగు కవిత్రయంలో ఒకరు. భారతంలో విరాటపర్వం మొదలు చివరి వరకూ గల 15 పర్వాలనూ తెలుగుచేసిన మహనీయుడు.



ఈయన తాతగారైన భాస్కరుడు 'సారకవితాభిరాముడు, గుంటూరివిభుడు' తిక్కన తండ్రి కొమ్మన దండనాధుడు. ఖడ్గతిక్కన కవితిక్కనకు పెద్ద తండ్రి కుమారుడు. మనుమసిద్ధి రాజు ఆస్థానంలో తిక్కన మంత్రిగా ఉండే వాడు. ఆంధ్రమహాభారతంలోని ఎక్కువ భాగాన్నేకాకుండా, తిక్కన 'నిర్వచనోత్తర రామాయణం' అనే మరో సరసమైన కావ్యం కూడా వ్రాశాడు. ఆయన తన భారతాన్ని హరిహరనాథునికి అంకితం చేశాడు. కేతన మొదలైన ప్రసిద్ధకవులు తిక్కన గారి శిష్యులు. (చూ. ఎర్రాప్రగడ; నన్నయ; మహాభారతం).

## తిమ్మరుసు

శ్రీకృష్ణదేవరాయల (చూ.) ఆస్థానంలో ప్రధానమంత్రి. సాళ్వ తిమ్మరుసు పూర్తిపేరు. కుశాగ్రబుద్ధి. ప్రజ్ఞాపాటవములు గల మేధావి. రాజకీయ ధురంధరుడుగ కీర్తి ప్రతిష్టలు ఆర్జించాడు. కృష్ణదేవరాయలు తిమ్మరుసును తన పంచమ ప్రాణంగా చూచుకుంటూ ఉండేవాడనీ తనకు రాజ్యం లభించుటకు కారణం తిమ్మరుసేనని అతని ఎడ వినయ విధేయతలు కలిగి భయ భక్తులతో మెలగుచూ అతనిని తన సొంత తండ్రివలె చూచుకుంటూ 'అప్పాజీ' అని పిలుచు చుండెడివాడని ప్రసిద్ధి. చిన్నప్పుడు పేదస్థితిలో ఉన్న తిమ్మరుసు శాస్త్రాధ్యయనం కానించి అప్పటికే వయోవృద్ధుడయి ఉండిన నీతిశాస్త్ర విశారదుడూ, రాజనీతి తంత్రజ్ఞుడూ అయిన చిట్టిగంగనామాత్యుని వద్ద రాజనీతి శాస్త్రములను కూలంకషంగా అభ్యసించారు.

మొదట విజయనగర ఆస్థానంలో సాళువ నరసింహరాయలు వద్ద దండ నాయకుడుగా ఉండి పిదప తుళువ నరసా నాయకుని కొలువులో చేరి అతని కార్యకర్తగానూ, మంత్రిగానూ తన ప్రజ్ఞాపాటవాల్ని ప్రదర్శించాడు. తరువాత వీర నరసింహ రాయల ప్రధానియై కడకు అతని సోదరుడు కృష్ణరాయలు ఆస్థానమున ప్రధానమంత్రి పదవి చేపట్టి అతి సమర్థవంతముగ నిర్వహించాడు. కృష్ణరాయల దండ యాత్రలన్నిటిలోనూ పాల్గొని దిగ్విజయాల్ని సాధించిపెట్టాడు. కాని చివరిదశలో తిమ్మరుసు కృష్ణరాయలు వారి కోపమునకు గురియైనట్లు పోర్చుగీసు సందర్శకుడు న్యూనిజు వ్రాసిన యాత్రా చరిత్రవలన తెలియుచున్నది.

## తిరుక్కురళ్

తెలుగులోని వేమన శతకం వలె తమిళంలో సుప్రసిద్ధమైన నీతి శతకం. కురళ్ అనే ఒక చిన్న ఛందస్సులో ఈ శతకంలోని పద్యాలు కూర్చబడడం వల్లదానికి తిరుక్కురళ్ అనే పేరు వచ్చింది. ధర్మ, అర్థ, కామాలు అనే మూడు పురుషార్థాలనూ గురించి మూడు భాగాలుగా ఈ కావ్యం వ్రాయబడింది. ఈ కావ్యం వ్రాసిన మహాకవి తిరువళ్లువర్.

## తిరుపతి

ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో ఉన్న సుప్రసిద్ధ వైష్ణవ పుణ్యక్షేత్రం. భారతదేశంలోని ముఖ్యంగ దక్షిణాది వారికీ అందునా ఆంధ్రప్రదేశ్‌లోని హిందూ భక్తజనులకు ఇలవేల్పు-శ్రీ వేంకటేశ్వరస్వామి వారి సన్నిధి. సప్తగిరులను దాటి తిరుమల కొండపై నున్నది. ఉత్తర భారతీయులు ఈ స్వామిని 'బాలాజీ' అని వ్యవహరిస్తారు. శ్రీనివాసుడు అనీ, ఏడుకొండలవాడని భక్తజనులు పిలుతురు. మంగళాశాసనం పొందినట్టి 108 దివ్యతిరు

పతులలో ఒకటైన తిరుమల తిరుపతి స్వయంవ్యక్త క్షేత్రములలో ఒకటని భక్తులు విశ్వసిస్తారు. చారిత్రకాధారములను బట్టి క్రీ.శ 10వ శతాబ్దినుండీ ఈ దేవళం విశేషమయిన ప్రశస్తిని పొందినట్లు కనిపిస్తుంది. 16వ శతాబ్దిలో ఈ ప్రాంతమును ఏలిన విజయనగర చక్రవర్తి కృష్ణదేవరాయలు తిరుమల దేవళమును అభివృద్ధి చేయుటలో విశేషకృషి చేసినట్లు తెలుస్తున్నది. ఆలయ వ్యవహారములను చక్క బెట్టుటకు తిరుమల—తిరుపతి దేవస్థానం (టి.టి.డి) కమిటీని ప్రభుత్వం చట్టరీత్యా నియమించును. భారత దేశంలోని వార్షికాదాయం ఎక్కువగాగల దేవళములలో తిరుపతి ఒకటి. ఈ ఆదాయంతో ధర్మప్రచారం, విద్యాసాంస్కృతిక రంగము లందు కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తున్నారు. దర్శనార్థమయి నిత్యమూ వచ్చే భక్తజనులకు దిగువ తిరుపతిలోనూ, తిరుమలలోనూ వసతి సౌకర్యాలను సమకూర్చారు. తిరుమలకు సమీపంలో ఆకాశగంగా, గోగర్భం, పాపనాశం, పాండవతీర్థం వంటి దర్శనీయ స్థలాలు ఉన్నాయి. దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామి దేవళం, కోదండ రామస్వామి గుడి శ్రీ కపాలేశ్వరస్వామి ఆలయం ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు. దిగువ తిరుపతికి 4 కి.మీ. దూరంలో ఉన్న తిరుచానూరును అలివేలు మంగాపుర మందురు. ఇచ్చట పద్మావతీ దేవి అమ్మవారి ఆలయము ఉంది.



శ్రీ వేంకటేశ్వరస్వామివారు

తిరుపతి దేవళం - ఒక దృశ్యం

# తిరుపతి వేంకటకవులు

దివాకర్ల తిరుపతి శాస్త్రి, చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి—వీరిరువురిని కలిపి తిరుపతి వేంకటకవులు అంటారు. ఆంధ్రదేశమంతా సంచారం చేసి ఈ జంట కవులు చేసిన అష్టావధాన(చూ.), శతావధానాలు ఎంతో ప్రఖ్యాతి పొందాయి.




తిరుపతి శాస్త్రి 1872 మార్చి 22న జన్మించారు. తండ్రి వేంకటావధాని, తల్లి శేషమ్మ. వేంకట శాస్త్రి 1870 ఆగస్టు 28న జన్మించారు. తండ్రి కామయ్య, తల్లి చంద్రమ్మ. వీరిరువురూ కాశీ పండితుడు చర్ల బ్రహ్మయ్య శాస్త్రి వద్ద శిష్యరికం చేసి జంట కవులయ్యారు. 19 ఏళ్ళ ప్రాయంలో ఈ జంటకవులు కాకినాడలో మొదట శతావధానం చేసి అక్కడి పండితులనూ ఆంగ్ల విద్యాధికులనూ ముగ్ధులను చేశారు. అది మొదలు ఆంధ్ర దేశంలో తిరుగుతూ అసంఖ్యాకంగా అవధానాలు చేశారు.

ఈ జంట కవులు కాళీ సహస్రం, ధాతురత్నాకరం, సుకన్యా శృంగార శృంగాలు కాష్టకములు అనే సంస్కృత కృతులూ, దేవీ భాగవత పురాణం (అనువాదం) శ్రవణానందం, లక్షణాపరిణయం, ఏలామాహాత్మ, బుద్ధ చరిత్ర అనే తెలుగు కావ్యాలూ రచించారు. శ్రీనివాస విలాస చంపువును తెనుగులోకి అనువదించారు. మృచ్ఛకటికం, ముద్రారాక్షసం, బాల రామాయణం అనే సంస్కృత నాటకాలను తెనిగించారు. భారత కథను 5 నాటకాలుగా వ్రాశారు. ఇవి గాక దంభవామన, సుకన్య, పండితరాజు, అనర్ఘనారదం అనే రూపకాలు, పాణిగ్రహీత, పతివ్రత, శివభక్తి, శివపురాణం, సుశీల, గోదేవి వంటి

ప్రబంధాలు, విక్రమాంక దేవచరిత్ర, చంద్రప్రభ చరిత్ర, హర్షచరిత్ర అనే గద్యకృతులు, గీరతము, గుంటూరు సీమ వంటి పద్య సంకలనాలు, 'జాతక చర్య' నానారాజ సందర్శనం, శతావధాన సారము వంటి పద్య రచనలు వీరి ఇతర కృతులు.

తిరుపతి వేంకటకవులు 'పల్లెటూళ్ళ పట్టుదల' అనే ఒక ప్రహసనం, కామేశ్వరీ శతకం కూడా వ్రాశారు. 1920లో తిరుపతి శాస్త్రి స్వర్గస్థులైన తర్వాత 30 ఏళ్ళు జీవించి వేంకట శాస్త్రి తన రచనలన్నిటిని తిరుపతి వేంకటీయములుగానే ప్రచురించడం చూస్తే వారిరువురి సాహిత్య మైత్రి ఎంతగాఢమైందో అర్థమవుతుంది.

వేంకటశాస్త్రిని ఆంధ్రా యూనివర్సిటీ 'కళా ప్రపూర్ణ' బిరుదుతో గౌరవింపగా,నాటి మద్రాసు ఉమ్మడి ప్రభుత్వం ప్రథమాంధ్ర ఆస్థాన కవిగా సత్కరించింది. 1950 మార్చిలో విజయవాడలో వేంకటశాస్త్రి పరమపదించారు. తిరుపతివేంకటకవులు వ్రాసిన పాండవోద్యగ విజయాలు వంటిపద్యనాటకాలు ఇప్పటికీజనాదరణపొందుతూనే ఉన్నాయి.

## తిరువణ్ణామలై

పంచలింగాలలో అగ్నిలింగం ఉన్న శైవక్షేత్రం. రమణమహర్షి ఆశ్రమం స్థాపించుకున్న పుణ్యక్షేత్రం. మద్రాసునుంచి 125 కిలోమీటర్ల దూరంలో ఇది ఉంది. ఇచ్చట ప్రధాన గోపురానికి 11 అంతస్తులు. ఇంకా అనేక గోపురాలు ఉన్నాయి. ప్రధాన గోపురం శ్రీ కృష్ణదేవ రాయలు నిర్మించాడు. సహస్రస్తంభాల మండపం, పెద్దతటాకం ఉన్నాయి. ఇచ్చట అరుణగిరినాథర్ భక్తుడు ' తిరుప్పుగళు ' అనే పదాలను సుబ్రహ్మణ్యస్వామి మీద పాడాడు. ఇతడు తన పాపాలు పోవడానికి ఈ పదాలు పాడి గోపురం మీద నుంచి క్రిందికి దుముకగా సుబ్రహ్మణ్య స్వామి వచ్చి రక్షించాడని ఐతిహ్యం.

పూర్వం పార్వతి శివుని కోసం ఘోర తపస్సు ఆచరించగా అరుణాచలం నుంచి శివుడు అగ్ని రూపంలో వచ్చి కార్తీక శుద్ధ పూర్ణమినాడు ఆమెను కలిశాడని స్థానిక స్థల పురాణం! నాటి పార్వతి తపస్సును స్మరించిజేస్తూ ఏటేటా 10రోజులు పాటు గొప్ప ఉత్సవాలు చేస్తారు. పూర్ణిమనాడు పెద్ద దీపం 'కార్తీకదీపం' వెలిగిస్తారు. ఇది చాల దూరం వరకూ కనిపిస్తుంది. పార్వతిని ప్రసన్నురాలుని చేసికోడానికి పర్వత శిఖరాగ్రం మీద అగ్నివలె శివుడు అవతరించిన కథను స్మరించు కుంటూ **యాత్రికులనేకులు** ఈ జ్యోతిని దర్శించడానికి వస్తారు. ఈ కొండలో చుట్టూ అనేక గుహలు ఉన్నాయి. రమణాశ్రమం స్టేషన్‌కు 3కి.మీ దూరంలో రమణ మహర్షి ఆశ్రమం ఉంది.

## తిరువనంతపురం

కేరళ రాష్ట్రం రాజధాని తిరువనంతపురం. దీనినే త్రివేండ్రం అని పిలుస్తారు. నగరం ఏటవాలుగా ఉన్న ఒక చిన్న కొండపై ఉండడం చేత వర్షాకాలంలో వర్షాలకు చెత్తా చెదారం కొట్టుకుపోయి పట్టణం పరిశుభ్రంగా ఉంటుంది. తిరువనంతపురం అంటే పవిత్రమైన సర్పముపై పవళించి ఉండే విష్ణువుని నివాస స్థలం అని అర్థం. శ్రీ పద్మనాభ స్వామి దివ్యక్షేత్రమిది. పద్మనాభస్వామి దేవాలయం, కౌడయార్ రాజ భవ నం, కనకున్నూ రాజభవనం, సెక్రటేరి యట్ భవనం, విక్టోరియా జూబిలీ హాల్, యూనివర్సిటీ భవనాలు చూడదగ్గవి. నగర జనాభా: 4,83,086 (1981); శివార్లు కలుపుకుంటే నగర జనాభా: 5,20,125 (1981).

మ్యూజియం చుట్టూ గల సుందరమైన తోటలో గల జంతు ప్రదర్శన శాల భారతదేశంలో అత్యుత్తమమైంది. ఇక్కడే ఆర్ట్ గ్యాలరీ కూడా ఉన్నది. దీనిలో సుప్రసిద్ధ చిత్రకారుడు రాజారవివర్మ మొదలు భారతదేశ, తూర్పు ఆసియా దేశపు చిత్రకారులు రూపొందించిన అపూర్వ వర్ణచిత్ర కళాఖండాలు అనేకం ఉన్నాయి. మ్యూజియం శిల్ప సౌందర్యం అమోఘమైంది. బీచ్ దగ్గరగా ఉన్న అక్వేరియం, అబ్జర్వేటరీ, ప్రాచీన లిఖిత పుస్తక భాండారం, వేలీ సరస్సు సందర్శించదగ్గ ప్రదేశాలు.(చూ. కేరళరాష్ట్రం)

## తిలక్, బాలగంగాధర్ 1856–1920

'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అని చాటిన ప్రముఖ భారతజాతీయ నాయకుడు. మహావిద్వాంసుడు, గొప్ప దేశభక్తుడు. **బాల్—పాల్—లాల్** అని ప్రసిద్ధి పొందిన జాతీయ మహానాయకత్రయంలో **మొదటివాడు.** తక్కిన ఇద్దరూ లాలాలజపతిరాయ్(చూ.), బిపిన్‌చంద్ర పాల్(చూ.). 'స్వరాజ్యం నా జన్మహక్కు దానిని నేను సాధించితీరుతాను' అని తిలక్ ఎలుగెత్తి చాటాడు. 'లోకమాన్యుడు'గా ఆయన ప్రసిద్ధి పొందాడు. 1856

జూలై 23వ మహారాష్ట్రలోని రత్నగిరిలో చిత్పవన బ్రాహ్మణ కుటుంబంలో తిలక్ జన్మించాడు. తండ్రి ఉపాధ్యాయుడు కావడం చేత చిన్నతనంలోనే పాశ్చాత్య భావలచేత ప్రభావితుడుకావడం సంభవించింది. 'దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీ'లో ఉపాధ్యాయుడుగాను(1883), ఫెర్గూసన్ కాలేజీలో ఆచార్యుడుగాను (1885) తిలక్ పనిచేశాడు. గోపాల కృష్ణగోఖలే (చూ.) తిలక్‌కు ఆ కాలేజీలో సహఆచర్యుడుగా ఉండేవాడు. తిలక్ తీవ్రవాది.



గోఖలే మితవాదాన్ని ఆయన విమర్శిస్తూ వుండేవాడు. మరాఠీలో 'కేసరి', ఇంగ్లీషులో 'మహారాటా' అనే వార్తా పత్రికలను తిలక్ నిర్వహించే (1890) వాడు. 1897లో సంభవించిన క్షామ పరిస్థితులు, ప్లేగు వ్యాధి నిర్మూలనలో ప్రభుత్వ ఉదాసీన వైఖరిని అశ్రద్ధను పత్రికాముఖంగా విమర్శించగా తిలక్‌పై 'రాజద్రోహం' (సెడిషన్) కేసు బనాయించి 18 మాసాలు కారాగారవాసశిక్షను విధించారు. మహారాష్ట్రలో శివాజీ జయంతి ఉత్సవాలు, గణపతి ఉత్సవాలు జరిపించి బాలగంగాధర్ తిలక్ సాంఘికంగానూ, రాజకీయంగానూ ప్రజలలో గొప్ప చైతన్యం కలుగజేశాడు. స్వదేశీ ఉద్యమాన్ని బలంగా సమర్థించాడు. ప్రజాబాహుళ్యంతో సత్సంబంధాలు ఏర్ప రుచుకోమని సాటి నాయకులకు బోధించేవాడు. ఒకసారి ఖుదీరామ్ బోస్, ప్రఫుల్లచంద్ర చాకీ అనే యువకులు ముజఫర్ పూర్‌లో బాంబు ప్రయోగించగా తిలక్ ఆ వార్తను శ్లాఘిస్తూ తన కేసరి పత్రికలో వ్రాశాడు. బ్రిటిష్ వారు ఆయనపై రాజద్రోహం అభియోగం తెచ్చికోర్టులో విచారణ జరిపి 6 ఏళ్ళు శిక్షవిధించి, బర్మాలోని మాండలే జైలుకు పంపారు (1908). మాండలే జైలులో ఉండగా 'గీతా రహస్యం' పేర భగవద్గీతకు తిలక్ గొప్ప వ్యాఖ్యానం రచించాడు. ఆ గ్రంథంలో కర్మ ప్రాధాన్యాన్ని తిలక్ సమర్థించాడు. 1914లో జైలు నుంచి విడుదలై స్వయం పరిపాలన (హోమ్‌రూల్) ఉద్యమాన్ని దేశం అంతటా విస్తరింపచేశాడు. జాతీయ పోరాటంలో హిందూ—ముస్లిములను తాత్కాలికంగానైనా సమైక్యపరచడానికి 1916లో లక్నో ఒప్పందాన్ని ముస్లిములతో తిలక్ కుదుర్చు కున్నాడు. 'ఆర్కిటిక్ హోమ్ ఇన్ ది వేదాస్', 'వేదిక్ క్రోనాలజీ' అండ్ వేదాంగజ్యోతిషం అనే గ్రంథాలు తిలక్ మేధాశక్తికి నిదర్శనాలు. 1920లో తిలక్ నిర్యాణం చెందినప్పుడు భారతజాతి అంతా తమ ఆత్మీయుణ్ణి కోల్పోయినట్లు విలపించింది. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం).

## తుంగభద్రా నది

ఆంధ్రప్రదేశ్—కర్నాటక రాష్ట్రాల్లో ప్రవహిస్తున్న తుంగభద్రా నది 'తుంగ, భద్ర' అను రెండు నదుల కలయిక. వరాహ పర్వతశ్రేణి లోనూ, గంగమూల అనే చోట ఈ రెండు నదులు పుట్టి ఈశాన్యం వైపుగా ప్రవహించి ఒకే నదిగా కలిసి పోయి కర్నాటక సరిహద్దు దాటి కర్నూలు సమీపంలో కృష్ణానది (చూ.)లో పడుతుంది. 640 కి.మీ. నిడివి గల తుంగభద్రకు ఉపనదులు వరదానది, వేదవతినది. తుంగభద్రా నదీజలం త్రాగటానికి బహురుచిగా ఉంటుందని ప్రసిద్ధి. ఈ నదీ తీరాన ఉన్న శృంగేరీ, హంపి, హరిహర పుణ్యక్షేత్రాలు ప్రసిద్ధి కలవి. హొస్పెట్టు వద్ద తుంగభద్ర నదిపై డామును కట్టి జల విద్యుత్తును ఉత్పత్తి చేసి ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలు పంచుకుంటున్నాయి. పంటనీరు కూడా రెండు రాష్ట్రాలకు చెందిన పొలాలకు అందుతూంది .

## తులసీదాసు

క్రీ.శ. 16వ శతా.

హిందీ భాషలో మహాకవి. మహా భక్తుడు. హిందీ రామాయణము 'రామ చరిత మానస్' రచయిత. ఉత్తరప్రదేశ్‌లోని లాజాపురంలో జన్మించాడు. తండ్రిపేరు



ఆత్మారామ్. తల్లి హులసీ. భార్యపేరు రత్నావళి. ఈయన రచనలలో కడఖారామాయణ, కవిత్తరామాయణ, కుండలీయరామాయణ, కృష్ణగీతావళీ, గీతావళీ, ఛందా వలి, ఛప్పయరామాయణ, జానకీమంగళ, ఝూల్నా రామాయణ, దోహావళీ, పార్వతీ మం గళ, బరవైరామాయణ, రామ చరిత మానస, రామశలకా, రామ సత్సంగి, రోటరామాయణ, వైరాగ్యనందిని, వినయపత్రిక, హనుమద్బాషుక ప్రధానమైనవి.

## తువాలు దీవులు

పసిఫిక్ మహాసముద్రంలో ఫిజీదీవుల సమీపంలో ఉన్న ఒక మిక్కిలి చిన్న ద్వీప రాజ్యం. వీటిని పూర్వం 'ఎల్లిసే' దీవులు అనేవారు. 1979లో బ్రిటిషు వారి వలస ఆధిపత్యం నుంచి విముక్తిని పొంది స్వతంత్ర రాజ్యం అయింది. పాలినీషియన్ జాతులు వారు ఎక్కువ.

విస్తీర్ణం: 24 చ.కి.మీ; జనాభా: 8700 (1988); రాజధాని: ఫోంగాఫాలే(ఫునాఫుటీ అటాల్ మీద ఉన్నది); అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు క్రైస్తవులు. కొబ్బరి ముఖ్యమైన పంట. ఎండు కొబ్బరి, తపాలా బిళ్ళలు దేశ ఆర్థిక వ్యవస్థకు మూలాలు.

## తూర్పు కనుమలు

దక్షిణ భారతదేశంలో తూర్పు మైదానం వెంబడి గుట్టలు, మిట్టలుగా వ్యాపించి ఉన్న కొండల వరుస. ఉత్తరాన ఒరిస్సాలోని గంజాం జిల్లాలో ప్రారంభమై ఆంధ్రకోస్తా ప్రాంతం ద్వారా దక్కను పీఠభూమి వరకూ వ్యాపించి ఉన్న పర్వత శ్రేణి ఇది. ఎత్తైన శిఖరం మహేంద్రగిరి. దాని ఎత్తు 1,500 మీటర్లు.

## తూర్పు గోదావరి జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. ఇది తూర్పు కోస్తా జిల్లా. 16° 30′ 18° 30′ ఉ. అక్షాంశ 81° 30′ 83° 30′ తూ. రేఖాంశల మధ్య ఈ జిల్లా ఉంది. దీనికి తూర్పున, దక్షిణాన బంగాళాఖాతం, ఉత్తరాన మధ్యప్రదేశ్, విశాఖ జిల్లా, పశ్చిమాన ఖమ్మం, పశ్చిమ గోదావరి జిల్లాలు ఉన్నాయి.

విస్తీర్ణం: 10,807 చ.కి.మీ; జనాభా: 37,01,714 (1981), జిల్లా కేంద్రం: కాకినాడ. రాజమండ్రి, అమలాపురం, తుని ఇతర ప్రధాన పట్టణాలు. కాకినాడ చిన్న తరహా రేవు పట్టణం.

ఈ జిల్లా పశ్చిమాన మెట్ట ప్రాంతం, తూర్పున సారవంతమయిన డెల్టా భూమి. జిల్లాలో ప్రవహిస్తున్న ప్రధాన మయిన నీటి వనరు గోదావరినది (చూ.). కాటన్ బరాజ్ (చూ.) సెంట్రల్ డెల్టా, తూర్పు డెల్టా ప్రాంతాలకు పంటనీటిని సరఫరా చేస్తూంది. యేలేరు చిన్న నీటి వనరు.

వరి ప్రధానమయిన పంట. కొబ్బరి, చెరకు పొగాకు, నువ్వులు, అపరాలు వాణిజ్య పంటలు. మామిడి, బత్తాయి, జామ సపోట పండ్లతోటలు విరివిగా ఉన్నాయి. మామిడి రసాలకు (పంచదార కలశ చెరుకురసం, కొత్తపల్లి కొబ్బరి)ఈ జిల్లా ప్రసిద్ధి. చీనా, బంకమన్ను, మెగ్నీషియమ్, సున్నపురాయి, కురవిందం, చమురు వాయువు (రాజోలు, నఖినేటిపల్లి, తాటిపాక)ఈ జిల్లాలోని ముఖ్యమైన ఖనిజ సంపదలు. గొల్లల మామిడాడలో లభించే కురవిందం ఖనిజం ఆధారంగా రాజమండ్రిలో క్రూసిబిల్ పరిశ్రమ సాగు తూంది. కాకినాడ ఎరువు కర్మాగారాలకు, మత్స్య పరిశ్రమకు, బోట్ యార్డ్‌కు ప్రసిద్ధి. రాజమండ్రి వద్ద గోదావరి నది మీద మూడు పెద్ద రైలు వంతెనలున్నాయి. వీటిలో ఒక దానిపైన రోడ్డు సౌకర్యం కూడా ఉంది. కోనసీమ(చూ.) ప్రకృతి సౌందర్యంతో కన్నుల విందుచేస్తుంది. కొబ్బరి తోటలు ఇక్కడఎక్కువ. రోడ్డు, రైలు, పడవరవాణాసౌకర్యాలు పుష్కలంగాఉన్నజిల్లా. కోనసీమకుమాత్రం రైలుసౌకర్యంలేదు.

రాజమండ్రిలోని కోటిలింగాలు, ద్రాక్షారామ భీమేశ్వరాలయం, ముమ్మడివరం(బాలయోగి- ఈయన సిద్ధిపొందారు), అంతర్వేది (చూ.), పిఠాపురం కుక్కుటేశ్వరాలయం జిల్లాలోని ప్రధాన పుణ్యక్షేత్రాలు, ధవళేశ్వరం



లోని కాటన్ బరాజ్, గన్నవరం వద్ద ఉన్న ఆక్వెడక్టు వినోద పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి. పంపానది తీరాన ఉన్న అన్నవరంలో శ్రీ సత్యనారాయణస్వామి సన్నిధి ఉంది. అశేష. భక్తజనులు శ్రీ సత్యనారాయణస్వామి వ్రతాలు, పూజలుచేసికొనడానికి వస్తూ ఉంటారు. 12 ఏళ్ళ కొకసారి వచ్చే గోదావరి పుష్కరాలకు దేశం నలుమూలల నుంచి యాత్రికులు రాజమండ్రిలోని పుష్కరం రేవుకు వస్తూ ఉంటారు.

## తెనాలి రామకృష్ణకవి

చూ. రామకృష్ణకవి, తెనాలి

## తెలంగాణా

ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రధాన భౌగోళిక భాగాలలోను ఒకటి. మిగతావి కోస్తా ప్రాంతం, రాయలసీమ. పూర్వపు నిజాం సంస్థానం (హైదరాబాదు రాష్ట్రం)లోని తెలుగు మాట్లాడే ప్రాంతం ఇది(చూ. నిజాం). ఆంధ్రప్రదేశ్‌లోని 10 జిల్లాలు తెలంగాణాలో ఉన్నాయి. అవి: హైదరాబాదు జిల్లా, రంగారెడ్డి జిల్లా, మెదక్ జిల్లా, నిజామాబాద్ జిల్లా, ఆదిలాబాద్ జిల్లా, కరీంనగరం జిల్లా, మహబూబ్ నగరం జిల్లా, వరంగల్లు జిల్లా, ఖమ్మం జిల్లా, నల్గొండ జిల్లా. వీటికి సముద్ర తీరం లేదు. (ఆయా జిల్లాల వివరాలు అకారాది క్రమంలో చూడనగును)

## తెలుగుతల్లి

మా తెలుగుతల్లికి మల్లెపూదండ అన్న చరణంతో సుప్రసిద్ధకవి శంకరంబాడి సుందరాచారి తెలుగు దేశ ప్రశస్తిని కొనియాడుతూ రచన చేసిన విజయగీతికకు సుప్రసిద్ధ రూపశిల్పి గణపతి స్థపతి 'తెలుగుతల్లి'ని 1986లో ఒక స్త్రీ మూర్తిగా సాధికారిక రూపకల్పన చేశారు. ఆ గీతికలోని భావాలు స్ఫురించేలాగున తెలుగుతల్లి మూర్తికి రూపు రేఖలు దిద్దేరు. పెన్నిధులు, జీవనదులూ అయిన కృష్ణా, గోదావరి, పెన్నా నదుల జలాలకు ప్రతీకగా నిండుకుండ పూర్ణకుంభం ఆంధ్రప్రదేశ్ లాంఛన చిహ్నం ఆ స్త్రీ మూర్తి కుడిచేతిలో ధరింపచేశారు స్థపతి. పూర్ణకుంభం మీది మామిడి ఆకులు, టెంకాయ శుభాన్ని పలుకుతూ ఆంధ్రప్రదేశ్ 'అన్నపూర్ణ' అని స్ఫురింపచేస్తున్నాయి. వామహస్తమున వరికంకి తెలుగునేల నాలుగు చెరగులా పండుతున్న బంగారు పంటలను స్ఫురింపజేస్తున్నాయి. మల్లెపూదండ కంఠాభరణమయి ముఖమున మందహాసం చిరునవ్వులు తొణికిసలాడుతున్నాయి. ఈ తెలుగుతల్లి శిల్ప విగ్రహాన్ని రాష్ట్ర రాజధాని హైదరాబాదులో బుద్ధపూర్ణిమ ప్రాంగణానికి సమీపంలో ప్రతిష్ఠించారు.

మా తెలుగు తల్లికి
మల్లెపూదండ
మా కన్నతల్లికి
మంగళారతులు

కడుపులో బంగారు
కనుచూపులో కరుణ
చిరునవ్వులో
సిరులు
దొరలించు
మా తల్లి

గలగలా గోదారి
కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ
పరుగులిడుతుంటేను

బంగారు పంటలే
పండుతాయీ
మురిపాల ముత్యాలు
దొరలుతాయీ

అమరావతీ నగర
అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో



తారాడు నాదాలు
తిక్కయ్య కలములో
తియ్యందనాలూ
నిత్యమై నిఖిలమై
నిలిచియుండేదాక

రుద్రమ్మ
భుజశక్తి
మల్లమ్మ
పతిభక్తి
తిమ్మరుసు
ధీయుక్తి

కృష్ణరాయల కీర్తి
మా చెవుల
రింగుమని
మారుమ్రోగేదాక

నీ ఆటలే ఆడుతా
నీ పాటలే పాడుతా
జై తెలుగు తల్లీ!
జై తెలుగు తల్లీ!!

— శంకరంబాడి
సుందరాచారి

## తేజ్ బహాదూర్ సింగ్

చూ. గురుగోవింద్ సింగ్

## తైమూరు

చూ. తామర్లేన్

## తోడర్‌మల్లు

రాజకీయ ధురంధరుడు. అక్బర్ (చూ.) చక్రవర్తికి ప్రధాన మంత్రి. అక్బర్ కొలువులో మొదట ఒక చిన్న ఉద్యోగంలో చేరి తన ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించి,

మన్ననలందుకుని పైకి వచ్చిన ప్రతిభావంతుడు. అక్బర్ పాలనలో తలఎత్తిన తిరుగుబాట్లను చాకచక్యంగా అణచి వేశాడు. భూమిశిస్తు విధానాన్ని మొట్ట మొదట రూపొందించిన మేధావి. తోడర్‌మల్లు ఏర్పాటు చేసిన భూమిశిస్తు విధానమే తరువాతి పాలకులకు మార్గదర్శక మయింది. అక్బర్ దర్బారులో ఈతడు ఆర్థిక మంత్రి పదవిని నిర్వహించేవాడు. భూమి శిస్తు లెక్కలు పారసీక భాషలో వ్రాయాలనే నిర్బంధం వలన హిందువులు సైతం పారసీక భాషను నేర్చుకోవలసి వచ్చింది. అక్బర్ కొలువులో తోడర్ మల్లు అత్యంత దక్షతగల పాలకుడుగా కీర్తి గడించాడు. రాజా తోడరుమల్లుగా ప్రసిద్ధి చెందాడు.

## తోరుదత్తు 1856–1877

ఇంగ్లీషు భాషలో సుప్రసిద్ధ కవయిత్రి. ఈమె భారతీయ మహిళ. వంగదేశంలో 1856 మార్చి 4వ తేదీన తోరుదత్తు జన్మించింది. ఫ్రెంచి, ఆంగ్ల భాషలలో కావ్యాలు రచించి మంచి కవయిత్రిగా పేరు పొందింది. ఇంగ్లండు, ఫ్రాన్స్ సాహిత్య విమర్శకులు ఈమె కవితలను ఘనంగా కొని యాడారు. ఈమె ఫ్రెంచి కవుల పద్యాలను ఆంగ్లంలోకి అనువదించింది. 1871లో విక్టర్ హ్యూగో ఫ్రెంచ్ పార్లిమెంటులో ఉపన్యసిస్తూ చెప్పిన విషయా లను ఈమె ఆంగ్లంలోకి అనువదించింది. చిన్న వయసులోనే (1877) తోరుదత్తు మరణించింది. అయినా ఆ స్వల్ప జీవిత కాలంలోనే ఆంగ్ల కవ యిత్రిగా ఆమె అఖండమైన ఖ్యాతిని ఆర్జించింది.

## తోలుబొమ్మలాట

ఆంధ్రప్రదేశ్‌లోని సుప్రసిద్ధ సంప్రదాయ జానపద రంగస్థల కళారూపం. క్రీ.పూ. 6వ శతాబ్దంనుండీ ఈ కళారూపం ఉన్నట్లు తెలుస్తున్నది. పండితారాధ్య చరిత్ర (13వ శతాబ్దం)లో దీని ప్రస్తావన కనిపిస్తున్నది. తోలుతో తయారుచేసిన రంగుల బొమ్మలు తెల్లటి గుడ్డపై పెట్టి వెనుకనుంచి ఆడించే నాటకకళ. బొమ్మలు 30 సెం.మీ. నుండి రెండు మీటర్లు పొడవు కలిగి ఉంటాయి. కథలనుబట్టి బొమ్మల సంఖ్య పదినుండి ముప్ఫయి వరకు ఉంటాయి. బొమ్మ ఆరు, ఎనిమిది భాగాలుగా ఉండి చేతులు, కాళ్ళు, తల, మొండెం విడిగా సంధింపబడి ఉంటాయి. కదలికలకు వీలుగా ఉంటాయి. కళాత్మకంగా కన్నాలు బొమ్మనిండా ఉంటాయి. ఇద్దరు ముగ్గురు బొమ్మలు తెరపై ఆడిస్తూ ఉంటే మరొక ఇద్దరు హార్మనీ, మద్దెల వాయిస్తూ కథాగానం చేస్తూ ఉంటారు. ఆడించే పాటకు అనుగుణంగా తెరపై బొమ్మలు కదులుతూ ఉంటే చూడముచ్చటగా ఉంటాయి. ఎన్నుకునే కథలు సంప్రదాయంగా రామాయణంనుండి సుందరకాండ, లంకాదహనం, మైరావణ, మహాభారతం నుండి కీచకవధ, విరాట పర్వం, దక్షిణ గోగ్రహణం, నుంచి కథలు రాగయుక్తంగా మధ్య మధ్య పిట్టకథలతో ఉంటాయి. కథలో మధ్య మధ్య విసుగును నివారించ డానికి కేతిగాడు, బంగారక్క హాస్య ప్రహసనాలు ఉంటాయి. జుట్టు పోలిగాడు, గంధోలిగాడు, అలాటప్ప గాడు వంటి హాస్యపాత్రలను కూడా తెరపై ప్రవేశపెట్టి హాస్యాన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గాంధీజీ శత జయంతి (1969) సందర్భంగా గాంధీజీ హరిజనోద్ధరణ కథ తోలుబొమ్మల రూపకాన్ని ప్రత్యే కంగా తయారుచేయించి ప్రదర్శించారు. ప్రస్తుతం (1990) మద్రాసులోని అడయారులో ఉన్న కేంద్ర చర్మ పరిశోధనా సంస్థ (సి.ఎల్.ఆర్.ఐ.)లో తోలుబొమ్మల విభాగాన్ని స్థాపించి కళను అభివృద్ధి చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడ సమీపంలో మాధవపట్నం, నెల్లూరుజిల్లా ఆత్మకూరు సమీపంలో డి.సి. పల్లెలోనూ, నిమ్మలకుంట (అనంత పురం), విజయనగరాల్లోనూ సంప్రదాయ తోలుబొమ్మ కళా కారులు ఉన్నారు.


తోలుబొమ్మలు

## త్యాగయ్య 1767–1847

సుప్రసిద్ధ వాగ్గేయకారుడు. కర్ణాటక సంగీతానికి పితామహుడు. నేటి తమిళనాడు రాష్ట్రంలోని తంజావూరు జిల్లాలో కావేరీ నదీ తీరాన వున్న తిరువాయూరు గ్రామంలో రామ బ్రహ్మం, సీతమ్మల కుమారుడుగా క్రీ.శ. 1767 మే నెల 4న త్యాగయ్య జన్మించాడు. తల్లి దండ్రులు రామభక్తులు. తల్లి పురందరదాసు కీర్తనలను పాడుతూ ఉండేది.త్యాగయ్య గురువు శొంఠి రమణయ్య. అప్పటికే స్వంతంగా కీర్తనలు అల్లేవాడు. ఈయన అల్లిన 2,400 కీర్తనలు పాడుతూ ఉంఛవృత్తి చేసుకుంటూ ఉండేవాడు. ఈయన సంగీత రచనలలో సాహిత్యంపాలు ఎక్కువ. 72 మేళకర్త రాగాలలోనూ కృతులను రచించాడు. ఈయన 'ఘనరాగ పంచరత్న' కీర్తనలు అత్యంత ప్రఖ్యాతి గాంచినవి. ఈ కీర్తనలన్నియు ఆదితాళము లోనివే. 1. నాటరాగమున 'జగదానందకారక' అను దానిలో చరణముల పొందిక, రాగవిస్తరణకు యోగ్యమైనది. ఇందలి భావములు వేదాంత ఖండములు. 2. గౌళరాగమున 'దుడుకుగల నన్నే దొరకొడుకు బ్రోచెరా' అను దానిలో మానవుడు చేయు పాపములనుండి తరించుటకు మార్గమును సూచించాడు. 3. ఆరభి రాగమున 'సాధించెనే ఓమనసా' అను దానిలో దమ శమాదిగుణముల అలవరచు కొనవలయునను బోధ గలదు. 4. వరాళిరాగమున 'కన కనరుచిరా కనకవసన' అనుదానిలో శ్రీరాముని ధ్యానించుకొలదీ ఉత్సాహము, ప్రగతి మార్గం అధికమగుననే సూచన కలదు. 5. శ్రీరాగమున 'ఎందరో మహాను భావులు' అను దానిలో మంచి వారిలో సుగుణముల గ్రహింపు నేర్పు గలదని తెలిపాడు. 'నౌకా చరిత్ర' ఈయన రచనలలో నృత్యనాటిక. 'కాకాచర్రో' ఈయన రచించన సుప్రసిద్ధమైన యక్షగానం. 1847 పుష్య-శుద్ధ దశమినాడు త్యాగయ్య సిద్ధి పొందారు. కావేరీ నది వద్దున తిరువాయూరులో నిర్మితమైన త్యాగరాజ సమాధి వద్ద నేటికీ ఏటేట ఆయన ఆరాధనోత్సవాలు అత్యంత వైభవంగా జరుగుతున్నాయి.



## త్రిగుణాలు

మానవులలో సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ప్రధానంగా ఉంటాయని భారతీయ మనస్తత్వ శాస్త్రవేత్తలు పేర్కొన్నారు. శాంత స్వభావం గల వారిలో సత్వగుణం, ఉద్ధత స్వభావం గలవారిలో రజోగుణం, మందమతులైన వారిలో తమోగుణం ప్రాధాన్యం వహిస్తూ ఉంటాయి. సత్వ రజ స్తమోగుణాలలో ఏగుణం అధికంగా ఉన్న వారు ఎలా ప్రవర్తిస్తారో, వారు ఎలాంటి ఆహారాన్ని ఇష్టపడతారో భగవద్గీతలో వివరంగా వర్ణించబడింది.

## త్రిపిటకాలు

బౌద్ధధర్మోపదేశాలు సంగ్రహించబడిన గ్రంథాలు. బుద్ధుడు మహాపరినిర్వాణం చెందినతరువాత రాజగృహంలో ఒక బౌద్ధ భిక్షువుల మహాసభ ఏర్పాటు చేయబడింది. దానిలో బౌద్ధమత సిద్ధాంతాలను సంగ్రహించే 'సుత్త పిటకం', సంఘంలో పాలించదగిన నియమాలను సంగ్ర హించే 'వినయపిటకం' కూర్చబడ్డాయి. తరువాత కొంత కాలానికి వైశాలీ నగరంలో రెండవ 'మహాసంగీతి' జరిగింది. ఆ సదస్సులో వెనుకటి రెండు పిటకాలను పునస్సంశోధితం చేశారు. అశోకుని రాజ్యకాలంలో 'తిస్సామోగ్గలి పుత్రుడి' అధ్యక్షతను పాటలీ పుత్రంలో మూడవ సంగీతి జరిగింది. దానిలో 'అభిధమ్మపిటకం' అనే మూడవ పిటకం కూర్చబడింది. ఆ విధంగా బౌద్ధులకు ప్రామాణిక గ్రంథాలయిన త్రిపిటకాల సంకలనం పూర్తి అయింది. ఈ త్రిపిటకాలలో బుద్ధుని రచనలు ఏవో ఆయన శిష్యుల రచనలు ఏవో స్పష్టంగా నిర్ణయించడం సాధ్యం కాదు.

## త్రిపుర రాష్ట్రం

భారత దేశానికి ఈ చిన్న రాష్ట్రం ఒక అంతర్జాతీయ సరిహద్దు. దీనికి ఈశాన్యాన అస్సాము, మిజోరామ్ రాష్ట్రాలు ఉన్నాయి. తక్కిన అన్ని వైపులా బంగ్లాదేశ్ ఉంది.




1300 ఏళ్ళ చరిత్రగల ఈ ప్రాచీన హిందూ సంస్థానం, భారత దేశానికి స్వాతంత్ర్యం (1947)వచ్చిన తరవాత 1949లో భారతదేశంలో విలీనమయింది. 1956 నుంచీ కేంద్రపాలిత ప్రాంతంగా ఉండి, 1972లో పూర్తి స్థాయి రాష్ట్ర ప్రతిపత్తిని పొందింది.

విస్తీర్ణం: 10,486 చ.కి.మీ. జనాభా:20,53,058 (1981) రాజధాని: అగర్తలా; అధికార భాష: బెంగాలీ; ప్రజలు కాక్‌బార్క్, మణిపురీ భాషలు కూడ మాట్లాడతారు. వరి, గోధుమ, నూనె గింజలు, చెరకు, జూట్‌నార, మెస్టానార, బంగాళదుంపలు ముఖ్యమయిన పంటలు. ఈ రాష్ట్రంలోని ఆదిమ జాతులు చేనేతలో నైపుణ్యం గలవారు. పట్టు పరిశ్రమకు ఈ రాష్ట్రం ప్రసిద్ధి.

వినోద పర్యాటకులను ఆకర్షించే దర్శనీయ స్థలాలలో నిమాహల్, సిఫాహిజాలా, దుంబార్ సరస్సు, కమలా సాగర్, జంపయి కొండ, ఉనాకోటి, మాతబారీ పేర్కొన దగినవి.

## త్రిమూర్తులు

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను త్రిమూర్తులు అంటారు. బ్రహ్మకు సృష్టిచేసే పనీ, విష్ణువుకు ఆ సృష్టిని పాలించేపనీ, ఈశ్వరుడికి సృష్టిని సంహారం చేసే పనీ అప్పగించబడ్డాయి. వాణీ, లక్ష్మీ, పార్వతులు వరుసగా ఈ త్రిమూర్తుల ధర్మపత్నులు.

## త్రిలింగ

సుప్రసిద్ధ శైవ క్షేత్రాలయిన—శ్రీశైలం, కాళేశ్వరం, ద్రాక్షారామ ప్రాంతాల మధ్య ప్రదేశం. కావున దీనికి త్రిలింగ దేశమని ఒకప్పటి వ్యవహారం. ఆ 'త్రిలింగ' శబ్దమే కాలక్రమేణా 'తెలుంగు' తెనుంగుగా మారి ఆ తరువాత తెలుగు—తెనుగు అయి కడకు తెలుగు—తెనుగుగా రూపొందినదనీ తెలుస్తున్నది.

## త్రివేణి

చూ. ప్రయాగ

## త్రిశంకు స్వర్గం

చూ. విశ్వామిత్రుడు

## త్రేతాగ్నులు

దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, ఆవహయాగ్ని ఈ మూడింటినీ 'త్రేతాగ్నులు' అంటారు. ఈ మూడు అగ్నులను ఆరాధించడం బ్రహ్మకు విహితమైన ధర్మం. అలా నిత్యం అగ్నిని ఆరాధించే బ్రాహ్మణుణ్ణి 'నిత్యాగ్ని హోత్రి' అంటారు.

## థార్ ఎడారి

ఉత్తర భారతదేశంలో ఆరావళీ పర్వతశ్రేణికి నైర్రుతిగా రాజస్థాన్‌లో ప్రారంభమయి, సింధునదీ మైదానం వరకూ విస్తరించి ఉన్న ఎడారి. దీనికి పంజాబు రాష్ట్రం ఉత్తర సరిహద్దు. దీని విస్తీర్ణం: 1,92,000 చ.కి.మీ. ఇది మిక్కిలి అనావృష్టి ప్రాంతం. ఏడాదికి వర్షపాతం 25 సెం.మీలకు మించదు. పచ్చిక ఉన్నచోట గొర్రెల పెంపకం సాగిస్తున్నారు. ఇటీవల గాంధీ సాగరడాము నిర్మించి, రాజస్థాన్ కాలువ వ్యవస్థ ద్వారా ఈ ఎడారిలోని వ్యవసాయయోగ్యమయిన నేలలకు పంటనీటిని సరఫరా చేసి పంటలు పండిస్తున్నారు.

## దండి మహాకవి క్రీ.శ. 660–680

దండి మహాకవి దాక్షిణాత్యుడు. కాంచీపురంలోని ఒక పల్లవరాజు ఆస్థానాన్ని అలంకరించినట్లు తెలుస్తూంది. భారవి మహాకవికి ఈయన 'ప్రపౌత్రుడు' (పుత్రుని పుత్రుడు) అని భావిస్తున్నారు. ఈయన జీవించి ఉన్నకాలం విషయంలో పండితుల మధ్య ఏకాభిప్రాయం లేదు. డా. కాణే దండి మహాకవి క్రీ.శ 660–680 ప్రాంతంలో జీవించి ఉండవచ్చునని నిర్ణయించారు.

'కావ్యాదర్శం' అనే అలంకార శాస్త్ర గ్రంథం, 'దశకుమారచరిత్ర' అనే గద్య ప్రబంధం దండి మహాకవి రచించాడని అందరూ అంగీకరిస్తున్నారు. అయితే ఈయన వ్రాసిన మూడవ గ్రంథం విషయంలో మాత్రం అభిప్రాయబేధాలున్నాయి. కొందరు 'మృచ్ఛకటికం' అంటున్నారు. ఎక్కువ మంది అది 'అవంతి సుందరి కథ' అంటున్నారు. 'దండినః పదలాలిత్యం' అనే శ్లోకంలో భారవి కాళిదాసు, మాఘకవులతో సరిమానంగా 'దండి' స్మరింపబడ్డాడు. లలితలలితాలైన పదాలను కూర్చడంలో 'దండి మహాకవి' సిద్ధహస్తుడు.

## దండీ యాత్ర

చూ.ఉప్పు సత్యాగ్రహం

## దక్షిణ అమెరికా

పశ్చిమార్ధగోళంలో దక్షిణంగా ఉన్న భూఖండం. మధ్య అమెరికాలోని పనామాకు దక్షిణంగా ఉన్న దేశాలన్నీ వెస్ట్ ఇండీస్ కలుపుకుని 'దక్షిణ అమెరికా' అని వ్యవహరింపబడే ప్రాంతానికి చెందినవియే. దక్షిణ అమెరికాలో మాట్లాడే స్పేనిష్, పోర్చుగీస్, ఫ్రెంచ్, ఇంగ్లీషు (బహుకొద్ది) భాషాలిపులన్నిటికీ లాటిన్ లిపి ప్రాతిపదిక గావున వీటిని 'లాటిన్ అమెరికా' అని కూడా వ్యవహరిస్తూ ఉంటారు. అర్జెంటీనా, ఈక్వడార్, ఉరుగ్వే ఎల్‌సాల్వడార్, కొలంబియా, కోస్టరికా, క్యూబా, చిలీ, గయానా, గ్వాతెమాలా, డొమినికన్ రిపబ్లిక్, నికరగ్వా, పనామా, పరాగ్వే, పెరూ, పోర్టోరికో, ఫ్రెంచ్ గయానా, బెలిజే, బొలీవియా, మెక్సికో, వెనిజ్యులా, వెస్ట్ ఇండీస్ దీవులు, సురినామ్, హయిటీ, హూండురాస్ మొదలయినవి దక్షిణ అమెరికాలో చేరి ఉన్నాయి. వీటి జనాభా (1984) సుమారు 40 కోట్లు. దాదాపు ఇవన్నీ స్వతంత్ర గణరాజ్యాలయినాయి. వీటి వివరాలు అకారాది క్రమంలో చూడనగును.

## దక్షిణ ఆఫ్రికా

ఆఫ్రికా దక్షిణపు కొసను ఉన్న ఒక గణ రాజ్యం. మహాత్మాగాంధీ అక్కడ భారతీయుల పరిస్థితిని మెరుగు పరచడానికి మొట్టమొదట సత్యాగ్రహం జరిపిన దేశం. ఇప్పటికీ తెల్లవారు కానివారు (రంగు జాతుల వారు) రాజకీయంగా రెండవ తరగతి పౌరులుగా అక్కడ అగచాట్లు పడుతున్నారు. వర్ణ విద్వేషం, (అపార్థీడ్) ప్రబలంగా ఉన్న రాజ్యం. ఆదిమ జాతివారైన బంటూ తెగల వారికి ప్రత్యేక రాజ్యాంగ ప్రతిపత్తిని కలిగించారు. అయినా ప్రపంచంలో చాలా దేశాలు దక్షిణ ఆఫ్రికాలోని




వర్ణ విద్వేషాన్ని నిరసించి రాజకీయంగా దానిని వెలివేసినట్లుగా చూస్తున్నాయి. గత మూడు దశాబ్దాలుగా నెల్సన్ మండేలా (చూ. మండేలా) అను ఆఫ్రికన్ జాతీయ నాయకుడు దేశ స్వాతంత్ర్యానికి పోరాటం జరుపుతున్నాడు.

విస్తీర్ణం: 11,23,226 చ.కి.మీ. జనాభా: 2,96,28,000 (1988) అధికార భాష: ఇంగ్లీషు. ఆఫ్రికాన్జ్ అనే భాషను ప్రజలు మాట్లాడతారు. రాజధానులు: ప్రెటోరియా(కార్యనిర్వాహక), బ్లూమ్ ఫోంటేన్ (న్యాయ), కేప్‌టౌన్ (శాసన నిర్మాణం). ప్రజలు క్రైస్తవ మతావలంబకులు. ప్రత్తి, గోధుమ, మొక్కజొన్న, పొగాకు, చెరకు, నిమ్మజాతి పండ్లు ఇక్కడి వ్యవసాయోత్పత్తులు. దక్షిణ ఆఫ్రికాలో ఖనిజ సంపద పుష్కలంగా ఉంది. బంగారం, వజ్రం, యురేనియం వంటి విలువయిన ఖనిజాలు ఇక్కడ లభిస్తున్నాయి. ప్రపంచంలో ఉత్పత్తి అయే బంగారంలో దాదాపు సగం దక్షిణ ఆఫ్రికానుంచే వస్తూంది. ఇంకా నేలబొగ్గు, తగరం, రాగి, మాంగనీసు, ఇనుపరాయి, సీసం, క్రోమియం కూడా దొరకుతాయి. పారిశ్రామికాభ్యుదయం సాధించిన ఈ దేశంనుంచి భారీ యంత్ర సామగ్రి, రాసాయనిక ద్రవ్యాలు, నూలు వస్త్రాలు, ఆహార దినుసులు ఎగుమతి అవుతున్నాయి.

## దత్తాత్రేయుడు

అత్రిమహర్షికీ, అనసూయకూ విష్ణ్వంశంతో జన్మించిన పుత్రుడు. అత్రి విష్ణువును గూర్చి తపస్సు చేయగా ఆయన ప్రత్యక్షమై, 'నేను నీకు దత్తుడను' అన్నాడట. అందుచేత ఈయనకు 'దత్తాత్రేయుడు' (అత్రికి దత్తుడైనవాడు) అనే పేరువచ్చింది. దత్తాత్రేయుని భార్య లక్ష్మి. అలర్కుడికీ, ప్రహ్లాదుడికీ దత్తాత్రేయుడే ఆత్మవిద్య ఉపదేశించాడని భాగవతంలో ఉంది. దత్తాత్రేయుడు యోగీశ్వరేశ్వరుడు.

## దయానంద సరస్వతి, స్వామి

ఆర్యసమాజ మత స్థాపకుడు. వేదార్థ వ్యాఖ్యాత. కతియవాడ్‌లో మోర్వీరాష్ట్రంలోని 'తంగారా' అనే పట్టణంలో 1824లో దయానందుడు జన్మించాడు. 14 ఏండ్ల వయస్సులో ఒక విధమైన ఆధ్యాత్మిక జాగ్రుతి



ఆయనలో ఏర్పడింది. అది ఆయన జీవిత విధానాన్ని పూర్తిగా మార్చివేసింది.

సత్యాన్వేషణకై దయానందుడు ఇల్లు విడిచి దేశాటనం ప్రారంభించాడు. తన 24వ ఏట 'దండి' స్వామి అనబడే పూర్ణానందుడు ఆయనను చేరదీసి, అంతకు పూర్వపు ఆయనపేరు 'మూలాశంకర్' ను 'దయానంద' అని మార్చాడు. అప్పటి నుంచి 'సరస్వతి' సన్యాసుల తెగలో ఒకరై 'దయానంద సరస్వతి' అయారు. విరజానందుడనే వేద పండితుని వద్ద రెండున్నర సంవత్సరాలు వేదాధ్యయనం చేశారు.

వివిధ మతాలలోని లోపాలూ, ఛాందసాలూ ఎత్తి చూపి, విగ్రహారాధన వేదాలలో ఎక్కడా అనుమతించ బడలేదని రుజువు చేశారు. 'సత్యార్థ ప్రకాశ'మనే గ్రంథం ద్వారా తన అభిప్రాయాలను ప్రకటించారు. శ్వేత వస్త్రధారణ మంచి పద్ధతి అని భావించారు. 1875 ఏప్రిల్ 10న బొంబాయి వెళ్ళి అక్కడ అదేరోజున ఆర్యసమాజాన్ని స్థాపించారు. 1877లో పంజాబు రాష్ట్రం దర్శించి, అక్కడ అనేక స్థలాలలో ఆర్యసమాజ శాఖలను స్థాపించారు. ఉదయపూర్‌లో 'పరోపకారిణి సభ' అనే సంస్థను ఏర్పాటు చేసి, ఒక వీలునామా ద్వారా తన ఆస్తినంతా ఆ సభా కార్యక్రమాలకోసం వినియోగించే ఏర్పాటు చేశారు. వేద సాహిత్యాన్ని ప్రచురించడం, వేద ధర్మం ప్రచారం చేయడం, అనాథ బాల బాలికలను తెచ్చి పోషించి విద్యనేర్పడం ఆ సభ ఆశయం. తన 59వ ఏట 1883లో అజ్మీర్‌లో దీపావళి రోజున దయానంద సరస్వతి సిద్ధిపొందారు.

## దలైలామా, 14వ

తన అనుయాయులతో సహా ప్రస్తుతం ఇండియాలో తలదాచుకుంటున్న టిబెట్ దేశపు బౌద్ధ మత (లామా శాఖ) పీఠాధిపతి.శాంతి నోబెల్(1989) బహుమానం అందుకున్నమహనీయుడు.



1935 జూలై 6వ తేదీన ఉత్తర టిబెట్‌లో 'ధోవ్‌'రాష్ట్రంలోని 'టాగ్‌ట్సర్' గ్రామంలో ఒకరైతు బిడ్డగా నేటి 14వ దలైలామా జన్మించాడు. తండ్రి చొక్యాంగ్ త్సెరింగ్, తల్లి సోనమ్ ట్సోమో. రెండేళ్ల వయసులోనే ఈతడు 1933 డిసెంబర్ 13న సిద్ధిపొందిన 13వ లామా అపరావతారమని ప్రజలు చెప్పుకోసాగారు. ఆ వార్తవిన్న, లాసాలోని 'సేరా' మఠంలోని పెద్దలామా వెంటనే ఆ గ్రామం వచ్చి శిశువును పరీక్షించాడు. 13వ దలైలామా తాలూకు భోజన పాత్రను కళ్ళజోడును పెన్సిల్‌ను చేతి కర్రను ఆ శిశువు అతి తేలికగా గుర్తుపట్టాడు. దలైలామాలకు ఉండవలసిన పెద్దపెద్ద చెవులు, కాళ్లమీద పులిచారలు ఆ శిశువులో కనిపించాయి. 1939 అక్టోబరులో ఆ శిశువును 'లాసా' తీసుకొని రాగా 13వ దలైలామా తాలూకు కట్టుడు దంతాలను అతడు గుర్తించాడు. 1940 ఫిబ్రవరి 22న అతనిని 1000 గదులున్న 'పోతాలా' ప్రాసాదంలో సింహాసనాధిష్ఠితుణ్ణి చేసి, 14వ దలైలామాగా ప్రకటించారు. అతని పేరు 'టెంజిన్ జోట్సో'గా కూడా మార్చారు. గురువులను నియమించి అతనికి విద్యాబోధన జరిపించారు. తన 25వ ఏట దలైలామా సేరా, డ్రెపుంగ్, గాడెన్ అనే 3 ప్రాచీన విశ్వవిద్యాలయాలలోనూ ప్రథమ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. 1959లో 'మోన్‌లామ్' వార్షిక ప్రార్థనోత్సవం సందర్భంలో జోకాంగ్, లాసాలలో జరిగిన చరమ పరీక్షలలో ఆయన ఉత్తీర్ణుడయాడు. 76 మంది హేమాహేమీలైన తర్కశాస్త్ర విద్వాంసులు ఆయనను పరీక్షించి 'గేష్ —లా—రెంపా' (బౌద్ధతర్క శాస్త్రంలో డాక్టరేట్‌కు సమానం) అనే పట్టా ఇచ్చారు.

శాంతి ప్రియుడైన దలైలామా చీనా వారిని 'రక్షణ' 'విదేశ వ్యవహారాల' శాఖలను పర్యవేక్షిస్తూ ఆంతరంగిక వ్యవహారాలలో మాత్రం టిబెట్‌కు స్వతంత్రప్రతిపత్తిని ఇమ్మని అర్థించారు. చీనా అందుకు కూడా అంగీకరించక, ఆయనను 'రాజకీయ శవం, బందిపోటు దొంగ, దేశద్రోహి' అని దూషిస్తూంది.

## దశావతారాలు

దుష్టులను పరిమార్చడానికీ, శిష్టులను అనగా మంచి వారిని రక్షించడానికి విష్ణుమూర్తి ఈ భూమి మీద తిరిగి తిరిగి అవతరిస్తూ వచ్చాడని హిందూ సంప్రదాయం. 'అవతారం' అనే మాటకు 'దిగిరావడం' అని అర్థం. విష్ణుమూర్తి ఎత్తిన అవతారాలలో ప్రధాన మైనవి 10.

వాటినే దశావతారాలు అంటారు. ఈ అవతారాలను వర్ణించే ఒక శ్లోకం ఉంది.

మత్స్యకూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః!
రామోరామశ్చ రామశ్చ బుద్ధకల్కి రేవచ!!

దశావతారాలు: 1. మత్స్యావతారం, 2. కూర్మావతారం, 3. వరాహావతారం; 4. నరసింహావతారం, 5. వామనావతారం; 6. పరశురామావతారం, 7. శ్రీ రామావతారం, 8. బలరామావతారం; 9. బుద్ధావతారం; 10. కల్కి అవతారం.

ఇవికాక విష్ణుమూర్తి తాల్చిన 18 అంశావతారాలను గురించి కూడా భాగవతం తెలియచేస్తుంది.

## దాద్రా& నాగర్ హవేలీ

భారతదేశం పశ్చిమ తీరాన ఉన్న రెండు కేంద్రపాలిత ప్రాంతాలు. గుజరాత్, మహారాష్ట్ర చుట్టూరా ఉన్నాయి. 1779 నుండీ గోవా (చూ.)తో బాటు పోర్చుగీసు పాలనలో ఉన్న ప్రాంతాన్ని 1954లో బలవంతంగా ప్రజలు కైవసం చేసుకొని పరిపాలన మొదలు పెట్టారు. బహుశః ప్రజలే ప్రత్యక్షంగా పాలించిన ప్రాంతం ఇది ఒక్కటేనేమో! 1961 (ఆగ.)లో పోర్చుగల్ పాలన అంతరించడంతో గోవా, డయ్యూ, డామ్‌నలతో బాటు భారతదేశంలో విలీనమయి గోవాతో ఈ ప్రాంతం కలిసి ఉండేది. 1987లో గోవాకు రాష్ట్ర ప్రతిపత్తి కల్పించడంతో ఇవి వేరై ప్రత్యేక కేంద్రపాలిత ప్రాంతాలుగా కొనసాగుతున్నాయి. (చూ. గోవా).

విస్తీర్ణం: 491 చ.కి.మీ. జనాభా: 11,03,676 (1981) రాజధాని: సిల్వాస్సా, అధికారభాష: హిందీ, గుజరాతీ, ప్రజలు భిలీ, భిలోడీ భాషలు మాట్లాడతారు. ప్రజలలో చాలామంది ఆదిమజాతుల వారున్నారు. వ్యవసాయమే జీవనోపాధి. వరి, రాగులు, అపరాలు, పండ్లు, గోధుమ, చెరకు సాగుపంటలు. సిల్వాస్సా, మసత్ ప్రాంతాలలో చిన్న తరహా పరిశ్రమలు నెలకొన్నాయి.

## దీపావళి

ప్రతి సంవత్సరం ఆశ్వయుజ బహుళ చతుర్దశి అమావాస్య తిథులలో భారతీయులందరూ సంతోషంగా సమైక్యంగా అతి ఘనంగా జరుపుకొనే పండుగ పర్వదినం. 'దీపావళి' అంటే దీపాల వరుస అని అర్థం.

చీకటి అజ్ఞానానికి గుర్తు. వెలుగు జ్ఞానానికి ప్రతీక. మనలోఉన్న అజ్ఞానాంధాకారాన్ని తొలగించి జ్ఞానజ్యోతులు వెలిగించుకోడం దీపావళి ఉద్దేశ్యం. నరకుడు అనే రాక్షసుడు అతి గర్వంతో భూలోకవాసులను హింసిస్తూ ఉండగా మహావిష్ణువు కృష్ణుడి రూపంలో అవతరించి, సత్యభామా సమేతుడై నరకాసురుణ్ణి హతమార్చాడు. ఈ రోజున భూలోకవాసుల బాధలు తొలగిన సంతోషంలో దీపావళి పండు జరుపుకోవడం ఆరంభమైందని పురణాలు చెబుతున్నాయి. దీపాలతో ఇళ్ళను అలంకరించుకోడం, బాణాసంచ కాల్చడం ప్రధానంగా జరుగుతున్నాయి.

## దీక్షితులు, చింతా 1891–1960

బాలసాహిత్య స్రష్ట. ప్రముఖ కథా రచయిత. తూర్పు గోదావరి జిల్లా దంగేడు గ్రామంలో జన్మించి బి.ఏ., ఎల్.టి., వరకూ చదివి ప్రభుత్వ విద్యాశాఖలో పనిచేశారు. వారి 'లక్కపిడతలు' తెలుగు బాలసాహిత్య కృషిలో ఎన్నదగిన ఉత్తమ గేయరచన. అందులోని హనుమంతుడి తోక శీర్షికలో రామాయణ కథను పాడిగారు. పిల్లల మనస్తత్వాన్ని బాగా అవగాహన చేసికొని వ్రాసిన మరొక రచన 'సూరీ, సీతి, వెలకి'. ఇంకా 'లీలాసుందరి' వంటి కాల్పనిక బాలసాహిత్య రచన లెన్నిటినో చేశారు. చిత్రరేఖ (1912) హరిణ దంపతులు (1923), కలికన్య (1925) తొలిరచనలుగా ప్రముఖ రచనలు. పదకొండు కథలుగల 'ఏకాదశి'వారి కథా సంకలనం. దీక్షితులు సృష్టించిన పాత్ర 'వటీరావు ఎమ్.ఏ.' చుట్టూ అనేక కథలు వ్రాశారు. 'బాలానందం' కలం పేరుతో 1931 నుండి 'భారతి' మాసపత్రికలో పిల్లల శీర్షికను నిర్వహించేవారు. ప్రభుత్వ ఉద్యోగ విరమణ చేసిన తరువాత నర్సాపురంలో విశ్రాంతి తీసికుంటూ 1960లో కీర్తిశేషులయ్యారు.

## దుర్గాబాయి దేశ్‌ముఖ్

స్వాతంత్ర్యసమరయోధురాలు. మహిళా జనోద్ధరణకై తన జీవితాన్ని అంకితం చేసిన ధన్యజీవి. ఆంధ్రమహిళాసభ స్థాపకురాలు.

రామారావు, కృష్ణవేణమ్మ దంపతులకు 1909లో జూలై 15న దుర్గాబాయి జన్మించింది. 1921లో గాంధీజీ ఆంధ్రదేశంలో పర్యటించినపుడు ఆయన హిందీ

ఉపన్యాసాలను తెలుగులోకి అనువదించి ఆయన మెప్పు పొందింది. ఉప్పు సత్యాగ్రహ (చూ.) కాలమున మూడు పర్యాయాలు కారాగార శిక్షను అనుభవించింది. శిక్షా కాలమున జైలులో స్త్రీ ఖైదీలతో పరిచయం పెంచుకొని స్త్రీలకు విద్య లేకపోవడంవల్లే పతనమవుతున్నారని అభిప్రాయపడి స్త్రీ జనోద్ధరణకు పూనుకొన్నది. స్త్రీలను ఉద్ధరించాలంటే తాను విద్యావంతురాలుకాక తప్పదని గ్రహించి మరల విద్యాభ్యాసం ప్రారంభించి ఎల్ఎల్బి పట్టాని పొందింధి..




విద్యాభ్యాసం చేస్తూనే 1937లో 'బాలికా బృందా వనం' సంస్థను నెలకొల్పి అందులో దుర్గాబాయి, ఆమె తల్లి ఉపాధ్యాయులుగా ఉండి సంగీతం, నాట్యం, హిందీ నేర్పించసాగారు. ఆ సంస్థ 1938 ఆంధ్రమహిళా సభగా మారింది. 1952–53లో ప్లానింగ్ కమీషన్ సభ్యురాలుగా పనిచేసింది. ఆ సమయంలోనే అప్పటి కేంద్ర ఆర్థిక మంత్రి చింతామణి దేశ్ముఖ్ను ఆమె వివాహం చేసుకుంది. అప్పటి నుండి దుర్గాబాయి చేపట్టిన ప్రజాసేవ కార్యక్రమాలన్నింటిలోనూ భర్త ఆమెకు చేదోడు వాదోడుగా వ్యవహరించారు.

ఆంధ్ర మహిళా సభ సంస్థలో వైద్యశాలలు, శల్య చికిత్సా కేంద్రాలు, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ, మహిళా విద్యాలయాలు, శిశు విహారాలు, సాక్షరతా కేంద్రాలు, నర్సుల శిక్షణాశాల ఇంకను ఎన్నో సంస్థలు నెలకొల్ప బడినాయి. ఆమె కృషిఫలితంగా జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో పెక్కు గౌరవాలను దుర్గాబాయ్ పొందారు. భారత ప్రభుత్వం పద్మవిభూషణ బిరుదునిచ్చి సత్కరించింది. 1981 మే 9న హైదరాబాదులో దుర్గాబాయి కీర్తి శేషులయారు.

## దుర్యోధనుడు

గాంధారీ ధృతరాష్ట్రులకు కలిగిన నూరుగురు పుత్రులలో జ్యేష్ఠుడు. ఇతడు 'కలి' అంశంతో జన్మించాడని ప్రసిద్ధి. గాంధారి ఒక సంవత్సరం పాటు గర్భం ధరించినా సహజమైన ప్రసవం రాకపోవడంతో ఆమెతన కడుపుమీద చేత్తోకొట్టుకోగా ఒక మాంసపుముద్ద పుట్టింది. వ్యాసుడు దానిని నూట ఒక్క ఖండాలుగా విభజించి నేతిలో ఉంచి వానిని కాపాడమని చెప్పాడు. ఆశకలాలలో నుంచే దుర్యోధనుడు అతని తొంభై తొమ్మిది మంది సోదరులూ దుస్సల అనే సోదరీ ఉద్భవించారు.

చిన్నతనం నుంచీ దుర్యోధనుడు తన పినతండ్రి కుమారులైన పాండవుల మీద కక్షగట్టి వారిని అనేక విధాలుగా హింసించాడు. భీముణ్ని పాముల చేత కరిపించాడు. విషాన్నం పెట్టించాడు. పాండవులను లక్క ఇంటిలో పెట్టి ఆ ఇంటికి నిప్పు పెట్టించాడు. అయినా ధర్మాత్ములైన పాండవులకు ఎలాంటి హానీ కలుగలేదు. మామ అయిన శకుని జిత్తుల సాయంతో మాయా జూదంలో దుర్యోధనుడు రెండుసార్లు ధర్మరాజును ఓడించాడు. ఒకసారి ద్రౌపది వస్త్రాపహరణ దురాగతానికి పూనుకోగా కృష్ణుడు వచ్చి ద్రౌపదిని ఆదుకున్నాడు. మరొక సారి పాండవులు 12 సంవత్సరాలు వనవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేసే షరతు విధించాడు. ఎన్ని కష్టాలు పడినా పాండవులు ధర్మమార్గం వీడలేదు. చివరికి కృష్ణుని హితవు కూడా వినకుండా దుర్యోధనుడు పాండవులైదుగురికీ ఐదూళ్లు ఇవ్వడానికి కూడా నిరాకరించాడు. కౌరవులకు పాండవులకు మధ్య కురుక్షేత్రం (చూ.)లో ఘోర సంగ్రామం జరిగింధి. ఇరుపక్షాల లోనూ వేలాది యోధులు మరణించారు. భీమునితో గదాయుద్ధంలో చివరికి దుర్యోధనుడు కూడా హతుడయ్యాడు. దుర్యోధనుని భార్య చారుమతి.

## దేవేంద్రనాథ్ టాగూర్

రవీంద్రనాథ టాగూర్ (చూ) తండ్రి. ద్వారాకానాథ టాగూర్ కుమారులలో ఈయనే జ్యేష్ఠుడు. దేవేంద్రనాథ టాగూర్ ప్రాథమిక విద్యాభ్యాసం రాజా రామమోహనరాయలు నెలకొల్పిన పాఠశాలలో జరిగింది.

తన 18వ ఏట అతని అమ్మమ్మ చావుకి సిద్ధంకాగా అప్పటి ఆచారం ప్రకారం ఆమెను గంగా తీరానికి తీసుకువెళ్ళారు. అక్కడ కొన్ని గంటలు ఉంచారు. దేవేంద్రుడు ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. బంధువులు హరినామస్మరణ చేస్తూ ఉండగా అకస్మాత్తుగా దేవేంద్రుడికి ఒక దివ్యానుభూతి కలిగింది.



ఒకనాడతడు వీధిని పోతూఉండగా గాలికి ఎగిరి పోతున్న ఒక కాగితం ముక్క అతని కంటబడింది. అందులో ఈశోపనిషత్తులోని ప్రథమ శ్లోకం సంస్కృతంలో వ్రాయబడి ఉంది. దాని అర్థం "ప్రపంచంలోని ప్రతి అణువు ఈశ్వరునితో నిండి ఉంది. అయినా నీకు దయచేసిన దానినే అనుభవించు. పరుల సొత్తును ఆశించకు". ఉపనిషత్తుల పఠనానికి ఈ శ్లోకం అతనిని పురికొల్పింది. వేదాంత విద్యకూ బ్రహ్మజ్ఞానానికీ దారి చూపించింది. 1839 అక్టోబరు 6వ 'తత్త్వ బోధినీ సభ' అనే బ్రహ్మవిద్యా సంస్థను నెలకొల్పాడు. దీనిలో దేవేంద్రుడు ధర్మప్రసంగాలు చేస్తూ ఉండేవాడు. బ్రహ్మతత్త్వాన్ని బోధించాలనే ఉద్దేశ్యంతో 'తత్త్వబోధిని' అనే పత్రికను నెలకొల్పాడు. బ్రహ్మ సమా జంలో ప్రముఖ సభ్యుడై దానిని అభివృద్ధి చేశాడు. బ్రహ్మధర్మానికి నిర్దిష్టమైన నిర్వచనం ఇచ్చి సభ్యులందరి చేత ఒక దీక్షా పత్రంపై సంతకాలు చేయించాడు. గాయత్రీ మంత్రం ద్వారా ప్రార్థనలు జరగేవి. క్రైస్తవుల మతపు మార్పిడి ప్రచారానికి హిందూయువకులు లోబడకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. హిందూ హితార్థి విద్యాలయాన్ని స్థాపించి మతాంతీకరణాలను తీవ్రంగా ఎదుర్కొన్నాడు. వేదాంత శాస్త్రాన్నీ, ఉపనిషత్తులనూ, బ్రహ్మధర్మానికి ప్రాతిపదికలుగా చేశాడు. వాటిలోని వాక్యాలను ఏరికూర్చి బ్రహ్మధర్మంగా వ్రాయించాడు. దీనితో సనాతనులు ఆయనను వెలివేశారు. వెలివేసినా లెక్క చేయకుండా గృహాన్నీ, సత్ కర్మనీ విడనాడని సన్యాసి అయాడు. 1856లో హిమాలయ ప్రాంతానికి వెళ్ళాడు. 1859లో కేశవచంద్రసేనుడు, దేవేంద్రనాథుడు కలిసి 'బ్రహ్మ విద్యాలయం' నెలకొల్పారు. 1866 నవంబరులో ఈ సంస్థ రెండుగా చీలడంతో భారతీయ బ్రహ్మసమాజమనే కొత్త సమాజం ఏర్పడింది. మహర్షి దేవేంద్రనాథ టాగూర్ కలకత్తాకు 150 కి.మీ దూరంలోఉన్న జాత్‌పూర్ గ్రామం వద్ద ఒక శాంతి ఆశ్రమాన్ని నిర్మించుకొని అక్కడే ఉంటూ, 1905 జనవరి 19న సిద్ధిపొందాడు. ఆ శాంతి ఆశ్రమమే తరువాత 'శాంతి నికేతనం' అయింది.

## ద్రోణాచార్యుడు

భరద్వాజ మహర్షి ఘృతాచి అనే అప్సరసను చూసినపుడు ఆయనకు వీర్యస్ఖలనమైంది. ఆ వీర్యాన్ని ఒక ద్రోణం (కుండ)లో ఉంచి కాపాడగా ఆ ద్రోణం నుంచి పుట్టినవాడు గనుక ఆయన 'ద్రోణుడు' అయాడు. తండ్రి ఆశ్రమంలోనే సకల విద్యలూ ద్రోణుడు నేర్చుకున్నాడు. అగ్నివేశుని వలన ధనుర్విద్యలో ఆరితేరాడు. కృపాచార్యుని చెల్లెలయిన కృపిని ద్రోణుడు వివాహమాడాడు. ఆయనకు అశ్వత్థామ అనే కుమారుడు కలిగాడు. ఆరంభంలో లేమి వలన ద్రోణుడు చాలా బాధలు పడ్డాడు. చిన్ననాటి చెలికాడైన ద్రుపదమహారాజు సహాయం అర్థించగా ఆయన ద్రోణుణ్ని అవమానించాడు.

హస్తినాపురంలో దుర్యోధనాదులు ఆడుకుంటున్న బంతి నూతిలో పడగా తన విలు విద్యా నైపుణ్యంతో ద్రోణుడు ఆ బంతిని పైకి తీసివారికిచ్చాడు. ఆ వృత్తాంతం విన్న ధృతరాష్ట్రుడూ, భీష్ముడూ ద్రోణుణ్ని రాజకుమారులకు అస్త్ర విద్యాగురువుగా నియమించారు. అర్జునుడు ద్రోణుడికి అభిమానపాత్రుడయాడు. అర్జునుణ్ని ద్రోణుడు అస్త్ర విద్యలో తనంతవాణ్ని చేశాడు.

మహాభారత సంగ్రామంలో ద్రోణుడు కౌరవుల పక్షం వహించి యుద్ధం చేశాడు. భీష్ముని తరువాత కౌరవ సేనలకు నాయకత్వం వహించి పద్మవ్యూహం పన్నాడు. ఆ వ్యూహాన్ని ఛేదించడమే తప్ప తిరుగు మార్గం తెలియని అభిమన్యుడు ఆ వ్యూహానికి బలి అయాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు చేత 'అశ్వత్థామ హతః—కుంజరః' అని పలికించి 'కుంజరః' అనే చివరి మాట ద్రోణుడికి వినిపించకుండా వాద్యాలుమోగింప చేశాడు. ధర్మరాజు అసత్యం ఆడడనే నమ్మకంతో తన కుమారుడైన

అశ్వత్థామ నిజంగా హతుడయాడని నమ్మి ద్రోణుడు అస్త్రసన్యాసం చేశాడు. కార్యభారం దుర్యోధనాదులకు ఒప్పగించి యోగబలంతో తన రథం ఎక్కి ఒక జ్యోతి రూపంలో పరమ పదానికి ఎగసిపోయాడు. తరువాత ధృష్టద్యుమ్నుడు వచ్చి అతని శిరస్సు ఖండించాడు.

## ద్రౌపది

పాంచాలరాజైన ద్రుపద మహారాజు పుత్రిక. ద్రుపదుని కుమార్తె గనుకనే 'ద్రౌపది' అని పేరు వచ్చింది. ఆమె అయోనిజ. అనగా మానవగర్భంలో పుట్టనిది. మహాభారతంలో ఒక ప్రముఖపాత్ర. ద్రుపదుడు సంతానంకోసం యజ్ఞం చేస్తూ ఉండగా యజ్ఞకుండం నుంచి ఒక పుత్రుడూ, ఒక పుత్రికా పుట్టారు. పుత్రుడు ధృష్టద్యుమ్నుడు, పుత్రిక 'ద్రౌపది'. ద్రౌపది అసలు పేరు 'కృష్ణ '. మత్స్య యంత్రం(చూ.) కొట్టినవారికే తన కూతురునిచ్చి వివాహం చేస్తానని ద్రుపదుడు స్వయంవరం చాటించాడు. వీరాధివీరులైన కర్ణ, దుర్యోధనాదులు ఆ యంత్రం ఛేదించలేక పోయారు. బ్రాహ్మణ వేషంలో ఉన్న అర్జునుడు ఆ యంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని గెలుచుకున్నాడు. అయినా తల్లి కుంతి ఆదేశం మేరకు పాండవులు ఐదుగురూ ద్రౌపదిని వివాహం ఆడారు. ద్రౌపది మహా పతివ్రత. ఈమెకు ధర్మరాజాదుల వలన వరుసగా ప్రతి వింధ్యుడు, శ్రుతసేనుడు, శ్రీతకీర్తి శతానీకుడు, శ్రుతకర్ముడు అనే ఐదుగురు పుత్రులు కలిగారు. వారికే ఉపపాండవు లని ప్రసిద్ధి.

దుర్యోధనుని (చూ.)ఆదేశాన్ని అనుసరించి దుశ్శాసనుడు ద్రౌపదిని నిండుసభలో వివస్త్రనుచేసి మానభంగం చేయ జూచాడు. దుశ్శాసనుడి రొమ్ము నెత్తురుతోకాని తన తలవెంట్రుకలను ముడివేయనని ద్రౌపది ప్రతిజ్ఞ చేసింది. చివరికి మహాభారత సంగ్రామంలో భీముడు దుశ్శాసనుణ్ణి సంహరించి ఆమె ప్రతిజ్ఞ నెరవేర్చాడు. అజ్ఞాతవాసంలో విరాటుని కొలువులో మారువేషంలో సైరంధ్రిగా ఉండగా కీచకుడు ఆమె పొందు ఆశింపగా వలలుడనే వంటవాడిగా మారువేషంలో ఉన్న తన భర్త భీముణ్నే ప్రోత్సహించి అతని చేత ద్రౌపది కీచక సంహారం చేయించింది. భారతయుద్ధానంతరం పాండ వులు రాజ్యం వదిలి హిమవత్పర్వతాలకు పోయేటప్పుడు వారిని అనుసరించి మార్గమధ్యంలోనే విగత ప్రాణి అయి స్వర్గలోకం చేరుకుంది.

## ద్వారక

గుజరాత్ రాష్ట్రంలో గోమతి నది సంగమ స్థానంలోని వైష్ణవ పుణ్యక్షేత్రం. (22° 15′ ఉ 69° 3′ తూ) జామ్ నగరుకు 140 కి.మీ. దూరంలో ఉంది. ఇచ్చట ఉన్న ద్వారకానాథ్ దేవళం గోపురం ఎత్తు దాదాపు 45 మీ. గోమతి అవతలి ఒడ్డున లక్ష్మినారాయణ గుడి ఉంది. శ్రీకృష్ణుడు తన రాజధానిని మథుర (చూ.) నుండి ద్వారకకు తరలించాడని స్థానిక ఐతిహ్యం.

## ధర్మరాజు

పాండు మహారాజుకు కలిగిన ఐదుగురు కుమారు(పంచపాండవు)లలో ధర్మరాజు జ్యేష్ఠుడు. ఈ యన తల్లి కుంతి. మహాభారత కథలో ఒక ప్రముఖపాత్ర. పాండవుల ధర్మపత్ని ద్రౌపది(చూ.) 'ధర్మరాజు' అసలు పేరు 'యుధిష్ఠిరుడు'. 'యుధిష్ఠిరుడు' అనగా యుద్ధం లో వెన్నిచ్చి పారిపోకుండా ధైర్యంతో స్థిరంగా నిలబడే వాడు. బాల్యంనుంచి ఈయన ప్రదర్శించిన సద్గుణాల వల్ల, ధర్మాచరణ వల్ల ఈయనకు 'ధర్మరాజు' అనే పేరు రూఢి అయింది. భీష్ముని ఆదేశానుసారం ధృతరాష్ట్రుడు (చూ.) ఈయనకు యౌవ రాజ్యాభిషేకం చేశాడు. కృష్ణుని ఉపదేశం వల్ల ధర్మరాజు రాజసూయయాగం నిర్వర్తించాడు. ఆ యాగంలో ధర్మరాజు ప్రతిరోజూ 10 వేలమంది బ్రాహ్మణులకు తక్కువ కాకుండా అన్నదానం చేశాడు.

శకునితో జూద క్రీడలో ద్రౌపదితో సహా సర్వస్వం ఓడిపోయాడు. మరొకసారి జూదంలో ఓడిపోయి 12 ఏళ్లు అరణ్యవాసం, ఒక ఏడాది అజ్ఞాతవాసం చేయవలసి వచ్చింది. అజ్ఞాతవాసం కాలంలో కంకుభట్టు అనే పేరుతో విరాటుని కొలువులో విరాట రాజుకి ఇష్టసఖుడుగా పనిచేశాడు. మహాభారత యుద్ధంలో విజయం సాధించి ధర్మరాజు రాజ్యాభిషిక్తుడయాడు. మూడు అశ్వమేధ యాగాలు చేశాడు. చివరికి భార్యతోనూ, సోదరుల తోనూ, మహాప్రస్థానానికి బయలు దేరి మార్గమధ్యంలో భార్యనూ, సోదరులనూ కోల్పోయాడు. ఒక కుక్క రూపంలో యమధర్మారాజు మాత్రం, స్వర్గం వరకూ ఆయనను అనుసరించాడు. స్వర్గారోహణ సమయానికి ధర్మరాజు వయస్సు 108 సంవత్సరాలు.

## ధృతరాష్ట్రుడు

కురువంశరాజు అయిన విచిత్రవీర్యుని పుత్రుడు. మహాభారత కథలో ఒక ప్రముఖపాత్ర. ఈయన తల్లి అంబిక. పెద తండ్రి అయిన భీష్ముడు ఈయన చేత విద్యాభ్యాసం చేయించాడు. ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డి. సుబలదేశపు రాజపుత్రి అయిన గాంధారి ఈయన ధర్మపత్ని. ఆమె కాక ఇతర పత్నులు కూడా కొంద రున్నారు. ధర్మపత్ని గాంధారి వలన ఈయనకు దుర్యోధన, దుశ్శాసనాది నూరుగురు కుమారులు దుస్సల అనే కుమార్తె కలిగారు. తన సోదరుడు పాండురాజు పుత్రులైన పాండవులకు రాజ్యాధికారం లేకుండా తన అనంతరం దుర్యోధనుడే సార్వభౌముడు కావాలని ఈయన శత విధాల ప్రయత్నించాడు. కౌరవపాండవుల మధ్య సంధి కుదిర్చి భారత యుద్ధాన్ని నివారించాలని ప్రయత్నించిన కృష్ణుని హిత బోధలు కూడా ఈయన పెడచెవిని పెట్టాడు. భారత యుద్ధ సమయంలో సంజయుడు ఎప్పటికప్పుడు యుద్ధ వార్తలను ధృతరాష్ట్రు డికి వినిపిస్తూ ఉండేవాడు. కౌరవ వంశనాశనం జరిగిన తరువాత యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రుణ్ణి ఆదరించి నప్పటికీ భీమసేనుని వాక్శూలాలవాడిని భరించలేక గాంధారి మొదలైన వారితో సహా ధృతరాష్ట్రుడు వనవాసానికి పోయి, 'అక్కడ ఘోరమైన తపస్సు చేస్తూ, చివరికి ఒక దావాగ్ని వాతపడి అంతరించాడు.

## ందలాల్ బోస్ 1883–1966

సృజనాత్మక కళా జగత్తులో భారత జాతికి పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన కళాకారులలో నందలాల్ బోస్ చెప్పుకోదగినవారు. ఖరగ్‌పూర్‌లో (బీహార్)1883 డిసెంబరు 3వ నందలాల్ బోస్ జన్మించారు. అవనీంద్రనాథ్ టాగూర్ వద్ద చిత్రకళ నేర్చాడు. సుప్రసిద్ధ కళా విమర్శకుడు హేవెల్ ప్రశంసల నందుకొన్నాడు. శాంతినికేతనంలో రవీంద్రనాథ్ టాగూర్ 'కళా భవ నాన్ని' స్థాపించగా నందలాల్ దానికి ప్రధానాచార్యుడుగా నియమితులైనారు. అప్పటి నుండి జీవిత పర్యంతం శాంతినికేతనం లోనే ఉన్నారు. రవీంద్రుని వెంట చీనా, జపాను దేశాలలోని కళాకేంద్రాల్ని సందర్శించి అధ్యయనం చేశారు. కుడ్యచిత్రాలు, పౌరాణిక చిత్రాలు, లౌకిక చిత్రాలు, బౌద్ధ చిత్రాలు, ప్రకృతి దృశ్యాలు, జానపద చిత్రాలనెన్నిటినో నందలాల్ చిత్రీకరించారు. వివిధ కళారీతులతో నూతన ప్రక్రియలతో రచించిన ఒకే ఒక చిత్రకారుడు నందలాల్. నందలాల్ చిత్రాలలో హిమా లయపు కుటీరం, విఠల్ నగరంలో బాపూజీ కుటీరం, కాశీ ముఖ్యమైనవి.

## నందా, గుల్జారీ లాల్ జననం 1898

జవహర్‌లాల్ తరవాత 1964 లోను, లాల్ బహదూర్ శాస్త్రి తరవాత 1966 లోనూ తాత్కాలి కంగా ప్రధానమంత్రి పదవిని అలంకరించిన గుల్జారీ లాల్ నందా 1898 జూలై 4వ తేదీన పంజాబులోని సియాల్ కోటలో జన్మించారు. బొంబాయిలో వస్త్రాల మిల్లుల కార్మికులకు నాయకత్వం వహించి సమ్మె జయప్రదం అవడానికి కారకుడై గాంధీజీ ప్రశంసలు పొందారు. అప్పటినుంచి ఆయన కార్మిక నాయకుడుగాపేరు పొందారు. 1946లో బొంబాయి మంత్రివర్గంలో కార్మిక మంత్రిగా నియుక్తు లయారు. 1951లో ప్లానింగ్ కమిషన్ ఉపా ధ్యక్షులుగాను, 1952 నుండి 1957 వరకు నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రిగాను, 1957 నుంచి ప్లానింగ్ శాఖామంత్రిగాను పనిచేశారు. అటు తర్వాత కొన్నాళ్ళు హోమ్ శాఖను కూడా నిర్వహించారు. సదాచార సమితిని వ్యవస్థాపించి సమా జంలో అవినీతిని రూపుమాపుటకు కృషిచేస్తున్నారు.

## నందాదేవి

హిమాలయ పర్వతాలలోని ఒక ఎత్తయిన శిఖరం. దీని ఎత్తు 7,698 మీ. భారతదేశంలో ఉత్తరప్రదేశ్ భూభాగంలో ఈ శిఖరం ఉంది.

## నకులుడు

పంచపాండవులలో నాలుగవవాడు. మహాభారత కథలో ఒకపాత్ర. పాండురాజు రెండవ భార్య అయిన మాద్రికి అశ్వినీ దేవతల అనుగ్రహం వలన కలిగిన ఇరువురు పుత్రులలో పెద్దవాడు. రెండవవాడు సహ దేవుడు. నకులుడు మిక్కిలి సౌందర్య వంతుడని ప్రసిద్ధి. నకుల, సహదేవులను కని మాద్రి భర్త అయిన పాండురాజుతో సహగమనం చేయడం వలన ధర్మజ, భీమార్జునులతో పాటు నకుల సహదేవులను కూడా

కుంతీదేవియే పెంచి పెద్దవారినిచేసింది. నకులునికి పంచపాడవులకు పత్ని అయిన ద్రౌపది(చూ.) కాక మరొక భార్యకూడా ఉంది. ఆమె పేరు 'రేణుమతి' (రేణుక). ఆమెవలన నకులునికి 'నిరమిత్రుడు' అనే కుమారుడు జన్మించాడు. ద్రౌపదికి నకులునివలన పుట్టిన కొడుకు 'శతానీకుడు.'

## నటరాజు

తాండవ భంగిమలో శివుని స్వరూపం. సృష్టి, స్థితి, లయ, త్రయోభవ (భ్రాంతి), అనుగ్రహ (మోక్షం) అను పంచ మహాకార్యాల్ని తాండవం ద్వారా పరమశివుడు ప్రదర్శిస్తాడు. ఒకప్పుడు తారగం అనే అరణ్యంలో ఋషులు సమావేశమై చర్చిస్తూ ఉండగా శివుడు అటువైపు వెళ్లుతూ తారసపడతాడు. వారిలో వారు పోట్లాడుకుంటున్న మునులు వారి కోపోద్రిక్తతను శివునివైపు మరలుస్తారు. చంపాలనే ఉద్దేశ్యంతో మొదట ఒక వ్యాఘ్రాన్ని (పులిని) సృష్టించి శివుని మీదకు వదులుతారు. తన చిటికెన వేలితో ఆ పులిని పట్టి సంహరించి చర్మాన్ని ఒలిచి ఉత్తరీయం వలె కప్పుకుంటాడు. అప్పుడు ఋషులు ఒక బ్రహ్మాండమైన సర్పాన్ని సృష్టించి ఆయన మీదకు వదలగా దానిని పట్టి పరమశివుడు మెడలో హారంగా ధరిస్తాడు. విసిగిన ఋషులు ముయాలకా అనే ఒక బ్రహ్మరాక్షసిని సృష్టించి **వదులుతారు** ఆ రాక్షసిని శివుడు పాదాలక్రింద తొక్కిపట్టి దానిమీద తన్మయంలో శివతాండవం చేసేడని ఐతిహ్యం. నటరాజ స్వరూపంలో కనిపించే శివుని ఢమురకనుంచి సృష్టి, ఆశకు సంకేతం హస్తం నుండి స్థితి, అగ్ని నుండి లయ (సంహారం), పైకి ఎత్తిన పాదం నుండి ముక్తి, ఆ పాదంవైపుకు తిరిగి ఉన్న నాలుగవ హస్తం ఆత్మకు— శరణ్యం తెలియచేస్తాయి. శాస్త్రీయ నృత్య కార్యక్రమాలలో నటరాజుకు రంగపూజ చేసి నాట్య ప్రదర్శనకు ఉపక్రమించడం సంప్రదాయం. సుప్రసిద్ధ కళావిమర్శకుడు ఆనంద కె.కుమారస్వామి తన 'డేన్స్ ఆఫ్ శివా' అను విమర్శనాత్మక గ్రంథంలో శివతాండవంగూర్చి వ్రాశాడు.(చూ.చిదంబరం)



## నన్నయభట్టు

క్రీ.శ. 11వ శతా.

తెలుగులో ఆదికవి. 'ఆంధ్రవాగనుశాసనుడు' బిరుదాంకితుడు. రాజమహేంద్రవరంలోని రాజరాజ నరేంద్రునికి 'కుల సచివుడు.' రాజరాజనరేంద్రుని అభ్యర్థన మీదనే సంస్కృత భారతాన్ని తెనుగు చేయడానికి నన్నయభట్టు పూను కొన్నాడు. కాని, ఆది, సభాపర్వాలు అరణ్యపర్వంలోని 3 ఆశ్వాసాలు, 142 పద్యాలూ రచించిన తరువాత ఏ కారణం వల్లనో ఆయన భారతరచన ఆగిపోయింది. (చూ. ఎర్రాప్రగడ; తిక్కన).

నన్నయ ఆంధ్రమహాభారతాన్నేకాక 'ఆంధ్ర శబ్దచింతామణి' అనే తెలుగు భాషా వ్యాకరణాన్ని సంస్కృతంలో రచించాడు. నన్నయ ఆంధ్ర మహాభారత భాగాన్ని ఆంధ్ర శబ్దచింతామణినీ మాత్రమేగాక, మహేంద్ర విజయం మొదలైన కొన్ని ఇతర గ్రంథాలు కూడా రచించి నట్టు తెలుస్తూంది. కాని ఆ గ్రంథాలు లభించడం లేదు.నన్నయకు భారత రచనలోతనసహాధ్యాయి అయిన నారాయణభట్టు సాయంచేసినట్టు నన్నయ స్వయంగా చెప్పుకొన్నాడు. హైదరాబాదులో తెలుగువెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో నన్నయ శిల్ప విగ్రహాన్ని ప్రతిష్ఠించి (1986) గౌరవించారు.



## నన్నెచోడుడు

తెలుగులో 'కుమారసంభవం' అనే మహాప్రబంధాన్ని రచించిన నన్నెచోడ మహాకవి నన్నయ కంటె ముందు వాడని కొందరూ, నన్నయ తిక్కనల నడిమి కాలంవాడని కొందరూ, తిక్కనకంటే కూడా అర్వాచీనుడని మరి కొందరు భావిస్తున్నారు. ఇదమిత్థమని ఆయన కాలం నిర్ణయం కాలేదు. తెలుగులో శైవకవులలో మొట్టమొదట పేర్కొన దగినవాడు నన్నెచోడుడు. ఆయనకు 'కవిరాజ శిఖామణి' అనే బిరుదం ఉంది.

## నమీబియా

ఒకప్పుడు నైర్భతి ఆఫ్రికా అని పిలువబడిన ఈ నమీబియా, అట్లాంటిక్ మహాసముద్రాన్ని ఆనుకొని ఉన్న ఒక ఆఫ్రికాదేశం. 1990లో స్వాతంత్ర్యం సాధించు కుంది. విస్తీర్ణం: 8,23,144 చ.కి.మీ. జనాభా: 11,84, 000 (1988) రాజధాని: విన్ ధోయిక్; అధికార భాష: ఇంగ్లీష్. ప్రజలు ఆఫ్రికాన్స్ భాష మాట్లాడతారు.




ఓవాంబో ఆదిమజాతి 50 శాతం ఉన్నారు. మిగతా ఆదిమ జాతులు కవాన్గో, హెరేరో, దామర, నామా వంటి వారున్నారు. తెల్లవారు 6 శాతం. ప్రజలు క్రైస్తవం పాటిస్తున్నారు.

ఖనిజ సంపద పుష్కలంగా ఉన్న రాజ్యం. వజ్ర నిక్షేపాలు మెండు. రాగి, జింకు సీసం, జిరిమేనియం, మాంగనీస్ ఇతర ఖనిజోత్పత్తులు. పశువుల పెంపకం, గొర్రెలు, మేకల పెంపకం ప్రజల ప్రధాన వృత్తులు. మత్స్యపరిశ్రమ కూడా ప్రజలకు జీవనాధారాన్ని సమ కూరుస్తుంది.

## నయాగరా జలపాతం

కెనడా, యునైటెట్ స్టేట్స్ దేశాలకు చెందిన మనోహరమైన పెద్దజలపాతం. ఇది నయాగరా నదీప్రవా హం మీద ఉంది. 1678లో దీని ఉనికిని కనుగొన్నారు. కాని, 1919 వరకు రెండు దేశాలకు మధ్య సరిహద్దు రేఖ రూపొందలేదు. క్రమంగా వంతెనలు నిర్మించి పర్యాటకులను ఆకర్షించే వినోద యాత్ర స్థలంగా దీనిని రూపొందించారు. యు.ఎస్.ఏ. వైపు జలపాతం ఎత్తు 51 మీ. కెనడా వైపు 48 మీ. ఎత్తు ఉంది.1941లో ఇంద్రధనుస్సు (రెయిన్‌బో) వంతెన కట్టి ఎన్నెన్నో సదుపాయాలు సమకూర్చారు. ఇప్పుడు నయాగరా జలపాతం అంతర్జాతీయ వినోదపర్యాటక కేంద్రంగా ప్రసిద్ధిగాంచింది. జలవిద్యుత్కేంద్రంగా 1852 నుంచి అభివృద్ధి చెందుతూ వచ్చింది. ప్రపంచ జలవిద్యుత్కేం ద్రాలలో ఇది మిక్కిలి పెద్దది.

## నరేంద్రదేవ్

దేశభక్తుడు, జాతీయ నాయకుడు. మేధావి. తన జీవితాన్ని ప్రజాసేవకే అంకితం చేసుకున్న మహాను భావుడు.

నరేంద్రదేవ్ 1889 అక్టోబర్ 30న ఉత్తరప్రదేశ్ లోని సీతాపూర్‌లో జన్మించారు. భారతీయ సంస్కృతిని గుడ్డిగా ఆరాధించక, హేతుబద్ధంగా పరిశీలించి విశ్వసించే గుణం నరేంద్రదేవ్‌కి విద్యార్థి దశలోనే అలవడింది.

అలహాబాద్‌లో విద్యాభ్యాసం గావించే రోజుల్లో తిలక్, అరవింద్ (చూ.)ల వారి ప్రభావానికిలోనైరి. కాశీవిద్యా. పీఠం, లక్నో విశ్వవిద్యాలయాలకు వైస్‌ఛాన్సలర్‌గా పనిచేసి ఆదర్శ విద్యావేత్తగా పేరు మోశారు. నరేంద్రదేవ్ 1929లో గాంధీజీని మొదటిసారి దర్శించారు. ఆయన సిద్ధాంతాలలో నచ్చిన వాటిని ఆచరణలో పెట్టారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని కారాగార వాసం అను భవించారు. అహమ్మద్‌నగర్, ఆల్మోరా జైళ్లలో నరేంద్ర దేవ్, జవహర్ లాల్ నెహ్రూ కలిసి శిక్ష అనుభవించారు. నరేంద్రదేవ్ త్యాగధనుడు. క్రమశిక్షణకు ప్రాధాన్యమిచ్చిన వ్యక్తి. వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని అణచి వేసే నిబంధనలను, నియమాలను వ్యతిరేకిం చాడు. 1956 ఫిబ్రవరి 19న తమిళనాడులోని ఈ రోడ్‌లో ఆచార్య నరేంద్ర దేవ్ కన్నుమూశాడు.



## నర్మాదానది

మధ్యప్రదేశ్‌లోని 'అమరకండిక' వద్ద ఆవిర్భ వించి అరేబియా సముద్రంలో కలసే ఒక నది. పశ్చిమంగా 1090 కి.మీ. మేర ప్రవహించి ఈ నది గుజరాత్ రాష్ట్రం ప్రవేశిస్తుంది. గుజరాత్ రాష్ట్రంలో మరొక 280 కి.మీ. మేర ప్రవహించి బ్రోచ్ వద్ద కాంజే సింధుశాఖలో పడుతూంది. వింధ్యా, సాత్పూరా పర్వతాల లోని కీకారణ్యాల గుండా ఈ నది ప్రవహిస్తూంది. కపిలధార, తబలపూర్, ధురంధర, అమృతశిల వంటి

జలపాతాలు ఈ నది ప్రవహించే మార్గంలో కనిపిస్తాయి. కపిల, వైశాలీ, ఎరంగే, ఇక్కు నదులు నర్మదానదికి ఉపనదులు. బ్రోచ్ జిల్లాలో 'నవగావ్ు' వద్ద నర్మదా నది మీద డామును నిర్మించి, దాదాపు 10 లక్షల ఎకరాల పంటనేలకు సాగునీటిని సరఫరా చేస్తున్నారు.

నర్మదానదిని 'రుద్రపుప్పు' అనీ, 'అయోనిజ' అనీ కూడా అంటారు. దీని ప్రసక్తి మహాభారతంలోనూ, మత్స్య, పద్మ, కూర్మ స్కాందపురాణాలలోనూ కనిపిస్తుంది. భారతదేశంలోని పుణ్యనదులలో నర్మదా నది ఒకటి. ఈ నదీ తీరం వెంట అనేక పుణ్యక్షేత్రాలు ఉన్నాయి.

## నలంద

భారతదేశంలోని బౌద్ధవిద్యా పీఠాలలో ప్రముఖమైంది. క్రీ.శ. 410లో ఫాహియాన్ (చూ) ఇండియాకు వచ్చి వెళ్ళిన తరువాత ఈ కేంద్రం ప్రసిద్ధి పొందింది. మహాయాన బౌద్ధానికి పట్టుకొమ్మ అయింది. కొరియా, జపాన్, చీనా, శ్రీలంక వంటి సుదూర ప్రాంతాలనుంచి అధ్యయనం చేయడానికి అనేక మంది విద్యార్థులు ఇక్కడికి వస్తూ ఉండేవారు. దర్శనాలు, జైనమతం, తంత్రవిద్య, ఖగోళశాస్త్రంఇచ్చటి అధ్యయన విషయాలు. దిఙాగుడు, ధర్మపాలుడు, స్థిరమతి 12 ఏళ్ళపాటు ఇక్కడ అధ్యయనం చేశారు. 1200లో తురుష్కుల దాడులలో ఈ విద్యాకేంద్రం నాశనమయింది.

## నల్గొండ జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. ఇది 16° 20', 17° 48' ఉ అక్షాంశాలకూ, 78° , 40', 80° –05' తూ. రేఖాంశలకూ మధ్య ఉంది.




విస్తీర్ణం: 14,242 చ.కి.మీ. జనాభా 22,75, 476 (1981), జిల్లాకేంద్రం: నల్గొండ.

ఈ జిల్లాకు కృష్ణానది (చూ.) ప్రధాన జలాధారం. ఇది ఏలేశ్వరం వద్ద ఈ జిల్లాలో ప్రవేశించి 85 కి.మీ. మేర జిల్లాలో ప్రవహిస్తూంది. దిండి, పెదవాగు, మూసి, అహల్య, ఆలేర్, కొనగలీ చిన్ననదులు. జిల్లాలో ప్రధానంగా లభించే సున్నపురాయి ఆధారంగా మిర్యాలగూడలో సిమెంటు పరిశ్రమ అభివృద్ధి చెందుతూంది. కృష్ణానది మీద విజయపురి (నందికొండ)వద్ద నాగార్జునకొండ(చూ.)లోయలో బహుళార్థ సాధకమైన నాగార్జునసాగర (చూ.)డామును నిర్మించారు (1967). ఇక్కడ జలవిద్యుదుత్పత్తి కూడా జరుగుతూంది. ఈ జిల్లాలో వరి, జొన్న, సజ్జ, వేరుసెనగ, మిర్చి, పసుపు, పొగాకు, ఆముదం ముఖ్యమయిన పంటలు. ఈ జిల్లాలో ముఖ్యంగా చూడదగిన స్థలాలు: దేవరకొండ కోట, యాదగిరి లక్ష్మినరసింహస్వామి సన్నిధి, నాగార్జునకొండ మ్యూజియమ్, నాగార్జునసాగర్ డామ్.

## నవగ్రహాలు

భారతీయ జ్యోతిశాస్త్రం నవగ్రహాల సంచారం మీద ఆధారపడి ఉంది. భూలోకంలో ఒక వ్యక్తి జన్మించిన క్షణంలో ఆకాశంలో గ్రహాల ఉనికిని లెక్కగట్టి దానిని బట్టి ఆ వ్యక్తి జాతక చక్రం తయారు చేస్తారు. మానవుల జీవిత ఘటనలమీద గ్రహాల ప్రభావం ఉందని జ్యోతి శాస్త్రవేత్తల విశ్వాసం. ఈ క్రింది తొమ్మిది గ్రహాలను నవగ్రహాలుగా పరిగణిస్తున్నారు. 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. కుజుడు (అంగారకుడు), 4. బుధుడు, 5. గురువు, (బృహస్పతి), 6. శుక్రుడు, 7. శని, 8. రాహువు, 9. కేతువు. పాశ్చాత్యజ్యోతి శాస్త్రంలో ఈ తొమ్మిది గ్రహాలనే గాక, 1. వరుణుడు (యూరేనస్), 2. ఇంద్రుడు (నెప్ట్యూన్), 3. ప్లూటో అనే మరోమూడు గ్రహాలసంచారాన్ని కూడా పరిగణనలోకి తీసుకుంటున్నారు. భారతీయులు గ్రహాలుగా భావించే తొమ్మిదింటిలోనూ నిజానికి సూర్యుడు గ్రహంకాదు. సూర్యుని చుట్టూ తిరిగే ఖగోళాలే గ్రహాలు. అలాగే చంద్రుడు స్వయంగా సూర్యుని చుట్టూ తిరిగే ప్రధాన గ్రహం కాదు. భూమి చుట్టూ తిరుగుతూ భూమితో పాటు సూర్యుణ్ణే చుట్టివచ్చే ఉపగ్రహం. రాహువు, కేతువు కూడా వాస్తవ గ్రహాలు

కావు. అవి ఛాయాగ్రహాలు. భూమినీడ, చంద్రునినీడ కూడా సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. వాటికి జ్యోతిశ్శాస్త్రవేత్తలు రాహు, కేతువులని పేర్లుపెట్టారు.

## నవధాన్యాలు

భారతీయ సంప్రదాయంలో వివాహ, ఉపనయనాది శుభకార్యాలలో నవధాన్యాలు ప్రధానమైన పాత్ర నిర్వహిస్తాయి. పాలికలలో (మూకుళ్లలో) నవధాన్యాలను చల్లి మొక్కలను మొలిపిస్తారు. అది శుభప్రదమని హిందువుల విశ్వాసం. ఈ క్రింది తొమ్మిది ధాన్యాలను నవధాన్యాలు అంటారు. అవి: *1. వరి ధాన్యం; 2. ఉలవలు; 3. పెసలు; 4. మినుములు, 5. నువ్వులు; 6. గోధుమలు; 7. అనుములు; 8. కందులు; 9. సెనగలు.*

## నవరత్నాలు

అమూల్యలైన రత్నాలు తొమ్మిది రూపాలలో ఉంటాయని భారతీయ సంప్రదాయం. అవి *1. వజ్రం, 2. వైడూర్యం, 3. గోమేధికం, 4. పుష్యరాగం, 5. మరకతం, 6. మాణిక్యం, 7. నీలం, 8. ప్రవాళం (పగడం), 9. మౌక్తికం (ముత్యం).*

## నవరసాలు

కావ్యానికి ఆత్మ 'రసం' అనీ, రసాలు తొమ్మిది విధాలుగా అభివ్యక్తం అవుతాయనీ భారతీయ అలంకార శాస్త్రం పేర్కొంటుంది. కావ్యంలో విభావాలు, అనుభావాలు, వ్యభిచారీ భావాలు అనే వివిధ భావాలు చేత పరిపోషం చెందిన స్థాయి భావమే రసంగా పరిణమిస్తుందని ఆలంకారికుల సిద్ధాంతం. అలంకారం శాస్త్రంలో చెప్పిన తొమ్మిది రసాలూ, వాటి స్థాయి భావాలూ ఈ క్రింది విధంగా ఉన్నాయి:

| రసము | స్థాయి |
|---|---|
| 1. శృంగారం | రతి |
| 2. వీరం | ఉత్సాహం |
| 3. కరుణ | శోకం |
| 4. అద్భుతం | విస్మయం |
| 5. హాస్యం | హాసం |
| 6. భయానకం | భయం |
| 7. బీభత్సం | జుగుప్స |
| 8. రౌద్రం | క్రోధం |
| 9. శాంతం | శమం |

ఈ తొమ్మిది రసాలలో భరతుడు శాంతాన్ని రసంగా పరిగణించలేదు. మరికొందరు భక్తి, వాత్సల్యం మొదలైన వాటిని కూడా రసాలలో చేర్చాలని వాదించారు.

## నాగార్జున కొండ

సుప్రసిద్ధ ప్రాచీన బౌద్ధ క్షేత్రం. గొప్ప చారిత్రక స్థలం. శ్రీ పర్వతమని దీనికి మరొక పేరు.

ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణా నదీ తీరంలో ఉన్న సుప్రసిద్ధబౌద్ధ క్షేత్రం. విజయపురి వద్ద హైదరాబాదుకు సుమారు 150 కి.మీ దూరంలో నల్గొండ–గుంటూరు జిల్లాల సరిహద్దులో ఉంది. మాధ్యమిక మహాయాన బౌద్ధం ఇక్కడ వర్ధిల్లింది. శూన్య వాద సూత్ర కారుడు, మహామేధావి అయిన ఆచార్య నాగార్జునుడు (క్రీ.శ. 2వ శతాబ్ది) జీవించిన పవిత్ర బౌద్ధారామకేంద్రం ఇది. నదీలోయలో అనేక బౌద్ధ శిథిలాలు 1922 ప్రాంతంలో బయట పడ్డాయి. స్తూపాలు, మఠాలు, ఆరామాలు విద్యాపీఠం, అధ్యయన కేంద్రాలు, ఆ కాలం నాటి శిలా శాసనాలు, శిల్పకళా ఖండాలు ఇందులో ఉన్నాయి. బుద్ధుని భౌతిక అవశేషం ఇక్కడ మహాస్తూపంలో భద్ర పరచబడి ఉండటం ఒక విశేషం. ఇది మహాచైత్యంలోని ఒక భాగం. స్తంభాల మీద లిఖించిన శాసనాలను బట్టి విజయపురిలోని బౌద్ధ కేంద్రం అతి ప్రాచీన మైనదని తెలుస్తూంది. వివిధ ప్రాంతాలనుంచి వచ్చే బౌద్ధ భిక్షువులకు ఆశ్రయమివ్వడానికి ఇక్కడ ప్రత్యేక సదుపాయాలు ఉండేవి. ఆ రోజుల్లో కాశ్మీరు, చీనా, గాంధార, శ్రీలంక వంటి సుదూర ప్రాంతాలనుంచి కూడా యాత్రికులు ఇక్కడికి వస్తూ ఉండేవారు. ఈ ప్రాంతాన్ని పాలించిన ఇక్ష్వాకు రాజవంశీయులలో స్త్రీలు బౌద్ధాన్ని అభిమానించేవారనీ పురుషులు హిందూ మతాన్ని అభిమానించేవారనీ ఇచ్చట



మహాభినిష్క్రమణం - బుద్ధుని జీవితంలోని ఒక ఘట్టం (శిలాప్రతిమ)

బయట పడిన శిథిలాలను బట్టి తెలుస్తూంది. ఇక్కడ అశ్వమేధయాగం చేసిన గుర్తులు, అవభృథస్నానం చేయడానికి అనువైన స్నానఘట్టాలు, శిథిలాలలో బయట పడ్డాయి. స్త్రీలు మొక్కుకొని వేయించిన శిల్పశిలా ఫలకాల మీద బుద్ధుని జీవితం నుంచి గ్రహించబడిన ఘట్టాలు జాతక కథలు కానవస్తాయి. ఈ శిథిలాలను 1954లో త్రవ్వి వాటిని సురక్షిత ప్రాంతానికి (కొండ మీదికి) తరలించి భద్రపరిచారు. కొండమీదనే ఒక మ్యూజియం (1966) నిర్మించి ఇచ్చట లభించిన పురాతత్త్వ శిల్ప సంపదను ప్రదర్శిస్తున్నారు. వినోద పర్యాటకులకు నాగార్జున కొండ దర్శనీయమైన స్థలం. నది మధ్యలో ఉన్న కొండ మీదికి వెళ్ళడానికి లాంచ్ సదుపాయం ఉంది.

## నాగార్జున సాగరు డాము

విజయపురి (16° 35′ ఉ. అక్షాంశ, 79° 17′ తూ. రేఖాంశ) వద్ద కృష్ణానది(చూ.) మీద నిర్మింపబడిన (1955–1967) పెద్ద డాము. ఇది నల్గొండ జిల్లా మిర్యాలగూడా తాలూకా నందికొండ గ్రామం వద్ద ఉంది.


నాగార్జునసాగరు డాము

నదికి ఆవలి వైపు గుంటూరు జిల్లా 2,000 ఏళ్ళ క్రిందట ఈ ప్రాంతంలో ఒక ఉజ్వల నాగరకత వర్ధిల్లింది. మాధ్యమిక మహాయాన బౌద్ధ మతాచార్యుడు నాగార్జునుడు (క్రీ.శ. 2వ శతా.) జీవించిన ప్రాంతం కావడం వల్ల ఈ డాముకు ఆ మహనీయుని పేరు పెట్టారు. 1955లో జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చెయ్యగా 1967లో నాటి భారత ప్రధాని అయిన ఇందిరా గాంధీ ఈ డాముకు సంబంధించిన జలాశయం నుంచి నీటిని పంట చేలకు మొదట సారిగా విడుదల చేశారు.

ఈ డాము నిర్మాణానికి సంబంధించిన కొన్ని విశేషాలు ఉన్నాయి. ఇంత భారీ డాము స్వరూపాన్ని సిద్ధపరచిన వారందరూ స్వదేశీ ఇంజనీర్లే! డాము నిర్మాణంలో ఉపయోగించిన బండరాళ్ళు స్థానికంగా లభించినవే. సిమెంటు, రాయి కలిపి కట్టడం దాని మరొక ప్రత్యేకత. అందుకే దీనిని మేసనరీ (తాపీపని)డాము అంటారు. దీనికి ఇరువైపులా $1\frac{1}{2}$ కి.మీ. పొడవున మట్టి డామును నిర్మించారు. డాము ఎత్తు దాదాపు 125 మీ. మేసనరీ డాము పొడవు 1426 మీ. నాగార్జున సాగరు డాము వల్ల ఏర్పడిన జలాశయం విస్తీర్ణం 285 చ.కి.మీ. పూర్తి వరద మట్టం ఎత్తు 164 మీటరులు.

నాగార్జున సాగరు డాము కుడి కాలువ పేరు జవహర్‌లాల్ నెహ్రూ కాలువ. గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో ప్రవహించే ఈ కాలువ, అక్కడి చేలకు పంట నీటిని అందిస్తూంది. ఎడమ వైపు కాలువ పేరు లాల్ బహదూర్ కాలువ. ఖమ్మం, కృష్ణా జిల్లాలలో ఇది ప్రవహిస్తూంది. కాలువ వ్యవస్థ అక్కడక్కడ లోతుగా ఉండి, కొన్ని చోట్ల సొరంగాల (టన్నెల్) ద్వారా ఆక్విడక్టుల ద్వారా పోతూంది. మొత్తం మీద 14 లక్షల హెక్టారుల పంట భూమికి సాగు నీటిని అందిచడం ఈ డాము లక్ష్యం. 'పంప్డ్‌స్టోరేజి' పద్ధతి మీద జల విద్యుత్తు ఉత్పత్తి జరుగుతూంది. అతివృష్టి సమయంలో కృష్ణా నదికి వచ్చే వరదలను అరికడుతూ నాగార్జున సాగరు డాము ఒక బహూళార్థ సాధక ప్రణాళికగా రూపొందింది. (చూ. నాగార్జున కొండ).

## నాగార్జునాచార్య

క్రీ.శ. 2వ శతా.



**కృష్ణా**నదీ లోయలోని శ్రీపర్వతం మీద జీవించిన మహా విద్వాంసుడైన బౌద్ధ భిక్షువు (చూ. నాగార్జున కొండ). బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ఆచార్య నాగార్జునుడు బౌద్ధ దర్శనాలలో ప్రసిద్ధిగన్న మాధ్యమిక మహాయాన సంప్రదాయానికి ప్రవక్త. ఇతడు విదర్భలోని

ఒక పండిత వంశంలో జన్మించి హిందూమత గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి చివరికి బౌద్ధమతం స్వీకరించి, బౌద్ధ భిక్షువు అయాడు. సాతవాహన చక్రవర్తి గౌతమీ పుత్రయజ్ఞశ్రీకి ఈయన సన్నిహితుడు. ఆయన పేర నాగార్జునాచార్యుడు వ్రాసిన లేఖ 'సుహృల్లేఖ' గా ప్రసిద్ధి మైంది: అది చీనా, టిబెట్ భాషలలో ఇప్పటికీ భద్రపరచబడింది. ఇందు ధర్మసందేశాలు పొందుపరచబడి ఉన్నాయి.

## నాగాలాండ్ రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. ఇది భారత దేశంలో ఈశాన్య భాగంలో ఉంది. తూర్పున అంతర్జాతీయ సరిహద్దుగా బర్మాదేశం ఉంది. ఈ రాష్ట్రానికి ఈశాన్యంగా అరుణాచలప్రదేశ్, దక్షిణాన మణిపూర్, పశ్చిమాన అస్సాం ఉన్నాయి. బ్రహ్మపుత్రా నది లోయలో ఈ రాష్ట్రం ఉంది. ఈ రాష్ట్రం అంతా కొండల మయం.ఎత్తయిన శిఖరాగ్రం శరామతి; ఎత్తు 3850 మీ.; రాష్ట్ర రాజధాని: కోహిమా; సముద్ర మట్టానికి ఇది 1470 మీ. ఎత్తునఉంది. ధనసిరి,డోమాంగ్,డీకూ, జాన్జీ ప్రధానమయిన నీటివనరులు.రాష్ట్రప్రజలు నాగాలు అనబడే ఆదిమ జాతులకు చెందినవారు. వీరిలో అనేక ఉపజాతులు అంగామీ, జీలియాంగ్, రెంగోమా, కుకీవంటి తెగలవారు ఉన్నారు. వారంత కోహిమా ప్రాంతంలో నివసిస్తుంటారు. ఆవూ జాతివారు మొఖుక్చుంగ్ జిల్లాలో ఉంటారు. ఇతర చోట్ల లోతా, సేమా, చాంగ్, సంగటన్, గెవ్సగ్గన్ యవ్ంచుంగర్, ఫోయ్, కొన్యావ్ అనే ఆదిమజాతులవారు కనిపిస్తారు.




1957–61 మధ్య కేంద్రపాలిత ప్రాంతంగా ఉన్న ఈ ప్రాంతం 1963 నుంచి రాష్ట్ర ప్రతిపత్తిని సంతరించుకుంది. ఈ రాష్ట్ర ప్రజలకు జీవనాధారం సేద్యం. వరి ముఖ్యమయిన సాగుపంట. పర్వత సానువులలోని చెట్లను నరికి సాగుకు అనుకూలంగా చెయ్యడాన్ని వీరు జుమ్మింగు సేద్యం అంటారు. అయితే ఇప్పుడు ఈ పద్ధతికి స్వస్తి చెప్పి, సానువులలో గట్లువేసి పండ్లతోటలూ, అడవులు, వాణిజ్యపంటలు పండిస్తున్నారు. నాగా ప్రజలు హస్త కళలలో నిపుణులు. దావో అనే ఒక చిన్న పరికరంతో వారు అందమైన వస్తువులు రూపొందిస్తారు. ఇక్కడ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి బాగా జరుగుతూంది. కాగితం—కలపగుజ్జు కర్మాగారాలు, పంచదార మిల్లులు ఉన్నాయి.

ప్రకృతి సౌందర్యంతో శోభిల్లే పర్వత సానువులు చక్కటి శీతోష్ణస్థితి గలిగి విహార స్థలంగా వినోదయాత్రికులను ఈ రాష్ట్రం ఎక్కువగా ఆకర్షిస్తూంది. ఇక్కడి రంగుల పువ్వులు, వన్యప్రాణులు, రంగురంగుల పక్షులు పర్యాటకుల మనస్సులను విశేషంగా ఆకట్టుకొంటున్నాయి.

## నాగేశ్వరరావు పంతులు, కాశీనాథుని

ప్రముఖ దేశభక్తుడు. దానశీలి. 'విశ్వదాత,' 'దేశోద్ధారక' బిరుదాంకితులు. భారతదేశ స్వాతంత్ర్యం సముపార్జనకు కృషి చేసిన మహాపురుషులలో ఒకరు.

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా ఎలకుర్రు గ్రామంలో బుచ్చయ్య, శ్యామలా అను దంపతులకు 1867లో నాగేశ్వరరావు పంతులు జన్మించారు. మచిలీపట్నంలో మెట్రిక్యులేషన్, గుంటూరులో ఎఫ్.ఎ పరీక్షలు పాసైయి మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి.ఏ చదివి పరీక్షకు వెళ్ళకుండా మానేశారు.

1903లో 'అమృతాంజనం లిమిటెడ్' అనే మందుల షాపు ప్రారంభించారు. తెలుగువారిలో రాజకీయ చైతన్యం కలిగించడం కోసం 1909 సెప్టెంబరు 9న బొంబాయి నుండి 'ఆంధ్రపత్రిక' ను వార పత్రికగా ప్రారంభించారు. తన మకామును బొంబాయి నుండి 1914లో మద్రాసుకు మార్చగా, 'ఆంధ్రపత్రిక' దినపత్రిక అయింది. అటు యుద్ధ వార్తలను, ఇటు స్వాతంత్ర్యోద్యమ వార్తలను కూడా ప్రచురిస్తూ తెలుగు ప్రజలవికాసానికి, చైతన్యానికి ఆయన చేసిన కృషి మరువరానిది.1911లోస్వగ్రామం ఎలకుర్రులో'శ్యామలాంబా ధర్మవిద్యాలయం'స్థాపించి



అందులో హరిజన విద్యార్థులకు ప్రవేశం కల్పించారు. హరిజన సేవా సంఘానికి అధ్యక్షులుగా ఉన్నారు. గ్రంథాలయోద్యమం, హిందీ ప్రచారోద్యమం, ఖద్దరు ఉద్యమానికి ఆయన చేసిన కృషి గణనీయమైంది. గాంధీజీ పిలుపును అందుకుని నాగేశ్వరరావు రాజకీయ రంగంలో ప్రవేశించారు. 1924లో 'భారతి' అనే సాహిత్య మాస పత్రికను ప్రారంభించి తెలుగు భాషాభివృద్ధికి, తెలుగు వాఙ్మయాభివృద్ధికి గణనీయమైన సేవ చేశారు. కొమర్రాజు లక్ష్మణరావు (చూ.)ప్రారంభించిన 'ఆంధ్ర విజ్ఞానసర్వసం'చేపట్టి రెండవకూర్పు1932లోప్రకటించారు. 1926లో 'ఆంధ్రగ్రంథమాల' అనే ప్రచురణ సంస్థను స్థాపించి అనేక ఉత్తమ గ్రంథాలను ప్రచురించారు.

ఆంధ్రరాష్ట్రావతరణం ముందు తెలుగు దేశంలో సర్కారు, రాయలసీమ రాజకీయ నాయకుల మధ్య ఏకాభిప్రాయం కుదర్చడానికి బాధ్యత వహించి ఒప్పందం కుదిర్చారు. మద్రాసులోని పంతులు గారి సొంత బంగళా 'శ్రీబాగ్'లో ఒప్పందంపై 1937లో సంతకాలు జరిగినందున' దీనికి 'శ్రీబాగ్ ఒడంబడిక' అని పేరు. 1938 ఏప్రిల్ 11వ తేదీన శ్రీ నాగేశ్వరరావు పంతులు గారు శివసాయుజ్యం పొందారు.

## నాచన సోమన 15వ శతా.

'ఉత్తర హరివంశం' అనే సుప్రసిద్ధ కావ్యం రచించిన ఆంధ్ర మహాకవి. కొందరు తెలుగు విమర్శకులు ఈయన కవిత్రయంలో గొప్పకవి తిక్కన కంటే కూడా గొప్పవాడనీ ప్రశంసించారు. అయితే కవిత్రయంలో ఒకడైన ఎర్రాప్రగడ వ్రాసిన హరివంశం కావ్యమే ఈ నాచన సోమన కావ్యంకంటే గొప్ప కావ్యం అని మరికొందరు విమర్శకులు వాదించారు.

సోమన తన కావ్యంలోని ఆశ్వాసాంత గద్యంలో తాను 'సకల భాషా భూషణుడ'ననీ 'సాహిత్య రస పోషణుడ' ననీ, 'సంవిధాన చక్రవర్తి'ననీ, 'నవీన గుణసనాథుడ'ననీ చెప్పుకొన్నాడు. ఈ కావ్యానికి అవతారిక లేకపోవడం వల్ల కవిని గూర్చిన విశేషాలు ఎక్కువగా తెలియరావడం లేదు. ఈ కావ్యంలోని నరకాసుర వధ, హంస ఢింభకోపాఖ్యానం, ఉషాపరిణయ కథ వంటివి మిక్కిలి రసవత్తరంగా రచించబడినాయి.

## నాట్యశాస్త్రం

చూ. భరతముని

## నాదిర్షా 1688–1747



మొగలాయీ పాలన అంతిమ దశలో భారతదేశం పైకి దాడిచేసిన ఇరాన్(షా) చక్రవర్తి. ఢిల్లీ, లాహూరు పట్టణాన్ని ముట్టడించి, ధన వస్తురాసులను ఎత్తుకుపోయాడు.ఇలాఎత్తుకుపోయిన వాటిలో ప్రతిష్ఠనార్జించిన కోహినూరు వజ్రం, నెమలి సింహాసనం కూడాఉన్నాయి. ముస్లిములయిన షియా, సున్నీ శాఖల మధ్య ఐక్యత సాధించటానికి పాటుపడ్డాడు

## నాన్ ఎలైన్డ్ మూవ్‌మెంట్

ఏ అగ్ర రాజ్య కూటమిలోనూ చేరకుండా తటస్థంగా ఉండాలి అనే వాదాన్ని అలీనోద్యమము అంటారు.

రెండవ ప్రపంచ యుద్ధం 1945 లో ముగిసిన తర్వాత అమెరికా, సోవియట్ రష్యా దేశాలు అగ్రరాజ్యాలుగ ఏర్పడ్డాయి. తరువాత కొద్దికాలంలోనే భారతదేశంలాగా ఎన్నో దేశాలు త్వరత్వరగా స్వాతంత్ర్యం పొందసాగాయి. ఈ రాజ్యాలను తమ తమ పక్షాలలో చేర్చుకోవాలని అగ్రరాజ్యాలు రెండూ పోటీపడసాగాయి. ఫలితంగా ఈ దేశాలు స్వాతంత్ర్యం పొందినా ఆ అగ్ర రాజ్యాల ఒద్దికలో ఉండవలసి వచ్చేది. ఈ పరిస్థితి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకు ఎంత మాత్రం నచ్చలేదు. 1955లో ఇండోనీషియాలోని బాండుంగ్‌లో జరిగిన ఆసియా దేశాల మహాసభ నెహ్రూ ప్రతిపాదించిన పంచశీల సూత్రాలను ఆమోదించింది. తర్వాత 1956 లో యుగోస్లావియాలో జరిగిన సమావేశంలో నెహ్రూ, ఈజిప్టు అధ్యక్షుడు నాసర్, యుగోస్లావియా అధ్యక్షుడు టిటో ఈ అలీనోద్యమాన్ని రూపకల్పన చేశారు. 'అలీనం' అంటే ఏ అగ్రరాజ్య కూటమిలోనూ చేరకుండా స్వతంత్రంగానూ, తటస్థంగానూ ఉండడం. మొదట్లో

ఈ ఉద్యమంలో 25 దేశాలు మాత్రమే సభ్యత్వాన్ని స్వీకరించినా, ఈనాడుదినిలో 101 దేశాలు సభ్యదేశాలుగా ఉన్నాయి. ఇపుడు ''నామ్'' అని పిలువబడే ఈ అలీన ఉద్యమం గణనీయమైన తృతీయ శక్తిగా రూపొందింది. దీని సమావేశాలు 1961లో బెల్‌గ్రేడ్, 1964లో కైరో, 1970లో లుసాకా, 1973లో ఆల్‌జీర్స్, 1976లో కొలంబో, 1979లో హవానా, 1983లో న్యూఢిల్లీ, 1986లో సైప్రస్, 1988లో జింబాబ్వేలోనూ జరిగాయి.

## నాన్ కో ఆపరేషన్‌మూవ్‌మెంట్

చూ.సహాయ నిరాకరణోద్యమం

## నానాజాతి సమితి చూ. ఐక్యరాజ్యసమితి

## నానాఫడ్నవీస్ 1742–1800

మహారాష్ట్రకుచెందిన రాజనీతిజ్ఞుడు. పరిపాలనా దక్షత కలవాడు. పీష్వా బాలాజీరావు కుమారులయిన విశ్వేశ్వర రావు, మాధవరావులతో కలిసి చదువుకున్నాడు. 1756 లో 'ఫడ్నవీస్' హోదాను అందుకున్నాడు. మూడవ పానిపట్టు యుద్ధం (1761)లో మహారాష్ట్ర పీష్వాలు పరాజయం పొందారు. విశ్వేశ్వరరావు వీరస్వర్గం పొందారు. ఆ బెంగతో బాలాజీరావు మరణించాడు. మాధవరావు పీష్వా అయాడు. అతని పినతండ్రి పీష్వా కాగోరి శత్రువులయిన ముస్లిము, ఇంగ్లీషు ప్రభువులతో చేయి కలిపి చేసిన ప్రయత్నాలను నానాఫడ్నవీస్ చాకచక్యంతో అరికట్టగలిగాడు. ఇంగ్లీషు వారి కుటిల నీతిని నిరసించి నానాఫడ్నవీస్ వారిని మహారాష్ట్ర నుంచి, వీలయితే దేశంనుంచే తరిమివేయాలని కంకణం కట్టు కున్నాడు. హైదర్ మహరాజాసింథియా, నాగపూర్ భాన్‌స్లే,



పీష్వాల సేనలు ఎవరికి వారు ఒకే సమయంలో దండెత్తి ఇంగ్లీషు వారిని వోడించాలని పథకం వేశాడు. చివరికి మొదటి మహారాష్ట్ర యుద్ధం సంధితో ముగిసింది. తర వాత నారాయణరావు నానా ఫడ్నవీస్ సహాయంతో పీష్వా అయాడు.

నానాఫడ్నవీస్ ఘటనాఘటన సామర్థ్యంగల మేధావి. పూణే నగరపు నీటి సరఫరా వ్యవస్థను ఆయనే రూపొందించాడు. బెల్గాం నగరాన్ని నిర్మించి పెక్కు ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టి నిర్వహించాడు.

## నానాసాహెబు



ప్రథమ భారత స్వాతంత్ర్యసమర(1857) నాయకులలో ఒకడు. మాజీ పీష్వా బాలాజీరావు దత్తపుత్రుడు.అసలుపేరు దండుపంత్.

భారతదేశంలో బ్రిటిషు పాలనను తుదముట్టించాలని పట్టుదలతో ఝాన్సీ లక్ష్మీ బాయి (చూ.) వంటి భారతీయ యోధులను సమాయత్తం చేయడంలో ఈయన విశేష కృషి చేశాడు. 1857లో కాన్పూరులో జరిగిన సిపాయీల తిరుగు బాటులో నానాసాహెబు అనుచరులు బ్రిటిషు సేనలను చిత్రవధకు గురిచేశారు. అయినా చివరికి తిరుగుబాటు విఫలం కావడంతో 1859 లో నానాసాహెబ్ నేపాల్‌కు పారిపోయాడు. ఈయన మరణాన్ని గురించిన వివరాలు తెలియవు.

## నాబార్డ్ చూ. రిజర్వుబ్యాంకు

## నాయకులు

కావ్యంలో అన్ని రసాలలోనూ నాయకులుగా ఉండేవారు నాలుగు విధాలుగా కనిపిస్తారు: 1. ధీరోదాత్తుడు, 2. ధీరోద్ధతుడు, 3. ధీరశాంతుడు, 4. ధీరలలితుడు. ధైర్యం మొదలైన ఉదాత్తగుణాలు గలవాడు ధీరోదాత్తుడు. గర్వం, అసూయ, క్రోధం మొదలైన గుణాలు కలవాడు ధీరోద్ధతుడు. ప్రసన్నాత్ముడు, ధీరుడు అయిన నాయ కుడు ధీరశాంతుడు. నిశ్చింతుడు, కళలలో ఆసక్తి కలవాడు, నిరంతరమూ సుఖజీవనాభిషి ధీరల లితుడు. శృంగార నాయకులలో కూడా నాలుగు విధాలైన నాయకులు ఉన్నారు. 1. అనుకూలుడు: ఒకే నాయిక యందు అనురాగం గల వాడు; 2. దక్షిణుడు. అనేక నాయికలను సమానంగా ప్రేమించేవాడు; 3. ధృష్టుడు—నాయిక పట్ల అపచారం చేసి కూడా నిర్భయంగా

ప్రవర్తించేవాడు; 4. శఠుడు— ఇతరులకు తెలియకుండా నాయికకు మాత్రమే తెలిసేట్టు అప్రియం ఆచరించే వాడు.

## నాయికలు

శృంగార నాయికలు మూడు విధాలు. 1. స్వీయ (కట్టుకున్న భార్య); 2. పరకీయ (తండ్రి అధీనంలో ఉండే కన్యగాని మరొకరి భార్యగాని); 3. సామాన్య (వేశ్య). శృంగార రసంలో అవస్థాభేదాలను బట్టి ఎనిమిది విధాలనాయికలను గుర్తించారు. 1. స్వాధీన పతిక (ప్రియుణ్ణి తన చెప్పుచేతలలో పెట్టుకునే నాయిక); 2. వాసకసజ్జిక (అలంకరించుకుని శయ్యాదులను సిద్ధం చేసి పతికోసం నిరీక్షించే నాయిక); 3. విరహోత్కంఠిత (చెప్పిన సమయానికి నాయకుడు రాలేదని పరితపించే నాయిక); 4. విప్రలబ్ధ (సంకేతస్థలానికి వెళ్ళి అక్కడ ప్రియుడు కనిపించకపోతే కలవరపడే నాయిక); 5. కలహాంతరిత (కోపంగా ఒళ్ళూ పైనా తెలియకుండా ప్రియుణ్ణి దూషించి తరువాత పశ్చాత్తాపపడే నాయిక); 6. ఖండిత (పరస్త్రీ వద్దకు పోయి తిరిగి వచ్చిన ప్రియుడి శరీరం మీద శృంగార లక్షణాలు కనిపించగా ఆగ్రహించే నాయిక); 7. ప్రోషిత భర్తృక (నాయకుడు పరదేశంలో ఉండడం వల్ల పరితపించే నాయిక); 8. అభిసారిక (ప్రియుణ్ణి కలుసుకోడానికి సంకేత స్థలానికి పోయే నాయిక).

## నారాయణదాసు, ఆదిభట్ల

హరికథా పితామహుడు, పండితుడు, బహు భాషావేత్త. శ్రీకాకుళం జిల్లా బొబ్బిలి తాలూకా అజ్జాడ గ్రామంలో 1834లో నారాయణదాసు జన్మించారు. తండ్రి నుండి పాండిత్య మహిమ, కవితా కౌశలము, తల్లినుండి రసభావుకత్వాన్నీ దాసు సంపాదించు కొన్నాడు. వ్రాయడం సరిగా రాని వయస్సులోనే భాగవతాన్ని రాగయుక్తంగా నేర్చుకున్నాడు. దాసు మొదట యక్ష గానాలను తర్వాత హరికథా ప్రబంధాలను రచించి, కార్యక్రమాల్లో పాల్గొనుటయే గాక శిష్యులకు నేర్పేవారు. అనేక రాజసంస్థానాలలో సత్కారాలను పొందారు. దాసు గడించిన కీర్తిని గుర్తించి ఆనంద గజపతి మహారాజు ఆయనను తన దర్బారులో పండితునిగా నియమించారు. 1919లో విజయరాయ గజపతి స్థాపించిన సంగీత పాఠశాలకు అధ్యక్షుడిగా దాసు నియమితులైనారు. 1945లో నారాయణదాసు కీర్తిశేషు లయ్యారు.

## నార్వే

యూరప్ ఖండంలో వాయవ్య దిశలో ఉన్న ఒక దేశం. ఒక రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలించేదేశం ఇది. అర్ధరాత్రి ఆకాశంలో 'ఆరోరా బొరియాలిస్' అనబడే కాంతులు ఇక్కడ కనిపిస్తాయి. మే, జూన్, జూలై నెలల్లో సూర్యుడు అసలు అస్తమించడు. నవంబరు మాసాంతం నుంచి జనవరి నెల ఆఖరు వరకూ సూర్యుడు ఉదయించడు.

విస్తీర్ణం: 3,23,878 చ.కి.మీ.; జనాభా: 42, 02,000 (1988), రాజధాని: ఆస్లో; అధికార భాష: నార్వేజియన్. పర్వత మయమయిన ఈ దేశంలో సహజ సంపద పుష్కలంగా ఉంది. బార్లీ, ఓట్ ధాన్యం, రైధాన్యం, బంగాళదుంపలు ముఖ్యమయిన పంటలు. మత్స్య పరిశ్రమ భారీ స్థాయిలో నిర్వహించబడుతూంది. గండుమీను, హెర్రింగ్, ట్యూనా, సీల్, తిమింగలం, మేకెరిల్, సాల్మన్ చేపలు లభిస్తాయి. అడవులనుంచి లభించే కలపతో కలపగుజ్జు, కాగితం తయారీ, ప్లైవుడ్ మొదలైన పరిశ్రమలు బాగా సాగుతున్నాయి. జలవిద్యుత్ పుష్కలంగా లభించడం వల్ల ఫ్యాక్టరీలకు ఇంధనం కొరతలేదు. అల్యూమినియం పరిశ్రమకు జలవిద్యుత్తు లభిస్తూంది. నార్వే పశ్చిమ తీరంవెంబడి ఫియోర్డ్లు అనబడు ఎత్తయిన కొండశిఖరాలు కానవస్తాయి. నార్వే దేశం స్కాండినేవియా ద్వీపకల్పంలో తూర్పున ఉంది. నార్వే దేశపు మ్యాపును స్వీడెన్‌లో చూడనగును.

## నాసిక్

చూ. గోదావరి నది

## నికరాగ్వా

మధ్య అమెరికాలోని ఒక స్వతంత్ర గణ రాజ్యం. విస్తీర్ణం: 1,27,849 చ.కి.మీ.; జనాభా: 36, 22,000 (1988), రాజధాని: మానాగ్వా; అధికార భాషలు: స్పేనిష్, ఇంగ్లీష్. స్పేనిష్—ఇండియా సంకర మెస్టిజో జాతులు 69 శాతం, తెల్లవారు 14 శాతం, నీగ్రో 8 శాతం, జాంబో సంకర(నీగ్రో—ఇండియన్) జాతులు 5 శాతం. రోమన్ కేథలిక్ 87 శాతం పాటిస్తారు.

పసిఫిక్ తీరాన సారవంతమయిన నేలలో ప్రత్తి పుష్కలంగా పండుతూంది. దానిలో ఎక్కువ భాగం ఇతర దేశాలకు ఎగుమతి అవుతూంది. చెరకు, కాఫీ, జొన్న, మొక్కజొన్న, అరటిపండ్లు, వరి, ప్రత్తి, నువ్వులు ఇతర పంటలు. పశువుల పెంపకం, పందుల పెంపకం సాగుతున్నాయి. బంగారం ముఖ్య ఖనిజ నిక్షేపం. రొయ్యలు, చేపలు లభిస్తున్నాయి. అడవులలో కలప దొరకుతుంది.

## నిజామాబాదు జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. 18° 05' 19° 03' ఉ. అక్షాంశాలు, 77° 32', 78° 40' తూ. రేఖాంశాల మధ్య ఉన్న ఈ నిజామాబాదు జిల్లాకు ఉత్తరాన ఆదిలాబాదు తూర్పున కరీంనగరం, దక్షిణాన **మెదక్, కర్నాటక, పశ్చిమాన మహారాష్ట్ర సరిహద్దులు.**

విస్తీర్ణం: 7,956 చ.కి.మీ.; జనాభా 16,79,279 (1981); జిల్లా కేంద్రం: నిజామాబాదు. కొండలు, మిట్టలు, పీఠభూమి ప్రాంతం ఎక్కువగా ఉన్నా, మహారాష్ట్ర నుంచి ప్రవహిస్తూ వచ్చిన గోదావరి నది (చూ.) ఈ జిల్లాకు ఉత్తర సరిహద్దు వెంబడి 112 కి.మీ. మేర పారుతూంది. గోదావరికి ముఖ్య ఉపనది అయిన మంజీరా, ఎడ్లకట్ట అనే మరో చిన్న నది ఇతర జలాధారాలు. పోచారం జలాశయం, నిజాంసాగరు జలాశయం, ఇటీవల (1980) పోచంపాడు వద్ద నిర్మించిన శ్రీరామసాగరు సాగునీటిని సరఫరా చేస్తూ ఉండటంతో ఈ జిల్లా సుసంపన్నమైంది. అనేక పంటలను రైతాంగం పండిస్తు న్నారు. వరి, చెరకు ప్రధానమయిన పంటలు. పంచదార పరిశ్రమ జిల్లా ఆర్థిక వ్యవస్థకు దోహదం చేస్తూంది. చారిత్రక స్థలం అయిన డిచ్‌పల్లి, నిజాంసాగర్, పోచవరం, అలిసాగర్ వినోద పర్యాటకుల్ని విశేషంకా ఆకర్షిస్తున్నాయి. నిజాంసాగర్ ఆయకట్టులో చెరకు విరివిగా పండుటవల్ల రాష్ట్ర ప్రభుత్వ రంగమున పంచదార మిల్లు పనిచేస్తుంది. రాష్ట్రంలో పెద్ద పంచదార మిల్లులలో ఇది ఒకటి.




## నిజాము

దక్కన్‌లో 1713లో నిజాముల్ ముల్క్ స్థాపించిన అసఫ్‌జాహీ రాజవంశం. వారు ఏలిన ప్రాంతం నైజాం. దీనికి హైదరాబాదు రాజధాని. కోస్తా ప్రాంతంలోని ఉత్తర సర్కారులను 1768లో బ్రిటిషు ఈస్ట్ ఇండియా కంపెనీకి నిజాం ఇచ్చివేశాడు. 1800–01 లో రాయలసీమజిల్లాలను నిజాము బ్రిటిషు ఈస్ట్ఇండియా కంపెనీకి దత్తం చేశాడు. శేషించిన తెలుగు మాట్లాడే ప్రాంతం (తెలంగాణా జిల్లాలు), మరాఠీ మాట్లాడే ప్రాంతం (మరట్వాడా జిల్లాలు), కన్నడం మాట్లాడే ప్రాంతం(రాయచూరు, గుల్బర్గా, బీజాపూరు జిల్లాలు) హైదరాబాదు సంస్థానంగా భారత స్వాతంత్ర్యానంతరం 1948లో పోలీసు చర్య జరిగేవరకూ నవాబుల పాలనలో ఉండి, ఆ తరువాత భారతదేశంలో విలీనం అయింది.


**ఉస్మాన్ అలీఖాన్**

ఆఖరి అసఫ్‌జాహీ నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఏడవవాడు. నిజాం నవాబులలో మీర్ మహబూబ్ అలీఖాన్(చూ.) ప్రజానురాగం చూరగొన్న ఉదారస్వభావం గలవాడుగాను, మత సామరస్య పోషకుడుగాను కీర్తి పొందాడు. అతని ప్రధాని సాలార్‌జంగ్ పరిపాలనను సువ్యవస్థీకరించి విద్యా, వైద్య సౌకర్యాలు కల్పించాడు. రైలుమార్గం వేయించిన మహనీయుడు కూడా ఆయనే.

## నివేదిత

దేశం కాని దేశానికి వచ్చి దైవానికీ ప్రజాసేవకీ తన జీవితాన్ని అంకితం చేసిన నారీరత్నం నివేదిత. భారతీయుల గురించి మత తత్వాన్ని గురించి విన్న ఐర్లాండ్ దేశస్థురాలైన నివేదిత తన సర్వస్వాన్ని వదిలి భారతదేశానికి వచ్చి హిందూమతాన్ని స్వీకరించింది. 1867 అక్టోబరులో నివేదిత జన్మించింది. పుట్టినప్పుడు తల్లిదండ్రులు పెట్టిన పేరు ''నోబుల్''. విద్యాభ్యాసం

ముగించాక లండన్‌లో ఒక స్కూలు ప్రారంభించింది నివేదిత. స్వామి వివేకానంద అమెరికాలో ఒక కార్యక్రమంలో పాల్గొని తిరిగి భారతదేశానికి తిరిగి వస్తూ స్నేహితుల పట్టుదలపై ఇంగ్లండ్ విచ్చేశాడు. అప్పుడే నోబుల్ వివేకనంద ఇచ్చిన ఉపన్యాసాలని శ్రద్ధాసక్తులతో విన్నది. మరుసటి సంవత్సరం వివేకా నందుడు మరల ఇంగ్లండ్ వచ్చినప్పుడు నోబుల్ ఆయన్ని కలుసుకొని గంటల కొద్దీ సేపు చర్చలు జరిపింది. వివేకానందుడి ఆహ్వానంపై ఇంగ్లండు వదిలి కలకత్తా వచ్చింది. హిందూ మతాన్ని స్వీకరించి 'నివేదిత'గా పేరు మార్చుకుంది.

కలకత్తాలో ప్లేగు వ్యాధి వ్యాపించినపుడు అనేక మంది యువతీ యువకులను తోడుతీసుకెళ్ళి రోగులకి చికిత్స చేసింది. ఉత్తర భారతదేశంలో పాఠశాలలు స్థాపించింది. వివాహితులైన వనితలకి ఆరోగ్య సూత్రాలు,నిత్యజీవితంలో ఎదుర్కోవలసిన సమస్యలపై బోధనాతరగతులు నిర్వహించడమేగాక వితంతు శరణాలయాన్ని తన ఇంటనే నెలకొల్పింది. ఈ సంస్థ నిర్వహణకి దేశదేశాల నుండి విరాళాలు అందాయి. 1911 అక్టోబరులో నివేదిత స్వర్గస్థురాలయింది.

## నెదర్లాండ్స్

పశ్చిమ యూరప్‌లో 'నార్త్‌సీ' (ఉత్తర సముద్రం) ని ఆనుకుని (రైన్‌నదీ ముఖద్వారంలో) ఉన్న ఒక చిన్న సంపన్న దేశం. రాజ్యాంగానికి లోబడి రాజ వంశీయులు పరిపాలించే దేశం ఇది. సముద్ర మట్టానికి దాదాపు 7 మీటరుల దిగువన ఉండే పోల్డరు ప్రాంతం ఈదేశంలో అతి సారవంతమయిన భాగం. సముద్రపు ముంపుకు గురికాకుండా డైకు నిర్మాణాలు ఈ పల్లపు ప్రాంతాలను రక్షిస్తూఉంటాయి.ఇసుక మైదానాలు, మెట్ట నేలలు, ఇసుకగుట్టలు (డ్యూన్) నెదర్లాండ్స్‌లోని ఇతర ప్రాంతాలలో కానవస్తాయి.




విస్తీర్ణం:41,863 చ.కి.మీ.;జనాభా:1,47,41,000 (1988); రాజధాని: ది హేగ్; అధికార భాష: డచ్. వ్యవసాయంలో యంత్ర సాధనాలు విరివిగా వాడుక చేస్తారు. పాడి పరిశ్రమ ఎక్కువ కావడం వల్ల క్షీరోత్పత్తులను ఎక్కువగా ఎగుమతి చేస్తూ ఉంటారు. బార్లీ, ఓటు ధాన్యం, బీటు (పంచదార), గోధుమ, ట్యూలిపు పుష్పాలు సాగుపంటలు. మత్స్యపరిశ్రమ భారీస్థాయిలో జరుగుతుంది. చమురు వాయువు,పెట్రోలు (గ్రానింజెన్), ఉప్పు ఖనిజ నిక్షేపాలు. మత్స్య పరిశ్రమ కూడా ఎక్కువే. పారిశ్రామికాభ్యుదయం (రాండ్‌స్టాడ్) గాంచిన ఈ దేశం ఎలక్ట్రానిక్ సామగ్రి, జవుళీ, ఇనుము, ఉక్కు సామగ్రి(ఇజ్‌ముయిజెన్) ఆహార పదార్థాలు, యంత్ర సామగ్రి మొదలైన వాటిని విదేశాలకు ఎగుమతి చేస్తూంది. ఆమ్‌స్టరు డాము ప్రపంచంలో వజ్ర పరిశ్రమకు ప్రధాన కేంద్రం. రాటర్ డాము పెద్ద రేవుపట్టణం.

## నెపోలియన్ బోనాపార్టీ

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఫ్రెంచ్ చక్రవర్తి కుశాగ్ర బుద్ధిగల సేనాని. గొప్ప రణరంగ యోధుడు.



1769 ఆగస్టు 15న ఫ్రాన్స్‌కు చెందిన కార్సికా దీవిలోని అజాషియో అనేచోట ఒక సంపన్న కుటుంబంలో నెపోలియన్ జన్మించాడు. సైనిక విద్యనభ్యసించి 16వ ఏటనే యుద్ధ శకట దళానికి (ఆర్టిలరీ) సెకండ్ లెఫ్టినెంట్ అయ్యాడు. 10 ఏళ్ళ తరువాత ఆయన కీర్తి తారస్థాయి నందుకొంది. 1795లో పాస్కెల్ పాలీ నాయకత్వాన జరిగిన స్వాతంత్ర్య సమరంలో చేరి ఫ్రెంచ్ విప్లవం (చూ.)లో పాల్గొన్నప్పుడు నెపోలియన్‌కు తన సైనిక పాటవాన్ని ప్రదర్శించడానికి చక్కని అవకాశం లభించింది. శత్రు పక్షాలు బలహీనమయిన అదనుసు గుర్తించి ఆ క్షణంలో దాని వైపు తన బలాన్నంతా కేంద్రీకరించి జయం సాధించే చతురుడు నెపోలియన్. అయితే 1794లో రాబస్పీయిర్ పతనం చెందినప్పుడు ఈయన కూడా నిర్బంధానికి లోనయాడు. తరువాత టౌలన్ విజయం అతని జీవితాన్ని ఒక మలుపు తిప్పింది. ఆ రోజు (1895 అక్టోబరు 5) ఫ్రాన్స్‌లో రాచరికాన్ని తరిమికొట్టిన రోజు. అప్పటి నుంచి అతని జాతకం మారింది. 1799లో నెపోలియన్ ఫ్రాన్స్ గద్దె ఎక్కాడు. 1804లో ఫ్రెంచ్ సామ్రాజ్యాధినేత అయాడు. లార్డ్ నెల్సన్ చేతిలో ట్రఫాల్గర్ వద్ద 1805లో ఓటమి చెందాడు. 1806లో రైన్ సమాఖ్యను స్థాపించాడు. 1807లో రష్యన్ సైన్యాన్ని ఫ్రీడ్‌లాండ్ వద్ద ఓడించాడు. ఆ తరువాత మాస్కో మహానగరాన్ని కైవసం చేసి కొన్నాడు. అయితే 1814లో సింహాసనాన్ని త్యజించవలసి వచ్చింది. ఆ కాలాన్ని ఎల్బా దీవిలో గడిపాడు. 1815లో మరల ఫ్రాన్స్‌కు చక్రవర్తి అయి 3 మాసాలు బ్రిటిషు వారితో హోరా హోరీగా పోరు జరుపవలసి వచ్చింది. బ్రిటిషు సేనలు వెలింగ్‌టన్ డ్యూక్ సేనాధిపత్యంలో ఫ్రెంచ్ వారితో పోరాటం సాగించాయి. ఆదిలో నెపోలియన్ జయాలు సాధించినా, తుట్టతుదకు వాటర్లూ వద్ద తీవ్రమైన ఓటమికి గురి అయి, సెయింట్ హెలీనాలో నెపోలియన్ తలదాచుకో వలసి వచ్చింది. అక్కడే 1821 మే 5న నెపోలియన్ మరణించాడు. నాటి నెపోలియన్ సామ్రాజ్యం నేటి యూరప్‌లో (బ్రిటన్, స్వీడెన్, పోర్చుగల్ తప్ప) నాల్గింట మూడు వంతులు విస్తరించింది. నెపోలియన్ ఘన చరిత్ర అనేక మంది యోధులకు స్ఫూర్తినిచ్చింది. 19వ, 20వ శతాబ్దాలలోని అనేక దేశాధిపతులకు నెపోలియన్ సాధించిన జయాలు ఆదర్శప్రాయం అయ్యాయి. ఇతడు రూపొందించిన ఫ్రెంచ్ శాసన నిర్మాణం ఇప్పటికీ అందరికీ శిరోధ్యార్యంగా ఉంది. ఈయన ప్రవేశపెట్టిన విద్య, బ్యాంకింగ్, సంస్కరణలు గణనీయమైనవి. నెపోలియన్‌కు ఇద్దరు భార్యలు జోసఫీన్ బ్యూహారీయాస్, మేరీ లేజీ (ఆస్ట్రియా).

## నెల్సన్ మండేలా చూ. మండేలా, నెల్సన్

## నెల్లూరు జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. ఇది దక్షిణాన ఉన్న ఒక కోస్తా జిల్లా. ఈ జిల్లాకు ఉత్తరాన ప్రకాశం జిల్లా, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన చిత్తూరు జిల్లా, తమిళనాడు, పశ్చిమాన కడప జిల్లా ఉన్నాయి.




విస్తీర్ణం:13,076 చ. కి.మీ.; జనాభా: 20,06,447(1981); జిల్లా కేంద్రం: నెల్లూరు; సోమశిల శద్ద ఈ జిల్లాలో ప్రవేశించే పెన్నానది ఈ జిల్లాకు పెన్నిధి. ఇది డెల్టాగా ఏర్పడి సంగం వద్ద కట్టిన ఆనకట్ట నేలను సారవంతంచేస్తూంది. కండలేరు, ఉప్పుటేరు, సువర్ణ ముఖి, బుగ్గేరు, పిలపేరు వంటి చిన్న నీటి వనరులు కూడా ఉన్నాయి. నక్కల గండి తటాకం, రాళ్ళపాడు తటాకం, నెల్లూరు చెరువు, పాందువ తటాకం, సర్వేపల్లి తటాకం, దిగువ ఆనకట్ట మున్నగునవి పంట పొలాలకు నీటిని సరఫరా చేస్తున్నాయి. వరి ప్రధానమయిన పంట. జొన్న, సజ్జ, రాగులు, అపరాలు, వేరుసెనగ ఇతర పంటలు. ఇక్కడ పండే వరిలో ఎక్కువ శాతం తమిళనాడుకు ఎగుమతి అవుతూంది. మైకా (కాకి బంగారం) ప్రధానమయిన ఖనిజోత్పత్తి. ఇది విదేశాలకు ఎగుమతి అవుతూంది. ఇనుపరాయి, జిప్సమ్ ఖనిజాలు కూడా లభిస్తాయి. గూడూరు వద్ద గాజు, పింగాణీ

పరిశ్రమ ఉంది. ఈ జిల్లా చేనేతకు ప్రసిద్ధి. వెంకటగిరి జరీ చీరెలు విదేశాలకు కూడా ఎగుమతి అవుతున్నాయి. శ్రీహరి కోట వద్ద రోదసీ పరిశోధన (షార్) కేంద్రం ఉంది. ఉదయగిరి కోట, జొన్నవాడ దేవళం, శ్రీహరికోట, యానాది గుట్ట, వేదగిరి, సంగం దర్శనీయ స్థలాలు.

## నేపాల్

ఇండియా—చీనాల మధ్య హిమవత్పర్వత సానువులలో ఉన్న దేశం. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయుల చేత ఈ దేశం పాలించబడుతూంది. ఒకప్పుడు రాణాలు పాలిస్తూ ఉండేవారు. ఇక్కడి ప్రజలలో ఘూర్కాజాతి వారు ఎక్కువ.




విస్తీర్ణం: 1,47,181 చ.కి.మీ.; జనాభా: 1,80, 04,000 (1988), రాజధాని: ఖాట్మండూ; అధికార భాష: నేపాలీ. హిందూ మతస్థులు(89 శాతం), బౌద్ధ మతస్థులు(5 శాతం) ఈ దేశంలో ఉన్నారు.

నేపాల్‌లో అటవీ సంపద ఎక్కువ. పర్వత సానువులలోను, దక్షిణ మైదానాలలోనూ సేద్యంచేసి వరి, చెరకు, జొన్న, మొక్కజొన్న, నూనెగింజలు పండిస్తున్నారు. పశువుల పెంపకం, కూడా ప్రజలకు జీవనోపాధి కలిపిస్తూంది. సున్నపురాయి, మాగ్నసైట్, టాల్క్, గార్నెట్ రత్నం ఖనిజ నిక్షేపాలు లభిస్తున్నాయి. నేపాల్‌నుంచి ఓషధులు ఇతర దేశాలకు ఎగుమతి అవుతున్నాయి. పరిశ్రమలు ఇప్పుడిప్పుడు అభివృద్ధి అవుతున్నాయి. ప్రపంచంలో మిక్కిలిఎత్తయిన పర్వత శిఖరం ఎవరెస్ట్ (చూ.) నేపాల్‌లోనే ఉంది. పర్వతారోహణచేయు వినోదపర్యాటకులకు నేపాల్ ప్రముఖ విహారస్థలం.

## నైజర్

పశ్చిమ ఆఫ్రికాలోని ఒక స్వతంత్ర గణ రాజ్యం. ఒకప్పుడు ఫ్రెంచ్ వారి అధీనంలో ఉన్న ఈ దేశం 1970లో స్వాతంత్ర్యాన్ని సాధించుకుంది. సహజ సంపద ఎక్కువగాలేని దేశం. దేశం విశాలమయింది. జనసాంద్రత తక్కువ. ఉత్తరాన సహారా ఎడారి ఉంది. విస్తీర్ణం: 11,86,408 చ.కి.మీ.; జనాభా: 69,37,000 (1988); రాజధాని: నియామే; అధికార భాష: ఫ్రెంచ్.

నైరృతి దిశకు ప్రవహించే నైజర్ నది ఒక్కటే జలాధారం. ప్రత్తి, వేరుసెనగ ప్రధానమయిన పంటలు. వరి, జొన్న, అపరాలు, కందమూలాలు, గోధుమ, పొగాకు, మొక్కజొన్న ఇతర పంటలు. పశువుల పెంపకం ప్రజలకు ప్రధాన జీవనాధారం. తగరం, యురేనియం, నేట్రాన్, రాతిఉప్పు ప్రధాన ఖనిజాలు.

## నైజీరియా

పశ్చిమ ఆఫ్రికాలోని ఒక స్వతంత్ర గణ రాజ్యం. 1960లో బ్రిటిషు వారి వద్ద నుంచి స్వాతంత్ర్యం సాధించుకున్న నైజీరియా అప్పటి వరకూ యూరోపియన్‌ల వలస రాజ్యంగా ఉండేది. కళాత్మక దేశంగా ప్రసిద్ధిగాంచింది. పికాసో వంటి సుప్రసిద్ధ కళాకారులను ప్రభావితం చేసిన దేశం ఇది.

విస్తీర్ణం: 9,23,768 చ.కి.మీ.; జనాభా: 11,22, 58,000 (1988); రాజధాని: లాగోస్. అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు ఎక్కువగా ఇస్లాం మతావలంబకులు. నైజీరియా ప్రజలు నీగ్రో వర్గానికి చెందినవారు. హౌసా, ఫులానీ, కానూరీ, ఇడో, యోరుబా, ఇబో, ఇబిబియో, ఇదోతూ, ఇజావు మున్నగునవి నీగ్రోలలో ఉపజాతులు. నైజీరియాకు సహజ సంపద మెండు. ఇప్పుడిప్పుడే ఈ దేశం ప్రగతి పథంలో ప్రవేశిస్తూంది. నైజర్ నదీ పరీవాహ ప్రాంతంలో ఎక్కువ భాగం నైజీరియాలోనే ఉంది. దాని ఉపనది బెన్యూ నది కూడ నైజీరియాలోనే ఎక్కువ మేర ప్రవ హిస్తూంది. చాద్ సరస్సులో కలిసే కదూనా—కొమాదుగు మోజ్ నది నైజీరియాలోనే ఉంది.

నైజీరియా వ్యవసాయ ప్రధానమయిన దేశం. అరటి పండ్లు, కర్ర పెండలం, మొక్కజొన్న, వరి, చిరు




ధాన్యాలు, దుంపజాతులు ఇక్కడపండే ఆహారపు పంటలు. ప్రత్తి,కోకో,పావ్ గింజల నూనె, వేరుసెనగ, రబ్బరు మున్నగునవి ఎగుమతి పంటలు. ముఖ్యంగా కోకో,వేరుసెనగ,పావ్ గింజల నూనెకు నైజీరియా ప్రసిద్ధి గాంచినది. కలప ఎగుమతులుకూడా ఎక్కువే. కొలంబైట్ అనే ఖనిజోత్పత్తి నైజీరియాలో ఎక్కువ. నేలబొగ్గు, బంగారం, ఇనుపరాయి, సీసం, సున్నపురాయి, జింకు ఖనిజాలు కూడా ఇక్కడ లభిస్తున్నాయి. పెట్రోల్ తైల నిక్షేపాలు కూడా ఉన్నాయి.

## నైమిశారణ్యం

పూర్వం నైమిశారణ్యం అనబడిన ప్రదేశం నేడు 'నీమ్‌సార్' అని పిలువబడుతూంది. కాన్పూర్‌కు నీమ్‌సార్ 160 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇక్కడ గోమతీ నది ప్రవహిస్తుంది.

పూర్వం కలిదోష భీతులైన మహర్షులు విష్ణుమూర్తిని కలిదోషరహితమైన స్థలం చూపించమని ప్రార్థించారు. అప్పుడు మహావిష్ణువు తన సుదర్శన చక్రాన్ని భూలోకం మీదికి విసిరి ''ఇది ఎక్కడ పడుతుందో అక్కడ కలి ప్రభావం ఉండనేరదు'' అని చెప్పాడు. ఆ చక్రం నైమిశారణ్యంలో పడింది. దీనిలో అగాధమైన జలం ఉంది.

నైమిశారణ్యంలో ''పంచప్రయాగ'' అనే పేర ఒక సరస్సు ఉంది. దీనిలో స్నానం చేస్తే గొప్ప పుణ్యం లభిస్తుందని హిందువుల విశ్వాసం. దీనికి సమీపములో 'అక్షయ వటం ఉంది. దీనిని పాండాలు 'కల్పవృక్ష' మని వ్యవహరిస్తారు. దీనిచుట్టూ యాత్రికులు ప్రదక్షిణం చేస్తారు.

మను, శతరూపులు తపస్సు చేసిన స్థలం, వ్యాసుడు శౌనకాదులకు 18 పురాణాలూ చెప్పిన స్థలం ఇదే. ఇక్కడ ఒక సరస్సు ఒడ్డున అన్నపూర్ణా—విశ్వనాథుల మందిరం ఉంది. ఇక్కడ 'దశాశ్వమేధం' అనే ఒక దేవాలయం కూడా ఉంది. దీనిలో పంచదేవుల విగ్రహాలు ఉన్నాయి. ఇవి కాక మార్కండేయాశ్రమం, వ్యాససరోవరం, గంగోత్రి సరోవరం చూడదగిన స్థలాలు.

నైమిశం 130 కి.మీ. చుట్టుకొలత గల క్షేత్రం. దీనిని ప్రదక్షిణం చేయడానికి ఫాల్గుణ బహుళ అమావాస్యనాడు ప్రారంభించి చైత్రశుద్ధ పౌర్ణమినాడుకి ముగిస్తారు.

వసిష్ఠుని ఆజ్ఞానుసారం శ్రీరాముడిక్కడ అశ్వమేధయాగం చేశాడు. ఆ యజ్ఞానికి సంబంధించిన భస్మాలను పాండాలు చూపిస్తారు. ద్వాపరయుగంలో పాండవులిక్కడ చాలాకాలం నివసించారు. ఇప్పుడు ఇది చెరకు వ్యాపారానికి ప్రసిద్ధి చెందింది.

## నైలునది

ప్రపంచంలో మిక్కిలి పొడవైన నది. ఆఫ్రికాలో భూమధ్య రేఖ మీద ఉన్న ఉగాండా దేశంలోని విక్టోరియా సరస్సు నుంచి ఆవిర్భవించి సుడాన్ గుండా ఈజిప్టు వైపుకు ఉత్తర దిశగా 6738 కి.మీ ప్రవహించి, మధ్యధరా సముద్రంలో కలుస్తుంది. నదీ ముఖద్వారంలో కెయిరో రాజధాని సమీపంలో సారవంతమయిన డెల్టా ఏర్పడింది. ఎతియోపియా నుంచి బ్లూనైల్ నది వచ్చి ఖార్టోమ్ వద్ద నైలు నదిలో కలుస్తుంది. నైలు నదికి 2500 కి.మీ. దిగువను ఏ ఉపనదులూ లేవు. బ్లూ నైల్ నది మీద రోజరీస్ వద్ద డాములు నిర్మించారు. ఖార్టోమ్ దగ్గరలో వైట్ నైల్ మీద డామును కట్టారు. ఈజిప్టులో నైలు నది మీద అస్వాన్ డామును నిర్మించినప్పుడు ఏర్పడిన తటాకానికి 'నాసర్' సరస్సు అని పేరు పెట్టారు. అస్యుత్, సెన్నార్ ఇతర డాములు. అస్వాన్ డాము నిర్మాణ సమయంలో ఆ ప్రాంతంలో ఉన్న పిరమిడ్లు, స్ఫింక్స్ శిల్ప సంపద మునిగి పోకుండా రక్షించడానికి యునెస్కో ఒక బృహత్పథకం తయారు చేసి నిర్వహించింది.

నైలు డెల్టా జన సమ్మర్దం గల ప్రాంతం. రాజధాని కెయిరో, ప్రాచీన నగరం అయిన అలెగ్జాండ్రియా ఈ డెల్టా భాగంలోనే ఉన్నాయి. అనావృష్టి కాలంలోనూ, వేసవిలోనూ డాముల నుంచి కాలువల ద్వారా సాగునీటిని సరఫరా చేయడం వల్ల ఏడాది పొడవునా ఏదో పంట వేస్తూనే ఉంటారు. ప్రత్తి (చూ.) ఈజిప్టు ప్రధానమైన పంట. చెరకు, గోధుమ, బార్లీ ఇతర పంటలు.

## నోబెల్ బహుమానం

స్వీడెన్ దేశీయుడు, రాసాయనిక శాస్త్రవేత్త అయిన 'ఆల్‌ఫ్రెడ్ బెర్నార్డ్ నోబెల్' (1833–1896) 1896లో తన ఐశ్వర్యంలో ఎక్కువ భాగాన్ని ఒక ధర్మనిధిగా ఏర్పాటు చేస్తూ ఒక వీలునామా వ్రాశాడు. ఆ నిధి మీద వచ్చే రాబడితో ఈ క్రింది అయిదు రంగాలలో ఏటేటా విశిష్ట సేవలనందించిన వారికి నోబెల్ బహుమానాలు ఈయవలసిందని కోరాడు.




1. భౌతికశాస్త్రం, 2. రసాయనశాస్త్రం, 3. శారీరక లేదా వైద్యశాస్త్రం, 4. సాహిత్యం, 5. శాంతిసాధన.

1969లో ఈ అయిదు రంగాలతో పాటు ఆర్థిక శాస్త్ర రంగంలో కూడా విశిష్టసేవలనందించిన ప్రపంచ ప్రముఖునికి 6వ నోబెల్ బహుమానం ఇవ్వడం ప్రారంభించారు. బహుమతులకు అర్హులైన వారిని నిర్ణయించే బాధ్యత మూడు స్వీడిష్ సంస్థలకూ, ఒక నార్వేజియన్ సంస్థకూ అప్పగించారు. నోబెల్ బహుమాన గ్రహీతకు ఒక సువర్ణపతకం, అతని విశిష్ట సేవలను ప్రశంసించే ప్రశంసాపత్రం. సుమారు మూడు లక్షల రూపాయల నగదు లభిస్తాయి. నగదు మొత్తం నోబెల్ నిధి ఆదాయాన్ని బట్టి ఏటేటా మారుతూ ఉంటుంది.

ఏ రంగంలో అయినా అర్హుడైన వ్యక్తి లేడనుకుంటే ఒక ఏడాది బహుమతి నిలిపి వేయవచ్చును. ఒక ఏడాది ఒక రంగంలో ఒకరికంటే ఎక్కువమంది బహుమతికి అర్హులని నిర్ణయించబడితే బహుమతి మొత్తం వారందరికీ సమానంగా పంచబడుతుంది. 1901వ సంవత్సరంనుంచీ పై రంగాలలోనూ 1969 నుంచీ ఆర్థిక శాస్త్ర రంగంలోనూ నోబెల్ బహుమతులను ఇస్తూ వచ్చారు. మొట్టమొదటి నోబెల్ సాహిత్య బహుమతి 1901లో ఫ్రెంచి కవి 'రీని సల్లీ ప్రూధోనీ'కి ఇచ్చారు. 1913 సాహిత్య నోబెల్ బహుమతి భారతీయ మహాకవి రవీంద్రనాథటాగూర్ (చూ.)కు లభించింది. 1930లో భౌతిక శాస్త్రం (ఫిజిక్స్) నోబెల్ బహుమతి భారతీయ శాస్త్రవేత్త సి.వి. రామన్ గెలుచుకున్నాడు. 1968 వైద్యశాస్త్రంలో నోబెల్ బహుమతి హర్‌గోవింద్ ఖోరానా (జననం 1911)కు లభించింది. 1983 భౌతిక శాస్త్ర నోబెల్ బహుమతి సుబ్రమణ్య చంద్రశేఖర్ (సి.వి.రామన్ అన్న కుమారుడు) కు లభించింది. అయితే వీరిరువురూ యునైటెడ్ స్టేట్స్ పౌరులుగా ఆదేశంలోనే స్థిర నివాసమేర్పరచుకున్నారు. శాంతి నోబెల్ బహుమానం గ్రహించిన ఇరువురు మహనీయులు ప్రస్తుతం భారతదేశంలో జీవించి ఉన్నారు. ఒకరు 1979లో శాంతి బహుమతి గ్రహించిన 'మదర్ తెరిస్సా' రెండవ వారు 1989 లో శాంతి బహుమతి గ్రహించిన దలైలామా.

## నౌరోజీ, దాదాబాయ్ 1825–1917

సుప్రసిద్ధ భారతజాతీయ నాయకుడు. భారత జాతీయ కాంగ్రెసు పుట్టక పూర్వంనుంచీ స్వాతంత్ర్యం కోసం పోరాడిన వ్యక్తి దాదాబాయ్ నౌరోజీ!

1825 సెప్టెంబరు 4 న బొంబాయిలో ఒక పార్శీ కుటుంబంలో ఆయన జన్మించాడు. తండ్రి పలన్‌జీదోరీజీ. జోరాష్ట్రియన్ (చూ.) మత పురోహితుడు.

వ్యాపారం నిమిత్తం 1855లో ఇంగ్లండ్ వెళ్ళిన దాదాబాయ్ నౌరోజీ భారతదేశ స్థితిగతులను ఆంగ్లేయులకు విడమరచి చెప్పనారంభించాడు. లండన్‌లో ఇండియన్ సొసైటీ స్థాపించి దానిని ఒక ప్రచార సాధనంగా ఆయన ఉపయోగించుకున్నాడు. 1855 ఆగస్టులో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడయ్యాడు. ఆ సంవత్సరమే ఇంగ్లండులో పార్లమెంటుకు పోటీ చేసి ఓడిపోయాడు. ఇలా నాలుగుసార్లు పోటీచేయగా, 1892లో లిబరల్ అభ్యర్థిగా ఆయన గెలుపొందాడు.



భారతజాతీయ కాంగ్రెసుకు 1886, 1893, 1906 సం.లలో అధ్యక్షుడుగా ఎన్నికయాడు. అని బిసెంట్ కోర్కెపై హోం రూల్ లీగ్ అధ్యక్షుడుగా

కొంతకాలం ఆయన పనిచేశాడు. బొంబాయి విశ్వవిద్యాలయం 1916లో ఆయనకు డాక్టరేట్ ఇచ్చి సత్కరించింది. 1917లో బొంబాయిలోనే ఆయన పరమపదించారు.

## న్యూజిలాండ్

ఆస్ట్రేలియాకు ఆగ్నేయ దిశలో దాదాపు 2000 కి.మీ. దూరంలో పసిఫిక్ మహా సముద్రంలో ఉన్న ఒక ద్వీపరాజ్యం. అందమైన ప్రకృతి దృశ్యాలతో, హిమ శిలామయమైన ప్రాంతాలతో పచ్చిక బయళ్ళతో అలరారుతూ ఉంటుంది ఈ దేశం. అగ్నిపర్వతాలు, జలపాతాలు, వేడి నీటి బుగ్గలు, సరస్సులు ఈ దేశంలో అడుగడుగునా కానవస్తాయి. కొండలు చాలా ఎక్కువ ఈ దేశంలోని ఆదిమవాసులను 'మవూరీ'లు అంటారు. వీరు పొలినీషియన్ ప్రాంతం నుంచి వచ్చిన వారు. ఒకప్పుడు బ్రిటిషు పాలనలో ఉన్న ఈ దేశం నేడు స్వతంత్ర రాజ్యం అయింది. ఇక్కడ ఎక్కువ మంది యూరోపియన్‌లే.

విస్తీర్ణం: 2,67,515 చ.కి.మీ.; జనాభా: 33,66, 000; అధికార భాష: ఇంగ్లీషు. రాజధాని: వెల్లింగ్‌టన్. ఆక్లండ్, క్రైస్ట్‌చర్చ్ ఇతర ప్రధాన పట్టణాలు.

న్యూజిలాండ్ ప్రజల ప్రధాన వృత్తి పాడి పరిశ్రమ. గొర్రెలను పెంచి ఉన్ని, మాంసం ఎగుమతి చేస్తారు. అనేక రకాల క్షీరోత్పత్తులు విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి. మత్స్య పరిశ్రమ కూడా ఎక్కువే. గోధుమ, బార్లీ, బంగాళ దుంపలు, మొక్కజొన్న, ఓట్ ధాన్యం ఇతర పంట దినుసులు. జలవిద్యుదుత్పత్తి ఎక్కువ. పారిశ్రామికాభ్యుదయం సాధించిన దేశం న్యూజిలాండ్. మోటారుకారుల తయారీ, కాగితం, జవుళీ పరిశ్రమలు పేర్కొనదగినవి. దేశంలో ప్రతి ఏడాదీ అనేక సార్లు భూకంపాలు సంభవిస్తూ ఉంటాయి. అయితే సాధారణంగా ఇవి అంత ప్రమాద స్థాయిలో ఉండవు. చూ. ఆస్ట్రేలియా దేశపటం

## న్యూనిజ్

పదహారవ శతాబ్దిలో విజయనగర సామ్రాజ్య చక్రవర్తి అచ్యుత దేవరాయ పాలన (1529– 42) లో భారతదేశమును **సందర్శించిన** పోర్చుగీసు యాత్రికులు ఇద్దరులో ఒకరు. మరొకరు ప్యాజ్. విజయనగర సామ్రాజ్య వైభవాన్ని గూర్చి అనేక వివరాలు తాను వ్రాసిన యాత్రా చరిత్రలో పొందుపరిచాడు.

## న్యూయార్క్ మహానగరం

ప్రపంచంలోని మహానగరాలలో ప్రముఖమయింది న్యూయార్క్. యునైటెడ్ స్టేట్స్ తూర్పు ప్రాంతంలో హడ్సన్ నదిని ఆనుకుని ఈ నగరం ఉంది. యునైటెడ్ నేషన్స్ (ఐ.రా.స.)ప్రధాన కార్య స్థానం ఇక్కడే ఉంది.


స్టాట్యూ ఆఫ్ లిబర్టీ

న్యూయార్క్ మహానగరం

మేన్‌హాటన్, బ్రాంక్స్, బ్రూక్లిన్, క్వీన్స్, రిచ్‌మాండ్ అనే అయిదు మండలాలుగా ఈ నగరం ఉంది. అంతర్జాతీయ వ్యాపార కేంద్రం మేన్ హాటన్ లోని వాల్ స్ట్రీట్‌లో ఉంది. న్యూయార్క్ అనగానే 100 ఏళ్ళ నాటి స్వేచ్ఛావనిత అనే 'స్టాట్యూ ఆఫ్ లిబర్టీ' (1886) విగ్రహం గుర్తుకు వస్తుంది. ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యానికి ప్రతీకగా ఉన్న ఈ విగ్రహం న్యూయార్క్ హార్బరుకు అనతి దూరంలో ఒక చిన్న దీవి మీద ప్రతిష్ఠించబడి ఉంది.

న్యూయార్క్ విస్తీర్ణం: 945 చ.కి.మీ. జనాభా: 72,84,300 (1987). శివార్లు కలుపుకుంటే జనాభా: 1,78,07,100. న్యూయార్క్ సిటీలో అన్ని దేశాల నుంచి వచ్చిన ప్రజలూ ఉన్నారు. మేన్‌హాటన్ రాజమార్గాలు (అవెన్యూ), వీధులూ తీర్చి దిద్దినట్లు ఉండి ఆకాశ హర్మ్యాలు క్రిక్కిరిసి ఉంటాయి. 110 అంతస్తులున్న వరల్డ్ ట్రేడ్ సెంటర్ (1976), 102 అంతస్తులున్న ఎంపైర్ స్టేట్ బిల్డింగు (1929) మేన్ హేటన్‌లో ఉన్నాయి. గుగెన్‌హేమ్ మ్యూజియం, ప్రకృతి వస్తు (నేచురల్ హిస్టరీ) సంగ్రహాలయం, మెట్రోపాలిటన్ మ్యూజియం ఆఫ్ ఆర్ట్స్, బ్రూక్లిన్ చిల్డ్రన్స్ మ్యూజియం జిజ్ఞాసువులను ఎక్కువగా ఆకర్షిస్తాయి. న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరీ ప్రపంచంలోనే అతి పెద్ద పుస్తక భాండాగారం (1895). ఇది పరిశోధనా ప్రధానమైంది. 50 లక్షలుపైగా పుస్తకాలు, 35 లక్షల చిత్రాలు, 3 లక్షల దేశపటాలు (మ్యాపులు), ఇంకా ఫిల్మ్ రీళ్ళ (లక్షకు పైగా) ఇందులో ఉన్నాయి. స్థానికులు నగరం ఒక మూల ఉన్న తమ ఇళ్ళ నుండి మరొక మూల తాము పని చేసే చోటికి చేరుకోవడానికి సువ్యవస్థితమైన భూమ్యంతర్గత రైలు (సబ్వే) మార్గాలు అతి చాకచక్యంతో నిర్వహించబడుతున్నాయి. న్యూయార్కు నగరమంతా వంతెనలు అల్లిబిల్లిగా అల్లుకుని రాకపోక సౌకర్యాలకు ఎంతో అనువుగా వున్నాయి. చూ. యునైటెడ్ స్టేట్స్

## న్యూ హెబ్రిడీస్

చూ. వనౌతూ

## పంచకావ్యాలు

సంస్కృత మహాకవులు వ్రాసిన ఉద్గ్రంథములలో శ్రేష్ఠమయినవిగా ఎంపిక చేసిన అయిదింటిని పంచ కావ్యాలుగా పేర్కొంటారు. అవి: 1. రఘువంశం, 2. కుమార సంభవం, 3. మేఘ సందేశం, 4. మాఘం, 5. భారవి. ఇందు రఘువంశం, కుమారసంభవం, మేఘ సందేశం కాళిదాసు (క్రీ.శ. 5శతా) రచనలు; కాగా శిశుపాలవధ అను 'మాఘం' గ్రంథాన్ని మాఘకవి (క్రీ.శ 7శతా) రచనకు ఇతివృత్తం మహాభారతం నుండి గ్రహింపబడింది. 'కిరాతార్జునీయం' అను 'భారవి' కీ.శ 6 శతా. చెందిన భారవి మహాకవి రచనకు ఇతివృత్తం మహాభాగవతం, మహాభారత గ్రంథాలనుండి గ్రహింపబడినది.

## పంచతంత్రం

సుప్రసిద్ధమైన భారతీయ నీతికథల గ్రంథం. విష్ణుశర్మ ఒకరాజకుమారుడికి నీతిని బోధించడం కోసం ఈ గ్రంథం రచించినట్లు తెలుస్తూంది. 6వ శతాబ్దంలో ఇది 'పహ్లవీ' (ప్రాచీన పర్షియన్) భాషలోకి అనువదించబడినందువల్ల అంతకుముందే సంస్కృతంలో ఈ పంచతంత్ర గ్రంథం వెలసిఉండాలి. అనంతరం 9వ శతాబ్దంలో అరబ్బీలోకి, అటుపిమ్మట అనేక యూరప్ భాషలలోకి, ప్రాచ్య భాషలలోకి ఈ గ్రంథం అనువదించబడింది.

మిత్రభేదం, మిత్రలాభం, విగ్రహం, సంధి, అసంప్రేక్ష్యకారిత్వం అనే అయిదు భాగాలుగా ఈ గ్రంథం ఉండడంవల్ల దీనికి 'పంచతంత్రం' అనే పేరు వచ్చింది. సోమదేవుని కథాసరిత్సాగరంలో పంచతంత్రంలోని కథలన్నీ కనిపిస్తున్నాయి. పంచతంత్రంలోని పాత్రలు జంతువులు, పక్షులు అయినా వాటి సంభాషణల ద్వారా గొప్ప రాజనీతి, ఉదాత్త మానవస్వభావం ప్రకటించబడ్డాయి. సంస్కృతం లోని పంచతంత్రాన్ని దూబగుంట నారాయణ కవి, బైబరాజు వెంకటనాథుడు కావ్యరూపంగా



పంచతంత్ర కథ మొసలి—కోతి గుండెకాయ

తెలుగులోకి అనువదించారు. 19వ శతాబ్దంలో చిన్నయసూరి ఈ కథలలో కొన్నింటిని 'నీతి చంద్రిక' అనే గద్య కావ్యంగా తెలుగులో రచించాడు. అది బహుజనాదరణ పొందింది.

## పంచభూతాలు

ఆర్ష సంప్రదాయం ప్రకారం కంటికి కనిపించే ప్రపంచం అంతా అయిదు మౌలిక పదార్థాల మయమని భావన. అవి: పృథ్వీ (భూమి), అప్ (జలం), తేజస్సు (అగ్ని), వాయవ్య (గాలి), ఆకాశం (ఈథర్). వీటిని పంచ మహాభూతాలని అంటారు.

## పంచవర్ష ప్రణాళికలు

భారతదేశం స్వాతంత్ర్య సాధించుకుని (1947), రాజ్యాంగం ఏర్పర్చుకొని గణరాజ్యమయిన (1950) పిదప దేశం ఆర్థికాభివృద్ధి కృషికి వీలుగా పంచవర్ష ప్రణాళికలను రూపొందించుకుని అమలు పరుస్తూ వచ్చింది. అటువంటి వాటిలో మొదటి పంచవర్ష ప్రణాళిక 1951–56 మధ్య అమలు పరచబడి ఇప్పటి (1990) వరకూ 7 పంచవర్ష ప్రణాళికలు అమలు అయ్యాయి. 1990 ఏప్రిలులో ప్రారంభమయిన 8వ పంచవర్ష ప్రణాళిక 1994 మార్చిలో అంతమవుతుంది. దేశంలోని సహజ వనరులయిన నేల, జలనిధులు, ఖనిజ **విధులు,** ద్రవ్య నిధులు, పంటలు, మానవ నైపుణి వనరులను సమాయత్తం చేసి, ఉత్పత్తి అయిన సిరిసంపదలను ఒక పథకం ప్రకారం పంచిపెట్టి ప్రజలందరూ లబ్ధి పొందేటట్టు చేయడమే ఈ పంచవర్ష ప్రణాళికల ధ్యేయం. ఈ లక్ష్య సాధనకై అవిరళ కృషి సల్పుటవలనే దేశంలో భారీ పంట నీటి వనరులు ఏర్పడి పంటలు పండి, విద్యుత్తు ఉత్పత్తి అయి పారిశ్రామికాభ్యు దయం సాధించి ప్రపంచంలోని పారిశ్రామిక రాజ్యాలలో భారతదేశం మొదటి పదింటిలో ఒకటిగా వెలుగొందుతుంది. ఈ పంచ వర్ష ప్రణాళికల ఫలితంగానే నేడు దేశం సస్య శ్యామలమై హరిత విప్లవం (గ్రీన్ రివల్యూషన్), శ్వేత విప్లవం (వైట్ రివల్యూషన్), నీలి విప్లవం (బ్లూ రివల్యూషన్) సంభవించాయి. హరిత విప్లవం ఫలితంగా ఆహారపు పంటలు, వాణిజ్య పంటలు దిగుబడులు ద్విగుణీకృతమయి స్వయసమృద్ధి సాధించుటయే గాక కొన్ని పంట దినుసులు ఇతర దేశాలకు ఎగుమతి అయి విదేశీద్రవ్యాన్ని ఆర్జిస్తున్నాయి. శ్వేత విప్లవ ఫలితంగా పాలవెల్లువ కార్యక్రమం చేపట్టబడి దేశంలో అందరికీ క్షీరోత్పత్తులు అంది ఆరోగ్యవంతులవుతున్నారు. నీలి విప్లవం ఫలితంగా మత్స్యసంపద పెరిగి అందరికీ పుష్టికరమయిన ఆహారం లభించడానికి వీలయింది. పట్టణ వాసులకే కాక మారుమూలానున్న పల్లెవాసులకు కూడా ఆహార దినుసులు సకాలంలో అందడానికి జాతీయ ఉత్పత్తి– వితరణ వ్యవస్థ (నేషనల్ ప్రొడక్షన్ మరియు డిస్ట్రిబ్యూషన్ సిస్టమ్) ద్వారా ఏర్పాట్లు పగడ్బందీగా చేశారు. పంచవర్ష ప్రణాళిక ఫలితంగా పారిశ్రామికోత్పత్తులు పెరిగి దేశ ప్రజల అవసరాలను తీర్చుటయే గాక విదేశాలకు ఎగుమతులు కూడా అధికమయ్యాయి. రవాణా సౌకర్యాలు తంతి తపాల ప్రసార సౌకర్యాలు ఇతోధికంగా పెరిగాయి. ప్రజాస్వామ్యం అమలులో ఉన్న అధిక జనాభాగల భారతదేశంలోని ఆర్థిక అసమానతలు తొలగి సమ సమాజం ఏర్పడి దేశం సిరిసంపదలను అందరూ సమానంగా భుక్త పరచుకొని అనుభవించడానికి ఈ పంచవర్ష ప్రణాళికలు ఎంతగానూ తోడ్పడ్డాయి. పంచవర్ష ప్రణాళికలను రూపొందించుట అతి జటిలమయిన నిర్వాహం. ఇందుకు ప్రత్యేకంగా యోజన సమితి (ప్లానింగ్ కమీషన్) ఒకటి పని చేస్తూంది. ఇందులో ఆయా ఆర్థిక సాంకేతిక రంగాల్లో పండిన అనుభవంగల మేధా సంపన్నులు, నిష్ణాతులయిన సిబ్బంది వివరాల సేకరణ, పథకరూపకల్పన కార్యక్రమాల్లో సదా నిమగ్నులయి ఉంటారు. యోజన సమితి అధ్యక్షుడు దేశ ప్రధాని. కాబినట్ మంత్రి స్థాయి గలిగిన వారు ఒకరు ఉపాధ్యక్షులుగా ఉంటారు. ఇంకను ఐదుగురు ఆయా ఆర్థిక, విద్యా, సంక్షేమ, పారిశ్రామిక రంగాలకు చెందిన నిపుణులు సభ్యులుగా ఉంటారు.

## పంచశీల

ప్రపంచశాంతి పరిరక్షణకోసం వివిధ దేశాల వారు అనుసరించవలసిన అయిదు సూత్రాలను 'పంచ శీల' అని వ్యవహరిస్తున్నారు.

భారతప్రధాని జవహర్ లాల్ నెహ్రూ టిబెట్ మీద చీనాకు ఉన్న సర్వాధిపత్యాన్ని గుర్తిస్తూ, 1954 ఏప్రిల్‌లో చీనా ప్రధాని చౌ–ఎన్–లై తో చేసుకున్న ఒడంబడిక ఉపోద్ఘాతంలో ఈ సూత్రాలు వున్నాయి.

*1. ప్రాదేశిక సమగ్రతను, సర్వాధిపత్యాన్నీ పరస్పరం గుర్తించడం; 2. ఒకరి దేశం మీద మరొకరు దురాక్రమణ జరుపకుండా వుండటం; 3. ఒక దేశపు ఆంతరంగిక వ్యవహారాలలో మరొక దేశం జోక్యం చేసుకోకుండా వుండటం; 4. పరస్పర శ్రేయస్సు కోరుతూ సమాన భావంతో కృషి చేయడం; 5. శాంతియుత సహజీవనం సాగించడం.*

## పంచాయతీరాజ్ వ్యవస్థ

ప్రజా పరిపాలనను వికేంద్రీకరించడానికిగాను స్థానిక స్వపరిపాలన పద్ధతి 1947 నుండీ దేశవ్యాప్తంగా అమలులో ఉంది.

ఇది మూడు అంచెలుగా
జిల్లాస్థాయి—జిల్లా పరిషత్తు
సమితి స్థాయి—పంచాయతీ సమితి
గ్రామస్థాయి—గ్రామ పంచాయతి

భారతదేశంలో నేడు 2,06,987 గ్రామ పంచాయితీలూ, 4043 పంచాయతీ సమితులూ, 340 జిల్లా పరిషత్తులు దేశవ్యాప్తంగా పనిచేస్తున్నాయి. వీటికి చట్ట ప్రకారం ఎన్నికలు నిర్వహించడం ప్రజా ప్రతినిధులను ఎన్నుకోవడం ఆయా రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యత. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇటీవల పంచాయతీ సమితుల స్థానే మండలాల వ్యవస్థను ప్రవేశపెట్టారు

గ్రామాల్లో విద్యాసౌకర్యాలను సమకూర్చడం, గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టడం వంటి పనులు పంచాయతీ వ్యవస్థకు . ఒప్పగించబడినది. చట్టప్రకారం పంచాయతీ సంస్థలు పన్నులు విధించి అభివృద్ధి పనులకు నిధులు సమకూర్చుకొన వచ్చును. లాభసాటి సామూహిక వసతులను కల్గించుకొనవచ్చును. రాష్ట్రప్రభుత్వాలనుండి గ్రాంట్లు స్వీకరించవచ్చును. పంచాయతీ సంస్థలు తమ విధులు, అధికారాలు శాసనాల ద్వారా పొందుతూఉంటాయి. మహరాష్ట్ర, గుజరాతు, తమిళనాడు, పశ్చిమబెంగాలు వంటి రాష్ట్రాలలో పంచాయతీ రాజ్య వ్యవస్థ సువ్యవస్థీకరింపబడినది. గ్రామాల్లో నివసించే వారి మధ్య తగవులు వచ్చినప్పుడు, గ్రామీణులకు శీఘ్రగతిని న్యాయ పరిష్కారం అందివ్వడానికి న్యాయ పంచాయతీలు పని చేస్తున్నాయి

## పంజాబ్ రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. ఈ రాష్ట్రం సారవంతమైన సింధునదీ మైదానంలో వుంది. 'పంజ్' (పాంచ్) అంటే అయిదు. ఆబ్ అంటే నది. అనగా అయిదు నదులు జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లెజ్ ప్రవహించే ప్రాంతం పంజాబ్ అయింది. భారతస్వాతంత్ర్య సమయం (1947)లో పంజాబ్‌ను రెండుగా విభజించి తూర్పు భాగం ఇండియాలోను పశ్చిమ భాగం పాకిస్తాన్‌లోను కలిపారు. 1966లో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ జరిగినపుడు పంజాబ్‌లో కొంతభాగాన్ని విడదీసి హర్యానా ఏర్పాటుచేయగా ఇప్పటి పంజాబు రాష్ట్రం ఏర్పడింది.




విస్తీర్ణం: 50,367 చ. కి.మీ.; జనాభా: 1,67,88, 915(1981); రాజధాని: చండీగఢ్; అధికార భాష: పంజాబీ (గురుముఖిలిపి). ప్రజలలో అధికభాగం సిక్కు మతస్థులు. సట్లెజ్ ఘాగర్ మైదానం అతి సార వంత మయిన పంటనేల. సింధు, రావి, బియాస్, సట్లెజ్, ఘాగర్ నదులు ప్రధానమైన జలాధారాలు. సట్లెజ్ నదిపై భాక్రా—నంగల్ భారీ డామును కట్టి పంటనీటిని అందించుటయే గాక జలవిద్యుత్తును ఉత్పత్తి చేస్తున్నారు. పంజాబు రైతాంగం శ్రమ జీవులు. భూభాగంలో 85 శాతం సాగునేల. రాసాయనిక ఎరువులు, శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులు పాటించడంవల్లా అధిక దిగుబడులు సాధించి రాష్ట్రాన్ని సుసంపన్నం చేశారు. విద్యుత్తును రైతులకు చౌకరేట్లలో సరఫరా చేస్తున్నారు. వరి, చెరకు, గోధుమ ప్రధానమైన పంటలు. ఇండియాలో పారిశ్రామిక ప్రగతి సాధించిన రాష్ట్రాలలో పంజాబ్ అగ్రగామిగా వుంది. చిన్నతరహా పరిశ్రమలు కూడా ఇక్కడ ఎక్కువ. నూలు వస్త్రాలు, హోయిసరీ దుస్తులు, శస్త్ర పరికరాలు, దుస్తులు, కుట్టుమిషన్లు, క్రీడాసామగ్రి, సైకిళ్ళు, శాస్త్ర వైజ్ఞానిక పరికరాలు, విద్యుత్ పరికరాలు, యంత్రపు పనిముట్లు, పైన్‌నూనె ముఖ్యమయిన పరిశ్రమలు. లూథి

యానా, జలంధర్ ప్రధాన పారిశ్రామిక కేంద్రాలు. అమృతసర్ (చూ.)లో ఉన్నస్వర్ణ దేవాలయం సిక్కుల • పరమ పవిత్రపుణ్యక్షేత్రం. రాజధాని నగరం చండీగఢ్‌ను సుప్రసిద్ధ ఫ్రెంచ్ వాస్తుశిల్పి 'లీ కార్బుజర్' ఆధునిక భావాలకు అనుగుణంగా అతిసుందరంగా తీర్చిదిద్దాడు (1960). దీనిని చూడడానికి వినోదపర్యాటకులు వస్తూ ఉంటారు. చండీగఢ్ కేంద్ర పాలిత ప్రాంతంగా ఉండి, ఇటు పంజాబ్‌కే గాక అటు హర్యానా రాష్ట్రానికి కూడా రాజధానిగా ఉంది. (చూ. సిక్కుమతం)

## పండితత్రయం

సుప్రసిద్ధ ఆంధ్ర, శైవ మతాచార్యులు. ఆంధ్ర దేశంలో వీరశైవ మతం రెండు సంప్రదాయాలుగా వ్యాప్తిలోకి వచ్చింది. మొదటిది బసవన్న సంప్రదాయం లేదా జంగమ సంప్రదాయం. రెండవది పండిత సంప్రదాయం లేదా ఆరాధ్య సంప్రదాయం 'లింగధారు' అనబడే రెండవ సంప్రదాయానికి ప్రవర్తకులు. ఈ సంప్రదాయాలకు చెందిన శైవా చార్యులు ముగ్గురు. 1.శ్రీపతి పండితుడు, 2.శివలెంక మంచన పండితుడు, 3.మల్లికార్జున పండి తుడు. ఈ ముగ్గురిని 'పండిత త్రయం' అని వ్యవహరిస్తారు. సృష్టి, స్థితి, లయకారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఆధిక్యాన్ని వీరు అంగీక రించరు. శివుడే ఏకైక పరతత్వం అని ప్రామాణికంగా నిరూపించి పండితత్రయం ఈ సంప్ర దాయాన్ని స్థాపించారు. మతప్రచారం కోసం ఎన్నో మహిమలను ప్రదర్శించి, వీరశైవ మతవ్యాప్తికి వీరు విశేషంగా తోడ్పడ్డారు. వీరిలో శ్రీపండితుడు 1060–1135 మధ్యకాలమునను, మంచన 1085–1150 మధ్యకాల మునను, మల్లికార్జునుడు 1100–1180 మధ్యకాలము నను జీవించి శైవప్రధానమయిన రచనలు చేశారు.

## పండుగలు – పబ్బాలు

ఏడాదిలో నిర్ణీతదినమున లేదా సమయంలో జరుపుకునేవి పండుగలు. ఇవి మత సంబంధమయినవిగా ఉండవచ్చు (ఉదా: వినాయక చవితి, రంజాన్, క్రిస్టమస్), సమాజపరంగా ఉండేవి (ఉదా: ఉగాది, సంక్రాంతి, హోలీ) మరికొన్ని వీటితో బాటు జాతీయ పండుగలు— జాతి దృష్ట్యా ప్రముఖమయినవి (ఉదా: జనవరి 26, ఆగస్టు 15 స్వాతంత్ర్యదినోత్సం). పండుగ రోజున ఉత్సవాలు నిర్వహించడం, సంబరాలు చేసుకోవడం, తిరునాళ్ళు, జాతరలు జరుపుకొవడం పరిపాటి. ఇంటింటా పిండి వంటలు చేసుకొని కేరింతలు కొట్టుకుంటూ సరదాగా




కాలక్షేపం చేయడం మామూలు. పురాణకాలక్షేపం, హరికథలు, బుర్రకథలు, నాటకాలు, వినోద ప్రదర్శనలు జరుపుకోవడం కూడా ఉంది. జాతీయ పండుగల సమయాల్లో ప్రముఖులు ఉపన్యాసా లివ్వడం పరిపాటి. ఇవి గాక, హిందూ సంఘజీవనంలో గృహిణులు నోములు, వ్రతాలు పట్టి పండుగలు చేసుకుంటారు. ఉదాహరణకు వరలక్ష్మి వ్రతం, కేదారీశ్వరనోము, మంగళగౌరీ నోము, అట్లతద్దె వంటివి హిందూ స్త్రీలు చేసికుని పేరంటం కూడా చేస్తారు. పేరంటం సమయంలో ఇరుగుపొరుగు ఇల్లాళ్లు అందరూ కలుసుకొనడంతో సంఘీభావన, పరస్పర అవగాహనకు అవకాశం ఉంటుంది. కొన్ని ముఖ్యమయిన పండుగలు ఆయా అకరాది శీర్షికలలో ఇవ్వడమైంది. (చూ. ఉగాది, దీపావళి, దసరా, క్రిస్టమస్, రంజాన్).

## పటేల్, వల్లభాయి చూ. వల్లభాయిపటేల్

## పట్టాభి సీతారామయ్య, భోగరాజు

భారతస్వాతంత్ర్య సంగ్రామకాలంలో అగ్ర శ్రేణికి చెందిన జాతీయ నాయకులలో ఒకరు. 'కాంగ్రెస్ చరిత్ర' రచయిత. పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలుకా గుండుగొలను గ్రామంలో 1880 నవంబరు 24న ఆయన జన్మించారు. వైద్యవిద్యనభ్యసించి బందరులో

వైద్యవృత్తిని నిర్వహిస్తుండగా హోమ్‌రూల్ ఉద్యమం పట్టాభిని ఆకర్షించింది. 1916లో వైద్యవృత్తికి స్వస్తి చెప్పి ప్రజా సేవారంగంలో ప్రవేశించాడు. బందరులో జాతీయ కళాశాలను నెలకొల్పిన ప్రముఖులలో ఆయన ఒకడు.

కాంగ్రెస్ వార్షిక మహాసభలలో పాల్గొంటూ, భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన వాదాన్ని ప్రారంభించి, ఆ వాదానికి బాలగంగాధర్ తిలక్ తదితర అగ్రనాయకుల ఆమోదం పొందాడు. ఆయన కృషి ఫలితంగా 1920లో ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెస్ కమిటి ఏర్పడింది. అప్పటినుంచి గాంధీజీకి ఆయన అత్యంత సన్నిహితుడయాడు.



కాంగ్రెస్ సందేశాలను అందరికీ తెలియ జెప్పడానికి 1919లో 'జన్మభూమి'అనే వారపత్రికను ప్రారంభించాడు. ఉప్పు సత్యాగ్రహం (చూ.)లో పాల్గొని ఒక సంవత్సరం, శాసనోల్లంఘనోద్యమంలోపాల్గొని రెండేళ్ళు,మచిలీపట్టణంలోజరిగిన పికెటింగ్‌లోపాల్గొని 6నెలలు కఠినకారాగారవాస శిక్షలను అనుభవించాడు. ఆతర్వాత వ్యక్తి సత్యాగ్రహోద్యమం సందర్భంగా డిటిన్యూగా 8 నెలలు వేలూరు జెయిల్‌లో నిర్బంధించబడ్డాడు. 'క్విట్ ఇండియా'(చూ.) ఉద్యమం సందర్భంగా 1942 ఆగస్టు 9న కాంగ్రెస్ కార్యవర్గంలోని ఇతర సభ్యులతో పాటు సీతారామయ్యను కూడా అరెస్టు చేసి, 1945 జూన్ 14 వరకు ప్రభుత్వం అహమ్మద్‌నగర్ కోటలో నిర్బంధించింది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కి మూడేళ్ళు అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి రెండేళ్ళు అధ్యక్షుడుగా పనిచేశాడు. కృష్ణా జిల్లా కో ఆపరేటివ్ బ్యాంక్, ఆంధ్రా ఇన్సూరెన్స్ కంపెనీ, ఆంధ్రా బ్యాంకు నెలకొల్పిన వారు పట్టాభి సీతారామయ్య గారే! 1952 నుండి 57 వరకు మధ్య ప్రదేశ్ గవర్నర్‌గా పనిచేశాడు. 1959 డిసెంబరు 17న హైదరాబాద్‌లో పరమపదించారు.

## పడమటి కనుమలు

దక్షిణ భారతదేశంలో పశ్చిమాన అరేబియా సముద్రాన్ని ఆనుకుని ఉన్న పర్వత శ్రేణిని పడమటి కనుమలు అంటారు. (చూ. తూర్పు కనుమలు). మహారాష్ట్ర దక్షిణ భాగం, కేరళ తూర్పు భాగం, తమిళనాడు పశ్చిమ భాగాల్లో వ్యాపించిన ఈ పడమటి కనుమలు కొండలు, మిట్టలుగా ఉన్నాయి. ప్రసిద్ధమైన నీలగిరి కొండలు, ఏలకు కొండలు, ఏనమలై కొండలు ఈ పర్వత శ్రేణిలోనివే. వాటి ఎత్తు సగటున 915 మీ. నుంచి 1220 మీ. వరకూ ఉంటుంది. నీలగిరి కొండల్లో ఉన్న దొడ్డబెట్ట కొండ పడమటి కనుమల్లో అతి ఎత్తయినది. దీని ఎత్తు 2635 మీ. (8640). తమిళనాడులోని నీలగిరి కొండలలో ఉన్న ఉదక మండలం (ఊటీ) వేసవి విడిదిగాను విహార కేంద్రంగాను ప్రసిద్ధి చెందింది. ఇచ్చట తోడాజాతి గిరిజనులు నివసిస్తున్నారు. ఉదకమండలం సమీపాన ఉన్న కోటగిరి, కూనూరు, వెల్లింగ్‌టన్ శీతల శీతోష్ణస్థితి కలిగి వేసవి విడిది కేంద్రాలుగా ఉన్నాయి. కొడైకెనాలు మరొక శీతల కేంద్రం. ఉదకమండలం సమీపాన హెర్బేరియం, వనౌషధ పరిశోధనకు అనువయిన వృక్షశాస్త్ర పరిశోధనా కేంద్రాన్ని నెలకొల్పారు. వన్యమృగ రక్షణకై ఏర్పాటు అభయారణ్యాలు! తెక్కడి (కేరళ) ముదమలయి ప్రాంతాల్లో నెలకొల్పేరు. పడమటి కనుమలలో ఉన్న అడవులు వన్యప్రాణులలో ఏనుగులకు ప్రసిద్ధి. (చూ. కర్నాటక, కేరళ, తమిళనాడు)

## పతంజలి

పాణిని రచించిన 'అష్టాధ్యాయి'(చూ.) అనే సంస్కృత వ్యాకరణానికి మహాభాష్య కర్త. వ్యాకరణ మునిత్రయంలో ఈయన మూడవవారు. మిగతా ఇద్దరు పాణిని, వరరుచి (కాత్యాయనుడు) యోగ సూత్రకారుడైన పతంజలి కూడా ఈయనే. అని సంప్రదాయజ్ఞుల భావన. కాని మహాభాష్యంలో లేని ప్రయోగాలు యోగసూత్రాలలో ఉన్నందువల్ల ఆయన మరో 'పతంజలి' అని ఆధునిక పరిశోధక విద్వాంసుల సిద్ధాంతం. ఈయన కాలం స్పష్టంగా తెలియదు. అయినా మహాభాష్యంలో పాటలీ పుత్రం రాజధానిగా చేసుకొని మగధదేశాన్ని పాలించిన పుష్యమిత్రుడి (క్రీ.పూ. 2వ

శతాబ్ది) ప్రసక్తి ఉండడం చేత ఈయన ఆ పుష్యమిత్రుడు సమకాలికుడై ఉండవచ్చునని పరిశోధకుల భావన.

పతంజలి వ్రాసిన **వ్యాకరణ** మహాభాష్యం ఆనాటి భారతీయుల సాంఘిక, మత, సాంస్కృతిక జీవనాన్ని తెలుసుకోవటానికి కూడా ఉపయోగించే ఉద్గ్రంథం భర్తృహరి, కైయటుడు (12వ. శతా) పతంజలి మహాభాష్యానికి వాఖ్యలు వ్రాశారు.

## పద్మజానాయుడు 1900–75

దేశసేవిక, పరిపాలనా దక్షురాలు, సంఘ సంస్కర్త. ముత్యాల గోవిందరాజుల నాయుడు, సరోజినీ నాయుడు (చూ.)దంపతులకు 1900 నవంబరు 17వ హైదరాబాదులో పద్మజానాయుడు జన్మించింది

సరోజినీనాయుడు ద్వారా గాంధీ మహాత్ముని పరిచయం లభించి అప్పటినుండి ఆయన అడుగుజాడల్లో నడిచింది. 1929లో హైదరాబాదులో ప్లేగువ్యాధికి గురైన బాధితులకు సహాయమందించుటకై ఏర్పడివ సంఘంలో ఆమె చురుకుగా పాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమకాలంలో నిజాం రాజ్యంలో విధించిన నిషేధాన్ని ధిక్కరించి గాంధీ జయంతి వేడుకలను జరపడానికి పూనుకోగా నిజాం ప్రభుత్వం పద్మజా నాయుడ్ని అరెస్టు చేసింది.

భారతయూనియన్‌లో నిజాం సంస్థానం విలీనం కావాలని 1947–48లో సాగించిన ఉద్యమం సంద ర్భంగా జరిగిన బీభత్సకాండను తక్కిన భారతీయులకు తెలియ జేయడానికి ఆమె మారుమూల ప్రాంతాలలో సైతం పర్యటించి యథార్థాలను తెలుసుకొని ఒక నివేదికగా తయారు చేసి వెలువరిచారు. 1956 నుండి 1967 వరకు పశ్చిమ బెంగాల్ గవర్నర్‌గా పనిచేశారు. భారత ప్రభుత్వం పద్మజానాయుడికి 'పద్మవిభూషణ' అవార్డు నిచ్చి సత్కరించింది. 1975 మే 2న పద్మజానాయుడు ఢిల్లీలో స్వర్గస్థులయిరి.

## పద్మిని

అతిలోక సుందరి అయిన రాజపుత్ర మహిళ. చిత్తోడ్‌గడ్ రాణి. గుహిలీ రాజపుత్ర రాజవంశానికి చెందిన రాణారత్న సింహుని పట్ట మహిషి. ఢిల్లీ చక్రవర్తి అల్లా ఉద్దీన్ ఖిల్జీ ఆమెను చూడగోరినప్పుడు పర పురుషులను చూడనని, అతని ఎదుట పడడానికి ఆమె అంగీకరించ లేదు. ఆమె ప్రతి బింబాన్నైనా అద్దంలో చూపమని అర్థించి, అల్లా ఉద్దీన్ తీరా ఆ ప్రతిబింబాన్ని చూశాక ఆమెను మోహించాడు. ఏలాగయినా ఆమెను చేజిక్కించు కోవాలని క్రీ.శ. 1303లో అలా ఉద్దీన్ ఖిల్జీ చిత్తోడ్‌గడ్ మీద దండయాత్ర జరిపాడు. రత్న సింహుడు అతనికి బందీగా చిక్కాడు. రాజపుత్రసేనలు వీరోచితంగా పోరాడినా, చిత్తోడ్‌గడ్ కోట ఖిల్జీ వశమయింది. అప్పుడు పద్మినితో బాటు పెక్కు మంది రాజపుత్ర స్త్రీలు అగ్నిలో దూకి తమ పాతివ్రత్యాన్ని కాపాడుకున్నారు. ఆమె కథను ఇతి వృత్తంగా తీసుకొని మాలిక్ మహమ్మద్ జయాసీ 'పద్మవత్' అనే గొప్ప కావ్యాన్ని హిందీలో రచించాడు.

## పనామా కాలువ

ఉత్తర అమెరికాకు, దక్షిణ అమెరికాకు మధ్య ఉన్న భూ సంధి ప్రాంతాన్ని 'పనామా కాలువ మండలం' అంటారు. ఇది ఒక స్వతంత్ర ప్రతిపత్తి గల గణరాజ్యం. అయినా యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వం దాని మీద ఆధిపత్యాన్ని వదులుకోవడానికి అంతగా ఇష్టపడడం లేదు. పనామా కాలువ మండలం సైనికదృష్ట్యా కీలకమయింది. విస్తీర్ణం: 77,082 చ.కి.మీ.; జనాభా 23,22,000 (1988); రాజధాని: పనామాసిటీ; అధికారభాష: స్పేనిష్. అమెరికన్ ఇండియన్‌లు ఒకప్పుడు (15వ శతాబ్దం వరకూ) మత్స్య పరిశ్రమను ఇక్కడ అభివృద్ధి చేశారు. పనామా అంటే అసలు అమెరికన్ ఇండియన్ భాషలో 'చేపలు పట్టేవారు' అని అర్థం. దేశానికి 686 కి.మీ. నిడివిగల సముద్రతీరం ఉంది. తుయ్రా, చెపో, చాగ్రేస్ నదులు ప్రధానమైన నీటివనరులు. అరటి పండ్లు, ఆహారధాన్యాలు, చెరకు, ప్రత్తి, కాఫీ, మొక్కజొన్న, పొగాకు, ముఖ్యమైన పంటలు. రొయ్యల పరిశ్రమకు పనామా ప్రసిద్ధి. రాతిఉప్పు, సున్నపురాయి, ఖనిజనిక్షేపాలు మహోగనీ వంటి విలువైన కలపకూడా లభిస్తూంది. అనేకములయిన లాకులు, సరస్సుల గుండా కాలువల మీద నౌకాయానం సాగుతుంది. పనామా కాలువ పొడవు 80 కి.మీ. నౌకలు దీనిని దాటడానికి దాదాపు ఎనిమిది గంటలు పడుతుంది. ప్రతి ఏడాదీ సుమారు 15వేల నౌకలు పనామా కాలువగుండా ప్రయాణిస్తూ ఉంటాయి.

కాలువదాటడానికి నౌక పరిమాణాన్ని బట్టి సుంకం (టోల్) వసూలు చేస్తారు. పగటున నౌకకు పదివేల డాలర్ల సుంకం చెల్లించవలసి ఉంటుంది.

## పరాగ్వే

దక్షిణ అమెరికాలోని స్వతంత్ర గణరాజ్యం. దీనికి సరిహద్దు రాజ్యాలు ఉత్తరాన బొలీవియా, బ్రెజిల్, తూర్పున అర్జెంటీనా ఉన్నాయి.




విస్తీర్ణం: 4,06,752 చ.కి.మీ.; జనాభా: 40, 07,000(1988); రాజధాని: అసన్ సియాన్; అధికార భాష: స్పానిష్. ప్రజలు క్రైస్తవ మతస్థులు. ప్రజలు మెస్టిజో, అమెరికన్ ఇండియన్ జాతులకు చెందినవారు. పరాగ్వే నది, పరాధా నది ప్రధానమయిన జలసంపదలు. రైతాంగం ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతూంది. ప్రత్తి ప్రధానమైన పంట. కర్రపెండలం, చిరుగడం, సోయాచిక్కుడు, చెరకు, పొగాకు, వరి, నారింజ, అరటి కూడా పండుతాయి. పశువుల పెంపకం ప్రజల ప్రధాన జీవనోపాధి.

అసన్‌సియాన్ వినోదయాత్రికులను ఆకర్షిస్తూంది. ఇసుకరాయి సరస్సు విహారస్థలం. ఎన్కార్నేషన్ ప్రాచీన శిథిలాలు ఉన్నగుట్ట.

## పరాశరుడు

వసిష్ఠ మహర్షి పౌత్రుడు. శక్తిమహర్షి పుత్రుడు. వేదవ్యాసుని తండ్రి. ఈయన తల్లి అదృశ్యంతి. ఈయన జన్మించడానికి ముందే తండ్రిని ఒక రాక్షసుడు మింగివేశాడు. చనిపోయిన తండ్రిని దర్శింపగోరి తాత అయిన వసిష్ఠుని సలహా మీద శివుణ్ణే గురించి తపస్సు చేసి ఆయన అనుగ్రహంతో స్వర్గంలో ఉన్న తండ్రిని చూసి వచ్చాడు. తండ్రిని సంహరించిన రాక్షస జాతి నంతటినీ నిర్మూలం చేయడానికి క్రతువు మొదలుపెట్టాడు. పులస్త్యాది మునుల సలహా మీద చివరికి క్రతువును ఉపసంహరించి హోమాగ్నిని హిమాలయాలకు ఉత్తరంగా వదిలాడు. ఒకరోజున తీర్థ యాత్రలకు పోతూ పడవ మీద యాత్రికులను యమునానది దాటిస్తున్న మత్స్యగంధి సత్యవతిని చూశాడు. ఆమె కన్యాత్వానికి భంగం కలుగకుండానూ, ఆమెకు మత్స్యగంధం (చేపల కంపు) పోయి ఆమె యోజనగంధి 'అయేట్టూ' వరాలు ఇచ్చి పగటి పూట తన తపశ్శక్తితో కృత్రిమంగా చీకట్లను సృష్టించి యమునా నదీతీరాన పరాశరుడు ఆమెతో సంగమించాడు. ఆ సంగమానికి ఫలితంగానే సద్యోగర్భంతో వ్యాస మహర్షి జన్మించాడు.

## పరీక్షిత్తు

అర్జునుని మనుమడు. అభిమన్యుని పుత్రుడు. ఈయన తల్లి ఉత్తర. తల్లి గర్భంలో ఉన్నప్పుడే పాండవుల సంతతిని నశింపజేయాలని అశ్వత్థామ 'బ్రహ్మశిరో' నామక అస్త్రం ఇతని మీద ప్రయోగించాడు. కృష్ణుని అనుగ్రహం వలన ఆ అస్త్రం ఇతనికెలాంటి హానినీ కలిగించలేకపోయింది. తల్లి గర్భంలో ఉన్నప్పుడే తనకు కనపడిన దేవుణ్ణే లోకం అంతటా దర్శించగలిగాడు. కనుక ఇతనికి 'పరీక్షిత్తు' (అంతటా దర్శించగలవాడు) అనే పేరు వచ్చింది. మేనమామ అయిన ఉత్తరుని కూతురు ఇరావతిని పరీక్షిత్తు వివాహమాడాడు. పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు. ధర్మరాజాదులు హిమాలయాలకు పోవడానికి ముందే పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేశారు. 60 ఏళ్లపాటు పరీక్షిత్తు రాజ్యం ఏలేడు.

ఒక రోజున అడవిలో ఒక లేడిని తరుముకుంటూ వెళ్ళి పరీక్షిత్తు శమీకుడనే ముని ఆశ్రమం చేరి ఆ లేడి జాడచెప్పమని ఆయనను అడిగాడు. సమాధిలో ఉన్న ఋషి బదులీయలేదు. కోపం వచ్చి పరీక్షిత్తు అక్కడ చచ్చిపడి ఉన్న ఒక పామును అతని మెడలో వేసి వెళ్లిపోయాడు. శమీకుని కుమారుడు శృంగి జరిగిన సంగతి తెలుసుకుని "7 రోజులలో తక్షకుని విషంతో పరీక్షిత్తు మృతి చెందును గాక!" అని శపించాడు. ఆ 7 రోజులూ శ్రీశుకుని వలన పరీక్షిత్తు భాగవత కథలు విన్నాడు. శృంగి శాపం ప్రకారం 7వ రోజున తక్షకుని కాటుకు గురి అయి, దేహయాత్ర చాలించాడు.

## పర్షియా

నేటి ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్ రాజ్యాలున్న ప్రదేశమే ప్రాచీన పర్షియా. మొదటి డరయస్, జెర్జెస్ మహాచక్ర

వర్తుల కాలంలో మహోన్నతమయిన నాగరకత విలసిల్లిన ప్రాంతం ఇది. క్రీ.పూ. 500 నాడు ఇది 'ఆకెమెనీటీ' సామ్రాజ్యంగా పేరు పొందింది. ఉత్తర ఆఫ్రికానుంచి ఇండియా వరకూ విస్తరించింది. క్రీ.పూ. 331లో అలిగ్జాండర్ ఈ ప్రాంతాన్ని కూడా జయించాడు. క్రీ.శ. 641లో ఈ ప్రాంతం అరబ్బుల వశమైంది. అంతకు ముందు సెల్యుసిడ్ రాజవంశం, సస్సానికలు, పార్తియన్‌లు ఈ ప్రాంతాన్ని పాలించారు. ఆ తరువాత ఈ ప్రాంతం ఇస్లాం మత ప్రభావానికి లోనైంది. (చూ. ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్).

## పల్లవులు

దక్షిణ భారతదేశం చరిత్రయందు ప్రముఖ పాత్ర వహించిన మహరాజ వంశం. ఈ రాజవంశం క్రీ.శ మూడవ శతాబ్దినుండి 7వ శతాబ్ది వరకు పరిపాలన సాగించినది. ఇందు ఆరవ శతాబ్ది చివరవరకూ పాలించిన పల్లవరాజులలో ముఖ్యులు వీరకూర్చవర్మ (క్రీ.శ. 285–310 ప.), విజయస్కందవర్మ (310–335 ప.),, విష్ణుగోపుడు (335 ప.), త్రిలోచన పల్లవుడు (350 ప.), కుమారవిష్ణు I (360–385 ప.), బుద్ధవర్మ (385–410 ప.), సింహవర్మ I (436–460 ప.), స్కందవర్మ (460–485 ప.), నందివర్మ (485–510 ప.) పేర్కొనదగిన వారు. విష్ణుగోపుడు (385) రాజ్యమేలుతుండగా సముద్రగుప్తుని దండయాత్ర జరుగగా గొప్ప సంక్షోభం సంభవించినది.

తరువాత అంటే 6వ శతాబ్దాంతంలో సింహవిష్ణువు (575–600 ప.) మహాపల్లవుల ఏలుబడి ప్రారంభమయింది. పిదప కాంచీపురం రాజధానిగా మహేంద్రవర్మ (600–630 ప.) సింహాసనమెక్కెను. ఈతని రాజ్యం ఉత్తరాన కృష్ణానది, దక్షిణాన కావేరి నది మధ్య విస్తరించి ఉండేది. మహేంద్రవర్మ జైన మతావలంబి యనియు, అప్పర్ అను మరొక పేరుగల తిరునావుక్కరుసు అను నాయనర్ శైవాచార్యుని బోధనల ఫలితంగా శైవుడయ్యాడని అంటారు. విజయవాడ సమీపంలోని ఉండవల్లి, మొగల్రాజపురము నందలి గుహాలయాలు ఈ కాలము నాటివే. ఆ తరువాత పల్లవులలో అతి పరాక్రమవంతుడు నరసింహవర్మ ఏలికను ఆరంభించెను(630–668 ప.). ఈయన పాలనా కాలంలోనే చాళుక్య చక్రవర్తి పులకేశి దండయాత్రను తట్టుకోవల్సివచ్చినా, చివరకు విజయం సాధించగలిగాడు. ఈతడు నిర్మించిన గుహాలయం ఒకటి నెల్లూరు జిల్లాలోని భైరవుని కోనయందున్నది. నరసింహవర్మ II (668–710) పట్టాభిషిక్తుడైన పిమ్మట తన తండ్రి వాస్తుకళా పోషణ సాగించి మహాబలిపురంలోని సముద్రతీరమున దేవళాలను నిర్మించి కళాప్రాంగాణమును రూపొందించుటలో శ్రద్ధాసక్తులు చూపెను. తరువాతి పల్లవ మహారాజు పరమేశ్వరవర్మ II పై బాదామీ చాళుక్య రాకుమారుడు విజయాదిత్యుడు, పశ్చిమ గాంగ మహారాజు శ్రీ పురుషముత్తరుసుడునూ ఏకమై దండెత్తి ఓడించగా కప్పం కట్టవలసి వచ్చింది. కడపటి పల్లవులలో ఇమ్మడి నందివర్మ (733–794 ప.), దంతివర్మ (మరణం 898) పాలకులు పేర్కొనదగినవారు.



## పల్నాటి వీరచరిత్ర

మహాకవి శ్రీనాథుడు (చూ.) మంజరీ ద్విపదలో రచించిన చారిత్రక కావ్యం. సపత్నీ సంతాన మయిన నలగామ, మలిదేవాదుల మధ్య దాయభాగం కోసం కార్యంపూడిలో యుద్ధం జరిగుతుంది. మలిదేవాదుల పక్షన యుద్ధాన్ని నిర్వహిస్తారు. ఈ వీరగాథ ఇందలి ఇతివృత్తం. (చూ. బ్రహ్మనాయుడు)

## పశ్చిమ గోదావరి జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 23 జిల్లాలో ఒకటి. ఈ జిల్లాకు తూర్పున బంగాళాఖాతం, ఉత్తరాన తూర్పు

గోదావరి జిల్లా, దక్షిణాన కృష్ణాజిల్లా, పశ్చిమాన కృష్ణా, ఖమ్మం జిల్లాలు సరిసహద్దు లుగా ఉన్నాయి.

విస్తీర్ణం: 7,742 చ.కి.మీ., జనాభా: 28,56,999 (1981), జిల్లా కేంద్రం: ఏలూరు. ఇతర ప్రధానమైన పట్టణాలు తణుకు, తాడేపల్లిగూడెం, భీమవరం, పాలకొల్లు, నర్సాపురం, కొవ్వూరు. పశ్చిమాన తూర్పు కనుమలు, తూర్పున సారవంతమైన డెల్టా, మధ్య మెట్టభూములు గల ఈ జిల్లా వరిపంటకు ప్రసిద్ధి. గోదావరి నది (చూ.) పోలవరం ప్రాంతంలో ఈ జిల్లాలో




ప్రవేశించి నర్సాపురం సమీపంలో ఒక పాయ(వశిష్ఠ) సముద్రంలోకలుస్తూంది.తమ్మిలేరు,బినేరు,కొవ్వాడ,ఎర్రకాలువ,జల్లేరు,రాళ్ళమడుగు, గుండేరు,ఉప్పుటేరు ఈ జిల్లాకుగల ఇతరజలాధారాలు. ఏలూరుకుదక్షిణంగా కొల్లేరు సరస్సుఉంది.ఈ ప్రాంతానికి విదేశాల నుండి పెలికాన్ వంటి అనేకరకాల పక్షులు ప్రతి ఏడాది వలస వస్తూ ఉంటాయి. తూర్పు గోదావరి జిల్లా ధవళేశ్వరం వద్ద నిర్మించబడిన కాటన్ బరాజు (చూ.) నుంచి పశ్చిమ డెల్టా కాలువ వ్యవస్థ పశ్చిమ గోదావరిజిల్లా సాగునీటి అవసరాలను తీరుస్తూంది. మెట్ట ప్రాంతానికి తటాకాలు, బుగ్గబావుల ద్వారా పంటనీరు లభిస్తూంది. వరి, అపరాలు, పొగాకు, చెరకు, నూనె గింజలు, కొబ్బరి ప్రధానమైన పంటలు. తణుకు, పాలకొల్లు, చాగల్లు, భీమడోలు, పంచదార ఉత్పత్తికి ప్రసిద్ధి. తణుకులో రోదసీ వాహనాలకు అవసరమైన ఇంధనం తయారవుతూంది. నర్సాపురం సమీపాన ఏనుగువాని లంకలో పెట్రోలు, చమురు వాయువు నిక్షేపాలు బయట పడ్డాయి. చమురు వాయువును కొన్ని పరిశ్రమలకు సరఫరా చేయడమే గాక దాన్ని ఆధారంగా చేసుకొని విద్యుత్తును ఉత్పత్తి చేయడానికి కూడా కృషి సాగుతూంది. ఏలూరు తివాచీల నేతకు, నర్సాపురం క్రోచెలేస్ అల్లిక పరిశ్రమకు ప్రసిద్ధి. జిల్లాలో రోడ్డు, రైలు, పడవ సౌకర్యాలు బాగా ఉన్నాయి. నర్సాపురం చిన్న తరహా ఓడరేవు. పాలకొల్లులో శనివారం సంతలో పెద్ద టోకువ్యాపారం పశువులసంత జరుగుతుంది. ద్వారకా తిరుమల (చిన్న తిరుపతి)లో శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధి, నర్సాపురం లోని ఎంబెరు మానారు సన్నిధి, పాలకొల్లులోని క్షీరా రామలింగేశ్వర స్వామి, పెనుగొండలో కన్యకాపరమేశ్వరి ఆలయం, పోలవరం సమీపంలోని పట్టిసీమ వీరభద్రుని గుడి భక్తజనులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. జిల్లాలో అక్కడక్కడ ప్రాచీన బౌద్ధ, జైన అవశేషాలు కానవస్తున్నాయి. (చూ. కోస్తాప్రాంతం)

# పశ్చిమ బెంగాల్

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. మహాభారత కాలం నుంచీ 'వంగ' దేశంగా ప్రసిద్ధి గాంచినది. 1863 నుంచి బ్రిటిష్ వారి బెంగాల్ ప్రావిన్స్‌కు పశ్చిమాన ఆగ్రా, దక్షిణాన ఒరిస్సా, తూర్పున అస్సాం సరిహద్దులుగా ఉండేవి. ఇప్పటి బీహార్ రాష్ట్రం ఆనాటి బెంగాల్ రాష్ట్రంలో అంతర్భాగంగా ఉండేది. 1912 వరకూ బెంగాలు లోని కలకత్తా (చూ.) బ్రిటిష్ ఇండియా ప్రభుత్వానికి రాజధానిగా ఉండేది (చూ. ఢిల్లీ). భారత స్వాతంత్ర్యా నంతరం భారతదేశంలో బెంగాలీ భాష మాట్లాడే ప్రాంతం పశ్చిమ బెంగాల్‌గా రూపొందింది; తూర్పు బెంగాల్ తూర్పు పాకిస్తాన్ (నేటి బంగ్లాదేశ్) అయింది.

విస్తీర్ణం: 87,853 చ.కి.మీ.; జనాభా: 5,45,80,647 (1981); రాజధాని: కలకత్తా; అధికార భాష: బెంగాలీ.

గంగానది, దాని ఉపనది హుగ్లీ పశ్చిమ బెంగాల్‌కు ప్రధాన జలాధారాలు. వరి పుష్కలంగా పండుతుంది. నూనె గింజలు, జ్యూట్‌నారా, మెస్టా, బంగాళా దుంప, తేయాకు (డార్జిలింగు) ప్రధానమయిన వాణిజ్యపు పంటలు. రాష్ట్రంలో నేటి కమ్యూనిష్టు ప్రభుత్వంవారు పాలిరైతుల దుస్థితిని మెరుగుపరచడానికి 'ఆపరేషన్ బార్గా' అన్న పథకం చేపట్టి అమలు పరుస్తున్నారు. దాని ప్రకారం పాలిరైతు ప్రతివాడూ ప్రభుత్వ రికార్డులలో తన పేరు నమోదు చేసికొని తీరాలి.

ఇనుపరాయి, నేలబొగ్గు, పుష్కలంగా లభిస్తున్నాయి.

ఈ నేలబొగ్గు ఆధారంగానే దుర్గాపూరులో ఉక్కు ఫాక్టరీ పనిచేస్తూంది.

బ్రిటిష్ వారి కాలం నుంచీ కలకత్తా పెద్ద రేవు పట్టణంగా అభివృద్ధి చెందింది. ఇండియాలో ప్రధాన వాణిజ్య కేంద్రం. విక్టోరియా మెమోరియల్ గ్యాలరీ, మ్యూజియం, ఇండియన్ మ్యూజియం, జంతుప్రదర్శనశాల,జైనదేవళం,కాళిగుడి (కాళిఘాట్),జాతీయ లైబ్రరీ (బెల్ వెడెర్ భవనం), మార్బుల్ ప్యాలెస్, ఈడెన్ గార్డెన్,బినోయ్ బాదల్, దినేష్ బాగ్ (డల్ హౌసీ స్క్వేర్)దక్షిణేశ్వరదేవళం, హౌరా వంతెన కలకత్తా(చూ.) నగర పరిసరాలలో చూడదగిన స్థలాలు. కలకత్తాలో ఇటీవల భూమ్యంతర్గత (ట్యూబ్) రైల్వే మార్గాన్ని ఏర్పాటు చేశారు. కలకత్తాకు సమీపంలో (బిర్భూమిజిల్లా) ఉన్న శాంతినికేతన్ (విశ్వభారతి) విద్యాకేంద్రాన్ని రవీంద్రనాథ టాగూర్(చూ.) స్థాపించారు. హిమాలయ పర్వత సానువులలో ఉన్న శీతల కేంద్రం డార్జిలింగు, కలకత్తాకు 240 కి.మీ దూరంలో ఉన్న పూరీ జిల్లాలోని సముద్రపు బీచ్ వినోద పర్యాటకులకు విహారస్థలాలు. ఇచ్చటి 'టాయ్ ట్రెయిన్' అందరినీ ఆకర్షిస్తూంది. 24 పరగణాలలోని సుందరవనాలు (సుందర్ బన్స్) అనేకములయిన కాలువలతో నిండి చూడ ముచ్చటగా ఉంటాయి.



## పశ్చిమ సామో

అసలు పేరు మాలో సా ఓలోటో. దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలో న్యూజీలాండ్‌కు తూర్పుగ ఉన్న ద్వీపరాజ్యం. బ్రిటిషువారినుండి 1962లో స్వాతంత్ర్యం సాధించుకున్న ఈ రాజ్యాన్ని రాజవంశీయులు రాజ్యాంగానికి లోబడి పాలిస్తున్నారు. ఇందులో నాలుగు ప్రధాన దీవులు ఉన్నాయి. అందులో ఉపోలూ దీవి, సవాయీ దీవి పెద్దవి. అంతర్జాతీయ తేదీరేఖ (చూ.) పశ్చిమ సామో ప్రక్కనుండియే వెళ్ళుచున్నది.

విస్తీర్ణం: 2,831 చ.కి.మీ; జనాభా: 1,62,000 (1988); రాజధాని: ఆపియా; అధికార భాషలు: సామో, ఇంగ్లీషు. ప్రజలు **పాలినీషియా** తెగలకు చెందినవారు 88 శాతం, సంకర జాతుల 10 శాతం, తెల్లవారు 2 శాతం, క్రైస్తవం పాటిస్తున్నారు.

కొబ్బరి, టారోదుంప, బొప్పాయి, మామిడి, అనాస, పొగాకు, ఆవకాడో, కోకో పశ్చిమ సామోలోని వ్యవసాయోత్పత్తులు. పందుల పెంపకం, పశుపోషణ, కోళ్ల పరిశ్రమ ప్రజలకు జీవనోపాధులు. కలప లభిస్తున్నది. మత్స్య పరిశ్రమ ఉంది. కొబ్బరి నుండి నూనె, కొబ్బరి పిండి, ప్లైవుడ్ పరిశ్రమ, చాపలు, నారవస్త్రాలు, పొగాకు పరిశ్రమలు పేర్కొనదగినవి.

## పాండవులు

పాండురాజు కుమారులైదుగురికి పాండవులు అని ప్రసిద్ధి. వీరు అయిదుగురు 1. ధర్మరాజు, 2.భీముడు, 3.అర్జునుడు, 4.నకులుడు, 5.సహదేవుడు. పాండురాజుకు ఇద్దరు భార్యలు. కిందముడనే ముని పాండురాజుకు భార్యతో సంగమ మైన మరుక్షణమే మరణం సంభవించేట్టు శపించాడు. అందుచేత పాండురాజు తన ఇద్దరు భార్యలతో వానప్రస్థ జీవనం చేస్తూ పెద్ద భార్య కుంతిని ఆమె దూర్వాసుని వలన పొందిన మంత్ర ప్రభావంతో దేవతల అనుగ్రహం వలన సంతానాన్ని కనమని ఆదేశించాడు. ఆమె క్రమంగా యమ, వాయు, ఇంద్రదేవతల వలన ధర్మజ, భీమ, అర్జునులను ప్రసవించింది. కుంతీదేవి మంత్ర ప్రభావంతో మాద్రి కూడా అశ్వినీ దేవతల అనుగ్రహం వలన నకుల సహదేవులు అనే కుమారులను కన్నది. ఈ అయిదుగురు పాండవులుగా ప్రసిద్ధిచెందారు. (చూ. అర్జునుడు, కర్ణుడు, కుంతీదేవి, కురుక్షేత్రం, దుర్యోధనుడు, ద్రౌపది, ధర్మరాజు, ధృతరాష్ట్రుడు, నకులుడు, భీముడు, మత్స్యయంత్రం, మహాభారతం సహదేవుడు).

## పాండిచ్చేరి

మద్రాసుకు సమీపాన ఉన్న దక్షిణ భారతదేశంలోని ఒక కేంద్రపాలిత ప్రాంతం. దానిని పుదుచ్చేరీ అనికూడా అంటారు. తమిళనాడును ఆనుకుని ఉన్న 'పాండిచ్చేరి' విస్తీర్ణం: 293 చ.కి.మీ. మాత్రమే కాక,

'కారికల్' విస్తీర్ణం: 160 చ.కి.మీ. కేరళనానుకుని ఉన్న 'మహే' (విస్తీర్ణం: 9 చ.కి.మీ) ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పు గోదావరి జిల్లాను ఆనుకొని ఉన్న యానాం (విస్తీర్ణం: 30 చ.కి.మీ) కూడా ఈ కేంద్రపాలిత ప్రాంతంలో భాగాలు.

కేంద్రపాలితమయిన ఈ నాలుగు భాగాలు మొత్తం విస్తీర్ణం: 492 చ.కి.మీ., జనాభా: 6,04,471; రాజధాని: పాండిచ్చేరి. పాండిచ్చేరి ప్రాంతంలో జింజీనది, కారికల్ ప్రాంతంలో కావేరీ డెల్టాలోని అరసలార్‌వాగు, మహేపట్టణ ప్రాంతంలో మాహేనది, యానాం ప్రాంతంలో గౌతమీ (గోదావరి నది) పాయలో పడుతున్న కోరింగనది ఈ కేంద్రపాలిత ప్రాంతాలకు ప్రధానమైన జలాధారాలు. వరి, చెరకు, నూనె గింజలు ప్రధానమయిన పంటలు.

పాండిచ్చేరి పట్టణం మద్రాసు నగరానికి 160 కి.మీ. దూరంలో ఉంది. పాండిచ్చేరి 1955 వరకూ ఫ్రెంచ్ వారి ఆధీనంలో ఉండి తరువాత భారతదేశంలో విలీనమయింది. పాండిచ్చేరిలోని నాలుగు విభాగాల్లో ఆయా ప్రాంతీయ భాషలలో తమిళం, మలయాళం, తెలుగు మాట్లాడతారు. ఇంగ్లీషు, ఫ్రెంచ్ భాషలు కూడ మాట్లాడతారు. పాండిచ్చేరిలోని ఫ్రెంచ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీ ప్రసిద్ధి చెందిన చారిత్రక పరిశోధన కేంద్రం. పాండిచ్చేరి లోని రాజప్రాసాదం బీచ్, అరవిందుని ఆశ్రమం (ఆధ్యాత్మిక కేంద్రం), జోన్ ఆఫ్ ఆర్క్ స్వేర్, దేవళాలు, చర్చీలు వినోదపర్యాట కులను యాత్రికులను ఆకర్షిస్తున్నాయి. పాండిచ్చేరి సమీపంలోని ఆరోవిల్లీ ప్రాంగణం అంతర్జాతీయ యాత్రా స్థలం.

## పాంపే

ఇటలీలోని ప్రాచీన నగరం. రోమన్ నాగరకత మహోజ్జ్వలంగా అభివృద్ధి చెందిన ప్రాచీన నగరం ఇది. క్రీ.శ. 79లో వెసూవియస్ అగ్ని పర్వతం ప్రేలినప్పుడు ఈ నగరం భస్మీపటలం అయింది. త్రవ్వకాలను బట్టి ప్రాచీన కాలం నాటి ఈ నగరశోభ తెలియవస్తూంది.

## పాకిస్తాన్

బ్రిటిష్ ఇండియాను 1947లో రెండుగా విభజించినప్పుడు ఏర్పడిన స్వతంత్ర గణరాజ్యం. భారతదేశానికి వాయువ్యదిశలో ఈ దేశం ఉంది. ఇప్పటి బంగ్లాదేశ్ (చూ.) 1971 వరకూ తూర్పు పాకిస్తాన్ అనే పేరుతో పాకిస్తాన్ రాజ్యంలో ఒక భాగంగా ఉండేది. ఇది ఇస్లాం మతప్రాతిపదిక మీద అవతరించిన రాజ్యం.

విస్తీర్ణం: 7,96,095 చ.కి.మీ., జనాభా: 10, 94,34,000 (1988), రాజధాని: ఇస్లామాబాదు; అధికారభాష: ఉర్దూ. లాహోరు, ముల్తాన్, పెషావరు రావల్పిండి, ఫైసలాబాదు ఇతర ప్రధాననగరాలు. కరాచీ అంతర్జాతీయ రేవుపట్టణం. పాకిస్తాన్ స్త్రీలు పర్దా, ఘోషా పాటిస్తారు.




సింధునది (చూ.), దాని ఉపనదులు సట్లెజ్, రావీ, చీనాబ్, జీలం ప్రవహించి పాకిస్తాన్ లోని పంజాబు మైదానాన్ని సారవంతం చేస్తున్నాయి. మంగళడామ్ వంటి నీటి వనరులు ఇటీవల ఏర్పడ్డాయి. ఎడారి ఈమైదానానికి దక్షిణంగాఉంది. గోధుమ, చెరకు, ప్రత్తి, వరి, పొగాకు, మొక్కజొన్న ప్రధానమయిన సాగుపంటలు. పశువుల పోషణ, కోళ్ళపెంపకం ఉన్నాయి. సున్నపురాయి (గ్రాఫైట్) రాతి ఉప్పు, ఆర్గొనైట్ ఖనిజాలు ఇక్కడ దొరుకుతాయి.

## పాటలీపుత్రము

గంగా, శోణేనదులు అంతర్వేది యందున్న ఈ పట్టణము క్రీ.పూ. శతాబ్దులనుండి వర్ధిల్లెను. గ్రీక్ రాయబారి మెగస్తనీస్ మౌర్య చంద్రగుప్తుని దర్బారులో ఉండి ఇచ్చటి విషయాలనన్నింటినీ 'ఇండికా' అను గ్రంథములో వ్రాశాడు.

క్రీ.పూ. 300లో మౌర్య సామ్రాజ్య కాలమున ఈ పట్టణము నుండి పడమటి ఆఫ్ఘనిస్తాన్ వరకు 1840 కి.మీ. రహదారి నిర్మించబడింది. దారి ప్రక్కన మైలురాళ్ళు ప్రతిమైలునకు పరిసర గ్రామములు తెల్పు ఫలకములు స్థాపింపబడెను. చెట్లను, బావులను ఈ మార్గము ప్రక్కలయందు అమర్చబడెను. నేటి బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నా ఈ చారిత్రక నగరంలోని భాగమే.

## పాణిని

సుప్రసిద్ధ సంస్కృత వ్యాకరణ కర్త. 'అష్టాధ్యాయి'(చూ.) అని ఈయన రచించిన సంస్కృత భాషా వ్యాకరణం నేటికీ భారతదేశం అంతటా వ్యవహారంలో ఉంది. పాణినికి ఆహికి, శాలాంకి, దీక్షపుత్ర శాలాతురీయ అనే పేర్లుకూడా ఉన్నట్లు తెలుస్తూంది. ఈయన గంగాధర దేశీయుడనీ, శాలాతుర గ్రామ నివాసి అనీ శాలాతుర గ్రామాన్ని స్వయంగా దర్శించిన చీనా యాత్రికుడు హుయాన్ స్యాంగ్ వ్రాశాడు.

పాణిని వ్రాసిన 'అష్టాధ్యాయి'కి అష్టకం, పాణినీయం, వృత్తి సూత్రం, అకాలిక వ్యాకరణం, శాలా తురీయ తంత్రం అనే పేర్లుకూడ ఉన్నాయి. అష్టాధ్యాయిలో 3,995 సూత్రాలు ఉన్నాయి. ఈ గ్రంథంలో ఎనిమిది అధ్యాయాలు ఉన్నందున ఇది 'అష్టాధ్యాయి' అయింది. ప్రతి అధ్యాయంలోను నాలుగేసి పాదాలు ఉన్నాయి. ప్రతిపాదంలోనూ చాల సూత్రాలు ఉన్నాయి; పాణిని కాలంలో సంస్కృతం వ్యవహార భాషగా ఉండేది. పాణిని వ్రాసిన 'అష్టాధ్యాయి'లో వ్యాకరణమేగాక భాషాశాస్త్ర సూత్రాలూ ఇమిడి ఉన్నాయని పలువురి పండితుల అభిప్రాయం. పాణిని జీవించిన కాలం క్రీ.పూ. 7–6 శతాబ్దాల మధ్య అని అంటున్నారు. (చూ. పతంజలి).

## పాపువా—న్యూగినీ

న్యూగినీలో తూర్పు భాగం, పరిస ర దీవులూ కలిసి 'పాపువా న్యూగినీ రాజ్యంగా ఏర్పడ్డాయి. బ్రిటిష్ కామన్ వెల్త్ లో ఇది ఒక సభ్యదేశం.

విస్తీర్ణం: 4,62,840 చ.కి.మీ.; జనాభా: 35,62, 000 (1988); రాజధాని: పోర్ట్‌మొరస్బీ; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు మెలనీషియా పాపువాదేశీయ మాండలిక భాషలూ మట్లాడతారు. వారు క్రైస్తవం, ఆదిమ మతాలూ అనుసరిస్తారు. ప్రజలలో 84 శాతం న్యూగినీ పాపువా ఆదిమ తెగలకు చెందిన వారు. 15 శాతం మెలనీషియన్‌లు. దేశం అంతా మహాపర్వతాలతో నిండిఉంటుంది. మైదానాలలో బాడువలు ఉన్నాయి. పరిసరాలలో ఉన్న దీవులలో అగ్ని పర్వతాలు, పగడపు దీవులు ఎక్కువ. అరటి, కొబ్బరి, చెరకు, చిరుగడం, కందమూలాలు, పామ్ నూనెగింజలు, కర్రపెండలం, కాఫీ, కోకో, మామిడి ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. రాగి, వెండి, బంగారం, తైలం ఖనిజనిక్షేపాలు. ఆహార పరిశ్రమ, ధాతు పరిశ్రమ, కలప, గుజ్జు పరిశ్రమ ఈ దేశంలో ప్రధాన పరిశ్రమలు.

## పారిస్ మహానగరం



ఫ్రాన్స్ దేశపు రాజధాని నగరం. మనోహరమైన నగరంగా, సాంస్కృతిక కేంద్రంగా జగత్ప్రసిద్ధిపొందింది. 100 ఏళ్ళ క్రింద నిర్మించిన ఈఫెల్ గోపురం సుప్రసిద్ధమయింది. లోవ్రే ఆర్ట్ మ్యూజియం, నాట్రడామ్ చర్చి పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి. క్రీ.పూ. 52లో రూపుగొన్న ఈ మహానగరానికి రెండువేల ఏళ్ళ చరిత్ర ఉంది. ఇంత ప్రాచీనమైనప్పటికీ ఈ నగరం ఎల్లప్పుడూ కలకల లాడుతూ ఉంటుంది. ఇది సీన్ నదీ తీరాన ఉంది. బహువిశాలమయిన రాజవీథులతో విరాజిల్లుతున్నది. కళాకారులు పికాసో, విక్టర్‌హ్యూగో దార్శనికులు డెకార్ట్, సాహితీ వేత్తలు వాల్టేర్, జీన్‌పాల్ సార్త్రే వంటి మహనీయులను ప్రభావితంచేసిన నగరం ఇది. శాస్త్ర విజ్ఞాన పరిశోధనాగారాలు ఇక్కడ అనేకం ఉన్నాయి. 60కి మించి నాటకశాలలు ఉన్నాయి (సినిమాహాళ్ళుగాక). ఆధునిక పారిశ్రామిక కేంద్రం ఐక్యరాజ్యసమితికి ఒక ముఖ్య అంగం విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక వ్యవహారాలు చూసే యునెస్కో కేంద్ర కార్యస్థానం పారిస్‌లోనే ఉంది. పారిస్ జనాభా:21,65,892 (1982). నగరశివార్లు కలుపు కుంటే జనాభా:1,02,10,059 ఉంటుందని అంచనా.

## పార్లమెంట్

ప్రజాప్రతి నిధుల సభను పార్లమెంట్ అంటారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో కీలకమైన పాత్ర నిర్వహించే సంస్థ పార్లమెంటు. చట్టాల నిర్మాణంలో దేశంలో ఇది అత్యున్నతమైన సభ. ఇందులో రాజ్యసభ (చూ.) అనే ఒక

ఎగువసభ; లోక్‌సభ (చూ.) అనే ఒక దిగువసభ ఉంటాయి. రెండూ కలిసి పార్లమెంట్‌గా వ్యవసహరిస్తారు. రాజ్యసభకు పరోక్షంగా, లోక్‌సభకు ప్రత్యక్షంగా ఎన్నికలు జరుగుతాయి. (చూ. మాగ్నాకార్టా)



రాజ్యసభ కంటే లోక్‌సభకు ఎక్కువ అధికారాలుంటాయి. భారతీయ పౌరుడై 25 సంవత్సరాల వయస్సుగల ఏ వ్యక్తి అయినా లోక్‌సభకు పోటీ చేయవచ్చు. రాజ్యసభకి పోటీ చేయాలంటే కనీసం 30 సంవత్సరాల వయస్సు కలిగి ఉండాలి. ప్రభుత్వ నిర్వహణ, ద్రవ్య వినియోగం, పన్నుల విధింపు, బడ్జెటు ఆమోదం, శాసన నిర్మాణం ఇత్యాది కార్యకలాపాలను ప్రజల తరుపున ప్రజాప్రతి నిధులు ఒక కంట కనిపెడుతూ విధి నిర్వహణ మెళుకువలను సూచిస్తూ అధికార పాలనను సభ్యులు ఎప్పటికప్పుడు చక్కగా చర్చిస్తూ ఉంటారు. పార్లమెంట్‌లోని అధిక సంఖ్యాబలం ఉన్న పార్టీ తరపున ప్రధాన మంత్రి ద్వారా పరిపాలన సాగిస్తూ అల్పసంఖ్యాబలం ఉన్న సభ్యులు ప్రతిపక్ష కూటమిగా ఏర్పడి పక్షనాయకుడ్ని ఎన్నుకుంటారు. ప్రతి పక్షనాయకుడి స్థాయి మంత్రి వర్గ సభ్యుని స్థాయికి సమానంగానే ఉంటుంది.

## పార్శీమతం

చూ. జరతుష్ట్ర

## పాలస్తీనా

మధ్యధరా సముద్రాన్ని ఆనుకొని ఉన్న ఒక చిన్న భూభాగం. చారిత్రక ప్రసిద్ధిగాంచిన ప్రాంతం. ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన యూదు (జూడాయజమ్), క్రైస్తవ మతాలకు జన్మస్థానం పాలస్తీనా. పరిశుద్ధ గ్రంథమయిన బైబిల్‌లో దీని ప్రస్తావన కానవస్తుంది. ఇస్లాం మతాన్ని అవలంబించినవారికి కూడా పాలస్తీనా పవిత్ర పుణ్యక్షేత్రం. అయితే ఈ ప్రాంతం ఎల్లప్పుడూ వివాదస్థలంగానే ఉండిపోయింది. యూదులు, అరబ్బుల మధ్య నిరంతరం పోరాటం సాగుతూనే ఉంటుంది. 1948లో పాలస్తీనాను రెండుగా విభజించి ఇజ్రాయెల్ (చూ.), జోర్డాన్ (చూ.) దేశాలుగా చేశారు. గాజాను ఈజిప్టు ఆక్రమించిన తరవాత పాలస్తీనా అస్తిత్వం పోయింది.

## పాల్కురికి సోమనాథుడు

చూ. సోమనాథుడు, పాల్కురికి

## పింగళి వెంకయ్య 1876–1963

భారత జాతీయ పతాక నిర్మాత. బహుముఖ ప్రజ్ఞాశాలి. దేశభక్తుడు. కృష్ణా జిల్లా దివితాలూకాలో భట్లపెనుమర్రు గ్రామంలో 1876 ఆగస్టు 2న జన్మించాడు. 19 ఏండ్ల వయస్సులో భారత సైన్యంలో చేరి దక్షిణాఫ్రికాకు పోయి బోయర్ యుద్ధంలో పాల్గొని స్వదేశానికి తిరిగి వచ్చి, కొంతకాలం రైల్వేగార్డుగా పనిచేశాడు. దాస్య జీవనం నచ్చక ఉద్యోగానికి రాజీనామా చేసి దేశస్వాతంత్ర్యానికై కృషి చేస్తున్న కొన్ని రహస్య విప్లవ సంఘాలతో పరిచయం చేసుకొని ఉత్తర భారతదేశంలో రహస్యోద్యమంలో ఐదేళ్ళు పని చేశాడు. వ్యవసాయంలో అభిరుచి ఎక్కువగా ఉండడం వల్ల వ్యవసాయ రంగంలో కొత్త ఉత్పత్తి విధానాలను ప్రవేశ పెట్టడానికై అనేక పరిశోధనలు చేసి తాను కనుగొనిన నూతన విషయాలను దేశీయ, విదేశీయ పత్రికలలో ప్రచురించాడు. దానితో ఆయనకు బ్రిటన్‌లోని రాయల్ అగ్రికల్చరల్ సొసైటీలో సభ్యత్వం లభించింది.



బందరు జాతీయ కళాశాలలో ఉపన్యాసక పదవి లభించింది. ఆ కాలంలోనే ఆయన 'ఇండియాకు ఒక జాతీయ పతాకం' అనే పేర ఒక ఆంగ్ల గ్రంథాన్ని రచించాడు. దానిలో 20 విధాలైన పతాకాలను ఆయనసూచించాడు. ఆ సమయంలో ఆంధ్రదేశ పర్యటన సందర్భంలో గాంధీజీ విజయవాడ (నాటి బెజవాడ) రాగా,

అప్పుడు మహాత్ముడు ఇచ్చిన సూచనలమేరకు భారత జాతీయ కాంగ్రెస్ పతాకాన్ని వెంకయ్య రూపొందించాడు. మూడు రంగులు మధ్యన రాట్నపు ప్రతి రూపం గల ఈ పతాకమే జాతీయ కాంగ్రెస్ పతాకంగా ఆమోదింప బడింది. 1963 జూలై 4న విజయవాడలో పింగళి వెంకయ్య పరమ పదించారు.

## పికాసో 1881–1973

20వ శతాబ్దిలో సుప్రసిద్ధ వర్ణ చిత్రకారుడుగా పేరొందిన పాబ్లో పికాసో స్పెయిన్‌లోని 'మాలగా' అనే గ్రామంలో జన్మించాడు. 1904–73 మధ్య ఫ్రాన్సులో



జీవయాత్ర సాగించాడు. పికాసో బాలమేధావి. చిన్నతనం లోనే 1901–1904 మధ్య నీలం రంగుతోనే ఎక్కువ వర్ణ చిత్రాలు రూపొందించాడు. 1906లో 'లే డెమోసెల్లీ అవిగ్నాన్' చిత్రం రచించినప్పటి నుంచి ఈయనకు కీర్తి లభించింది. తరువాత క్యూబిజమ్ అనే నూతన శైలిని సృష్టించి పోషించాడు. 1937లో 'గూర్నెకా'ను చిత్రించాడు. 1945 తరువాత వర్ణ చిత్రాలతో పాటు, శిల్ప, పింగాణీ కళలవైపు కూడా తన దృష్టిని మరలించాడు.

## పిరమిడ్లు

ప్రపంచంలోని ఏడు వింతలలో ఒకటి పిర మిడ్‌లు. ఇవి ఈజిప్టు దేశంలో సుమారు 4,500 ఏళ్ళ క్రిందట నైలునదీ సమీపంలో నిర్మించిన ఈజిప్ట్ రాజుల సమాధులు. భౌతిక శరీరాలను పరిరక్షించి ఉంచితే వారి ఆత్మలు శాశ్వతంగా నిలచి ఉంటాయని ఈజిప్టు వారి నమ్మకం. ఆ నమ్మకంతోనే మరణించిన వారి శరీరాలను 'మమ్మీ' ప్రక్రియకు లోను చేసి పిరమిడ్ అనబడే భారీ కట్టడాల అట్టడుగుభాగంలో ఒక రహస్య మందిరంలో వాటిని భద్రపరచేవారు. ఈ పిరమిడ్ ఆకారం క్రిందిభాగం చతురస్రాకారంగా ఉంటుంది. ఆ చతురస్రం మీది నాలుగు భుజాల మీద నాలుగు సమత్రిభుజాలు రూపొందించి ఆ త్రిభుజాలపై కోణాలు ఒక బిందువు వద్ద కలిసేటట్టు నిర్మించేవారు. ఈజిప్ట్‌లో నైలునది ప్రక్కన 1,2 దేవళాలు ఉన్నాయి. వాటిలో అపరకర్మలు జరుపుతూ ఉండడం పరిపాటి. మహారాజులకు పెద్ద పిరమిడ్, ఆ ప్రక్కనే మహారాణికి చిన్న పిరమిడ్ కట్టడం ఒక సంప్రదాయం. జోసర్ మహారాజుకు క్రీ.పూ. 2650లో ఇమోతెప్ కైరో సమీపంలో నిర్మించిన పిరమిడ్ మొట్టమొదటిది అని ప్రసిద్ధి పొందింది. ఇది కచ్చాకట్టడం. క్రీ.పూ. 2600లో 'మీదెమ్'లో కట్టిన పిరమిడ్ తీర్చిదిద్దబడి నున్నగా కనిపిస్తుంది. నైలునదికి పశ్చిమాన గిజా (అల్ జిజాహ) వద్ద నిర్మించిన మూడు పిరమిడ్‌లు క్రీ.పూ. 2500 నాటివి. ఇవి ఇప్పటికీ చెక్కుచెదరకుండా నిలిచివున్నాయి. పైగా అన్నింటి కంటే పెద్దవి కూడా! గిజా వద్ద కాఫ్రెరాజ్ గోరీ ప్రక్కన ఒక భారీ స్ఫింక్స్ శిల్పం ఉంది. ఒక పెద్ద పిరమిడ్‌ను నిర్మించడానికి నాలుగులక్షల మంది కార్మికులు 20 ఏళ్ళు పాటుపడేవారని ప్రాచీన గ్రీకు చరిత్రకారుడు హెరోడోటస్ పేర్కొన్నాడు.

## పి.వి. నరసింహారావు జననం: 1921

భారతప్రధాని పూర్తిపేరు పాములపర్తి వెంకట నరసింహారావు. 'పీవీ' అని వ్యవహరిస్తారు. కరీంనగరం జిల్లా వంగరలో జూలై 6, 1921 నాడు జన్మించారు. వరంగల్లు, హైదరాబాదు, నాగపూరులలో(బి.ఏ.బి.ఎల్.) విద్యాభ్యాసం. మంతెని,వరంగల్లు రాజకీయ కార్యరంగాలు. బహుభాషా పారంగ తుడు. తెలుగు, హిందీ, ఇంగ్లీషు, ఉర్దూ, మరాఠీ భాషలలో సాహిత్య స్థాయినందుకున్న వైదుషి. విదేశీ భాషల పరిచయం కూడా ఘనంగా సంపాదించాడు. స్వామీ రామానంద తీర్థ అంతేవాసిగా ఆయన ఆధ్వర్యంలో జరిగిన 'వందేమాతరం' ఉద్యమం

లో ప్రముఖపాత్ర నిర్వహించారు. హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి పదవినీ, రాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్ష పదవినీ (1956) నిర్వహించాడు. 1962–72 మధ్య ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ్యుడై ఆయా మంత్రివర్గాల్లో సభ్యుడై న్యాయ, సమాచార, ఆరోగ్య, విద్యామంత్రిత్వ శాఖలు నిర్వహించి రాష్ట్ర ముఖ్యమంత్రి పదవినందు కున్నాడు (1971–72). 1977, 1980, 1989 లోక్‌సభ ఎన్నికల్లో గెలుపొంది, 1980–89 మధ్య ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీల కేంద్రమంత్రి వర్గాల్లో సభ్యుడై విదేశాంగ, దేశీయాంగ, రక్షణ, మానవ వనరుల అభివృద్ధి (విద్య) శాఖలను కడుసమర్థవంతంగా నిర్వహించి రాజీవ్‌గాంధీ (చూ.) మరణానంతరం అఖిలభారత కాంగ్రెస్ సంస్థ అధ్యక్షుడై దేశ ప్రధాని (జూన్ 1991) పదవిని చేపట్టి నిర్వహిస్తున్నాడు.



## పురందర దాసు క్రీ.శ. 1550 ప్రాంతం

సుప్రసిద్ధ వాగ్గేయకారుడు. కన్నడ భక్తకవి. ఈయన మధ్వమతస్థుడు. నరహరి తీర్థుడు నెలకొల్పిన దాస సంప్రదాయంలో ఈయన 3వ వాడు. శ్రీపాద రాయుడు రెండోవాడు. పురందరదాసు కుటుంబసమేతంగా విజయనగరం వచ్చి, వ్యాసరాయుని ఉపదేశం పొందాడని చరిత్రకారులు చెబుతారు. ఈయన ఎన్నో కీర్తనలు, సుళాదులు, ఉగాభోగములు రచించాడు. ఈయన కీర్తనలన్నీ పురందర విఠల నామాంకితాలై వుంటాయి. పురందరదాసు మొత్తం 4, 75,000 కీర్తనలు రచించాడనీ,అయితే అందులోసుమారు వేయి కీర్తనలు మాత్రమే లభ్యం అవుతున్నాయనీ తెలుస్తూంది. కీర్తనలలోని విషయాన్నిబట్టి వాటిని 1.హరి గురు స్మరణస్తుతి, 2. అంతరంగ నివేదన, 3. కృష్ణలీలలు, 4. సమాజవిమర్శ, 5. సమాజశోధన అని అయిదు వర్గాలుగా విభజించవచ్చు.



అన్నమాచార్యులు, త్యాగరాజస్వామి, కీర్తనల వలె పురందర దాసు కీర్తనలు కూడా కర్ణాటక సంగీత సంప్రదాయంలో నేటికీ విరివిగా ప్రచారంలో ఉన్నాయి.

## పురాణాలు, అష్టాదశ

పురాణాలు ప్రాచీనగాథలు. ఈ ప్రాచీన గాథలను 18 పురాణాలుగా విభజించినవాడు వ్యాస మహర్షి. 'పురాణం పంచలక్షణమ్' అనగా పురాణం అయిదు లక్షణాలు గలది అని ప్రసిద్ధి. ఆ అయిదు లక్షణాలు: 1. సర్గం (సృష్టి), 2. ప్రతి సర్గం (ప్రళయం), 3. వంశం (సూర్య, చంద్రాది వంశాలు), 4. మన్వంతరం (స్వారోచిషాది మన్వంతరాలలో జరిగిన కథ), 5. వంశానుచరితం (ఆయా వంశస్థుల కథలు).

18 పురాణాలు: 1. బ్రాహ్మం, 2. పాద్మం, 3. వైష్ణవం, 4. శైవం, 5. భాగవతం, 6. భవిష్యోత్తరం, 7. నార దీయం, 8. మార్కండేయం, 9. ఆగ్నేయం, 10. బ్రమ్మకైవర్తం, 11. లైంగం, 12. వారాహం, 13. స్కాందం, 14. వామనం, 15. మాత్స్యం, 16. కూర్మం, 17. గారుడం, 18. బ్రహ్మాండం.

*18 ఉపపురాణాలు:* సనత్కుమారీయం, నారసింహీయం, స్కాందం, శివధర్మం, దౌర్వాసం, నారదీయం, కాపిలం, మానవం, ఔశనం, బ్రహ్మాండం, వారుణం, కాశీపురాణం, లైంగం, సాంబం, పారాశర్యం, మారీచం, భార్గవం.

## పురుషార్థాలు

భారతీయ సంస్కృతిని అనుసరించి మానవుడు జీవితంలో సాధించవలసిన ప్రయోజనములు నాలుగు. వీటినే చతుర్విధ పురుషార్థాలు అంటారు. అవి: 1.ధర్మం; 2.అర్థం; 3.కామం; 4.మోక్షం

## పురుషోత్తముడు క్రీ.పూ.340 ప్రాంతం

దేశభక్తుడు, పరాక్రమశాలి అయిన భారతదేశపు రాజు. అలెగ్జాండర్ (క్రీ.పూ. 256–323) ప్రపంచాన్నంతటినీ జయించాలని బయలుదేరి భారతదేశంలోకి

ప్రవేశించబోతూ ఉండగా జీలం నది ఒడ్డున అతని సేనలను ఎదిరించి పరాక్రమంతో యుద్ధంచేసి శత్రువు ప్రశంసలను పొందిన మహనీయుడు ఈ పురుషోత్తముడు. ఈయనకే పూరువు, పోరస్ అనే పేర్లుకూడా ఉన్నాయి. (చూ. అలెగ్జాండర్)

## పుష్కరం

చూ. కుంభమేళ

## పూరీ

ఒరిస్సాలోని సుప్రసిద్ధ వైష్ణవ పుణ్యక్షేత్రం. భువనేశ్వర్‌కు 62 కి.మీ. జగన్నాథుని బలభద్ర–సుభద్ర సన్నిధి పవిత్ర ధామాల్లో ఒకటి. మిగతావి బదరీ,



కేదారనాథ్. ప్రతి ఏడాదీ ఆషాఢ శుద్ధ విదియ నాడు (జూన్–జూలై) దేశం నాలుగు మూలల నుండి భక్త జనులు వచ్చి జగన్నాథుని రథోత్సవంలో పాల్గొంటారు. రథాన్నిలాగే తాడును పట్టుకుంటే జన్మ తరిస్తుందని భక్తుల విశ్వాసం.

## పృథ్వీరాజు

క్రీ.శ. 12వ శతాబ్ది

భారతదేశంలో ఢిల్లీ కేంద్రంగా పాలించిన చివరి హిందూ రాజు. ఈయన చౌహాన్‌రాజ వంశీయుడు. జయచంద్రుని కుమార్తె రాణీ సంయుక్తను అపహరించి పృథ్వీరాజు వివాహమాడాడు. ఘోరీ మహమ్మద్ భారత్‌దేశం మీద దండయాత్ర చేసినప్పుడు పృథ్వీరాజు స్థానేశ్వరానికి సమీపంలో ఉన్న 'తరాయి' వద్ద అతని సైన్యంతో తలపడి రాజపుత్రయోధుల సాయంతో విజయం సాధించి, అతని దాడిని తిప్పికొట్టాడు. అయితే ఆ తరువాత సంవత్సరం ఘోరీ మహమ్మద్ మరింత పెద్ద సైన్యంతో దండెత్తి వచ్చినప్పుడు ఓటమి చవి చూడక తప్పలేదు.

## పెద్దన, అల్లసాని

1470–1535

ఆంధ్రకవితా పితామహుడు. 'మనుచరిత్ర' (చూ.) కర్త. అష్టదిగ్గజాలలో అగ్రగణ్యుడు. చొక్కనామాత్యుని కుమారుడు. శఠకోపయతికి శిష్యుడు. మనుచరిత్రనే కాక 'హరికథాసారము' అనే మరో కావ్యాన్ని కూడా ఆయన రచించాడు. మనుచరిత్రకు 'స్వారోచిషమను సంభవం' అని మరోపేరు. 'హరికథాసారము' అనే కావ్యం లోని పద్యాలు లక్షణ గ్రంథాలలో ఉదాహరింపబడి కనిపిస్తున్నాయే తప్ప ఆ గ్రంథం లభించలేదు. పెద్దన కాలికి కృష్ణదేవరాయలు స్వయంగా గండపెండేరం తొడిగి సత్కరించారు.చూ. అష్టదిగ్గజాలు

కృష్ణరాయలు మరణించినపుడు 'కృష్ణరాయలతో దివికేగ లేక బ్రతికి యున్నాడు జీవచ్ఛవంబనగుచు' అంటూ వాపోయి పెద్దనామాత్యుడు కృతజ్ఞతతో ఆయనను స్మరించాడు.

## పెరిప్లస్

అరుణ సముద్ర యాత్ర అను అర్థంవచ్చు 'పెరిప్లస్ మారిన్ ఎరిత్రే' అను లాటిన్ గ్రంథం యాత్రా చరిత్ర క్రీ.శ రెండవ శతాబ్దంలో వ్రాయబడినట్లు తెలుస్తున్నది. భారతదేశంలో సాతవాహనుల కాలమున దేశ శాంతిని పరిరక్షించుటకు హస్తకళలను కుటీర పరిశ్రమలను, సాంస్కృతిక కళలను పోషించిన తీరుతెన్నులు ఈ గ్రంథంలో విశదీకరింపబడ్డాయి. నేల మీద, సముద్రమీద జరిగిన 60 అంతర్జాతీయ వ్యాపారాల వివరాలు ఇందు పొందుపరుపబడ్డాయి.

## పెరూ

పసిఫిక్ మహాసముద్రాన్ని ఆనుకుని ఉన్న దక్షిణ అమెరికాలోని ఆండీస్ పర్వతశ్రేణిలోని స్వతంత్ర గణ రాజ్యం. అల్పాకా, వీకూనా, లామా వంటి అపూర్వమయిన జంతుజాలం ఈ దేశంలో కానవస్తుంది. ఇప్పుడు వీటికి అభయారణ్యాలు కల్పించిరక్షిస్తున్నారు.



ఒకప్పుడు పెరూ దేశం 'ఇన్కా' అనబడే రెడ్ ఇండియన్‌ల వాసస్థానం. 16వ శతాబ్దినుంచి స్పెనిష్ వారి అధీనం అయి, 1821లో స్వతంత్ర గణరాజ్యంగా రూపొందింది.

విస్తీర్ణం: 12,81,215 చ.కి.మీ.; జనాభా: 2,12, 56,000 (1988); రాజధాని: లీమా; అధికార భాష: స్పెనిష్, క్వెచువా; ప్రజలు క్వెచువా, మెస్టిజో, తెగలకు చెందినవారు. కేథలిక్కు క్రైస్తవాన్ని పాటిస్తున్నారు.

అమెజాన్ నదికి ప్రారంభ జలాధారాలు అయిన మారణన్‌నది, నాపోనది, ఉకాయాలీ నది తూర్పు మైదానాలలో ప్రవహిస్తున్నాయి. సముద్రతీరంలో సేద్యానికి ఆండీస్‌కొండల నుంచి ప్రవహించే వాగులు తోడ్పడు తున్నాయి. ప్రత్తి, చెరకు, కాఫీ, వరి, బంగాళాదుంప, మొక్కజొన్న, అరటి, కర్రపెండలం ప్రధానమయిన పంటలు. మొక్కజొన్నకు ఆదిమస్థానం పెరూ దేశమే. రెడ్ ఇండియన్ జాతులకు మొక్కజొన్న ముఖ్యమైన ఆహారం. మత్స్య పరిశ్రమ ఇక్కడ ఎక్కువ. బిస్మత్తు, వెండి, రాగి, బంగారం, ఇనుపరాయి, సీసం, గంధకం, ఫాస్ఫేట్ ఖనిజాలు ఈ దేశంలో లభిస్తున్నాయి. ఖనిజ సంపదకూడా ఎక్కువే. వందల ఏళ్ళుగా గనుల పరిశ్రమ ఈ దేశంలో సాగుతూంది. పిట్టలరెట్ట (గ్వానో) సమీపంలో చించాదీవులలో భారీ రాసులలో లభిస్తుంది. దీనిని పొలాలలో ఎరువుగా వేస్తారు. పెరూ రైతాంగం రాసా యనిక ఎరువులు వాడవలసిన అవసరం అంతగా ఉండదు.

## పొట్టి శ్రీరాములు చూ. శ్రీరాములు,పొట్టి

## పోతన

1420



ఆంధ్రమహాభాగవతం రచించిన గొప్పభక్తకవి. ఈయన తల్లి లక్కమాంబ, తండ్రి కేసన. కుమారుడు మల్లన. మనుమడు ప్రౌఢ సరస్వతి. మునిమనుమలు కేసన,మల్లన కవులు.ఈయన నివాసస్థలం ఓరుగల్లు అని కొందరూ, ఒంటిమెట్టఅని కొందరూ అంటున్నారు.

పోతన ఏ గురువు దగ్గర విద్యనేర్చుకున్నట్టు దాఖలాలు లేవు. శ్రీ పరమేశ్వర కరుణా కవిత కవితా విచిత్ర, 'సహజపాండిత్య' అని భాగవతంలో ఆశ్వాసాంత గద్యంలో తనను గురించి తాను చెప్పుకున్నాడు. పోతన రచించిన మరిరెండు గ్రంథాలు 'భోగినీ దండకము', 'వీరభద్ర విజయము'. పోతనకు శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై 'భాగవతం రచించమనీ, తనకు అంకితం ఇవ్వమనీ, ఆదేశించాడట' అందుకే 'పలికెడిది భాగవతమట, పలికించెడి వాడు రామభద్రుండట' అంటారు ఆయన. మహాభక్తుడు, సాత్విక గుణ సంపన్నుడు, నిరాడంబరుడు పోతన. శ్రీనాథుడు పోతన బావమరిది. ఈ ఇరువురిని గురించి పలుకథలు ప్రచారంలో ఉన్నాయి.

## పోర్చుగల్




స్పెయిన్‌కు సరిహద్దుగా యూరప్‌లోపశ్చిమాన అట్లాంటిక్ మహాసముద్రాన్ని ఆనుకొని ఉన్నదేశం. సాహస యాత్రికులకు ప్రసిద్ధి. ఆఫ్రికాను చుట్టి భారతదేశానికి నూతన సముద్రమార్గాన్ని కనుగొన్న వాస్కోడాగామా పోర్చుగల్ దేశీయుడే!1961 వరకూ భారత దేశంలోని గోవా, డయ్యూ, డామన్ ప్రాంతాలు పోర్చుగల్ అధీనంలోనే ఉండేవి. ఆఫ్రికాలోనూ దక్షిణ అమెరికాలోనూ ఒకప్పుడు వలస రాజ్యాలు స్థాపించిన దేశం.

విస్తీర్ణం: 92,389 చ.కి.మీ.; జనాభా: 1,03, 49,000 (1988); రాజధాని: లిస్బన్; అధికార భాష: పోర్చుగీసు.

డౌర్గోనది, తేజ్యోనది, గౌదియానా నది ప్రధానమయిన నీటి వనరులు. బార్లీ, మొక్కజొన్న, ఓట్ ధాన్యం, వరి, రైధాన్యం, గోధుమ ప్రధానమయిన పంటలు. నిమ్మజాతి పండ్లు, ద్రాక్షతోటలు ఎక్కువ. మత్స్య పరిశ్రమలో కాడ్, టునా, సార్డీన్ చేపలు ఎక్కువగా పట్టి ఎగుమతి చేస్తారు. నేలబొగ్గు, రాగి, పైరిటీస్, కియోలిన్, గంధకం, యురేనియం, వుల్ఫ్రా

మైట్, టంగ్‌స్టన్ ఖనిజ నిక్షేపాలు ఇక్కడ విరివిగా లభిస్తాయి. కార్కు, అరపూస (రెజిన్) కలప అడవుల నుంచి లభించే సరుకులు.

## పోలండ్

తూర్పు యూరప్‌లోని ఒక స్వతంత్ర గణ రాజ్యం. కమ్యూనిస్ట్ రాజ్య కూటమిలోని దేశం. 1918లో ఈ దేశం స్వతంత్రమైంది. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభంలో 1939లో జర్మనీ పోలండ్ మీద దాడి చేసింది. 1944లో విముక్తి పొంది మరల స్వతంత్ర రాజ్యం అయింది. ఇటీవల కమ్యూనిస్ట్ ప్రభుత్వాన్ని అంతమొందించడానికి ప్రజాస్వామ్య శక్తులు ప్రయత్ని స్తున్నాయి.

విస్తీర్ణం: 3,12,693 చ.కి.మీ; జనాభా: 3,78,64,000 (1988); రాజధాని: వార్సా; అధికారభాష: పోలిష్. ప్రజలు రోమన్ కేతలిక్కు క్రైస్తవం పాటిస్తారు. పశ్చిమ కార్పేతియన్ పర్వత శ్రేణుల నుంచి బాల్టిక్ సముద్రం వైపుకు ప్రవహించే విస్తులా నది (పొడవు 1056 కి.మీ) ప్రధాన జలాధారం. బుగ్ నది, ఓడర్ నది, వార్తానది ఇతర నీటి వనరులు. రై ధాన్యం, గోధుమ, ఓటు ధాన్యం, బంగాళదుంప, బీటు (పంచదార) దుంప, పొగాకు, ఫ్లాక్స్‌నార సాగుపంటలు. పందుల పెంపకం ప్రజలకు ప్రధాన జీవనోపాధి. సైలీషియాలో నేలబొగ్గు ఇక్కడ పుష్కలంగా దొరుకు తుంది. రాగి, ఇనుపరాయి, లిగ్నైట్, సీసం, గంధకం, జింకు, తక్కువ రాశిలో చమురు వాయువు, పెట్రోలు, లభిస్తాయి. జవుళీ, ధాతు పరిశ్రమ, రాసాయనిక ద్రవ్యాలు, భారీయంత్రపు పని ముట్లు మత్స్య పరిశ్రమ నౌకా నిర్మాణం, విమానాల తయారీ పేర్కొనదగిన పరి శ్రమలు. నౌకలు, ఉక్కు, ధాతువులు, నూలువస్త్రాలు, రాసాయనిక ద్రవ్యాలు యం త్రపు పనిముట్లు, ఫోటో సామగ్రి, నేలబొగ్గు ఎగుమతి అవుతున్నాయి. (చూ. ప్రపంచయుద్ధం, ద్వితీయ)




## ప్రకాశంజిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. కర్నూలు, గుంటూరు, నెల్లూరు జిల్లాలనుండి కొన్ని ప్రాంతాలను విడదీసి 1970లో ఒంగోలు కేంద్రంగా ప్రత్యేక జిల్లాను ఏర్పాటుచేశారు. సుప్రసిద్ధ జాతీయవాది టంగుటూరి ప్రకాశం(చూ.) స్మృతిచిహ్నంగా ఆయన శత జయంతి సంవత్సరం 1972లో ఈ జిల్లాకు 'ప్రకాశం జిల్లా' అని పేరు పెట్టారు. ఇది 14° 57′, 16° 17′ ఉ.అక్షాంశాలకూ, 78° 45′, 80° 25′ తూ. రేఖాంశాలకూ మధ్య ఉంది. తూర్పున బంగాళాఖాతం, ఉత్తరాన గుంటూరు, మహబూబునగరం జిల్లాలు, దక్షిణాన కడప, నెల్లూరు జిల్లాలు, పశ్చిమాన కర్నూలు జిల్లా దీనికి సరిహద్దులు. విస్తీర్ణం: 17,624 చ.కి.మీ.; జనాభా: 24, 56,547 (1981); జిల్లాకేంద్రం: ఒంగోలు.

నల్లమలై కొండలనుంచి గుండ్లకమ్మనది ఒంగోలు మండలం వరకూ ప్రవహిస్తోంది. ముసియేరు, పాలేరు, భవనాశి తటాకం, దోమలేరు, మేకూరు ఇతర జలాధారాలు.

అపరాలు, పొగాకు,ప్రత్తి, వేరుసెనగ, జొన్న, వరి సాగు పంటలు.ఒంగోలు పశు జాతి పనితనానికి పేరు పడ్డది. కందుకూరులోని జీర్ణ దేవాలయం పురాతనమైంది. దర్శించదగ్గ స్థలం. సింగ రాయ కొండలోని నృసింహ స్వామి ఆలయం కూడా సుప్ర సిద్ధ మైంది.



## ప్రకాశం, టంగుటూరి

ప్రసిద్ధ భారత జాతీయ నాయకుడు. స్వాతంత్ర్య సమరయోధుడు. త్యాగధనుడు, 'ఆంధ్రకేసరి'. ఆంధ్ర రాష్ట్రానికి మొట్టమొదటి ముఖ్యమంత్రి.

ఒంగోలు జిల్లా (ప్రస్తుతం ప్రకాశం జిల్లా) కనపర్తి గ్రామంలో 1872 ఆగస్టు 23న టంగుటూరి ప్రకాశం జన్మించారు. 1892లో మద్రాసు న్యాయ కళా శాలలో న్యాయశాస్త్రం అభ్యసించారు. 1894లో సెకండరీ గ్రేడ్

ప్లీడరుగా రాజమండ్రిలో ప్రాక్టీసు ప్రారంభించారు. 1901లో రాజమండ్రి పురపాలక సంఘం అధ్యక్షుడై ప్రజాదరణ పొందారు. 1903లో ఇంగ్లండు వెళ్ళి బారిస్టరు పరీక్షలో ఉత్తీర్ణులై స్వదేశానికి తిరిగి వచ్చి మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించారు. 1921లో సహాయ నిరాకరణ ఉద్యమంలో అడుగు పెట్టి రాజకీయ రంగ ప్రవేశం చేశారు. కొందరు కాంగ్రెస్ నాయకుల సహకారంతో ఆయన 'స్వరాజ్య' అనే ఇంగ్లీషు దినపత్రికను స్థాపించి పాలకుల నిరంకుశ చర్యలను నిర్భయంగా విమర్శించడంతోపాటు దేశభక్తిని ఉద్బోధించి ప్రజలను ఉత్తేజితులను చేశారు. ఖాసా సుబ్బారావు, ఎమ్. చలపతిరావు వంటి వారు తరువాత గొప్ప సంపాదకులుగా పేరు తెచ్చుకొన్నవారనేకులు మొదట 'స్వరాజ్య' పత్రికలో పనిచేసినవారే. 1928లో మద్రాసులో సైమన్ కమీషన్ బహిష్కరణ 'సైమన్ గోబాక్' సందర్భంగా పికెటింగ్ జరుపుతున్న ప్రజానీకంపై బ్రిటిష్ నిరంకుశాధికారులు తుపాకులు ప్రయోగించగా ఒకవ్యక్తి నేలకు ఒరిగాడు. అప్పుడు ప్రజాసమూహంలోనుంచి ప్రకాశం ముందుకు ఉరికి తుపాకులు బారుచేసి నిలబడిన సాయుధ భటులకు తన ఎదురు రొమ్మును చూపుతూ "సిద్ధంగా ఉన్నాను కాల్చండి" అన్నాడు. సాయుధ భటులు వెనుకంజవేశారు. 'ఆంధ్రకేసరి' అనే బిరుదు ఆయనకు ఆ సందర్భంలోనే లభించింది. 1937లో మద్రాసు ఉమ్మడి రాష్ట్రంలో సి. రాజగోపాలాచారి మంత్రి వర్గంలో రెవిన్యూ మంత్రిగాను, 1945లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ప్రధాని (ప్రిమియర్)గాను, 1953లో ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడి నప్పుడు దానికి మొదటి ముఖ్యమంత్రిగాను ప్రకాశం పంతులు పనిచేశారు. గ్రామీణ సంక్షేమానికీ, రైతుపండించే పంటకు గిట్టుబాటు ధర లభించడానికీ, వినియోగదారుకి చౌకగా సరుకులు లభించడానికీ ప్రొడ్యూసర్—కన్‌జ్యూమర్ సహకార సొసైటీలను పెట్టడానికి కృషిచేశారు. జమిందారీ నిర్మూలనవంటి భూసంస్కరణలు ప్రవేశపెట్టి



ప్రజలకు ప్రకాశం పంతులు అత్యంత ప్రేమాస్పదులయ్యారు. (చూ. రాష్ట్రావతరణ)

1957 మే 20వ తేదీన తన 85వ ఏట హైదరాబాదు నగరంలో టంగుటూరి ప్రకాశం పంతులు పరమపదించారు. (డెమోక్రసీ)

## ప్రజాస్వామ్యం

ప్రజలచే నేరుగా గాని, ప్రజలచే ఎన్నుకొన బడిన ప్రతినిధుల ద్వారా గాని ఏర్పడిన ప్రభుత్వ వ్యవస్థను ప్రజాస్వామ్య వ్యవస్థ అంటారు. ప్రజాస్వామ్యంలో ప్రభుత్వ అధికారం కేంద్రీకృతం కాకుండా విభజించటమనే ముఖ్య లక్షణాన్ని బట్టియే అట్టి రాజ్యం లోని ప్రజలు ఒక నియోజక వర్గముగా రూపొందిరాజ్యాధి కారాన్ని అమలు జరుపుటలోనూ అదుపు నందుంచుకొనుటలోనూ అధి కారమున భాగస్వామ్యం గల తక్కిన వారిపై అదుపు స్వత్వం కలిగి యుండుట ఏర్పడినది. రాజ్యాధికారానికి మూలం ప్రజలే అనీ సర్వసత్తాకత ప్రజలందే న్యస్త మయినదనీ ప్రజాస్వామ్య మూలభావన విశదీకరిస్తూంది. ప్రజాస్వామ్యం పటిష్ఠంగా అమలు జరగాలంటే దేశానికి ఒక రాజ్యాంగం (కానిస్టిట్యూషన్) అవసరం. అట్టి రాజ్యాంగాన్ని అనుసరించి అందలి ఎన్నికల నియమావళికి లోబడి ప్రజాస్వామ్య రాజ్యంలో 'ప్రభుత్వం' ప్రజల ఎన్నిక మార్గాన్నే అధికారంలోకి రాగలుగుతూంది. అధికార మందున్న ఒక ప్రభుత్వాన్ని దింపి దాని స్థానే వేరొక ప్రభుత్వాన్ని వ్యవస్థాపించుటకు ప్రజలకు హక్కు వుంది. అందుచేతనే ప్రభుత్వాన్ని ఎన్నుకొనుటకు గాని దానిని దింపివేయుటకు గాని గల హక్కును ప్రజలు చలాయించుటకు అవకాశం ఇచ్చే రాజ్యాంగమే 'ప్రజాస్వామ్యం' అని చెప్పవచ్చును. మరొక విధంగా చెప్పాలంటే ప్రజలకొరకు ప్రజల చేత పరిపాలింపబడు ప్రభుత్వం గల రాజ్యమే 'ప్రజాస్వామ్య' రాజ్యం అవుతుంది. ప్రజాస్వామ్యంలో ఎన్నికలు (చూ.) నిర్ణీత కాలావధిలో జరుగుతాయి. ఏ ఒక ప్రభుత్వం అయినా నిరవధికంగా ప్రభుత్వ పాలన కొనసాగించడం ప్రజాస్వామ్య విరుద్ధం. ప్రజలకు ప్రభుత్వంపై గల అధికారం దేశంలో జరుగుచుండు ఎన్నికల వలన వ్యక్తమవుతూంది. ఏ ప్రభుత్వం అయినా ప్రజాభీష్టానికి వ్యతిరేకమయిన పనులు చేసినట్లయిన ఎన్నికలలో ప్రజలు తమకు నచ్చిన వ్యక్తికి

లేదా రాజకీయపక్షానికి (పార్టీ) ఓట్లు వేసి గెలిపించి కొత్త ప్రభుత్వం ఏర్పడేటట్టు చేస్తారు. (చూ. ప్రభుత్వం; భారత రాజ్యాంగం; రాజ్యాంగం.)

## ప్రతాపరుద్రీయం

వేదం వేంకటరాయశాస్త్రి (1853–1929)రచించిన సుప్రసిద్ధ చారిత్రక నాటకం. ఇందలి ఇతివృత్తం కాకతీయ (చూ.) రాజవంశానికి చెందిన ప్రతాపరుద్ర (14 శతాబ్దారంభం) చక్రవర్తికి సంబంధించినది. ఈతనిని జయించాలని ఢిల్లీ సుల్తాన్ ప్రయత్నించాడు. చక్రవర్తి వేటకు వెళ్లి అడవిలో ఒక చెట్టుకింద ఒంటరిగా బడలికతో కాస్త కునుకు తీస్తుండగా సుల్తాను అనుచరులు దొంగచాటుగా బంధించి ఢిల్లీకి తీసికొని పోతారు.

చక్రవర్తి ఢిల్లీ సుల్తానుల బందీ అయ్యేడని వెల్లడయితే రాజ్యంలో అరాచకం ప్రబలుతుందని మహామంత్రి యుగంధరుడు(చూ). ఒక యుక్తి పన్నుతాడు. ప్రతాపరుద్ర రాజాగారి పోలికలుగల చాకలి పేరిగాడికి ప్రతాపరుద్ర చక్రవర్తి వేషం వేయించి సింహాసనం మీద కూర్చోపెడ తాడు. పాలనాబాధ్యతలను మిగిలిన మంత్రులకు అప్పగించి యుగంధ రుడు తానొక పిచ్చివాడి వేషం ధరించి ఢిల్లీకి వెళతాడు. అక్కడ "ఢిల్లీ సుల్తాన్–పట్టుకు పోతాన్!" అని పాడుతూ, పిచ్చివాడిలా తిరుగుతూ, రహస్యంగా అనేక మాయోపాయాల్ని పన్ని ఎట్టకేలకు ప్రతాపరుద్రుని చెరనుండి తప్పించి ఓరుగల్లుకు చేరుస్తాడు. ఇదీ కథ. ఈ నాటకాన్ని వేంకటరాయశాస్త్రి రసవత్తరంగా రచించగా బహుజనాదరణ పొందింది.

## ప్రతాపరుద్రీయ యశోభూషణం

చూ. విద్యానాధుడు

## ప్రతాప రుద్రుడు, ప్రథమ

కాకతీయ చక్రవర్తి. ఈయన రుద్రమదేవి దౌహిత్రుడు. ఆమెకు పుత్ర సంతానం లేనందున తన పెద్ద కుమార్తె పుత్రుడైన ప్రతాపరుద్రదేవుణ్ణి దత్త పుత్రుడుగా స్వీకరించింది. ఈయన తల్లి ముమ్మడమ్మ తండ్రి మహాదేవరాయలు.

రుద్రమదేవి మరణానంతరం 1295లో ప్రతాపరుద్రుడు సింహాసనం అధిష్ఠించాడు. ఈయన రాజ్యానికి వచ్చేసరికి 35 సంవత్సరాలవాడు. పరిపాలనా విధానాన్ని కట్టుదిట్టం చేసి 77 గురు నాయకులను ఏర్పాటు చేసి ఆయా ప్రాంతాల పరిపాలనా బాధ్యతలను వారికి అప్పగించాడు. ప్రతాపరుద్రుని సైన్యం చాలా శక్తిమంతమైంది. అల్లావుద్దీన్ ఖిల్జీ ఎనిమిది సార్లు దండెత్తినా ప్రతాపరుద్రుడి సైన్యం ధైర్య సాహసాలతో పోరాడి 7 సార్లు వారిని వెనక్కి తరిమి వేసింది. 8వ సారి ప్రతాపరుద్రుడు ఓడిపోయి సంధి చేసుకున్నట్లు తెలుస్తూంది. 1323లో ఘియాసుద్దీన్ తుగ్లక్ కుమారుడైన ఉలఘ్‌ఖాన్ ఓరుగల్లు మీద దండెత్తి కోటను స్వాధీనం చేసుకున్నాడు. బందీ అయిన ప్రతాపరుద్రుణ్ణి ఉలఘ్‌ఖాన్ ఢిల్లీ పంపించాడు. ప్రతాపరుద్రుడు దారిలోనే మరణించాడు.

ప్రతాపరుద్రుడు గొప్ప సాహిత్య పోషకుడు. సంస్కృతం, తెలుగు రెండు భాషలను ఆయన ఆదరించాడు. ప్రతాపరుద్రుడు ఆస్థానంలోని సంస్కృత కవులలో సాకల్య మల్లుభట్టు 'ఉదాత్త రాఘవము', 'నిరోష్ఠ్య రామాయణము' అనే రెండు సంస్కృత కావ్యాలు వ్రాశాడు. 1320లో 'జైనేంద్ర కల్యాణాభ్యుదయము' అనే సంస్కృత కావ్యాన్ని రచించిన జైన కవి అప్పారాయడు ప్రతాపరుద్రుడి ఆస్థానంలోనివాడే. తెలుగులో 'క్రీడాభిరామం' అనే వీధి నాటకానికి మూలం అయిన సంస్కృత 'ప్రేమాభిరామం' రచించిన రావిపాటి త్రిపురాంతకుడు ప్రతాపరుద్రుడి సమకాలికుడే అని చరిత్రకారుల అభిప్రాయం. అలంకార శాస్త్రంలో ప్రామాణిక గ్రంథంగా పరిగణించబడే 'ప్రతాపరుద్రయశోభూషణం' రచించిన విద్యానాథుడు ప్రతాప రుద్రుని ఆస్థాన పండితుడు. పాల్కురికి సోమనాథుడు రచించిన 'అనుభవసారం', 'చతుర్వేదసారం', సోమనాథ భాష్యం', 'రుద్ర భాష్యం' మొదలైన గ్రంథాలు ఈ కాలంలోనే వెలువడ్డాయి. ప్రతాపరుద్ర చక్రవర్తి స్వయంగా 'నీతి సారము'అనే రాజనీతి శాస్త్ర గ్రంథాన్ని రచించాడు. ప్రతాపరుద్రుడు 'విద్యాభూషణ' బిరు దాంకితుడు.



## ప్రతాపరెడ్డి, సురవరం

తెలుగు భాషకు తెలుగు సంస్కృతికి ఎనలేని సేవచేసిన ప్రముఖులలో ఒకరు. ఈయన 1896 మే 28న మహబూబ్‌నగరం జిల్లాలోని బోరవెల్లి గ్రామంలో జన్మించారు. కర్నూలులో విద్యాభ్యాసం చేసి తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి న్యాయశాస్త్ర పట్టా పొందారు. కాని ఆయనకు ప్లీడర్ వృత్తి పట్ల ఆసక్తి ఉండేది కాదు. 1924లో ప్రతాపరెడ్డి అప్పటి హైదరాబాదు నగర పోలీసు కమీషనర్ అయిన రావు బహద్దూర్ వెంకట్రామా రెడ్డి ఆదేశం ప్రకారం రెడ్డి హాస్టల్ కార్యదర్శి పదవిని చేపట్టారు. ఆ రోజులలో హైదరాబాదులో తెలుగు భాషకు ఏమాత్రమూ గుర్తింపు ఉండేది కాదు. హైద్రాబాదు నగరంలో తెలుగు భాషను బోధించే స్కూలు ఒకటి కూడా ఉండేది కాదు. కోర్టులలో విద్యాలయాలలో అన్ని చోట్లా ఉర్దూ భాషే వ్యవహారంలో ఉండేది. ఈ పరిస్థితి పట్ల ఎంతో ఆవేదన చెందిన ప్రతాపరెడ్డి నిజాం రాష్ట్రంలోని తెలుగు వారిని జాగృదం చేయడానికి తెలుగు పత్రిక ఒకటి వెలువరించాలని భావించారు. అతి కష్టం మీద ఈ పత్రికను స్థాపించడానికి నిజాం ప్రభుత్వం నుంచి అనుమతి పొంది రాజబహదూర్ వెంకట రామారెడ్డి సహాయ సహకారాలతో ''గోలకొండ పత్రిక''ను స్థాపించారు. మొదట్లో ఇది వారానికి రెండుసార్లు వెలువడేది. కాని తెలుగు పాఠకులు దీనిని బాగా ఆదరించడంతో త్వరలోనే ఇది దినపత్రికగా మారింది. ఈ పత్రికలో రెడ్డి అనేక వ్యాసాలు వ్రాసేవారు. ప్రతాపరెడ్డి గొప్ప సాహిత్య పరిశోధకులు. ఈయన వ్రాసిన ''ఆంధ్రుల సాంఘిక చరిత్ర'', 'హిందువుల పండుగలు' ''రామాయణ విశేషాలు'' వంటివి గొప్ప పరిశోధనా గ్రంథాలు. నిజాం రాష్ట్ర ఆంధ్రులకు అశేష సేవచేసిన రాజబహదూర్ వెంకట్రామారెడ్డిగారి జీవిత చరిత్రను కూడా ఈయన వ్రాశారు. ప్రతాపరెడ్డి గొప్ప స్వాతంత్ర్యోద్యమ యోధుడుగా ప్రసిద్ధి పొందారు. నిజాం నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా జరిపిన ఉద్యమాలలో ఈయన ప్రముఖ పాత్ర వహించారు. 1920లో జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్ర మహా సభకు అధ్యక్షులుగా ఉన్నారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం వంటి గొప్ప సంస్థల అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ప్రతాపరెడ్డి 1954లో కీర్తిశేషు లయారు. ఆయన శిల్ప విగ్రహమును హైదరాబాదులోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ప్రతిష్ఠ చేశారు.



## ప్రధాని

భారత రాజ్యాంగం ప్రకారం 'ప్రధాని' పదవి అతికీలక మయినిది. సార్వత్రిక ఎన్నికలలో అత్యధిక సంఖ్యాబలం ఉన్న రాజకీయ పార్టీ నాయకుడ్ని ప్రధానిగా మంత్రి వర్గం ఏర్పాటు చెయ్యమని రాష్ట్రపతి ఆహ్వానిస్తాడు. అప్పుడు ప్రధాని తన ఇష్టం వచ్చిన వారిని మంత్రి వర్గసభ్యులుగా ఎన్నుకొనగా 'రాష్ట్రపతి' ప్రధాని చేతను, అతని మంత్రివర్గ సభ్యుల చేతను ప్రమాణస్వీకారం చేయిస్తారు. మంత్రివర్గ సభ్యులను ప్రధాని ఇష్టానుసారం మార్చవచ్చును. అనగా కొందరిని తీసివేయుటగాని, మరి కొందరిని చేర్చుటగాని చేయవచ్చును. ప్రధాని రాజీనామా చేసినట్లయిన మంత్రివర్గం కూడా రద్దవు తుంది. ప్రధానికి సర్వాధికారాలు ఉన్నాయి. మంత్రి వర్గ నిర్ణయాలన్నీ ప్రధాని అధ్యక్షతనే తీసికొనబడతాయి. పాలనా విధాన నిర్ణయమంతా ప్రధానిలోనే న్యస్తమయి ఉంటుంది. రాష్ట్రపతికి మంత్రివర్గానికి మధ్యన ప్రధాని అనుసంధాత. పార్లమెంటులో ప్రభుత్వం తరపున ముఖ్య ప్రతినిధి ప్రధానియే. (చూ. ప్రభుత్వం, భారత ప్రభుత్వం, భారత రాజ్యాంగం, రాజ్యసభ, రాష్ట్రపతి, లోక్‌సభ).

## ప్రపంచం

భూమి వయస్సు ఒక లెక్కప్రకారం సుమారు 460 కోట్ల సంవత్సరాలు. అయితే జీవపరిణామ క్రమంలో ప్రాణం ఉన్న ఏకకణ జీవులు మొదట ప్రాదుర్భవించింది రెండు వందల కోట్ల ఏళ్ల క్రిందటనే. 17 లక్షల ఏళ్ళ క్రిందట పాతరాతి యుగంలో మానవ రూపం వర్ధిల్లి వేట, ఆహార సేకరణ

మొదలు పెట్టడం జరగింది. 4 లక్షల ఏళ్ళ క్రిందట రెండు కాళ్ళ మీద నిలబడే మనిషి జావాలోనూ, చీనాలోనూ, ఆఫ్రికాలోనూ అవతరించాడు. పొడుగాటి గొడ్డళ్ళను ఉపయోగించిన నియాండర్తల్ పూర్వీకులు 180 **వేల** ఏళ్ళ క్రిందట మనినారు. 70 వేల ఏళ్ల క్రిందట నియాండర్తల్ మనివున్న జాడలు యూరప్ లోనూ, ఆసియాలోనూ, ఉత్తర ఆఫ్రికాలోనూ కనిపించాయి. అప్పటికి మొదటి దశ హిమయుగం ముగిసి నియాండర్తల్ మానవుడు అంతరించి 40 వేల ఏళ్ల క్రిందట హూమో సేపియన్స్ అనే ఆధునిక మానవాకృతి అవత రించింది. సునిశిత.మైన పనిముట్లు, పదునైన చాకులు ఉపయోగం లోకి తీసికొని వచ్చారు. చిత్రకళ, శిల్పకళలలో అభిరుచి కనబరచాడు. ఈ లక్షణాలు దక్షిణ ఫ్రాన్స్‌లోని ఆరిగ్నేషియర్ సంప్రదాయంగల క్రోమాగ్నన్ మాన వునిలో గోచరించాయి. 18 వేల ఏళ్ల క్రిందట హిమయుగం పూర్తిగా అంతరించడంతో ఆరిగ్నేషియర్ సంస్కృతి కూడా అంతరించి సోల్యుట్రియన్, మాగ్డలేని యన్ సంస్కృ తులు వెలసి పాతరాతియుగపు కళలు విజృంభించాయి. 15 వేల ఏళ్ళ క్రిందట బేరింగు జలసంధిని ఆసియా వాసులు దాటినట్లు దాఖాలాలు ున్నాయి. ఇట్లు గత ఏభయి వేల ఏళ్ళల్లోనూ అంటే ుమారు 800 మానవతరాల (తరం అంటే 62 ఏళ్లు) ోని మొదటి 650 తరాలు మానవుడు గుహ జీవితాన్ని ిగించాడు. తరవాత సుమారు 80 తరాలు దేశద్రిమ్మరిగా ిరిగాడు. ఆకాలంలోనే ఆదిమ మానవుడు దేశ ద్రిమ్మరి తనానికి స్వస్తిపలికి ఒక చోట స్థిర నివాసం ఏర్పరచుకొనడం ప్రారంభించాడు. (ఉదా. పాలస్తీనాలోని జెరికో) అప్పుడే చేనేత, ధాతు సాధన, ఎద్దులు లాగే నాగలి, చక్రాలతో బండి వంటి సాధన సంపత్తిని సమకూర్చు కున్నాడు. ఇలా ఏ ప్రవాహ తీరాన్నో (ఉదా. నైలు, టైగ్రిస్, యూఫ్రటీస్, సింధు, హోయాంగ్– హో తీరాలలో)ఎంచుకుని స్థిర నివాస మేర్పరచుకున్న ప్పుడు మానవులు ఒక చోట చేరేటప్పటికి పరస్పరమూ మాట్లాడాలనిపించి కాబోలు భాష, లిపి, (హైరగ్లిఫిక్, ంధులిపి)ని సృష్టించు **కున్నారు.** పిమ్మట, అచ్చు పని (ప్రింటింగు) ప్రారంభించే సరికల్లామరో ఆరవయి ఆరు తరాలు గడిచాయి. ఈ అరవయి ఆరు తరాల కాలంలోనూ ఈజిప్టు నాగరకత, సుమేర్, బాబిలి లోనియా, సింధు నాగరకత, ఆర్య నాగరకత, హిటైట్ నాగరకత, మినోవా నాగరకత, అస్సీరియా నాగరకత, రోమన్ నాగరకత, అయోనియా (గ్రీక్) నాగరకత, బైజాంటియన్ నాగరకత వంటి సంస్కృతీ సంప్ర దాయాలు వెలసి వర్ధిల్లి ప్రపంచ వ్యాప్తంగా విస్తరించ దొడగాయి. హిందూ, జరతుష్ట్ర, బౌద్ధం, జైనం, క్రైస్తవం, ఇస్లాం వంటి మత విశ్వాసాలను ఆయా ప్రవక్తలు ప్రవచించి రూపొందించి ప్రచారం చేయసాగారు. ఈ నాగరకతలు పరిఢవిల్లిన సమయం లోనే రాజ్యాలు స్థాపన జరిగి సామ్రాజ్యాలు ప్రభుత్వ ఆధిపత్యాలు విస్తరించాయి. అటువంటి మహా సామ్రాజ్యాలలో చెప్పకోదగ్గవి– రోమన్ సామ్రాజ్యం, ఓటోమన్ సామ్రాజ్యం, మంగోలు సామ్రా జ్యం, మేసిడోనియన్, ఫోనీషియన్, బైజాంటియన్ సామ్రాజ్యం, పవిత్ర రోమన్ సామ్రాజ్యం, బ్రిటిషు సామ్రాజ్యం. ఈ లోపున మానవ మేధస్సు మరింత పరిణతి చెందడంతో భావ వికసన యుగం పరాకాష్ఠ నందుకొనినది. అయితే ఈ తరువాతి భావ వికసన యుగంలోనే గూటెన్ బర్గ్ (క్రీ.శ. 15వ శతాబ్ది) అచ్చుయంత్రాన్ని నిర్మించడంతో మానవుడు ప్రగతి పథంమీద పడ్డాడు. మరోనాలుగు తరాలు గడిచే సరికల్లా విద్యుత్తు (ఎలక్ట్రిసిటీ) ఉత్పత్తి, వినియోగాలు తెలిసి కొన్నాడు. అంతకు ముందే ఐజాక్ న్యూటన్ (1642–1722)గురుత్వాకర్షణ బలసూత్రాలను అందించడంతో యాంత్రిక సౌలభ్యం ఏర్పడింది. పారిశ్రామిక విప్లవం జేమ్స్‌వాట్(1736–1819)ఆవిరియంత్రంతో ఆరంభ మయింది. దానితో మాన వుడు విశ్రమించిక ఏదో ఒక నూతన నిర్మాణాన్ని ప్రపంచంలోకి తీసికొని వస్తూనే ఉన్నాడు. అలనాడు అగ్ని ఉపయోగం, చక్రంతో బండి, అచ్చుపని, ఈనాడు సైన్స్, ఇంజనీరింగ్, ఎలక్ట్రానిక్స్ సాయంతో కంపూటర్ నిర్మించి వాడకంలోకి తీసికొని వచ్చాడు(1960) 20వ శతాబ్ది ఆరంభంలో ఐన్‌స్టీన్ $E=mc^2$ అనే గణితసూత్రం అందించడంలో భౌతిక శాస్త్రంలో విప్లవాత్మకమైన మార్పువచ్చి పరమాణుశక్తి మానవుని అదుపులోకి వచ్చింది. ఇలా ఆవిష్కరించిన వాటిలో ముందెన్నడూ 799 తరాల లోనూ కనీవినీ ఎరుగనట్టి శక్తులు, యుక్తులు, సామగ్రి ఈ 800 వ

# ప్రపంచం

ఆర్కిటిక
ఆర్కిటిక
అట్లాంటిక్ మహాసముద్రం
పసిఫిక్ మహాసముద్రం
పసిఫిక్ మహా సముద్రం
అట్లాంటిక్ మహాసముద్రం
హిందూ మహాసముద్రం
అంట

## ప్రపంచం : ఐ.రా.స. సభ్యదేశాలు

1. అంగోలా
2. ఆంటిగో & బార్బుడా
3. ఆఫ్ఘనిస్తాన్
4. అర్జెంటీనా
5. అల్జీరియా
6. అల్బేనియా
7. ఆస్ట్రియా
8. ఆస్ట్రేలియా
9. ఇండోనేషియా
10. ఇజ్రాయెల్
11. ఇటలీ
12. ఇరాక్
13. ఇరాన్
14. ఈక్వడార్
15. ఈక్వటోరియల్ గినీ
16. ఈజిప్ట్
17. ఉగాండా
18. ఉరుగ్వే
19. ఎతియోపియా
20. ఎల్ సాల్వడార్
21. ఐర్లాండ్
22. ఐస్‌లాండ్
23. ఒమన్
24. కంపూచియా
25. కాంగో
26. కటార్
27. కామెరూన్
28. కువాయిట్
29. కెనడా
30. కెన్యా
31. కేప్ వెర్డే
32. కొమోరోస్
33. కొలంబియా
34. కోటే డ ఐవరీ
35. కోస్టారికా
36. క్యూబా
37. గయానా
38. గాంబియా
39. గినీ
40. గినీ బిస్సౌ
41. గెబన్
42. గ్రీస్
43. గ్రెనడా
44. గ్రేట్ బ్రిటన్
45. గ్వాటెమాలా
46. ఘనా
47. చాద్
48. చిలీ
49. చైనా
50. జపాన్
51. జమైకా
52. జర్మనీ, తూర్పు
53. జర్మనీ, పశ్చిమ
54. జాంబియా
55. జింబాబ్వే
56. జెకోస్లోవాకియా
57. జైయిరీ
58. జోర్డాన్
59. టర్కీ
60. టాంజేనియా
61. టునీషియా
62. టోగో
63. ట్రినిడాడ్ & టుబాగో
64. డెన్మార్క్
65. డొమినికన్ రిపబ్లికన్
66. డొమినికా
67. డ్జిబౌటి
68. థాయిలాండ్
69. దక్షిణ ఆఫ్రికా
70. నమీబియా
71. నార్వే
72. నికరాగ్వా
73. నెదర్‌లాండ్స్
74. నేపాల్
75. నైజర్
76. నైజీరియా
77. న్యూజీలాండ్
78. పనామా
79. పరాగ్వే
80. పాకిస్తాన్
81. పాపువాన్యూగినీ
82. పెరూ
83. పోర్చుగల్
84. పోలండ్
85. ఫిజీ
86. ఫిన్లాండ్
87. ఫిలిప్పీన్స్
88. ఫ్రాన్స్
89. బంగ్లాదేశ్
90. బర్మా
91. బల్గేరియా
92. బహమాస్
93. బహ్రేయిన్
94. బార్బడోస్
95. బురుండీ
96. బుర్కినా ఫాసో
97. బెనిన్
98. బెలిజీ
99. బెల్జియమ్
100. బైలోరష్యా
101. బోత్స్వానా
102. బోలివియా
103. బ్రూనే
104. బ్రెజిల్
105. భారతదేశం
106. భూటాన్
107. మంగోలియా
108. మడగాస్కర్
109. మలావీ
110. మలేసియా
111. మారిటేనియా
112. మారిషస్
113. మాల్‌దీవులు
114. మాలి
115. మాల్టా
116. మెక్సికో
117. మొజాంబిక్
118. మొరాకో
119. యుక్రెయిన్
120. యుగోస్లావియా
121. యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్
122. యునైటెడ్ స్టేట్స్
123. యెమెన్ (ఏడెన్)
124. యెమెన్ (సానా)
125. రష్యా
126. రుమేనియా
127. రువాండా
128. లక్సెంబర్గ్
129. లావోస్
130. లిబియా
131. లెబనాన్
132. లెసతో
133. లైబీరియా
134. వనౌటూ
135. వియత్నామ్
136. వెనిజ్వెలా
137. శ్రీలంక
138. సామో, పశ్చిమ
139. సావ్‌టోమే & ప్రిన్సిపీ
140. సింగపూర్
141. సియర్రా లియోనీ
142. సిరియా
143. సుడాన్
144. సురినామే
145. సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్
146. సెకెల్లిజ్
147. సెనెగల్
148. సెయింట్ కిట్ & నెవిస్
149. సెయింట్ లూసియా
150. సెయింట్ విన్సెంట్స్ & ది గ్రెనడీన్స్
151. సైప్రస్
152. సోమాలియా
153. సోలమన్ దీవులు
154. సౌదీ అరేబియా
155. స్పెయిన్
156. స్వాజీలాండ్
157. స్వీడన్
158. హంగేరి
159. హయిటీ
160. హోండూరాస్

తరంలో తాను కైవసం చేసికొని విరామం లేకుండ ఎప్పటికప్పుడు ప్రగతిని సాధిస్తూనే ఉన్నాడు. ఆ మానవ కృషి ఫలితాలే నేడు టెక్నాలజీ -రేడియో, టి.వి. కంప్యూటర్, శాటిలైట్ కమ్యూనికేషన్స్ సమాజ కళ్యాణానికి ఉపకరిస్తున్నాయి. 1969 జూలై 21 నాడు చంద్రమండలంపై కాలూన గలగడం,డి.ఎన్.ఏ.వంటి ప్రాథమిక జీవాణువును సాధించి బయోటెక్నాలజీ రంగంలో ముందడుగు వేయడం మానవుని జిజ్ఞాసపూరితమయిన కృషి ఫలితమే. ఇలా ఆధునిక మానవుడుగా పెరిగిన ఆదిమ మానవుడు నేడు సుమారు 160 స్వతంత్ర రాజ్యాలతో తనకంటూ సభ్య సంఘ సంస్కృతిని ఏర్పరచుకొని మనుగడ సాగిస్తున్నాడు. అనాది కాలం నుండి నేటి వరకూ మానవుడు పడిన పాట్లు అందుకు సాధించిన కృషి సంఘటనల వారీగా క్రింద పట్టికలో పొందుపరచమైనది. 160 రాజ్యాల పట్టిక కూడా ఇవ్వడమైనది.

[illegible]

క్రీ.పూ.
4000 పశ్చిమ ఇరాన్‌లో శుశాన్ నాగరకత వర్ధిల్లింది.
3500 సుమేరియా (యూఫ్రటీస్ నదీ తీరాన) నాగరకత వర్ధిల్లింది. బాణాగ్ర (క్యూని ఫారమ్)లిపి.
3100 ఈజిప్టులో హైరగ్లిఫిక్‌లిపి. క్రీట్‌లో మినోవా నాగరకత (3000–1100) చిత్రలిపి.వెండి, బంగారం ఉప యోగం. పూర్వ మైసీనియా (దక్షిణ గ్రీస్) నాగరకత ప్రారంభం.
3000 సింధు నాగకత. ద్రావిడ నాగరకత.
2980 ట్రాయ్‌లో(వాయవ్య టర్కీ) ప్రారంభ స్థిరనివాసాలు.
2850 చీనాలో ఐతిహాసిక స్వర్ణ యుగం.
2700 ఈజిప్టులో పిరమిడ్‌ల యుగ ప్రారంభం.
2400 ఆర్యుల వలస ప్రారంభం.
2371 అక్కాడ్ (ఉత్తర ఇరాక్) సామ్రాజ్యం.
2200 మధ్య మినోవా యుగం. కలం, సిరా ఉపయోగించి దీర్ఘలిపి.
1720 ఈజిప్టులో హిక్సోస్. యుద్ధంలో రథాల వాడకం ప్రారంభం (1720–1550).
1751 బాబిలోనియాలో(క్రీ.పూ. 2800–1750)హమ్మురాబీ శాసనావళి.
1600 తరువాతి మినోవా నాగరకత—దీర్ఘలిపి.
1600 చీనాలో శుంగ రాజవంశపాలన
1546 ఈజిప్టులో మూడవ తుత్మోసిస్ హయాములో 18వ రాజవంశపాలన; నాగరకత ఉచ్ఛస్థితి.
1500 భారతదేశంలో వేదసాహిత్యం; ఆసియా మైనర్‌లో బలవత్తరమైన ఆర్య సామ్రాజ్యం (మిత్తానీ); ఈజిప్టు, బాబిలో నియా(యూఫ్రటీస్ లోయ) సామ్రా జ్యాలతో ఫొనీషియా లాభసాటి వర్తక వాణిజ్యం నెరిపింది.
1400 మినోవా (క్రీట్) నాగరకత ఉచ్ఛస్థితి.
1350 హిట్టైట్ (టర్కీ ప్రాంతం) నాగరకత (క్రీ.పూ 1900–1200) ఉచ్ఛస్థితి.
1300 హీబ్రూల అణచివేత; ఈజిప్టు నుండి (మోజెస్) కాందిశీకులుగా వెళ్ళిపోవుట; ఫొనీషియాలో స్థిర నివాసాలు.
1250 పాలస్తీనాపైకి హీబ్రూ (ఇజ్రాయెల్)ల దాడి.
1200 ఈజిప్టుపైకి 'సాగర' నాసుల దాడి; హిట్టైట్ నాగరకత పతనం; సాగర ప్రాబల్యం పెరిగింది.
1125 చీనాలో సూదంటు రాయి వాడకం.
1027 చీనాలో చౌ రాజ వంశపాలన(1027–249).
1005 డేవిడ్, సాలమన్ రాజ్యాల.ప్రాబల్యం, జెరోసలెమ్ అభయ హస్తం (1005–925).
1000 భారతదేశంలో ఋగ్వేదం.
850 కార్తేజ్ (టునీషియా ప్రాంతం) స్థాపన.
791 చీనాలో గ్రహణం గూర్చి శాసనం.

క్రీ.పూ. 776 గ్రీస్‌లో ప్రపథమ ఒలింపిక్ క్రీడల నిర్వహణ.
758 రోమ్ నగరం స్థాపన; దక్షిణ ఇటలీలో గ్రీక్ స్థిర నివాసాలు.
745 నైరృతి ఆసియాలో అస్సీరియా (నినెవ్ రాజధాని) ప్రబల రాజ్యంగా వెలు గొందింది.
722 రెండవ సార్గన్‌చే సమారియా (ఉత్తర పాలస్తీనా) ముట్టడి.
700 హోమర్ ఇలియెడ్, ఒడెస్సే కావ్యాల రచన; ఇనుము ఉపయోగం.
625 నూతన బాబిలోనియా (చాల్డియన్) సామ్రాజ్యం.
594 గ్రీస్(ఏథెన్స్)రాజ్యాంగ సంస్కరణ.
538 బాబిలోనియా పర్షియన్‌ల కైవసం.
509 రోమన్ గణరాజ్య స్థాపన.
508 ఏథెన్స్‌లో ప్రజాస్వామ్య రాజ్యాంగ ప్రక టన.
500 ఎట్రుస్కన్‌లు ఉత్తర ఇటలీలో ప్రాబ ల్యంలో ఉన్నారు.
480 గౌతమ బుద్ధుని నిర్యాణం; పర్షియన్‌లు స్పార్టాను అదుపులో పెట్టారు.
479 గ్రీక్‌లు పర్షియాదాడుల్ని ఎదుర్కొనగలి గారు; చీనాలో కన్‌ఫ్యూసియస్ నిర్యాణం.
461 ఏథెన్స్‌లో పెరిక్లిజ్ పాలన.
447 పార్తెనాన్ నిర్మాణం ప్రారంభం.
431 ఏథెన్స్—స్పార్టా ఘోర యుద్ధం.
425 హెరొడోటస్(485–425)నిర్యాణం.
406 గ్రీక్ రచయితలు యూరిపిడిజ్, సోఫో క్లిజ్ మరణం.
399 గ్రీక్‌చరిత్రకారుడు తుసిడైడిస్‌మరణం. సోక్రటీస్(470–399)కు (హెమ్‌లాక్ విషంతో)మరణదండన.
347 ప్లేటో నిర్యాణం (427–347).
334 మేసిడోనియా (బాల్కన్ దేశాల) రాజు ఫిలిప్‌ను హత్యచేసి అలెగ్జాండర్ పట్టాభిషిక్తుడయ్యాడు.
333 పర్షియారాజు డరయస్‌ను అలెగ్జాండర్ ఓడిస్తాడు. ఈజిప్టు అలెగ్జాండర్ కైవసమవుతుంది.
323 అలెగ్జాండర్ (356–323)బాబిలో నియాలో మరణిస్తాడు.
323 ఈజిప్టులో మొదటి టాలమీ పాలన ప్రారంభం.
322 అరిస్టాటిల్ (384–322)నిర్యాణం.
221 షిహ హుయాన్‌టీ పాలనలో ఉన్న చీనా ప్రాంతం చిన్ రాజవంశ వశమైంది.
214 అంతకు ముందు విడిగావున్న గోడల్ని చీనాగోడ (గ్రేట్ వాల్ ఆఫ్ చీనా)గా కలిపి కట్టారు.
213 చీనా సంప్రదాయ సాహితిని దగ్ధం చేశారు.
212 ఆర్కిమెడిస్ (287–212) నిర్యా ణం.
202 చీనాలో హాన్ రాజవంశ పాలన (క్రీ.పూ. 202 క్రీ.శ. 220)

క్రీ.పూ. 196 మేసిడోనియా పతనమైన తరువాత గ్రీక్ నగర రాజ్యపాలన నుండి రోమ్ విడివడింది.
124 చీనాలో ప్రభుత్వోద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి మహా విద్యాలయ కేంద్రం.
110 వూ—టీ చక్రవర్తి పాలనలో చీనాసామ్రా జ్యం విస్తరించి విదేశీవర్తకవాణిజ్యాలు పెంపొందాయి.
60 పాంపేలో పాంపే, సీజర్, క్రేసియస్ నాయకత్రయపాలన.
55 బ్రిటన్‌పైకి జూలియస్ సీజర్ దండయాత్ర (55–54).
48 పాంపే సీజర్ వశమైంది.
46 సీజర్ పంచాంగాన్ని సంస్కరించాడు.
44 సీజర్ హత్యగావింపబడ్డాడు.
43 రెండవ నాయకత్రయ పాలన, ఆంటోనీ, ఆక్టేవియస్, లేపిడస్.
31 ఆంటోనీ—క్లియోపాత్రాపై ఆక్టేవియస్ నౌకాదళ విజయభేరి.
19 వర్జిల్ (70–19)మహాకవి మరణం.
4 ఏసుక్రీస్తు జననం (తిథి నిర్దుష్టం కాదు).

క్రీ.శ.
6 చీనాలో ప్రభుత్వ సిబ్బంది శిక్షణ, పరీక్షలు సువ్యవస్థీకరించబడినాయి.
9 చీనాలో వాంగ్‌మాంగ్ నిర్వహించిన తీవ్ర సంస్కరణలు.
30 ఏసుక్రీస్తును శిలువపై వేసి బాధలకు గురిచేసిన (తేదీ నిర్దుష్టం కాదు) సంఘటన.
79 వెసూవియస్ అగ్నిపర్వతం బ్రద్దలయి పాంపే నాశనమైంది.
180 'పంచ మహాచక్రవర్తుల'లో ఒకడైన మార్కస్ అరీలియస్(121–180) నిర్యాణం; రోమన్ సామ్రాజ్య పతనం ప్రారంభం.
527 బైజాంటినియన్ (కానిస్టాంటినోపుల్ రాజధాని) చక్రవర్తి జస్టినియన్-I (క్రీ.శ. 483–565) పౌర న్యాయ సూత్రా వళిని క్రోడీకరించాడు.
534 ఉత్తర ఆఫ్రికా ఇటలీ బైజాంటినియనల వశమయ్యాయి.
570 మహమ్మద్ (570–632)ప్రవక్త జననం.
581 చీనాలో స్యూ రాజ వంశపాలన (581–618).
605 చీనాలో పెద్ద కాలువను త్రవ్వేరు.
618 చీనాలో ట్యాంగ్ రాజవంశ పాలన (618–907).
622 హిజేరా మహమ్మదీయ శకం ప్రారంభం; మెక్కా నుండి మదీనాకు మహ మ్మద్ పలాయనం.
632 మహమ్మద్ సిద్ధి పొందారు.
638 ముస్లిములు జెరుసలెమును వశపర్చుకున్నారు.
648 అలెగ్జాండ్రియా ముస్లిముల వశమైంది.
645 జపాన్‌లో సోగా తెగ పాలన అంతరించ డంతో బౌద్ధం ప్రవేశించింది, చీనా సంస్కృతి ప్రబలింది.

# ప్రపంచ చరిత్ర: కొన్ని ప్రముఖ ఘట్టాలు

క్రీ.శ 750 రిమాయ్యద్ (డమాస్కస్ రాజధాని)ల ఆస్థానంలో అబ్బాసిడ్ (క్రీ.శ. 750–1258) పాలన ప్రారంభం కలీఫా పాలన (బాగ్దాద్ రాజధాని) ప్రారంభం.

800 షార్లమాన్ (క్రీ.శ. 742–814) రోమ్‌లో పట్టాభిషిక్తుడయ్యాడు. (పవిత్ర రోమన్ సామ్రాజ్యం)

868 చీనాలో ప్రపథమంగా ముద్రించిన గ్రంథం.

899 ఆల్ఫ్రెడ్ చక్రవర్తి నిర్యాణం.

900 ఘనా (వాయవ్య ఆఫ్రికా)లో ఉచ్ఛస్థితి.

982 గ్రీన్‌లాండ్‌ను నార్స్‌మెనచే ఆవిష్కరణ.

1016 డెన్మార్క్ రాజు కాన్యూట్ ఇంగ్లండుకు చక్రవర్తి అయ్యాడు.

1086 డూమ్స్‌డే గ్రంథ (భూమిశిస్తు వివరాలు.) సంకలన.

1148 డమాస్కస్‌ను కైవసం చేసుకోవడంతో రెండవ మత యుద్ధం (క్రూసేడ్) విఫలమయింది.

1161 చీనా యుద్ధాల్లో విదారకద్రవ్యాల వాడకం. చెంగిజ్ ఖాన్ (1162–1227) మంగోల్ విజేత ఆసియా, తూర్పు యూరప్‌లను జయిస్తాడు.

1215 జాన్ రాజుచే ఇంగ్లండ్‌లో భూస్వాములు 'మాగ్నాకార్టా' మీద చేవ్రాలు చేయిస్తారు.

1241 మధ్య యూరప్ పైకి మంగోల్‌ల దాడులు.

1294 శాస్త్ర ప్రయోగ విజ్ఞాని రోజర్ బేకన్ నిర్యాణం.

1354 ఓటోమన్ టర్క్‌లు యూరప్‌లో గల్లిపోలీ వద్ద స్థిరనివాసం.

1362 బ్రిటిషు పార్లమెంట్‌లోను, న్యాయస్థానాల్లోనూ ఇంగ్లీషు అధికార భాష స్థాయి నందుకుంది.

1363 తైమూరు(తామర్లేన్)దండయాత్రలు ప్రారంభం.

1368 చీనాలో మింగ్ రాజవంశ పాలన (1368–1644).

1396 ఆఖరి మత యుద్ధాన్ని (క్రూసేడ్) నికోపోలిస్ వద్ద టర్క్‌లు అణచివేస్తారు.

1421 జోన్ ఆఫ్ ఆర్క్ సజీవ దహనం.

1438 హాప్స్‌బర్గ్‌లు పవిత్ర రోమన్ సామ్రాజ్యాన్ని పాలిస్తారు (1438–1806).

1453 శత వర్ష యుద్ధానంతరం బైజాంటియన్ (కానిస్టాంటినోపిల్)పతనం. బ్రిటిషు ఆధిక్యత.

1454 యూరప్ లో గూటెన్‌బర్గ్ (1398–1468)చే అచ్చు యంత్రం.

1492 క్రిస్టోఫర్ కొలంబస్ పశ్చిమ ఇండియా దీవుల ఉనికి ఆవిష్కరణ.

1494 యూరప్‌లో అంతర్జాతీయ సంబంధాలు—ఆధునిక దౌత్యనీతి ప్రారంభం.

1498 వాస్కోడగామా సముద్రమార్గం ద్వారా భారత దేశంలోని కాలికట్టు చేరాడు.

1499 అమెరిగో వెస్పుస్సీ దక్షిణ అమెరికా ఉనికిని నిరూపిస్తూ దేశపటం తయారుచేశాడు.

1500 బ్రెజిల్ ఉనికిని పెడ్రోకేబ్రల్ కను గొన్నాడు.

1507 పోర్చుగీసు రాజప్రతినిధి ఆల్‌బుకర్క్ గోవాలో సామ్రాజ్యస్థాపన చేశాడు.

1513 పునరుజ్జీవనం ఉచ్ఛస్థితిలో లియో X పోప్ అయ్యాడు. మైకోవిల్లీ మేధావి రాజనీతిని గురించి 'ప్రిన్స్' గ్రంథాన్ని రచించాడు.

1517 మార్టిన్ లూథర్ కింగ్ సంస్కరణోద్యమంలో 95 సిద్ధాంత వ్యాసాలు సిద్ధపరచాడు; టర్క్‌లు ఈజిప్టునువశపరచుకున్నారు.

1519 దేశాన్వేషకుడు మెజిల్లాన్ ప్రపంచ యాత్ర బయలుదేరాడు. బహుముఖ ప్రజ్ఞాశాలి లియోనార్డోడా విన్సీ (1452–1519)నిర్యాణం.

1542 పోర్చుగీస్ ప్రపథమంగా జపాన్ చేరుట.

1543 సుప్రసిద్ధ ఖగోళ విజ్ఞాని కోపర్నికస్ నిర్యాణం.

1564 షేక్స్‌పియర్ మహాకవి జననం (1564–1616)

1570 పోప్ ఇంగ్లండ్ మహారాణి ఎలిజబత్తును బహిష్కరించాడు.

క్రీ.శ. 1582 పోప్ గ్రిగరీ XIII (ఇంగ్లీషు) పంచాంగాన్ని సంస్కరించాడు (ఇప్పుడు అమలులో ఉన్న కేలండరు విధానం).

1588 స్పేనిష్ ఆర్మడా ఓటమి.

1600 భారతదేశంలో ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీ స్థాపన; జపాన్‌లో టోకుగావా యుగం ప్రారంభం (1600–1868)

1602 డచ్ ఈస్ట్ ఇండియా కంపెనీ స్థాపన.

1601 వర్జీనియా (అమెరికా)లో లండన్ వాసులు వలస ప్రారంభించారు.

1608 క్విబెక్ (కెనడా)ను చాంప్లియన్ స్థాపించాడు.

1613 రష్యాలో జార్-I మైకేల్ రొమానావ్ పాలన.

1614 నేపియర్ గణిత లాగరిథమ్ జంత్రీలను తయారుచేశాడు.

1616 గెలీలియో శాస్త్ర ప్రయోగాలపై నేరారోపణ.

1620 యాత్రా జనకులు (పిల్‌గ్రిమ్ ఫాదర్స్) 'మే ఫ్లెయిర్' నౌకలో న్యూఇంగ్లండ్ (అమెరికా) చేరారు.

1624 రిచ్లూ ఫ్రాన్స్ ప్రధాని అయ్యారు.

1628 విలియమ్ హార్వే విజ్ఞాని 'రక్తప్రసరణం' గురించి ప్రచురించాడు.

1636 జపాన్ దేశీయులు విదేశాలకు వలస వెళ్లుట నిషేధింపబడినది.

1644 చీనాలో మంచూ రాజవంశపాలన (1644–1911) ప్రారంభం.

1649 ఇంగ్లండులో చార్లెస్-I ఉరితీత.

1664 న్యూయార్క్‌ను ఇంగ్లీషువారు ఆక్రమించారు.

1666 లండన్ దగ్ధమైంది; సుప్రసిద్ధ భౌతిక విజ్ఞాని ఐజాక్ న్యూటన్ (1642– 1727)గురుత్వాకర్షణ బలసూత్రాలను నిర్వచించారు.

1669 ప్రసిద్ధ చిత్రకారుడు రెంబ్రాంట్ (16 06–1669 నిర్యాణం.

1679 ఇంగ్లండ్‌లో హెబియస్ కార్పస్ చట్టం రూపొందింది.

1690 లాకే 'ప్రభుత్వం' మీద రెండు ఉద్గ్రంథాలు అందించాడు.

1694 బాంక్ ఆఫ్ ఇంగ్లండ్ వ్యవస్థాపన.

1695 ఇంగ్లండ్‌లో పత్రికా స్వేచ్ఛ.

1696 రష్యాలో పీటర్ ఏకైక మహాచక్రవర్తి జార్ అయ్యాడు.

1713 అమెరికాకు బానిస వ్యాపారంలో స్పెయిన్ వారికి గుత్తాధికారం.

1714 బ్రిటన్‌లో హానోవర్ వంశపాలన. విగ్‌ల అధికారం.

1721 రాబర్ట్‌వాల్ పోల్ బ్రిటిషు ప్రధాని అవుతాడు.

1733 ఇంగ్లండ్‌లో పారిశ్రామిక విప్లవం మొదటి దశ ప్రారంభం.

1751 ఫ్రాన్స్‌లో ఎన్‌సైక్లోపీడీ (విజ్ఞాన సర్వస్వం మొదటి గ్రంథం) ప్రచురణ.

1753 బ్రిటిషు మ్యూజియం (స్లోనే వస్తు సేకరణ)స్థాపన.

1759 ఫ్రాన్స్‌లో మహాకవి వాల్టేర్‌చే 'కాండిడే' ప్రచురణ.

1762 కేథరీన్-II మహా జారినా చక్రవర్తిని అయింది.

1768 ఇంగ్లండ్‌లో రాయల్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ స్థాపన. 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' మూడు సంపుటాలు ప్రచురణ ప్రారంభమయింది.

1773 బోస్టన్ టీ పార్టీ అమెరికా విప్లవానికి నాంది.

1775 జేమ్స్‌వాట్ ఆవిరి యంత్రం.

1776 అమెరికా స్వాతంత్ర్య యుద్ధ ప్రకటన. ఆడమ్ స్మిత్ దేశదేశాల సిరి సంపదలు (వెల్త్ ఆఫ్ నేషన్స్) ప్రచురణ.

1783 వేడిగాలి (మాంట్ గాల్ఫర్) హైడ్రోజన్ (చార్లెస్) గుమ్మటాల్లో మొదటిసారిగా ఎగిరారు.

1784 ఇంగ్లీషు నిఘంటు కారుడు సామ్యూల్ జాన్సన్ (1709–84) నిర్యాణం.

క్రీ.శ. 1788 ఆర్థర్ ఫిలిప్ నాయకత్వంలో నౌకలు ఆస్ట్రేలియా తీరాలు చేరాయి.

1789 జార్జి వాషింగ్‌టన్ యునైటెడ్ స్టేట్స్‌కు ప్రప్రథమ ప్రెసిడెంటు అయ్యాడు; ఫ్రెంచి విప్లవం రాజుకుంది (జులై 14)ఫ్రాన్స్‌లో రెయిన్ ఆఫ్ టెర్రర్ ప్రారంభం.

1792 డెన్మార్క్ బానిస వ్యాపారం రద్దు చేసింది; ఫ్రాన్స్ గణ (రిపబ్లిక్) రాజ్యమయింది.

1793 16వ లూయీ ఉరితీత.

1794 ఫ్రాన్స్‌లో రాబస్పియర్ (జాకోబిన్‌లు) పతనం—విప్లవ కారుల విజయభేరి; హాయిటీలో నీగ్రోల తిరుగుబాటు.

1795 నెపోలియన్ బోనాపార్టి పారిస్ మూకలను అదుపులో పెట్టాడు..

1802 బ్రిటన్—ఫ్రాన్స్ శాంతి సంధి; ప్రప్రథమ ఆవిరి నౌక 'చార్లెట్ దుండాస్' క్లైడ్ నది మీద ప్రయాణించింది.

1804 నెపోలియన్ బోనాపార్టీ ఫ్రాన్స్‌కు చక్రవర్తి అయ్యాడు.

1805 ట్రఫాల్గర్ యుద్ధంలో నెల్సన్ విజయ భేరి.

1806 నెపోలియన్ జర్మన్ సైన్యాన్ని పునర్వ్యవస్థీకరిస్తాడు; పవిత్ర రోమన్ సామ్రాజ్య పతనం.

1807 బ్రిటిషు సామ్రాజ్యంలో బానిస వ్యాపారం రద్దు. యూరప్‌నంతటినీ నెపోలియన్ తన రాజ్యంలో కలుపుకుంటాడు

1819 అర్జెంటీనా స్వపరిపాలన—దక్షిణ అమెరికాలో స్వతంత్రించిన ప్రప్రథమ దేశం.

1814 నెపోలియన్ ఫ్రెంచి సింహాసనాన్ని వదలి ఎల్బా దీవిలో తలదాచుకుంటాడు.

1815 నెపోలియన్ ఎల్బా నుంచి పలాయనం. వాటర్లూ సంగ్రామం నెపోలియన్ ఓటమి. నెపోలియన్‌ను సెయింటు హెలినాకు పంపుతారు.

1819 స్టామ్‌ఫర్డ్ రాఫిల్స్ సింగపూర్ వ్యవస్థాపించాడు.

1821 నెపోలియన్ నిర్యాణం (సెయింట్ హెలీనాలో)

1823 మన్రో సిద్ధాంతం.

1825 గ్రేట్ బ్రిటన్‌లో ప్రప్రథమ రైలుమార్గ నిర్మాణం (స్టాక్‌టన్ నుంచి డార్లింగ్ టన్ వరకు).

1826 అట్లాంటిక్ మహా సముద్రాన్ని డచ్చివారి ఆవిరి నౌక మొదటిసారిగ దాటింది.

1827 సుప్రసిద్ధ పాశ్చాత్య వాగ్గేయకారుడు బెతోవెన్ నిర్యాణం.

1831 మైకేల్ ఫారడే విద్యుదయస్కాంత ప్రవాహాన్ని కనుగొన్నాడు.

1832 ప్రసిద్ధ జర్మన్‌కవి గోథే నిర్యాణం; మోర్స్ ఎలక్ట్రిక్ టెలిగ్రాఫ్‌ను కను గొన్నాడు.

1833 కార్మిక శ్రేయస్సునుకోరి ఫ్యాక్టరీ చట్టం బ్రిటన్‌లో అమలుచేశారు.

1834 పేదరిక నిర్మూలనానికి (పూర్ లా) బ్రిటన్‌లో చట్టం.

1835 మొదటిసారిగా 'సోషలిజమ్' పద ప్రయోగం.

1837 విక్టోరియా రాణి బ్రిటిషు సింహాసనం ఎక్కింది.

1838 నేషనల్ ఆర్ట్ గ్యాలరీ లండన్‌లో వ్యవస్థాపన.

1840 'పెన్నీ' తపాల బిళ్ల ప్రారంభం.

1841 హాంగ్‌కాంగ్ బ్రిటిషువారి ఆధిపత్యం లోకి వచ్చింది.

1848 కాలిఫోర్నియా (పశ్చిమ అమెరికా)లో బంగారం (గోల్డ్‌రష్) దొరికింది.

1856 బెస్సెమర్ ఉక్కు తయారీవిధానాన్ని కను గొన్నాడు.

1859 ఛార్లెస్ డార్విన్ 'జీవకోటి ప్రాదుర్భావం—మానవ అవతరణ' (ఆరిజన్ ఆఫ్ స్పీషీస్, డిసెంట్ ఆఫ్ మాన్) ప్రచురణ.

1860 గారిబాల్డీ ఇటలీలో అధినేత.

1861 అబ్రహాం లింకన్ (1809–65) అమెరికన్ ప్రెసిడెంటు అయ్యాడు. అమెరికా పౌర యుద్ధం ప్రారంభం.

# ప్రపంచ చరిత్రలో కొన్ని ప్రముఖ ఘట్టాలు

క్రీ.శ. 1862 ప్రష్యాలో బిస్మార్క్ ప్రాబల్యం.

1865 అబ్రహామ్ లింకన్ హత్య (ఏప్రిల్ 9). బానిసత్వం రద్దయింది. (ఏప్రిల్ 14). గ్రెగర్ మెండెల్ అనువంశిక సూత్రాలు అందించాడు.

1867 కెనడాకు డొమినియన్ ప్రతిపత్తి ప్రాప్తించింది.

1868 జపాన్‌లో షోగన్‌పాలన అంతం—మెయిజీ పునరుద్ధరణ; ఇంగ్లండులో డిజ్రేలీ స్థానంలో గ్లాడ్‌స్టన్ ప్రధాని అయ్యాడు.

1872 బ్రిటన్‌లో రహస్య బ్యాలెట్ పద్ధతి అమలు.

1874 డిజ్రేలీ మరల బ్రిటిష్ ప్రధాని అయ్యాడు.

1878 థామస్ ఆల్వా ఎడిసన్, స్వాన్ విద్యుద్దీపాన్ని సృష్టిస్తారు. గ్లాడ్‌స్టన్ మరల బ్రిటిషు ప్రధాని అయ్యాడు.

1881 లూయీ పాశ్చర్ (ఫ్రాన్స్) వ్యాధి నిరోధక టీకా (వాక్సిన్) మందును కనుగొన్నాడు.

1884 గ్రీనిచ్ ప్రధాన రేఖాంశ అంతర్జాతీయంగా గుర్తించబడింది. ఫాబియన్ సొసైటీ వ్యవస్థాపన.

1886 జర్మనీలో డాయిమ్లర్ (1834–1900) మొట్టమొదటి మోటారుకారు నమూనాను రూపొందిస్తాడు.

1895 మార్కోనీ (ఇటలీ) తీగలేకుండా (వైర్లెస్) వార్తా ప్రసారం చేస్తాడు. X–రేను విల్హెల్మ్ రంజన్ ఆవిష్కరిస్తాడు. సిగ్మండ్ ఫ్రాయిడ్ మానసిక విశ్లేషణ ప్రచురిస్తాడు. క్యూరీ దంపతులు రేడియంను కనుగొన్నారు.

1899 దక్షిణాఫ్రికాలో బోయర్ యుద్ధాలు ప్రారంభం (1899–1902).

1901 రష్యాలో ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గం వేశారు.

1903 ఆర్విల్ & విల్బర్ రైట్ సోదరులు 'కిట్టీహాక్' (గాలికంటె బరువైన)లో ప్రప్రథమ విమాన యానం (డిసెంబరు 17) చేశారు.

1906 విటమిన్‌లను హాప్కిన్స్ కనుగొన్నాడు.

1907 న్యూజిలాండ్‌కు డొమినియన్ ప్రతిపత్తి.

1909 పియరీ ఉత్తర ధ్రువాన్ని చేరతాడు; బ్లేరియట్ విమానంమీద ఇంగ్లీషు ఛానెల్‌ను దాటతాడు; దక్షిణ ఆఫ్రికా యూనియన్ రూపొందింది; హెన్రీ ఫోర్డ్ (అమెరికాలో) చౌకగా మోడలు-'T' మోటారు కారును తయారు చేస్తాడు; 1911లో చైనాలో విప్లవం; అముండ్సన్ దక్షిణ ధ్రువాన్ని చేరతాడు (డిసెంబరు 14).

1910 జార్జి V (1865–1936) బ్రిటను సింహాసనాన్ని అధిష్ఠించాడు.

1912 సన్ యెట్–సెన్ నాయకత్వంలో చైనా గణరాజ్యమయింది.

1914 ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రారంభం (1914–1918).

1917 రష్యాలో విప్లవం, లెనిన్ రష్యాధినేత అవుతాడు.

1919 పారిస్‌లో శాంతి సమావేశం; ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం యథార్థమని సంపూర్ణ సూర్యగ్రహణం రోజున ప్రయోగాంద్వారా (మార్చి 29) నిరూపిస్తారు.

1920 నానాజాతి సమితి సమావేశం. ఓటోమన్ సామ్రాజ్యం విచ్ఛిన్నమయింది.

1924 లెనిన్ మరణానంతరం స్టాలిన్ రష్యాధినేత అయ్యాడు.

1929 గ్రాఫ్ జెప్లిన్ (జర్మన్) 'గాలిఓడ'లో ఖండాంతర వైమానిక యానాలు ప్రయత్నిస్తాడు. అమెరికాలో ఆర్థిక మాంద్యం—వాల్ స్ట్రీట్‌లో ఉపద్రవం (నవంబరు 30).

1933 హిట్లర్ జర్మన్ ఛాన్సలర్ అయి నియంత పాలన ప్రారంభిస్తాడు.

1936 ఇంగ్లండ్ గద్దెమీద ఎడ్వర్డ్ VIII రాజు అయ్యాడు. కాని ఆయన సింహాసనాన్ని త్యజించగా జార్జి VI (1895–1952) పట్టాభిషిక్తుడయ్యాడు.

1937 చైనాను ఆక్రమించడానికి జపాన్ దాడి.

క్రీ.శ. 1938 ఛాంబర్లేను, దలాదియర్, హిట్లర్, ముస్సోలినీ మధ్య ఒడంబడిక (సెప్టెంబరు 29).

1939 (సెప్టెంబరు 1) ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం (1939–45).

1940 విన్‌స్టన్ చర్చిల్ బ్రిటిషు ప్రధాని అయ్యాడు (1940–45; 1951– 55).

1945 హిరోషిమా, నాగసాకి (ఆగ 9)పై ఆటంబాంబు ప్రయోగంతో ద్వితీయ ప్రపంచ యుద్ధం ముగుస్తుంది. ఐక్య రాజ్య సమితి(ఐ.రా.స) నియమావళి. శాన్ ఫ్రాన్సిస్కోలో 50 దేశాల ప్రతినిధులు సమావేశమై సంతకాలు చేస్తారు.

1946 న్యూరెన్‌బర్గ్ విచారణలో నాజీల ఉరి తీత. ఐ.రా.స. న్యూయార్క్‌లో ప్రథమ సమావేశం (అక్టోబరు 23).

1947 భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది (ఆగస్టు 15) జవహర్‌లాల్ నెహ్రూ ప్రప్రథమ భారత ప్రధాని అయ్యాడు.

1948 భారత 'జాతిపిత' గాంధీ హత్య (జనవరి 30).

1948 ట్రాన్సిస్టర్ ఉపయోగంలోకి వచ్చింది.

1949 మావో నాయకత్వంలో చైనాలో ప్రజా గణరాజ్యస్థాపన.

1950 భారత దేశం గణరాజ్యం (రిపబ్లిక్) అయింది.

1952 దక్షిణ ఆఫ్రికాలో వర్ణవ్యత్యాసాన్ని నిరసిస్తూ సత్యాగ్రహాలు. ఎలిజబెత్తు II ఇంగ్లండ్ రాణీ అయ్యింది.

1953 హిల్లరీ, టెన్సింగ్ ఎవరెస్ట్ శిఖరారోహణ (మే 29) రష్యాలో హైడ్రోజన్ బాంబును పరీక్షచేశారు, స్టాలిన్ నిర్యాణం తరవాత కృశ్చేవ్ రష్యాధినేత అయ్యాడు.

1954 అమెరికా వారు బికినీలో హైడ్రోజన్ బాంబును పరీక్ష చేశారు.

1955 పరమాణు శక్తి వినియోగంలో బ్రిటన్ అమెరికాల సహకారం— జెనీవాలో సమావేశం; గ్రంథ ప్రచురణ—యూనివర్సల్ కాపీరైట్ కన్వెన్షన్ ఆచరణలోకి వచ్చింది.

1956 బుద్ధ వర్ధంతి (2500); సూయజ్ కాలువను—కంపెనీని ఈజిప్టు అధినేత నాసర్ జాతీయకరణ చేశాడు.

1957 భారతదేశంలో పరమాణు రియాక్టరు 'అప్సర' పని ప్రారంభించింది; రష్యాచే మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహం('లైకా' కుక్కను పెట్టి) ప్రయోగం.

1958 రష్యావారి స్పుత్నిక్ I భూమిచుట్టూ 688 లక్షల కి.మీ. తిరిగి 11367 సార్లు ప్రదక్షిణం చేసింది; అమెరికాచే ఎక్స్‌ప్లోరర్ I కృత్రిమ ఉపగ్రహ ప్రయోగం.

1959 టిబెట్టులో (చైనా) బహిష్కరించగా దలైలామా భారతదేశ శరణు అర్థించాడు.

1960 దక్షిణ ఆఫ్రికాలో వర్ణ వైషమ్యం—షార్ప్ విల్లీ దురంతంలో 67 మందిని కాల్చి చంపారు. అప్పర్‌వోల్టా, కాంగో, నైజీరియా దేశాలకు స్వాతంత్ర్యం.

1960 కంప్యూటర్ ఉపయోగంలోకి వచ్చింది.

1961 రష్యాలో యూరీ గెగారిన్ (1934– 68) ప్రప్రథమ రోదసీయానంచేసి జయప్రదంగా భూమికి తిరిగి వచ్చాడు (ఏప్రిల్ 17).

1962 బురుండీ, రువాండా, జమైకా, ట్రినిడాడ్, టుబాగో స్వాతంత్రం పొందాయి. అమెరికా—యూరప్ మధ్య టెల్‌స్టార్ ద్వారా మొట్టమొదటి (కృత్రిమ ఉపగ్రహం ద్వారా) ప్రత్యక్ష టి.వి. ప్రసారం. పరమాణు శక్తిని వినియోగించి 'సవన్నా' నౌక ప్రయాణించింది. రష్యా అంగారక గ్రహానికి రోదసీ నౌకను పంపింది.

1963 మలేసియా(మలయా, సింగపూర్) ప్రాదుర్భావం. అమెరికా అధ్యక్షుడు కెనెడీ హత్య. జాంజిబార్, కెన్యా స్వాతంత్ర్యం పొందాయి. రష్యాలో బ్రెజ్నేవ్ అధినేత అయ్యాడు.

క్రీ.శ. 1965 గాంబియా స్వాతంత్ర్యం పొందింది; 'ఎర్లీబర్డ్' వార్తాప్రసార కృత్రిమ ఉపగ్రహం పనిచేయడం ప్రారంభించింది. తూర్పు పాకిస్తాన్‌లో ఉప్పెన, 16, 000 మరణించారు. టెలివిజన్ ప్రసారాల్లో మొదటిసారిగా సిగరెట్టు ప్రచారం నిషేధించారు.

1966 చంద్రమండలం మీదకు రష్యా లూనా—9, అమెరికా 'జెమినీ—10' చేరాయి. బార్బేడాస్, బోట్స్వానా, మలావీ గణ రాజ్యాలయ్యాయి. చైనాలో సాంస్కృతిక విప్లవం ప్రారంభం.

1967 బ్రిటన్‌లో కలర్ టెలివిజన్ (బి.బి.సి.) ప్రారంభం. కేప్‌టౌన్‌లో ప్రప్రథమ మానవ గుండె మార్పిడి శస్త్రచికిత్స (బెర్నార్డ్).

1968 అమెరికా (మెంఫిస్)లో నీగ్రో పౌర హక్కుల నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్ (జూ.) హత్య గావింపబడ్డాడు.

1969 శబ్దావేగాతీత 'కాంకార్డ్' మొట్ట మొదటి పయనం. చంద్రమండలంపై కాలుపెట్టిన మొదటి మానవులు ఆర్మ్‌స్ట్రాంగ్, ఆల్డ్రిన్ (జూలై 21)

1970 థాలిడమైడ్ వల్ల వికలాంగులైన పిల్లలకు వారి తల్లితండ్రులకు నష్టపరిహారం ఇవ్వమని తీర్పు.

1971 ఈజిప్టు—రష్యా 15 ఏళ్ల సహకార ఒప్పందం; చైనాకు ఐ.రా.స. సభ్యత్వం. బంగ్లాదేశ్ అవతరణ డిసెంబరు.

1972 అమెరికా అధ్యక్షుడు రిచర్డ్ నిక్సన్ సుహృద్భావ సమాలోచన లకై మాస్కో సందర్శన.

1973 'స్కైలాబ్'లో 59 రోజులు ఉండి వ్యోమగాములు సురక్షితంగా భూమిమీదకు తిరిగివచ్చారు; అరబ్బు—ఇజ్రాయెల్ యుద్ధం

1974 జర్మనీ విలియమ్ బ్రాండ్ట్ ఛాన్సలర్ పదవికి రాజీనామా; ఇజ్రాయెల్‌లో గోల్డ్‌మెయిర్ ప్రధానిగా రాజీ నామా. అమెరికాలో రిచర్డ్ నిక్సన్ రాజీనామా.

1975 షేక్ ముజిబర్ రహమాన్ (బంగ్లాదేశ్) హత్య; అంగోలాకు స్వాతంత్ర్యం.

1977 బంగాళాఖాత తీరం (అవనిగడ్డ)లో పెనుఉప్పెన 25,000 మంది మరణం.

1978 ప్రపంచంలో మశూచినిర్మూలన అయిందని ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రకటన; డొమినికాకు స్వాతంత్ర్యం.

1979 బ్రిటన్‌లో మార్గరెట్ థాచర్ మహిళా ప్రధాని అయ్యింది; ఇరాన్‌లో అయతుల్లా ఖొమేనీ అధినేత అయ్యాడు.

1980 ఇరాన్—ఇరాక్ (సెప్టెంబరు) యుద్ధం.

1983 అటెన్‌బరో 'గాంధీజీ' జీవితంపై చలనచిత్రం నిర్మించాడు; సౌర కుటుంబం దాటి పయనించడానికి అమెరికా వారు పయోనీర్—10 రోదసీ నౌకను పంపారు (జూన్ 13).

1984 రెండవసారి రోనాల్డ్ రీగన్ అమెరికా అధ్యక్షుడయ్యాడు. భారతదేశంలో ఇందిరాగాంధీ హత్య, రాజీవ్‌గాంధీ ప్రధాని అయ్యాడు. హాంగ్‌కాంగ్ భవితవ్యంపై బ్రిటిషు చైనా అధికార్లు (1997లో చైనాకు అప్పగించడానికి) ఒప్పందానికి వచ్చారు.

1985 దక్షిణ ఆఫ్రికాపై అమెరికా పరిమిత ఆంక్షలు విధించింది.

1986 గోర్బచెవ్ బహిరంగ రాజనీతి (గ్లాస్ నాస్ట్) పునర్వ్యవస్థీకరణ (పెరిస్త్రోయికా) వినూత్న రాజకీయ భావాల్ని ప్రవేశ పెట్టాడు.

1989 1977 ఆగస్టులో భూతలం నుండి బయలుదేరిన వాయేజర్—2 రోదసీ యానంచేసి సుమారు రెండేళ్ల తరవాత 1989 ఆగస్టు 24 నాడు సౌర మండలంలో ఆఖరి గ్రహమయిన నెప్ట్యూన్‌తోనూ అయిదుగంటల తర్వాత దాని ఉపగ్రహం ట్రైటాన్‌తోనూ సమాగమమయింది.

1989 భారతదేశంలో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం విశ్వనాథ ప్రతాప్ సింగ్ ప్రధానిగా ఏర్పడింది (డిసె.3).

1990 నెల్సన్ మండేలా చెరనుండి విడుదల (ఫిబ్ర 10).

## ప్రపంచయుద్ధం I (ప్రథమ)

యూరప్ ఖండమునందలి రాజ్యములవారు సామ్రాజ్య విస్తరణ కాంక్షల ఫలితంగా సంభవించిన యుద్ధం 1914 జూలై 18 మొదలు 1918 నవంబరు 11 వరకూ సాగినది. ఇందు పాల్గొన్న రెండు పక్షములు: 1.కేంద్ర రాజ్యాలు, 2.మిత్ర రాజ్యాలు. ఆస్ట్రియా, జర్మనీ, టర్కీ 1914నుండీ, బల్గేరియా 1915 నుండే కేంద్ర పక్షమున పోరాడినవి. రష్యా, ఫ్రాన్స్, గ్రేట్‌బ్రిటన్, బెల్జియమ్, సెర్బియా, మాంటెనీగ్రో, జపాన్, 1914 నుండీ ఇటలీ, సాన్‌మారినో 1915 నుండీ పోర్చుగల్, రుమేనియా 1916 నుండీ క్యూబా, గ్రీస్, ఉరుగ్వే, ఈక్వడార్, చీనా, తాయిలాండ్, పనామా, బొలీవియా, పెరూ, బ్రెజిల్, యునైటెడ్ స్టేట్స్, సైబీరియా దేశాలు 1917నుండీ, గ్వాటెమాలా, కోస్టరికా, నికరగ్వా, హయిటీ, హొండ్‌రాస్ 1918 నుండీ మిత్ర రాజ్యపక్షాన పాల్గొన్నాయి. అయితే వాస్తవానికి యుద్ధ నిర్వహణమున కేంద్రరాజ్య పక్షాన జర్మనీ, ఆస్ట్రియా, టర్కీ దేశాలూ, మిత్రరాజ్య పక్షాన ఫ్రాన్స్, గ్రేట్‌బ్రిటన్, రష్యా, యునైటెడ్ స్టేట్స్ క్రమముగా ప్రముఖపాత్ర వహించాయి.

పారిశ్రామిక విప్లవ ఫలితంగా పారిశ్రామికోత్పత్తుల విక్రయానికై మార్కెట్లు ప్రాబల్యం సంపాదించుటకు ఒకవైపు ఇంగ్లండ్ మరొకవైపు జర్మనీ పెనుగలాట ప్రారంభించాయి. 1910 నాటికే జర్మనీ, ఇటలీ, ఆస్ట్రియా, టర్కీ ఒక పక్షమై రష్యా, ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్ రెండో పక్షమై యుద్ధానికి సమాయత్తమువడం ప్రారంభించాయి. 1912, 1913 సంవత్సరాలలో బాల్కన్ రాజ్యాలతో టర్కీ పరస్పర సంఘర్షణలు ప్రారంభమయ్యాయి. చివరకు ఆస్ట్రియా చక్రవర్తి వారసుడు ఫ్రాన్సిస్ ఫెర్డినాండ్ హత్య గావింపబడుటతో (1914 జూన్ 28) ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఇట్లు ఆరంభమయిన యుద్ధంలో మొత్తం 31 ప్రపంచ రాజ్యాలు (1914–1918) పాల్గొనుట సంభ వించినది. ఇందు నేలమీద టాంకులు, సముద్రము లో యుద్ధనౌకలు, జలాంతర్గాములు వాయు తలమున విమానములు, బాంబర్‌లు వంటి కొత్త యుద్ధసామగ్రి సహాయంతో ప్రపంచయుద్ధం భీషణంగా సాగింది. జలాంతర్గాములను జర్మనీ మొదటిసారిగ ఈ యుద్ధమున ప్రవేశపెట్టినది. ఈ ప్రథమ ప్రపంచ యుద్ధంలో మరణించినవారు 79,40,000 మంది ఉన్నారు. ఇక గాయపడినవారు 1,95,36,000 మంది ఉన్నారు. యుద్ధఖైదీలుగా పట్టుబడిన వారి సంఖ్య 64,90,000. మొత్తం ప్రత్యక్ష యుద్ధవ్యయం 90,250 కోట్ల రూపాయలు. పరోక్ష యుద్ధవ్యయం మరొక 75,806 కోట్ల రూపాయలు. ప్రథమ ప్రపంచ యుద్ధ సమయమున గ్రేట్ బ్రిటన్‌లో చక్రవర్తి జార్జి V (ప్రధానులు ఆస్క్విత్, డేవిడ్‌లాయిడ్ జార్జి) యునైటెడ్ స్టేట్స్‌లో అధ్యక్షుడు వుడ్రోవిల్సన్, ఫ్రాన్స్ ప్రధానులు రెనేవివియానీ, ఆరిస్టిడ్ బ్రియాండ్, జార్జిస్‌క్లెమెంషొ, జర్మనీ చక్రవర్తి కెయిజర్ విల్హెల్మ్, రష్యాలో మొదట జార్ నికలస్ II, యుద్ధం అంతిమ సమయంలో ప్రజా ప్రతినిధి లెనిన్, ఓటూమన్ చక్రవర్తి మొహమ్మద్ V ఆయా రాజ్యాధినేతలుగా ఉన్నారు. ప్రథమ ప్రపంచ యుద్ధం ముగియగానే యూరపు దేశపటంలో సరిహద్దుల రూపురేఖలు మారిపోయాయి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచంలో శాంతి స్థాపనకై నానాజాతిసమితిని వ్యవస్థాపించారు. ప్రథమ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత ఇరుపక్షాల మధ్య అనేక సంధులు జరిగాయి. అందులో వెర్సైయిల్స్ సంధి ప్రధానమయినది. ఈ సంధి షరతులు కఠోరమయినవని చారిత్రకుల అభిప్రాయం. ప్రథమ ప్రపంచ యుద్ధానికి కారణం జర్మనీయే అని తుది నిర్ణయమైంది. ఫలితంగా యుద్ధ నష్టాల్ని తట్టుకోవడమే కాక ఇతర దేశాలవారికి సంభవించిన నష్టాల్ని కూడ భరించవలసివచ్చింది. జర్మనీకి వలసలు పోయాయి. దేశ పరిమాణమూ తగ్గింది. దానితో సిరిసంపదలూ కోల్పోయింది. రక్షణ సిబ్బంది వ్యవస్థ తగ్గించుకొనవల్సి వచ్చింది.



## ప్రపంచయుద్ధం II (ద్వితీయ)

ప్రథమ ప్రపంచయుద్ధ విరమణ సమయంలో జరిగిన వెర్సైయిల్స్ సంధి కఠోర నియమాలతో

ఉండడంవల్లనే అని ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి దారితీసాయని చారిత్రకుల అభిప్రాయం.



అంతకు ముందెన్నడూ ఇంత పెద్ద యుద్ధం జరుగలేదు. సుమారు 56 ప్రపంచదేశాలు హోరాహోరిగా 1939 సెప్టెంబరు నుండి ఆరేళ్లపాటు పోరాడగా చివరకు 1945 ఆగస్టు 6, 9, జపాన్‌లో హిరొషిమా, నాగసాకి నగరాలపై ఆటంబాంబు ప్రయోగంతో ఈ ప్రపంచ యుద్ధం 1945 సెప్టెంబరు 2న ముగిసింది. ఇరు పక్షాలవైపునా దాదాపు ఒకకోటీ అరవయి లక్షలు క్షతగాత్రులయ్యారు. ఆయాదేశాలకు ఆనాడు యుద్ధ వ్యయం 4,60,000 కోట్ల రూపాయలయిందని అంచనా. మొత్తంమీద ప్రపంచాన్ని ఈ యుద్ధం దద్దరిల్ల చేసింది. వాయు విమానలను విచ్చలవిడిగ బాంబులు వేయుటకు వినియోగించారు. యుద్ధ నౌక, జలాంతర్గాములు, టార్పిడోలు, పదాతి సైనిక దళాలు, క్షిపణులు, బాంబర్లు, **ఫైటరలు,** టాంకులు విరివిగా వాడుక చేశారు. ప్రపంచ నలుమూలలా ఆసియా, యూరపు, ఉత్తర ఆఫ్రికా, అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రాల లోనూ, మధ్యధరాలోనూ రణరంగాలు ఏర్పడి పోరాటాలు **సాగాయి. రాడార్‌ను మొదటిసారి ఈ యుద్ధంలో వినియో గించారు.**

ఆర్జంటినా 1945 మార్చి 27, ఆస్ట్రేలియా 1939 సెప్టె 3, హిరాక్ 1943, జన 17, ఈక్వెడార్ 1945 ఫిబ్ర 2, ఉరుగ్వే 1945, ఫిబ్ర 15, ఎతియోపియా 1945, డిసె 14, ఎల్ సాల్వడార్ 1941, డిసె 8, కెనడా 1939, సెప్టె 10, కొలంబియా 1943 నవ 26, కోస్టారికా 1941, డిసె 8, క్యూబా 1941 డిసె 9, గ్రీస్ 1940, అక్టో 28, గ్రేట్ బ్రిటన్ 1939 సెప్టె 3, గ్వాతెమాలా 1941, డిసె 9, చిలీ 1945, ఏప్రిల్ 11, చీనా 1941 డిసె 8, జెకొస్లొవేకియా 1941, డిసె 10, టర్కీ 1945, ఫిబ్ర 23, డొమినికన్ రిపబ్లిక్ 1941, డిసె 8, దక్షిణ ఆఫ్రికా 1939, సెప్టె 6, నార్వే 1940, ఏప్రిల్ 9, నికరాగ్వా 1941, డిసె 11, నెదర్లాండ్స్ 1940, మే 10, న్యూజీలాండ్ 1939 సెప్టె 3, పనామా 1941, డిసె 7, పరాగ్వే 1945, ఫిబ్ర 7, పెరూ 1945, ఫిబ్ర 12, పోలండ్ 1939, సెప్టె 1, ఫ్రాన్స్ 1939 సెప్టె 3, బెల్జియమ్ 1940, మే 10, బొలీవియా 1943, ఏప్రిల్ 7, బ్రెజిల్ 1942 ఆగస్టు 22, భారతదేశం 1939, సెప్టె 3, మెక్సికో 1942, మే 22, లక్సెంబర్గ్ 1940 మే 10, లెబనాన్ 1945 ఫిబ్ర 27, సైబీరియా 1944, జన 27, వెనిజ్యూలా 1945, ఫిబ్ర 15, శాన్‌మారినో 1944, సెప్టె 21, సిరియా 1941, జూన్ 8, సౌదీ అరేబియా 1945, మార్చి 1, హెయిటీ 1941, డిసె 8, హూండూరాస్ 1941, డిసె 8 రాజ్యాలు మిత్రపక్షాలు (అలైస్) తరపున పాల్గొన్నారు. ప్రథమ ప్రపంచయుద్ధం (1914-18) సమయాన జరిగిన ప్రధాన ఘట్టాల వివరాల క్రింది పట్టికలోనూ తరువాయి 196 పుటలోనూ పొందుపరచడమైనది.

## ప్రథమ ప్రపంచయుద్ధం 1914-1918

| | |
|---|---|
| **1914** | |
| జూన్ 28 | ఆర్చ్‌డ్యూక్ ఫ్రాన్సిస్ ఫెర్దినాండ్ హత్య. |
| జూలై 28 | సెర్బియాపై ఆస్ట్రియా హంగేరి యుద్ధ ప్రకటన. |
| జూలై 30 | రష్యా యుద్ధ సన్నాహాలు ప్రారంభించింది. |
| ఆగ 1 | రష్యాపై జర్మనీ యుద్ధం ప్రకటించింది. |
| ఆగ 3 | ఫ్రాన్స్‌పై జర్మనీ యుద్ధం ప్రకటించింది. |
| ఆగ 4 | బెల్జియమ్‌పై జర్మనీ దండయాత్ర చేసింది. జర్మనీపై గ్రేట్ బ్రిటన్ యుద్ధ ప్రకటన. |
| ఆగ 26-31 | రష్యా ద్వితీయ సైనిక బలాన్ని తాన్నెన్‌బర్గ్ వద్ద జర్మనులు అణచివేశారు. |
| అక్టో 3 | వెంబెర్గ్ రణరంగంలో ఆస్ట్రియాను రష్యా ఓడించింది. |
| సెప్టె 6 | మార్నె ప్రథమ పోరాటంలో జర్మనులను మిత్ర సైన్యాలు ఆపివేయుట. |
| నవ 17 | ఇప్రెస్ ప్రథమ పోరాటంలో జర్మనులు ఇంగ్లీషు ఛానల్ చేరలేకపోయారు. |
| అక్టో 29 | టర్కీ దేశం కేంద్ర పక్షాన్ని చేరింది. |
| **1915** | |
| ఫిబ 18 | గ్రేట్ బ్రిటన్‌పై జర్మనీ దిగ్బంధనం ప్రారంభం. |
| ఏప్రి 22 | ఇప్రెస్ ద్వితీయ పోరాటంలో జర్మనీ విషప్రయోగం చేసింది. |
| ఏప్రి 25 | గల్లీ పోలీ ద్వీప కల్పం మీద మిత్ర పక్ష సైన్యాల సమీకరణ. |
| మే 2 | గాలీషియాలో ఆస్ట్రియా సంఘర్షణ ప్రారంభించింది. |
| మే 7 | లూజీటేనియా నౌకను జర్మనీ జలాంతర్గామి ముంచివేసింది. |
| మే 23 | ఆస్ట్రియా హంగేరీలపై ఇటలీ యుద్ధం ప్రకటించింది. |
| **1916** | |
| ఫిబ్ర 21 | వెర్డూన్ వద్ద జర్మనీ పోరాటం ప్రారంభం. |
| ఏప్రి 29 | 10,000 మంది బ్రిటిష్ సైనికులతో కుత్ ఆవ్ అమారా టర్కీకి లొంగిపోయింది. |
| జూన్ 1 | జట్లండ్ పోరాటంలో జర్మన్ నౌకాదళాన్ని బ్రిటిషు నౌకాదళం ఓడించింది. |

ఇటలీ 1940, జూన్ 10, జపాన్ 1941 డిసె 7, జర్మనీ 1939 సెప్టె 1, ఫిన్లాండ్ 1941 జూన్ 25, బల్గేరియా 1941 మార్చి 1, రుమేనియా 1940 నవ 23, హంగేరీ 1940 నవ 20 రాజ్యాలు శత్రుపక్షాల (ఏక్సిస్) తరఫున పాల్గొన్నాయి.

దీనిని బట్టి 49 మిత్రదేశాలు 7 శత్రుదేశాలు మొత్తం 56 దేశాలు ద్వితీయ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నాయి. జర్మనీలో అడల్ఫ్ హిట్లర్ స్వీయ చరిత్ర 'మెయిన్ కావ్ఫ్' (1925)లో వెర్సైయిల్స్ సంధి షరతుల్లోని ఆంక్షలను తొలగించి తీరుతానని శపథం చేశాడు. దాని ప్రకారం 1933లో తాను జర్మనీ దేశానికి ఛాన్సలరు అయిన తోడనే తన కార్యక్రమం ప్రారంభించాడు. చిన్న పిల్లల (కిండర్‌గార్టెన్స్) స్థాయి నుండి వీరగాథల్ని నూరిపోసి సైనిక దృక్పథాన్ని అలవర్చడానికి తీవ్ర ప్రయత్నాలు చేశాడు. బాల బాలికలు హిట్లర్ యువసేనలో చేరి సైనిక క్రమశిక్షణ నిర్బంధం అలవర్చుకొనితీరాలి. ఇలా పెంపొందించిన నాజీ సైన్యాన్ని సమాయత్తం చేసి సెప్టెంబరు 1న పోలండ్ మీదకి దండయాత్ర నిర్వహించడంతో ద్వితీయ ప్రపంచ యుద్ధానికి నాందీప్రస్తావన పలకబడింది. ఇటు జపాన్‌లో చారిత్రకంగ సైనిక తత్వం జాతి సంప్రదాయంగా అనూచానంగా వస్తూంది. సమూరై అనబడు సైనిక దండు వర్గం అంటే జపాన్ వారికి అత్యంత అభిమానపాత్రం. మనిషికి జీవిత పరమావధి వీరోచితంగా పోరాడడమే! 1920 తర్వాత కొంత వరకూ స్వేచ్ఛాయుత ప్రభుత్వమేర్పడినప్పటికి 1931 తర్వాత మరల సైనిక తత్వానికే పెద్దపీటవేశారు. ప్రపంచం ఎనిమిది దిక్కులలో ఉన్న ప్రజను ఏకఛత్రం క్రింది తీసికురావలెను. 'హక్కోఇచొ' నినాదము ద్వారా జాతికి సైనిక పిలుపు నిచ్చి ఉత్తేజ పర్చారు. 1931 సెప్టె 18 నాడే కోరియాపై జపాన్ దాడిచేసి రణరంగం లోనికి దూకింది. ఆ తరువాత చీనాపై జపాన్ 1931 జూలై 7న దాడి చేసింది. కొందరు చరిత్రకారులు ఆనాటి నుండే ద్వితీయ ప్రపంచయుద్ధం ప్రారంభమయినట్లుగా పేర్కొనుట కూడా కద్దు.

ఈ ప్రపంచయుద్ధం (1939–45) జరుగుతున్నప్పుడు ఇంగ్లండులో ఛేంబర్లీన్, విన్‌స్టన్ చర్చిల్ ప్రధానులుగాను, ఫ్రాన్స్‌లో చార్లెస్ డీగాల్ ప్రధానిగాను, యునైటెడ్ స్టేట్స్‌లో ఫ్రాంక్లిన్ **డీలానూ** రూజ్వెల్ట్, హెన్రీ ట్రూమన్ అధ్యక్షులుగాను, రష్యా అధినేతగా జోసెఫ్ స్టాలిన్, యుగోస్లావియా అధినేతగా మార్షల్ టిటో వంటి ప్రముఖ రాజనీతిజ్ఞులు మిత్రపక్ష దేశాధినేతలు ఉన్నారు. అడాల్ఫ్ హిట్లర్ జర్మనీలోనూ, హిరోహిటో జపాన్‌లోనూ, బెనిటో ముస్సోలినీ ఇటలీలోనూ శత్రుపక్ష దేశాధినేతలుగాను ఉన్నారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలోనే భారత జాతీయ కాంగ్రెసు నాయకుడు సుభాష్ చంద్రబోసు (నేతాజీ) తన గృహనిర్బంధం నుంచి 1941 మార్చిలో తప్పించుకుని ఆఫ్ఘనిస్తాన్ మీదుగా జర్మనీ వెళ్లి భారత స్వాతంత్ర్య పోరాటంలో సహాయాన్ని అర్థించాడు. అక్కడ నుంచి నేతాజీ జపాన్ వెళ్లి వారి సహకారం కోరి అజాద్–హింద్–ఫౌజ్ అను ఇండియన్ నేషనల్ ఆర్మీని (ఐ.ఎన్.ఏ) వ్యవస్థాపించాడు. జపాన్ వారికి బర్మా, మలయా యుద్ధాలలో చిక్కిన భారతీయ యుద్ధ ఖైదీలను తన ఫౌజులో చేర్చుకుని 'ఢిల్లీ ఛలో' అనే నినాదమిచ్చి భారతదేశం వైపుకు సాగించేడు. ఇందులో చేరిన వారంతా దేశభక్తులు. రంగూన్‌లో భారత జాతీయ పతాకం ఎగురవేయగలిగాడు. తాత్కాలికంగా నేతాజీని రాజ్యాధినేతగా ప్రవాసంలో ఒక స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ఈ భారత జాతీయ సైన్యం 1944 మేలో అస్సాంలోని మౌడక్ చేరుకుంది. మరొక దళం నాగాకొండ ప్రాంతాలను కైవసం చేసుకున్నాయి. బ్రిటిషు వారి నుండి అండమాన్, నికోబార్ దీవులను విముక్తి చేశారు. అయితే హిరోషిమా (ఆగ. 6), నాగసాకీ (ఆగ. 9)ఆటంబాంబు ప్రయోగంతో 1945లో జపాన్ లొంగుబాటు జరగడంవల్ల నేతాజీ ప్రయత్నాలు ఫలించ లేదు. భారత జాతీయ సైన్యంలో పనిచేసినవారిలో కెప్టెన్ షానవాజ్ ఖాన్, కెప్టెన్ లక్ష్మి, కెప్టెన్ సైగాల్, ఆంధ్రకు చెందిన కల్నల్ డి.ఎస్. రాజు వంటి ప్రముఖులు ఉన్నారు.

ఈ నేపథ్యంలో ద్వితీయ ప్రపంచ యుద్ధం కొనసాగింది. ఈ ద్వితీయ ప్రపంచయుద్ధం (1939 45) సమయాన జరిగిన ప్రధాన ఘట్టాల వివరాలు 196 పుట లోని పట్టికలో పొందు పరచడమైనది. (చూ. రూజ్వెల్ట్, విన్‌స్టన్ చర్చిల్, స్టాలిన్)

## ప్రథమ ప్రపంచయుద్ధం (తరువాయి)

జూన్ 4 తూర్పు గాలీషియాలో రష్యా పోరాటం ప్రారంభం.

జూలై 1
నవ 18 సొమ్మే పోరాటాల్లో మిత్ర పక్షాల జయభేరి.

**1917**

ఆగ 17 జర్మనీపై ఇటలీ యుద్ధం ప్రకటించింది.

సెప్టె 15 బ్రిటీషు సైనికులు టాంకులను మొట్టమొదటి సారిగా వినియోగించారు.

ఫిబ్ర 1 జలాంతర్గాములను యుద్ధంలో జర్మనీవారు యథేచ్ఛగా వాడుటం ప్రారంభించారు.

ఏప్రి 6 జర్మనీపై యునైటెడ్ స్టేట్స్ యుద్ధం ప్రకటించింది.

జూన్ 26 ఫ్రాన్స్‌లో అమెరికన్ సైన్యాలు దిగడం ప్రారంభించాయి.

జూలై 31
ఆగ 9 రష్యా అంతిమ పోరాటాన్ని జర్మనీ అణచి వేసింది.

జూలై 3
నవ 10 ఇప్రెస్ తృతీయ పోరాటంలో మిత్ర సైన్యాల్ని జర్మనీ ఆపింది.

నవ 7 రష్యాలో బోల్షివిక్‌లు అధికారాన్ని చేజిక్కించుకున్నారు.

డిసె 9 జెరూసెలెమ్ మిత్రపక్షాల కైవసమయింది.

డిసె 15 జర్మనీ, రష్యా యుద్ధం విరమించి సంధి చేసుకున్నాయి.

**1918**

జన 8 ప్రపంచ శాంతికి చతుర్దశ సూత్ర ప్రాతిపదికను వుడ్రోవిల్సను సూచించాడు.

మార్చి 3 బ్రెస్ట్ లిథొవిస్క్ సంధి పత్రాలపై రష్యా సంతకాలు చేసింది.

మార్చి 21 సొమ్మే అంతిమ పోరాటం జర్మనీ ప్రారంభించింది.

మే 21 అయిస్నే మీద జర్మనీ పోరాటం సాగించింది.

జూన్ 15 ఆస్ట్రియా - హంగేరీ ఆఖరి పోరాటం సాగించాయి.

జూన్ 23 రష్యాతో ముర్మన్‌స్క్‌ను మిత్ర పక్షాలు ఆక్రమించాయి.

జూన్ 25 బెల్లెవుడ్‌ను అమెరికన్ నౌకాదళం కైవసం చేసుకుంది.

జూలై 15 మార్నే పోరాటంలో ఫ్రాన్స్ రెండో పోరాటం ప్రారంభించింది.

జూలై 21 చాటాప్ తియరీని మరల మిత్ర సైన్యాలు ముట్టడించాయి.

ఆగ 8 ఆమీన్స్ వద్ద జర్మన్ రేఖను బ్రిటిషు సేనలు దాటా.

సెప్టె 26 పశ్చిమ రంగంలో మిత్రసైన్యాలు ఆఖరి పోరాటం ప్రారంభించాయి.

సెప్టె 29 యుద్ధ విరమణ పత్రాలపై బల్గేరియా సంతకం చేసింది.

అక్టో 30 యుద్ధ విరమణ సంధి పత్రాలపై ఓటోమన్ సామ్రాజ్యం సంతకం చేసింది.

నవ 3 యుద్ధ విరమణ పత్రాలపై ఆస్ట్రియా సంతకం చేసింది.

నవ 9 జర్మనీ చక్రవర్తి కెయిజర్ వెలే సింహాసనాన్ని త్యజించాడు.

నవ 11 యుద్ధ విరమణ సంధి పత్రాలపై జర్మనీ సంతకం చేసింది.

## ద్వితీయ ప్రపంచయుద్ధం 1939–1945

**1939**

సెప్టె 1 పోలెండ్‌పై జర్మన్ సేనలు దాడి చేశాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం.

సెప్టె 3 జర్మనీపై గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు. యుద్ధం ప్రకటించాయి.

నవ 30 ఫిన్లాండ్‌పై రష్యా దాడి.

**1940**

ఏప్రిల్ 9, డెన్మార్క్, నార్వే దేశాలపై జర్మనీ దాడి.

మే 10 బెల్జియమ్, లక్జెంబర్గ్, నెదర్లాండ్స్‌పై జర్మనీ దాడి.

జూన్ 10 గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలపై ఇటలీ యుద్ధ ప్రకటన.

జూన్ 22 జర్మనీకి ఫ్రాన్స్ లొంగుబాటు.

ఆగ 4 బ్రిటిషు సొమాలీలాండ్‌పై ఇటలీ దాడి.

సెప్టె 22 ఫ్రెంచి ఇండో-చీనాను జపాన్ కబళించింది.

అక్టో 28 ఇటలీ సేనలు గ్రీస్‌ను కబళించాయి.

నవ 20 హంగేరీ శత్రుపక్షంలో చేరింది.

**1941**

జన 15 ఎతియోపియాపై బ్రిటిషు సేనల దాడి.

మార్చి 1 బల్గేరియ శత్రుపక్షంలో చేరింది.

ఏప్రి 6 గ్రీస్, యుగోస్లావియా దేశాలపైకి జర్మనీ దాడి.

ఏప్రి 13 జపాన్, రష్యా దేశాలు నిర్యుద్ధ ఒడంబడికపై సంతకాలు చేశాయి.

జూన్ 8 బ్రిటిషు, ఫ్రెంచి సేనలు సిరియాపై దాడి.

జూన్ 22 రష్యాపై శత్రుసేల దాడి.

జూలై 7 అమెరికన్ సేనలు ఐస్‌లాండ్ చేరాయి.

ఆగ 14 అట్లాంటిక్ ఛార్టర్ ప్రకటించబడింది.

ఆగ 25 రష్యా, బ్రిటిషు సేనలు ఇరాన్‌పై దాడి.

డిసె 7 పెరల్ హార్బర్‌ను జపాన్ ముట్టడించింది.

డిసె 8 జపాన్‌పై యునైటెడ్ స్టేట్స్ యుద్ధం ప్రకటించింది.

డిసె 9 జర్మనీ, ఇటలీ, జపాన్ దేశాలపై చీనా యుద్ధం.

డిసె 11 యునైటెడ్ స్టేట్స్‌పై. జర్మనీ, ఇటలీ దేశాలు యుద్ధం ప్రకటించాయి; జర్మనీ, ఇటలీ దేశాలపై యునైటెడ్ స్టేట్స్ యుద్ధం ప్రకటించింది.

డిసె 25 హాంగ్‌కాంగ్‌లో బ్రిటిషు సేనల లొంగుబాటు.

**1942**

జన 2 జపాన్ దాడులకు మనీలా లొంగుబాటు.

జన 11 జపాన్ సేనలు డచ్చి తూర్పు ఇండియా దీవులను చేరాయి.

ఫిబ్ర 1 మార్షల్ దీవులపైనా, గిల్బర్ట్ దీవులపైనా అమెరికన్ నౌకల దాడి.

ఫిబ్ర 15 జపాన్ వారికి సింగపూర్ లొంగిపోయింది.

ఫిబ్ర 27 జావా సముద్రంలో జరిగిన పోరాటంలో మిత్రపక్షాలకు ఓటమి.

మార్చి 7 జపాన్ తూర్పు ఇండియా దీవులను ఆక్రమించింది.

ఏప్రి 9 బతాన్ జపాన్ వారికి లొంగిపోయింది.

ఏప్రి 18 అమెరికన్ యుద్ధనౌక నుండి ఒక విమానం టోక్యోపైకి దాడి జరిపింది.

మే 4-8 పగడపు సముద్ర పోరాటంలో మిత్రపక్షాల జయభేరి.

మే 6 కొర్రెగిడార్‌ను జపాన్ సేనల ఆక్రమణ.

జూన్ 5 బల్గేరియా; రుమేనియా, హంగేరీ దేశాలపై అమెరికా యుద్ధం ప్రకటించింది.

జూన్ 4-6 జపాన్ సామ్రాజ్యం తూర్పుకు విస్తరించ కుండా మిడ్వే పోరాటం ఆపింది.

జూన్ 21 ఉత్తర ఆఫ్రికాలో టోబ్రూక్‌ను జర్మన్ సేనలు ముట్టడించాయి.

జూలై 2 ఎల్ ఆలమియిన్ వద్ద జర్మనీ సేనలు ముందుకు సాగకుండ బ్రిటిషు సేనలు ఆపివేశాయి.

ఆగ 7 అమెరికా నౌకాదళం గ్వాడాల్ కెనాల్‌కు చేరింది.

సెప్టె 16 రష్యాలోని స్టానిల్‌గ్రాడ్ (వోల్గాగ్రాడ్) నగరంలోకి జర్మనీ సేనలు ప్రవేశించాయి.

అక్టో23 ఎల్ ఆలమియిన్ వద్ద బ్రిటిషు పోరాటం ప్రారంభమైంది.

నవ 11 ఉత్తర ఆఫ్రికాలో ఫ్రెంచి వ్యతిరేకత తగ్గింది.

నవ 12 బ్రిటిషు సేనలచే టాబ్రూక్ ముట్టడి.

నవ 19 స్టాలిన్‌గ్రాడ్‌లో రష్యా సేనలు ఎదురు దాడి.

**1943**

ఫిబ్ర 2 స్టాలిన్‌గ్రాడ్‌లో మిగిలివున్న జర్మనీ సేనలు లొంగిపోయాయి.

మార్చి 2-5 బిస్మార్క్ సముద్ర పోరాటంలో జపాన్ నౌకాబలాన్ని మిత్ర పక్షాలు ఓడించాయి.

మార్చి 13 యాంగ్‌ట్జీ నది దాటి జపాన్ సేనలు తిరోగమించాయి.

మే 7 టూనిస్, బిజెర్టే మిత్రపక్షల వశమయినాయి.

మే 12 ఆఫ్రికా రణరంగాన శత్రుపక్షాల బలం సన్నగిల్లింది.

మే 30 అట్టూ రణరంగంలో జపాన్ బలం తగ్గు ముఖం పట్టింది.

జూలై 10 సిసిలీపై మిత్రపక్షల దాడి.

సెప్టె 3 ఇటలీలో మిత్రపక్షాలు ప్రవేశించాయి. మిత్రపక్షాలతో యుద్ధ విరమణ ఒడంబడికపై ఇటలీ రహస్యంగా సంతకం చేసింది.

అక్టో 13 జర్మనీపై ఇటలీ యుద్ధం ప్రకటించింది.

నవ 1 బౌగెన్‌విల్లీ దీవిపై అమెరికా సేనలు దిగాయి.

నవ 6 కీవ్ పట్టణాన్ని రష్యా తిరిగి సాధించుకుంది.

## ద్వితీయ ప్రపంచయుద్ధం (తరువాయి)

| | |
|---|---|
| నవ 20 | తరావా, మాకిన్‌లపై అమెరికన్ నౌకాదళం దాడి. |
| నవ 22 | ఈజిప్టులోని కెయిరోలో మిత్రపక్ష సమావేశం జరిగింది. |
| **1944** | |
| జన 27 | లెనిన్‌గ్రాడ్ ముట్టడిని రష్యా సేనలు ఛేదించాయి. |
| జన 31 | క్వాజెలీన్ అనే చిన్న దీవిని అమెరికన్ సేనలు ముట్టడించాయి. |
| ఫిబ్ర 17 | ట్రుక్ దీవిపై అమెరికన్ నౌకదళం దాడి. |
| ఫిబ్ర 29 | అడ్మిరాలిటీ దీవులపై మిత్రపక్ష సేనల ప్రవేశం. |
| మార్చి 19 | జర్మనీ సేనలు హంగేరీలోనికి చొచ్చుకుని పోయాయి. |
| మార్చి 22 | జపాన్ సేనలు భారతదేశపు సరిహద్దులు దాటాయి. |
| ఏప్రి 22 | మిత్ర పక్ష సేనలు హూలందియా (జాజపురా) ప్రవేశించాయి. |
| జూన్ 6 | ఫ్రాన్స్‌లోని నార్మండీలో మిత్రపక్ష సేనల ప్రవేశం. |
| జూన్ 13 | ప్రప్రథమ వి-1 చోదిత క్షిపణి (గైడెడ్ మిసైల్) లండన్‌మీద పడింది. |
| జూన్ 15 | సాయిపాన్‌దీవిపై అమెరికన్ సేనల దాడి. |
| జూన్ 15 | జపాన్ బి-29 సూపర్ ఫోర్ట్రెస్ దాడి. |
| జూన్ 19-20 | ఫిలిప్పీన్ సముద్ర పోరాటంలో అమెరికన్ సేనల జయభేరి. |
| జూలై 21 | అమెరికన్ సేనలు గ్వామ్ దీవి ప్రవేశించాయి. |
| జూలై 25 | నార్మండీ నుండి అమెరికన్ సేనలు వైదొలగాయి. |
| ఆగ 15 | మిత్రపక్షాల సేనలు దక్షిణ ఫ్రాన్స్‌లో ప్రవేశించాయి. |
| ఆగ 25 | జర్మనీపై రుమేనియా యుద్ధ ప్రకటన. |
| సెప్టె 10 | రష్యాతో ఫిన్లాండ్ యుద్ధవిరమణ సంధి. |
| సెప్టె 15 | పెలేలియూ దీవిపై అమెరికన్ సేనల దాడి. |
| అక్టో 20 | లెయిటే లో అమెరికన్ సేనల ప్రవేశం. |
| అక్టో 23-26 | లెయిటే సింధు శాఖ పోరాటంలో జపాన్ నౌకాదళాన్ని అమెరికన్ నౌకాదళం ఓడించింది. |
| డిసె 16 | జర్మనీ సేనలు బల్జ్ పోరాటాన్ని ప్రారంభించాయి. |
| డిసె 27 | జర్మనీ పోరాట ఉధృతాన్ని మిత్ర పక్ష సేనలు అణచివేశాయి. |
| **1945** | |
| జన 9 | ఫిలిప్పీన్స్‌లోని లూజాన్ మీదికి మిత్రపక్ష సేనల దాడి. |
| జన 11 | రష్యా సేనలు పోలండ్‌లోని వార్సా పట్టణం ప్రవేశం. |
| జన 21 | జర్మనీపై హంగేరీ యుద్ధ ప్రకటన. |
| ఫిబ్ర 13 | బూడాపెస్ట్ (హంగేరీ)లోనికి రష్యా సేనలు ప్రవేశం. |
| ఫిబ్ర 19 | జిమాదీవిపై అమెరికన్ నౌకాదళం దాడి. |
| ఏప్రి 1 | ఒకినావా దీవిలో అమెరికన్ సేనలు ప్రవేశం. |
| ఏప్రి 13 | దాడి చేస్తున్న రష్యా సేనలకు వియెన్నా చిక్కింది. |
| ఏప్రి 22 | తోర్గా వద్ద రష్యా-అమెరికన్ సేనల కలయిక. |
| మే 2 | ఇటలీలోని జర్మనీ సేనల లొంగుబాటు. |
| మే 2 | బెర్లిన్, రష్యా సేనల కైవసమయింది. |
| మే 7 | జర్మనీ మిత్రపక్షాలకు లొంగిపోయింది. |
| జూలై 26 | మిత్రపక్షాలు పాట్స్‌డామ్ డిక్లరేషన్ చేశాయి. |
| ఆగ 6 | జపాన్‌లోని హిరోషిమాపై అమెరికన్ సేనలు అటంబాంబును ప్రయోగించాయి. |
| ఆగ 9 | జపాన్‌లోని నాగసాకీపై మరొక ఆటంబాంబు ప్రయోగం. |
| ఆగ 10 | శాంతి సమాలోచనలకు జపాన్ రంగం సిద్ధం చేసింది. |
| ఆగ 14 | మిత్రపక్షాలు సూచించిన షరతులను జపాన్ అంగీకరించింది. |
| సెప్టె 2 | లొంగుబాటు పత్రాలపై జపాన్ సంతకాలు చేసింది. |
| సెప్టె 8 | చీనాలోని జపాన్ సేనల లొంగుబాటు. |
| సెప్టె 12 | ఆగ్నేయ ఆసియాలోని జపాన్ సేనలు లొంగిపోయాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధం సాధికారంగా ముగిసింది. |

## ప్రభుత్వం

కేంద్ర ప్రభుత్వ కార్యనిర్వాహాన్ని ప్రధాని అతని మంత్రి వర్గ అనుచరులు (కేబినెట్) నిర్వహిస్తారు. అంటే కార్యనిర్వాహణాధికారమంతా ప్రధాని, అతని మంత్రి వర్గ సభ్యులలో న్యస్తమయి ఉంటుందే కాని ప్రభుత్వాధికారిలో కాదు. రాజ్యాంగం ప్రకారం ప్రధాని తన విధుల నిర్వహణలో శాసన రీత్యా రాష్ట్రపతికి, రాజకీయంగా పార్లమెంటుకే బాధ్యుడై ఉంటాడు. మంత్రివర్గం తీసికున్న విధాన నిర్ణయాన్ని బట్టి ప్రభుత్వ కార్యదర్శి ,రాష్ట్రపతి తరపున ప్రభుత్వ ఉత్తర్వులు జారీ చేస్తూ ఉంటాడు. అయా మంత్రులు ఆయా ప్రభుత్వ శాఖలకు అధిపతులై విధాన నిర్ణయాలు నిర్వహిస్తూంటారు. వారిక్రింద కార్యనిర్వాహక వర్గం కార్యదర్శి (సెక్రటరీ), ఉప కార్యదర్శి, సహాయక కార్యదర్శి, విభాగ అధికార (సెక్షన్ ఆఫీసర్), సహాయకులు ఉంటారు. మరల ఆయా ప్రభుత్వ శాఖల క్షేత్రాధిపతులు (డైరక్టర్ — జనరల్, డైరక్టర్ కమీషనర్, ఛీఫ్ ఇంజనీరు మొదలగు వారు) ఉంటారు. ప్రభుత్వ కార్యనిర్వహణ అంతా క్షేత్రాధిపతుల చేతుల మీదుగానే నిర్వహింపబడుతు ఉంటుంది.

ఇటులనే రాష్ట్ర ప్రభుత్వం కూడా పని చేస్తుంది. రాష్ట్రపతి బదులు గవర్నర్, ప్రధాని బదులు ముఖ్యమంత్రి ప్రభుత్వవిధాన నిర్ణయాల్ని చేస్తారు ప్రభుత్వకార్యభారం అంతా ప్రభుత్యోగులు కార్యదర్శి మొదలు కొని క్రింది పదవుల్లో ఉండే సహాయకులు నిర్వహిస్తూంటారు. క్షేత్రాధిపతులు (డైరక్టర్, కమీషనర్, ఛీఫ్ ఇంజనీర్) జిల్లా స్థాయిలో కలక్టరు అతని సిబ్బంది నిర్వహిస్తూ ఉంటారు. (చూ. ముఖ్యమంత్రి)

## ప్రయాగ

త్రివేణి సంగమస్థలమైన సుప్రసిద్ధ భారత పుణ్యక్షేత్రం. గంగా, యమునా, సరస్వతీ నదులు ఇక్కడ సంగమం చెందుతున్నాయి. అయితే గంగాయమునా నదులు కలవడం మాత్రమే పైకి కనిపిస్తుంది. సరస్వతీ నది (చూ.) అంతర్వాహినిగా వచ్చి ఈ క్షేత్రంలోని గంగా, యమునా నదులతో సంగమం చెందుతూందని భారతీయుల విశ్వాసం. ఈ త్రివేణీ సంగమంలో స్నానం చేయడం, పితృదేవతలకు తర్పణాలు వదలడం, పుణ్యా

హేతువని తరతరాలుగా భారతీయులు విశ్వసిస్తున్నారు. నేటికీ లక్షలాది మంది యాత్రికులు త్రివేణీ సంగమంలో స్నానం చేయడానికి, పితృదేవతలకు తర్పణాలు వదలడానికి ఈ క్షేత్రానికి వస్తున్నారు. నేటి అలహాబాదు నగరమే ప్రయాగ క్షేత్రం. 'కుంభమేళా' (చూ.)కు ఇక్కడ పెద్ద తిరునాళ్లు జరుగుతుంది. భారతదేశం లోని మునులు, సన్యాసులూ, యోగులూ, సిద్ధులు అందరూ ఈ మాఘమేళకు వస్తారు. బ్రహ్మ ఇక్కడ అనేక యాగాలు చేశాడనీ, అందుకే ఈ క్షేత్రానికి 'ప్రయాగ' అనే పేరు వచ్చిందనీ విష్ణు పురాణం చెబుతూంది.

## ప్రస్థాన త్రయం

చూ. బ్రహ్మసూత్రాలు

## ప్రాథమిక హక్కులు

పరపాలనలో ప్రజలకు ఏలాంటి హక్కులూ, ఏలాంటి స్వాతంత్ర్యమూ ఉండవు. భారతదేశం స్వాతంత్ర్యంసాధించిన (1947) తర్వాత తయారు చేసుకున్న రాజ్యాంగంలో (1950) ప్రజలకు ఉండే ప్రాథమిక హక్కులు పొందుపరచబడ్డాయి. ఈ హక్కులు స్వతసిద్ధమైనవి. వేరే శాసనాల వలన గాని ప్రభుత్వ ఉత్తర్వుల వలన సంక్రమించేవికావు. ప్రాథమిక హక్కులు 7 రకాలుగా విభజించవచ్చు. 1.సమానత్వానికి *సంబంధించినవి:* వీటివల్ల జాతీయత, కులభేధాలతో నిమిత్తం లేకుండా న్యాయ స్థానాలలో ప్రజాసంస్థలలో విద్యాలయాలలో ఉద్యోగాలలో అందరికి సమానావకాశాలు లభిస్తాయి. బలహీన వర్గాలకు కొన్ని ప్రత్యేక సదుపాయాలు కల్పించబడ్డాయి. అస్పృశ్యత చట్టసమ్మతం కాదని నిర్ణయించబడింది.

2.స్వాతంత్ర్యానికి *సంబంధించినవి:* వీటివల్ల వాక్ స్వాతంత్ర్యం, సమావేశాలు జరుపుకోడానికి, దేశంలో నిరాఘాటంగా సంచరించడానికి, ఏ ప్రదేశంలోనైనా నివాసమేర్పరచుకోడానికి, ఆస్తి సంపాదించుకొని అనుభవించడానికి, వృత్తి చేసుకోడానికి, స్వేచ్ఛ కల్పించబడింది.

3.అధికార *దుర్వినియోగానికి సంబంధించినవి:* అధికార దుర్వినియోగాన్ని అరికట్టడం ద్వారా దేశంలో బానిసత్వం, వ్యక్తుల చేత నిర్బంధంగా వెట్టిచాకిరీ చేయించుకోనే విధానం నిర్మూలించబడ్డాయి.

4.మత *సంస్కృతులకు సంబంధించినవి:* వీటి ఫలితంగా ప్రతి పౌరుడికి తనకు ఇష్టం వచ్చిన మతాన్ని అనుసరించే హక్కు, ప్రచారం చేసే హక్కు లభించాయి.

5.విద్యా, *సంస్కృతులకు సంబంధించినవి:* వీటివల్ల అనేక అల్పసంఖ్యాక వర్గాలకు వారి భాషను, లిపిని రక్షించుకోవడానికీ అందుకుగాను ప్రత్యేక విద్యాలయాలు స్థాపించుకోవడానికీ స్వేచ్ఛ లభించింది.

6.ఆస్తి *విషయమైన హక్కు:* వీటివల్ల ఆస్తి సంపాదించుకోవడానికీ, అనుభవించడానికీ, దానిని ప్రభుత్వం వశపరుచుకొన్నప్పుడు నష్ట పరిహారంగా కొంత మొత్తాన్ని పొందడానికీ హక్కు కల్పించబడింది.

7.*ఈ హక్కులన్నింటినీ కోర్టులద్వారా సాధించడానికి సంబంధించినవి:* పై హక్కులన్నింటిని ఉన్నత న్యాయ స్థానం ద్వారా రక్షించుకునే హక్కు వీటివలన పౌరులకు లభిస్తుంది.

## ప్రేమ్‌చంద్ 1880–1936

ప్రముఖ హిందీ నవలా రచయిత. కాశీకి సమీపంలో లమహి అనే గ్రామంలో 1880లో ఈయన జన్మించాడు. ఆర్థిక పరిస్థితులు బాగా లేనందువల్ల ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించాడు. తర్వాత స్వయం కృషితో ఉన్నత విద్యాభ్యాసం చేసి పరీక్షాధికారి పదవిని పొందగలిగాడు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడంకోసం ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. ప్రేమ్‌చంద్ మొదట ఉర్దూ భాషలో రచనలు చేసి పేరు ప్రతిష్ఠలు ఆర్జించాడు. ఈయన మొదటి హిందీ నవల 'ప్రేమా' 1905లో వెలువడింది. ఇది ఈయన ఉర్దూ నవలకు అనువాదం. తర్వాత 'సేవాసదన్', 'వరదాన్', 'ప్రేమాశ్రమ్','రంగభూమి','కాయాకల్ప్','ప్రతిజ్ఞ',అనే నవలలు వరుసగావెలువడ్డాయి. మానసికంగా బాగా పరిణతి చెందిన తరువాత ప్రేమ్‌చంద్ వ్రాసిన నవలలు 'గబన్','కర్మభూమి','నిర్మల','గోదాన్'. ప్రేమ్‌చంద్



దాదాపు నాలుగు వందల కథలు వ్రాశాడు. ప్రేమ ద్వాదశీ, ప్రేమ పచాసీ, ప్రేమ పూర్ణిమ, సప్త సరోజ్, నవనిధి ఈయన కథాసంకలనాలలో ముఖ్యమైనవి. 'కర్బలా', 'సంగ్రామ్', 'ప్రేమ్ కీ వేదీ' అనే మూడు నాటకాలు కూడా ప్రేమచంద్ వ్రాశాడు. ఈయన నవలలు, కథలు అనేకం ఇతర భాషలలోకి అనువదించబడ్డాయి. అందుచేత హిందీ భాషాప్రాంతంలోనే కాక, భారత దేశమంతటా ఈయన రచనలకు ప్రశంసలు లభించాయి.

ఈయన రచనలలో ఆర్ద్రత, ఆత్మీయత ముఖ్యమైన గుణాలు. అద్భుతమైన పాత్ర చిత్రీకరణ కౌశలం, గంభీరమైన సంభాషణలు పాఠకుల మనస్సులను ఆకట్టు కుంటాయి. ప్రేమ్‌చంద్‌ని ఆయన అభిమానులు 'ఉపన్యాస సామ్రాట్' అని ప్రశంసించారు. (నవలను హిందీలో 'ఉపన్యాస్' అంటారు).

## ప్లాసీయుద్ధం

తూర్పు బంగ్లాదేశ్ పరిపాలకుడు సిరాజ్—ఉద్—దౌలా బ్రిటిష్ ఈస్ట్ ఇండియా స్థావరాన్ని ముట్టడించి నప్పుడు రాబర్ట్ క్లైవ్ (చూ.) 3,200 మంది సైనికులను ఆయత్తపరచి 50,000 మంది ఉన్న శత్రు సైన్యాన్ని ఎదుర్కొని 1757లో ప్లాసీయుద్ధంలో వారిని అవలీలగా ఓడించాడు. తత్ఫలింగా సంపన్నమైన బంగ్లాదేశం ఇంగ్లీషు వారి ఆధిపత్యంలోకి వచ్చింది. ఈ మలుపుతో బ్రిటిష్ పరిపాలన భారతదేశంలో సువ్యవస్థితమైంది.

## ప్లినీ క్రీ.శ. 23–79

ఇటలీలోని ప్రసిద్ధరోమన్ చరిత్ర కారుడు. ప్లీనీ రచించిన 37 సంపుటాల చరిత్ర నేటికి లభిస్తూంది. పాంపై (చూ.) ఉపద్రవంలో నశించిన నౌకకు ఆయన అడ్మిరల్‌గా ఉండేవాడు. ఆ ఉపద్రవంలోనే ఆయన మరణించాడు.

## ప్లేటో క్రీ.పూ. 427–347

ప్రాచీన గ్రీక్ తత్త్వవేత్త. పాశ్చాత్య సంస్కృతికి గట్టి పునాదులు వేసిన మేధావి. ఈయన ఆలోచనలూ, రచనలూ గత 2000 ఏళ్ళుగా ప్రపంచ వ్యాప్తంగా చాలామందిని ప్రభావితం చేస్తూవచ్చాయి. 'ప్లేటో' నిజనామం 'అరిస్టోక్లేట్'. 'ప్లేటో' అంటే భారీ భుజస్కంధాలు కలవాడు అని అర్థం. ఆ నామమే ఆయనకు స్థిరపడిపోయింది. ఏథెన్స్‌లోని 'అకాడమీ' ఈయనకు కార్యరంగం. ప్లేటో గురువు సోక్రటీస్ (చూ.). ప్లేటో శిష్యుడు అరిస్టాటిల్ (చూ.). ప్లేటో ప్రవచించిన గురు—శిష్య సంవాదాలు నేటికీ శిరోధార్యాలు. ఈయన క్రీ.పూ. 357లో స్థాపించిన అకాడమీలో ఖగోళశాస్త్రం, జీవ శాస్త్రం, గణితం, రాజనీతిశాస్త్రం వంటి రంగాలలో మౌలిక మయిన విషయాలమీద ఆయా రంగాలలో నిష్ణాతులైన వారు చర్చాగోష్ఠులు జరుపుతూ ఉండేవారు. ప్లేటో తన భావాలను ప్రవచించడానికి చేపట్టిన సాహిత్యప్రక్రియను 'డైలాగ్' (సంవాదం) అంటారు. ఇద్దరి మధ్యగాని అంతకంటే ఎక్కువమంది మధ్యగాని జరిగే సంభాషణ ఇది. ఈ విమర్శలు, సమీక్షలు నాటకీయంగా ఉండేవి. 'అపాలజీ', 'క్రీటో', 'ది రిపబ్లిక్', 'సింపోజియం' వంటి 35 డైలాగులు ప్లేటో రచించినట్లు తెలుస్తూంది. నీతిశాస్త్రం, మానవధర్మశాస్త్రం వీటిలో ప్రధాన వస్తువులు.

## ఫ్రక్రుద్దీన్ అలీ అహమద్

భారతదేశానికి ఐదవ రాష్ట్రపతి (1974–77). 1905లో ఢిల్లీలో జన్మించిన ఢిల్లీ నగర సంస్కృతిని అలవర్చుకున్నాడు. ఫ్రక్రుద్దీన్ 1928లో లండన్‌లో బారిస్టరు పట్టా సంపాదించి స్వదేశానికి తిరిగి వచ్చి కాంగ్రెసులో చేరి గాంధీ, నెహ్రూ, అజాద్, సరిహద్దుగాంధీ, కృపలానివంటి జాతీయ నాయకుల ప్రభావం క్రిందికి వచ్చాడు. అఖిల భారత కాంగ్రెస్ సభ్యుడై క్రియాశీలక రాజకీయల్లో పలుకుబడిని సంపాదించగలి గాడు. కొంతకాలం పంజాబు హైకోర్టులోనూ, తరువాత అస్సాం హైకోర్టులోనూ న్యాయవాదవృత్తి చేపట్టాడు. 1946 నుండీ అస్సాం రాష్ట్రమంత్రివర్గ సభ్యుడై పరిపాలనా రంగంలో దక్షతను సంపాదించగలిగాడు. 1960లో అస్సాంలో తలఎత్తిన భాషావివాద పరిష్కారంలో రాజకీయ చతురత ప్రదర్శించి బెంగాలీ,



అస్సాం ప్రజల విశ్వాసాన్ని సమానంగా చూరగొన్నాడు. 1957లో అస్సాం శాసనసభకు ఎన్నిక అయి 1961 వరకూ అస్సాం మంత్రివర్గ సభ్యుడుగా కొనసాగాడు. 1967లోకేంద్ర మంత్రి అయి తరువాత 1974లో రాష్ట్రపతి అయి గడువు పూర్తికాకముందే 1977 ఫిబ్రవరి 11న హఠాన్మరణానికి గురిఅయ్యాడు.

## ఫాహియాన్

సుప్రసిద్ధ చైనా యాత్రికుడు. చంద్రగుప్త విక్రమాదిత్యుడు (375–418) ఉత్తర భారతదేశాన్ని పరిపాలించే కాలంలో క్రీ.శ. 405లో ఈయన భారతదేశం సందర్శించాడు. తక్షశిల, రాజ గృహం, గయ, వారణాసి, అయోధ్య, పాటలీపుత్రం;కపిలవస్తు, తామ్రలిప్తి మొదలైన ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాలను 6 ఏళ్లపాటు ఈయన దర్శించి వాటిని గూర్చి తన యాత్రాచరిత్ర గ్రంథంలో వివరించాడు.

ఫాహియాన్ చైనాలోని షాంఫై నగరంలో నివసించే బౌద్ధ భిక్షువు.క్రీ.శ. 370 ప్రాంతంలో కంగే వంశంలో ఈయన జన్మించాడు. చిన్న తనంలోనే తల్లి దండ్రుల్ని కోల్పోవడం వల్ల ఒక బౌద్ధ మఠంలో ఈయన పెరిగి పెద్ద వాడయ్యాడు. 'వినయ పిటక' అనే బౌద్ధ గ్రంథాన్ని తన దేశానికి తీసుకుపోవడానికి ఈయన భారతదేశానికి వచ్చాడు. గుప్తరాజుల కాలంనాటి దేశ పరిస్థితులు, ఆనాటి సాంఘికాచారాలు, భారతీయుల సౌశీల్యం, మతవిశ్వాసాలు మొదలైన వాటిని గురించి గ్రంథస్థం చేశాడు. ఆ కాలపు చరిత్రను వ్రాయటానికి ఫాహియాన్ రచనలు ముఖ్యమైన ఆధారాలుగా చరిత్రకారులకు ఉపయోగించాయి. 'ఫాహియాన్' అనేది ఇతడికి మత సంబంధమైన బిరుదు. ఆమాటకు ప్రసిద్ధ 'బౌద్ధ ధర్మాధికారి' అని అర్థం. 82 సంవత్సరాల వయస్సులో 'కింగ్ బౌ పట్టణంలో 'సిన్ను' అనే బౌద్ధ సంఘారామంలో ఫాహియన్ దేహయాత్ర చాలించారు.

## ఫిజీదీవులు

దక్షిణ పసిఫిక్ సముద్రంలోని 800పైగా దీవుల సముదాయం ఫిజీ. వీట్‌వేవు పెద్దదీవి. తరువాత పెద్దది వాన్‌వేవు. వీటిలో అగ్నిపర్వతాలు ఎక్కువ. విస్తీర్ణం: 18,274 చ.కి.మీ.; జనాభా: 7,42, 000 (1988); రాజధాని: సువా; అధికార భాష: ఇంగ్లీష్. నందిలో అంతర్జాతీయ విమానాశ్రయం ఉన్నది.

ప్రజలలో సగానికిపైగా భారతదేశంనుంచి కూలీలుగా వెళ్ళినవారే. ఇందులో తెలుగు మాట్లాడేవారు కూడా ఉన్నారు. మెలనేషియానుంచి వచ్చిన వారు మిగతావారు. చీనావారు, యూరోపియన్‌లు కూడా ఉన్నారు. క్రైస్తవులు 53 శాతం, హిందువులు 38 శాతం, ముస్లిములు 7 శాతం. 1874నుంచి బ్రిటిష్ వలసరాజ్యంగా ఉన్న ఫిజీ దీవులు1970లోస్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకున్నాయి. సారవంతమయిన నదీలోయలోను, కోస్తాతీరాన వరి, చెరకు, కొబ్బరి, అరటిపండ్లు, అల్లం విరివిగా పండుతాయి. అటవీ సంపద ఎక్కువ. వెండి, బంగారపు ఖనిజాలు దొరుకుతాయి. పశుపోషణ ఉంది.

## ఫిన్లాండ్

యూరప్‌లో బాల్టిక్‌తీరాన ఉన్న స్వతంత్ర గణరాజ్యం. ఒకప్పుడు రష్యన్ సామ్రాజ్యంలో అంత ర్భాగం. 1917లో స్వతంత్రమైంది.

విస్తీర్ణం: 3,38,145 చ.కి.మీ.; జనాభా: 49, 52,000 (1988); రాజధాని: హెల్సింకీ; అధికార భాషలు: ఫిన్నిష్, స్వీడిష్. ప్రజలు :క్రైస్తవులు.

ఈ దేశానికి కోస్తాతీరం 2353 కి.మీ. ఉంది. దేశంలో ప్రవహించే నదులలో కెయోజోకీ పెద్దది. వొనియోనది, జోలుజోకీనది చిన్నవి.దక్షిణాన తటాకాలు ఎక్కువ. తటాకాలు ఆధారంగా సేద్యంచేసి ఓట్‌ధాన్యం, రైధాన్యం, బంగాళ దుంపలు, గోధుమ, బీటు (పంచదార) దుంపలు పండిస్తారు. పశుపోషణ, పాడిపరి శ్రమ, కోళ్ళ పరిశ్రమ ఇతర జీవనాధారాలు. జనాభాలో చాలాభాగం దక్షిణాదినే నివసిస్తారు. కోనిఫర్ అడవులు 65శాతం భూభాగాన్ని ఆక్రమించి ఉన్నాయి. అటవీ సంపద ఆర్థిక వ్యవస్థకు పుష్టిచేకూరుస్తుంది. కాగితం తయారీ, కాగితం గుజ్జు తయారీ ప్రధానమైన పరిశ్రమలు. నౌకానిర్మాణం, ధాతు పరిశ్రమ, తోలు పరిశ్రమ, రాసాయనిక ద్రవ్యాల ఉత్పత్తి ఇతర భారీ పరిశ్రమలు.

## ఫిరోజ్‌షా మెహతా

భారత జాతీయనాయకుడు. 1845 ఆగస్టు4వ తేదీన బొంబాయిలో ఒక పార్శీకుటుంబంలో ఫిరోజ్‌షా మెహతా జన్మించాడు. లండన్‌లో న్యాయ శాస్త్ర

పట్టభద్రుడై స్వదేశానికి తిరిగి వచ్చి న్యాయావాద వృత్తి ప్రారంభించి పలుకుబడి సంపాదించి దాదాభాయి నౌరోజీ (చూ) ప్రభావంతో రాజకీయాలలోకి దిగారు. ఈస్ట్ ఇండియా అసోసియేషన్ బొంబాయి శాఖకు కార్యదర్శి అయినారు. 1872లో బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్ సభ్యుడై పాలనలో చాలా శ్రద్ధ వహించాడు.

1885లో భారతజాతీయ కాంగ్రెస్ స్థాపనలో ఫిరోజ్‌షా ప్రముఖ పాత్రవహించి 1890లో దానికి అధ్యక్షుడయ్యారు. బొంబాయి లెజిస్లేచర్ కౌన్సిల్‌కి 1886 నుండి దాదాపు 15 ఏళ్ళు సభ్యుడుగా ఉంటూ అనేక మార్పులకు కారణభూతులైనారు. 1914 నవంబరు 5న ఫిరోజ్‌షా కీర్తిశేషులయ్యారు.

## ఫిర్దౌసి క్రీ.శ. 940–1020

పారసీక మహాకవి. అసలు పేరు అబుల్‌కాసిమ్ మానేర్. ' నామా' అను రాజవంశీయుల చరిత్రను వ్రాశాడు. గుర్రం జాషువా ఈ కవి జీవితాన్ని ఇతివృత్తంగా తీసికొని ఖండ కావ్యాన్ని వ్రాశాడు.

## ఫిలిప్పీన్ దీవులు

ఆసియాకు దాదాపు 1000 కి.మీ. దూరంలో ఉన్న ఫిలిప్పీన్ ద్వీప సముదాయం ఒక స్వతంత్ర గణ రాజ్యం. ఈ దీవుల సంఖ్య చిన్నవి, పెద్దవి కలిసి 7107. వీటిలో దక్షిణాదిన మిన్డానో, ఉత్తరాదిన లూజాన్ సముదాయాలు ఉన్నాయి.




విస్తీర్ణం: 3,00,000 చ.కి.మీ.; జనాభా: 5,87, 23,000(1988); రాజధాని: మనీలా; అధికార భాషలు:ఫిలిప్పీనో,ఇంగ్లీషు. ప్రజలు ఎక్కువమంది ఫిలిప్పిన్–మలేసియా వర్గానికి చెందినవారు టాగలాగ్ సెబేనో, ఇలోకానో హిలిగేనాన్ ఇలోంగా, బికోల్, సమర్లేతీ తెగలవారున్నారు.ఇది క్రైస్తవ దేశం రోమన్ కేథలిక్‌లు ఎక్కువ.

లూజాన్‌లోని కాగాయాన్‌నది, ఆగ్నోనది, పంపాంగా నది, మిన్డానోలోని ఆగుసాన్ నది ప్రధాన జీవనదులు. ఇవిగాక సరస్సులు, తటాకాలు పంటనీటిని సరఫరా చేస్తున్నాయి. వరి, కొబ్బరి, మొక్కజొన్న, రబ్బరు, అనాసపండ్లు, క్రపెండలం, చెరకు, పొగాకు, చిరుగడం, మామిడి, అరటి ప్రధానమైన పంటలు. ప్రజలకు పశువుల పెంపకం జీవనోపాధిని కల్పిస్తూంది. బూరుగు దూది కలప, మహోగని కలప అటవీ సంపద. మత్స్యపరిశ్రమ బాగా సాగుతూంది. క్రోమైట్, వెండి, రాగి, బంగారం, మాంగనీస్, ఇనుప ఖనిజాలు ఫిలిఫ్పీన్స్ దీవులలో లభిస్తున్నాయి. రబ్బరు సామగ్రి, తైలశోధన, పండ్లనిల్వ, ఉప్పు, పిండి, చుట్టలు, సిగరెట్లు, ఎరువులు, సిమెంటు, గాజు సామగ్రి, కలప సామాను, ప్లైవుడ్ ప్రధాన పరిశ్రమలు. అంతర్జాతీయ వరి పరిశోధనా సంస్థ (ఐ.ఆర్.ఆర్.ఐ) మనిలాలో ఉంది.

## ఫొనీషియా

నేటి సిరియా, లెబనాన్, ఇజ్రాయెల్ ప్రాంతాలను గ్రీక్ భాషలో ఒకప్పుడు ఫొనీషియా అని వ్యవహరించేవారు. ప్రాచీన కాలంలో ఫొనీషియాలో మహావీరులు ఉండేవారు. వణిక్ ప్రముఖులు, నావికులు సముద్రయానంలో ఆరితేరినవారై కొత్త దేశాలను కనుగొనడానికి పూనుకొనే వారు. గ్రీక్ వర్ణమాలకు మూలం ఫొనీషియన్‌ల లిపి అని అంటారు.

## ఫాస్ట్

ఇది గోతేరచన.గోతే జర్మన్ మహాకవి.నాటక రచయిత. గోతే పూర్తి పేరు జోహనన్ వూల్ఫ్‌గాంగ్ ఫాన్ గోతే. గోతేను జర్మనీ భాషలో గెర్‌తాలాహ్ అని అంటారు. గెతే అని కూడ వ్యవహరించడం కద్దు. ఫాస్ట్ ఆయన రచనలన్నిటిలోనూ సుప్రసిద్ధమయింది. ఇది ఆయన రచనలలో ఆఖరిది. ఈ నాటకంలో 'ఫాస్ట్' ప్రధాన పాత్ర. అంతులేని జ్ఞానాన్నీ జీవితానుభవాన్నీ సదా ఆకాంక్షించే స్వభావం కలవాడు కథానాయకుడు ఫాస్ట్. మెఫిస్టోఫిలీస్ అనే భూతం అతడ్ని ఒక ఆట పట్టిస్తూ ఒక జీవితానుభవం నుండి మరో జీవితానుభవంలోకి మళ్లిస్తూ ఉంటుంది. అయితే ఆదర్శ స్వభావియైన ఫాస్ట్‌కు ఏమాత్రం సంతృప్తి ఉండదు. నాటకం రెండవ భాగంలో అపరాధియైనా, గర్వపోతు అయినా ఫాస్ట్ గుణసంపన్నుడూ,

సత్యాన్వేషీ కాబట్టి, దైవానుగ్రహం వల్ల భూతం బారినుండి బయట పడగలుగుతాడు. చివరకు భూతం పందెంలో ఓడిపోయి పంతం నెగ్గించుకోలేక పోతుంది. ఈ నాటకాన్ని రసవత్తరంగా గోతే రచించి ప్రపంచ సాహిత్యంలో కీర్తి సంపాదించాడు.

## ఫ్రాన్స్

పశ్చిమ యూరప్‌లోని ఒక ప్రముఖదేశం. స్పెయిన్, పశ్చిమ జర్మనీ, ఇటలీ దీనికి సరిహద్దులు. సుదీర్ఘమైన చరిత్రగల గణరాజ్యం ఇది. ఒకప్పుడు మహారాజులు పాలించిన దేశం. 1789–1793 మధ్య ఫ్రెంచ్ విప్లవం (చూ.) ఫలితంగా ప్రజాతంత్ర గణరాజ్యం ఆవిర్భవించింది. మధ్యలో కొంతకాలం నెపోలియన్(చూ.)వంటి మహా నియంతలుకూడా పాలించారు.

విస్తీర్ణం: 5,43,965 చ.కి.మీ.; జనాభా: 5,58, 60,000 (1988); రాజధాని: పారిస్ ; అధికార భాష: ఫ్రెంచ్. ప్రజలు సుఖజీవనాన్ని కోరుకునే సౌందర్యోపాసకులు. ఫ్రెంచ్‌వారు పాకకళా ప్రావీణులు. వీరి వంటకాలు జగత్ప్రసిద్ధి. ఫ్రాన్స్ సుసంపన్నమైన రాజ్యమేగాక బలిష్ఠమైన సైనిక సంపత్తి కూడా గల దేశం.

రైన్ నదిలోయ సారవంతమయింది. పడవ ప్రయాణానికి సౌకర్యంగల నది ఇది. 'గారొన్నే'నది పారే ప్రాంతం సారాయికి అనువైన ద్రాక్షతోటలకు ప్రసిద్ధి. 1050 కి.మీ. నిడివిగల 'లోయిరే'నది ఫ్రాన్స్‌లో పెద్దనది. ఆల్ప్స్, జూరా కొండలలో పారే ఏరుల ప్రాంతాలు వినోద పర్యాటకులకు విహార స్థలాలు. రైన్‌నది సాగునీటిని అందించడమేగాక 'రివీరా' విహార స్థలానికి కేంద్రంగా కూడా ఉంది. కార్సికా దీవి ఫ్రాన్స్‌కి చెందినదే.




గోధుమ, **రైధాన్యం**, బీటు (పంచదార)దుంపలు, ద్రాక్ష,మొక్కజొన్న,బంగాళదుంపలు, రేప్‌సీడ్, పొద్దు తిరుగుడు, ఆపిల్ పండ్లు, కూరగాయలు,పీచ్,ఓట్ ధాన్యం, బంగాళదుంపలు వ్యవసాయోత్పత్తులు.ఇవి ఈ దేశంనుంచి భారీ ఎత్తున ఎగుమతి అవుతున్నాయి. క్షీరోత్పత్తులు, మాంసం కూడా విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి. గండుమీను, పీతలు, హెర్రింగ్ చేపలు, గండురొయ్య, మేకరిల్, ఆయిస్టర్‌లు, సార్డీన్‌లు, ట్యూనా ఇత్యాది మత్స్య సంపద ఎక్కువ. పారిశ్రామికంగా ప్రగతి సాధించిన దేశాలలో ఫ్రాన్స్ ప్రముఖమయినది. విమానాల తయారీ, మోటారు కార్ల తయారీ, యంత్ర సామగ్రి, విద్యుత్ పరికరాలు, కలప సామగ్రి, ఇనుము—ఉక్కు, ఆభరణాలు, అత్తర్లు, జవుళీ, మద్యం, కాగితం, అల్యూమినియం పరిశ్రమలలో పేర్కొనదగినవి.

చరిత్ర ప్రసిద్ధిపొందిన డెకార్టే, వాల్టేర్, విక్టర్ హ్యూగో, జోన్—ఆఫ్—ఆర్క్, నెపోలియన్, మొపాసా వంటి అనేక జగత్ప్రసిద్ధులు పుట్టిన గొప్పదేశం ఫ్రాన్స్!

ఫ్రెంచ్‌భాషను, సాహిత్యాన్ని ప్రమాణీకరించడానికి 1635లో స్థాపించబడిన 'ఫ్రెంచ్ అకాడమీ' ఇతర ప్రపంచ భాషలవారికి ఒరవడి అయింది.(చూ. పారిస్).

## ఫ్రెంచ్ విప్లవం

ఫ్రాన్స్‌లో 10 ఏళ్ల (1789–1799) పాటు జరిగిన చరిత్ర ప్రసిద్ధమైన ప్రజాపోరాటం. 'స్వేచ్ఛ' 'సమానత్వం' 'సౌభ్రాత్రం' అని నినాదాలిచ్చి రక్తసిక్తంగా సాగిన 'ఫ్రెంచ్ విప్లవం' 1789 జూలై 14న పారిస్‌లోని బాస్టిల్లే ముట్టడితో ఆరంభమయి, మహాప్రభంజనంవలె దేశం అంతటా వ్యాపించింది. 10 ఏళ్ల పాటు దేశాన్ని అస్తవ్యస్తం చేసింది. 1799 నాటికి ఉద్యమం తారాస్థాయి నందుకొని వంశపారంపర్యపు రాజరిక వ్యవస్థకు స్వస్తి పలికింది. దేశదేశాలకు కనువిప్పు కలిగించింది. ప్రపంచ ప్రజలు స్వేచ్ఛావాయువులు పీల్చడం మొదలు పెట్టారు. అంతకు ముందు దశాబ్దం క్రిందట (1776)లో జరిగిన అమెరికన్ విప్లవం ఫ్రెంచ్ వారికి ఉత్తేజాన్ని కలిగించింది.

విప్లవకాలంలో ప్రజాప్రతినిధుల కూటమి దమన నీతితో కూడిన పరిపాలన (రెయిన్ ఆఫ్ టెరర్) సాగించింది. తమకు ఎదురు తిరిగిన వారందరినీ నిర్దాక్షిణ్యంగా ఉరితీసింది. చివరకు రాబస్పీయర్ వంటి నాయకులు కూడా ఉరికంబం ఎక్కవలసి వచ్చింది. విప్లవానంతరం నెపోలియన్ ఫ్రాన్స్ నియంతగా గద్దె ఎక్కాడు.

## బంకించంద్ర ఛటర్జీ 1838–93

ప్రముఖ బెంగాలీ నవలా రచయిత. 'వందేమాతరమ్' గీత రచయిత. బెంగాల్‌లో మొదట బి.ఏ. డిగ్రీ పొందిన వ్యక్తి ఈయనే! కొంతకాలం 'ప్రభాకర' పత్రికా సంపాదకుడి దగ్గర ఈయన ఉద్యోగం చేశాడు. తరువాత డిప్యూటీ కలెక్టర్ అయ్యాడు. బంకించంద్ర మొదట కొంతకాలం కవిత్వం వ్రాసి, తరువాత వచన రచనలు చేయటం ప్రారంభించాడు. ఆంగ్ల రచయితలలో సర్ విలియమ్ స్కాట్ ఈయన అభిమాన రచయిత.



1865లో బంకించంద్ర రచించిన ప్రసిద్ధ బెంగాలీ నవల 'దుర్గేశనందిని' వెలువడింది.ఇది ఒక చారిత్రక నవల. శాక్తేయుల దురాచారాలను చిత్రిస్తూ వ్రాసిన నవల 'కపాలకుండల' 1866లో ప్రచురితమైంది. బెంగాల్ దేశపు ఆచార్య వ్యవహారాలను చిత్రించే నవల 'మృణాలిని' (1869). ఆనాటి సాంఘిక విషయాలను తెలిపే నవల 'బిష్‌బ్రక్ష'(1873). ఈ నవల ఆంగ్ల భాషలోకి అనువాదం చేయబడింది. ఇంకా 'దేవీ చౌధురాణి' (1884), 'ఆనందమఠ్'(1882), 'రాజసింహ' (1882), 'రజని' (1877), 'రాధారాణి' (1875), 'ఇందిర' (1873), 'యుగ్లాంగులీయ' (1874), 'సీతారామ్' (1887) మొదలైనవిఈయన రచించాడు. 'వందేమాతరమ్' అనే జాతీయగీతం బంకించంద్ర ఛటర్జీ 'ఆనందమఠ్' నవలలోనిది. 1872లో బంకించంద్ర, 'వంగదర్శిని' అనే పత్రికను ప్రారంభించాడు. ఆ కాలపు సాంఘికాచార వ్యవహారాలను గురించి, ఆ పత్రికలో ఆయన ఎన్నో వ్యాసాలు వ్రాశాసేవాడు. భాగవత విశేషాలను ప్రాశస్త్యాన్ని వర్ణిస్తూ ఈయన ఒక గ్రంథం వ్రాశాడు. ఈయనను మహా రచయితగా గుర్తించి, నాటి బ్రిటిష్ ప్రభుత్వం 'రాయబహద్దర్', 'సి.ఐ.ఇ.' అనే బిరుదులు ఇచ్చి సత్కరించింది.

## బంగాళాఖాతం

దక్షిణ ఇండియా, బర్మాదేశాలకు మధ్యఉన్న సముద్ర భాగాన్ని 'బంగాళాఖాతం' అంటారు. దీనికి దక్షిణాన హిందూ సముద్రం వుంది. గంగానది, బ్రహ్మపుత్రానది, మహానది, గోదావరి నది, కృష్ణానది, కావేరీనది, ఐరావతినది (బర్మా) ఈ బంగాళా ఖాతంలో కలుస్తాయి. కలకత్తా, విశాఖపట్టణం, మద్రాసు, రంగూను (బర్మా) రేవు పట్టణాలు బంగాళాఖాత తీరాన ఉన్న ప్రసిద్ధ నౌకాశ్రయాలు, రేవు పట్టణాలు. అండమాన్, నికోబార్, దీవులు (ఇండియా) మెర్గుయాద్వీప సముదాయం బంగాళాఖాతంలో తూర్పు భాగాన ఉన్నాయి. బర్మా తీరం వెంబడి అగ్ని పర్వతాలుండే దీవులు ఉన్నాయి. బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడడం వల్ల ఆంధ్ర కోస్తా (1000 కి.మీ. నిడివి)తీరం పెనుతుఫాను (సైక్లోన్)లకు గురి అవుతూ ఉంటుంది. కలకత్తా విశాఖపట్టణం, కాకినాడ, మచిలీపట్టణం, నర్సాపురం, మద్రాసు, నాగపట్టణం, తూత్తుకూడి చేపల రేవులుగా ప్రసిద్ధి పొందాయి. సాగరగర్భంలో తైల నిక్షేపాలు ఉన్నాయి.

## బంగ్లాదేశ్

ఒకప్పుడు బ్రిటిష్ ఇండియాలో భాగంగా ఉండి, 1947లో తూర్పు పాకిస్తాన్ (తూ. పాకిస్తాన్) అయింది. 1971 నుంచి పాకిస్తాన్ నుంచి విడివడి 'బంగ్లాదేశ్' అనే స్వతంత్ర గణరాజ్యంగా ఏర్పడింది. ఆగ్నేయాన బర్మా దేశం తప్ప, తక్కిన అన్ని వైపులా భారత దేశమే ఈ దేశానికి సరిహద్దు.

విస్తీర్ణం: 1,43,998 చ.కి.మీ.; జనాభా: 10,77,56,000(1988); రాజధాని: ఢాకా. చిటగాంగ్, ఖుల్నా,రాజ్‌షాహీ,మైమెన్‌సింగ్ ఇతర పట్టణాలు. అధికార భాష: బెంగాలీ (బాంగ్లా). ప్రజలు ముస్లిములు 84 శాతం, హిందువులు 12 శాతం వున్నారు.



గంగానది, బ్రహ్మపుత్రానది, మెఘ్నా నదులు తెచ్చే రేగడి మన్ను (సిల్ట్)వల్ల నేల సారవంతమయింది. జ్యూట్ నారకు ఈ దేశం ప్రసిద్ధి. వరి, చెరకు, తేయాకు, పొగాకు, బంగాళ దుంపలు, అరటి, చిరుగడం, అనాస ప్రధానమయిన పంటలు. జ్యూట్‌నార ఈ దేశం నుంచి ఎగుమతి అవుతూంది. చమురు వాయువు నిక్షేపాలు ఉన్నాయి. జ్యూట్ సామగ్రి, నూలు వస్త్రాలు, కాగితం ప్రధాన పరిశ్రమలు. టేకు కలప చిట్‌గాంగ్ అడవుల నుండి లభిస్తుంది. సుందర వనాలలో బెంగాలీ పులులు విహరిస్తూ ఉంటాయి.

## బదరీనాథ్

హిమాలయా పర్వతాలలో సముద్రమట్టానికి సుమారు 1829 మీ. (6000 ) ఎత్తున ఉన్న పరమ పవిత్రమైన భారతీయ పుణ్యక్షేత్రం. బదరీనాథ్‌నే బదరీ నాథ్ పూరి, బదరి కాశ్రమం, బ్రహ్మకపాలం అని కూడా అంటారు.

భారతీయ పురాణాలలో నారాయణాష్టాక్షరి ఉద్భవించిన క్షేత్రంగానూ, రుద్రుని బ్రహ్మహత్యా దోషం పోగొట్టిన పుణ్యభూమి గానూ, పితృదేవతలకు పిండ ప్రదానం చేస్తేవారికి ముక్తి కలిగించే వైకుంఠద్వారం గానూ, గంగ ఆవిర్భవించిన పావన ప్రదేశంగానూ, వ్యాసమహర్షి వేద విభజన చేసి పురాణాలు రచించిన పుణ్య భూమిగానూ, నరనారాయణులూ శంకర, మధ్వ, రామానుజాచార్యులూ తపస్సు చేసి సిద్ధిపొందిన తపోవనం గానూ బహువిధాలుగా ఈ క్షేత్రం కీర్తించబడింది. హృషీకేశం నుంచి బదరీనాథ్ వరకూ ఇప్పుడు బస్సులు నడుస్తున్నాయి. మార్గ మధ్యంలో దేవప్రయాగ, రుద్రప్రయాగ, పాతాళగంగ, జోషీమఠ్ మొదలైన ఇతర పుణ్యక్షేత్రాలెన్నో ఉన్నాయి. బదరీక్షేత్రం ఆరుమాసాలు మంచుతో కప్పబడి ఉండడం చేత ఆరుమాసాలు మాత్రమే యాత్రికులు ఆ క్షేత్రాన్ని దర్శించే అవకాశం ఉంది. మంచుతో కప్పబడి ఉన్న **ఆరుమాసాలూ దేవతలు ఆ స్వామిని అర్చిస్తారని స్థానికస్థల పురాణం.**

## బర్మా

ఆగ్నేయ ఆసియాలోని ఒక స్వతంత్ర గణ రాజ్యం. 1885–1922 మధ్య బ్రిటిష్ ఆధిపత్యంలో ఉన్నప్పుడు బర్మా ప్రాంతం భారతదేశంలో ఒక రాష్ట్రం (ప్రావిన్స్)గా ఉండేది. తరువాత 1948లో పూర్తి స్వాతంత్ర్యం సాధించుకునే వరకూ బ్రిటిషు వలస రాజ్యాధిపత్యానికి లోబడి స్వపరిపాలన సాగించుకుంటూ ఉండేది. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో బర్మా ఒక ప్రముఖ యుద్ధరంగం (1942–45) అయింది.

విస్తీర్ణం: 6,76,577 చ.కి.మీ. జనాభా: 3,99, 52,000 (1988), రాజధాని: రంగూన్, అధికార భాష: బర్మీస్. ప్రజలు ఆయా ఆదిమజాతుల భాషలు మాట్లాడుతారు. ప్రజలలో అధికభాగం బౌద్ధులు (90 శాతం).

ఐరావతీ నదీలోయ, డెల్టా నేలలు సారవంతమైనవి. వరిపంట అధికం. ప్రత్తి, గోధుమ, వేరుసెనగ, జొన్న, తేయాకు, పొగాకు, నువ్వులు, రబ్బరు, వెల్లుల్లి, చెరకు, మిర్చి, జ్యూట్‌నార ఇతర పంటలు. బర్మా ఆగ్నే యాసియాలోని ధాన్యాగారం. బియ్యం ఎగుమతికి ప్రసిద్ధి పొందింది. టేకు, వెదురు ప్రధానమయిన అడవి ఉత్పత్తులు. పెట్రోలు, సీసం, తగరం, జింకు, టంగ్‌స్టన్, రాగి, వెండి, ఆంటిమనీ ఖనిజ నిక్షేపాలున్నాయి. కెంపులు, నీలం, పచ్చ వంటి రత్నాలకు బర్మా ప్రసిద్ధి. బర్మా పేరును యూనియన్ ఆఫ్ మ్యాన్మార్‌గా 1989 లో మార్చారు.

## బల్గేరియా

ఆగ్నేయ యూరప్‌లో బాల్కన్ ప్రాంతంలోని ఒక స్వతంత్ర గణరాజ్యం. 1944లో ప్రజా సోషలిస్ట్ రిపబ్లిక్ అయింది.




విస్తీర్ణం: 1,10,994 చ.కి.మీ.; జనాభా: 89, 78,000(1988); రాజధాని: సోఫియా; అధికార భాష: బల్గేరియన్. ప్రజలు క్రైస్తవులు.

బాల్కన్ పర్వతాలలో ఆవిర్భవించిన మారిట్సానది, ఉత్తరపు సరిహద్దు వెంబడి ప్రవహించే డాన్యూబ్ నదికి ఉపనదీ. నల్లసముద్రం (బ్లాక్ సీ)లోపడు తున్దరూనది ఈ దేశానికి ప్రధాన జలాధారాలు.

గోధుమ, రైధాన్యం, బార్లీ, మొక్కజొన్న, ద్రాక్ష, రోజాపుష్పం, ఓట్‌ధాన్యం, బంగాళ దుంపలు, పొగాకు,

బీట్ (పంచదార) దుంప ప్రధానమయిన సాగుపంటలు. 1948నుంచి పారిశ్రామికంగా కూడా ఈ దేశం ప్రగతి సాధిస్తోంది. ధాతు పరిశ్రమ, పిండిమరలు, యంత్ర సామగ్రి, రోజా తైలం పారిశ్రామికోత్పత్తులు. బాక్సైట్, నేలబొగ్గు, జింకు, మాంగనీసు, సీసం, యురేనియం, రాగి బల్గేరియాలో లభించే ఖనిజాలు. హస్త కళలకు బల్గేరియా ప్రసిద్ధి.

## బసవేశ్వరుడు 12వ శతాబ్ది

కర్ణాటకలో వెలసిన సుప్రసిద్ధ వీరశైవమత ప్రవక్త. దక్షిణ భారతదేశంలో శైవమతాన్ని పునరుద్ధరించిన మహావ్యక్తి. ఆయన నందీశ్వరుని అవతారం అని వీరశైవుల విశ్వాసం. కర్నాటక రాష్ట్రంలోని శ్రీగిరి అగ్రహారంలో మరిడెగ మాదిరాజు, మదాంబ దంపతులకు బసవేశ్వరుడు జన్మించాడు. తండ్రి ఉపనయనం చేయబోగా కర్మపాశాలలో చిక్కుకోవడం ఇష్టంలేని బసవన్న ఇంటినుంచి పారిపోయాడు. విభూతి ధరించి, రుద్రాక్షలు మెడలో వేసుకొని లింగపసాయితం అనే కత్తిని నడుమున కట్టుకొని శివభక్తుడుగా ఆయన జీవితం గడప సాగాడు. కూడలి సంగమేశ్వరుని ఆరాధించి ఆ దేవుణ్ణి ప్రత్యక్షం చేసుకున్నాడు. కల్యాణ పురాధీశుడైన బిజ్జలుని రాజ్యంలో భాండాగారధ్యక్షుడుగా పనిచేస్తున్న ఇతని మేనమామ మరణించగా ఆ స్థానంలో బసవేశ్వరుణ్ణే **భాండాగారధ్య** క్షుడుగా బిజ్జలుడు నియమించాడు. దండ నాయకుడుగా కల్యాణ కటకంలో ఉన్న సమయంలో అల్లమ ప్రభువనే శివయోగి బసవుడికి శివయోగాన్ని ఉపదేశించాడు. దీనితో బసవడికి కొన్ని మహత్తులు ప్రాప్తించాయి. 'బసవ వచనాలు' నీతివంతమైన జీవనానికి మార్గదర్శక బోధిని.

## బహామా దీవులు

వెస్టిండీస్‌కు ఉత్తరంగా ఉన్న ఒక ద్వీపరాజ్యం. ఇందులో 700 ఒకమాదిరి దీవులూ, మరొక 2000 వరకూ చిన్న చిన్న దీవులూ ఉన్నాయి. అయితే మొత్తంమీద 30 దీవులే మానవ నివాసయోగ్యమయినవి. ఆండ్రోస్ దీవి అన్నిటికంటే పెద్దది. అయితే 'ప్రావిడెన్స్' దీవిలో జనసాంద్రత ఎక్కువ. 1964లో స్వపరిపాలన హక్కునూ, 1973లో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ఈ రాజ్యం సాధించుకుంది.

విస్తీర్ణం: 13,939 చ.కి.మీ., జనాభా: 2,45, 000 (1988), రాజధాని: నస్సవూ, అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలలో ఎక్కువమంది (84 శాతం) నీగ్రోజాతులవారు. తెల్లవారి శాతం 13 మాత్రమే! ప్రజలు క్రైస్తవులు.

పండ్లు, కూరగాయలు బాగా పండుతాయి. మత్స్య పరిశ్రమ ఎక్కువ. బహామా దీవులు ప్రకృతి సౌందర్యానికి ప్రఖ్యాతి పొందాయి. విదేశీ వినోద పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తూ విదేశీ ద్రవ్యం ఆర్జిస్తున్నాయి.

## బహ్రేయిన్

అరేబియా సింధుశాఖలోని 33 చిన్న దీవులతో కూడిన అరబ్బీరాజ్యం. ఇది రాజవంశీయుల (అమీరుల) పాలనలో ఉండేది. 1971లో స్వతంత్రం అయింది. ఈ దీవులలో 'బహ్రేయిన్' పెద్ద దీవి. దానిని బట్టి ఈ ద్వీప సముదాయానికి కూడా అదే పేరు వచ్చింది.

విస్తీర్ణం: 690 చ.కి.మీ. జనాభా: 4,21,000 (1988), రాజధాని: మనామా; అధికార భాష: అరబ్బీ. ఇంగ్లీషు కూడా మాట్లాడతారు. ప్రజలలో బహ్రేనీ అరబ్బుల శాతం 68, పర్షియన్, ఇండియన్, పాకిస్తానీయుల శాతం 25, తెల్లవారు 4 శాతం. ప్రజలలో 85 శాతం ముస్లిములు. షియా, సున్నీ సంప్రదాయాలను పాటిస్తున్నారు. పుష్కలంగా లభిస్తున్న పెట్రోలు తైలవ్యాపారం వల్ల దేశం సుసంపన్నమైంది.

పండ్లు, ఖర్జూరం, కూరగాయలు ముఖ్యమైన వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ, కోళ్ళ పెంపకం కూడా సాగుతున్నాయి. ప్రజల జీవన ప్రమాణస్థాయి చాలఎక్కువ.

## బాణుడు క్రీ.శ. 7వ శతాబ్ది

సుప్రసిద్ధ సంస్కృత గద్యకవి. 'కాదంబరి', 'హర్ష చరిత్ర'ల కర్త. 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' (లోకంలోని రచన అంతా బాణుని ఎంగిలే!), 'కాదంబరీ రసజ్ఞానాం ఆహారోపి నరోచతే' (కాదంబరిలోని రసాన్ని ఆస్వాదన చేసిన వారికి ఆహారం కూడా రుచించదు) వంటి సుప్రసిద్ధలోకోక్తులకు ఆధారభూతుడు అయిన వాడు.

బాణుడు ఆపస్తంభసూత్రుడు, వాత్స్యాయనుని వంశం లో పుట్టినవాడు. శోణేనదికి దక్షిణాన ఉన్న ప్రీతి కూటం ఇతని నివాసం. తండ్రి చిత్రభానుడు; తల్లి రాజదేవి. వేదవేదాంగాలను అధ్యయనం చేసిన బాణుడు కవి పండిత చక్రవర్తి అయిన శ్రీ హర్షుని ఆస్థాన కవిగా సన్మానాలు పొందాడు.

సంస్కృతంలో బాణుడు గద్యాన్ని వివిధ మనోహర రీతులలో నడిపించాడు. తరువాతి రచయితలకు ఏమీ మిగల్చకుండా సర్వ విధ కల్పనలనూ, వర్ణనలనూ చేశాడు. 'హర్ష చరిత్ర' రచించి, అటు తరువాత వచ్చిన చరిత్ర కావ్యాలకు బాణుడే ఒరవడి పెట్టాడు.

## బాపా, అమృతలాల్ తక్కార్

మహాత్మాగాంధీ అనుచరుడు. అస్పృశ్యతా నిర్మూలన, హరిజనోద్ధరణ కార్యక్రమాలు ఈయన కార్య క్షేత్రాలు. భావనగర్‌లో ఒక నీరుపేద కుటుంబంలో 1869 నవంబరు 29న జన్మించారు. మెట్రిక్ ప్యాసై పూనాలో ఇంజనీరింగు అభ్యసించెను. కొన్నాళ్లు చేసిన ఉద్యోగాన్ని విడచిపెట్టి దీన జనోద్ధరణ వైపు తన కృషిని మళ్లించెను. భారతసేవక్ సమాజ్‌లో సభ్యుడై జీవిత పర్యంతము ప్రజాసేవలో నిమగ్నుడయి కృషి చేశాడు. దేశంలో కరువుకాటకాలు ఏ ప్రాంతంలో సంభవించినా, ఆయా ప్రాంతాలకు వెళ్లి ఆయన సేవలు అందించేవాడు. 1914లో మధురలోనూ, ఆ తరువాత గుజరాతులోనూ కచ్, పంచమహల్ జిల్లాలలోనూ పేదజాతులు ఈయన సేవలు అందుకొన్నారు. కొండ జాతుల పరిచయమై వారి దుస్థితిని చక్కపరుచుటకు భిల్లుల సేవామండలిని స్థాపించేడు. 1932 లో గాంధీజీ ఉపవాస ఫలితంగా హరిజన సేవక్ సంఘం ఏర్పడగా తక్కార్ బాపా సంఘ కార్యదర్శిగా ప్రారంభించి జీవితాంతం హరిజనసంక్షేమ కార్యక్రమాలలోనూ, అస్పృశ్యతా నిర్మూలన కార్యక్రమా లలోనూ అకుంఠిత దీక్షతో పనిచేశాడు.

## బాపిరాజు, అడవి 1895–1952

ప్రసిద్ధ తెలుగు నవలా రచయిత, గాయకుడు, చిత్రకారుడు. పత్రికాసంపాదకుడు.

కృష్ణయ్య, సుబ్బమ్మ దంపతులకు 1895లో బాపిరాజు జన్మించారు. చిన్ననాటినుండీ బాపిరాజు కథలంటే చెవి కోసుకునేవాడు. చదువుకునేటప్పుడే పద్యాలు అల్లడం, బొమ్మలు గీయడం ఆయనకు సరదా.



స్వాతంత్ర్య సంగ్రామంలో చురుకుగా పాల్గొని 1922 లో అరెస్టయినాడు. జైలు లోనే సాతవాహన కాలాన్ని చిత్రించే అద్భుత కథా కల్పనతో 'హిమ బిందు'అనే నవల ప్రారంభించాడు. బందరు జాతీయ కళాశాలలో మూడేళ్ళపాటు ప్రమోద కుమార ఛటోపాధ్యాయుని శిష్య రికం చేసి భారతీయ చిత్రకళలోని మెళుకువలను తెలుసుకొన్నారు. తర్వాత 'సముద్రగుప్తుడు' మొదలగు చిత్రాలను చిత్రించి ప్రఖ్యాతి నార్జించారు.

భీమవరంలో న్యాయవాద వృత్తి చేస్తూ 'నారాయణ రావు' అనే సాంఘిక నవల వ్రాశారు. తిక్కన చిత్రం చిత్రించి ఆంధ్ర విశ్వవిద్యాలయం బహుమతి పొందారు. 1934లో ఆంధ్ర జాతీయ కళాశాల ప్రధానాచార్యులుగా పనిచేస్తూ, శైలబాల, వీరా, హిమాలయ రశ్మి మొదలైన చిన్న కథలు రాశారు. 1939లో సినీరంగంలో ప్రవేశించి 'అనసూయ, ధ్రువ విజయం, మీరాబాయి మున్నగు సినిమాలకు కళాదర్శ కత్వం వహించారు. 1944–47 హైదరాబాదులో 'మీజాన్' అనే దిన పత్రికకు సంపాదకత్వం వహించారు. ఈ కాలంలోనే 'తుఫాను' గోన గన్నారెడ్డి, కోనంగి నవలలను అనేక చిన్న కథలను వ్రాశారు. 1952 సెప్టెంబరు 19న బాపిరాజు మద్రాసులో కన్ను మూశారు.

## బాబర్ 1483–1530

భారతదేశంలో మొగల్ సామ్రాజ్యాన్ని వ్యవ స్థాపించిన మహావీరుడు. మధ్య ఆసియాలోని రెండు పెద్ద మహారాజవంశాలకు చెందిన సంతతివాడు. తల్లివైపు వారు చెంగిజ్ ఖాన్ (చూ) పరంపరకునూ, తండ్రివైపువారు తైమూరు వారసులకునూ చెందినవారు. చిన్నతనంలోనే

బాణుడు ఆపస్తంభసూత్రుడు, వాత్స్యాయనుని వంశంలో పుట్టినవాడు. శోణేనదికి దక్షిణాన ఉన్న ప్రీతి కూటం ఇతని నివాసం. తండ్రి చిత్రభానుడు; తల్లి రాజదేవి. వేదవేదాంగాలను అధ్యయనం చేసిన బాణుడు కవి పండిత చక్రవర్తి అయిన శ్రీ హర్షుని ఆస్థాన కవిగా సన్మానాలు పొందాడు.

సంస్కృతంలో బాణుడు గద్యాన్ని వివిధ మనోహర రీతులలో నడిపించాడు. తరువాతి రచయితలకు ఏమీ మిగల్చకుండా సర్వ విధ కల్పనలనూ, వర్ణనలనూ చేశాడు. 'హర్ష చరిత్ర' రచించి, అటు తరువాత వచ్చిన చరిత్ర కావ్యాలకు బాణుడే ఒరవడి పెట్టాడు.

## బాపా, అమృతలాల్ తక్కర్

మహాత్మాగాంధీ అనుచరుడు. అస్పృశ్యతా నిర్మూలన, హరిజనోద్ధరణ కార్యక్రమాలు ఈయన కార్య క్షేత్రాలు. భావనగర్‌లో ఒక నీరుపేద కుటుంబంలో 1869 నవంబరు 29న జన్మించారు. మెట్రిక్ ప్యాసై పూనాలో ఇంజనీరింగు అభ్యసించెను. కొన్నాళ్లు చేసిన ఉద్యోగాన్ని విడచిపెట్టి దీన జనోద్ధరణ వైపు తన కృషిని మళ్లించెను. భారతసేవక్ సమాజ్‌లో సభ్యుడై జీవిత పర్యంతము ప్రజాసేవలో నిమగ్నుడయి కృషి చేశాడు. దేశంలో కరువుకాటకాలు ఏ ప్రాంతంలో సంభవించినా, ఆయా ప్రాంతాలకు వెళ్లి ఆయన సేవలు అందించేవాడు. 1914లో మధురలోనూ, ఆ తరువాత గుజరాతులోనూ కచ్, పంచమహల్ జిల్లాలలోనూ పేదజాతులు ఈయన సేవలు అందుకొన్నారు. కొండ జాతుల పరిచయమై వారి దుస్థితిని చక్కపరుచుటకు భిల్లుల సేవామండలిని స్థాపించేడు. 1932 లో గాంధీజీ ఉపవాస ఫలితంగా హరిజన సేవక్ సంఘం ఏర్పడగా తక్కర్ బాపా సంఘ కార్యదర్శిగా ప్రారంభించి జీవితాంతం హరిజనసంక్షేమ కార్యక్రమాలలోనూ, అస్పృశ్యతా నిర్మూలన కార్యక్రమాలలోనూ అకుంఠిత దీక్షతో పనిచేశాడు.

## బాపిరాజు, అడవి 1895–1952

ప్రసిద్ధ తెలుగు నవలా రచయిత, గాయకుడు, చిత్రకారుడు. పత్రికాసంపాదకుడు.

కృష్ణయ్య, సుబ్బమ్మ దంపతులకు 1895లో బాపిరాజు జన్మించారు. చిన్ననాటినుండీ బాపిరాజు కథలంటే చెవి కోసుకునేవాడు. చదువుకునేటప్పుడే పద్యాలు అల్లడం, బొమ్మలు గీయడం ఆయనకు సరదా.



స్వాతంత్ర్య సంగ్రామంలో చురుకుగా పాల్గొని 1922 లో అరెస్టయినాడు. జైలులోనే సాతవాహన కాలాన్ని చిత్రించే అద్భుత కథా కల్పనతో 'హిమ బిందు'అనే నవల ప్రారంభించాడు. బందరు జాతీయ కళాశాలలో మూడేళ్ళపాటు ప్రమోద కుమార ఛటోపాధ్యాయుని శిష్యరికం చేసి భారతీయ చిత్రకళలోని మెళుకువలను తెలుసుకొన్నారు. తర్వాత 'సముద్రగుప్తుడు' మొదలగు చిత్రాలను చిత్రించి ప్రఖ్యాతి నార్జించారు.

భీమవరంలో న్యాయవాద వృత్తి చేస్తూ 'నారాయణ రావు' అనే సాంఘిక నవల వ్రాశారు. తిక్కన చిత్రం చిత్రించి ఆంధ్ర విశ్వవిద్యాలయం బహుమతి పొందారు. 1934లో ఆంధ్ర జాతీయ కళాశాల ప్రధానాచార్యులుగా పనిచేస్తూ, శైలబాల, వీరా, హిమాలయ రశ్మి మొదలైన చిన్న కథలు రాశారు. 1939లో సినీరంగంలో ప్రవేశించి 'అనసూయ, ధ్రువ విజయం, మీరాబాయి మున్నగు సినిమాలకు కళాదర్శకత్వం వహించారు. 1944–47 హైదరాబాదులో 'మీజాన్' అనే దిన పత్రికకు సంపాదకత్వం వహించారు. ఈ కాలంలోనే 'తుఫాను' గోన గన్నారెడ్డి, కోనంగి నవలలను అనేక చిన్న కథలను వ్రాశారు. 1952 సెప్టెంబరు 19న బాపిరాజు మద్రాసులో కన్ను మూశారు.

## బాబర్ 1483–1530

భారతదేశంలో మొగల్ సామ్రాజ్యాన్ని వ్యవస్థాపించిన మహావీరుడు. మధ్య ఆసియాలోని రెండు పెద్ద మహారాజవంశాలకు చెందిన సంతతివాడు. తల్లివైపు వారు చెంగిజ్ ఖాన్ (చూ) పరంపరకునూ, తండ్రివైపువారు తైమూరు వారసులకునూ చెందినవారు. చిన్నతనంలోనే

1920లో ఇంగ్లండులో మొదట జరిగింది. అప్పుడు 32 దేశాల నుండి 301 మంది బాలభటులు పాల్గొన్నారు. 1971లో 80 దేశాలకు సంబంధించిన 22,000 మంది బాలభటులు పాల్గొన్నారు. ఆసియా దేశాల స్కౌట్ జంబూరీ హైదరాబాదులో 1987లో జరిగింది. బాలురకు బాలభట వ్యవస్థ ఉన్నట్లే బాలికలకు బాలిక భటవ్యవస్థ (గర్ల్‌గైడ్స్) ఉంది. (చూ. బేడెన్‌పవెల్)

## బిందుసారుడు

మగధవంశపు రాజు. మౌర్యచంద్రగుప్తుడి కుమారుడు. భారతదేశ చరిత్రలో సుప్రసిద్ధుడైన అశోక (చూ.) చక్రవర్తి తండ్రి. ఈయన క్రీ.పూ 297 నుంచి 272 వరకు మగధ రాజ్యాన్ని పరిపాలించాడు. అప్పుడు అశోకుడు యువరాజుగా ఉండి తక్షశిల లోనూ, ఉజ్జయిని లోనూ రాజప్రతినిధిగా వ్యవహరించేవాడు. బిందుసారుడికి 'అమిత్ర ఘాత' (శత్రుసంహారి) అనే బిరుదు ఉన్నట్లు తెలుస్తూంది.

## బిపిన్ చంద్రపాల్ 1858–1932

లాల్ నాయకత్రయంలో (బాల్–పాల్–లాల్) మధ్యముడు. బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయ్ (చూ.) భారత స్వాతంత్ర్య సమర యోధుడు. కాంగ్రెసు (చూ.)లో అతివాద పక్షానికి నాయకత్వం వహించేవాడు. మహావక్త. బెంగాల్ విభజన సమయంలో తన ప్రజ్ఞాపాటవాల్ని ప్రదర్శించి వెలుగులోకి వచ్చాడు. స్వదేశీ ఉద్యమాలకు నాయకుడు. స్వరాజ్యం బ్రిటిషు వారు కనికరించి ఇచ్చే కానుక కాదు. దానికోసం పోరాటం సల్పి దక్కించుకోవాలని ఎలుగెత్తి చెప్పేవాడు.



'న్యూఇండియా','వందేమాతరం' పత్రికల్లో వ్యాసాలు వ్రాసేవాడు. తిలక్ కంటె ఘటికుడు. పాల్ స్వతహాగా మతాభిమాని. పైగా అతనికి కొన్ని సమ్మోహన, ఆకర్షణ శక్తులుకూడాఉండేవి. ఆయన గంభీరోపన్యాసాలు చేసి ప్రజల్ని ప్రభావితం చేయడంలో కృతకృత్యుడయ్యేవాడు. రాజకీయ ఉద్యమాల్లో పాల్గొని అనేకసార్లు కారాగారవాస శిక్షలు, అనుభవించిన ధీశాలి పాల్. 1858లో పుట్టిన బిపిన్ చంద్రపాల్ 1932లో కీర్తిశేషుడయ్యాడు.

## బిస్మార్క్ 1815–98

జర్మన్ రాజనీతి వేత్త. దౌత్యవేత్త. యుద్ధనీతి పారంగతుడు. జర్మనీ సామ్రాజ్యానికి సృష్టికర్త. పూర్తి పేరు ఓటో ఎడ్వర్డ్ లియోపాల్డ్ ఫాన్ బిస్మార్క్. జుంకర్ కుటుంబానికి చెందినవాడు. 1859–62 మధ్య సెయింట్ పీటర్స్ బర్గ్‌లో ప్రష్యా రాయబారిగా ఉన్నప్పుడూ, తరువాత 1862లో పారిస్ దౌత్యప్రతినిధిగా ఉన్నప్పుడూ యూరప్‌లోని రాజకీయ స్థితిగతులను కూలంకషంగా అధ్యయనం చేశాడు. తరువాత బెర్లిన్ తిరిగి వచ్చి అధ్యక్షుడు (ఛాన్సలర్) అయ్యాడు. 1866లో కోనిగ్రాజ్ యుద్ధంలో ఆస్ట్రియాను ఓడించి ష్లెజ్‌విగ్ – హూల్‌స్టయిన్ ప్రాంతాన్ని కలుపుకున్నాడు. ఫ్రాంకో – ప్రష్యా (1870) యుద్ధం కూడా గెలిచాడు. ఆ విధంగా ఆయన హయాంలో జర్మనీ అంతా ఐక్యమయింది. తరువాత 1884లో వలస విధానాన్ని రూపొందించి అమలు పరిచాడు. 1888లో చక్రవర్తి అయిన విలియమ్‌II బిస్మార్క్ ప్రతిభను గుర్తించలేకపోవడంతో 1890లో ఛాన్సలర్ పదవి నుంచి వైదొలగవలసి వచ్చింది.

## బీజాపురము

దక్కన్ ప్రాంతంలో 15వ శతాబ్దంలో వంద సంవత్సరాల పాటు మహావైభవం అనుభవించిన పట్టణం బీజాపురం. ఆలీ ఆదిల్‌షా పాలనలో నూతన కట్టడాలతో ఈ పట్టణం రూపొందగా తర్వాత పాలించిన ఇబ్రహీం ఆదిల్‌షా, మహ్మద్ ఆదిల్‌షా భవన నిర్మాణ పథకాలను కొనసాగించెను. 1686లో ఔరంగజేబు ఈ పట్టణాన్ని స్వాధీనం చేసుకోగా, 1818లో మహారాష్ట్రులు దీనిని ఆక్రమించారు. 1848లో బ్రిటిష్ వారి స్వాధీనమైంది. ఇక్కడి ప్రఖ్యాతమైన భవనం గోల్ గొంబాజ్. ఇది మహ్మద్ ఆదిల్‌షా గోరీ. పై కప్పు గోళాకారంగా ఉంటుంది. ఇది ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కట్టడం. బీజాపుర భవనంలో ఏర్పాటైనా శబ్దగ్రహణ చాతుర్య నిర్మాణం వల్ల ఎంత నెమ్మదిగా మాట్లాడినప్పటికీ అది

భవనమంతా వినిపిస్తుంది. కోటగోడల మీద, తుపాకి ఫిరంగులను పేల్చుటకు వీలుగా నిర్మించిన కట్టడాలు ఎంతో సొంపుగా ఉన్నాయి. మేహల్‌మహల్, జుమ్మా మసీదు ఇక్కడ ప్రధానంగా చూడదగిన ఇతర స్థలాలు.

## బీహారు రాష్ట్రం

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. ఇది పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు మధ్య ఉంది. ఉత్తరాన హిమలయ పర్వతాల (నేపాల్) వరకూ ఈ రాష్ట్రం విస్తరించి ఉంది. దీనికి సముద్ర తీరం లేదు. అసలు బీహార్ అనే పదం 'విహార' అనే పదానికి భ్రష్టరూపం. ఈ రాష్ట్రం ప్రకృతి వైపరీత్యాలకు సదా గురిఅవుతూ ఉంటుంది. గంగానది, గండకీనది, సరయూనది వంటి హిమనదులు బీహారు రాష్ట్రానికి తరుచు వరద బీభత్సం కల్పిస్తూ ఉంటాయి. ఉత్తర బీహారులో మైదానాలూ, దక్షిణ బీహారులో అడవులూ కొండలూ ఎక్కువ. ఛోటానాగపూర్, సంతాల్ పరగణాల ప్రాంతంలో పర్వత శిఖరాలున్నాయి. బీహారు గత వైభవం ఉజ్జ్వలమైంది. మౌర్య చక్రవర్తులు, అశోకుడు ఏలిన ప్రాంతం ఇది. నాటి మగధ సామ్రాజ్యానికి పాటలీపుత్రం (నేటి పాట్నా) రాజధాని. మగధ రాజ్యం క్షీణించిన తరువాత తిరిగి షర్షా పాలనలో పాట్నా పునరుద్ధరింపబడినది. ఈ బీహారు బ్రిటిష్ పాలన ఆరంభంలో బెంగాల్ ప్రెసిడెన్సీలో అంతర్భాగంగా ఉండి 1936లో ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది.




విస్తీర్ణం: 1,73,877 చ.కి.మీ.; జనాభా: 6,99, 14,734(1981); రాజధాని: పాట్నా; అధికార భాష: హిందీ. ప్రజలు భోజపురీ అనే మాండలి కాన్ని మాట్లాడతారు. వరి, గోధుమ, మొక్కజొన్న,అపరాలు, బంగాళ దుంప, చెరకు, నూనె గింజలు, పొగాకు, జ్యూట్‌నార, పంట దినుసులు. కలప, బీడీ ఆకు (కెందూ), లక్క, కుసుమ, కరంజా, మాహువాగింజలు, బంక, సాల్ విత్తులు అడవులనుంచి లభించే ఉత్పత్తులు. భారతదేశంలో ఖనిజసంపద ఎక్కువగా ఉన్న రాష్ట్రం బీహారు. నేలబొగ్గు, ఇనుప రాయి ఖనిజాలు ఆధారంగా జమ్‌షెడ్‌పూర్ (1900), బొకారో (1980) పట్టణాలలో భారీ ఉక్కు కర్మాగారాలు వెలసి పనిచేస్తున్నాయి. రాంచీ పారిశ్రామిక కేంద్రం. బీహారు రాష్ట్రంలో చారిత్రక ప్రసిద్ధిగల స్థలాలు చాలా ఉన్నాయి. రాజగృహ, బుద్ధగయ, నలందా, సుసరామ్, వైశాలీ, భీమ్ బంధు ముఖ్యమయినవి. గౌతమబుద్ధుడు బుద్ధగయలోని రావిచెట్టు క్రింద ధ్యానముద్రలో ఉన్నప్పుడే జ్ఞానోదయం సాధించాడు. నలందా ప్రాచీన విద్యాపీఠం. బౌద్ధ ఆరామాలు, మఠాల అవశేషాలు ఈ రాష్ట్రంలో చూడవచ్చును. **బీహారు రాష్ట్రంలో** ప్రాచీన లిచ్ఛవీ రాజ్యకేంద్రం వైశాలి. రాష్ట్ర రాజధాని పాట్నా పురాతన పాటలీ పుత్ర నగరం. ఢిల్లీ సుల్తాను షర్షా సూరి సమాధి, ససరామ్‌లో ఉంది. హజారీబాద్, జిట్లా, జాతీయ పార్కులు, అభయారణ్యాలు ఈ రాష్ట్రంలో దర్శించదగ్గ స్థలాలు. (చూ. గయ, గౌతమ బుద్ధుడు)

## బురుండీ

తూర్పు ఆఫ్రికాలోని ఒక చిన్నగణరాజ్యం. 1962లో స్వాతంత్ర్యం సిద్ధికి పూర్వం ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వానికి లోబడి బెల్జియమ్ పాలనలో 'రువాండా—ఉరుండీ'గా ఉండేది. టాంజేనియా, జెయిరీ, రువాండా దేశాలు బురుండీకి సరిహద్దులు.

విస్తీర్ణం: 27,834 చ.కి.మీ., జనాభా: 51,31, 000 (1988); రాజధాని: బుజుంబూరా; అధికార భాషలు: రుండీ, ఫ్రెంచ్. ప్రజలలో రుండీ తెగవారు 97 శాతం, హూట్టూ, టూట్సీ త్వాపిగ్మీ ఇతర ఉపజాతులు. ప్రజలు క్రైస్తవమతం, ఆదిమ మతాలూ అనుసరిస్తారు.

నైర్రుతిగా టాంగన్యీకా సరస్సు, ఈశాన్యంగా కోహోహో సరస్సు, రువేరు సరస్సు, రుసిజీనది, రువిరోన్జీనది, రూవూబూనది ప్రధాన జలాధారాలు. ఈ దేశంలోని రొన్వానది నైలునదికి ప్రాదుర్భావస్థానం. అరటి, చిరుగడం, కర్రపెండలం, కందమూలాలు, వేరుసెనగ, చిరుధాన్యాలు, పామ్‌గింజలు, ప్రత్తి ప్రధాన మయిన వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ, కోళ్ళ పెంపకం,

## బెర్ముడా

ఉత్తరాన అట్లాంటిక్‌లోని 300కి పైగాఉన్న పగడపు దీవుల సముదాయం. న్యూయార్క్‌కి సుమారు 1000 కి.మీ. దూరంలో ఇవి ఉన్నాయి. ఒకప్పుడు బ్రిటిష్ వలస రాజ్యంగా ఉన్న బెర్ముడా ఇప్పుడు బ్రిటిష్ అసోసియేట్ రాజ్యంగా ఉంటూ అంతర్గత స్వపరిపాలన సాగించుకుంటూంది.

విస్తీర్ణం: 54 చ.కి.మీ.,; జనాభా: 58,300 (1988), రాజధాని: హామిల్టన్; అధికార భాష: ఇంగ్లీష్. ప్రజలు క్రైస్తవులు. ఎక్కువమంది నీగ్రోలు. కొంతమంది ఇంగ్లీషువారు, పోర్చుగీసువారు కూడా ఉన్నారు. కాయగూరలు, ఈస్టర్, లిల్లీ పుష్పాలు, అరటిపండ్లు, నారింజ పండ్లు సాగుచేసి ఎగుమతి చేస్తున్నారు. ఆహార పదార్థాలు దిగుమతి చేసుకుంటారు. వినోద పర్యాటకులకు చక్కని విహారస్థలం.

## బెలిజీ

మధ్య అమెరికాలోని స్వతంత్రదేశం (1981). పూర్వం దీనిని బ్రిటిష్ హోండూరాస్ అనేవారు.

విస్తీర్ణం: 22,965 చ.కి.మీ., జనాభా: 1,78, 000 (1988), రాజధాని: బెల్మోపాన్ (పాత రాజధాని బెలిజీసిటీ 1963లో సంభవించిన పెనుతుఫానులో నాశనమయింది). అధికార భాష: ఇంగ్లీష్. ప్రజలు క్రైస్తవులు. ఇంగ్లీష్ భాష మాట్లాడే నీగ్రోలు 40 శాతం. వీరిని 'క్రియోల్స్' అంటారు. మెస్టిజోలు 33 శాతం మాయన్ ఇండియన్‌లు, కెకుచీ, గారిఫూనా తెగల వారున్నారు. ఈదేశం నిమ్మ, నారింజ జాతిపండ్లను విశేషంగా పండించి ఎగుమతి చేస్తూంది. చెరకు, గ్రేప్‌ఫ్రూట్, కొబ్బరి ఎగుమతి పంటలు. నారింజరసం తీసి చిక్కగా అయ్యేట్టుచేసి ఎగుమతి చేస్తారు. కలప కూడా ఎక్కువగా లభిస్తుంది. ఆహార పదార్థాలు దిగుమతి చేసుకుంటారు.

## బెల్జియం

యూరప్ ఖండంలోని చిన్న దేశాలలో ఒకటి. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలిస్తున్న దేశం. నార్త్ సీని ఆనుకొని 66 కి.మీ. సముద్రతీరం ఉంది.

విస్తీర్ణం: 30,518 చ.కి.మీ.; జనాభా: 98,65, 000. (1988); రాజధాని బ్రసెల్స్; అధికార భాష: డచ్, ఫ్రెంచ్. ప్రజలు క్రైస్తవులు. ఆంట్‌వెర్ప్ రేవు పట్టణం. లిగాజ్, నాల్‌సెయింట్, చార్లెరోయి పారిశ్రామిక కేంద్రాలు. ఘెంట్, లవువెయిన్, లీగే ప్రముఖ పట్టణాలు.

ఉత్తర ప్రాంతాన్ని 'ఫ్లాండర్స్' అంటారు. సారవంత మయిన బంకమన్ను నేలలలో సేద్యం జరుగుతోంది. పల్లపు మైదానాలను 'పోల్డర్లు' అంటారు. డైకులు సహాయంతో సముద్రపు ఆటుపోటుల్ని అరికడతారు. మధ్య మైదానాలు కూడా సారవంతమయినవే. లీ నది, మాసీ నది, సాంబ్ర్ నది, జేర్త్ నది, సమోలా నది, బెల్జియమ్‌కు ప్రధాన జలాధారాలు. సాగునీటి సమస్యలేదు. గోధుమ, ఓట్ ధాన్యం, బీటు (పంచదార) దుంపలు, ఫ్లాక్స్, రై ధ్యానం, హెంప్‌నార, చికోరీ సాగుపంటలు. బంగాళాదుంపలు ముఖ్యమైన ఆహారపంటలు. ఈ దుంపలనుంచి సారాయిని కూడా ఉత్పత్తి చేస్తారు. జింకు, మార్బుల్‌రాయి, స్లేట్‌క్వారీలు కూడా ఉన్నాయి. కాడ్, హెర్రింగ్, ఆయిస్టర్ చేపలు ఎక్కువ. ఓస్టెండ్ మత్స్యపరిశ్రమ కేంద్రం. పారిశ్రామికంగా బెల్జియం విశేష ప్రగతిని సాధించింది. యూరప్‌కే కర్మాగారమన్న ప్రసిద్ధి పొందింది. ఇనుప ఖనిజాలు, నేలబొగ్గు సరిపడేంత లేనందువల్ల వీటిని దిగుమతి చేసికొని కర్మాగారాలు నడుపుతున్నారు. గాజు పరిశ్రమ ప్రముఖమయింది. జవుళీ, సంగీత పరికరాలు (పియానో, ఆర్గాన్), కలప సామగ్రి, తోలు వస్తువులు, మార్గరీన్, వినిగార్, పంచదార (బీటు), కిటికీలకు రంగు గాజు పలకలు, వజ్రాలను సానపెట్టడం, సారాబట్టీలు ప్రధాన మయిన పరిశ్రమలు.

## బేడెన్—పవెల్ 1857–1941

బాలభట ఉద్యమాన్ని వ్యవస్థాపించిన మహనీయుడు. పూర్తిపేరు రాబర్ట్ స్టీఫెన్సన్ స్మిత్ బేడెన్—పవెల్. ఈయన బ్రిటిషు సైన్యంలో సైనికుడుగా ఉండేవాడు. బ్రిటిషు బాలలకు వ్యాయామంలో శిక్షణ, బహిరంగ ప్రదేశాల్లో జీవనశైలి అవసరమని తన సైనికానుభవంలో తెలుసుకొన్నారు. ఈ అనుభవం బాలభట (బాయ్ స్కౌట్) వ్యవస్థను 1907లో ఇంగ్లండ్

లో ప్రారంభించడానికి దారితీసింది. రెండేళ్ల తరువాత తన సోదరి ఆగ్నిస్ బేడెన్ పవెల్ సహాయంతో ఇంగ్లండ్ బాలికభట వ్యవస్థ (గర్ల్‌గైడ్)ను ప్రారంభించాడు. క్రమంగా ఈ బాలభట ఉద్యమం ప్రపంచదేశాలలో వ్యాప్తి చెందడంతో బేడెన్–పవెల్ ఉద్యమానికి ప్రముఖ నాయకుడయ్యాడు. 'బాలభట వ్యవస్థ' పైన, 'సైనిక దండయాత్ర'ల పైన రచనలు కూడ చేశాడు.

బేడెన్ పవెల్ లండనులో 1857లో జన్మించాడు. 1876లో బ్రిటిషు సైన్యంలో చేరి భారతదేశం, ఆఫ్ఘనిస్తాన్, దక్షిణ ఆఫ్రికా దేశాలలో పనిచేశాడు. దక్షిణ ఆఫ్రికాలో బోయర్ యుద్ధ (1899–1902) సమయంలో ఒకవైపు కాటక పరిస్థితులు మరొక వైపు తన సైన్యంలో చాలామంది వ్యాధి గ్రస్థులు అయినా మేఫ్‌కింగ్‌ను రక్షించడం బేడెన్ పవెల్ ప్రదర్శించిన ప్రతిభాపాటవాలకు మెచ్చి ఆయనకు మేజర్ జనరల్ స్థాయి ఇచ్చి గౌరవించారు. (చూ. బాలభటవ్యవస్థ) బేడెన్ పవెల్ శిలావిగ్రహం హైదరాబాద్‌లోని దోమలగూడాలో రాష్ట్ర బాలభట కార్యాలయం ఎదుట ప్రతిష్ఠింప బడినది.

## బైబిలు

క్రైస్తవుల పవిత్ర మతగ్రంథం. దీనికి 'ది బుక్' అని మరొక పేరు(చూ. క్రైస్తవం). వాస్తవానికి బైబిలు అంటే గ్రీక్ భాషలో 'బుక్' లేదా 'గ్రంథమ'ని అర్థం. జూడాయిజమ్ క్రైస్తవానికి సంబంధించిన పవిత్ర రచనలు ఇందు పొందుపరప బడ్డాయి. బైబిలు పాత నిబంధనను (ఓల్డ్ టెస్టామెంట్) యూదులు పాటిస్తారు. కొత్త నిబంధన బైబిలును క్రైస్తవులు పాటిస్తారు. ఇందు మాథ్యూ, మార్కు, లూకా ప్రవక్తలు ప్రవచించిన ఆధ్యాత్మిక భావాలను సువార్తలుగా రూపొందించి ప్రచారం చేస్తున్నారు. జాన్ సువార్త ఆఖరిదని చెబుతారు. బైబిలు ప్రపంచ భాషలన్నింటిలోకి అనువదింపబడినది. ఒక లెక్క ప్రకారం 250 పూర్తి అనువాదాలు, 1130 పాక్షిక అనువాదాలు ఉన్నట్లు తెలుస్తున్నది.

బైబిలు పురాతనత్వం క్రీ.పూ 5500 వరకు వెళ్లింది. అయితే క్రీ.శ.1100–1300 మధ్య మాత్రమే ఇటాలియన్ స్పెనిష్, జర్మన్, ఇంగ్లీషు బైబిలు పాఠాలు వెలువడ్డాయి. క్రీ.శ. 522–534 మధ్య లూథర్ కొత్త నిబంధనను పరిష్కరించాడు. గూటెన్‌బర్గ్ 15వ శతాబ్దంలో ముద్రణ రూపొందించిన తర్వాత బైబిలు ప్రచారం ముమ్మరమైంది. బైబిలు గ్రంథం అత్యంత ప్రచారములో ఉన్న గ్రంథంగా పేర్కొనబడుతున్నది. తెలుగుభాషలో బైబిలు శ్రీరాంపురం 'నూరుజ్ఞాన వచనాలు'గా 1746–47లో ప్రచురింపబడినది. దీని తోనే తెలుగులో ముద్రణ ఆరంభమయింది. 1973లో, కకుడ్ 'బైబిలు' ప్రామాణిక కూర్పును పూర్తిచేసి ప్రచురించారు. 'సర్వేజనో సుఖినోభవన్తు' సర్వమానవ కళ్యాణమే బైబిలు రచనలోని ఇతివృత్తం.

## బొంబాయి

మహారాష్ట్ర రాజధాని. పశ్చిమ భారతదేశంలో అరేబియా సముద్రాన్ని ఆనుకుని ఒకదీవి మీద ఉన్న బొంబాయి భారతదేశంలోని మహానగరాలలో పెద్దది. దేశంలో సుప్రసిద్ధ వాణిజ్య కేంద్రం. భారతదేశపు మొత్తం అంతర్జాతీయ వ్యాపారంలో సగంపైగా బొంబాయి మీదుగానే జరుగుతుంది. గుజరాత్ సుల్తాను ఈ ప్రాంతాన్ని 1534లో పోర్చుగీస్‌వారికి దత్తం చేయగా వారు ఒక కోటను నిర్మించారు. 1661లో బ్రగాంజా యువరాణి కేతరిన్‌ని ఇంగ్లండ్ చక్రవర్తి ఛార్లెస్ II వివాహమాడగా స్త్రీధనంగా బ్రిటిష్‌వారి అధీనంలోకి వచ్చింది. తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీకి కౌలుకు ఇవ్వబడింది. 1834లో మొదటి జవుళీ మిల్లు స్థాపించబడింది. అప్పుడే సూయజ్ కాలువ ఏర్పడడంతో నౌకావాణిజ్యం ఈవైపు జోరుగా సాగనారంభించింది. భారతదేశంలో అత్యధిక పారిశ్రామికాభ్యుదయం చెందిన నగరం బొంబాయి. జవుళీ పరిశ్రమ, మోటారుకార్లు, రసాయనిక ద్రవ్యాలు, గాజు, తైలశోధన, కాగితం, తోలు,



బొంబాయి సమీపమున ఉన్న ట్రాంబేలోని పరమాణుశక్తి పరిశోధన కేంద్రము, గోపురము – సిరస్ అనబడు అటామిక్

ఫర్నిచర్, ఆహారపదార్థాలు, ప్లాస్టిక్స్, ఎలక్ట్రానిక్స్, టి.వి.సెట్లు, ఎలక్ట్రానిక్ పరికరాలు, పెయింట్లు, సైకిళ్లు యంత్రసామగ్రి మున్నగు భారీ, మధ్యతరహా, చిన్నతరహా పరిశ్రమలు నెలకొని ఆర్థిక వ్యవస్థను ఇనుమడింపచేస్తు న్నాయి. భారతదేశంలో సినిమా పరిశ్రమ ప్రారంభ (1920–30) కాలంనుండీ బొంబాయి చలనచిత్ర పరిశ్రమకు ప్రసిద్ధి గాంచింది. జనసాంద్రత ఎక్కువగా గల బొంబాయి దీవి మధ్యభాగంలో కర్మాగారాలు ఎక్కువగా ఉన్నాయి. జనం కిక్కిరిసి ఉండే బొంబాయి ప్రజాజీవన శైలి ద్రుతి ఎక్కువగా గోచరిస్తుంది. రైలు—రోడ్డు రాకపోకలు, రవాణా సౌకర్యాలు సువ్యవస్థీకృతమై ఒక మూలనుండి మరొక మూలకు శీఘ్రగతిని చేరుటకు సమపాయాలు చేశారు. బొంబాయిలో బాబా అటమిక్ రిసెర్చి సెంటర్ (పరమాణు పరిశోధన కేంద్రం)ఉంది. మ్యూజియమ్‌లు, ఆర్ట్ గ్యాలరీలు, క్రీడాంగణాలు (స్టేడియా) పెక్కు గలవు. మహాలక్ష్మి దేవళం, సిద్ధి వినాయకుని గుడి భక్తజనాల్ని ఆకర్షిస్తున్నాయి. 8వ శతాబ్దికి చెందిన ఎలిఫెంటా గుహలు పది కిలోమీటర్ల దూరంలో ఉన్న దీవిపై **ఉన్నాయి.** ఈ గుహలు శిల్ప కళా ఖండాలకు ప్రసిద్ధి. బొంబాయి మహానగరం జనాభా (శివార్లు కలుపుకుని) 82,43,405 (1981) ఉంది. (చూ. మహారాష్ట్ర)

## బొలీవియా

**ద**క్షిణ అమెరికాలోని స్వతంత్ర గణరాజ్యం. దక్షిణ అమెరికాలో స్పెయిన్ ఆధిపత్యంలో సతమతమవుతున్న పలుదేశాలు స్వతంత్రం కావడానికి కారకుడయిన స్వాతం త్ర్య సమరయోధుడు సైమన్ బోలివర్ (1825)స్మృతి చిహ్నంగా ఈదేశానికి 'బోలీ వియా'అనే పేరుపెట్టారు. ఇది ఒకప్పుడు 'ఇన్కా' రెడ్ ఇండియన్‌లకు స్థావరం.



విస్తీర్ణం: 10,98,581 చ.కి.మీ.; జనాభా: 69,93, 000(1988), రాజధాని: లాపాజ్; అధికార భాష: స్పానిష్, ప్రజలు క్రైస్తవులు.

మామోరీనదికి ఉపనదులు మాద్రేడె డిమోస్ నది, బెనీనది, సామిగ్వేయినది, బొలీవియా దేశంలోని ప్రముఖ జలాధారాలు. కోకో, కాఫీ, మొక్కజొన్న, వరి, చెరకు, ప్రత్తి ప్రధానమయిన సాగుపంటలు. ఆండీస్ పర్వత ప్రాంతాలలో బిస్మత్తు ముఖ్య ఖనిజ సంపద. ఆంటిమనీ, రాగి, బంగారం, సీసం, వెండి, టంగ్‌స్టన్, తైల నిక్షేపాలు బొలీవియా ఆర్థికవ్యవస్థకు దోహదం చేస్తున్నాయి. అడవులలో 2000 రకాల చెట్లున్నాయి. ఇందులో క్యాబ్రాచో కలప, రబ్బరు లాభసాటి వృక్షాలు. నదుల్లోనూ, ఏరుల్లోనూ చేపలు విరివిగా లభిస్తున్నాయి. రాజధాని లాపాజ్‌లోని తియాహూనాకో మ్యూజియం చూడదగింది.

## బోత్స్వానా

**ఆ**ఫ్రికాఖండం దక్షిణ భాగంలో తూర్పున, దక్షిణాన దక్షిణాఫ్రికా, పశ్చిమాన నమీబియా, ఉత్తరాన జింబాబ్వే సరిహద్దులుగా ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యం. 1966కు ముందు దీనిపేరు బెచువానా లాండ్.

విస్తీర్ణం: 5,81,730 చ.కి.మీ.; జనాభా: 12, 11,000 (1988); రాజధాని: గాబోరోనే; అధికార భాష: ఇంగ్లీషు; బోత్స్వానా ప్రజలు ఆదిమ జాతులవారు. ఇందులో త్స్వానా 75 శాతం, షోనా 12 శాతం, శాన్ 4 శాతం, ఖొయిఖొయిన్ (హాటెన్‌టాట్) 3శాతం ఉన్నారు. ఆదిమమత విశ్వాసాలను అవలంబించేవారు 50 శాతం. మిగతావారు క్రైస్తవం పాటిస్తున్నారు.

కలహారీ ఎడారి ఈదేశం అంతా వ్యాపించి ఉంది. ఉత్తరంలో అంగోలా దేశంనుంచి ఓకోవాన్గోనది న్గామి లాండ్ ప్రాంతంలోకి పారుతూంది. నిద్రావ్యాధిని సంక్రమింప చేసే ట్సేట్సీ ఈగల బెడదకు జడిసి ఈ ప్రాంతంలో ఎవరూ నివసించడానికి ఇష్టపడరు. బొబ్బర్లు, మొక్క జొన్న, చిక్కుళ్ళు, ప్రత్తి, జొన్న, వేరుసెనగ, చిరుధాన్యాలు, పొగాకు ప్రధానమయిన పంటలు. గొడ్డుమాంసం కోసం పశువుల పెంపకం ఎక్కువ. మేకలను కూడా పెంచుతారు. రాగి, ఆస్బెస్టాస్, వజ్రాలు, నికెల్, నేలబొగ్గు, మాంగనీస్ ఖనిజ నిక్షేపాలు లభిస్తున్నాయి. పరిశ్రమలు తక్కువ. ఈ దేశంలోలభించే వజ్రాలను త్రవ్వితీసి విదేశీ ద్రవ్యాన్ని ఆర్జిస్తున్నారు.

## బోస్టన్ టీ పార్టీ

అమెరికన్ విప్లవానికి దారి తీసిన ప్రముఖ సంఘటన. బ్రిటిషు వలసాధిపత్యాన్ని నిరసిస్తూ అమెరికాలోని ప్రజలు జరిపిన పోరాటం. అమెరికా విప్లవం పూర్వరంగంలో ఈ సంఘటన పేర్కొనదగినది.1767 లో బ్రిటిష్ ప్రభుత్వంవారు తేయాకు (టీ)పై వాణిజ్య సుంకం విధించారు. ఇందువల్ల అమెరికాలోని స్థానిక వర్తకులు నష్టాలకు గురిఅయేవారు. అప్పుడు వర్తకులు ఆందోళనలు చేయడం ప్రారంభించారు. 1773లో బ్రిటిష్ వైఖరి తీవ్రతరం చేయగనే అమెరికాలో వర్తకులు నిరసన ప్రదర్శనలు తీవ్రతరం చేశారు. ఆ సందర్భంలోనే వర్తకులు 'బోస్టన్ టీ పార్టీ' ప్రదర్శన నిర్వహించారు. ఆ సమయంలో అమెరికాలోని బోస్టన్ హార్బరులోనికి తేయాకు పెట్టెలతో బ్రిటిష్ నౌకలు ప్రవేశించాయి. అక్కడికి 700 మంది అమెరికన్ వర్తకులు ఆ నౌకలు హార్బరునుంచి వెనుకకు పంపివేయమని కోరారు. వారు వినలేదు. అదే అదను చూచుకుని అమెరికన్ వర్తకులు రెడ్ ఇండియన్ వేషధారణలో నౌకలపైకి విజృంభించి పెట్టెలలోని తేయాకును సముద్రంలో ఎత్తిపోశారు. ఇదీ బోస్టన్ టీ పార్టీ కథ.

ఈ సంఘటన జరిగిన దాదాపు రెండేళ్లకు 1775 ఏప్రిల్ 19న అమెరికాలోని ప్రజలు స్వాతంత్ర్య పోరాటం ప్రారంభించారు. ఈ పోరాటం 8 ఏళ్లు జరిగింది. అమెరికాలోని తూర్పు వైపున ఉన్న 13 వలస రాష్ట్రాలలోని ప్రజలు పాల్గొన్నారు. అంతకుముందు పదేళ్లు ప్రచ్ఛన్న పోరాటం సాగి ఆ రోజు (ఏప్రిల్ 19) లెక్సింగ్‌టన్ (మాస్)లో తీవ్ర రూపం దాల్చింది. 1773 జూలై 3న వాషింగ్ టన్ కాంటినెంటల్ ఆర్మీకి దళాధిపతి అయ్యాడు. 1776 మార్చి 3న బ్రిటిష్ వారు బోస్టన్‌ను ఖాళీ చేసి వెళ్లిపోయారు. 1776 జూలై 4న స్వాంతంత్ర్య ప్రకటన (డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్) ఆమోదించారు. 1776 జనవరి 3న వాషింగ్‌టన్ ప్రిన్స్ టన్‌ను కైవసం చేసుకున్నారు. సెప్టెంబరు 26న బ్రిటిష్ సైన్యం ఫిలిడెల్ఫియాను ఆక్రమించారు. 1782 జూలై 11న బ్రిటిష్ సైన్యం సవన్నాను ఖాళీ చేశారు. నవంబరు 20న బ్రిటిష్‌వారు అమెరికన్ వారు పారిస్‌లో సమావేశమై మొదటి శాంతి సంధి (పీస్ ట్రీటీ) చేసుకొన్నారు. 1783 సెప్టెంబరు 31న పారిస్ తుది శాంతి సంధి చేసుకున్నారు. 1783 నవంబరు 25న బ్రిటిష్ సైన్యం పూర్తిగా న్యూయార్క్‌ను విడిచి పెట్టడంతో విప్లవం ముగిసింది. జాన్ ఆడమ్స్, బెంజమిన్ ఫ్రాంక్లిన్, తామస్ జెఫర్‌సన్, తామస్ పెయినీ వంటి అమెరికన్ రాజకీయ నాయకులు పాల్గొన్నారు. బ్రిటిష్ తరపున హెర్డ్, నార్త్, జార్జ్ III, ఎడ్మండ్‌బర్క్ పాల్గొన్నారు. అమెరికన్ విప్లవం ఒక విధంగా యూరపియన్ వలసాధిపత్యానికి విరుగుడుగా పనిచేసింది. యునైటెడ్ స్టేట్స్‌లో అంకురించి 1789 లో వాషింగన్‌టన్ అధ్యక్షతన మొదటి ప్రజాస్వామ్య ప్రభుత్వం నెలకొన్నది.

1789లో అమెరికన్‌లు సాధించిన స్వేచ్ఛాయుత ప్రజాస్వామ్య విజయానికి స్మారక చిహ్నంగా దాదాపు వందేళ్ల తరువాత 1886లో ఫ్రెంచివారు 'స్వేచ్ఛా వనిత విగ్రహాన్ని బహూకరించారు. అదే న్యూయార్కు హార్బరు సమీపంలో ప్రతిష్ఠింపబడిన 'స్టేట్యూ ఆఫ్ లిబర్టీ' (చూ.). (చూ. వాషింగ్‌టన్, జెఫర్‌సన్, లింకన్, రూజ్‌వెల్ట్, కెనడీ, బుష్) ఇటీవల 1976లో అమెరికన్ విప్లవం ద్విశత జయంతి జరుపుకున్నారు.

## బౌద్ధం

గౌతమ బుద్ధుడు (చూ.) క్రీ.పూ. 6వ శతాబ్దిలో భారతదేశంలో వ్యవస్థాపించిన మతం. మొదట భారతదేశంలో ప్రచారం పొందినది. క్రి.పూ 269–232 మధ్య భారతదేశాన్ని పాలించిన అశోక (చూ.) చక్రవర్తి అండతో ఆగ్నేయాసియాలోని పలుప్రాంతాలకు ముఖ్యంగా శ్రీలంక, బర్మా, ఇండోనీషియా, కంపూచియా, తాయిలాండ్, తూర్పు ఆసియాలోని చీనా, జపాన్, టిబెట్టు దేశాలకు వ్యాపించింది. ఇప్పటికీ ఆయా దేశాల్లో ప్రజల మతంగా కొనసాగుతూనే ఉంది.

కోరికలు వాంఛలతో కూడిన మానవ జీవితం కడు బాధకరమయినదనీ ఈ బాధలకు మూలం అవిద్య అనీ బౌద్ధం బోధిస్తుంది. మానవుడు ఈ జనన—మరణ చాక్రిక అవస్థలనుండి విముక్తి పొందడానికి జ్ఞానమార్గమొక్కటే సులువైన మార్గమని బౌద్ధ ధర్మసూత్రాలు సూచిస్తాయి.

మంచి భావన, మంచి భాషణ (మాట), మంచి కృషి, మంచి జీవనం, మంచి ధ్యానం, మంచి నిర్ణయం, మంచి నడత, ఆత్మపరిశీలనం వంటి అపురూపమగు అష్టాంగ మార్గాలు మానవుని కష్టాలు ఛేదించే మార్గాలని బౌద్ధం బోధిస్తాంది.ఇదే మానవుని సుఖ జీవనానికి మార్గమని ఆ మతబోధ. కంపూచియా, శ్రీలంక, బర్మా, తాయిలాండ్ దేశాల్లో ఇప్పటికే ఉన్న హీనయానమనబడే తేర వాద బౌద్ధం రెండు శాఖలలో ఒకటి. ఎవరికివారు ప్రతివ్యక్తీ కృషిచేసి వ్యక్తిగతంగానే ముక్తి పొందాలనేదే హీనయాన సారాంశం. చీనా, టిబెట్టు, జపాన్ దేశాలల్లో పాటిస్తున్న ఇక రెండవదయిన మహాయాన శాఖ సూచించే ముక్తిమార్గం ఎంపికచేసుకున్న మతంలో విశ్వాసం ఉంటే చాలునంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధం క్రీ.పూ. 2వ శతాబ్ది మొదలు క్రీ.శ. 7వ శతాబ్ది వరకూ బాగా పోషింపబడినదని తెలుస్తాంది. అమరావతీ (చూ) నాగార్జున కొండ, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గోలి, శాలిహుండం, రామతీర్థం, ఘంటసాల మున్నగు ప్రాంతాల్లో ఈ మత వ్యాప్తికి కేంద్రాలుగా ఉండేవని అచ్చటి బౌద్ధావశేషాలను బట్టి తెలుస్తాంది, మెగస్తనీస్ (క్రీ.పూ. 302)ఫాహియాన్, హుయాన్‌త్స్యాంగ్ ఇత్సింగ్ (క్రీ.శ. 671–695)వంటి యాత్రా చారిత్రుకుల వ్రాతలను బట్టి (630–644) బుద్ధ చరిత్ర వివరాలు తెలుస్తున్నాయి.సాతవాహనుల (చూ.)కాలంలో దక్కనులోబౌద్ధం వ్యాప్తి బాగాజరిగింది.భారతదేశంలో బౌద్ధంక్షీణదశలో (7వ శతా) వజ్రయానశాఖ అవతరించింది. లామాయిజమ్(టిబెట్టు,మంగోలియా),జెన్ బౌద్ధం (జపాన్)ఇతరశాఖలు.

## బ్రహ్మ

హిందువుల ప్రధాన దేవతలలో ఒకడు బ్రహ్మ. త్రిమూర్తులలో ఈయన మొదటివాడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను 'త్రిమూర్తులు (చూ.) అంటారు. సృష్టి చేయడం బ్రహ్మపని. సృష్టిని పాలించే పని విష్ణువు చేసే పని, లయంచేసే పనిని ఈశ్వరుడూ నిర్వర్తిస్తారు. బ్రహ్మనే ప్రజాపతి అని కూడా అంటారు. నాలుగు ముఖాలు గలవాడు గనుక ఈయన చతుర్ముఖుడు. విష్ణుమూర్తి నాభీ కమలంలో నుంచి బ్రహ్మ జన్మించాడు. బ్రహ్మభార్య సరస్వతి (చూ.) ఆమె విద్యాదేవి. బ్రహ్మదేవుని వాహనం హంస.

## బ్రహ్మనాయుడు క్రీ.శ. 12వ శతా.

రాజనీతి వేత్త. రాజకీయ ధురంధురుడు. సౌజన్యమూర్తి, సంఘసంస్కర్త, శాంతికాముకుడు. శివ కేశవుల భేదం పాటించని వైష్ణభక్తుడు. 12వ శతాబ్ది లో ఆంధ్రప్రదేశ్ లోని పల్నాడును పాలించిన హైహయస్థానంలోని మహామంత్రి. కుల,మత విభేదాలనూ,వర్గవైషమ్యాలనూ కూల ద్రోసి 'చాపకూడు' పేర సహపంక్తి భోజనాలను ఏర్పాటుచేసిన మహామనీషి, మానవతావాదీ బ్రహ్మనాయుడు.హరిజనుడైన కన్నమనీని చేరదీసిసొంతబిడ్డగా ప్రేమించి పెంచిపోషించాడు.పల్నాటివీరభారతంలో మరపురాని మానవోత్తముడు.



నలగామరాజు నాగమ్మను మంత్రిణిగా గ్రహించి సవతి సోదరులు మలి దేవాదులకు అపకారం తలపెట్టగా బ్రహ్మనాయుడు మలిదేవాదుల పక్షం వహించి రాజును ఒప్పించి మలిదేవాదులను మాచర్లకు తీసికొనిపోయి రాజ్యం ఏర్పాటు చేశాడు. అందులో తాను మంత్రియై సమసమాజాన్ని నిర్మించడానికి కృషి చేశాడు. కోడి పందేల పేరుతో నాగమ్మ కుట్రపన్ని మలిదేవాదులను అడవుల పాలు చేసింది. బ్రహ్మనాయుడు వారికి అండగా నిలచి రాజకుటుంబంలో సామరస్య సాధనకు కృషిచేశాడు. కాని విఫలుడయ్యాడు. చివరకు ఇరుపక్షాలలోని మహాయోధులు హతులు కాగా పశ్చాతప్తుడయి నలిగామునిరాజుగా చేశాడని పల్నాటి చరిత్రను బట్టి తెలుస్తుంది. (చూ. పల్నాటి వీరచరిత్ర)

## బ్రహ్మపుత్రానది

భారతదేశం ఈశాన్యప్రాంతంలో ప్రవహించే హిమనది. హిమాలయాలలో పుట్టి 1600 కి.మీ. టిబెట్‌లో ప్రవహించి ఆగ్నేయంగా నామ్చాబురావా వద్ద

వంపు తిరిగిన తరువాత దాదాపు 120 ఉపనదులు అక్కడక్కడ దీనిలో కలుస్తాయి. ఆ తరువాత గారో కొండలుదాటి దక్షిణానికి మళ్ళుతుంది. అప్పుడు గోలుందో వద్ద గంగానదిలో సంగమిస్తుంది. 725 కి.మీ. మేర అస్సాం రాష్ట్రంలో ప్రవహిస్తుంది. బ్రహ్మపుత్రానదికి విస్తారమయిన లోయఉంది. అతివృష్టికి గురిఅయే ప్రాంతం కావడంచేత బ్రహ్మపుత్రానదికి వరదలు ఎక్కువ.టిబెట్టులో దీనిని త్సాగ్‌పోనది అంటారు. బ్రహ్మపుత్రానది మొత్తం నిడివి 2880 కి.మీ.

## బ్రహ్మయ్య, గొట్టిపాటి

ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు. రాజకీయ నాయకుడు. రైతు నాయకుడు. కృషి పండితుడు.

కృష్ణా జిల్లా ఘంటసాలలో 1898 డిసెంబరు 3న బ్రహ్మయ్య రైతుబిడ్డగా జన్మించారు. ఘంటసాల పరిసర ప్రాంతాల రైతులు కష్టనష్టాలలో పాల్గొంటూ 'రైతుపెద్ద' అనే పేరు గడించారు. జాతీయ నాయకులు భోగరాజు పట్టాభి సీతారామయ్య, చెరుకువాడ వెంకట నరసింహంతో1917లో పరిచయం ఏర్పడగా అప్పటి నుండి జాతీయోద్యమంలో పాల్గొంటూ, దేశసేవ సాగించారు. గ్రంథాలయ, వయోజన విద్యారంగాలలో ఆయన కృషి ప్రశంసనీయమైంది. ఘంటసాల దాని పరిసర గ్రామాలలో గ్రంథాలయాలు నెలకొల్పి వయోజనులలో జాతీయ చైతన్యం ప్రబోధించారు. 1920లో మహాత్ముని పిలుపుపై సహాయనిరాకరణోద్యమంలో సైమన్ కమీషన్ బహిష్కరణోద్యమంలో అత్యంత ఉత్సహంగా పాల్గొన్నారు. 1933లో హరిజన దేవాలయ ప్రవేశోద్యమానికి నాయకత్వం వహించారు. భారత జాతీయ కాంగ్రెసు పిలుపు మేరకు వివిధ ఆందోళనల్లో పాల్గొని ఐదేళ్ళకు పైగా కఠిన కారాగార శిక్షను అనుభవించారు. రైతు ఉద్యమానికి ఆయన చేసిన సేవ చాలా ప్రసిద్ధి గాంచింది.

1964లో ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తుకు ఏకగ్రీవంగా అధ్యక్షుడుగా ఎన్నికైనారు. 1968లో విధాన పరిషత్తు సభ్యుడుగా ఎన్నికైనారు. 'జాతి వెలుగులు', 'కాలచక్రం', 'నాజీవన నౌక' బ్రహ్మయ్య రచనలు.ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 'కళా ప్రపూర్ణ', భారత ప్రభుత్వం 'పద్మ విభూషణ్' బిరుదులతో సత్కరించాయి. 1968 లో బ్రహ్మయ్య పరమపదించారు.

## బ్రహ్మ సమాజం

విగ్రహారాధనను నిరసిస్తూ ఏకేశ్వరోపాసనను ప్రబోధించే ఆధునిక భారతీయ మతం. 1828 ఆగస్టు 20న రాజారావ్ మోహన్‌రాయ్(చూ.) బ్రహ్మ సమాజాన్ని స్థాపించాడు. 1830 జనవరి 23న దీనికి లాంఛన ప్రాయంగా ప్రారంభోత్సవం జరిగింది. ఆనాడు కలకత్తా సమాజంలో పలుకుబడిగల కాశీనాథరాయ, ద్వారకానాథ టాగూర్, ప్రసన్నకుమార్, తారాచంద్ర చక్రవర్తి, చంద్రశేఖర్ దే చేదోడు వాదోడు ఉండడం వల్ల సనాతన హిందువుల వ్యతిరేకతకు వారు ఎదురీదగలిగారు. అయితే 1830 నవంబరులో రాజారావ్ మోహన్‌రాయ ఇంగ్లండు వెళ్ళి మళ్ళీ తిరిగి రాకపోవడంతో బ్రహ్మ సమాజం కార్యకలాపాలలో కొంత స్తబ్దత ఏర్పడింది. 1842 తర్వాత దేవేంద్రనాథ.టాగూర్ ఈ సమాజంలో చేరడంతో ప్రార్థనలు, వేద పఠనం వంటివి సమాజ కార్యక్రమాలలో చోటు చేసుకున్నాయి. 1857లో కేశవ చంద్రసేన్ ఈ సమాజంలో అనేక సంస్కరణలు తీసుకు వచ్చాడు. బాల్య వివాహాలు మంచివి కావనీ, విధవలు పునర్వివాహాలు చేసుకోవచ్చుననీ, వర్ణాంతర వివాహాలు ప్రోత్సహించాలనీ బ్రహ్మ సమాజం ప్రచారం చేసింది. క్రైస్తవులలోను, మహమ్మదీయుల లోను, హిందువులలోను ఉన్న ఏకేశ్వర వాదులందరినీ ఈ సమాజం తనలో చేర్చుకుంది. వేదాలలో సమాజానికి బలాన్ని చేకూర్చే సమాచారానికై దేవేంద్రనాథటాగూర్(చూ.) అన్వేషించి విఫలుడై చివరికి తానే ఒక గ్రంథం వ్రాశాడు. తెలుగునాట కాకినాడలో రఘుపతి వెంకట రత్నం నాయుడు (చూ.)బ్రహ్మ సమాజం స్థాపనకు కృషి చేశాడు.

## బ్రహ్మసూత్రాలు

వేద వ్యాసమహర్షి రచించిన సుప్రసిద్ధమైన ఉత్తర మీమాంసా గ్రంథం. జగత్తు అంతటా వ్యాపించి ఉన్న పరబ్రహ్మ స్వరూపాన్ని వివరించే ఈ ఉదాత్త దార్శనిక గ్రంథంలో నాలుగు అధ్యాయాలు ఉన్నాయి. ప్రథమాధ్యాయంలో 138 సూత్రాలూ, ద్వితీయా ధ్యాయంలో 149 సూత్రాలూ, తృతీయాధ్యాయంలో 182 సూత్రాలూ, చతుర్థాధ్యాయంలో 76 సూత్రాలూ ఉన్నాయి. ప్రతి అధ్యాయం కొన్ని అధికరణాలుగా విభజించబడింది.

బ్రహ్మసూత్రాలను వివరిస్తూ శ్రీ శంకర భగవత్పాదులు సూత్ర భాష్యాన్నీ భగవద్రామానుజులు శ్రీ భాష్యాన్నీ రచించారు. మధ్వ, వల్లభాది ఇతర హిందూ మత ప్రవక్తలు కూడా బ్రహ్మ సూత్రాలకు భాష్యాలు వ్రాశారు. వేదాంత శాస్త్రంలో ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత ఈ మూడింటినీ 'ప్రస్థానత్రయం' అంటారు. జ్ఞానమే మోక్షానికి పరమ సాధనమని బ్రహ్మసూత్రాలు బోధిస్తున్నట్టు శ్రీ శంకరాచార్యులవారు వ్యాఖ్యానించగా, భక్తే చరమ మోక్ష సాధనమని రామానుజులు వారు వివరించారు.

## బ్రూనే

ఇండోనీషియాకు సమీపంలో బోర్నియోకు వాయవ్యదిశగాఉన్న ఒక సుల్తాన్‌ల రాజ్యం (బ్రిటిష్ రక్షణలో). ఒకప్పుడు ప్రాబల్యంఉన్న స్వతంత్ర సుల్తానేట్ 1971లో ఒడంబడిక ప్రకారం బ్రిటిష్‌వారి రక్షణ క్రిందికి వచ్చింది.

విస్తీర్ణం: 5,765 చ.కి.మీ.; జనాభా: 2,50, 000 (1988); రాజధాని: బందర్ సెరీ బెగవాన్; అధికార భాష: మలే, చైనీస్. ప్రజలు ఇస్లామిక్ మతస్థులు. పెట్రోలు, చమురువాయువు ఈ దేశంలో పుష్కలంగా లభిస్తున్నాయి. సమీపంలోని సముద్రగర్భం తైలనిక్షేపాలకు నిధి. వరి, కొబ్బరి, పండ్లు, సగ్గుబియ్యం, రబ్బరు బాగా పండుతాయి.

## బ్రెజిల్

దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర గణరాజ్యం. లాటిన్ అమెరికా దేశాలలో అన్నిటి కంటె ఇది పెద్దది. పూర్వం పోర్చుగల్ వలస రాజ్యంగా ఉండి 1889లో స్వతంత్ర గణరాజ్యమైంది.

విస్తీర్ణం: 85,11,965 చ.కి.మీ.; జనాభా: 14,42, 2,000 (1988); రాజధాని: బ్రసీలియా; అధికార భాష: పోర్చుగీసు. ప్రజలు మెస్టిజోలు, రెడ్‌ఇండియన్ తెగల వారు, యూరప్ నుంచి వచ్చిన పోర్చుగీసువారు అంతా క్రైస్తవ మతాన్నే అనుసరిస్తున్నారు. పూర్వం రియోడిజ నీరో లో ఉండే రాజధానిని కొత్తగా నిర్మించిన బ్రసీలియాకు 1960లో తరలించారు.

జల సంపదలో అమెజాన్ నది చాలా పెద్దది. దీని పరీవాహ ప్రాంతం ఎక్కువ. బ్రూనో నది, గ్రాండ్ నది మదీరా నది, నీగ్రోనది, పారణ నది, ఫ్రాన్సిస్కోనది, టాపోజీస్ నది, టోకాన్టిన్స్ నది, ఉరుగ్వే నది, జింగూనది ఇతర నీటివనరులు. దేశంలో ఎక్కువభాగం కీకారణ్యాలతో కూడిఉంది. సాగునేల ఎక్కువ. ఇంత సహజసంపద ఉన్నప్పటికీ అయిదింట ఒకభాగంమాత్రమే ప్రజలు వినియోగించుకో గలుగుతున్నారు. అయినా బ్రెజిలు రైతాంగం ఆహారోత్పత్తులలో ప్రపంచంలోనే అగ్రగామిగా ఉంది. వరి, చెరకు, పొగాకు, సోయా చిక్కుడు, రబ్బరు, అనాస పండ్లు, నారింజ పండ్లు, కోకో, కాఫీ, ప్రత్తి, మొక్కజొన్న, కర్ర పెండలం, కోకో, చిక్కుడు, అరటి పండ్లు ప్రధానమైన పంటలు. ఆహారోత్పత్తులలో ఈ దేశం స్వయం సమృద్ధి సాధించింది. పశువుల పెంపకం ప్రజలకు ప్రధాన జీవనోపాధి. తేయాకు పోలిన మాతో పండిస్తారు. బంగారం, పారిశ్రామిక వజ్రాలు, ఇనుప రాయి, మాంగనీసు ఖనిజ నిక్షేపాలు. కాగితం, రబ్బరు, ఉక్కు జవుళీ, టైర్లు, రైలు ఇంజనులు, గృహ పరికరాలు, తోలు సామగ్రి, రాసాయనిక ద్రవ్యాలు, మోటారు కార్లు, కలప సామగ్రి, సిమెంట్ పరిశ్రమలు వెలసి పారిశ్రామికాభ్యుదయానికి తోడ్పడు తున్నాయి. జల విద్యుత్తు ఇక్కడ విరివిగా ఉత్పత్తి అవుతూంది. సామీక్పాలో, బెలోహారి జంటో పారిశ్రామిక కేంద్రాలు.




## బ్రౌన్, చార్లెస్ ఫిలిప్

నిష్కామ భాషాభిమాని. అవిరళ భాషాసేవకుడు, సాహిత్య తపస్వి. తెలుగు వారి తపఃఫలం చార్లెస్ ఫిలిప్ బ్రౌన్. తెలుగు భాషా వాఙ్మయానికి ఆయన చేసిన సేవ అపారం. ఎన్నెన్నో తెలుగు రచనలు కాలగర్భంలో కలిసి పోకుండా ఎంతో శ్రమపడి కాపాడిన ఘనుడు.

1798 నవంబరు 10వ తేదీన కలకత్తాలో డేవిడ్ బ్రౌన్ కౌంటే దంపతులకు సి.పి. బ్రౌన్ జన్మించాడు.

ఇంగ్లీషుతోబాటు హీబ్రూ, సిరియక్, గ్రీక్, అరబ్బీ, పారసీకం, బెంగాలీ, హిందూస్థానీ తదితర భాషలు అభ్యసించాడు. 1812లో డేవిడ్ మరణించడంతో ఆయన కుటుంబం ఇంగ్లాండుకి వెళ్ళింది. 1817 తూర్పు ఇండియా కంపెనీ ఉద్యోగిగా బ్రౌన్ తిరిగి భారతదేశానికి వచ్చాడు. ఇంగ్లండ్‌లో ఉన్నప్పుడే బ్రౌన్‌ని మద్రాసు సివిల్ సర్వీస్‌లో ఉద్యోగిగా నియమించారు. ఆరోజుల్లో సివిల్ సర్వీసులో చేరిన వారు మద్రాసు కాలేజీలో చేరి ప్రాంతీయ భాషలతో పాటు తమ ఉద్యోగ నిర్వహణకు కావాల్సిన పని పాటలు నేర్చుకునేవారు. బ్రౌన్ 1817 ఆగష్టు 13న మదరాసులో కాలేజిలో చేరాడు. బ్రౌనుకి తెలుగు నేర్పిన ఘనత వెలగపూడి కోదండరామ పంతులుది. కాలేజీ పరీక్ష నెగ్గిన తర్వాత కడపజిల్లా కలెక్టరు హన్బరీకి అసిస్టెంట్‌గా బ్రౌన్ నియమితుడైనాడు. హన్బరీ తెలుగు బాగా మాట్లాడేవాడు. ఆయనలా తను మాట్లాడాలనే అభిలాషతో రెండేళ్లలో భాషావిషయంలో కలెక్టరుని మించిపోయాడు. 1824 నుండి ఆయన దృష్టి తెలుగు కావ్యాలపై పడింది. వేమన పద్యాల సేకరణకు నడుము బిగించాడు. 1829 కల్లా వేమన పద్యాలకు తాను చేసిన ఆంగ్లాను వాదాన్ని 'ది వర్సెస్ ఆఫ్ వేమన' పేరుతో ప్రకటించాడు. 1834లో సెలవుపై ఇంగ్లండు వెళ్ళి నపుడు బోడ్లియాన్ లైబ్రరీ మొదలైన వాటిని దర్శించి తెలుగు, కన్నడం, సంస్కృతంలోని అముద్రిత గ్రంథాలను పరిశీలించి కేటలాగులు తయారు చేశాడు. తన నిఘంటువుకీ, తెలుగు వ్యాకరణానికి తుది మెరుగులు సమకూర్చాడు. 1846లో పోస్టుమాస్టర్—జనరల్‌గా, ఆ ఏడాది మదరాసు ప్రభుత్వానికి తెలుగు అనువాదకుడుగా, కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషన్ సభ్యుడుగా మదరాసు బ్యాంకులో ప్రభుత్వపు డైరెక్టరుగా కాలేజీలో లిఖిత గ్రంథ భాండాగారం క్యూరేటరుగా ఆయన పనిచేసాడు.

ఆయన వ్రాసిన తెలుగు వ్యాకరణం, తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు, ఇంగ్లీషు—తెలుగు నిఘంటువు, మిశ్ర భాషా నిఘంటువు నేటికీ ప్రామాణికాలై ఉన్నాయి. వ్రాత పతులు, కావ్యాలు, లేఖల సేకరణ అమూల్యమైనవి. 1837లో తాను సెలవుపై లండన్ వెళ్ళినపుడు అక్కడ ఇండియా హవుస్ లైబ్రరీలో తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ లిపులలో ఉన్న లిఖిత ప్రతుల్ని పరిశీలించి వాటికి కేటలాగులు తయారు చేయడమేగాక వాటిని మద్రాసు తరలింపజేశాడు. తాను జీవించిన 86 సంవత్సరాలలో 67 సంవత్సరాలు తెలుగు భాషా సేవలోనే గడిపి 1884లో ఇంగ్లండులో మృతి చెందాడు.

## భగత్ సింగ్

పరపాలన నుండి భారతదేశానికి దాస్య విముక్తి గావించడంలో ప్రాణాలు పొగొట్టుకున్న అమర వీరులలో అగ్రగణ్యుడు భగత్‌సింగ్. పంజాబ్ (నేటి పాకిస్తాన్)లోని లైల్పూర్ జిల్లా బంగేలో 1909 సెప్టెంబరు 28న భగత్ సింగ్ జన్మించాడు. దేశభక్తికి, జాతీయాభిమానాన్ని నూరి పోయడానికి లాలాలజపతిరాయ్ లాహూర్‌లో స్థాపించిన నేషనల్ కాలేజీలో విద్యనభ్యసించి 1924లో విప్లవ ఉద్యమంలో చేరాడు. సైమన్ కమీషనకు వ్యతిరేక ఆందోళనలకు నాయకుడయ్యాడు. హిందూస్తాన్ సోష లిస్టు రిపబ్లికన్ ఆర్మీ స్థాపించి పంజాబు ఉత్తర పరగణాలలో విప్లవాత్మక చర్యలు సాగించాడు. కాకోరీ మెయిల్ దోపిడిలో ఇరుక్కున్న తన చెలికాళ్ల (జోగేష్, భటర్జీ, ఎస్.ఎన్. సన్యాల్)ను కాన్పూరు జెయిల్ నుండి బయట పడెయడానికి ప్రయత్నం చేశాడు. లాహూరు అసిస్టెంట్ పోలీస్ సూపర్నింటెండెంట్ జె.పి. సాండర్స్ హత్యకు (1928 డిసెంబర్ 17) బాధ్యుడు భగత్‌సింగ్. 1929లో ఏప్రిల్ 8న న్యూఢిల్లీలోని కేంద్ర అసెంబ్లీ (పార్లమెంట్)లో బాంబు పేల్చి కరపత్రాలను విసిరాడు. భగత్‌సింగ్‌ను అరెస్టు చేసి విచారణ జరిపి ద్వీపాంతర వాస శిక్ష వేశారు. కాని ప్రత్యేక ట్రిబ్యూనల్ పునర్విచారణ జరిపి ద్వీపాంతర శిక్ష పెంచి ఉరిశిక్షగా మార్చారు. భగత్‌సింగ్ సహాధ్యాయులు రాజగురు, సుఖదేవ్ కూడ అతనితోబాటు లాహూరులోని కేంద్ర జెయిలులో 1931 మార్చి 23 నాడు ఉరికంబమెక్కారు. అమరవీరుల శవాలకు పోలీసులు సట్లెజ్ నదీతీరాన ఫైరోజ్‌పూర్ వద్ద దహనక్రియలు చేస్తుండగా అతని



అనుచరులను సగం కాలిన శవాలను బలవంతాన తీసికొని రావీనదీ తీరాన లక్షలాది భగత్‌సింగ్ అభిమానులు విలపిస్తుండగా దహనక్రియలు పూర్తిచేశారు.

## భగవద్గీత

హిందువుల పవిత్ర గ్రంథం. మహాభారతం లోని భీష్మపర్వంలో 24–25 ఆశ్వాసాల్లో వివరింపబడి నది. కురుక్షేత్ర (చూ.)సంగ్రామ సమయాన అర్జునుడు రణరంగంలో స్వజనులతో పోరాటం సల్పుటకు సందే హిస్తాడు. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ–అర్జునుడు ఆ యిద్దరి మధ్య జరిగిన సంభాషణయే 'గీతోపదేశం'. అదియే భగవద్గీత. ఈ హితబోధ ప్రధానంగా మూడు విషయాల మీద నడిచింది. 1.కర్మయోగం; 2.జ్ఞాన యోగం; 3.భక్తియోగం. భగవద్గీతలోని సారాంశం హిందూ తత్వానికి మూలకందం. హిందూమత ప్రవక్తలు శంకరా చార్య (చూ.), రామానుజాచార్య(చూ.), మధ్వాచార్య (చూ.) ముగ్గురూ గీతోపదేశాన్ని తమతమ మత సంప్రదాయాలకు అనుగుణంగా గీతకు భాష్యాలు వ్రాసి వ్యాఖ్యానించారు. అసలు కృష్ణపరమాత్మ రణరం గంలో స్థూలంగానే అర్జునునికి హితబోధ చేశాడనీ తరవాత వ్యాసమహర్షి దానిని వివరించి వ్రాశాడనీ అంటారు. అయితే క్రీ.పూ. 3–4 శతాబ్దుల మధ్యన రచింపబడిన 'గీత' మహాభారత కథలో క్రీ.శ. 2వ శతాబ్దంలో ప్రక్షిప్తం చేయబడిందని ఆధునిక పండితుల అభిప్రాయం. ఏది ఏమయినా 'భగవద్గీత' పలు ప్రపంచ భాషలలోకి అనువదించబడి పసగల తత్త్వబోధగా ప్రసిద్ధి గాంచినది. ఇందులో అర్జున విషాదయోగ, కర్మయోగ, నిష్కామ యోగాలు ముఖ్యమైనవి. కర్మయోగ: ఫలితం ఆశించకుండ పనిచేయుట; జ్ఞానయోగ: సృష్టిని గూర్చి తెలుసుకొనుట; తారక బ్రహ్మయోగంలో బ్రహ్మ, ఆత్మతత్త్వకర్మలను గూర్చి అర్జునుడు అడిగిన ప్రశ్నలకు శ్రీకృష్ణుని జవాబులు; రాజరాజ గుహ్యయోగంలో భూమిపుట్టుక వగయిరా గురించి వివరణ ఇచ్చాడు. పిదప జగత్తులో దౌష్ట్యం విపరీతంగా పెరిగిపోయినప్పుడు తాను మరల మరల అవతారం ఎత్తుతూ దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తూ ధర్మాన్ని పునఃస్థాపితం నిర్వహిస్తూ ఉంటానని చెప్పాడు. చూ. శ్రీకృష్ణుడు

> పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్|
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే||

ఆ తరువాత విశ్వరూప దర్శనం చూపించగానే అర్జునుడు ఆశ్చర్యచకితుడై శ్రీకృష్ణుని కొనియాడతాడు. తరవాత భక్తియోగాన్ని గూర్చి శ్రీకృష్ణుడు వివరిస్తాడు. గుణత్రయ విభాగయోగంలో జ్ఞానం ఉత్కృష్టతను గూర్చి చెబుతూ ప్రకృతి, పురుషుల నుండి జగత్తు ఆవిర్భావం, సత్త్వం, రజస్సు, తమస్సు అను త్రిగుణాల విశిష్టతలను గురించి వివరిస్తాడు.ఇంక, దైవాసుర సంపద్విభాగయోగం లో మంచిపనులు, చెడ్డపనులు, శాస్త్రీయ, అశాస్త్రీయ చర్యలను గూర్చి చెప్పాడు. తరవాత 'ఓం' (చూ.)ను గూర్చియు శాస్త్రీయమయిన తపస్సు విధానాన్ని గురిం చియు వివరిస్తాడు. చివరగా మోక్ష సన్న్యాసాల్ని వివరిస్తూ జ్ఞాననిష్ఠ, త్యాగం, నిష్కామ కర్మయోగం–గీతోపదేశం యొక్క ఉత్కృష్టతలను గూర్చి విశదీకరిస్తాడు.

> కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన|
> మా కర్మఫల హేతుర్భూ ర్మాతే సఙ్గోస్త్వ కర్మణి||

"పని (కర్మ)చేయ్యడమే నీ వంతు; దాని (కర్మ) ఫలాన్ని మాత్రం ఆశించకు. ఫలమేదో దక్కుతుందని మాత్రం పని (కర్మ)చెయ్యడం నీ ధ్యేయం కాకూడదు. అలా అని ఏ పనీ (కర్మ)చెయ్యకుండా ఉండనూ కూడదు." అని అర్జునునికి శ్రీకృష్ణపరమాత్మ నిష్కామ కర్మను గూర్చి బోధిస్తాడు. ఇక శ్రీ వైష్ణవ సంప్రదాయం ప్రకారం, చివరగా

> సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకమ్ శరణమ్ వ్రజ
> అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మా శుచః||

"సర్వధర్మాలను వదిలేసి నన్ను ఒక్కడినే (శ్రీకృష్ణుని)శరణువేడుకోమనీ, నేనే నిన్ను పాపాలనుండి విముక్తుణ్ణిచేసి నీకు మోక్ష ప్రదానం చేయగలననీ" చరమ శ్లోకంగా 'శరణాగతి' భావాన్ని శ్రీకృష్ణుడు వివరించి రణరంగంలో అర్జునుని కార్యోన్ముఖుణ్ణి చేస్తాడు.

## భట్టుమూర్తి

క్రీ.శ. 16వ శతాబ్ది

ప్రముఖ ఆంధ్ర ప్రబంధ కవి. అష్ట దిగ్గజాలలో (చూ.) ఒకరు. సుప్రసిద్ధమైన 'వసుచరిత్ర' కర్త. భట్టుమూర్తికే 'మూర్తికవి', 'రామరాజు భూషణుడు' అనే మరి రెండు పేర్లుకూడా ఉన్నాయి. భట్టుమూర్తి అసలు పేరు మూర్తికవే అనీ ఆయన భట్రాజు కావడం వల్ల భట్టుమూర్తి అయాడనీ అళియ రామరాజు ఆస్థానకవి అయి ఆస్థానానికి భూషణంగా ఉండేవాడు గనుక 'రామరాజ భూషణుడు'గా ప్రసిద్ధి చెందాడనీ విద్వాం సులు చెబుతున్నారు.ఈయన ప్రసిద్ధరచన 'వసుచరిత్ర' గొప్ప శ్లేషకావ్యం. ఈ కావ్యంలో శబ్ద సౌందర్యం మిక్కుటం. కొన్ని పద్యాలు వీణమీద వాయించడానికి

అనుగుణంగా మధురవర్ణ సంయోజనంతో కూడి ఉన్నాయి. భట్టుమూర్తి వసు చరిత్ర కాకుండా 'నరసభూపాలీయం'అనే లక్షణ గ్రంథం, హరిశ్చంద్ర నలోపాఖ్యానం అనే ఒక ద్వ్యర్థి కావ్యం కూడా రచించాడు. నరస భూపాలీయం సంస్కృతంలో విద్యానాథుని 'ప్రతాపరుద్రీయ'నికి స్వేచ్ఛానువాదం. విద్యానాథుడు లక్ష్యాలలో కృతిభర్త ప్రతాపరుద్రుణ్ణి అభివర్ణంచగా, భట్టుమూర్తి తనకృతి భర్త నరసరాజును వర్ణించాడు. హరిశ్చంద్ర నలోపాఖ్యానం— ప్రతి పద్యం అటు హరి శ్చంద్రుడికీ, ఇటు నలుడికీ అన్వయించే విధంగా వ్రాయ బడింది. భట్టుమూర్తి 'వసుచరిత్ర'ను అనుకరిస్తూ తరవాతి కవులెందరో కావ్యాలు వ్రాశారు.

## భద్రాచలం

ప్రముఖ పుణ్యక్షేత్రం. ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లాలో గోదావరీ నదీతీరాన ఈ క్షేత్రం ఉంది. దక్షిణ భారతదేశంలో ప్రధాన శ్రీరామ క్షేత్రాలలో భద్రాచలం ఒకటి. చైత్రశుద్ధ నవమి రోజున ఇక్కడ శ్రీ సీతారాముల కళ్యాణం మహావైభవంగా జరుగుతుంది. దేశం నలు మూలల నుంచి లక్షలాది భక్తజనులు వస్తారు. ధనుర్మాసం నెల రోజులూ కూడా ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి. రామదాసు (చూ.)నాటి నైజాం రాజ్యంలో భద్రాచలానికి తహసీల్‌దారుగా ఉండేవాడు. గొప్ప రామభక్తుడైన రామదాసు ఒకరోజు కొందరి భక్తులతో కలసి శ్రీరాముని దర్శనానికి వెళ్ళాడట. ఆ భక్తులలో కబీరుదాసు కూడా ఉన్నాడు. కబీరు అన్యమతస్థుడని ఆలయ ధర్మకర్తలు అతనిని ఆలయంలోకి రానీయలేదు. అప్పుడు శ్రీ సీతారాములు అంతర్థానం అయ్యారు. ఆ సంఘటన వలన కనువిప్పు కలిగిన ధర్మకర్తలు భక్తితో కబీరుదాసును ఆలయంలోనికి ఆహ్వానించారు. అతడు ఆలయంలోకి రాగానే మళ్ళీ శ్రీ సీతారాములు యథాప్రకారం ఆలయంలో కనిపించారు. కబీరుదాసుని భక్తికి ఆశ్చర్యం పొంది రామదాసు (గోపన్న) ఆతని వలన మంత్రోపదేశం పొందాడు. కబీరు వలననే గోపన్నకు రామదాసు అనేపేరు వచ్చింది. ప్రతి ఏడూ కళ్యాణానికి ముత్యాల తలంబ్రాలు, పట్టువస్త్రాలు, సీతారాములకు నిజాం పంపుతూ వచ్చిన సంప్రదాయం ఇప్పటికీ కొనసాగుతూంది. భద్రాచలం పరిసరాలలో చూడదగిన పుణ్య క్షేత్రాలు చాలా వున్నాయి.

## భరతనాట్యం

భారతీయ సంప్రదాయ నృత్య రీతులలో ప్రముఖమైన బాణీ భరతనాట్యం. సాధారణంగా భారతీయ సంప్రదాయ నాట్యంలో శుద్ధలయ ప్రధాన మైనది 'నృత్త'. రెండవది 'నృత్య' లేదా 'అభినయ'- ఒక పాటలోని సాహిత్య భావానికి అనుగుణంగా హస్తాభినయ ముద్రల ద్వారా మౌనంగా ఇతర అవయవాల ద్వారా హావభావాలను ప్రద ర్శించడం ఇందులోని ప్రత్యేకత.

భరతనాట్యాన్ని ఒకప్పుడు 'దాసీయాట్టం' అనీ దేవదాసీల భోగం ఆట (సదిర్) అనీ పిలుస్తూ ఉండేవారు. ఇప్పుడు ఉన్న సంప్రదాయం తంజావూరు చతుష్టకం పొన్నయ్యపిళ్లే సోదర్లు తీర్చిదిద్ది అందించిన బాణీ. దక్షిణాదిని ఆలయాల్లో నైవేద్య నృత్యాలుగా ప్రసిద్ధి పొందాయి. తమిళనాడులో శైవాలయాలు మెండు. అందు చేత శైవ నృత్యాలు అక్కడ ఎక్కువ. ఆంధ్రప్రదేశ్‌లో వైష్ణవా లయాలలో వైష్ణవ నృత్యాలు ఆలయ నాట్యంగా ప్రసిద్ధి పొందాయి. దేవదాసీ ఆర్థిక సాంఘిక స్థితి దిగజారడంతో ఈ సంప్రదాయం కొన్నేళ్ళు మరుగున పడి పోయింది.

ఇటీవల 1930లో మద్రాసులో రుక్మిణీదేవి అరండేల్ ఈ నాట్యకళను పునరుద్ధరించింది. ఇందులకై ఆమె మొదట అడయారు లోనూ తరువాత తిరువాన్మియూరులోనూ 'కళాక్షేత్రం'వ్యవస్థాపించి నిష్ణాతులయిన నాట్యాచారులను రప్పించి పోషిస్తూ భరతనాట్యానికి ఒకప్రతిపత్తిని కలిగించడంతో నేడు ఈసంప్ర


భరతనాట్యం

దాయాన్ని ఉన్నత కుటుంబాలకు చెందిన స్త్రీలు కూడ అభ్యసించి నృత్య కచ్చేరీలు చేస్తున్నారు. భరత నాట్యం నట్టువ సంప్రదాయానికి అంటే వ్యష్టి నృత్యాలకు సంబంధిం చింది. రుక్మిణీదేవి అరుండేల్ ప్రవేశపెట్టిన భరత నాట్యబాణీలో అలరిపు (పూజ)తో ప్రారంభమయి

జతిస్వరం (లయప్రధానం), శబ్దం (లయ—గేయసాహిత్యం), వర్ణం (నృత్త, అభినయం), కీర్తనలు, శృంగార పదాలు, జావళీలు అభినయించి చివరగా తిల్లానాగా ముగుస్తుంది. రుక్మిణీదేవి వలెనే టి. బాలసరస్వతి, ఆచార్య రాఘవన్ భరతనాట్య సంప్రదాయ పునరుద్ధరణ కృషిలో ప్రత్యేక కృషి చేశారు. కపిలవాత్సాయన్ భారతీయ నృత్య సంప్రదాయాలపై వ్యాఖ్యానించారు. (చూ. భరతముని)

## భరతముని క్రీ.పూ. 4వ శతాబ్ది

'భరత నాట్య శాస్త్ర' కర్త. నాట్య శాస్త్రానికే 'నాట్యవేదం' 'భరత నాట్య సూత్రాలు', 'భరత సూత్రం' అని కూడా ప్రసిద్ధి. మహర్షులు భరతమునిని అడిగిన ఈ 5 ప్రశ్నలకు సమాధానంగా ఈ నాట్యవేదం వెలసిందని ప్రసిద్ధి. 1. నాట్యవేదానికి ప్రయోజనం ఏమిటి?; 2. వేదపఠనానికి అధికారం కలవాడే నాట్య వేదపఠనానికూడా అధికారా?; 3. నాట్యవేదానికి అంగాలెన్ని?; 4. అంగాలను నిర్ణయించడానికి ప్రమాణం ఏమిటి?; 5. దాని ప్రయోగం ఎలా ఉంటుంది?

ఈ ప్రశ్నలకు జవాబుగా 36 అధ్యాయాలలో 6000 శ్లోకాలలో భరతముని 'నాట్య శాస్త్రం' రచించాడు. 'ఈ గ్రంథం ఒక్క వ్యక్తి వ్రాసింది కాదు. బహుద్రేకం' అని కొందరు వాదించారు. కాని, గ్రంథానికి ప్రముఖ వ్యాఖ్యాత అయిన అభినవ గుప్తుడు 'అభినవ భారతి' అనే తన వ్యాఖ్యానంలో ఆ వాదాన్ని నిరాకరించాడు. నాట్య శాస్త్రంలో భావం, అభినయం, ధర్మి, వృత్తి, ప్రవృత్తి, సిద్ధి, స్వరం, ఆతోద్యం, గానం, రంగం అనే విషయాలు వివరించబడ్డాయి. నాట్య శాస్త్రానికి 'అభినవ గుప్తుడే కాక ఘటకర్పరుడు' అనే మరొక వ్యాఖ్యాత కూడా ఉన్నాడు. నాన్యదేవుడు, శివి, శ్రీహర్షుడు, రాహులకుడు మొదలైన వారు నాట్య శాస్త్రానికి వార్తికాలు (శ్లోకరూపమైన వివరణలు) వ్రాశారు. నాట్య శాస్త్రానికి తెలుగు అనువాదాన్ని పోణంగి శ్రీరామ అప్పారావు అందించారు.( చూ. భరతనాట్యం, కూచిపూడి నాట్యం)

## భర్తృహరి

సుప్రసిద్ధ సంస్కృత నీతిశతక కర్త. పాటలీ పుత్ర నివాసి. భట్టీ విక్రమార్కుల కథలలోని భట్టియే భర్తృహరి అని కొందరు విద్వాంసుల భావన. భర్తృహరి వ్రాసిన సుభాషిత త్రిశతిలో నీతిని, శృంగారాన్ని, వైరాగ్యాన్ని బోధించే మూడు శతకాలు ఉన్నాయి. సంస్కృతంలో ఈ నీతి శతకాలు బహుజనాదరణ పొందాయి. తెలుగులో ఎలకూచి బాల సరస్వతి (1610–1670), ఏనుగు లక్ష్మణ కవి, పుష్పగిరి తిమ్మన (1750–1800) అనే ముగ్గురు కవులు భర్తృహరి శతకాల్ని అనువదించారు. వీటిలో ఏనుగు లక్ష్మణ కవి అనువాదమే 'భర్తృహరి **సుభాషితాలుగా** బహుళ ప్రజాదరణ పొందింది.

## భవభూతి క్రీ.శ. 7వ శతాబ్ది

సంస్కృతంలో కాళిదాసుతో సమానంగా ప్రశంస లందుకుంటున్న మహాకవి భవభూతి. విదర్భ దేశంలోని పద్మ పురనివాసి ఈయన. సాంఖ్య, యోగ, వ్యాకరణ, తర్క, అలంకార, వేదాంత శాస్త్రాలలో భవభూతి నిధి. కన్యాకుబ్జరాజైన యశోవర్మ ఆస్థాన కవి భవభూతి. సంస్కృతంలో ఈయన 3 నాటకాలు రచించాడు: 1. ఉత్తర రామచరిత్ర, 2. మహావీరచరిత్ర, 3. మాలతీ మాధవం. వీనిలో ఉత్తర రామచరిత్ర ప్రశస్తమైన రచన. కరుణ రస ప్రధానమైన ఆ నాటకంలోని శ్లోకాలెన్నో ప్రజల నాలుకల మీద నేటికీ నాట్యం చేస్తున్నాయి. ''అపిగ్రావారోదితి, అపిదళతి వజ్రస్య హృదయం'' అని సీత దుఃఖాన్ని భవభూతి వర్ణిస్తాడు. ఆమె దుఃఖానికి శిలలు కూడా విలపించాయట! వజ్ర హృదయం కూడా విచ్చి పోయిందట! ''ఏకోరస: కరుణ ఏవ'' అని సాహిత్యంలో కరుణరస ప్రాశస్త్యాన్ని భవభూతి చాటాడు.

## భాగవతం చూ. మహాభాగవతం

## భాగ్యనగరం చూ. హైదరాబాదు

## భారతదేశం

స్వతంత్ర గణతంత్రరాజ్యం. ఇండియా అనీ, భారత రిపబ్లిక్ అనీ వ్యవహరిస్తూ ఉంటారు. 5 వేల ఏళ్ల పైబడి వైభవోపేతమయిన సంస్కృతీ సంప్రదాయలూ ఘన చరిత్ర గల దేశం. దాదాపు 200 ఏళ్ల బ్రిటిషు వలస పాలన నుండి విముక్తి పొంది 1947 ఆగస్టు 15న

స్వాతంత్ర్యం సంతరించుకుంది. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం) ప్రపంచ ప్రజాస్వామ్య రాజ్యాంగాలను కూలం కషంగా పరిశీలించుకొని తనకంటూ ఒక రాజ్యాంగాన్ని సిద్ధపరచుకుని 1950 జనవరి 26 నాడు గణతంత్ర రాజ్యమవడంతో ప్రపంచంలోనే అత్యంత అధిక జనాభా గల ప్రజాస్వామ్య దేశాలలో అగ్రగామి అయింది. క్రీ.పూ. 3750 నుండి క్రీ.పూ. 1500 వరకూ మనిన సింధునాగరకత (చూ) సుమేరియా, ఈజిప్టు మొద లయిన దేశాలలో అవతరించిన నాగరకతల కంటె మిన్న అనిపించుకున్నది. అరణ్యకాలు షడ్దర్శనాలూ ఉపనిషత్తులూ చతుర్వేదాలూ బ్రహ్మ సూత్రాల కూర్పు, మహా భారత రామాయణం మహా భాగవతాది అష్టాదశపు రాణేతిహాసాలూ తిరుకురళ్ వంటి నీతి శాస్త్రం అల్లబడిన దేశం భారత దేశం. బౌద్ధ, జైన మత ప్రవక్తలు గౌతమ బుద్ధుడూ మహావీరుడూ వెలసిన దేశం ఇది. దక్షిణాదిని ఆదిశంకరాచార్యులూ, విశిష్టాద్వైత ప్రవక్త రామానుజా చార్య, ద్వైతమహా ప్రవక్త మధ్వాచార్య, శుద్ధా ద్వైత ప్రవక్త వల్లభాచార్య పావనం చేసిన దేశం. హిందూ మత పునరుద్ధరణకు ద్వాదశ ఆళ్వార్లు, 63 (అరువత్తి మూవర్) నాయన్మార్లు అవిరళ కృషి చేసిన దేశం. భారతదేశంలో మహా కవులు కాళిదాసు, మాఘుడు, బాణుడు, భాసుడు, శూద్రకుడు, ఇలాంగో అడిగల్ మున్నగు వారెందరో సృజనాత్మకమయిన మహా కావ్యాల్ని అందించారు. ధన్వంతరీ, చరకుడు, సుశ్రుతుడు, వాగ్భటుడు వంటి శాస్త్రవేత్తలు ఆయుర్వేద వైద్యవిధానాన్ని అందించారు. కణాదుడు పరమాణు స్వరూపాన్ని నిర్వచించాడు. ఆర్యభట, భాస్కరాచార్య, వరాహమిహి రుడు వంటి గణిత, ఖగోళవేత్తలు పుట్టిన భారతదేశం ప్రపంచానికి సున్నా(0)ను, దశాంశ పద్ధతిని అందించింది. సింధు నదీ దాని అయిదు ఉపనదులూ, గంగా నది, బ్రహ్మపుత్రా నది, నర్మదా నది, తపతీ నది, మహా నది, గోదవరి నది, కృష్ణా నది, పెన్నా నది, కావేరీ నది, తామ్రపర్ణి వంటి జీవనదులు నేలను తడిపి బంగారు పంటలునిచ్చే దేశం భారతదేశం. ఇనుపరాయి, నేల బొగ్గు, బాక్సైట్, మాంగనీసు, మైకా, రాగి, జింకు, పెట్రోలు, చమురువాయువు, డోలమైటు, బంగారు వంటి ఖనిజ నిక్షేపాలు గలదేశం. భారతదేశానికి మూడు వైపులా జలమయం, కోస్తా తీర ప్రాంతంలో మత్స్య సంపద మెండు. పశుసంపదతో తులతూగే ప్రాంతం. గొర్రె, మేక, ఆవు, గేదె వంటి అనేక రకాల పశువులకు నిలయం. రాసిలోనూ వాసిలోనూ ఇంత సిరిసంపదలతో తులతూగే భారతదేశం రత్నగర్భ అని పేరు ప్రఖ్యాతులు బడయ టంతో చారిత్రకంగా పెక్కుసార్లు అనేక విదేశీ రాజవంశాలను ఆకర్షించింది. మధ్య ఆసియా నుండి ఆర్యులను, మాసిడోనియా నుండి అలిగ్జాండరు, పశ్చిమ ఆసియా నుండి మహమ్మదు గజనీ, అంతకు ముందు నందులు, మౌర్యులు, కుషాణులు, గుప్తులు దండ యాత్రలకు లోనైంది. సాతవాహనులు, మొగలాయిలు, పాండ్యులు, పల్లవులు, చేర, చోళ, చాళుక్య రాజవంశాలు దక్షిణాదిని పాలించాయి. బ్రిటిషు, ఫ్రెంచి, డచ్చి (వలాందులు) పోర్చుగీసు వారలు వచ్చి కొన్ని ప్రాంతాలు కైవసం చేసికొని స్థావరాలు ఏర్పరచుకుని చాల కాలం ఏలిక సాగించారు (17–19 శతా.). బ్రిటిష్ వర్తకుల (ఈస్ట్ ఇండియా కంపెనీ) పాలనలో భారత స్వాతంత్ర సమరం 1857 ప్రారంభమవగా 1885లో భారత జాతీయ కాంగ్రెస్ సంస్థ స్థాపితమై పోరాటం కొనసాగించింది. ఈ లోపున1877లోపాలన వర్తకం చేసుకునే ఈస్ట్ ఇండియా కంపెనీ నుండి బ్రిటిషు ప్రభుత్వం(విక్టోరియా రాణి) క్రిందికి వచ్చింది. 1915లో జాతిపిత మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ రాజకీయ నాయకత్వంలో సత్యాగ్రహ మనే ఆయు ధంతో అహింసా సిద్ధాంతమును పాటిస్తూ సహాయ నిరాకరణ (1921), ఉప్పు సత్యాగ్రహం (1930), క్విట్ ఇండియా (1942)వంటి అనేక ఉద్యమాలు జరుగగా. రక్తరహిత విప్లవం ద్వారా 1947లో స్వాతంత్ర్యాన్ని సంతరించుకున్న దేశం భారతదేశం. విప్లవవీరులు భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు వంటి అనేక మంది యోధులు అమర వీరులయ్యారు. స్వాతంత్ర్యానంతరం భారతదేశం పాలనకు జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వం లభించడం భారత ప్రజల అదృష్టం. నెహ్రూ చారిత్రక అవగాహన గల మహామనీషి. సోషలిస్టు భావాలను జీర్ణించుకున్న మహామేధావి. ఆయనే ప్రప్రథమ ప్రధాని. రాజ్యాంగానికి లోబడి మిశ్రమ ఆర్థిక వ్యవస్థ(మిక్స్డ్ ఎకానమీ)ను చేపట్టి గణతంత్ర పాలన సాగించు కుంటున్న ప్రజాస్వామిక దేశం భారతదేశం. నిష్ణాతులైన

స్వదేశీ నిపుణులు రూపొందించిన పంచవర్ష ప్రణాళికలు 1951 నుండీ సిద్ధపరచుకొని సహజ వనరులను సద్వినియోగ పరుచుకుంటున్న దేశం ఇది. భాక్రా—నంగల్, నాగార్జున సాగరు వంటి భారీ డామ్‌లు నిర్మించి నదీజల సంపదను కాలువ వ్యవస్థద్వారా పంటనీటిని అందించారు. ఆధునిక శాస్త్రీయ వ్యవసాయసాగు పద్ధతులను రైతాంగానికి అందించడంలో హరిత విప్లవం (గ్రీన్ రివల్యూషన్) దేశంలో సంభవించింది. పారిశ్రామికాభ్యుదయ స్థాయిని ద్విగుణీకరించుకొనుటయే గాక స్వయంకృషి ద్వారా ఆహార పంటల దిగుబడిలో స్వయం సమృద్ధి సాధించు కున్న (1970)రాజ్యం భారత దేశం.పశుసంపద గుణగణాలను అభివృద్ధి చేసికొనడంతో పాలదిగుబడి పెరిగి శ్వేత విప్లవం (వైట్ రివల్యూషన్) సంభవించి (1980) క్షీరోత్పత్తులు అందరికీ అందుబాటులోకి వచ్చాయి. 7, 517 కిలోమీటరుల కోస్తా తీరం దేశానికి మూడువైపులా ఉండడం ఒక సహజసంపద. దానిని ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి చేసికొనడంతో చేపల దిగుబడిపెరిగి నీలి విప్లవం (బ్లూ రివల్యూషన్) సంభవించింది (1990). ఇక పారిశ్రామికంగా ప్రపంచ దేశాలతో పోటీపడుతూ అత్యున్నతమయిన ప్రగతిని సాధించుకుని నేడు జీవితావసర వస్తుసామగ్రి ఉత్పత్తిలో స్వయం పర్యాప్తత సాధించుకుంది. యంత్రపు పని ముట్లు, మోటారు కార్లు, రైలు పెట్టెలు, బస్సులు, మోటారు సైకిళ్లు, స్కూటర్లు వంటి రవాణా వాహనాలూ, ఇనుము, ఉక్కు, అల్యూమినియం, సిమెంటు, పంచదార, కాగితం, రాసాయినిక ద్రవ్యాలు, ఎరువులు, ప్లాస్టిక్కు సామగ్రి, ధాతుసామగ్రి, నౌకా నిర్మాణం వంటి అనేక పరిశ్రమలు నెలకొని ఉత్పత్తులు సాధిస్తున్నాయి.ఆధునిక హై-టెక్ పరిశ్రమ అయిన కంప్యూటర్ టెక్నాలజీలోకూడ భారతదేశం గణనీయమైనకృషిచేసి స్వదేశీ మేధాసంపదతో అత్యంత ఆధునికమైన 'సాఫ్ట్‌వేర్' ను తయారుచేసి ఎగుమతిచేసి విదేశీద్రవ్యాన్ని ఆర్జిస్తూంది.



# భారతదేశ స్వరూపం

| రాష్ట్రం | విస్తీర్ణం చ.కి.మీ. | జనాభా | రాజధాని |
|---|---|---|---|
| భారతదేశం | 31,66,414 | 68,51,84,692 | న్యూఢిల్లీ |
| 1. అరుణాచల్ ప్రదేశ్ | 83,743 | 6,31,839 | ఇతానగర్ |
| 2. అస్సాం | 78,438 | 1,98,96,843 | ప్రాగ్జ్యోతిస్పుర్ |
| 3. ఆంధ్రప్రదేశ్ | 2,75,068 | 5,35,49,673 | హైదరాబాదు |
| 4. ఉత్తరప్రదేశ్ | 2,94,411 | 11,08,62,013 | లక్నో |
| 5. ఒరిస్సా | 1,55,707 | 2,63,70,271 | భువనేశ్వర్ |
| 6. కర్నాటక | 1,91,791 | 3,71,35,714 | బెంగుళూరు |
| 7. కేరళ | 38,963 | 2,54,53,080 | తిరువనంతపురం |
| 8. గుజరాతు | 1,96,024 | 3,40,85,799 | గాంధీనగర్ |
| 9. గోవా | 3,702 | 10,07,749 | పానాజీ |
| 10. జమ్మూ & కాశ్మీర్ | 1,01,387 | 59,87,389 | శ్రీనగర్ |
| 11. తమిళనాడు | 1,30,058 | 4,84,08,077 | మద్రాసు |
| 12. త్రిపురా | 10,486 | 20,53,058 | అగర్తలా |
| 13. నాగాలాండ్ | 16,579 | 7,74,930 | కోహిమా |
| 14. పంజాబు | 50,362 | 1,67,88,915 | చండీగడ్ |
| 15. పశ్చిమబెంగాలు | 88,752 | 5,45,80,647 | కలకత్తా |
| 16. బీహారు | 1,73,877 | 6,99,14,734 | పాట్నా |
| 17. మధ్యప్రదేశ్ | 4,43,446 | 5,21,78,844 | భోపాల్ |
| 18. మణిపూర్ | 22,327 | 14,20,953 | ఇంఫాల్ |
| 19. మహారాష్ట్ర | 3,07,690 | 6,27,84,171 | బొంబాయి |
| 20. మిజోరామ్ | 21,081 | 4,93,757 | అయిజావ్ |
| 21. మేఘాలయా | 22,429 | 13,35,819 | షిల్లాంగ్ |
| 22. రాజస్తాన్ | 3,42,239 | 3,42,61,862 | జయపూర్ |
| 23. సిక్కిమ్ | 7,096 | 3,16,385 | గాంగ్‌టక్ |
| 24. హర్యానా | 44,212 | 1,29,22,618 | చండీగఢ్ |
| 25. హిమాచల్ ప్రదేశ్ | 55,673 | 42,80,818 | సిమ్లా |
| కేంద్రపాలిత ప్రాంతాలు | | | |
| అండమాన్ & నికోబార్ దీవులు | 8,249 | 1,88,741 | పోర్ట్‌బ్లెయిర్ |
| చండీగడ్ | 114 | 4,51,610 | చండీగడ్ |
| డామన్ & డయ్యూ | 112 | 78,981 | -- |
| దాద్రా & నగర్ హవేలి | 491 | 1,03,676 | సిల్వాసా |
| పాండిచ్చేరీ | 492 | 6,04,471 | పాండిచ్చేరి |
| లక్షదీవులు | 32 | 40,249 | కవరట్టీ |
| ఢిల్లీ | 1,483 | 62,20,406 | ఢిల్లీ |

# భారతదేశ చరిత్ర—ప్రముఖ ఘట్టాలు

క్రీ.పూ

3000 సింధునాగరకత

1500 ఆర్యులరాక - వేదయుగం; ఋగ్వేద సంకలన

1000 గంగామైదానానికి ఆర్యులరాక

900 కురుక్షేత్ర సంగ్రామం.

800 రామాయణం మహాభారతం (ఆదికూర్పు)

603 బింబిసారుని మగధపాలన

600 ఉత్తరభారత్‌లో మహాజనపదులు

551 అజాతశత్రు పాలన

550 ఉపనిషత్తులసంకలనం

540 గౌతమబుద్ధుడు నిర్యాణం.

518 డరయస్ సింధునదిపై పుకు సైలాక్స్‌ను నౌకా సాహసయాత్ర పంపుట

364 నంద రాజవంశ పాలన (364-324)

326 భారతదేశంపై అలెగ్జాండర్ దండయాత్ర

321 నందరాజవంశాన్ని తుదముట్టించి చంద్రగుప్తుడు మౌర్యవంశాన్ని పాటలీపుత్రం రాజధానిగా పాలన (324-300)

300 చంద్రగుప్తుని ఆస్థానంలో యాత్ర చారిత్రకుడు మెగస్తనీస్ గ్రీకు రాయబారిగా ఉన్నాడు.

272 అశోకుని పాలన (272-233)

271 దక్షిణాదిని సిముక శాతవాహన రాజ పాలన స్థాపించాడు.

261 కళింగయుద్ధ విరమణ

187 శుంగవంశపాలన (187-175)

146 ఖారవేలుడు కళింగరాజ్యస్థాపన.

26 పాండ్య (మధుర) చేర (కేరళ) రాజ్యవంశాల ఏలిక.

క్రీ.శ.

40 సింధులోయలో శకుల పాలన

52 సెయింట్ తామస్ భారతదేశంలో మతప్రచారం ప్రారంభం.

78 శకయుగం ప్రారంభం.

98 కనిష్కుని పాలన (98-117)

319 గుప్తసామ్రాజ్య స్థాపన, చంద్రగుప్తుని పాలన (319-335)

350 సముద్రగుప్త ఉత్తరభారతదేశం, దక్కను ప్రాంతాన్ని జయించెను

380 చంద్రగుప్త II విక్రమాదిత్య పాలన; ఫాహియాన్ రాక; గుప్తుల స్వర్ణ యుగం సాహిత్య పునరుజ్జీవనంలో కాళిదాసు ఇతర మహాకవులు, గణిత వేత్తలు ఆర్యభటుడు, వరాహమిహిరుడు, సుశ్రుతుడు (వైద్యం) మనిన కాలం, హిందూమత పునరుద్ధరణ.

606 హర్షవర్ధనునిపాలన ప్రారంభం.

609 చాళుక్యుల పాలన ప్రారంభం.

622 హిజీరా (ముస్లిం) యుగప్రారంభం.

639 హుయాన్‌స్యాంగ్ రాక (629-645)

670 ఇత్సింగ్ రాక.

712 ముహమ్మద్-బిన్-కాసీమ్ సింధుపై దాడి.

753 రాష్ట్రకూటుల పాలన.

892 తూర్పు చాళుక్య పాలన.

985 చోళరాజ్యవంశంపాలన.

1026 మహమ్మద్ గజనీ సోమనాథ స్వర్ణ దేవాలయాన్ని కొల్లగొట్టుట.

1191 ఢిల్లీరాజు పృథ్వీరాజ్ చౌహాన్ ఘోరీ మహమ్మద్‌ను ఓడించాడు. మొదటి తరాయిన్ యుద్ధం.

1192 మహమ్మద్ ఘోరీ పృథ్వీరాజును ఓడించాడు రెండవ తరాయిన్ యుద్ధం.

1206 బానిసరాజు వంశరాజ్యాన్ని ఢిల్లీలో కుతుబుద్దీన్ ఐబెక్ స్థాపించాడు.

1221 మంగోలు చక్రవర్తి చెంగిజ్ ఖాన్ భారతదేశంపై దండయాత్ర.

1232 ఢిల్లీ సమీపమున కుతుబ్ మినార్ నిర్మాణ ప్రారంభం.

1296 అల్లావుద్దీన్ ఖిల్జీ పాలన ప్రారంభం

1298 మార్కోపోలో భారతదేశ సందర్శన.

1320 ఘియాసుద్దీన్ తుగ్లక్ ఢిల్లీలో తుగ్లక్ రాజవంశాన్ని స్థాపించాడు.

1333 ఇబ్నబతూతా భారతదేశ సందర్శన.

1351 ఫిరోజ్‌షా తుగ్లక్ పట్టాభిషేకం.

1398 తైమూర్ భారతదేశంపై దాడి.

1451 లోడీరాజవంశపాలన (1451-1526) ఢిల్లీలో ప్రారంభం.

1489 అదిల్‌షా రాజవంశపాలన బీజాపూరులో ప్రారంభం.

1490 నిజాంషా రాజవంశపాలన అహమ్మద్ నగరంలో ప్రారంభం.

1498 పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా కాలికట్‌కు (కేరళ) రాక.

1510 గోవా పోర్చుగీసువారి కైవసం.

1518 కుతుబ్‌షాహీ రాజవంశం గోల్కొండలో స్థాపన.

1526 మొదటి పానిపట్టు యుద్ధం, లోడీ రాజులను బాబర్ ఓడించి మొగల్ రాజ్యాన్ని స్థాపించాడు.

1530 బాబర్ తర్వాత హుమయూన్ గద్దె నెక్కెను.

1538 గురునానక్ మరణం.

1539 షర్షా హుమయూన్‌ను ఓడించి ఢిల్లీ చక్రవర్తి అయ్యాడు.

1555 హుమయూన్ ఢిల్లీ సింహాసనాన్ని దక్కించుకొన్నాడు. (షర్షా వారసుడు సికిందర్ షా నుండి)

1556 హుమయూన్ మరణం; అక్బర్ పాలన ప్రారంభం; రెండవ పానిపట్టు యుద్ధంలో హేమూని అక్బర్ ఓడించాడు.

1564 హిందువులు చెల్లించవలసిన 'జిజియా జుట్టు పన్ను అక్బర్ రద్దుచేశాడు.

1565 తళ్ళికోట యుద్ధం, దక్కనులోని ముస్లింరాజులమధ్య సంధి - విజయ నగర రాజ్య పతనం.

1582 హిందూ - ముస్లిముల మధ్య సమైక్యాన్ను సాధించుటకు దీన్ ఇలాహీ (దైవంలో విశ్వాసం) అక్బర్ ప్రకటించెను.

1597 అక్బర్ తన దండయాత్రలను ముగించుకొన్నాడు. రాణాప్రతాప్ మరణం.

1600 ఇంగ్లీషు ఈస్ట్‌ఇండియా కంపెనీ స్థాపన.

1602 నెదర్లాండ్స్ ఈస్ట్ ఇండియా కంపెనీ స్థాపన.

1605 అక్బర్ మరణం; జహంగీర్ పాలన ప్రారంభం.

1609 పులికాటు (మద్రాసు సమీపము)లో డచ్చివారి ఫ్యాక్టరీ నిర్మాణం.

1611 మచిలీపట్నంలో ఇంగ్లీషు ఫ్యాక్టరీ నిర్మాణం.

1627 జహంగీర్ మరణం; షాజహాన్ పాలన ప్రారంభం; ఛత్రపతి శివాజీ జననం.

1631 షాజహాన్ తన భార్య ముంతాజ్ స్మృతికి చిహ్నంగా ఆగ్రాలో తాజమహలు నిర్మించాడు.

1639 మద్రాసులో ఇంగ్లీషువారు ఫోర్ట్ సెయింట్‌జార్జికోట నిర్మాణం.

1658 తుదిమొగల్ రాజు ఔరంగజేబు పాలన ప్రారంభం

1666 శివాజీ ఛత్రపతిగా పట్టాభిషేకం.

1679 ఔరంగజేబు మరల జిజియా పన్ను విధింపును పునరుద్ధరించాడు.

1707 ఔరంగజేబు మరణం- మొగల్ రాజ్యం పతనం.

1720 బాజీరావు పీష్వా పాలన పూణేలో ప్రారంభం.

1739 పర్షియారాజు నాదిర్షా ఢిల్లీ కైవసం.

1742 బెంగాలుపై మహారాష్ట్రుల దండయాత్ర; డూప్లే ఫ్రెంచి గవర్నరు అయ్యాడు.

1757 ప్లాసీ యుద్ధం - బెంగాలు నవాబు సిరాజ్-ఉద్-దౌలా మిర్ జాఫర్‌ను ఇంగ్లీషువారు రాబర్ట్ క్లైవ్ నాయకత్వంలో ఓడించారు.

1768 హైదరాలీతో బ్రిటిషువారి సంధి.

1772 వారన్‌హేస్టింగ్స్ బెంగాలు గవర్నరు అయ్యాడు.

1773 బ్రిటిషు పార్లమెంటు వలసపాలనను నియంత్రిస్తూ రెగ్యులేటింగ్ చట్టం చేసింది.

1775 మొదటి ఇంగ్లీషు-మరాఠా యుద్ధం.

1782 సాల్బాయిసంధి.

1780 రెండవ మైసూరు యుద్ధం

1784 హైదరాలీని బ్రిటిషు ఓడించెను.

1784 పిట్స్ ఇండియా చట్ట నిర్మాణం.

1792 ఇంగ్లీషువారు - టిప్పూసుల్తానుమధ్య మూడవమైసూరు యుద్ధం శ్రీరంగపట్నం సంధి

1793 బెంగాలులో శాశ్వత పరిష్కార పట్టా (పెర్మెనెంట్ సెటిల్‌మెంటు) నిర్మాణం.

# భారతదేశ చరిత్ర—ప్రముఖ ఘట్టాలు

1798 వెల్లస్లీ గవర్నరు జనరల్ అయ్యాడు.

1799 నాలుగవ మైసూరుయుద్ధంలో టిప్పూ సుల్తానును బ్రిటిషువారు ఓడించారు. మైసూరు విభజన.

1801 కర్ణాటక బ్రిటిషు ఆధిపత్యంలోనికి వచ్చింది.

1803 మరాఠా యుద్ధం.

1818 మరాఠీవారిని బ్రిటిషువారు అదుపులోపెట్టారు.

1828 లార్డ్ విలియమ్ బేంటింక్ గవర్నర్-జనరల్ అయ్యాడు. ఈయన హయాములో సతీసహగమనం నిషేధం (1829); థగ్గుల అణచివేత (1837)

1841 రంజిత్‌సింగ్ నాయకత్వంలో సిక్కు పాలన ప్రారంభం.

1845 సిక్కుల అణచివేత.

1848 డల్‌హౌసీ గవర్నరు-జనరల్ అయ్యాడు.

1848 పంజాబు బ్రిటిషువారి అధీనం.

1853 బొంబాయి నుండి థాణావరకూ ఇండియాలో మొట్టమొదటిరైలు మార్గ నిర్మాణం.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య
1858 పోరాటం. భారతదేశపాలన ఈస్ట్ ఇండియా కంపెనీ అధీనం నుండి బ్రిటిషు క్రౌన్ పాలనక్రిందికి తెస్తూ విక్టోరియా మహారాణి ప్రకటించింది.

1861 భారతీయ శిక్షాస్మృతి; ఇండియన్ కౌన్సిల్ చట్టం; - హైకోర్టుల చట్టం (ఇండియన్ పీనల్‌కోడ్)

1877 బ్రిటిషురాణి భారతీయ చక్రవర్తినిగా ప్రకటన.

1885 భారతజాతీయ కాంగ్రెసు స్థాపన- బొంబాయిలో మొదటి సమావేశం

1892 భారతీయ పరిపాలనను నియంత్రిస్తూ చట్టం.

1899 లార్డ్ కర్జన్ గవర్నర్-జనరల్ & వైస్రాయి అయ్యాడు.

1905 బెంగాలు విభజన ప్రతిపాదన

1906 ముస్లిమ్‌లీగ్ స్థాపన.

1908 వార్తాపత్రికలచట్టం.

1909 మింటో-మార్లే చట్టం.

1911 పంచమ జార్జిచక్రవర్తి, మేరీరాణి ఢిల్లీలో దర్బారు నిర్వహించారు.

1914 మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభం

1915 మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధి భారతీయ రాజకీయ రంగ ప్రవేశం.

1916 అనిబిసెంట్ చే హోమ్‌రూల్ ఉద్యమం (1916-17) నిర్వహించారు.

1919 రౌలట్ చట్టం - రాజకీయ ఆందోళన ప్రారంభం; జలియన్‌వాలాబాగ్ దురంతం; అలీ సోదరులు, మౌలానా అబుల్‌కలామ్ అజాద్ గాంధీ మద్దతులో ఖిలాఫత్ ఉద్యమం ప్రారంభించారు. (టర్కీషు ఖలీఫాపునరుద్ధరణ సమర్థిస్తూ); పరిమిత స్వయంరాష్ట్ర

1919 పాలనాధికారం ఇస్తూ మాంటేంగు-ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు.

1920 సహాయనిరాకరణకు తీర్మానం; సంస్కరణలపట్ల నిరసన ప్రదర్శన; విదేశీ వస్త్ర దహనం; విద్యార్థులు తరగతులు బహిష్కరణ; లాయర్లు న్యాయవాద వృత్తి బహిష్కరణ.

1921 మలబారులో మోప్లా (ముస్లిం) విప్లవం; వేల్స్ యువరాజు భారత సందర్శన - నిరసనగా హర్తాళ్.

1922 సహాయనిరాకరణ ఉద్యమానికి నాయకత్వం గాంధీజీకి కాంగ్రెస్ అప్పగించింది. బార్డోలీ సత్యాగ్రహం- చౌరీ చౌరావద్ద దౌర్జన్యకాండ- ఉద్యమాన్ని గాంధీజీ తాత్కాలికంగా నిలుపుదల చేశారు.

1923 మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్ స్వరాజ్యపార్టీని ప్రారంభించారు; స్వరాజ్య వాదులు కౌన్సిళ్ళలో ప్రవేశించి ప్రభుత్వాన్ని లోపలనుంచే ఎదుర్కొనాలనే ప్రయత్నం.

1928 సైమన్ కమిషన్‌రాక; 'సైమన్ గో బ్యాక్' నిరసన ప్రదర్శనలు

1929 వైస్రాయి లార్డ్ ఇర్విన్ భారత దేశానికి డొమినియన్ స్టేటస్ ప్రతిపాదించారు. డిసెంబరు 31 అర్ధరాత్రి లాహోరులో జరిగిన కాంగ్రెసు సమావేశంలో పూర్ణ స్వాతంత్ర్యాన్ని అర్థిస్తూ జవహర్‌లాల్ తీర్మానం ప్రవేశపెట్టాడు.

1930 జనవరి 26న భారతదేశ వ్యాప్తంగా ప్రజలు 'పూర్ణ స్వరాజ్యం' స్వాతంత్ర్యదినోత్సవం జరిపారు. సహాయ నిరాకరణ ఉద్యమం కొనసాగుతునే ఉంది. గాంధీజీ నాయకత్వంలో దండి యాత్ర-ఉప్పుసత్యాగ్రహం; లండన్‌లో మొదటి రౌండుటేబిల్ సమావేశం- కాంగ్రెసు పాల్గొనలేదు.

1931 గాంధీ-ఇర్విన్ ఒప్పందం; లండన్‌లో రెండవ రౌండ్ టేబిల్ సమావేశం- గాంధీజీ పాల్గొన్నారు.

1932 కాంగ్రెసు ఉద్యమం అణగదొక్కబడింది; లండన్‌లో మూడవ రౌండ్ టేబిల్ సమావేశం; కమ్యూనల్ అవార్డు ప్రకటన-పూనా ఒడంబడిక.

1933 భారతదేశ సంస్కరణలు మీద శ్వేత పత్రం

1934 సహాయనిరాకరణోద్యమానికి స్వస్తి.

1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టం.

1937 రాష్ట్రాలకు స్వయంపరిపాలన ప్రారంభోత్సవం-రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలు ఏర్పడ్డాయి.

1939 రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం (1939-45), కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేశాయి.

1942 క్రిప్స్ మిషన్ రాక- కాంగ్రెసు, ముస్లిం లీగ్ రెండూ క్రిప్స్ ప్రతిపాదనలను నిరాకరించాయి. కాంగ్రెసు ఆగష్టు 8న క్విట్ ఇండియా తీర్మానం ఆమోదించింది. ఆగష్టు 9న కాంగ్రెసు నాయకులు దేశవ్యాప్తంగా అరెస్టయినారు; కాంగ్రెసును చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించారు. జపాన్ సహకారంతో ప్రవాసంలో నేతాజీ సుభాస్ చంద్రబోస్ అజాద్ హింద్ ఫౌజ్ (ఇండియన్ నేషనల్ ఆర్మీ)ను ఏర్పాటు చేసి సింగపూర్‌లో 'స్వతంత్ర భారత ప్రభుత్వా'నికి ప్రారంభోత్సవం చేశారు.

1943 లార్డ్ వేవెల్ భారతదేశానికి గవర్నరు-జనరల్ & వైస్రాయి అయ్యారు. కాంగ్రెసు- ముస్లింలీగ్ మధ్య ఏకాభిప్రాయం కుదరక వేవెల్ ప్రతిపాదించిన పరిష్కారమార్గం అంగీకారయోగ్యం కాలేదు.

1945 జపాన్ ఓటమితో నేతాజీ నాయకత్వంలోని అజాద్ హింద్‌ఫౌజ్ బ్రిటిషువారికి లొంగుబాటు - జాతీయ సేనాసిబ్బంది (ఐ.ఎన్.ఏ.)ని 'ద్రోహచర్య' క్రింద ప్రత్యేక న్యాయస్థానంలో విచారణ జరిపారు.

1946 రాయల్ ఇండియన్ నేవీలో సైనిక తిరుగుబాటు (ఫిబ్రవరి 18); లార్డ్ పెతిక్ లారెన్స్ నాయకత్వంలో కేబినెట్ మిషన్ రాక (ఆగ. 19); తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటుకు నిర్ణయం - కాంగ్రెసు, ముస్లింలీగ్ రెండూ ఈ ప్రతిపాదనను అంగీకరించలేదు -తరువాత కాంగ్రెసు అంగీకరించి ప్రభుత్వం ఏర్పాటు - దేశవ్యాప్తంగా ముస్లింలీగ్ అల్లర్లు చెలరేగాయి - కలకత్తాలో హిందువులపై ముస్లిముల దౌర్జన్యకాండ - హిందువులు తిప్పికొట్టారు. రాజ్యాంగ పరిషత్తులో చేరమని వైస్రాయి అర్థించుట. ప్రత్యేక పాకిస్తాన్‌కు పట్టుదల - చివరకు ప్రత్యేక పాకిస్తాన్ ఏర్పాటుకు అంగీకారం కుదిరింది.

1947 జూన్ 1948 నాటికి ఇండియాను విడచిపెట్టి వెళ్ళిపోతామని 1947 ఫిబ్రవరి 20, నాడు బ్రిటీష్ ప్రధాని అట్లీ ప్రకటించారు. పాలనా బాధ్యతను బదలాయించడానికి లార్డ్ మౌంట్‌బాటన్‌ను వైస్రాయిగా నియమించారు. మార్చి 24న పదవీ బాధ్యతలు స్వీకరించాడు. బదలాయింపు ఆగస్టు 15 జరగాలని, జూలై 1న బ్రిటిషుపార్లమెంటు ఇండియా ఇండిపెండెన్స్ ఆక్టును సిద్ధపరచారు.

## భారతదేశ చరిత్ర—ప్రముఖ ఘట్టాలు

1947 ఆగస్టు 14-15 అర్ధరాత్రి పూర్ణ స్వాతంత్ర్యం భారతదేశానికి వచ్చింది- పాలనాబాధ్యత బదలాయింపు (ట్రాన్స్ ఫర్ ఆఫ్ పవర్) జరిగింది - మొదటి భారత ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ ఎర్రకోట బురుజు మీద నిలబడి 'ట్రీస్ట్ విత్ డెస్టినీ' చారిత్రకమైన ప్రసంగం చేశారు. లార్డ్ మౌంట్ బాటన్ స్వతంత్ర భారత దేశానికి మొదటి గవర్నర్ - జనరల్ అయ్యాడు.

1948 నాథూరామ్ గాడ్సేచే జన. 30 మహాత్మా గాంధీ హత్య; నిజాం(హైదరాదు)పై 'పోలీసు చర్య' (సెప్టె.13.)

1949 నవ. 26 - భారత రాజ్యాంగాన్ని రాజ్యాంగపరిషత్తు (కానిస్టిట్యుయెంట్ అసెంబ్లీ) సిద్ధపరచింది.

1950 జనవరి 26, భారత రాజ్యాంగం అమలులోనికి రావడంతో భారతదేశం ప్రజాసత్తాక గణతంత్ర రాజ్యమయింది.

1951 డిసె. 15. వల్లభాయి పటేలు
-56 మరణం. మొదటి పంచవర్ష ప్రణాళిక

1952 మొదటి సార్వత్రిక ఎన్నికలు; బాబూ. రాజేంద్రప్రసాదు మొదటి రాష్ట్రపతి గాను జవహర్ లాల్ నెహ్రూ ప్రధానిగాను ఎన్నుకోబడ్డారు.

1953 ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. (అక్టో. 1)

1954 భారత-చీనా దేశాల మధ్య 'పంచశీల ఒప్పందం

1955 ఆవడి కాంగ్రెసు సమావేశంలో సోష లిస్ట్ పేటర్న్ ఆఫ్ సొసైటీ తీర్మానం.

1956 భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవ స్థీకరణ. ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. (నవ. 1) రెండవ పంచవర్షప్రణాళిక 1956-61 హిందూకోడ్ బిల్లు సవరణ.

1957 రెండవ సార్వత్రిక ఎన్నికలు; రాజేంద్ర ప్రసాద్ రెండవసారి రాష్ట్రపతి అయ్యారు. జవహర్ లాల్ నెహ్రూ మరల ప్రధాని అయ్యారు.

1958 తులామాన పద్ధతి మెట్రిక్ విధానానికి మారింది.

1959 బొంబాయిని విభజించగా మహారాష్ట్ర - గుజరాతు రాష్ట్రాలు ఏర్పడ్డాయి.

1961 పోర్చుగీసు అధీనంలో ఉన్న గోవా, డయ్యూ, డామన్ భారత దేశంలో విలీనం.

1962 మూడవ సార్వత్రిక ఎన్నికలు; సర్వేపల్లి రాధాకృష్ణన్ రాష్ట్రపతి అయ్యారు, జవహర్ లాల్ నెహ్రూ మరల ప్రధాని అయ్యారు; ఉత్తర భారత సరిహద్దుపై చీనా దాడి (సెప్టె 19).

1963 నాగాలాండ్ రాష్ట్రం ఏర్పాటు.

1964 జవహర్ లాల్ నెహ్రూ మరణం (మే 27); లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని అయ్యారు.

1965 ఇండో-పాకిస్తాన్ యుద్ధం (రాన్ ఆఫ్ కచ్)

1966 టాష్కెంట్ లో లాల్ బహదూర్ శాస్త్రి - అయూబ్ మధ్య సమావేశం అంగీకారానికి వచ్చుట. లాల్ బహదూర్ శాస్త్రి టాష్కెంట్ లో హఠాన్మరణం (జన.2); ఇందిరాగాంధీ ప్రధాని అయ్యారు. హర్యానా, పంజాబు రాష్ట్రాల ఏర్పాటు; నాలుగవ పంచ వర్ష ప్రణాళిక (1966-71).

1967 నాలుగవ సార్వత్రిక ఎన్నికలు, ఇందిరాగాంధీ మరల ప్రధాని అయ్యారు. జకీరు హుస్సేన్ రాష్ట్రపతి అయ్యారు.

1969 మద్రాసు రాష్ట్రం తమిళనాడుగా పేరుమార్చుకుంది. జకీర్ హుస్సేన్ మరణం; వి.వి. గిరి రాష్ట్ర పతి అయ్యారు. 14 షెడ్యూల్డు బ్యాంకులు జాతీయకరణ చేయబడ్డాయి.

1970 మేఘాలయా రాష్ట్రం ఏర్పడింది. పూర్వపు సంస్థానాధీశులకిచ్చే రాజభరణాలు (ప్రీవీ పర్సులు) రద్దయ్యాయి.

1971 హిమాచలప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. లోక్ సభకు మధ్యంతర ఎన్నికలు- ఇందిరాగాంధీ మరల ప్రధాని అయ్యారు. ఇండో- పాక్ యుద్ధం, బంగ్లాదేశ్ అవతరణ (డిసె.17); ఐదవ పంచ వర్షప్రణాళిక (1971 - 76)

1972 మణిపూర్, త్రిపురా రాష్ట్రాలు ఏర్పడ్డాయి; అరుణాచల ప్రదేశ్, మిజోరామ్ కేంద్రపాలిత రాష్ట్రాలయ్యాయి;, రాజగోపాలాచారి మరణం.

1973 మైసూరు రాష్ట్రం పేరు కర్నాటక రాష్ట్రంగా మారింది.

1974 ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ రాష్ట్రపతి అయ్యారు.

1975 సర్వేపల్లి రాధాకృష్ణన్ మరణం (ఏప్రి. 17); సిక్కీమ్ 22వ రాష్ట్రంగా భారతదేశంలో విలీనమయ్యింది; అత్యవసర పరిస్థితి (ఎమర్జన్సీ) ప్రకటన (జూన్ 25); కలకత్తా, మద్రాసు దూరదర్శన్ (టి.వి) కేంద్రాలు స్థాపన; కట్టుబానిసత్వం (బాండెడ్ లేబర్) నిర్మూలన.

1976 రాజ్యాంగనికి 42వ సవరణ ఫలితంగా భారతదేశం సోషలిస్టు సెక్యులర్ రిపబ్లిక్ అయింది.

1977 లోక్ సభ రద్దయింది; రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ మరణం (ఫిబ్ర.3); అత్యవసర (ఎమర్జన్సీ) పరిస్థితి సడలింపు (మార్చి 21); లోక్ సభకు మధ్యంతర ఎన్నికలలో జనతా పార్టీ విజయం సాధించగా మొరార్జీ దేశాయి ప్రధాని అయ్యారు.

1977 'నీలం సంజీవరెడ్డి ఏకగ్రీవంగా రాష్ట్ర పతిగా ఎన్నిక అయ్యారు.

1978 కాంగ్రెసు (ఐ) పార్టీ ఏర్పడింది.

1979 మొరార్జీ దేశాయి ప్రధాని పదవికి రాజీనామా (జూలై 15); మదర్ తెరిసాకు నోబెల్ పురస్కారం.

1980 లోక్ సభకు మధ్యంతర ఎన్నికలలో ఇందిరాగాంధీ విజయం సాధించి మరల ప్రధాని అయ్యారు.

1982 తెలుగుదేశం పార్టీ నందమూరి తారకరామారావుచే స్థాపన; ఏనుగువానిలంక (ప.గో.జిల్లా)లో పెట్రోలు నిక్షేపం బయటపడింది. ఆచార్య వినోబాభావే మరణం (నవ. 15)

1983 ఆంధ్రప్రదేశ్ శాశనసభ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ విజయం సాధించగా ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రి అయ్యారు; సముద్ర గర్భంలో (బొంబాయి సమీపమున) పెట్రోలు నిక్షేపం బయటపడింది.

1984 ఫిబ్ర 26. ఇన్సాట్ 1 కృత్రిమ ఉపగ్రహం పనిచేయడం ప్రారంభం.

1984 ఏప్రిల్ రాఖేష్ శర్మ ప్రప్రథమ భారతీయ రోదసీనివాసి (సోయుజ్ టి.II), ఎవరెస్టు శిఖరారోహణచేసిన ప్రప్రథమ భారతీయ మహిళ కుమారి బిచేంద్రీపాల్. జూన్ 6 పంజాబులో తీవ్రవాదుల ఆగడాలను అరికట్టడానికి అమృతసర్ లోని స్వర్ణదేవాలయంలో 'ఆపరేషన్ బ్లూస్టార్' చర్య. అక్టో.31. ఇందిరాగాంధీ హత్య; రాజీవ్ గాంధీ ప్రధాని అయ్యారు. డిసె. లోక్ సభకు 8వ సార్వత్రిక ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) విజయం సాధించగా రాజీవ్ గాంధీ మరల ప్రధాని అయ్యారు.
భోపాల్ గ్యాస్ దుర్ఘటన డిసె.3

1985 భారత జాతియకాంగ్రెసు శతజయంతి వార్షికోత్సవం. డిసె.26

1986 జన 13 ఇండియన్ ఎయిర్ లైన్స్ ఫోకర్ (44) విమానాన్ని నడిపిన మొదటి మహిళా బృందానికి నాయకత్వం వహించిన వారు కమేండర్ సౌదామిని దేశ్ ముఖ్, కో - పైలట్ నివేదితా భాసిన్. ఫిబ్ర. 17. సుప్రసిద్ధ తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి తన 90వ ఏట సిద్ధి పొందేరు.

1987 బోఫోర్స్, ఫెయిర్ ఫాక్స్ ఉదంతాలు బయటపడ్డాయి.

1989 9వ లోక్ సభకు సార్వత్రిక ఎన్నికలు, నేషనల్ ఫ్రంట్ పార్టీ తరఫున విశ్వనాథప్రతాపసింగ్ (ప్రధాని) నాయకత్వంలో అల్పసంఖ్యాక (మైనారిటీ) ప్రభుత్వం ఏర్పడింది. (డిసె.3)

ఇంతనేపథ్యంతో రాజకీయంగా నాలుగు దశాబ్దాల స్థిరత్వ చరిత్రగల ప్రజాస్వామ్య భారతదేశానికి ఎల్లలు ఉత్తరాన హిమాలయ పర్వత శ్రేణులు, దక్షిణాన హిందూ మహాసముద్రం, తూర్పున బంగాళా ఖాతం, పశ్చిమాన అరేబియా సముద్రం. పొరుగున ఉత్తరాన నేపాల్, భూటాన్, చీనా, టిబెట్, అఫఘనిస్తాన్, దక్షిణాన శ్రీలంక, మాల్దీవులు, తూర్పున బంగ్లాదేశ్, బర్మా, పశ్చిమాన పాకిస్తాన్ ఉన్నాయి. 68° 7′, 97° 25′. తూర్పురేఖాంశాలు, 8° 4′, 37° 6′, ఉత్తర అక్షాంశల మధ్యనున్న ప్రదేశంలో భారతదేశం ఉంది. దేశం చుట్టు సరిహద్దు రేఖ పొడవు 15,200 కి.మీ. ఉత్తర దక్షిణాలుగా కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు దూరం 3214 కి.మీ. తూర్పు పడమరలు మధ్య దూరం 2933 కి.మీ. విస్తీర్ణం: 32,87,263 చ.కి.మీ. జనాభా: 68,51,84,692 (1981), 1988 అంచనా ప్రకారం 88,03,00,000కు పెరిగింది. గ్రామీణ జనాభా 77 శాతం. అధికార భాష: హిందీ.(చూ. జాతీయ భాషలు) ప్రజలు కాకసాయిడ్, మంగోలాయిడ్, ద్రావిడ్, నార్డిక్ ఆర్యులు, ప్రాటో—ఆస్ట్రలాయిడ్, పశ్చిమ బ్రాకీ సెఫాలిన్, నీగ్రిటో మానవ వర్గాలకు, ఉపజాతులకు చెందినవారు. ఆదిమ జాతులు, గిరిజనులూ ఈశాన్యంలో నాగాలు, దక్షిణాదిని ఇరుళ, కాడార్, లంబాడీ, సవర, గదబ, కోయ, ఖోండ్; మధ్యప్రదేశ్‌లో భిల్లు, సంతాళులు నివసిస్తున్నారు.(చూ. ఆయా రాష్ట్రాలు—అకారాది శీర్షికలు)

## భారతప్రభుత్వం

భారత రాజ్యాంగా(చూ.)నికి లోబడి కేంద్రప్రభుత్వ భారత దేశాన్ని పరిపాలిస్తుంది. లోకసభకు సార్వత్రిక ఎన్నికలు 5 ఏళ్ళకు ఒకసారి జరుగుతాయి. లోక్‌సభలో సంఖ్యాబలం ఉన్న రాజకీయ పక్షనాయకుణ్ణి ప్రభుత్వం ఏర్పాటు చేయమని రాష్ట్రపతి ఆహ్వానిస్తాడు. ఎన్నికలు కాగానే వివిధ రాజకీయ పక్షాలకు చెందిన ఎన్నికయిన లోక్‌సభ సభ్యులు సమావేశమై తమ తమనాయకులను ఎన్ను కుంటారు. మెజారిటీ పక్ష నాయకుడు ప్రధాని అయి, మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేస్తాడు. ఆయా మంత్రులు కార్యనిర్వాహక యంత్రాంగం ద్వారా దేశపరి పాలన నిర్వహిస్తూ ఉంటారు. (చూ. ప్రభుత్వం)

## భారత రాజ్యాంగం

1946 డిశంబరు 9న అవిభాజ్య భారతదేశానికి రాజ్యాంగ విధాన పరిషత్తు ఏర్పడింది. 1947 జూన్‌లో విభజన, ప్రత్యేక పాకిస్తాన్‌కు ఏర్పాటు జరిగిన తర్వాత ఆ పరిషత్తు 'భారత రాజ్యాంగ' నిర్మాణానికే పరిమితమైంది. పాకిస్తాన్ ప్రతినిధులు దానిలోనుంచి ఉపసంహ రించు కున్నారు. 1947 ఆగస్టు 14న రాజ్యాంగ పరిషత్తు సచ్చిదానంద సిన్హా అధ్యక్షతన సమావేశమయింది. పిదప సిన్హా మరణించగా బాబూ రాజేంద్రప్రసాద్ ఆ పరిషత్తుకు అధ్యక్షుడయ్యాడు. రాజ్యాంగ ముసాయిదా ప్రతిని ఫిబ్రవరి 1948లో సిద్ధంచేశారు. 1949 నవంబరు 26నాడు రాజ్యాంగానికి తుది రూపం ఇచ్చి దానిని ఆమోదించారు. 1950 జనవరి 26నాడు అది అమలులోనికి వచ్చి భారతదేశం ప్రజాసత్తాక గణతంత్ర రాజ్యంగా (రిపబ్లిక్) ప్రకటితం అయింది. రాజ్యాంగ నిర్మాణంలో పాల్గొన్న ప్రముఖులలో వల్లభాయి పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, పట్టాభి సీతారామయ్య, బి.ఆర్. అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, రాజ గోపాలాచారి ప్రభృతులు ఉన్నారు. రాజ్యాంగాన్ని తయారుచేసి ప్రకటించిన తరవాత ఆ పరిషత్తే మొట్టమొదటి పార్లమెంటుగా 1952లో సార్వత్రిక ఎన్నికలు జరిగేవరకూ వ్యవహ రించింది.

భారత రాజ్యాంగంలో ప్రధాన అంశాలు: ప్రాథమిక హక్కులు (ఫండమెంటల్ రైట్స్), కార్యనిర్వాహక శాఖ (ఎగ్జిక్యూటివ్), రాష్ట్రపతి (ప్రెసిడెంట్), ఉపరాష్ట్రపతి, మంత్రివర్గం, లోక్‌సభ, రాజ్యసభ, న్యాయవ్యవస్థ (జుడి షియల్), ఉద్యోగి శాఖ (పబ్లిక్ సర్వీసెస్) వీటి ఏర్పాటు. హక్కులు, విధులు రాజ్యాంగంలో వివరంగా పొందుపరుప బడినాయి. ఇందులో లోక్‌సభను దిగువ సభ లేదా ప్రజాప్రతినిధుల సభ అనీ, రాష్ట్ర శాసన సభల ప్రతినిధులతో కూడిన రాజ్యసభను ఎగువసభ అనీ అంటారు. లోక్‌సభ, రాజ్యసభ కలసి పార్లమెంట్ అవు తుంది. ప్రజావసరాలను బట్టి రాజ్యాంగాన్ని అప్పు డప్పుడూ సవరణలు చేస్తారు. మొట్టమొదటి సవరణ 1951లో చేయబడింది. ఇప్పటికి 63సార్లు (1990) భారత రాజ్యాగం సవరించబడింది. (చూ. భారత స్వాతంత్ర్య పోరాటం; రాజేంద్రప్రసాద్)

# భారతస్వాతంత్ర్యపోరాటం

పరపాలననుంచి దేశాన్ని విముక్తి చేసి స్వపరిపాలన చేసుకుందామనే భావన చాలా మంది భారతీయులకు మొదటగా 19వ శతాబ్ది మధ్యలో కలిగింది. ఈ తరుణంలో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ (చూ.) పాలనలో డల్‌హౌసీ (చూ.) భారతదేశంలో గవర్నర్–జనరల్‌గా (1848–56) నియమితు డయ్యాడు. అంతకు ముందు ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం ప్రారంభమై ఆ పారిశ్రామికోత్పత్తులు దిగుమతి కావడంతో భారత దేశంలో చేనేత వంటి అనేక కుటీర పరిశ్రమలు మూలపడడం వలన ప్రజల జీవనోపాధి పోయి వారి ఆర్థిక స్థాయి దిగజారి పోయింది. ఈ నేపథ్యంలో ఏ రాజైనా వారసులు లేకుండా చనిపోతే ఆ సంస్థానం బ్రిటిష్ ఇండియాలో అంతర్భాగం అయిపోతుందనే ప్రభుత్వ విధానాన్ని డల్‌హౌసీ ప్రవేశపెట్టాడు. ఝాన్సీ, నాగపూర్ సతరాసంస్థానాలు తమ రాజ్యభాగాలుగా బ్రిటిషు వారు ప్రకటించగా ఆ సంస్థానాధీశులు తీవ్రమయిన ఆందోళ నకు గురియై అన్యాయ మని నిరసన తెలుపగా వారి సైన్యాలను రద్దు చేశాడు. ఈ చర్యవల్ల మొగల్ చక్రవర్తుల వారసుల చెల్లాచెదురు అయారు. సైనికులు, ఉద్యోగులు నిరుద్యోగు లయిరి. ఇలా తీవ్రమైన అసంతృప్తికి గురి అయిన సంస్థానాధీశులు కంపెనీపాలనను ఎట్లాగైనా తుది ముట్టించాలని నడుంకట్టారు.

ఇలా 1857లో బ్రిటిష్ నిరుంకుశ పాలనా విధానానికి స్వస్తి పలకడానికి ప్రయత్నం ప్రారంభమయింది. బ్రిటిషు కంపెనీ సైన్యంలోని భారతీయ సిపాయిలను బ్రిటిష్ సైనిక అధికార్లు న్యూనతా భావంతో చూసేవారు. కూలీలనీ నీచంగా అవమానించేవారు. అప్పుడే కంపెనీసైన్యంలో ఎన్‌ఫీల్డ్‌రైఫిల్ అనునూతన రకం తుపాకీలను వాడుకలో పెట్టారు. ఈ క్రొత్తరకం రైఫిల్‌లో వాడే తూటాలను క్రొవ్వు దట్టించి ఉండేది. సిపాయీలు తూటా కొసను పంటితో కొరికి తుపాకీలో పెట్టి పేల్చ వలసివచ్చింది. అయితే, ఆ కొవ్వు ఆవు కొవ్వుగాని పంది కొవ్వుగాని అయిఉంటుందని వదంతి పుట్టించారు దానితో హిందూ ముస్లిం సైనికులు అది తమతమ మత సంప్రదాయాలకు విరుద్ధమని ప్రతిఘటన ప్రారంభించారు. ఆ విప్లవరాజు కుంది. తిరుగుబాటు మొదట మీరట్‌లో ప్రారంభమయి ఒకవైపు పంజాబులో మొదలుకొని దక్షిణంగా నర్మదా వరకూ, మరోవైపు తూర్పున బీహారు నుంచి పశ్చిమాన రాజస్థాన్ వరకూ వేగంగా విస్తరించింది. నాలుగు మూలల నుంచి సైనికులు ఢిల్లీ చేరుకొనగా 'ఢిల్లీ ముట్టడి'కి గురిఅయిందా అనిపించినట్టయింది. అందరూ కలిసి అంటే ప్రజలూ సైనికులు కలిసి బ్రిటిష్ వారిపై ధ్వజమెత్తినట్లయింది. ఆఖరి మొగల్ చక్రవర్తి బహదూర్‌షా జఫర్‌ను భారతదేశ చక్రవర్తిగా ప్రకటించారు. నానాసాహెబ్ (చూ.) నాయకత్వాన కాన్పూరులో తిరుగుబాటు జరుగుగా బ్రిటిష్ సైనికదళంపై జయభేరి మ్రోగించి పీష్వాఅయ్యాడు. నానాసాహెబ్ సేనాధిపతి తాంతియాతోపే (చూ.) మధ్య భారత్‌లోని గ్వాలియర్ మీదుగా ఝాన్సీవైపు సైన్యాన్ని నడిపించాడు. ఝాన్సీరాణీ లక్ష్మీబాయి (చూ.) పురుషవేషధారియై కత్తిపట్టి రణ రంగంలోకి దూకి వీరస్వర్గం చేరింది. లక్నో నవాబు భార్య హజ్రత్‌మహల్ తిరుగుబాటుకు ప్రోత్సహించింది. బీహారులో రాజాకున్వార్ సింగ్ (జగదీశ్ పురం) నాయకుడయ్యాడు. ఇట్లు తిరుగుబాటు ఛోటా నాగపూర్ సంతాలపరగణాల లోని జమీందార్ల మద్దతుతో పితూరీలు చెలరేగాయి. దాదాపు 18 మాసాలు ఈ తిరుగుబాటు ధోరణి కొనసాగింది. అయితే చివరకు మొత్తం మీద అంగబలం, మందుగుండుబలం ఉండడంతో బ్రిటిష్‌వారు ఈ తిరుగుబాటును అతి క్రూరంగా అణచివేయగలిగారు. కొందరు పెద్దనవాబులు తిరుగుబాటు దార్లకు మద్దతు ఇవ్వలేక పోయారు. తాంతియాతోపేను చివరకు పట్టుకుని ఉరి తీశారు. బహదూర్‌షాను బ్రిటిష్‌వారు బర్మాలో ప్రవాస నిర్బంధంలో ఉంచారు. ఈ తిరుగుబాటును 'సిపాయిల తిరుగుబాటు'గా బ్రిటిష్ చరిత్రకారులు వర్ణించినప్పటికీ వాస్తవానికి ఇది జాతీయోద్యమానికి నాందీ ప్రస్తావనమై ప్రథమభారత స్వాతంత్ర్య సమరంగా రూపుదిద్దుకుందని పేర్కొన వచ్చును. దాని ఫలితంగా భారతపాలనను కంపెనీ పాలనముండి ఇంగ్లండు రాణి విక్టోరియా 1858లో స్వీకరించింది. లార్డ్ కానింగ్ రాజప్రతినిధి (వైస్రాయి) గా నియమితుడవడంతో బ్రిటిష్ పార్లమెంటు ద్వారా భారతప్రభుత్వ పాలన ప్రారంభ మయింది. భారతీయ ప్రజలమత విషయాల్లో జోక్యం చేసుకో బోమని చెబుతూ

సంస్థానాధీశులతో కానింగ్ ఒడంబడికలు చేసుకున్నాడు. దానితో ఆందోళన కొంతవరకు సద్దుమణిగింది. 1877 లో విక్టోరియా రాణి భారతదేశానికి చక్రవర్తిని అయింది. డిజిరేలీ బ్రిటిష్ ప్రధానిగా సామ్రాజ్యానికి స్థిరత్వం చేకూరింది. అంతకు ముందే మెకాలే, బెంటింక్ పూనికపై భారతదేశంలో ఇంగ్లీషు చదువులు ప్రారంభ మయ్యాయి. వర్నాక్యులర్ స్కూళ్ళు ప్రారంభ మయి పనిచేస్తున్నాయి. బొంబాయి, కలకత్తా, మద్రాసు, రాజధాని నగరాలలో యూనివర్సిటీలు ప్రారంభమ య్యాయి (1857). దానిఫలితంగా పెక్కుమంది భార తీయులు పాశ్చాత్య రాజకీయ భావాలను అధ్యయనం చేయడం మొదలుపెట్టడంతో దేశంలో నవజాగృతి నెలకొంది. ఫ్రెంచి విప్లవం (చూ.) అమెరికన్ విప్లవం (చూ.) వంటి విషయాలు తెలుసుకొనగలిగి ప్రభావితు లయ్యారు. రానడే, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (చూ.) దయానంద సరస్వతి (చూ.), వివేకానంద (చూ.), రామకృష్ణ పరమహంస (చూ.), గోపాలకృష్ణ గోఖలే (చూ.), సయ్యద్ అహమ్మద్‌ఖాన్ ప్రభృతులు ఈ పునరుజ్జీవన కార్యక్రమంలో పాల్గొన్నారు. అదే సమయంలో భారతజాతీయ కాంగ్రెసు హ్యూమ్, బొనర్జీ, ఫిరోజిషామెహతా ఆధ్వర్యవంలో 1885లో బొంబాయి లో నెలకొన్నది. (చూ. కాంగ్రెస్, భారత జాతీయ) ఆ తరువాత స్వాతంత్ర్యపోరాటంలో లాల్— బాల్—పాల్ నాయక త్రయంలో లాలాలజపతిరాయ్ (చూ.), అతివాద వర్గానికి నాయకత్వం వహించాడు. మితవాద వర్గానికి గోపాలకృష్ణ గోఖలే నాయకుడయ్యాడు. 1908లో తిలక్ 'స్వరాజ్యం నాజన్మహక్కు— దానిని నేను సాధించి తీరుతాను' అని ఎలుగెత్తి అరిచాడు. అంతకు కొన్నాళ్ళ ముందు భారతదేశానికి వైస్రాయిగా వచ్చిన కర్జన్ (చూ.) బెంగాల్ విభజన ప్రతిపాదించాడు (1905). ఈ చర్య జాతీయ నాయకులెవ్వరికి బెంగాలులో ఇష్టంలేదు. స్వదేశ ఉద్యమాన్ని సురేంద్ర నాథ బెనర్జీ (చూ.) చేపట్టి ప్రజలకు ప్రబోధించాడు. ఈ కార్యక్రమంలో విదేశీ సరుకులను తగులబెట్టడం ఒక కార్యక్రమం. ఆరేళ్ళు సాగిన ఈ ఉద్యమం తరువాత కర్జన్ బెంగాలు విభజన ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

ఇదే సమయంలో (1915) దక్షిణాఫ్రికా నుంచి స్వదేశానికి తిరిగి వచ్చిన వెంటనే మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ (చూ.) భారతరాజకీయాలలో రంగప్రవేశం చేశాడు. దానితో భారత జాతీయ కాంగ్రెసుకు గాంధీగారి తిరుగులేని నాయకత్వ లభించింది. ఆయన అహింసా మార్గాన్ని చేపట్టి సత్యాగ్రహమనే ఆయుధం ద్వారా తన కార్యక్రమాన్ని నిర్వహించేవాడు. ఖద్దరు వడకడం, హరిజనోద్ధరణ వంటి నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టి ప్రజలను ఆకట్టుకుని కార్యోన్ముఖుల్ని చేయగలిగారు. బీహారులోని నీలి ముందు రైతులను రక్షించవడానికి చంపారన్ సత్యాగ్రహంలో, గుజరాతులో పెచ్చు శిస్తు నుంచి రైతులను రక్షించడానికి కైరా సత్యాగ్రహం, అలహాబాద్ సమ్మెవంటివి నిర్వహించి తన నాయకత్వపటిమను నిరూపించుకున్నాడు. ఫలితంగా చిత్తరంజన్‌దాస్, వల్లభాయ్ పటేలు, రాజాజీ, పట్టాభి సీతారామయ్య, సత్యమూర్తి, మోతిలాల్ నెహ్రూ, టంగుటూరి ప్రకాశం వంటి ఉన్నత శ్రేణి న్యాయవాదులు దేశవ్యాప్తంగా తాము చేసుకుంటున్న లాభసాటి వృత్తిని త్యాగం చేసి గాంధీపథంలో పడి భారతస్వాతంత్ర్య పోరాట ఉద్యమంలోకి దూకారు. ఇంకను ఎంతోమంది సంస్కరణాభిలాషులు చేస్తున్న వృత్తులు, చదువుతున్న చదువులు విడిచిపెట్టి రాజకీయ రంగంలోకి వచ్చారు. ఇదే సమయంలో అల్లూరి, వీరసావర్కార్ (చూ.), చంద్రశేఖర్ అజాద్, ఖుదీరాం బోసు, భగత్‌సింగ్ (చూ.) వంటివారు విప్లవపంథాను తొక్కి బ్రిటిష్ వారిని గడగడ లాడించారు. ఎన్.ఎమ్. జోషీ, రామ్‌మనోహర్ లోహియా, అరుణాఅసఫాలీ వంటి సోషలిస్టు భావాలున్న నాయకులు ఈ పోరాటానికి మద్దతు ఇచ్చారు. సుబ్రమణ్యభారతి, ఇక్బాల్ (చూ.), రవీంద్రనాథ్ టాగూర్ (చూ.), సరోజినీనాయుడు (చూ.), చిలకమర్తి లక్ష్మీనరసింహం (చూ.), జాషువా (చూ.), బసవరాజు అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటి వారు తమ కవిత్వ రచనలద్వారా జాతీయ భావాల్ని ప్రబోధిస్తూ ప్రజల్లో దేశభక్తి ప్రచారం చేశారు. ఈ సమయంలో ఆలీసోదరులు ఖిలాఫత్ ఉద్యమాన్ని నడిపించారు (1919). అనిబిసెంట్ హోమ్ రూలు ఉద్యమం నడిపింది. రౌలట్ చట్టం, 1919లోని జలియన్‌వాలాబాగ్ దురంతం (చూ.) గాంధీజీని చకితిడ్ని చేశాయి. దానితో గాంధీజీ

సహాయనిరాకరణోద్యమం (1920) శాసనోల్లంఘనం (1921) వంటి ఉద్యమ కార్యక్రమాలకు పిలుపు నిచ్చాడు. ఆ పిలుపు ప్రభంజన స్థాయినందుకొని దేశ వ్యాప్తంగా విస్తరించింది. లాఠీచార్జీలు చేశారు. జాతీయ నాయకుల్ని నిర్బంధించి కారాగారాల్లో పెట్టారు. వాస్త వానికి గాంధీజీ భారత రాజకీయాల్లో ప్రవేశించడం వల్ల భారత దేశంలోని భిన్నజాతులు, మతాలు, భాషలకు చెందిన వారి మధ్య అరమరికలు పోయి భావసమైక్యతను సాధించకోడానికి వీలయింది. సంయుక్త పరగణాలు (యు.పి.)లో చౌరీచౌరా అనుచోట అల్లర్లు జరుగగా పోలీసు కాల్పులు జరిపారు. తలపెట్టిన **బార్డోలీ** సత్యాగ్రహాన్ని గాంధీజీ నిలిపివేశాడు. ప్రజలు జరిపిన హింసాకాండ గాంధీజీకి నచ్చక అసమ్మతి **సూచకంగా** అలా చేశారు. చివరకు బార్డోలీ సత్యాగ్రహం 1928లో హెచ్చు భూమిశిస్తును నిరసిస్తూ నిర్వహించారు. నాయకత్వం గుజరాతు నాయకుడు వల్లభాయి పటేలుకు అప్పచెప్పాడు. అప్పుడు పటేల్ **'సర్దార్'** అయాడు. 1928లో బ్రిటిష్ వారు సైమన్ మంత్రివర్గ సమితిని పంపారు. కాని 'సైమన్ గోబ్యాక్' అనే నినాదంతో జాతీయనాయకులు నిరసన తెలిపారు. మద్రాసులో సిపాయీల తుపాకులకు రొమ్ము చూపి నిలచిన టంగుటూరి ప్రకాశం 'ఆంధ్రకేసరి' అయ్యాడు. 1927లో కాంగ్రెస్ మహా సభలో జవహర్ లాల్ నెహ్రూ 'పూర్ణస్వరాజ్యా'నికి తీర్మానం ప్రవేశపెట్టగా సభ ఆమోదం తెలిపింది. 1930 జనవరి 26 నాడు సంపూర్ణ స్వరాజ్యం కోసం పోరాటం కొనసాగిస్తామని దేశ ప్రజలు ప్రతిజ్ఞ పూనారు. ఎమ్. ఎన్.రాయ్, రామ్‌మనో హర్ లోహియా, జయప్రకాశ నారాయణ్, పట్వర్థన్, అరుణా అసఫాలీ వంటి సోషలిస్టు భావాలు గల నాయకులు ఈ పోరాటంలో పాల్గొన్నారు. విప్లవ మూర్తులు భగత్ సింగ్ (చూ), సుఖదేవ్ కేంద్ర పార్లమెంటులో బాంబు ప్రయోగం చేశారు. వారిని వారించి ఉరికంబ(1930)మెక్కించగా వారు అమరు మూరు. ఆ తరువాత దేశ వ్యాప్తంగా గాంధీజీ నాయకత్వంలో 1930 ఏప్రిల్‌లో ఉప్పు సత్యాగ్రహం (చూ) జరిగింది. 1942లో జరిగిన విప్లవాన్ని రైతులు, కార్మికులు, విద్యార్థులు నడిపారు. ఈ రెంటికీ మధ్య లండన్‌లో రౌండ్ టేబిల్ సమావేశాలు మూడు సార్లు జరిగాయి. మొదటి సమావేశాన్ని (1930) కాంగ్రెసు బహిష్కరించగా రెండవ (19 31), మూడవ (1932) సమావేశాల్లో గాంధీజీ పాల్గొన్నారు; మధ్యలో రామ్సే మేగ్డనాల్ ప్రవేశపెట్టిన (1932) కమ్యూనల్ అవార్డు అంబేద్కరు వంటి హరిజన నాయకులకు నచ్చక ఎదురు తిరుగగా ఒడంబడిక చేసికొనడంతో కమ్యూనల్ అవార్డు ఉపసంహరించు కోవల్సివచ్చింది. ఈ పరిణామాల ఫలితంగా భారత ప్రభుత్వ చట్టం 1935 రూపుగొని రాష్ట్రాలలో ఎన్నికలు నిర్వహింపబడిన తరువాత 1937లో మంత్రి వర్గాలు ఏర్పడి ప్రజాప్రభుతాలు నెలకొన్నాయి. సుభాస్ చంద్రబోస్ (చూ.) తీవ్ర భావాలుగల వ్యక్తి. గాంధీజీ మెత్తని తనం ఆయనకు నచ్చక విభేదించారు. 1939లో రెండవ ప్రపంచయుద్ధం ప్రకటించడంతో బ్రిటిష్ వైఖరి జాతీయ నాయకులకు నచ్చక పోవడంతో ఈ రాష్ట్రమంత్రి వర్గాలు రాజీనామా చేశాయి. మూక ఉమ్మడి అరెస్టులు జరిగాయి. గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహానికి పిలుపు నిచ్చారు. ఇందులో వినోబా భావే (చూ) మొట్టమొదటి సత్యాగ్రహి నాయకులంతా కటకటాల వెనుకకు వెళ్ళారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అజాద్ హింద్ ఫౌజ్ (1942) ఏర్పడడంతో స్వాతంత్ర్య పోరా టానికి బయట దేశాల నుండి దోహదం లభించింది. ఈ అజాద్ హింద్ ఫౌజు (ఐ.ఎన్.ఏ.)కు తరువాత సుభాసుచంద్రబోస్ నాయకత్వం లభించింది. 1945లో ప్రపంచ యుద్ధం ముగియగానే నిర్బంధంలో ఉన్న జాతీయనాయకులు విడుదలయారు. ఆ తరువాత 1946లో బొంబాయిలోని భారత నౌకాదళం తిరుగు బాటు చేసింది. దానితో బ్రిటిష్ ప్రభుత్వం భారతీయు లకు స్వాతంత్ర్యం ఇస్తామని ప్రకటించింది. ఈ విధంగా భారత స్వాతంత్ర్య పోరాటం హింస లేకుండా గాంధీజీ నాయకత్వంలో ముగిసింది. జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా తాత్కాలిక భారత కేంద్ర ప్రభుత్వం ఏర్పడింది (1946). ముస్లిములు మహమ్మదాలీ జిన్నా నాయ కత్వంలో ముస్లిములకు ప్రత్యేక పాకిస్తాన్ ఏర్పాటు గురించి పట్టుపట్టడంతో 1947లో మౌంట్ బాటన్‌ను వైస్రా యిగా నియమించి ప్రభుత్వ బదలాయింపు ఏర్పాటును చేశారు. దేశ విభజన తప్పనిసరియై భారతదేశం, పాకిస్తాన్ దేశాల ఆవిర్భావానికి దేశ నాయకులు ఒప్పుకోవల్సి

# భారత స్వాతంత్ర్య పోరాటం-ప్రముఖ సమరయోధులు

| | | | |
|---|---|---|---|
| అంబేద్కర్* | 1891-1956 | ప్రతివాది భయంకరాచార్యులు | 1910 జననం |
| అజాద్ మౌలానా అబుల్ కలాం * | 1888-1956 | పింగళి వెంకయ్య* | 1885-1963 |
| అరవిందఘోష్* | 1872-1933 | ఫిరోజ్‌షా మెహతా * | 1845-1915 |
| అల్లూరి సీతారామరాజు* | 1897-1922 | బంకించంద్ర ఛటర్జీ* | 1838-1894 |
| అహ్మద్ ఖాన్, సయ్యద్ | 1817-1888 | భగత్‌సింగ్* | 1907-1931 |
| ఆచార్య నరేంద్రదేవ్* | 1889-1956 | బాలగంగాధర్ తిలక్* | 1856-1920 |
| ఆనిబిసెంట్* | 1847-1933 | బిపిన్ చంద్రపాల్* | 1858-1920 |
| ఇందిరాగాంధి* | 1917-1984 | బెజవాడ గోపాలరెడ్డి * | 1907-జననం |
| ఇక్బాల్, మహమ్మద్* | 1873-1938 | బొనర్జీ డబ్ల్యు.సి. | 1844-1906 |
| ఈశ్వరచంద్రవిద్యాసాగర్* | 1820-1891 | పట్టాభి సీతారామయ్య, బి.* | 1880-1959 |
| ఉద్ధమ్‌సింగ్ | 1899-1940 | మదన్‌మోహన్ మాలవ్యా* | 1861-1946 |
| ఉన్నవ లక్ష్మీనారాయణ* | 1873-1958 | మహదేవ్ గోవింద రానడే* | 1842-1901 |
| ఎమ్.ఎన్. రాయ్* | 1886-1954 | మహమ్మద్ ఆలీ జిన్నా* | 1875-1948 |
| కందుకూరి వీరేశలింగం* | 1848-1919 | మాడపాటి హనుమంతరావు* | 1885-1965 |
| కన్నెగంటి హన్మంతు | మరణం 1921 | ముట్నూరి కృష్ణారావు* | 1879-1945 |
| కలేల్కర్ | 1885 జననం | మొరార్జీ దేశాయి * | 1896 జననం |
| కస్తూర్బాగాంధి* | 1869-1944 | మోతీలాల్ నెహ్రూ* | 1861-1931 |
| కామరాజ్ * | 1902-1975 | మౌలానా మహమ్మదలీ | 1878-1931 |
| కాశీనాధుని నాగేశ్వరరావు* | 1867-1938 | రంగా, ఎన్.జి.* | 1902-జననం |
| కృపలానీ, జె.బి* | 1888-1982 | రఘుపతి వెంకటరత్నం నాయుడు* | 1862-1939 |
| కొండా వెంకటప్పయ్య* | 1866-1948 | రమాబాయి రనడే | 1863-1939 |
| ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్* | 1890-1988 | రవీంద్రనాథ్ టాగూర్* | 1861-1941 |
| ఖాన్ సాహెబ్ | 1883-1958 | రాజగురు | మరణం1931 |
| గరిమెళ్ల సత్యనారాయణ* | 1893-1952 | రాజగోపాలచారి(రాజాజీ)* | 1878-1972 |
| గాంధీజీ* | 1869-1948 | రాజేంద్రప్రసాద్* | 1884-1963 |
| గురజాడ అప్పారావు* | 1861-1915 | రామమనోహర లోహియా* | 1910-1968 |
| గుర్రం జాషువా* | 1895-1971 | లాలాలజపతిరాయ్* | 1865-1928 |
| గోపాలకృష్ణ గోఖలే* | 1866-1915 | వరహగిరి వెంకటగిరి* | 1894-1980 |
| చిత్తరంజన్‌దాస్* | 1870-1925 | వల్లభాయి పటేల్* | 1875-1950 |
| చింతామణి సి.వై. | 1880-1941 | వాసుదేవ్ బల్వంత్ ఫడ్కే | 1883-1945 |
| చిలకమర్తి లక్ష్మీనరసింహం* | 1867-1946 | విఠల్‌భాయిపటేల్ | 1873-1933 |
| జవహర్‌లాల్ నెహ్రూ* | 1889-1964 | విజయలక్ష్మీ పండిట్ * | 1900 జననం |
| జయప్రకాశ్ నారాయణ్* | 1902-1980 | వినోబాభావే* | 1895-1982 |
| ఝాన్సీరాణి లక్ష్మీబాయి* | 1835-1858 | షౌకత్‌అలీ | 1873-1938 |
| టంగుటూరి ప్రకాశం* | 1872-1957 | సత్యమూర్తి | |
| తాంతియాతోపే* | మరణం-1859 | సరోజినీనాయుడు* | 1879-1949 |
| త్రిపురనేని రామస్వామి* | 1886-1943 | సావర్కార్, వి.డి.* | 1883-1966 |
| దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి * | 1897-1980 | సుఖదేవ్ | మరణం1931 |
| దుగ్గిరాల గోపాలకృష్ణయ్య* | 1889-1928 | సుబ్రమణ్య భారతి* | 1882-1921 |
| దుర్గాబాయి దేశ్‌ముఖ్* | 1909-1981 | సుభాష్‌చంద్రబోస్(నేతాజీ)* | 1807-1845 |
| నానా సాహెబ్* | 1821-1859 | సురేంద్రనాథ్ బెనర్జీ* | 1848-1925 |
| నౌరోజీ, దాదాభాయి* | 1825-1917 | హ్యూమ్, ఏ.ఓ. | 1829-1912 |

* వీరి జీవిత వివరాలు ఆయా అకారాదిక్రమంలోని శీర్షికలలో ఇవ్వడమైనది.

వచ్చింది. 1947 ఆగస్టు 14–15 అర్ధరాత్రి మౌంట్ బాటన్ ప్రభుత్వ బాధ్యతను జవహర్‌లాల్ నెహ్రూకు అప్పజెప్పడంతో ఎర్ర కోటపై బ్రిటిష్ యూనియన్ జాక్ పతాకం అవనత మైంది— భారత జాతీయ త్రివర్ణపతాకం ఆవిష్కరించ బడింది. ఆ అర్ధరాత్రి ఎర్రకోట బురుజుపై నిలబడి జాతినుద్దేశించి నెహ్రూ 'ట్రీస్ట్ విత్ డెస్టినీ' అను చారిత్రాత్మకమయిన ప్రసంగం చేశారు. తరువాత రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షతన రాజ్యాంగ పరిషత్తు (1948) ఏర్పడి భారత రాజ్యాంగం (చూ) సిద్ధపరుపబడినది. జనవరి 26, 1950 నాడు భారత దేశం ప్రజాసత్తాక గణతంత్రరాజ్యం (రిపబ్లిక్)గా రూపుగొన్నది. (చూ. భారతదేశం.)

## భారతి

చూ. సుబ్రమణ్యాభారతి

## భారతీయ కాలమానం

చూ. గ్రీనిచ్ కాలమానం

## భారవి

ప్రముఖ సంస్కృత మహాకవి. సంస్కృత పంచకావ్యాలలో ఒకటి అయిన 'కిరాతార్జునీయం' కర్త. మహాభారతం నుంచి గ్రహించబడిన కథ దానిలోని ఇతివృత్తం. ఇంద్రకీలాద్రి మీద అర్జునుడు తపస్సు చేయడం, కిరాత రూపంలో వచ్చిన శివునితో యుద్ధం చేసి, ఆయనను ప్రసన్నుణ్ణి చేసికొని, ఆయన వలన పాశుపతాస్త్రాన్ని పొందడం దానిలోని ప్రధానమైన కథ. ఈ చిన్న కథనే భారవి 18 ఆశ్వాసాల మహాకావ్యంగా రసవత్తరంగా తీర్చిదిద్దాడు. భారవి కవిత్వంలో అర్థగౌరవం ప్రధానంగా కనిపిస్తోంది. ('భారవేరర్థ గౌరవ'ం) భారవి తన కావ్యంలో 24 విధాల వృత్తాలను వాడాడు. కిరాతార్జునీయకావ్యానికి ఎందరెందరో వ్యాఖ్యానాలు రచించారు. మల్లినాథసూరి వ్రాసిన 'ఘంటాపథ' వ్యాఖ్యానమే మిక్కిలి ప్రసిద్ధి పొందింది.

## భాషలు

చూ. జాతీయ భాషలు

## భాసుడు

క్రీ.పూ. 3వ శతాబ్ది

సంస్కృతంలో రంగస్థల ప్రదర్శనయోగ్యమైన నాటకాల రచనకు ఆద్యుడు. కాళిదాసు కంటె కూడా పూర్వుడు. సంస్కృతంలో ఈయన 13 నాటకాలు వ్రాశాడు. వాటిలో విశేష ప్రసిద్ధి పొందినవి: 'స్వప్నవాసవదత్త', 'ప్రతిమానాటకం'. భాసుడి నాటకాలను మూడు వర్గాలుగా చేయవచ్చును. రామాయణానికి సంబంధించినవి (ప్రతిమ, అభిషేకనాటకం, యజ్ఞఫలం), మహాభారత కథకు సంబంధించినవి (పంచరాత్రం, దూతవాక్యం, మధ్యమవ్యాయోగం, దూత ఘటోత్కచం, కర్ణభారం, ఊరుభంగం, బాల చరితం), ఇతర కథల మీద ఆధారపడినవి (స్వప్న వాసవదత్తం, చారుదత్తం, అవిమారకం). భాసుడు కాళిదాసునేత కూడా గౌరవంగా స్మరించబడిన సంస్కృత మహానాటక కర్త.

## భీముడు

పంచ పాండవులలో మధ్యముడు. పాండురాజు నియోగంతో కుంతికి వాయుదేవుని అనుగ్రహం వలన కలిగిన కుమారుడు. భీముడు మహాబలశాలి. అతడు పుట్టిన 10వ రోజుననే కుంతి అతనినెత్తుకొని ఉండగా ఒక పెద్ద పులిని చూచి భయంతో ఆమె భీముణ్ణి జారవిడిచిందట! అతడు ఒక పెద్ద బండ మీద పడ్డాడు. అతనికేమీ హాని కలుగకపోగా ఆ బండ పిండి పిండి అయిందట. చిన్న తనంలో భీముడు కౌరవులను క్రిందపడవేసి ఈడుస్తూ, నీళ్లలో ముంచి ఏడిపిస్తూ ఉండేవాడు. దుర్యోధనుడు అనేక విధాలుగా భీముణ్ణి తుదముట్టించాలని ప్రయత్నించాడు. కాని ఆ ప్రయత్నాలేవీ ఫలించలేదు. విషాన్నం పెట్టించినా, కాళ్లూ చేతులూ కట్టి మడుగులో పడవేయించినా, లక్క ఇంటిలో కాల్పింప జూచినా భీముడు చావలేదు. సభలో ద్రౌపదిని దుర్యోధనుడు, దుశ్శాసనుడు పరాభవించగా దుశ్శాసనుని రొమ్ము నెత్తురుతో ద్రౌపది కేశపాశాలను ముడివేస్తాననీ, గదతో దుర్యోధనుని ఊరువు (తొడ) పగులగొట్టి వధిస్తానని భీముడు ప్రతిజ్ఞ చేశాడు. భారత యుద్ధంలో ఆ రెండు ప్రతిజ్ఞలూ ఆయన నెరవేర్చుకొన్నాడు. పాండవులందరితో పాటు భీముడికి కూడా ద్రౌపది ధర్మపత్ని. ఆమె కాక హిడింబ అనే అసురకాంతను, జలంధరను, కాళిని కూడా భీముడు వివాహమాడాడు. ఆయనకు ద్రౌపది యందు శ్రుతసోముడు, హిడింబయందు ఘటోత్కచుడు, జలంధర యందు సర్వగుడు, కాళియందు సర్వగతుడు అనే కుమారులు కలిగారు. భారత యుద్ధానికి ముందే భీముడు బకాసురుడు,

హిడింబాసురుడు, కీచక, జరాసంధులు అనే మహాబలులను మట్టు పెట్టాడు. బలానికి రూఢి శబ్దం భీముడే.

## భీష్ముడు

మహాభారతమందలి ప్రముఖపాత్ర. గంగా శంతనుల అష్టమ సంతానం. పూర్వాశ్రమనాదుం దేవవ్రతుడు. పాండవులంటే అనురాగం ఉన్నప్పటికిని కౌరవపక్షాన్నే వహించవలసివచ్చి కురువృద్ధుడయ్యాడు. కురుక్షేత్ర(చూ.) సంగ్రామంలో అర్జునుని బాణాలచే హతుడయి అంపశయ్యపై పరుండి ఉత్తరాయణ తుది గడియలకై వేచి ఉంటాడు (చూ. మానస సరోవరం).

## భువనేశ్వర్

ఒరిస్సా రాష్ట్ర రాజధాని. కటక్‌కు 30 కి.మీ దూరం. దేవాలయాలు రాజదేవళం, ముక్తేశ్వరం కొవెల అనంత బసుదేవుని గుడి, రాజారాణాన్ని దేవాలయం దేళీ, ఉదయ గిరి ఖండగిరి జైన బౌద్ధ గుహాలయాలు వంటివి ఎక్కువగా ఉండుటవల్ల దానిని 'ఆలయ నగరమని పిలుస్తుంటారు. గొప్ప పుణ్యక్షేత్రం. భువనేశ్వర్‌లోని వాస్తు శిల్ప కళకు రెండువేల ఏళ్ళ చరిత్ర వుంది. కళింగ వాస్తు శిల్ప సంప్రదాయం కొట్టవచ్చినట్లు కనబడుతుంది.

## భూటాన్

హిమాలయాలలోని ఒక పర్వతమయ రాజ్యం. తూర్పు, దక్షిణ, పశ్చిమ సరిహద్దులలో భారతదేశం, ఉత్తరాన చీనా ఉన్నాయి. ఇది రాజవంశీయుల పాలనలో ఉన్నదేశం. విస్తీర్ణం: 47,000 చ.కి.మీ.; జనాభా: 13,65, 000 (1988); రాజధాని: తింపూ; అధికార భాషలు: డ్జొన్గ్ఖా, నేపాలీ. ; ప్రజలు బౌద్ధులు, హిందువులు.

బ్రహ్మపుత్ర ఉపనదులైన బూంటాంగ్, టోంగ్సా, సంకోషి రాయిదాకా అనే హిమనదులు ఈ రాజ్యంలో ప్రవహిస్తున్నాయి. పర్వతమయం కావడంవల్ల పర్వత సానువులలో సేద్యంచేసి వరి, మొక్కజొన్న, గోధుమ, కాయగూరలు, బంగాళదుంపలు, చిరుధాన్యాలు, జ్యూట్ నార, బార్లీ, పండ్లు పండిస్తారు. డోలమైట్, సున్నపు రాయి, జిప్సమ్, పలకరాయి భూటాన్ ఖనిజ సంపద. అడవులనుంచి లభించే కస్తూరి, లక్క, మైనం, కలప శుద్ధిచేసి ఎగుమతి చేస్తారు. పండ్లు కూడా ఎగుమతి చేస్తారు. ఇండియాతోనే ఎక్కువ వాణిజ్యం సాగుతూంది. (చూ. భారతదేశం—దేశపటం)

## భోపాల్

మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని. ప్రముఖ వాణిజ్య కేంద్రం. పారిశ్రామిక కేంద్రం. చరిత్ర పూర్వయుగానికి చెందిన గుహాలయాలలో వర్ణచిత్రాలు భోపాల్‌కు సమీపంలో కనిపించాయి. 'భారత భవన్' సాంస్కృతిక కేంద్రాన్ని ఇటీవల (1980) రంగస్థల కళలు పోషించావికి తీర్చిదిద్దేరు. 1984లో సంభవించిన గ్యాసు దుర్ఘటనలో సుమారు 2000 మంది హతులయ్యారు. పెక్కుమంది క్షతగాత్రులయ్యారు. జనాభా 6,71,018 (1981).

## మంగోలియా

మధ్య ఆసియాలో చీనా, సోవియట్ రష్యా దేశాల నడుమ ఉన్న ఒక ప్రజాస్వామ్య కమ్యూనిస్టు రాజ్యం. దీనిని 'అవుటర్ మంగోలియా' అని వ్యవహరిస్తుంటారు. చెంగిజ్‌ఖాన్, కుబలయిఖాన్ ఏలిన ప్రాంతం. 1924లో కమ్యూనిస్టు రాజ్యం అయింది. ఇది అతి శీతల ప్రాంతం. ఒక్కొక్కప్పుడు ఉష్ణోగత—49° సెంటీగ్రేడ్ వరకూ పడిపోతుంది. విస్తీర్ణం: 15,66, 500 చ.కి.మీ.; జనాభా: 20,41,000 (1988); రాజధాని: ఉలన్ బతోర్; అధికార భాష: మంగోలియన్; దీని లిపి: సిరిలిక్. ప్రజలు మంగోలాయిడ్ వర్గానికి చెందినవారు.బౌద్ధంలోఒక శాఖ అయిన లామాయిజమ్‌ను ప్రజలు అనుసరిస్తారు. మంగోలియా అంతా ఎత్తయిన ప్రదేశం. ఆల్టాయా పర్వత శ్రేణిలోని పీఠభూమి ప్రాంతం ఇది. ఈ దేశంలో సరస్సులు అనేకం ఉన్నాయి. యవ్స్ సరస్సు పెద్దది. తూర్పు మంగోలియా అంతా పచ్చికబయలు ప్రదేశం. గోబీ ఎడారి ప్రక్కనే ఉండడంవల్ల, ఇది అంత సారవంతమైన నేల కాదు. ప్రజల జీవనోపాధి, దేశ ఆర్థిక వ్యవస్థ పశువుల పెంపకం మీదనే ఎక్కువగా ఆధారపడి ఉన్నాయి. ప్రభుత్వ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనే ఈ కార్య కలాపాలు కూడా జరుగుతాయి. ఇందులో గొర్రెల పెంపకం ఎక్కువ. గుర్రాలు, ఒంటెలు, ఆవులు కూడా ఉన్నాయి. ఉన్ని పరిశ్రమ ఎక్కువ. ఆహార ధాన్యాలు, బంగాళదుంపలు ప్రధానమైన పంటలు. నేలబొగ్గు, ఫ్లోర్‌స్పార్, తగరం, టంగ్‌స్టన్, రాగి, బంగారం, ఇనుపరాయి, పెట్రోలు తైల నిక్షేపాలు ఉన్నాయి. చూ. రష్యా (దేశపటం)

## మండేలా

పూర్తిపేరు రోలిహ్లాహ్లా నెల్సన్ మండెలా. దక్షిణాఫ్రికా రాజనీతిజ్ఞుడు. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసు (ఏ.ఎన్.సి) నాయకుడు. శ్వేత జాత్యహంకార వర్గవైషమ్య (అపార్టిట్) వైఖరికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపిన నల్లజాతి ఆశాజ్యోతి. ఆఫ్రికాలోని నల్లవారి పట్ల తెల్లవారి కఠోర విధానానికి బలియై 28 ఏళ్ల రాజకీయ ఖైదీగా కారాగారవాస శిక్ష అనుభవించి 1990 ఫిబ్రవరి 10న విడుదల అయిన నెల్సన్ మండేలా నల్లజాత్యభ్యున్నతికి పాటుపడిన మహనీయవ్యక్తి. మానవాళి స్వాతంత్ర్య పిపాసి.

రివెనిహూ విచారణ 1964 ఏప్రిల్ 20 నాడు జరిగిన సందర్భంలో మండేలా తన జీవిత పరమావధిని ఇలా ప్రకటించాడు 'నా జీవితమంతటినీ ఆఫ్రికన్ ప్రజల స్వేచ్ఛా పోరాటానికే ధారపోశాను. సామరస్యంగా, సమాన హక్కులతో ప్రజలందరూ కలిసి మెలిసి జీవించగల స్వేచ్ఛాయుత ప్రజాస్వామిక సమాజ స్థాపన నా ఆదర్శం. ఆ లక్ష్య సాధన కోసమే నేను జీవించాలనుకుంటున్నాను. అవసరమయితే ఈ నా ధ్యేయం నెరవేరడానికి నా ప్రాణాలను సైతమూ అర్పించడానికి సిద్ధంగా ఉన్నాను.'

ఇంతటి త్యాగమూర్తి మండేలా దక్షిణ ఆఫ్రికాలోని ఉమ్తాతా (ట్రాన్స్కే) పట్టణ శివారులోని తెంబూ రాజకుటుంబంలో 1918 జూలై 18న జన్మించాడు. క్జోసా భాష మాట్లాడే ఈ ప్రాంతంలోని ఆదిమజాతి వారికి సంప్రదాయముఖి అయ్యాడు. యువకుడుగా ఉండగానే ఆయనలో దేశభక్తి భావాలు పెల్లుబికాయి. న్యాయశాస్త్రం చదివి 1952లో న్యాయవాద వృత్తి ప్రారంభించాడు. మహాత్మా గాంధీ దక్షిణాఫ్రికాలోని వారికి సుపరిచితం.గాంధీజీసత్యాగ్రహం, అహింసాపద్ధతులు ఈయనకు స్ఫూర్తినిచ్చాయి. జాతివిచక్షణ (అపార్టిట్): అధికారిక విధానంపై శ్వేత జాతిపాలకులు ప్రకటించి ఆఫికన్లపై ఆంక్షలుప్రకటించి ఆరళ్లను మరింతకర్కశం



చేసిన రోజులవి. రాత్రి వేళ బయట తిరగాలన్నా, పొరుగు ఊరికి ప్రయాణం చేయాలన్నా, ఉద్యోగం పొందాలన్నా నల్లజాతులవారికి అనుమతి పత్రం (పాసు) అవసరం. ఇటువంటి అనుమతి పత్రాన్ని తెల్లరంగు వారెవరయినా చివరకు పిల్లలయినా ఇవ్వవచ్చును. అటువంటి అనుమతి పత్రం దగ్గర ఉంటే తప్ప తమగడ్డపై తాము స్వేచ్ఛగా సంచరించడానికి ఆఫ్రికన్‌లు నోచుకోలేదు. దక్షిణాఫ్రికా జనాభాలో శ్వేత జాతీయులు 15 శాతానికి మించరు. అయినా మొత్తం భూ విస్తీర్ణంలో 85 శాతం పైగా తెల్లవారి హక్కుభుక్తంలోనే ఉంది. తెల్లవారికై రిజర్వు చేసిన భూములను నల్లజాతి వారు కొనుక్కొని అనుభవించ డానికి వీలులేదు. తెల్లవారికి నిర్దేశించిన రైలు కంపార్ట్‌మెంట్ల లోను, రెస్టారెంట్‌లోను నల్లజాతి వారు అడుగు పెట్టడానికి వీలులేను. ఇటువంటి సిగ్గుచేటు దుష్ట శాసనాలకు గురి అయిన నల్లజాతి బాధితుల తరపున వకాల్తా తీసికొని న్యాయం చేకూర్చ డానికి మండేలా తొలిరోజుల్లో పాటుపడ్డారు. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసులో ప్రధాన భూమిక వహించి నిరసన ప్రదర్శనలు, సమ్మెలు, బంద్‌లు, శాసనోల్లంఘన ఉద్యమాలు, బాయ్‌కాట్లు వంటి గాంధీజీ అహింసా మార్గాన్నే ప్రజల్ని కూడగట్టుకుని శాంతియుతంగా అన్యాయాల్ని ఎదుర్కొనడానికి ఆయన అవిరళకృషి చేశాడు. అయితే 1960 మార్చి 21న జరిగిన షార్ప్ విల్లీ ఊచకోత దురంతం భారతదేశంలో 1919లో జరిగిన జలియన్ వాలాబాగ్ (చూ.) దుర్ఘటనను గుర్తుచేస్తుంది. తత్ఫలితంగా మండేలా తన అహింసా సరళికి స్వస్తి చెప్పి సాయుధ పోరాటానికి పూనుకొన్నాడు. ఏ.ఎన్.సి.కి సాయుధ దళాధిపతియై ప్రజలకు హాని కలగని విధంగా పథకం ప్రకారం విధ్వంసక చర్యలు చేపట్టి స్కార్లెట్ సింపర్నల్‌లా వేషాలు మార్చి పోలీసుల్ని ఏమార్చి తాను 1962లో పట్టుబడే వరకూ ప్రభుత్వాన్ని గడగడ లాడించాడు. 1964లో శిక్ష విధింపు దర్మిలా కారాగారాల్లోనే జీవితాన్ని గడిపి 1990 ఫిబ్రవరి 10న విడుదలయి బయటికి వచ్చిన త్యాగశీలి. దుర్భరపరిస్థితులను తొలగింపచేయడానికి దేశంలోని అన్ని రాజకీయ పక్షాల వారినీ కూడగట్టుకుని తన స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉన్నాడు(1990)

## మకర సంక్రాంతి

మకర సంక్రాంతిని సంక్రాంతి పండుగ అంటారు. ఈ సమయానికి పంటలు పండి, ఇంటికి వచ్చి సమృద్ధిగా ఉంటుంది గనుక దీనిని పెద్ద పండుగ అంటారు. ఇది మార్గశిర, పుష్య మాసాలలో సూర్యుడు మకర రాశిలో ప్రవేశించినప్పుడు ఉత్తరాయణం ప్రారంభంతో వస్తుంది. ఇది మూడు రోజులు జరుపునట్టి పండుగ. మొదటి దినము భోగి పండుగ, రెండవ నాడు సంక్రాంతి, మూడవ నాడు కనుము. మకర సంక్రమణం వెనుకటి నెలంతా ధనుర్మాసం. దీనికి పండుగ నెల అంటారు. ధనుర్మాసం 30 రోజులూ భక్తులు తెల్లవారు జాముననే లేచి స్నానాదులు ముగించి దైవారాధనం చేస్తారు. వైష్ణవులైతే ఆండాళు రచించిన తిరుప్పావె పాశురాలు దినానికొకటిగా పాడి అర్చించి భజనలతో ప్రదక్షిణాలు చేస్తారు. స్త్రీలు ఇంటి ముందు ముగ్గులతో అలంకరించి గొబ్బెమ్మలు పెట్టి వాటిలో గుమ్మడి పూలు అలంకరిస్తారు. (చూ. గొబ్బిఆట) భోగి పండుగ నాడు ఇంటి ముందు మంటలు వేసి పాత వస్తువులను కాల్చివేస్తారు. వీటినే భోగిమంటలు అంటారు. స్త్రీలు సాయంకాలం పిల్లలకు భోగి పండ్లు పోసి పేరంటం చేస్తారు. రెండవనాడు సంక్రాంతి. ఈ నాడు తర్పణ శ్రాద్ధాదులు జరిపితే పుణ్యలోకాలు వస్తాయని చెప్తారు. దాన ధర్మాలు చేస్తారు. దీనినే మొక్కుల పండుగ అంటారు. మూడవ రోజు కనుమ పండుగ. ఇది పూర్తిగా కర్షకుల పండుగ. ఆ రోజు పశువులను కడిగి అలంకరించి కొమ్ములకు రంగులు పూసి సింగారిస్తారు. పసుల కొట్టంలో పొంగలి వండి, అది పొంగుతున్నప్పుడు పాలపొంగిలి, పసుల పొంగలి' అని కేకలు వేసి దేవతలకు నైవేద్యం పెట్టి పొలాలకు వెళ్ళి ఆ పొంగలిని పసుపు కుంకుమలతో కలిపి వెదజల్లుతారు. సాయంకాలం పశువులను పూల దండలు, గజ్జెలు పట్టెడలతో అలంకరించి ఊరేగిస్తారు. చక్కెర పొంగలి తినిపిస్తారు. పొలిమేరలో ఎడ్ల పోటీలు, పొట్టేళ్ళ పోటీలు, కోడి పందేలు జరుగుతాయి. నాలుగవనాడు ముక్కనుమ జరుపుకుంటారు. తమిళనాడులో సంక్రాంతిని 'పొంగల' పండుగగా చేసుకుంటారు. కొత్తకుండలో 'అన్నం' వండి చెరకు గెడలూ, పండ్లూ నైవేద్యం పెడతారు.

## మకావ్రూ

దక్షిణ చీనాలోని పోర్చుగీసువారి వలస. సింకియాంగ్ నదీ ముఖద్వారంలో ఇది ఉంది. ఇది మిక్కిలి చిన్నరాజ్యం. అంతర్జాతీయ వాణిజ్యకేంద్రంగా ఇది ప్రసిద్ధిచెందడం వలన దీని ఉనికిని చీనా అనుమతించింది. బంగారం వ్యాపారం ఇక్కడ జోరుగా సాగుతూంది. అక్రమ రవాణాలకు, జూదాలకు పేరుమోసిన కేంద్రం.

విస్తీర్ణం: 16.9 చ.కి.మీ.; జనాభా: 4,79,000 (1988); రాజధాని: మకావ్రూ; అధికార భాష: పోర్చుగీసు. ప్రజలు చీనావారు. కాంటనీస్ (చీనా మాండలీకం) మాట్లాడతారు. బౌద్ధం, కన్‌ఫ్యూషియస్ మతములలో విశ్వాసం గలవారు. మతం పట్ల విశ్వాసం లేని వారి శాతం 46. వరి, కాయగూరలు మాత్రం పండిస్తారు. ఒకప్పుడు ఇక్కడి వ్యాపారం అగ్గిపుల్లలు, బాణాసంచా సామాన్లకు మాత్రమే పరిమితమయి ఉండేది. అయితే ఇప్పుడు జవుళీ, నూలు వస్త్రాలు, దుస్తులు, ప్లాస్టిక్, కెమెరాలు వంటి నిత్యావసర వస్తువులు అన్నీ ఇక్కడే విక్రయిస్తున్నారు.

## మడగాస్కర్

ఒకప్పుడు ఫ్రెంచ్‌వారి వలసరాజ్యంగా ఉండి, 1960లో స్వాతంత్ర్యం సాధించుకున్న ఒక ద్వీపరాజ్యం. ఆఫ్రికా తూర్పుతీరా (మొజాంబిక్)నికి 500 కి.మీ. దూరంలో ఈ ద్వీపం ఉంది.

విస్తీర్ణం: 5,87,041 చ.కి.మీ.; జనాభా: 1,09, 17,000 (1988); రాజధాని: అంతనానరీవ్; అధికార భాష: మలగాసీ. ఫ్రెంచి కూడా మాట్లాడతారు. బెమారివూనది, బెట్సిబోకానది, మాంగోరా నది ప్రధాన జలాధారాలు. ఇవికాక సరస్సులు, తటాకాలు ఉన్నాయి. వరి ముఖ్యాహార పంట. కర్రపెండలం, మొక్కజొన్న, చెరకు, బంగాళదుంప విరివిగా సాగు చేస్తారు. కాఫీ ముఖ్యమైన ఎగుమతి పంట. మడగాస్కర్ వనిల్లాకుప్రపంచ ప్రసిద్ధి. పొగాకు, లవంగాలు వాణిజ్యపంటలు. మైకా, నికెల్, రాగి, క్రోమైట్ మడగాస్కర్ లోని ఖనిజ నిక్షేపాలు.



## మణిపూరు

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. 1956నుంచి కేంద్రపాలిత ప్రాంతంగా ఉన్న మణిపూరు 1972లో రాష్ట్ర ప్రతిపత్తిని సాధించుకుంది. ఉత్తరాన నాగాలాండ్, దక్షిణాన మిజోరామ్, తూర్పున బర్మా, పశ్చిమాన అస్సాము ఈ చిన్న రాష్ట్రానికి సరిహద్దులు.




విస్తీర్ణం: 22,327 చ. కి.మీ.; జనాభా: 14,20, 953(1981); రాజధాని: ఇంఫాల్, అధికార భాషలు: మణిపురీ, ఇంగ్లీష్.వరి ప్రధానమైన పంట. పట్టు పరిశ్రమ (టస్సార్ పట్టు) ప్రజలకు జీవనాధారం. ప్రజలు హస్తకళలలో సిద్ధహస్తులు. చేనేత పనివారికి మంచి గిరాకీఉంది. మణిపురీ నృత్యం భారతదేశంలో ప్రసిద్ధికెక్కిన ఒక నృత్య సంప్రదాయం. కొండలోయలతో కూడిన మణిపూరు, సుందర ప్రకృతి దృశ్యాలకు ప్రసిద్ధి. ఇంఫాలాలోని మృతవీరుల స్మారక చిహ్నం, గోవిందాజీ దేవళం, 1467 లో నిర్మించిన బిష్ణుదేవళం (బిష్ణూపురం), తూర్పు ఇండియాలో అంతటిలోకీ పెద్ద మంచినీటి సరస్సు అయిన లోక్తక్ తటాకం దర్శనీయ స్థలాలు. ప్రపంచంలోని ఏకైక జాతీయ ఫ్లోటింగ్ పార్క్, కీబుల్ లమ్జావూ వనం, ఆర్కిడ్ యార్డు వినోద పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

## మత్స్య యంత్రం

ద్రుపద మహారాజు తన కుమార్తె ద్రౌపదికి తగిన వరుణ్ణి నిర్ణయించడం కోసం ఒక స్వయంవరం ప్రకటించాడు. స్వయంవర మండపంలో పైన ఒక మత్స్య యంత్రాన్ని నిర్మించి, దానికింద ఉన్న నీటిలో ఆయంత్ర ప్రతిబింబాన్ని చూస్తూ ఆయంత్రాన్ని ఛేదించగల మహాధానుష్కుడైన వీరుడే తనకుమార్తెకు భర్త కాగలడని ఆయన ప్రకటించాడు. దేశదేశాల వీరులు వచ్చి ప్రయత్నించారు. ఎవ్వరూ ఆ యంత్రం కొట్టలేక పోయారు. చివరికి అర్జునుడు ఆ ఘనకార్యం సాధించి ద్రౌపదిని గెలుచుకున్నాడు. అయినా తల్లి అయిన కుంతీదేవి ఆదేశాన్ని అనుసరించి అర్జునుడొక్కడే కాకుండా, అయిదుగురు పాండవులూ ద్రౌపదిని వివాహ మాడారు. (చూ. ద్రౌపది)

## మధుర ఉత్తరాది

ఇది యమునానదికి దక్షిణతీరాన ఉంది. మధుర చాలా ప్రాచీనమైన నగరం. పూర్వమిచ్చట 'మధు'వనే దైత్యుని క్రీడోద్యానవనం ఉండేది. శ్రీరామచంద్రుని తమ్ముడైన శత్రుఘ్నుడు మధు దైత్యుని సంహరించి ఈ నగరాన్ని నిర్మించి, ఈ నగరమును పాలించడానికి తన కుమారుడైన సుబాహుని నియోగించాడనీ, కాలాంతరంలో ఈ నగరం చంద్రవంశీయుల అధికారంలోకి వచ్చిందనీ, యదువంశాన్తర్గతమైన భోజవంశంలో జన్మించినవారు ఈ నగరాన్ని చాలాకాలం పాలించారనీ అంటారు. ఆ భోజవంశీయుడే ఉగ్రసేనుడు. ఉగ్రసేనుని కుమారుడు కంసుడు. కంసుని సంహరించి శ్రీకృష్ణుడు మరల ఉగ్రసేనుని రాజుగా చేశాడు. శ్రీకృష్ణ మందిరాలలో ప్రధానమైనవి. 1.గోవర్ధననాథ జీవమందిరం; 2.కేశవ దేవజీ మందిరం; 3.గతిశ్రమ నారాయణ మందిరం. ప్రతి సంవత్సరం అనేక పర్యాయాలు భక్తులు మధురా క్షేత్రానికి వచ్చి ప్రదక్షిణం చేస్తారు. ప్రతి ఏకాదశి, అక్షయ నవమి సందర్భంలో ఈ క్షేత్రంలో సామూహికంగా భక్తులు పరిక్రమణ (ప్రదక్షిణం) చేస్తారు. ప్రతి సంవత్సరం శ్రీ కృష్ణాష్టమి, శ్రావణ శుద్ధ పూర్ణిమ, ఆశ్వయుజ బహుళ ఏకాదశి మొదలు శరత్పూర్ణిమ వరకు రామ లీలోత్సవం, దీపావళి మొదలైన ఉత్సవాలు ఇక్కడ వైభవంగా జరుగుతాయి.

## మదన మోహన మాలవ్యా

ప్రముఖ జాతీయవాది. చిత్తశుద్ధి గల ఉదాత్త స్వభావి. మేధా సంపన్నుడు. తన 85 ఏళ్ల జీవితంలోనూ



60 ఏళ్లు ప్రజాసేవకే అంకితం చేశాడు. గొప్ప పార్లమెంటేరియన్. భారతజాతీయ కాంగ్రెసు వ్యవస్థాపించిన మరుసటి ఏడు అందులో సభ్యుడై 1909లోనూ,

1918లోనూ ఆ సంస్థకు అధ్యక్షుడయ్యాడు. కేంద్ర శాసన సభ్యుడుగా ఉండేవాడు. మొదట్లో బ్రిటిషు వారితో స్నేహం నెరపినా తరువాత వారి వైఖరిని ప్రతిఘటించాడు. మూడు సార్లు హిందూ మహాసభకు అధ్యక్షుడయ్యాడు. కొన్నాళ్ళు స్వరాజ్య పార్టీ సభ్యుడుగా ఉన్నాడు. తరువాత కాంగ్రెసు పార్టీలో సంప్రదాయ వాదిగా ఉండేవాడు. కాంగ్రెస్ పార్టీ వల్ల హిందు వుల సంక్షేమం దెబ్బ తింటున్నదని గ్రహించి నేషనలిస్ట్ పార్టీని స్థాపించాడు. మదన మోహన మాలవ్యా దేశానికి చేసిన సేవలన్నిటి లోనూ బెనారసు హిందూ యూనివర్శిటీ స్థాపన ప్రముఖ మయింది. విరాళాలు వసూలు చెయ్యడంలో ప్రత్యేక శ్రద్ధ చూపించి దాని ఆర్థిక స్థితిని పటిష్ఠం చేశాడు.

## మదర్ తెరిసా జననం 1910

దీనజన రక్షణమే జీవిత పరమావధిగా స్వీకరించి మానవసేవయే మాధవసేవగా గుర్తించి మానవ కళ్యాణానికి అపూర్వ కృషిచేస్తున్న మహిళామణి. యుగోస్లావియాలోని స్కోప్లిజేలో ఆల్‌బేనియా దేశానికి చెందిన కుటుంబంలో జన్మించి తన 18వ ఏట భారతదేశానికి వచ్చి సంఘసంక్షేమ కార్యక్రమాలు నిర్వహించడంలో నిమగ్నురాలయింది. ఈమె అసలుపేరు ఏగ్నిస్ గొన్‌క్స్హా బోజాక్సిహిన్. కలకత్తా కార్యకేంద్రంగా 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్' అను క్రైస్తవ శాఖను వ్యవస్థాపించింది. 1950లో ఈ వ్యవస్థ వటికన్‌లోని రోమన్ కేథలిక్ మతాధిపతి పోప్ అంగీకారాన్ని పొందింది. 1948లో భారత పౌరసత్వంపొంది, తెరిసా తన మానవ సేవా కృషిని కొనసాగిస్తున్నది. 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్' కృషి ప్రపంచ వ్యాప్తంగా విస్తరించి ఉంది. ఈమె చేస్తున్న సంఘసేవాకృషికి మేగ్సేసే పురస్కారం (1962), ప్రతిష్ఠా రమైన నోబెల్ శాంతి పురస్కారం (1979), భారతరత్న (1980) ఇంకా ఎన్నో సమ్మాన సన్నదులు మదర్ తెరిసాకు లభించాయి.



## మద్రాసు

బ్రిటిష్ ఇండియాలో దక్షిణ భారతదేశం అంతటికీ పరిపాలనా కేంద్రం. 1639లో ఈస్ట్ ఇండియా కంపెనీవారు ఫోర్ట్‌సెంట్ జార్జి పేర ఒక గిడ్డంగిని ఇక్కడ నిర్మించి వ్యాపార స్థావరం ఏర్పాటు చేశారు. క్రమంగా అది అభివృద్ధి చెందింది. నాటి మద్రాసు ప్రెసిడెన్సీకి కేంద్రంగా ఉండి, నేటి తమిళనాడు (చూ.) రాష్ట్రానికి రాజధాని అయింది. ఆనాటినుండి ఇది ప్రసిద్ధ రేవుపట్టణంగా కూడా అభివృద్ధి చెందింది. థియసాఫికల్ సొసైటీకి అంతర్జాతీయ కార్యకేంద్రం అడయారులో ఉంది. ఇచ్చట వటవృక్షం చాలా పెద్దది. మద్రాసు ప్రముఖ విద్యాకేంద్రం కూడా. సంగీత, నృత్యకళలకు ఇది ప్రసిద్ధ క్షేత్రం. భారత దేశంలో మొదటిసారిగా ఏర్పాటైన పాశ్చాత్య పద్ధతి విశ్వవిద్యాలయాలు మూడింటిలో ఒకటి మద్రాసు యూనివర్సిటీ (స్థాపితం 1857) ఇక్కడ ఉంది. ఇది గొప్ప రైలు జంక్షన్. మద్రాసు అంతర్జాతీయ విమాన కేంద్రం (మీనంబాకం). తిరువాన్మియూరులోని కళాక్షేత్రం భరతనాట్య సంప్రదాయానికి జాతీయ కేంద్రం. పారిశ్రామిక, వాణిజ్యకేంద్రం. తిరువాన్మియూరు, తిరువత్తియోరు మైలపూర్‌లలోని శైవ కపాలీ దేవాలయాలు తిరువళిక్కేణి (ట్రిప్లికేన్) లోని వైష్ణవ దేవాలయం అయిన పార్థసారథి గుడి, శైవ, వైష్ణవ భక్తులను విశేషంగా ఆకర్షించే పుణ్యస్థలాలు. మెరీనాబీచ్, వళ్లువరకూటం, గవర్నమెంటు సర్వకేంద్రం చూడదగిన స్థలాలు. (చూ. తమిళనాడు రాష్ట్రం).

## మధుర దక్షిణాది

తమిళనాడు రాష్ట్రంలో వైఘై నదీ తీరాన మధుర ఉంది. మధుర జిల్లాకు ఇది కార్య కేంద్ర పట్టణం.

ఇక్కడ సుప్రసిద్ధమైన మీనాక్షి సుందరేశ్వరుల దేవళం ఉంది. ఇది చాలా పెద్ద ఆలయం. 22 ఎకరాల స్థలాలలో నిర్మింపబడిన ఈ ఆలయంలో రెండు భాగాలు ఉన్నాయి. దక్షిణ భాగాన మీనాక్షిదేవి గర్భగుడి, ఉత్తర భాగాన సుందరేశ్వరుని గర్భగుడి ఉంటాయి. దేవళంలోని

పాలరాతి పనితనం చూపరుల నాకర్షిస్తుంది. మీనాక్షిదేవి విగ్రహం నల్లరాతితో నిర్మింపబడింది. మందిరంలో


మీనాక్షిగుడి—మధుర

సర్వదా దీపాలు వెలుగుతూ ఉంటాయి. ఏకశిలా నిర్మితాలైన వేయి స్తంభాల మండపము, తిరుమల నాయకుడి భవనం మధురలో ముఖ్యంగా చూడదగినవి. సంస్కృత సాహిత్యానికి ఈ నగరం ప్రసిద్ధి చెందింది. పూర్వం ఇది పాండ్య రాజులకు రాజధానిగా ఉండేది. మధురలో కామరాజ యూనివర్శిటీ ఉంది.

## మధ్యప్రదేశ్

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. బ్రిటిషు ఇండియాలో ఈ రాష్ట్రాన్ని సెంట్రల్ ప్రావిన్సెస్ అనేవారు; భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన సందర్భంలో (1956) మధ్యప్రదేశ్ అయింది. అప్పుడు దీనిలో నాటి మధ్యభారత్, వింధ్యప్రదేశ్, భోపాల్, కోటా ప్రాంతాలు విలీనం అయ్యాయి.

విస్తీర్ణం: 4,43,446 చ.కి.మీ.; జనాభా: 5,21, 78,844 (1981); రాజధాని: భోపాల్; అధికార భాష: హిందీ.

నర్మదా, తపతీనదీ లోయలు తప్ప మిగతా భూభాగం సముద్రమట్టానికి 500 మీ. ఎత్తుగా ఉన్న పీఠభూమి ప్రాంతం. ఈ పీఠభూమిలో మధ్యమధ్య వింధ్య, సాత్పూరా పర్వతశ్రేణులు ఉన్నాయి. చంబల్‌నది, బెట్వా, సింధ్, నర్మదా, తపతి, మహానది, ఇంద్రావతి (గోదావరి ఉపనది) ప్రధానమయిన జలసంపద.

వరి, గోధుమ, జొన్న ముఖ్యమయిన ఆహారపు పంటలు. నూనెగింజలు, ప్రత్తి, చెరకు, సోయా చిక్కుడు వాణిజ్యపు పంటలు. ఇనుపరాయి, మాంగనీస్, నేలబొగ్గు, సున్నపురాయి, తగర నిక్షేపాలు ఈ రాష్ట్రంలో పుష్కలంగా ఉన్నాయి. భిలాయిలోని ఉక్కు ఫ్యాక్టరీ, భోపాల్‌లోని భారత హెవీ ఎలక్ట్రికల్స్, కోర్బాలోని అల్యూమినియం ఫ్యాక్టరీ, కాగితం తయారీ (నీపానగర్, హోషంగా బాదు), జవుళీ పరిశ్రమ, ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ మున్నగు పరిశ్రమలు ఏర్పాటై మధ్యప్రదేశ్ పారిశ్రామిక ప్రగతికి తోడ్పడు తున్నాయి. చందెల్లా రాజవంశాలు (క్రీ.శ. 9–12 శతాబ్దులు) రాజధాని ఖజురహో (చూ.)లో నిర్మించిన దేవాలయ వాస్తుశిల్ప సంపద విశ్వవిఖ్యాతి గాంచింది. కాళిదాసు జన్మించిన ఉజ్జయిని వంటి పెక్కు చారిత్రక శిథిలావశేషాలు ఈ రాష్ట్రం లో ఉన్నాయి. భోపాల్‌లో ఇటీవల (1970–80)ని ర్మించిన 'భారత భవన్' జాతీయ కళాక్షేత్రంగా ప్రసి ద్ధి గడించింది. గ్వాలియర్ లో చారిత్రాత్మకమైన కోట లు ఉన్నాయి. జబల్‌పూర్ సమీపంలోని కన్హా జాతీయ అభయారణ్యం దేశంలోనే అందమైన వన్యమృగ సంర క్షణ కేంద్రం.




## మధ్వాచార్యులు 1198–1275

ద్వైత మతాచార్యుడు, ప్రవక్త, మహా విద్యావంతుడు, మహాభక్తుడు, దక్షిణ కర్ణాటకలోని ఉడిపి సమీపంలో గల పాజక గ్రామంలో క్రీ.శ. 1198లో మధ్యగేహభట్టు వేదవతి దంపతులకు మధ్వాచార్యులు జన్మించారు. తల్లిదండ్రులు ఆయనకు వాసుదేవుడని నామకరణం చేశారు. ప్రతిభావంతుడైన వాసుదేవుడు బాల్యంలోనే సకల వేదాలను ఇతిహాస, పురాణాలను స్వయంగా అభ్యసించి గురువుల వద్ద పఠిస్తూ, గురువులకు సహితం తెలియని విషయాలను అందరికీ చెప్పి ఆశ్చర్యపరిచేవాడు. సకల విద్యలను నేర్చుకొని గురుకులమునుండి ఇంటికి వచ్చి శ్రీమన్నారాయణ

భక్తిలో నిమగ్నుడైనాడు. పదహారు సంవత్సరాల ప్రాయం లోనే ప్రాపంచిక విషయాలందు అనాసక్తుడై సదా విష్ణుధ్యానపరాయణుడై గురువైన అచ్యుత ప్రేక్షకుల వద్ద సన్యాస దీక్షను పొంది 'పూర్ణ ప్రజ్ఞ' అను నామాన్ని స్వీకరించారు. పూర్ణ ప్రజ్ఞులు సన్యాసం స్వీకరించిన తర్వాత రెండు నెలల్లోనే ఆశ్రమానికి వచ్చి పండితులను జయించి ఆనందప్రదాయకమైన శాస్త్రాన్ని వివరించి గురువులచే 'ఆనందతీర్థ' అను బిరుదుపొందారు.



గీతా భాష్యాన్ని రచించి గురువుకి సమర్పించాడు. బ్రహ్మ సూత్రాలపై వ్యాఖ్యానం వ్రాశాడు. దానికి 'భాష్యము' అనిపేరు. ఉపనిషత్తులపై కూడా భాష్యం వ్రాశాడు. ఋగ్వేదంలోని మంత్రాలపై వ్యాఖ్యానం వ్రాశాడు.

ఈయన ప్రబోధించిన మతము 'ద్వైతము' లేదా 'మధ్వమతము'. ద్వైతమంటే జీవాత్మ, పరమాత్మ వేరుగానున్నవని పవిత్రమైన భారత, భాగవత గ్రంథాలను విమర్శిస్తూ భారత తాత్పర్య నిర్ణయం, భాగవత తాత్పర్య నిర్ణయం అనే గ్రంథాలతో సహా మొత్తం 37 గ్రంథాలను వ్రాశారు. వీటిని 'సర్వమూల గ్రంథా' లంటారు. క్రీ.శ 1275లో ఆయన సిద్ధి పొందారు.

## మనుచరిత్ర

తొలి తెలుగు ప్రబంధకావ్యం 'మనుచరిత్ర'. దీనిని అల్లసాని పెద్దన వ్రాశాడు. 'స్వారోచిషమను సంభవం' అనగా స్వారోచిషుడనే మనువు పుట్టుక ఈ కావ్యమునందలి ప్రధానమయిన ఇతివృత్తం. ప్రవరాఖ్యుడనే అందమైన యువకుడు ఒక ఋషి పుంగవుడు ఇచ్చిన పాదలేపనం సహాయంతో హిమ శిఖర ప్రాంతానికి వెళ్లడం తటస్థ పడుతుంది. అయితే అక్కడ చల్లదనానికి ఆ పాదలేపనం కాస్తా కరిగి పోతుంది. తిరిగి స్వస్థలం చేరే మార్గం తెలియక అవస్థపడుతూ ఉంటాడు. అదే సమయంలో 'వరూధిని' అను దేవ కన్య ప్రవరుడికి కనిపిస్తుంది. తన ఇంటికి తిరిగి చేరుకునే మార్గం చెప్పమని ఆమెను కోరతాడు. దారి చెప్పడం మాని ఆమె ప్రవరుణ్ణిని ప్రేమిస్తుంది. ఆమె ప్రేమను నిరాకరించి, అగ్నిదేవుని సహాయంతో ఎట్టకేలకు అతడు స్వస్థలం చేరుకుంటాడు. అంతకుముందే వరూధినిని ప్రేమించి ఆమెచే తిరస్కరించబడిన నలకూబరుడనే ఒక గంధర్వుడు ప్రవరుడి వేషంలో వచ్చి ఆమె కోరికను తీరుస్తాడు. ఫలితంగా వారికి స్వరోచి పుడతాడు. ఆ స్వరోచికే స్వారోచిష మనువు పుడతాడు. కావ్యంలోని కథ క్లుప్తంగా ఇదియే. మనుచరిత్రలో వరూధినీ-ప్రవరాఖ్యుల ఘట్టాన్నే పెద్దన రసవత్తరంగా వర్ణించి ప్రబంధ కావ్యరచనకు ఒరవడి పెట్టాడు. (చూ. పెద్దన).

## మనువు

'మనుస్మృతి' కర్త. భారతీయ ధర్మశాస్త్రం పొందుపరచబడిన సంస్కృతగ్రంథం మనుస్మృతి (చూ.) ఈ స్మృతి కర్త అయిన 'వైవస్వత మనువు'కు సంబంధించిన వైవస్వత మన్వంతరంలో ప్రథమ పాదం ప్రస్తుతం జరుగుతూందని హిందువుల విశ్వాసం.

## మనుస్మృతి

స్మృతి అంటే జ్ఞాపకం ఉంచుకున్న విషయం అని అర్థం. భారతీయ సంస్కృతిలో అనూచానంగా పాటింప బడుతున్న ధర్మసూత్రావళి 'మనుస్మృతి' ఇందులో ప్రజల ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్త కాండలు అను మూడు భాగాలు ఉంటాయి. సంఘజీవనంలో మానవ కళ్యాణానికి జాతిని సంస్కరించే అనేక సూత్రాలు ఇందులో పొందుపరుప బడ్డాయి. స్మృతులన్నిటిలోనూ మనుస్మృతియే అతి ప్రాచీనమైనది. భారతీయ ప్రాచీన పవిత్ర గ్రంథాలలో మనువులు పెక్కుమంది ఉన్నట్లును బ్రహ్మ ఆజ్ఞానుసారం అందులో ప్రథమ మనువే ధర్మసూత్రాల్ని ప్రవచించినట్లు తెలుస్తోంది. మనువుచే రచింపబడినట్లు చెప్పబడుతున్న మనుస్మృతి దాదాపు క్రీ.పూ. 200 ప్రాంతమున సంకలింపబడిందని పండితుల అభిప్రాయం. హిందూ ధర్మశాస్త్రంలో మనుస్మృతి అత్యంత ప్రామాణికమైనదిగా పరిగణింప బడుతున్నది. అతి ప్రాచీనమైన ఈ ధర్మశాస్త్రం లిపిపుట్టకముందునుంచి అనుశ్రుతంగా తరతరాలకు సంక్రమించినట్లు చెబుతారు. మనుస్మృతిలో దండన ప్రక్రియ సూచింపబడినది. ధర్మ

రక్షణావశ్యకత, దండ న్యాయపాలనలో రాజు చూపవలసిన మెళుకువలను గూర్చి అనేక సూచన లున్నాయి. మనుస్మృతిలో నాలుగు విధాలయిన శిక్షలను నిర్దేశించేడు. వాగ్దండన అంటే బుద్ధి చెప్పుట, ధిక్ దండన అంటే చివాట్లు పెట్టుట; అర్థ దండన అంటే జరిమానా విధించుట; వధ దండన అంటే దైహిక దండనలో శరీరంపై దెబ్బలు కొట్టుటను సూచించాడు. మహాభారతంలో పెక్కుచోట్ల మనుధర్మశాస్త్రాన్ని ప్రస్తావించారు. ఇప్పుడు లభిస్తున్న మనుస్మృతి భృగు మహర్షిచే 12 ప్రకరణాలుగా వింగడింపబడింది. ఇందులో 2694 శ్లోకాలు ఉన్నాయి. హిందువుల సంఘ జీవనం, వారసత్వం, ఆస్తి హక్కువంటి విషయాలకు మనుస్మృతి ప్రామాణికమైన ఆధారం. స్వాతంత్ర్యానంతరం అంబేద్కర్ న్యాయమంత్రిగా ఉన్నప్పుడు అందులోని సూత్రాలను ఆధునిక సంఘజీవనానికి అనువుగ మలుచుకుంటూ హిందూ కోడ్‌ను సవరించి శాసనం చేశారు (1956).

## మమ్మీ

చూ. పిరమిడ్‌లు

## మలావీ

ఆఫ్రికా దక్షిణ భాగంలో 'న్యాసా' సరస్సుకు ఆనుకుని ఉన్న స్వతంత్ర గణ రాజ్యం. 1964లో బ్రిటిష్ వారి నుంచి స్వతంత్ర ప్రతిపత్తిని సాధించింది.

విస్తీర్ణం: 1,18,484 చ.కి.మీ.; జనాభా: 82, 11,000 (1988); రాజధాని: లిలోన్వే; అధికార భాష: ఇంగ్లీషు;ప్రజలు మారావీ, టోంగా, చెవా, తుంబుగా భాషలు మాట్లాడ తారు. వీరిలో క్రైస్తవులు(65 శాతం), ముస్లిములు (28 శాతం), తమ తమ సంప్రదాయ మతవిశ్వాసాలను పాటిస్తారు. న్యాసా సరస్సు (మలావీ సరస్సు), షీర్వా సరస్సు, బూవా నది, షీరే నది (జాంబజీకి ఉపనది) ప్రధాన జలాధారాలు. అయినా నేల సాగుకు అనుకూలమైంది కాకపోవడం వల్లనూ రైతాంగ బలం లేక పోవడం వల్లనూ వ్యావసాయకంగా కూడా మలావీ అభివృద్ధి చెంద లేదు. చెరకు, కాఫీ, ప్రత్తి, వేరుసెనగ, తేయాకు, పొగాకు, టుంగ్ నూనె ఇక్కడి పంట దినుసులు. మలావీ సరస్సు మత్స్య పరిశ్రమకు అనుకూలంగా ఉంది. ఖనిజ సంపద శూన్యం. పరిశ్రమలు కూడా తక్కువే. ఆర్థికంగా వెనుకబడి ఉన్న దేశం ఇది. పర్వత సానువులలో సుందర వృక్ష సంపద, సరస్సులు, రమణీయ ప్రకృతి దృశ్యాలు విదేశీ వినోద పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి.

## మలేసియా

ఆగ్నేయ ఆసియాలోని ఒక దేశం. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలించే 13 రాష్ట్రాలతో కూడిన ఒక ఫెడరల్ రాజ్యం. 1957లో స్వతంత్రం సిద్ధించింది. సాబా, సారవాక్ రాష్ట్రాలు బోర్నియో దీవికి వాయువ్య ప్రాంతంలో ఉన్నాయి.

విస్తీర్ణం: 3,30,442 చ.కి.మీ; జనానా: 1,69, 65,000 (1988); రాజధాని: కౌలాలంపూర్; అధికార భాష: మలేసియా (మలే).ప్రజలలో ఎక్కువ మంది మలే జాతీయులు. చైనీయులు, భారతీయులు కూడా ఉన్నారు. తెలుగువారు కూడా మలేసియాలో ఉన్నారు. కౌలాలంపూర్, జార్జ్‌టౌన్, పోర్ట్ స్వెట్టిన్ హామ్ ప్రధాన రేవులు. ఇపో, పెనాంగ్, జోహార్ బహారు, పెట్లాంగ్ జయా ఇతర పట్టణాలు.

సాబాలో కినాబా టెన్గన్ నది, సారవాక్ రాష్ట్రంలోని రాజాంగ్ నది ప్రధానమయిన నదులు. ప్రపంచంలో రబ్బరు మిక్కిలి ఎక్కువగా పండించే దేశం మలేసియా. కొబ్బరి, పామ్ నూనెగింజలు, మిరియం, అనాస పండ్లు, వరి ఇతర ముఖ్యమయిన పంటలు. కలప పుష్కలంగా లభిస్తూంది. బాక్సైట్, ఇనుపరాయి, తగరం ముఖ్యమైన ఖనిజ సంపద. పారిశ్రామికాభ్యుదయం విరివిగా సాగుతూన్న ఆగ్నేయాసియా దేశాలలో మలేసియా కీలక పాత్ర వహిస్తోంది. చూ. వియెత్నామ్ (దేశపటం)

## మర్యాదరామన్న కథలు

తెలుగు నాట బహు జనాదరణ పొందిన జానపద కథలు మర్యాదరామన్న కథలుగా ప్రసిద్ధి చెందాయి. గ్రామీణ జీవితంలో తారసిల్లు తగవులను పల్లెవాసులు వివేచనాశీలి అయిన 'మర్యాదరామన్న' వద్దకు న్యాయం చేకూర్చమని పంచాయితీకి వచ్చేవారు. ఇరు పక్షాలవారి అభ్యర్థనలను విని జాగ్రత్తగా పరిశీలించి తప్పుచేసిన వాడికి బుద్ధి వచ్చేలాగున 'మర్యాదరామన్న' నేర్పుగా తీర్పు చెప్పుచుండెడివాడు. ఆ తీర్పులు అందరికీ ఆమోద

యోగ్యంగా ఉండేవి. 'కత్తితో కోసినా రక్తం రాకూడదు', 'బాలయ్య-పదివేల వరహాలు', 'మరింత బెల్లం ముక్క', 'ఆ ఏనుగే కావాలి', 'ఎత్తుకు పైఎత్తు' వంటి కథలు జానపద బాలసాహిత్యంలో పాఠ్య భేదాలతో చెప్పుకుంటారు.

## మహబూబ్ అలీఖాన్ పాషా

హైదరాబాదు (నిజాం) సంస్థానాన్ని పాలించిన అసఫ్ జాహీ వంశపాలకుడు. ఆర్తజన నిత్యపోషకుడుగా కీర్తిప్రతిష్ఠలు ఆర్జించిన మహామనీషి. ఐదవ నైజాము ప్రభువు. 1869లో తన మూడవ ఏటనే గద్దెనెక్కాడు. అతని దివాను, ప్రధాని సాలార్‌జంగ్ రాచకార్యాలు సమర్థవంతంగ నిర్వహించగా యుక్తవయస్సు రాగానే సర్వాధికారాలు చేపట్టాడు. హైదరాబాదులోని సీతారామ్‌బాగ్ రామాలయానికి జాగీరు నిచ్చి మతసహనాన్ని ప్రోత్సహించాడు. ఈయన పరిపాలనలోనే మూసీ నదికి జలప్రళయం వల్ల ప్రకృతి వైపరీత్యం ఏర్పడగా ఆయన ఉదార స్వభావంతో ప్రజలను ఆదుకుని రక్షణ కల్పించాడని ప్రసిద్ధి. జనాదరణపొందిన ఈ ప్రభువు స్మృతి చిహ్నంగా టాంక్‌బండ్ (హైదరాబాదు)మీదనున్న తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణమున ఆయన శిల్ప విగ్రహం ప్రతిష్ఠించి నేటి ప్రభుత్వం నివాళులర్పించింది.



## మహబూబునగరం జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలో ఒకటి. తెలంగాణాలోని ఈ జిల్లాకు ఉత్తరాన **రంగారెడ్డి** జిల్లా, తూర్పున నల్గొండ, గుంటూరు జిల్లాలు, దక్షిణాన కృష్ణానది, కర్నూలు, ప్రకాశం జిల్లాలు, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం సరిహద్దులుగా ఉన్నాయి.

విస్తీర్ణం: 18,432 చ.కి.మీ., జనాభా: 24,46,548 (1981), జిల్లాకేంద్రం: మహబూబునగరం. చెంచులు, లంబాడీలు ఈ జిల్లాలోని ఆదిమజాతులు. వనపర్తి, గద్వాల, నారాయణపేట పెద్ద పట్టణాలు. ప్రధానమైన నది కృష్ణానది. దీని ఉపనదులు భీమానది, దిండివాగు, పెద్దవాగు ఈ జిల్లాలో ప్రవహిస్తున్నాయి. కొయిల్‌సాగరు, చందాసాగరు, మూసాపేట ప్రాజెక్టు, సర్లాసాగరు,దిండిప్రాజెక్టుసాగునీటిని సరఫరా చేస్తున్నాయి.

జొన్నపంట అధికం. వరి, సజ్జ, రాగి, చిరుధాన్యాలు, అపరాలు ఇతర ఆహారపు పంటలు. వేరుసెనగ, ఆముదాలు వాణిజ్యపు పంటలు. పాడిపరిశ్రమ, కోళ్ల పరిశ్రమలు సాగుతున్నాయి. కురువిందం వంటి సిలికా రాయి కృష్ణానది లోయలోని క్వారీలలో లభిస్తూంది. క్వార్ట్జ్ ఎక్కువగా ఈ జిల్లాలో దొరుకుతుంది. కొత్తకోట చేనేత పరిశ్రమకు ప్రసిద్ధి. టస్సారు పట్టుపరిశ్రమ సాగుతూంది. జపానువారి సహకారంతో సంగీత పరికరాల ఫ్యాక్టరీ పనిచేస్తూంది.

పశ్చిమ చాళుక్యులనాటి అలంపురంలో వాస్తు శిల్పసంపద కళావిమర్శకులను విశేషంగా ఆకర్షిస్తూంది. శ్రీశైలండాము నిర్మాణ సమయంలో ఈ వాస్తు శిల్ప




సంపద మునకకు లోనుగాకుండా సంగమేశ్వర దేవళాలను సురక్షిత ప్రాంతాలకు తరలించి భద్రపరిచారు. పానగల్ కోట, కొయ్యలకొండలోని కోట, టంకశాల, ఉమామహేశ్వరాలయం, శ్రీరంగపురంలోని దేవళం, పిల్లలమర్రి ఈ జిల్లాలోని మరికొన్ని దర్శనీయ స్థలాలు.

## మహమ్మద్ ప్రవక్త క్రీ.శ 571–632

ఇస్లాం మత వ్యవస్థాపకుడు. మహాప్రవక్త. మహమ్మద్ క్రీ.శ 571లో బాగ్దాద్ పట్టణంలోజన్మించాడు. తండ్రి అబ్దుల్లా, తల్లి అమ్నా. మహమ్మద్ తలిదండ్రు లిరువురూ బాల్యంలోనే గతించడంతో 12వ ఏట తన

పినతండ్రితో కలిసి ఆయన వ్యాపారంలోకి దిగాడు. మెక్కా గ్రామంలో ధనవంతుని బిడ్డతో ఆయనకు వివాహం జరిగింది. మెక్కాకు సమీపంలోని హీరా పర్వత గుహకు తరుచు వెళ్ళి దైవప్రార్థన, దైవ ధ్యానంలో గడుపుతూ ఉండడం మహమ్మద్‌కి చిన్నతనం నుంచీ అలవాటు. ఒక్కొక్కప్పుడు ఆయన అక్కడే గడుపుతూ ఉండేవాడు. తనకు కలుగుతున్న దివ్యానుభవాలను ఇతరులకు వినిపిస్తూ ఉండేవాడు. మతమంటే పరిశుద్ధమైన నైతిక జీవనమనీ, రక్త మాంసాల బలి భగవంతుడు అంగీకరించడనీ ఆయన ప్రవచించాడు. మహమ్మద్ చదువుకున్నవాడు కాదు. సమాధి స్థితిలో అతడు చెప్పే మాటలను, పద్యాలను మిత్రులు వ్రాసుకొనేవారు. ఈ విధమైన ప్రవచనాలే తర్వాత ఖొరాన్ (చూ.)లోని 114 అధ్యాయాలుగా రూపొందాయి. మెక్కాలో తన వ్యతిరేకులను ఎదుర్కొంటూనే 13 సంవత్సరాలపాటు మహమ్మద్ మత ప్రచారం సాగించాడు. తర్వాత తన మకాం 'మదీనా' పట్టణానికి మార్చాడు. అక్కడ ప్రచారం పూర్తి అయాక చివరి దినాలలో తిరిగి మెక్కా చేరుకున్నాడు. అక్కడ **ప్రార్థనాసమావేశాలను** తానే నడుపుతూ ఉండేవాడు. క్రీ.శ. 632 మే నెలలో తన 61వ ఏట మహమ్మద్ కాలధర్మం చెందాడు. మరణ సమయంలో ఆయన నోటివెంట 'భగవంతుడు నాకు పరమ మిత్రుడు' అనే మాట వెలువడిందట! (చూ. ఇస్లాం, ఖొరాన్, మెక్కా).

## మహమ్మద్ బీన్ తుగ్లక్

అసలు పేరు ఉలుగ్‌ఖాన్. సుల్తాన్ రాజవంశ స్థాపకుడు ఘియాసుద్దీన్ తుగ్లక్ కుమారుడు. ఢిల్లీకేంద్రంగా 1325 నుండి 1351 వరకు రాజ్య పరిపాలన సాగించాడు. ఇతని పాలనలో శాంతి **నెలకోలేదని** చారిత్రకుల అభిప్రాయం. హిందువులతో సామరస్య భావంతో పాలన కొనసాగించాడు. అయితే అహంభావి. కక్ష సాధింపు అవిధేయులపట్ల అతిక్రౌర్యమూ చూపుటవలన పరిపాలనలో అయిష్టులు ఎక్కువయిరి. దేశకాల పరిస్థితులను లెక్కపెట్టక ప్రజలకు అనిష్ట కార్యాలను చేపట్టి తీవ్ర అసంతృప్తికి లోనుకావల్సి వచ్చింది. ఉదాహరణకు రాజధానిని ఢిల్లీనుండి దేవగిరికి మార్చాడు. ప్రజల వ్యతిరేకతకు గురియై మరల వెనుకకు ఢిల్లీకి మార్చాడు. ప్రజలలో అసమ్మతి పెరిగింది. సామ్రాజ్యంలో అరాచకం పెరిగి సామంతులు స్వతంత్రులుగుట ప్రారంభించారు. దక్కనులో బహ్మనీ (1347) ఏర్పడింది. 1339లో బెంగాలు స్వతంత్రించింది. ఓరుగల్లులో 1336లో కాపయ నాయకుడు ముస్లిం సైనికులను పంపివేశాడు. హరిహర, బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు (1336). గుజరాతు, మాళవ, సింధు ప్రాంతాలలో కూడ అల్లర్లు చెలరేగాయి. తిరుగుబాటుదారులను అణిచే ప్రయత్నంలో చివరకు తుగ్లక్ 1351లో మరణం పాలయ్యాడు.

## మహమ్మదాలీ జిన్నా 1876–1948

పాకిస్తాన్ సంస్థాపకుడు. ముస్లిములకు ప్రత్యేక దేశం కోరిన యోధుడు. హవాబీలో 1876లో జన్మించి, లండన్‌లో బారిస్టరు చదివి బొంబాయిలో న్యాయవాదిగా మంచి పలుకుబడి సంపాదించాడు. ఆదిలో నౌరోజీ, గోఖలే వంటి మిత కాంగ్రెసు వాదులతో కలసి పనిచేశాడు. సామ్రాజ్య శాసన సభ (ఇంపీరియల్ కౌన్సిల్)లో సభ్యుడుగా ఉన్నాడు. ముస్లిమ్‌లీగ్‌లో చేరి దానికి 1913లోనూ, 1920లోనూ అధ్యక్ష స్థానము నందు కొనసాగాడు (1934). ముస్లిము లందరూ ఆయనను మహానాయకునిగా ఎంచి 'ఖాయిదే ఆజామ్' అని పిలుచుకునేవారు. 1932లో రౌండ్‌టేబిల్ సమావేశంలో పాల్గొని హిందువులతోబాటు ముస్లిములకు సమాన ప్రతిపత్తిని గూర్చి వాదించాడు. భారతదేశాన్ని విభజించి ముస్లిం ప్రాంతాన్ని (పాకిస్తాన్) ఇవ్వమని పట్టుపట్టడం ప్రారంభించేడు. 1942లో క్రిప్స్ ప్రతిపాదనలను తిరస్కరించాడు. 1946లో లీగ్ ప్రతినిధులను రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనకుండ చేయడంతో 1947లో భారతదేశ విభజన తప్పనిసరి అయి ప్రత్యేక పాకిస్తాన్ ఏర్పడింది. జిన్నా ప్రప్రథమ గవర్నరు–జనరల్ పదవిని చేపట్టాడు. 1948లో కాలధర్మం చెందాడు.

## మహాబలిపురం

పల్లవుల క్రీ.శ.( 6వ శతాబ్ది) కాలంనాటి శిథిల శిల్పఖండాల కళాప్రాంగణం మహాబలిపురం. తమిళనాడులోని మద్రాసుకు 50 కి.మీ. దూరంలో కోరమండల

తీరమున ఉంది. మహాబలిపురాన్ని మామల్లపురం అని కూడా వ్యవహరిస్తూంటారు. ఇవి ద్రావిడ వాస్తు శిల్ప



అర్జునుని తపస్సు - గంగావతరణం

సంప్రదాయానికి మచ్చుతునకలు. ఏక శిలనుండి శిల్పించిన హస్తి, రథాలు, ధర్మరాజు రథం, భీమరథం, ద్రౌపది రథం వాస్తు కళకు పేరొందినాయి. గంగావతరణం, అర్జునుని తపస్సు వంటి పురాణగాథలను నాటి శిల్పులు మనోహరంగా చెక్కారు. సమీపంలోనే సగం నీటిలో మునిగి ఏడు పగోడాల లోని ఒక దేవాలయ ప్రాంగణం శిథిలావశేషాలలో కనిపిస్తూంటుంది. (చూ. తమిళనాడు, మద్రాసు).

## మహాభాగవతం

అష్టాదశ మహాపురాణాలలో ఒకటి. సంస్కృతంలోని మహాభారతేతిహాసంతో పాటు మహాభాగవత పురాణాన్ని కూడా వ్యాస మహర్షే రచించాడు. 'భాగవతం' అన్నపేరు సూచిస్తున్నట్లు దీనిలో భగవంతుడైన విష్ణు మూర్తి అవతారాలూ, భగవద్భక్తుల కథలూ ఉన్నాయి. దశమస్కంధంలో కృష్ణావతార కథ విపులంగా వర్ణించ బడింది. సంస్కృత భాగవతాన్ని మహాభక్తుడైన బమ్మెర పోతన (చూ.) మహాకవి ఆంధ్రీకరించాడు. దానిలోని మధురము లైన పద్యాలెన్నో తరతరాలుగా తెలుగు బాలబాలికలకు కంఠస్థాలవుతూ వచ్చాయి. ముఖ్యంగా గజేంద్రమోక్షం (చూ.) రుక్మిణీ కల్యాణం, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్ర బహుళ ప్రచారం పొందాయి. దశమస్కంధంలోని శ్రీకృష్ణుని లీలలు కూడా అందరికీ కంఠస్థంగా ఉంటాయి. ''మందార మకరంద మాధుర్య మున తేలు మధుపంబు పోవునే మదనములకు'', ''నల్లనివాడు పద్మనయనంబుల వాడు'' ''ఇందుగలడందు లేడని సందేహంవలదు'' వంటి పద్యాలు అందరికీ తెలిసినవి.

## మహాభారతం

పంచమ వేదంగా ప్రసిద్ధి పొందిన సంస్కృత ఇతిహాస గ్రంథం. దీని కర్త వ్యాస మహర్షి (చూ.) మూడేళ్ళ పాటు ఆయన గణపతిని లేఖకునిగా చేసికొని 18 పర్వాలతో కూడిన ఈ మహా భారత గ్రంథాన్ని రచించాడని ప్రసిద్ధి. భరతవంశపు రాజుల కథ గనుక దీనికి **'భారతం'** అనే పేరు వచ్చింది. యయాతి, దుష్యంతుడు, పూరుడు, శంతనుడు మొదలైన ఇతర భారతవంశపు రాజుల కథలు కూడా దీనిలో చెప్పబడినా ప్రధానంగా ఇది కౌరవ-పాండవుల మధ్య జరిగిన భారత సంగ్రామ కథ (చూ. కురుక్షేత్రం). శత సహస్రశ్లోకాలతో వ్యాసుడు మహాభారతం రచించి దేవలోకంలో ప్రచారం చేయడానికి నారదుడికీ, పితృ, రాక్షస లోకాలలో ప్రచారం చేయడానికి దేవలుడికీ, గరుడ, గంధర్వ, యక్షాది లోకాలలో వినిపించడానికి శకునికీ, నాగలోకంలో ప్రచారం చేయ డానికి కృష్ణద్వైపాయనుని శిష్యుడు సుమంతుడుకీ, మనుష్యలోకంలో వినిపించడానికి తన (వ్యాసుని) శిష్యుడు జనమేజయుడికీ ఉపదేశించినట్లు భారతంలోనే ఆరం భంలో వ్యాసమహర్షి పేర్కొన్నాడు. ఇందు రాజనీతి, సాంఘిక నీతి, యుద్ధనీతి వంటి నీతి బోధనలు కలవు. సంస్కృత మహాభారతాన్ని కవిత్రయం (చూ.) వారు తెలుగు చేశారు. వారిలో మొదటి వాడైన నన్నయ (చూ.) ఆది సభాపర్వాలనూ **అరణ్యపర్వంలో** కొంతభాగాన్నీ,రెండవ వాడైన తిక్కన చివరి 15 పర్వాలనూ (అంటే విరాటోద్యోగపర్వాలూ, యుద్ధ షట్కంలోని భీష్మ,ద్రోణ, కర్ణ,శల్య,సౌప్తిక,స్త్రీశాంతి సప్తకంలోని శాంతి,అనుశాసనిక, అశ్వమేధ,ఆశ్రమవాస,మౌసల,మహాప్రస్థానిక,స్వర్గారోహణ) మూడవవాడైన ఎర్రాప్రెగడ (చూ.) అరణ్యపర్వంలో నన్నయ అనువ దించకుండా వదిలిన భాగాన్నీ అనువదించారు. ఆంధ్ర మహాభారతం తెలుగులో ఆది కావ్యంగా ప్రసిద్ధి పొందింది.(చూ. కౌరవులు, పాండవులు) ధృతరాష్ట్రుడు, ధర్మరాజు, అర్జునుడు, భీముడు, నకు లుడు, సహదేవుడు, ద్రౌపది, దుర్యోధనుడు, కృష్ణుడు ఇందులోని ప్రముఖపాత్రలు. హరిశ్చంద్రోపాఖ్యానం, నలో పాఖ్యానం వంటి ఉపకథలు కూడా ఉన్నాయి.

## మహారాష్ట్ర

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. పశ్చిమాన అరేబియా సముద్రం, వాయవ్యాన గుజరాతు, ఉత్తరాన మధ్యప్రదేశ్, ఆగ్నేయాన ఆంధ్రప్రదేశ్, దక్షిణమున గోవా, కర్నాటక ఈ రాష్ట్రానికి సరిహద్దులు. బ్రిటిషు ఇండియాలో బొంబాయి, ఈస్ట్ ఇండియా కంపెనీవారి స్థావరం. నాటి బొంబాయి ప్రెసిడెన్సీ స్వాతంత్ర్యానంతరం ఉమ్మడి రాష్ట్రంలో కొనసాగి, 1960లో గుజరాతు విడిపోగా, మహారాష్ట్ర రూపొందింది. విస్తీర్ణం: 3,07,690 చ.కి.మీ., జనాభా: 6,27,84,171 (1981), రాజధాని: బొంబాయి, అధికార భాష: మరాఠీ. పూణే ప్రధాన పట్టణం. గోదావరినది (చూ.) జన్మస్థానం ఈ రాష్ట్రంలోనే నాసిక్ (త్రయంబకం)వద్ద ఉంది. వెయిన్‌గంగానది, పూర్ణానది గోదావరికి ఉపనదులు. రిర్నానది, కృష్ణానది (చూ.) కోయ్నానది, భీమానది, వార్నానది, తాపీనది ఇతర నీటివనరులు. పడమటి కనుమలలోని సహ్యాద్రిశ్రేణి అరేబియా తీరంవెంబడి వ్యాపించి ఉంది. దీనికి తూర్పు వైపున పీఠభూమి విస్తరించి ఉంది. గోధుమ, వరి, జొన్న, సజ్జ, అపరాలు ఈ రాష్ట్రంలోని ఆహారపు పంటలు. ప్రత్తి, చెరకు, నూనెగింజలు, పొగాకు ప్రధానమయిన వాణిజ్యపు పంటలు. దేశంలోనే 'మహారాష్ట్ర' పారిశామికంగా విశేష ప్రగతిని సాధించినరాష్ట్రం. బ్రిటిష్‌వారి కాలంలోనే జవుళీ పరిశ్రమ ఇక్కడ సువ్యవస్థితంగా




వేరులుపాతుకొని ఉంది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత పారిశ్రామికరంగం మరింత పుష్టిని సాధించింది. తారాపూరువద్ద పరమాణు విద్యుత్కేంద్రం ద్వారా విద్యుత్తు ఉత్పత్తి అవుతూంది. కొయ్నావద్ద జలవిద్యుత్ కేంద్రం ఉన్నది. యంత్ర సామగ్రి, రాసాయనిక ద్రవ్యాలు, ప్లాస్టిక్స్, కృత్రిమ దారాల (నైలాన్) ఉత్పత్తి, ఎలక్ట్రిక్ యంత్ర సామగ్రి, ఔషధాలు, ఇంజనీరింగు సామగ్రి, యంత్రాల పనిముట్లు, బీడు ఉక్కు, పోత సామగ్రి, ఎలక్ట్రానిక్ పరికరాలు ప్రధాన పరిశ్రమలు. బొంబాయి సమీపంలో సముద్రగర్భంలో పెట్రోలు తైల నిక్షేపా లున్నాయి. పెట్రోలు శుద్ధి కర్మాగారాలు పనిచేస్తున్నాయి. పూణే, నాసిక్, ఔరంగా బాదు, జల్గాన్ పారిశ్రామిక కేంద్రాలుగా అభివృద్ధి చెందుతున్నాయి. **(చూ. బొంబాయి)**

ఇండియాలో సినిమా ఆవిర్భవించిన నాటినుంచీ అమెరికాలో హాలివుడ్‌లాగ, ఇండియా చలనచిత్ర పరిశ్రమకు బొంబాయి కేంద్రం అయింది. మహారాష్ట్ర పేరు చెప్పగానే శివాజీ పేరు స్ఫురిస్తుంది. స్వాతంత్ర్య సమరయోధులు—తిలక్, నౌరోజీ, రానడే, గోఖలే పేర్లుకూడా స్ఫురిస్తాయి. అజంతా—ఎల్లోరా గుహలలో బౌద్ధ కుడ్యచిత్రాలు, ఎలిఫెంటా, కన్హేరా, కార్లాలోని శిల్ప సంపద, మహాబలేశ్వర్ (కృష్ణానది ప్రారంభం), మేథేరాన్, పంచాగ్ని శీతలకేంద్రాలు వినోద పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. పండరీపురంలోని పాండురంగ దేవళం, షిరిడిలోని సాయిబాబా గుడి, జేంధనాగనాథ్, నాందేడ్, గణపతిపూలే, నాసిక్ (గోదావరినది ప్రారంభం) మహారాష్ట్రలోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు.

## మహావీరుడు క్రీ.పూ. 599–527

జైన మతస్థాపకుడు. మహావీరునికి వర్ధమానుడని బిరుదు కలదు. మహావీరుడు, గౌతమ బుద్ధుడు(చూ.) సమకాలికులు. మహావీరుడు క్షత్రియ వంశానికి చెందినవాడు. ఉత్తర బీహారులోని విదిశానగరంలో జన్మించాడు. 30వ ఏడు వచ్చేదాకా గృహస్థుగా జీవితం గడిపి, తర్వాత సర్వం త్యజించి తమ్ముడికి రాజ్యం అప్పగించి వైశాలి నగర ప్రాంతంలో గల అశోక వృక్షం క్రింద ఘోర తపస్సు చేశాడు. 12 ఏళ్ళు దిగంబరుడై తీవ్ర నిష్ఠతో తపస్సు చేయగా 13వ సంవత్సరంలో అంటే అతని 42వ ఏట—జ్ఞానోదయమైంది. తర్వాత 30 సంవత్సరాల పాటు జన్మనిస్సారమైంది, వర్ణాశ్రమాలు కల్పితాలు, వేదం ప్రమాణంకాదు. అహింసే పరమ ధర్మం'' అను ప్రధాన సిద్ధాంతాలతో కూడిన తన మతాన్ని వివిధ ప్రాంతాలలో ప్రచారం చేశాడు. ప్రజలు తండోప తండాలుగా ఆయన అనుచరులై జైన మతాన్ని స్వీకరించారు. ఈయన మతం దక్షిణాదిని ఒకప్పుడు ప్రచారంలో ఉండేది. ఆంధ్ర

ప్రదేశ్‌లో 'కొలనుపాక' ప్రసిద్ధ జైన **క్షేత్రం,** రాష్ట్రంలో పలుచోట్ల జైన శిథిలావశేషాలు కానవస్తాయి. తన 72వ ఏట క్రీ.పూ. 527లో సిద్ధి పొందేడు.(చూ. జైనమతం)

## మహాశివరాత్రి

మాఘ బహుళ చతర్దశినాడు ఈ పండుగ వస్తుంది. శైవులకు మహాప్రతిష్ఠాకరమైన పండుగ. పవిత్ర మైన పర్వదినం. ఆనాడు పాపక్షయం అవుతుందని నమ్మకం. ఆరోజు శివసాయుజ్యం పొందుతారని శైవుల దృఢ నమ్మకం. ఆరోజు శివభక్తులు తెల్లవారు జాముననే లేచి స్నానాలు ముగించుకొని, ఉపవాసం చేసి రాత్రి పన్నెండు గంటలకు లింగోద్భవకాలం గనుక రాత్రంతా పూజలు, అభిషేకాలు అర్చనలు, శివలీలాకథా కార్య క్రమాలు జరిపి మరుసటి రోజు ఉదయం పారణ చేస్తారు. శివక్షేత్రాలలో ఈ ఉత్సవం గొప్పగా జరుగుతుంది. శ్రీశైలం (చూ.)లో పూర్వం ఈ ఉత్సవాలు జరిగేతీరును పండితారాధ్య చరిత్రలో విపులంగా కవి వర్ణించాడు. కోటప్పకొండ (గుంటూరు), పట్టిసీమ (గోదావరి జిల్లా) ప్రాంతాల్లో శివరాత్రి సంబరాలు జరుగుతాయి.

## మాక్స్‌ముల్లర్

ప్రాచ్య వాఙ్మయ వ్యాఖ్యాత. ఉపనిషత్తులు, ఋగ్వేదం వంటి ప్రాచీన భారతీయ పవిత్ర గ్రంథాల్ని 'సేక్రెడ్ బుక్స్ ఆఫ్‌ది ఈస్ట్' గా ప్రచురించి, మరుగున పడిన హైందవతత్త్వాన్ని ఆంగ్లేయులకు వివరంగా తెలియ జెప్పినవాడు. ప్రఖ్యాత జర్మన్ కవి విల్‌హెల్మ్ ముల్లర్ ఏకైక పుత్రుడు ఫ్రెడరిక్ మాక్స్ ముల్లర్. మధ్య జర్మనీ డెసావ్‌లో 1823డిసెంబరు 6వ మాక్స్ ముల్లర్, జన్మించాడు. 1841లో యూనివర్సిటీలో చేరి సంస్కృత భాషను అభిమాన విషయంగా అధ్యయనం చేశాడు. ప్రొఫెసర్ బ్రోకన్ వద్ద చేరి నల మహారాజు చరిత్ర, శకుంతల నాటకం,ఋగ్వేదం చదివాడు. తన 20వ ఏట హితోపదేశాన్ని జర్మన్ భాషలోకి అనువదించాడు. 1843లో ఫిలాసఫీలో డాక్టరేటు పట్టాని పొందారు.

సాయన భాష్యంతో ఋగ్వేదాన్ని ఆరు సంపుటాల్లో ప్రచురించడానికి తగిన విషయాలను సేకరించాడు. మరిన్ని విషయాల సేకరణకై ఇంగ్లండ్ వెళ్ళారు. జార్జినీ గ్రెన్‌ఫెల్ అను ఆంగ్లేయ యువతిని వివాహమాడి 1859లో ఆంగ్ల సంస్కృతిని అలవర్చుకున్నాడు. 1847లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో ఫాకల్టీ మెంబర్‌గా చేరి 30 సంవత్సరాల పాటు వివిధ పదవుల్ని చేపట్టి 1875లో మాక్స్ ముల్లర్ పదవీ విరమణ చేశారు. మాక్స్ ముల్లర్ తన జీవితకాలంలో భారతదేశం సందర్శించ లేకపోయినప్పటికీ ఈ దేశాన్ని ఆధ్యాత్మిక పారమార్థిక గృహంగా భావించాడు. పై వాటితోబాటు 'ఇండియ వాట్ ఇట్‌కెన్ టీచ్ అజ్' ప్రసంగాలు, పౌరాణిక ప్రేరణలు, శబ్దాలపుట్టుకచరిత్రలు, 'ప్రాచీన సంస్కృత వాఙ్మయ చరిత్ర మాక్స్ ముల్లర్ రచనలలో పేర్కొనదగినవి. 1900 అక్టోబర్ 28వ ఆక్స్‌ఫర్డులో మాక్స్‌ముల్లర్ కీర్తిశేషుడయ్యాడు.

## మాగ్నాకార్టా

ఇది ఒక లాటిన్ పద బంధం. దీనికి 'మహాస్మృతి', 'గ్రేట్ ఛార్టర్' ప్రసిద్ధ చట్టం అని చెప్పవచ్చును. రాజ్యమేలే రాజరికపు రాజు(మొనార్క్)ను అదుపులో పెట్టే శాసనావళి. రాజ్యాంగ పద్ధతిని రాజ్యపాలన కొనసాగించడానికి రూపుగొన్న ఈ ప్రప్రథమ శాసనా వళి ఆ తరువాత ప్రపంచ దేశాల్లో ప్రజాస్వామ్య విధానానికి ఆది స్వరూపం అయింది. రాజ్యాంగ శాసనానికి రూఢి వాచక మయింది.

వాస్తవానికి ఆ రోజుల్లో దీని వలన సామాన్య ప్రజానీకానికి ఎటువంటి స్వాతంత్ర్య లభించినట్టులేదు. తోచినట్టు హెచ్చుపన్నులు విధించి ప్రజలను ఇబ్బంది పెట్టే వారు. ఇబ్బందులకు పరిష్కార మార్గంగా ఆనాడు 1215లో ఇంగ్లండును పాలిస్తున్న కింగ్‌జాన్‌ను బలవంతం చేసి ఆ సంపన్న వర్గం కొన్ని హక్కులు పొందడానికి చేసిన ప్రయత్న కృషియే'మాగ్నాకార్టా'గా ఫలించింది. లండన్‌కు నైరృతిలో నదీ తీరాన రన్నిమీడ్ మైదానంలో ఈ సంపన్న వర్గం 'మాగ్నకార్టా'కు జాన్ రాజును ఒప్పించి దాని మీద చేవ్రాలు చేయించారు. ఈ చారిత్రక సంఘటన స్మారక చిహ్నం ఒకటి ఇప్పటికీ అక్కడ వుంది. జనసామాన్యానికి దీనివల్ల ఆ నాడు ఒరిగిందేమీ లేకపోయినా వంశానుగతంగా ఏలుతున్న మహారాజు ఆచరించే విశృంఖల నియంతృత్వ రాజనీతి ధోరణిని సాధ్యమయినంత వరకు నియంత్రించ

టానికి ఆనాడు ఈ 'మాగ్నాకార్టా' ప్రయోజన పడింది. ఆ తరువాత యునైటెడ్ స్టేట్స్, కెనడా వంటి ప్రజాస్వామ్య ప్రభుత్వాలు నెలకొన్నప్పుడు వారికి 'మాగ్న కార్టా' లోని సూత్రావళి ఒక నమూనాగా తోడ్పడింది.

## మాఘుడు

క్రీ.శ. 7వ శతాబ్ది

సంస్కృత మహాకవి. సంస్కృత పంచకావ్యా లలో ఒకటి అయిన 'శిశుపాలవధ'కర్త. ఈ కావ్యాన్ని కర్త పేరు మీదుగా 'మాఘం' అని వ్యవహరించడం కూడా కద్దు. మాఘుడు 'సుప్రభ దేవుని' పౌత్రుడు. 'దత్తక సర్వాశ్రముని' పుత్రుడే. 'శిశుపాలవధ' కావ్యంలోని కథ మహాభారత, భాగవత పురాణాల నుంచి గ్రహింపబడినది. వర్ణన ప్రధానమైన ఈ కావ్యంలో 'మాఘుడు' శబ్ద చిత్రాన్ని ఎక్కువగా ఆదరించాడు. చిత్ర కవిత్వం, బంధ కవిత్వం ఈ కావ్యంలో ఎక్కువగా కనిపిస్తాయి. కావ్యారంభంలోనూ, సర్గావసానాలలోను 'శ్రీ' శబ్దాన్ని మాఘుడు ప్రయో గించాడు. శిశుపాలవధకు ఎన్నో వ్యాఖ్యానాలు ఉన్నా మల్లినాథుడు వ్రాసిన 'సర్వం కష' వ్యాఖ్యానానికే విశేష ప్రసిద్ధి ఉంది.

## మానస సరోవరం

హిమాలయా పర్వత శిఖరాల మధ్య టిబెట్టులో ఉన్న పవిత్ర తటాకం. ఈ సరస్సు హిందువులకు అతి పవిత్రమైన తీర్థాస్థలి. అర్జునుడు తీర్థయాత్రకు వచ్చిన స్థలమని ప్రసిద్ధి. ఈ సరోవర ప్రాంగణంలో శివుని గూర్చి తపస్సు చేసిన శివసాయుజ్యం పొందుదురని హిందువుల విశ్వాసం. ఈ సరోవరపు తీరంనుండి ఒక మహర్షి సారస పక్షి (హంస) రూపంలో అంపశయ్య మీద పరుండి మోక్షానికై ఎదురుచూస్తున్న సమయంలో భీష్ముని సందర్శించాడని ఐతిహ్యం. బ్రహ్మ ఈ మానస సరోవరాన్ని సృష్టించాడనీ, సరయూనదికి జన్మస్థానం ఇదేననీ చెప్పుతారు.

## మారిటేనియా

పశ్చిమ ఆఫ్రికాలోని స్వతంత్ర గణ రాజ్యం. (1960) ఒకప్పుడు ఫ్రెంచ్ వలస రాజ్యంగా ఉండేది. 1958లో స్వతంత్ర ప్రతి పత్తిని సాధించుకుంది.

విస్తీర్ణం: 10,30,700 చ.కి.మీ; జనాభా: 18.94, 000 (1988); రాజధాని: నౌవాక్‌ఛోట్; అధికార భాష: అరబ్బీ; ప్రజలు మూర్‌లు 81 శాతం, వూలాఫ్, టుకులోర్, సోనిన్కే ఫులానీ తెగలు—వీరంతా నీగ్రోజాతి వారు. ఇస్లాం మతావలంబకులు 99 శాతం. దేశ ద్రిమ్మరులు. ఒంటె రోమాలతో చేసిన గుడారాలను వేసుకొని జీవయాత్ర సాగిస్తూ ఉంటారు.

సహారా ఎడారి ఈ దేశాన్ని చుట్టి ఉంది. అక్కడక్కడ పచ్చపట్టులు (ఒయాసిస్‌లు) కానవస్తాయి. దక్షిణాన సెనెగల్ నది అంతర్జాతీయ సరిహద్దుగా ఉంది. దీన్ని ఆనుకొని ఒక మైదానం ఉంది. ఇదే ఈ దేశంలో సారవంతమయిన నేల. వరి, చిరుధాన్యాలు, కంద మూలాలు, పుచ్చకాయలు, అపరాలు ఇక్కడ పండిస్తారు. ఖర్జూరం, వేరుసెనగ, అరబిక్ బంక, వాణిజ్యపు సరుకులు, రాగి, ఇనుపరాయి, లభిస్తాయి. తైల నిక్షేపాలను గూర్చి అన్వేషణలు సాగుతున్నాయి. పశుపోషణ ఉంది. కలప లభిస్తుంది. చూ. మాలీ (దేశ పటం)

## మారిషస్

హిందూ మహాసముద్రంలో ఆఫ్రికా (మడ గాస్కర్)కు తూర్పుగా ఉన్న ద్వీప రాజ్యం. భారతదేశానికి నైరృతి దిశలో 4000 కి.మీ. దూరంలో ఉంది. అప్పటి వరకూ బ్రిటిష్ వలస రాజ్యంగా ఉన్న మారిషస్ 1968లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకుంది. ఒక రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలిస్తున్నారు.

విస్తీర్ణం: 2040 చ.కి.మీ; జనాభా: 10,49, 000 (1988); రాజధాని: పోర్ట్‌లూయీ; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలలో మూడింట రెండు వంతులు భారతీయులు. తెలుగు వారు అధిక సంఖ్యలోనే ఉన్నారు. వీరిని క్రియోల్స్ అంటారు. వీరు క్రియోలీ భాష మాట్లాడ తారు. హిందూస్థానీ, ఫ్రెంచి భాషలు కూడా మాట్లాడ తారు. గ్రాండ్ నది, తాబేర్ నది ప్రధాన మయిన నదులు. మారిషస్ ఏక సస్య దేశమని చెప్పవచ్చును. 90 శాతం పంటనేలలో చెరకును విరివిగా పండించి పంచదారను ఉత్పత్తి చేసి విదేశాలకు ఎగుమతి చేసి తమ ఆర్థిక వ్యవస్థను పోషించుకుంటున్నారు. సుమారు 25 భారీ కమతా లున్నాయి. తేయాకును, పొగాకును కూడా పండించి ఎగుమతి చేస్తున్నారు. విదేశీ వినోద పర్యాటకులకు మారిషస్ చక్కని విహార స్థలం.

## మార్కస్ అరీలియస్ క్రీ.శ.121–180

రోమన్ చక్రవర్తి ఆంటోనియస్ పయస్ అనంతరం క్రీ.శ. 161లో సింహాసనమునకు వచ్చెను. ఎపిక్టెటస్ వ్రాసిన అనేక ఉద్గ్రంథాలను అరీలియస్ అధ్యయనంచేసి స్టోయిక్ తత్త్వము పట్ల మక్కువ చూపి దానిని అనుసరించసాగెను. ఆలోచనలు (మెడిటేషన్స్) అను అర్థంవచ్చు 12 గ్రంథాలను గ్రీక్ భాషలో రచించెను. మానవుడు సమాజంలో ఎట్లు నీతిమంతుడుగా ప్రవర్తించాలనేదే ఇందలి ప్రధాన విషయాలు.

## మార్కోపోలో 1254–1323

ఇటలీ (వెనిస్) దేశ యాత్రికుడు. 1271– 75 మధ్య భూమార్గాన్ని అనుసరించి బాగ్దాద్, గోబీ ఎడారి, షాంగ్ టూ ద్వారా చీనా సందర్శించి, కుబ్లయిఖాన్ దర్బారులో మూడేళ్లు ఉన్నాడు. మార్కోపోలోను అతని ప్రజ్ఞకు, అనుభవానికి, తెలివి తేటలకు మెచ్చి కుబ్లయి ఖాన్ ఆయనను కారకూరవ్ కొచ్చిన్—చీనా, బర్మాదేశాలలో తన రాయబారిగా పంపాడు. తరువాత మంగోల్ రాకుమారి వెంట మార్కోపోలో సుమత్రా, (నేటి ఇండోనీషియా) దక్షిణ భారతదేశాల మీదుగా సముద్ర మార్గాన పర్షియా చేరి, రాకుమారిని అక్కడ వదిలి 1295 నాటికి తాను స్వదేశం చేరుకున్నాడు. ఈ 24 ఏళ్ళలోను ఆయన సందర్శించిన స్థల విశేషాలను వ్రాసి పెట్టుకున్నాడు. స్వదేశంలో నౌకాధిపతిగా ఉండగా యుద్ధంలో శత్రువులు అతనిని బందీ చేశారు. కారాగారంలో ఉన్న సమయంలో తన అనుభవాలను జ్ఞాపకాలను 'రస్టిసియానో' అను వానికి చెప్పి గ్రంథస్థం చేయించి తన యాత్రా చరిత్రను ముందు తరాలవారికి అందజేశాడు. ప్రాచ్యదేశ విశేష వైభవ సంపత్తులను గూర్చి పాశ్చాత్యులు తెలిసికోడానికి ఇతని 'డిస్క్రిప్షన్ ఆఫ్ ది వరల్డ్' అనే గ్రంథం విశేషంగా ఉపకరించింది. ఆంధ్రప్రదేశ్‌లోని మోటుపల్లి రేవు (బాపట్ల వద్ద)లో ఆనాడు కాకతీయులు వేయించిన అభయ శాసన ప్రస్తావన ఈ గ్రంథంలో కనిపిస్తూంది.

మార్కోపోలో అందించిన 'డిస్క్రిప్షన్ ఆఫ్ ది వరల్డ్' అను గ్రంథం ఆధారం చేసికొనియే యూరపియన్ అన్వేషక బృందాలు తూర్పువైపుకు రావడం **ప్రారంభించాయి.**

## మార్క్స్, కార్ల్ 1818–1883

జర్మనీ తత్త్వ వేత్త. సాంఘిక శాస్త్రవేత్త. ఆర్థిక తత్త్వ ప్రవక్త. మానవాళి మనస్సుల మీద చిరస్థాయిగా ఉండే తమదంటూ ముద్రవేసిన కొద్దిమంది ప్రపంచ మేధావులలో ఒకడు. ప్రజాస్వామ్యానికి సంబంధించిన డెమాక్రటిక్ సోషలిజం, విప్లవాత్మక కమ్యూనిజం భావాలకు బీజసూత్రాలను తన ఉద్గ్రంథం 'దాస్‌కాపిటల్' లో పొందుపరచాడు. సోవియట్ రష్యా, చీనా,



తూర్పు యూరప్‌లలోని రాజకీయ నాయకులను ఈయన రచనలు అమితంగా ప్రభావితం చేశాయి.

నేటి జర్మనీ (నాటి ప్రష్యా)లో జన్మించి, బాన్, బెర్లిన్, జీనా యూనివర్సిటీలో విద్య నభ్యసించి, 1841లో డాక్టరేట్‌ను సంపాదించి పారిస్ వెళ్ళాడు (1843). అక్కడ ఫ్రెడ్రిక్ ఏంగెల్స్‌తో కలిసి తన విప్లవాత్మక భావాలను ప్రకటింప చేయసాగాడు 1845–1848). 'నూరీయన్ష్కేజీతుంగ్' పత్రికకుసంపాదకుడుగా ఉండటం వల్ల తనభావాలను ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం చేసే వీలు కలిగింది. కార్మిక సంఘం (1864) స్థాపించి, శ్రామిక జనోద్ధరణకు పాటుపడ్డాడు. 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో', 'దాస్ కాపిటల్' ఈయన ప్రసిద్ధ రచనలు. (చూ. కమ్యూనిజమ్; చీనా; మావో రష్యా; లెనిన్).

## మార్టిన్ లూథర్ కింగ్ (జూ.)

అమెరికన్ సంఘ సంస్కర్త. అమెరికాలోని నీగ్రోజాతి పౌరహక్కుల కోసం ఎడతెగకుండా ఉద్యమం నడిపిన మహనీయుడు. గాంధీజీ (చూ.)అహింసా సిద్ధాంతం అతడికి స్ఫూర్తినిచ్చింది. 1929 జనవరి 15న కింగ్ పుట్టినప్పుడు అతనికి తండ్రి మొదట పెట్టిన పేరు మైకేల్ లూథర్ కింగ్. ప్రొటెస్టెంటు మత విప్లవ నాయకుడు 'మార్టిన్ లూథర్‌కింగ్' మైకేల్ తండ్రికి ఆదర్శప్రాయుడు. తన కుమారుడు, అంతటివాడు

కావాలని అతని ఆరవ ఏట మైకేల్ పేరును మార్టిన్ లూథర్ కింగ్‌గా మార్చివేశాడు. తోరో వ్రాసిన 'సివిల్ డిసో బిడియన్స్'ను 1944లో చదివి ప్రభావితు డయ్యాడు. తనలో రేకెత్తిన ఆలోచనలకూ, ఆకాంక్షలకూ కార్యరూపం ఇవ్వాలంటే చర్చిలో పనిచేయడమే శ్రేయస్కరమని 1955లో చదువుకు స్వస్తి పలికి మౌంట్‌గొమారీ చర్చిలో మతాచార్య పదవి చేపట్టాడు.

ఆ రోజుల్లో అమెరికా దక్షిణ రాష్ట్రాల్లో వర్ణవైషమ్యం ఎక్కువగా ఉండేది. తెల్లవారికి, నల్లవారికి వేరే వేరే పాఠశాలలు, బస్సులు, రెస్టారెంట్‌లు ఉండేవి. ఈ పరి స్థితులు మారాలి అని కంకణం కట్టుకున్నాడు. క్రైస్తవం నాకు సంయమనం నేర్పితే గాంధీతత్వం నా కార్యచరణకు దారి చూపిందని అహింసాయుతంగా పోరాటం ప్రారం భించాడు. అతడి నాయకత్వం క్రింద నీగ్రోలు బస్సు ప్రయాణం మానివేయడంతో తెల్లవారు నిర్వహిస్తున్న బస్సు వ్యాపారం నష్టాలకు గురి అయింది. సుమారు 40 మిలియన్ డాలర్‌లు నష్టం వచ్చింది. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. నీగ్రోలకు ఓటింగ్ హక్కు కూడా ఇవ్వరాదని ప్రచారంచేసిన వార్తా దినపత్రికకు వ్యతిరేకంగా ఉద్యమం నిర్వహించాడు. ఇలాంటివి ఎన్నో ఉద్యమాలు సమర్థ వంతంగా నిర్వహించాడు. నీగ్రోజాతిని సుషుప్తావస్థ నుండి లేపి విద్యావంతుల్ని చేసి వారిలో చైతన్యం తేవడానికిగాను ఒక సంస్థను వ్యవస్థాపించి నిర్వహించాడు. "నేటినుండి (1863 జనవరి 1) బానిసలందరికీ సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రకటిస్తున్నాను" అని లింకన్ అన్న వందేళ్ల తరువాత (శత జయంతి)సరిగా అదేనాడు నల్లవారికి అన్ని రంగాల్లోనూ సమానత్వం సంపాదించే కార్యక్రమం ప్రారంభించి ఆఫీసులలోను, ఆసుపత్రులలోను, క్లబ్బు



లలోను, రెస్టారెంట్లలోను తెల్లవారి సరసన నల్లవారు కూర్చునే ఉద్యమం నిర్వ హించడానికి నడుం బిగించి సమర్థవంతంగా నడిపాడు. అరెస్టు అయ్యాడు. కెనెడీ (చూ.) జోక్యంతో విడు దల అయ్యాడు. 'సమాన హక్కుల పోరాటం'లో కింగ్ చూపిన అకుంఠిత కార్యదీక్ష, పట్టుదల, ఎత్తుగడ, కార్యసిద్ధికి 1964 నోబెల్ శాంతి బహుమతి తన 35 ఏటనే అందుకున్న త్యాగశీలి. నోబెల్ పురస్కారాన్ని కింగ్ అందుకుంటూ "ఏదో ఒక రోజు ప్రపంచం యుద్ధానికి బదులు శాంతిని వరిస్తుంది. రక్తానికి బదులు ప్రేమ, సౌభ్రాత్రం వెల్లివిరుస్తాయని నమ్మడానికి నేను సాహసిస్తున్నాను. ఆ మంచి రోజుకీ మనకూ మధ్య ఎన్నో ఆటంకాలు అవరోధాలు ఉన్నాయి. వాటిని అన్నిటినీ నేను అధిగమించి తీరుతాను" అని ఎలుగెత్తి చాటాడు. ప్రపంచంలోని మానవులందరూ— నల్లవారూ, తెల్లవారూ అనే వ్యత్యాసం లేకుండా కలిసి మెలసి అరమరికలు లేకుండా బ్రతికే రోజుకోసం ఎదురు చూస్తూ 'ఐ హేవ్ ఏ డ్రీమ్' కలలుకంటూ చివరకు 1968 ఏప్రిల్ 4న ఒక దుండగుడి తుపాకీ గుండుకు గురియై కీర్తిశేషులయ్యాడు.

## మాల్ దీవులు

**భా**రత దేశానికి నైరృతి దిశలో శ్రీలంకకు పశ్చిమాన ఉన్న బహుచిన్న స్వతంత్ర ద్వీప గణరాజ్యం (1965). 2000కు పైగా ఉన్న ఈ పగడపు దీవుల్లో మాలేదీవి, హువేవీదీవి, విల్లింగ్లీదీవి కొంచెం పెద్దవి.

విస్తీర్ణం: 298 చ.కి.మీ.; జనాభా: 1,79,000 (1981), రాజధాని: మాలే; అధికార భాష: దివేహీ. ప్రజలు ఇస్లాం (సున్నీ) మతం అనుసరిస్తారు. 210 దీవులలోనే జనసంచారం ఉంది. ఇవి 12 దీవుల సముదాయాలు. ఉత్తర దక్షిణాలుగా 500 కి.మీ. దాపున ఇవి విస్తరించి ఉన్నాయి. ఏ దీవి విస్తీర్ణం 15 చ.కి.మీటర్లకు మించిలేదు. ఉప్పునీటి కయ్యలు, తెల్ల ఇసుక బీచీలు ఎక్కువ. కొబ్బరిచెట్లు, పండ్లచెట్లు బాగా పెరుగుతాయి. జలాధారాలు లేకపోవడం వల్ల వర్షాధారపు పంటలు మాత్రమే పండిస్తారు. కొబ్బరి, అనాస, దానిమ్మ, బొప్పాయి, బ్రెడ్‌ఫ్రూట్, దుంపజాతులు ఈ దీవులలోని ప్రధాన పంటలు. ప్రజలకు ముఖ్యమయిన జీవనాధారం మత్స్య పరిశ్రమ. పెద్దపెద్ద పడవలతో సముద్రం మీద వేటకు వెళ్లి బొనిటో, ట్యూనా వంటి చేప జాతులను పట్టి వాటిని ఎండబెట్టి ఎగుమతి చేస్తూ ఉంటారు. ఎండుచేపలను శ్రీలంకకు ఎగుమతిచేసి విదేశీ

ద్రవ్యాన్ని ఆర్జిస్తున్నారు. పీచు పరిశ్రమ, కారీగవ్వలు, లక్కసామాను, చాపలు కుటీర పరిశ్రమలు. శ్రీలంకతో ఈ రాజ్యానికి ఎక్కువ లావాదేవీలు ఉన్నాయి. ఆహార ధాన్యం (వరి) దిగుమతి చేసుకుంటారు.

## మాలీ

పశ్చిమ ఆఫ్రికాలోని ఒక స్వతంత్ర గణ రాజ్యం. పూర్వం ఫ్రెంచ్ వలస రాజ్యంగా ఉన్న ఈ ప్రాంతం 1960లో స్వతంత్ర ప్రతి పత్తిని సాధించుకుంది.

విస్తీర్ణం: 12,40,192 చ.కి.మీ. జనాభా: 77,78,000 (1988); రాజధాని: బామాకో; అధికార భాష: ఫ్రెంచ్. ప్రజలు మూర్ జాతి నీగ్రోలు. వీరిలో బంబారీ 32 శాతం, ఫులానీ 14 శాతం, సెనుఫూ, 12 శాతం, సోనినో 9 శాతం ఇంకా టురోగే, స్తాం, ఘయా, మాలిన్కే, డోగానే తెగల వారున్నారు. ఇస్లాం మతం 90 శాతం అనుసరిస్తారు.




బానీ నది, నైజర్ నది దేశంలో దక్షిణాన ప్రవహిస్తున్నాయి. ప్రత్తి, వేరు సెనగ, వరి, మొక్క జొన్న, చిరుధాన్యాలు, షియా నూనె గింజలు, పండ్లు ఇక్కడ పండిస్తారు. పశువుల పెంపకం ప్రధానమైన వృత్తి. నదుల్లో చేపలు పట్టి ఎండబెట్టి పొగపెట్టి ఎగుమతి చేస్తూ ఉంటారు. పదును చేసిన తోలు కూడా ఎగుమతి అవుతోంది.

## మాల్టా

మధ్యధరా సముద్రంలో సిసిలీకి 90 కి.మీ. దూరంలో ఉన్న ఒక ద్వీపరాజ్యం. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలిస్తున్న దేశం. గోజో, కోమినో దీవులు కలసి ఈ రాజ్యం ఏర్పడింది.

విస్తీర్ణం: 316 చ.కి.మీ., జనాభా: 3,47,000 (1988), రాజధాని: వాల్లెటా; అధికార భాష: ఇంగ్లీషు; మాల్టీజ్. ప్రజలు రోమన్ కేతలిక్ క్రైస్తవులు.

పర్వతమయమైన ఈ రాజ్యంలో సహజ సంపద మృగ్యం. టమాటో నారింజ పండ్లు, ద్రాక్ష, బార్లీ, నారింజ జాతిపండ్లు, స్ట్రాబెర్రీ, బంగాళదుంపలు, ఉల్లి పండిస్తున్నారు. పాదరక్షలు, జవుళీ, రబ్బరు, ప్లాస్టిక్ పరిశ్రమలు. తమ ఉత్పత్తులను గ్రేట్‌బ్రిటన్‌కు ఇటలీకి ఎగుమతి చేస్తున్నారు. నౌకా నిర్మాణం, నౌకల మరమ్మతులు, ఆహార పానీయాలు ఇతర పరిశ్రమలు.

## మావో 1893–1976

పూర్తిపేరు మావ్–సే–టుంగ్. చీనా జాతీయవాది. చీనా రూపురేఖలు, జీవన శైలిని మార్చివేసిన కమ్యూనిస్టు మహానాయకుడు. రాజనీతి వేత్త. హూనాన్‌లో రైతుబిడ్డ. యువకుడుగా 1911లో సన్‌యత్ సేన్ విప్లవ సేనలో చేరి తరువాత పెకింగ్ యూనివర్శిటీలో లైబ్రేరియన్‌గా పనిచేశాడు. కార్ల్‌మార్క్స్, ఏంగిల్స్ వ్రాతలు ఈతని భావధోరణని బాగా వికసింపచేశాయి. రష్యా విప్లవం (1917)చే ప్రభావితుడయ్యాడు. 1924లో కొమింగ్ టాంగ్‌లో చేరాడు. కర్షకులను కూడగట్టుకొని వారి మద్దతును సంపాదించాడు. దేశాభ్యున్నతికి జాతీయోద్యమం ప్రారంభించాడు. ఇది నచ్చక చియాంగ్–కై–షేక్ ఈ ఉద్యమాన్ని రూపుమాపాలని చూసి, మావోను బహిష్కరించాడు. కాని అనతి కాలంలోనే 1934లో మావో తన అనుచరుడు చూటే సాయంతో అనుయాయుల బృందాలకు నాయకత్వం వహించి దక్షిణ చీనా నుండి వాయువ్య దిశవైపు షెన్సీ రాష్టంలోని యేనాన్ వైపుకు 'దీర్ఘ ప్రస్థానయాత్ర'న (లాంగ్‌మార్చ్) నిర్వహించాడు. ఈ సంఘటన ప్రపంచ చరిత్రలోనే అపూర్వమయిందిగా పరిగణనింపబడింది. యేనాన్‌లో సోవియట్ చీనా గణరాజ్యాన్ని వ్యవస్థాపించాడు. ఇది చీనాలో కమ్యూనిస్టు పాలనకు నాందీప్రస్తావన



అయింది. రెండవ ప్రపంచంలో యుద్ధ సమయంలో, జపాన్‌ను ప్రతిఘటించడానికి చియాంగ్–కై–షేక్‌తో చేసుకున్న యుద్ధకాల సాహచర్యం చివరకు చెడిపోవడంతో యుద్ధనాంతరం తీవ్ర సంఘర్షణలు జరిగాయి. కృషి ఫలించడంతో, 1949 అక్టోబర్ 1న చీనా గణరాజ్యం మావో అధ్యక్షతన పూర్తిస్థాయిలో రూపుగొనినది. ఆ తరువాత చీనా అభివృద్ధికి రష్యాతో ముప్ఫయిఏళ్ల ఒప్పందం చేసికొన్నాడు. మావో జీవితకాలం చీనాలో నియంత పాలన సాగింది. 1958లో అధ్యక్ష పదవిని విడనాడి పార్టీ కార్యదర్శి అయ్యాడు. 1958–59లో ప్రజా ఉద్యమం (కమ్యూన్ మూమెంట్) చేపట్టి ప్రభుత్వ సిబ్బంది (బ్యూరోక్రసీ)తో నిమిత్తం లేకుండా ప్రజల కష్టనష్టాలను తీర్చే సమసమాజాన్ని రూపొందించడమే తన ఆశయమని దీనిని సాధించడానికి విప్లవోద్యమం లేవ దీశాడు. త్రికరణ శుద్ధి ఆవశ్యకమనీ, మాటలకు చేతలకు తేడా ఉండకూడదని కామ్రేడ్లకు హితబోధచేసే వాడు. సమాజంలో పేదరికం, అవిద్య, అమాయకత్వం, అవినీతి, అనారోగ్యం రూపుమాపాలని నడుం కట్టుకున్నాడు. కర్తవ్యనిష్ఠతో 1965–69 మధ్య చీనాలో సాంస్కృతిక విప్లవానికి నినాదమిచ్చి నిర్వహించాడు. చీనా ప్రజల ఆర్థిక సాంఘిక అభ్యుదయానికి మావో చేసిన త్యాగం కృషి అపారం. 1976లో మావో మరణానంతరం ఆయన లేకపోవడం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

## మాస్కో

సోవియట్ రష్యాలోని 15 రిపబ్లిక్‌లకూ ఫెడరల్ రాజధాని నగరం. 1147లో స్థాపితమయిన మాస్కో నగరం విస్తీర్ణం: 878 చ.కి.మీ.; జనాభా: 86,75,000 (1988).ఇది చాలా పెద్దనగరం. ప్రపంచ మహానగరాలలో ఒకటి. రష్యన్ కమ్యూనిస్ట్ పార్టీకి కేంద్ర కార్యస్థానం. ప్రపంచ కమ్యూనిస్టులను ప్రభావితం చేస్తూ ఉంటుంది. అక్టోబర్ విప్లవానికి (1917)ముందు రష్యన్ చక్రవర్తి జార్‌కు ఇది స్థావరంగా ఉండేది. ఇప్పుడు కార్మికులతోనూ, కర్మాగారాలతోనూ కలకల లాడుతూ ఈ నగరం ఉంటుంది. నగరానికి మధ్యలో పాతకోటలోని క్రెమ్లిన్ ప్రాంతంలో ప్రభుత్వ కార్యాలయాలన్నీ కేంద్రీకృతం అయి ఉన్నాయి. రష్యన్ పార్లమెంట్ సమావేశ మందిరం కూడా క్రెమ్లిన్ లోనే ఉంది. క్రెమ్లిన్‌కు బయట రెడ్‌స్క్వేర్‌లో విప్లవదినోత్సవం వంటి ప్రభుత్వ ఉత్సవాలు, సైనిక విన్యాసాలు కవాతు, ప్రదర్శనలు జరుగుతూ ఉంటాయి. ఈ పండుగ వేడుకలను సమీపంలోని లెనిన్ (మాసోలియం) సమాధిపై నుంచి ప్రజలు వీక్షిస్తూ ఉంటారు. సుప్రసిద్ధ సోవియట్ నాయకుడు, సోవియట్ జాతిపిత లెనిన్ (చూ.) మరణానంతరం ఆయన భౌతికకాయాన్ని రసాయనాలతో సంస్కరించి (ఎమ్‌బామింగ్ చేసి) భద్రపరచిన ఈ సమాధి మండపాన్ని ప్రతిరోజు వేల కొద్దీ రష్యన్ పౌరులు సందర్శించి నివాళులర్పిస్తూ ఉంటారు. ప్రభుత్వ చారిత్రక కలోసియమ్, రష్యన్ హోటలు విదేశీ పర్యాట కులను ఆకర్షిస్తున్నాయి. ఈ మహా నగరంలో 150కి మించి ఉన్న రంగస్థలకేంద్రాలలో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహింపబడుతూ ఉంటాయి. మాస్కోలోని బోల్షియి బేలే (పాశ్చాత్య నృత్య బృందం), బొమ్మలాట ప్రదర్శించే సెంట్రల్ పప్పెట్ థియేటర్ జగత్ప్రసిద్ధి గాంచినవి. మాస్కో నగరం లోని స్థానిక ప్రజలకు రాక పోకల సౌకర్యాలను భూమ్యంతర్గత (మెట్రో) రైల్వే వ్యవస్థ సమకూరుస్తూంది. క్రీడాంగణాలు (స్టేడియం) చాలా ఉన్నాయి. చూ. రష్యా(దేశ పటం)

మాస్కోలో నివసించే వారిని మాస్కోవైట్‌లని అంటారు. మాస్కోలో నివసించడానికి ప్రతి పౌరుడు పాస్‌పోర్ట్ లాంటి అధికారికమైన అనుమతి పత్రం పొంది ఉండాలి. మాస్కోలో 1400 పత్రికలు ఉన్నాయి.



## మిజోరామ్

భారతదేశంలో 25 రాష్ట్రాలలో ఒకటి. ఇది భారతదేశానికి ఈశాన్య ప్రాంతంలో ఉంది. పూర్వం లూషాయీ జిల్లాగ ఉన్న ఈ ప్రాంతం 1954లో మిజో కొండల జిల్లా అయి 1972లో కేంద్రపాలిత ప్రాంతమయి తరువాత రాష్ట్ర ప్రతిపత్తిని సంతరించుకుంది. వాస్తవానికి రాష్ట్రం అంతా కొండలమయం. ఈ గిరిజనులలోలుషాయీ, పెయితీ, రాల్టేస్, పాంగ్, హ్మార్, క్నకీ, మారా, లాకేరీ తెగల వారున్నారు.




విస్తీర్ణం: 21,081 చ.కి.మీ.; జనాభా: 4,93, 356 (1981); రాజధాని: అయిజాల్; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు మిజోభాష మాట్లాడతారు. మిజోరామ్‌లో ధాళేశ్వరీ (తియావిన్)నది, సోనల నది, తుల్వానది ఉపనదులు బారక్‌నదిలో కలుస్తున్నాయి. కోలోదిన్‌నది, కర్నాపులీ నది ప్రధానమైన జలాధారాలు.

పోడు వ్యవసాయాన్ని పోలిన జుమ్మసాగుకు ఇటీవల స్వస్తిచెప్పి ఆధునిక వ్యవసాయ పద్ధతులను ప్రజలు అలవరచు కుంటున్నారు. పర్వత సానువులలో రబ్బరు, కాఫీ, తేయాకువంటి తోట పంటలు సాగుచేస్తున్నారు. ఆహారపు పంటలలో వరి, మొక్కజొన్న పండిస్తున్నారు. పంటనీటి వసతి పరిమితం. మిజో ప్రజలు రంగురంగుల చేనేతలలోనూ, హస్తకళలలోనూ ఆరితేరినవారు. వెదురు బొంగుల మధ్య గెంతుతూ తాళయుక్తంగాచేసే జానపద నృత్యానికి మిజోకళాకారులు పేరుపొందారు.

## మిల్టన్, జాన్ 1608–74

ఇంగ్లీషులో 'పేరడైజ్ లాస్ట్' అను మహాకావ్యాన్ని రచించిన మహాకవి. లండన్‌లో జన్మించాడు. కేంబ్రిడ్జిలో చదువుతూ ఉండగానే లా ఎల్లెగ్రో, లైసిడీస్ మున్నగు రచనలు చేశాడు. పౌరయుద్ధ సమయంలో రాజకీయ చైతన్యానికి కృషి చేశాడు. పత్రిక స్వేచ్ఛను గూర్చి తన 'ఏయిరో పగటికా'లో వాదించాడు. అంధుడైన తరువాతనే 'పేరడైజ్ లాస్ట్'ను రచించాడు.

## మీరాబాయి

మహా భక్తురాలు. కృష్ణతత్వం కథా వస్తువుగ అనేక భజన కీర్తనలు, మీరా భజనలు హిందూస్తానీలో రచించి ఆలాపించిన మహాసాధ్వి. కున్వార్ మహారాజ్‌ను వివాహం చేసుకుని 7 ఏళ్లు కాపురం చేసిన పిదప వితంతువయింది. అప్పటినుండి భక్తిమార్గాన్ని చేపట్టింది. చిత్తోడ్‌గడ్ సమీపాన విర్జీ ఆలయం ప్రక్కనే శ్రీకృష్ణ మందిరాన్ని నిర్మింపచేసి శేష జీవితాన్ని అక్కడే కొనసాగించింది. మీరా భజనలు హిందూస్థానీ సంగీత సంప్రదాయంలో ఒక ప్రధానమైన బాణీగా ప్రసిద్ధిపొందాయి.

## ముఖ్యమంత్రి

భారత రాజ్యాంగం ప్రకారం రాష్ట్రంలో ముఖ్యమంత్రి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేస్తాడు. సార్వత్రిక ఎన్నికల్లో అత్యధిక సంఖ్యా బలం ఉన్న రాజకీయ పార్టీ నాయకుడ్ని ఆ రాష్ట్ర మంత్రి వర్గాన్ని (కేబినెట్) ఏర్పాటుచేసి ప్రభుత్వాన్ని నిర్వహించమని గవర్నరు కోరతాడు. (చూ. ప్రధాని). ముఖ్యమంత్రిని గవర్నరు స్వేచ్ఛాను సారం నియమించవచ్చును. సాధారణ మంత్రులను ఎన్నుకొనుటలో మాత్రం గవర్నరు ముఖ్యమంత్రి సలహాను అనుసరించాలి. మంత్రులు అందరూ ఒక జట్టుగా ఏర్పడి సమష్టి బాధ్యతతో ప్రవర్తిస్తారు. ప్రభుత్వం తరఫున శాసనసభకు జవాబుదారీ అంతా ముఖ్యమంత్రి లోనే న్యస్తమయి ఉంటుంది.

## ముట్నూరి కృష్ణారావు 1879–1945

ప్రముఖ పత్రికా సంపాదకుడు. జాతీయ వాది, ప్రజానాయకుడు. 1879లో అమాలాపురంలో జన్మించారు. విద్యార్థి దశలో కృష్ణారావుకి ఆంగ్లభాషా సాహిత్యంపై అమిత మక్కువ ఉండేది. బిపిన్ చంద్రపాల్ గారి 'న్యూ ఇండియా' పత్రిక కృష్ణారావుకి అత్యంత ప్రీతి పాత్రమైనది. చెన్నపట్టణం నుండి మచిలీపట్నం తిరిగి వచ్చిన తర్వాత 1906లో కృష్ణా జిల్లా సంఘం పక్షాన పెట్టిన 'కృష్ణా పత్రిక'లో సహాయ సంపాదకుడుగా చేరారు. 1916

నుండి ఆయన కృష్ణాపత్రికకు ప్రధాన సంపాదకుడుగా పనిచేశారు. స్వాతంత్ర్యోద్యమకాలంలో కృష్ణాపత్రికలో



ఈయన వ్రాతలు చాలా తీవ్ర ధోరణిలో సాగుతుండేవి. దీనితో ప్రభుత్వం నుండి ఒత్తిడిరాగా జిల్లాసంఘం ఇతని సంపాదకత్వాన్ని తాత్కాలికంగా నిలుపుదల చేసింది. తర్వాత జిల్లా సంఘాన్ని ఎత్తివేయగా 'కృష్ణాపత్రిక'పూర్తిగా ఈయన యాజమాన్యంకిందికే వచ్చింది.

దేశ స్వాతంత్ర్యోద్యమ వివిధ ఘట్టాలలో ఆంధ్రులకు ఉత్తేజం కల్గిస్తూ కృష్ణాపత్రిక ద్వారా కృష్ణారావు నిర్వహించిన పాత్ర అసాధారణమైంది. జాతీయ భావాలకు సంఘ సంస్కరణ, స్వదేశీ ప్రచారాలకు ఆయన ఎంతో కృషి చేశారు. 1945లో కృష్ణారావు కీర్తిశేషులయారు. ఈయన శిల్పవిగ్రహమును హైదరాబాద్‌లోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ప్రతిష్ఠించి గౌరవించారు.

## ముద్రారాక్షసం

ముద్రా రాక్షస నాటకం సంస్కృతంలో విశాఖ దత్తుడు (క్రీ.శ. 8వ శతాబ్ది) వ్రాసిన ఒక విలక్షణమైన నాటకం. రాజనీతి ప్రయోగం ప్రధానంగా గల ఈ నాటకం కౌటిల్యుని అర్థశాస్త్రానికి లక్ష్యంగా రచించబడింది. కౌటిల్యుడు (చాణక్యుడు) ఈనాటకంలో ఒక పాత్ర. మౌర్య చంద్రగుప్తునికి మంత్రి అయిన చాణక్యునికి ప్రతిగా నందరాజులకు మంత్రి, రాజభక్తి పరాయణుడు అయిన రాక్షసమంత్రి కల్పించబడ్డాడు. వ్యూహాలు పన్నడంలోనూ, బుద్ధి చాతుర్యంలోనూ చాణక్యుడూ, రాక్షసమంత్రీ ఒకరినొకరు తీసిపోరు. చివరికి రాక్షసమంత్రి పేరు ఉన్న ముద్రాంగుళీయకాన్ని సంపాదించి దానిద్వారా రాక్షస, మలయ కేతువుల మధ్య భేదం కల్పించి రాక్షసుణ్ణి వశపరుచుకొన్న వృత్తాంతం దీనిలో అభివర్ణించబడడం వల్ల ఈ నాటకం 'ముద్రారాక్షసం' అయింది.

## మృచ్ఛకటికం

చూ. శూద్రకుడు

## మెకన్జీ, కల్నల్ కాలిన్

ఆంధ్రదేశ చరిత్రకు గణనీయమైన చారిత్రక సామగ్రిని సమకూర్చిన ఆంగ్లేయుడు. స్కాట్లండ్‌కు సమీపంలోని స్టార్నో దీవిలో 1754లో మెకంజీ జన్మించారు. 1782లో మదరాసుకు వచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీ ఇంజనీరింగ్ శాఖలో ఉద్యోగిగా చేరారు. ఆరోజులలో గొప్ప హైందవ విద్యా కేంద్రమైన మధురకు మెకంజీ వెళ్ళి అక్కడి ప్రముఖ పండితుల్ని కలుసుకొన్నాడు. వారితో సంభాషణల వల్ల దేశీయ వాఙ్మయం నుండి, ప్రాచీన వృత్తాంతాలనుండి దేశ చరిత్రకు ఉపకరించు సాధన సామగ్రిని సంపాదించవలెనను సంకల్పం మెకన్జీకి కలిగింది. మొదటిసారిగా నెల్లూరు నుండి తూర్పు కనుమల ద్వారా రాయలసీమ ప్రాంతానికి ఒంగోలుకు రహదారి మార్గాల నమూనాలతో దేశ పటమును తయారుచేసుకొన్నాడు. మెకన్జీ కృషి ఫలితంగా మొదటి సారిగా దక్కను ప్రాంతం ముఖ్యంగా నెల్లూరు, గుంటూరు, రాయలసీమ, మైసూరు ప్రాంతాల దేశ, నైసర్గిక పటము తయారైంది. మెకన్జీ సర్వే పనులపై దేశాటనం చేయునపుడు అనేక దేవాలయాలు, శాసనాలు అతని దృష్టికి వచ్చినాయి. అజ్ఞాత లిపిలో ఉన్న ఎన్నో తెలుగు, కన్నడ శాసనాల్లోని వివరాలను తెలుసుకోవడానికి, గ్రామ చరిత్రలు వ్రాయడానికి తాళ పత్రగ్రంథ సేకరణకు, చరిత్రకుపకరించు ప్రాచీన నాణాలను సంపాదించడంలో ఏలూరుకి చెందిన కావలి వెంకట బొర్రయ్య, వెంకట లక్ష్మయ్య అను సోదరుల సహాయం తీసుకున్నాడు. 1810లో మెకన్జీ మదరాసు ప్రాంతానికి సర్వేయర్ జనరల్‌గా నియమితులైనారు.

చరిత్రకుపకరించే 5,31,255 సాధనాలను మెకన్జీ కైఫీయతుల పేరిట మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథభాండాగారమున ఇప్పటికీ మెకన్జీ సేకరించిన చారిత్రక వృత్తాంతాలున్నాయి. 1821లో మెకన్జీ కలకత్తాలో స్వర్గస్థులయిరి.

## మెక్కా

ముస్లిముల పవిత్ర పుణ్యక్షేత్రం. సౌదీ అరేబియాలో ఉంది. ఇస్లాం (చూ.) మత స్థాపకుడు మహమ్మదు ప్రవక్త జన్మస్థలి. ఎర్ర సముద్రపు (రెడ్‌సీ)

రేవు పట్టణం జుద్దాకు 60 కి.మీ దూరంలో ఉంది. ఇచ్చట ఉన్న మహా మసీదు ప్రపంచంలోని ముస్లిము లందరికీ ప్రార్థనాకేంద్రం. మూలల్లో గోపురాలతోనూ ఆర్చీల తోనూ ఉన్న ఆర్కేడ్ మధ్య చిన్న కట్టడం పవిత్ర కేంద్రం

కాబాశిల—మెక్కా



'కాబా' శిల. ఇది నల్లగా ఉంటుంది. ప్రపంచంలోని ముస్లిములు అందరూ ఈ కాబా శిలవైపు తిరిగి మోకాళ్ల పై కూర్చుని 'నమాజు' ప్రార్ధనలు జరుపుతారు. అందుకే భారతదేశంలోని ముస్లిములు పశ్చిమ వైపుకు తిరిగి నమాజు చేసు కుంటూ ఉంటారు. భారత దేశానికి మెక్కా పశ్చిమంగా ఉంది. కావున అలా జరుపు కుంటారు.

ముస్లిము పంచాంగం ప్రకారం 10–11 మాస ములలోను 12 మాసం మొదటి పదిరోజులలోను మెక్కా పుణ్య క్షేత్రం దర్శిస్తారు. ఈ తీర్ధ యాత్రను 'హాజీ' యాత్ర అంటారు. యాత్ర చేసి తిరిగి వచ్చినవారు తమ పేరు ముందు 'హాజీ' అని జోడిస్తారు. 'కాబాశిల' చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణ చేయడంతో హాజీ యాత్ర ముగుస్తుంది. ప్రతి ముస్లిం జీవితంలో ఒకసారి హాజీ యాత్ర చేయ్యడంతో తన జన్మ ఫలించిందని విశ్వసిస్తారు. హాజీ మహోత్సవ సమయంలో మెక్కాలో ప్రత్యేక వసతి ఏర్పాట్లు చేస్తారు. ప్రతి దేశం నుండి ముస్లిములు సురక్షితంగా తీర్ధయాత్ర జరుపుకురావడానికి యాన సౌకర్యాలు ఆయా ప్రభుత్వాలు చేయడం పరిపాటి. ముస్లిమేతరులకు మెక్కా ప్రవేశం నిషేధం.

## మెక్సికో

యునైటెడ్ స్టేట్స్‌కు దక్షిణంగా ఉన్న లాటిన్ అమెరికన్ గణతంత్ర రాజ్యం. ఈ ప్రాంతంలో పన్నెండువేల ఏళ్లనాడు ప్రజాజీవనం ఉన్నట్లు దాఖ లాలున్నాయి. క్రీ.శ. 16వ శతాబ్ది ఆరంభంలో స్పెయిన్ వారి రాకకు ముందు అజెటిక్ నాగరకత (చూ.) కు కారకులయిన రెడ్ ఇండియన్‌లు టెనోచ్తితిలాన్ (ఇప్పటి మెక్సికో) రాజధానిగా పాలన సాగించారు. క్రీ.శ 1821లో మెక్సికోకు స్వాతంత్ర్యం ప్రాప్తించింది.

మెక్సికో సింధుశాఖలో పడుతున్న గ్రాండేనది పెద్దది. ఇది 2090 కి.మీ. పొడవుఉండి యునైటెడ్ స్టేట్స్‌కు సరిహద్దుగా ప్రవహిస్తున్నది. దక్షిణమున బాల్సాస్ నదీ ఇంకను చిన్న నదులు మెక్సికోకు జలాధారాలు. **ఆదిమ** జాతులతో సంకరానికి లోనైన సంతతి వారిని మెస్టిజో అంటారు. ప్రతివాడు మెస్టిజో అని చెప్పుకోవడానికి గర్విస్తాడు.

విస్తీర్ణం: 19,58,201 చ.కి.మీ.; జనాభా: 8,27, 21,000 (1988); రాజధాని: మెక్సికో సిటీ; అధికార భాష: స్పెనిష్. ఆదిమ మెక్సికన్‌లు, మాయన్, మిక్స్‌టెక్, నాహౌట్లా, ఓటోమీ, తారస్కానా, జెపోటికా వంటి ప్రాచీన భాషలు మాట్లాడతారు. మాయన్, అజెటిక్ నాగరకతావశేషాలు పలుచోట్ల కనిపిస్తాయి. పుచ్చ, దోస, మిర్చి, బార్లీ, చిక్కుడు, జొన్న, అరటి, మామిడి పండ్లు, నిమ్మనారింజ, వరి, చెరకు, గోధుమ, పొగాకు, ప్రత్తి, పండ్లు, హెనెక్విన్ నార, ఆల్ఫాల్ఫా, కాఫీ, మొక్కజొన్న ప్రధానమైన సాగుపంటలు. పశువుల పెంపకం ప్రజలకు జీవనాధారం. ఆబలోనే, ఆయిస్టరులు, సార్డీనులు, రొయ్య, టూనా మత్స్యపరిశ్రమలో చెప్పుకోదగ్గరకాల చేపలు. నేలబొగ్గు, ఇనుపరాయి, సీసం, రాగి, జింకు, వెండి, తగరం, గంధకం, చమురు




వాయువు, జిప్సమ్, బంగారం, మాంగనీస్, ఫ్లోర్‌స్పార్, పెట్రోలు తైలనిక్షేపాలు మెక్సికో లోని ఖనిజసంపద. చిక్లీ, ఎబనీ, పైన్, ఇరుగుడు చేవ, మహోగనీకలప అడవులలో లభించేవి. సిమెంట్, రాసాయనిక ద్రవ్యాలు, దుస్తులు, ఎరువులు, ఉక్కు, ఆహారపదార్ధాలు, కలపగుజ్జు, కాగితం ప్రధాన పారిశ్రామికోత్పత్తులు.

మెక్సికో సిటీలో ఆజెటిక్ క్షేత్రం, జోకాలోని ఆజెటిక్ శిథిలావశేషాలు, జాతీయ రాజప్రాసాదం, డీగో రివీరా కుడ్య చిత్రాలు, లిబర్టీ బెల్, సుందరమైన పెసోడేలా రిఫార్మా రాజవీధి, పేలస్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ (చలవరాతి రంగస్థలం), భూకంపం దెబ్బ తగలకుండా వేలాడే ఆకాశహర్మ్యం (44 అంతస్తులు), ప్లాజా ఆఫ్ త్రీ కల్చర్స్, బేసిలికా ఆఫ్ అవర్ లేడీ ఆఫ్ గ్వాడ్‌లూపే వంటి సుప్రసిద్ధ చారిత్రక స్థలాలు చూడదగ్గవి. 1985లో సంభవించిన పెద్ద భూకంపంవల్ల ఈ నగరం చాల దెబ్బతిన్నది.

## మెగ్సేసే పురస్కారం

1957 విమాన ప్రమాదంలో మరణించిన ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు మెగ్సేసే స్మృతికి చిహ్నంగా ఈ పురస్కారం వ్యవస్థాపింపబడింది. ప్రతి గ్రహీతకు, ఒక బంగారు పతకం, ఇరవయివేలు అమెరికన్ డాలర్లు (దాదాపు 2,90,000 రూపాయలు) నగదు ఫిలిప్పీన్ రాజధాని నగరం మనీలాలో ప్రదానం చేయబడుతాయి.

భారతదేశంలో ఈ 'పురస్కారం'చే సత్కరింపబడిన వారిలో మదర్ తెరిసా (1962) అంతర్జాతీయ అవగాహనకు, సృజనాత్మక రచనలకు అమితాబ్ చౌదరి (1961), సత్యజిత్‌రే (1967), బి.జి.వర్గీస్ (1975), శంభుమిత్రా (1976), గౌర్ కిశోర్ ఘోష్ (1981), అరుణ్‌శౌరీ (1982), ఆర్.కె. లక్ష్మణ్ (1984), సామూహిక నాయకత్వానికి ఆచార్య వినోబాభావే (1958), దారా ఎన్. ఖురోడీ, త్రిభువన్ దాస్, కె. పటేల్ వర్గీస్ కురియన్ (1963), కమలాదేవి ఛటోపాధ్యాయా (1966), ఎమ్. ఎస్. స్వామినాథన్ (1971), ఈలా ఆర్ భట్ (1977), రజన్‌కాంత్ ఎస్. ఆరోలే, మాబెల్లీ ఆర్ ఆరోలే (1979). ప్రజాసేవకు జయప్రకాశ్ నారాయణ్ (1965), ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి (1974), మణీభాయ్ భీమ్‌భాయి దేశాయి (1982), మురళీధర్ దేవదాస్ ఆమ్టే (1985), ప్రభుత్వసేవకు సి.డి. దేశ్‌ముఖ్ (1959) వంటి ప్రముఖులకు మెగ్సేసే పురస్కారం లభించింది.

## మెదకు జిల్లా

ఆంధ్రప్రదేశ్ లోని 23 జిల్లాలో ఒకటి. 17° 27′ 18° 18′ ఉ.అక్షాంశ, 77° 28′ మరియు 79° 12′తూ రేఖాంశాల మధ్య ఈ జిల్లా ఉంది. ఉత్తరమున నిజామాబాదు, కరీంనగరం జిల్లాలు, తూర్పున వరంగల్లు, నల్గొండ జిల్లాలు, దక్షిణమున హైదరాబాదు నగరం, రంగారెడ్డి జిల్లా, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం సరిహద్దులు.




విస్తీర్ణం: 9,699 చ. కి.మీ.; జనాభా: 18,27,588(1981); జిల్లా కేంద్రం: సంగారెడ్డి.'మెదకు' పదం 'మెతుకు' (బియ్యపు మెతుకు) నుండి వచ్చింది. మెదకుజిల్లా వరికి ప్రధానమైంది. జిల్లా నీటి వనరులలో మంజీరనది, హల్దీనది (పసుపులేరు), పోచారం తటాకం, రాయనపల్లి తటాకం (1926),పుష్పాలవాగు, దేవనూరు ప్రణాళిక పేర్కొనదగినవి. చెరకు, జొన్న, రాగి, అపరాలు, చిరుధాన్యాలు ఇతర పంట దినుసులు. ఇనుపరాయి, చీనా బంకమన్ను జిల్లాలో ఖనిజ నిక్షేపాలు. అంతర్జాతీయ మెట్టపంటల పరిశోధన క్షేత్రం (ఇక్రిశాట్) పటాన్‌చెరులో ఉంది. యద్దమల్లారం వద్ద రక్షణ శాఖవారి ఆర్డినెన్సు ఫ్యాక్టరీ ఉంది (1988). జహీరా బాదులో సహకార పంచదార ఫ్యాక్టరీ, రామచంద్రపురంలో భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ ఫ్యాక్టరీ (సరిహద్దులో ఉంది.) ఉన్నాయి. బియ్యపు మిల్లులు కూడా కలవు. సంగారెడ్డిలో ఫలపరిశోధన కేంద్రంలో నిమ్మ, మామిడి, జామ, సీతాఫలం వంటి పండ్లజాతులపై పరిశోధనలు సాగుతున్నాయి.

కొండాపురంలోని పురాతత్త్వ త్రవ్వకాలలో క్రీ.పూ. శాతవాహనులనాటి గౌతమీపుత్ర శాతకర్ణి, వశిష్ఠపుత్ర శాతకర్ణి కాలపు నాణాలు బయట పడ్డాయి. మెదకు పట్టణంలోని కోట, సుప్రసిద్ధ ఇంగ్లీషు వెశిలియన్ మిషన్‌వారి మెతడిస్ట్ చర్చి (1914)సు ప్రసిద్ధ వాస్తు నిర్మాణాలు.



వెసిలియన్ చర్చి—మెదకు

## మేఘలాయా

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. 1972 లోపూర్తి స్థాయి స్వయంప్రతిపత్తిగల రాష్ట్రం అయిన మేఘాలయాకు ఉత్తర, తూర్పు సరిహద్దులుగా అస్సాం, దక్షిణ, పశ్చిమ సరిహద్దులుగా బంగ్లాదేశ్ ఉన్నాయి. ఇది గిరిజనులకు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన రాష్ట్రం.

విస్తీర్ణం: 22,429 చ.కి.మీ.; జనాభా: 13,35, 819; రాజధాని: షిల్లాంగ్; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు ఖాసీ, జైంతీయా, గారో వంటి గిరిజన భాషలలో వ్యవహరిస్తూ ఉంటారు. ఎత్తయిన షిల్లాంగ్ పర్వతశిఖరం 1965 మీ. ఉంది.




కొండల్లో కురిసిన వర్షం మాండా, డావ్ఁరింగ్, రింగే, గానోయా, బూగీ, సింసాంగూ, కిన్షీ, ఖ్రీ, ఉమ్రూ ఉమెంగాటూ, ఉమాయూ యాం, మాప్లాంగూ, ఉగుయూ ఖ్యానూ, కుప్లీ, మింత్డూ, మింటాంగూ వంటి వాగులలో పడి గారోకొండలు, ఖాసీకొండలు, జైయింతా కొండలు ద్వారా జలపాతాలు, ఎత్తిపోతలు అయి ప్రవహిస్తూ ఉంటాయి. చిరపుంజీ సమీపమున మౌస్మాయీ గ్రామం దగ్గరనున్న నోషంగితియాంగూ జలపాతం వద్ద ప్రకృతి రామణీయకత చూడ ముచ్చటగా ఉంటుంది. అనేకమయిన వాగుల ద్వారా ప్రవహించే జలం ఎత్తయిన ఒకే కొండకొన మీద చేరి కిందకు పడుతోంది. ఖాసీ కొండలలోని చిరపుంజీ ప్రపంచంలోనే అత్యధిక వార్షిక వర్షం పాతం (12,700 మిమీ.) గల ప్రదేశంగా ప్రసిద్ధి గాంచి నది. జలపాతాలతోనూ, మేఘావృతమయిన కొండల కోనలతోనూ, తటాకాలతోనూ, ఆకాశన్నంటే గిరుల తోనూ, పచ్చిక బయళ్లతోనూ, నదీలోయల తోనూ ప్రకృతి సౌందర్యం ఉట్టిపడుతూ చూపరులను మేఘాలయాలోని ప్రతి అంగుళం ఆకర్షిస్తూంటుంది. ఈ ప్రాంతంలో నివసించే ఖాసీ, గారో, జైయింతీయా జాతులు అతి ప్రాచీన కాలానికి చెందిన గిరిజనులు. వీరి సాంస్కృతిక సంపద, సంగీత, నృత్య, క్రీడలు, కళాకౌశలాలూ వారి జీవనశైలికి అద్దం పడుతూ ఉంటాయి.

ఈ గిరిజనులలో పాతుకుపోయి వున్న జుమ్మో (పోడు) సేద్యవిధానానికి ఇప్పుడిప్పుడే స్వస్తిచెప్పి ఆధునిక వ్యావసాయిక పద్ధతులను చేపడుతున్నారు. బంగాళదుంప, తేజపతా, చెరకు, నూనె గింజలు, ప్రత్తి, జ్యూట్‌నార, మెస్టానార, పోక, గోధుమ, జొన్న, పండ్లు, కాయగూరలు ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. కలప ప్రధానమైన అటవీ ఉత్పత్తి. నేలబొగ్గు, సిల్లిమినేట్, సున్నపురాయి, డోలమైటు, పొయ్యిమన్ను, ఫెల్‌స్పార్, క్వార్ట్జ్, గాజుఇసుక ముఖ్యమయిన ఖనిజనిక్షేపాలు. సిమెంటు, ప్లైవుడ్, ఆహారపానీయాలు, ఆటవీసంపదనాధారంగా పరిశ్రమలు ప్రధానమయినవి. ఉనియాం తటాకం చేపల వేటకు ప్రసిద్ధి. కిల్లాంగు రాయి విహార కేంద్రం. నోషంగితియాంగూ జలపాతం సుందర ప్రకృతి దృశ్యాలలో దేశంలోనే పేరు పొందింది. నార్తియాంగు ప్రాంతం ఏకశిలలకు ప్రసిద్ధి. వీటిఎత్తు 9 మీటరులు ఉంటుంది.

## మైఖేలేంజెలో 1475–1564

ఇటాలియన్ శిల్పి. ప్రముఖ చిత్రకారుడు. కవి. బీద టస్కన్ కుటుంబంలో 1475లో జన్మించి రాళ్ల పనిచేసుకునే తన దాది ద్వారా శిల్పకళలో అభిరుచిని పెంచుకున్నాడు. మొదట డొమినికో గిర్లాండోలో కొలువులో ఉండేవాడు. మధ్య యుగపు మత విశ్వాసం, సనాతన సంప్రదాయం, పునరుజ్జీవన శక్తి అన్ని మేళవించి అతనిని సుప్రసిద్ధ శిల్పిగా తీర్చిదిద్దాయి. సిస్టీన్ ఛాపెల్ కప్పులోపల ఆరువేల చదురపు అడుగుల మేర చిత్రించిన కళాఖండం ఆయనకు అఖండ కీర్తిని తెచ్చిపెట్టింది. 'లాస్ట్ జడ్జిమెంట్', సెయింట్ పీటర్స్‌లోని 'పీయెటా' చలువ శిల్ప విగ్రహం, డేవిడ్ శిల్పం,(ఫ్లారెన్స్ అకాడెమియా) బ్రహ్మాండమైన మోజెస్ విగ్రహం (విన్కోలీలోని శాన్ పియాట్రూ), మెడిసీ కుటుంబం (ఫ్లారెన్స్) సమాధులకై

మైఖేలేంజెలో చిత్రం



సిద్ధపరచిన 'పగలు', 'రాత్రి' 'సంధ్యాచ్ఛాయ' 'ప్రాతః కాలం' వంటి సంకేత కళాఖండాలు **మైఖేలేంజెలో** ప్రతిష్ఠను పతాక స్థాయికి తీసుకుని వెళ్లాయి.

## మైసూరు

పూర్వం కర్నాటక (చూ.) రాష్ట్రాన్ని మైసూరు రాష్ట్రం అనేవారు. బెంగళూరుకు 140 కి.మీ. దూరంలో ఉన్న మైసూరు నగరం నాటి రాజసంస్థానానికి రాజధాని. ఇప్పుడు పలు పరిశ్రమలకు కేంద్రం. ముఖ్యంగా పట్టు పరిశ్రమ, పట్టు వస్త్రాలకు ప్రసిద్ధి చెందింది. ఇచ్చటి రాజప్రాసాదం, 'జగన్‌మోహన్ పాలెస్', ఇతర మ్యూజియమ్‌లు మొదలైన చారిత్రక కట్టడాలు పెక్కు ఉన్నాయి. దసరా పండుగ మైసూరులో వైభవోపేతంగా జరుగుతుంది. మైసూరు యూనివర్సిటీ (1916) 'మానస గంగోత్రి' ప్రాంగణంలో ఉంది.

## మొగల్ రాజ్యం

మంగోల్ యోధుడు బాబర్ (చూ.) దండయాత్రల ఫలితంగా మొగల్‌రాజ వంశపాలన భారతదేశంలో 1526 నుండీ ఆరంభమయింది. 1526–1530 మధ్య బాబర్ ముగ్గురు శత్రురాజులను ఓడించాడు. పానిపట్టు రణరంగమున 1526లో ఢిల్లీ సుల్తాన్ ఇబ్రహీమ్‌లోడీతో తలపడి విజయభేరి మ్రోగించాడు. తరువాత రాజపుత్రులను, ఆఫ్ఘన్ సామంతులను అదుపులో పెట్టటంతో మొగల్ సామ్రాజ్యం దేశంలో నిలద్రొక్కుకుంది. బాబర్ తరువాత హుమాయూన్ సింహాసనానికి వచ్చి షేర్‌ఖాన్ (షర్షా)తో పోరాడవలసి వచ్చి మొదట (1540) ఓడిపోయినా 1556 నాటికి మరల ఢిల్లీ సింహాసనాన్ని హుమాయూన్ చేజిక్కించుకుని భారతదేశంలో మొగల్‌ల ఆయుస్సు పెంచి తన కుమారుడు అక్బర్ (చూ.)కు అప్పచెప్పాడు. అక్బర్ పాలనలో (1556–1605) మొగల్ సామ్రాజ్యం బాగా విస్తరించింది. హిందూ, ముస్లిం సామరస్యం తారాస్థాయి నందుకుంది. అక్బర్ తరువాత సలీం, 'జహంగీర్' (1569–1627) పేరుతో మొగల్ రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. జహంగీర్ ప్రియసతి నూర్జహాన్ అధికార వ్యామోహంతో చేసిన ప్రయత్నాల్ని ఆయన కుమారుడు ఖుర్రం శౌర్యపరాక్రమాలతో ప్రతిఘటించాడు (1622–27). జహంగీర్ మరణానంతరం ఖుర్రం 'షాజహాన్' అనుపేర 1627లో పట్టాభిషిక్తుడయి 30 ఏళ్లు పాలించాడు. షాజహాన్ మహాయోధుడుగా ప్రసిద్ధి పొంది గోల్కొండ, బీజపూర్, వాయవ్య భారతదేశం లొంగదీసుకున్నాడు. చివరకు రాజకుటుంబం నందు చెలరేగిన ఆంతరంగిక కలహాలవల్ల మొగల్‌రాజ్యం బలహీనమై ఔరంగజేబు తరువాత మొగల్ సింహాసనానికి వచ్చిన బహదూర్ షా (1707–12) వంటి ప్రభువులు బలహీనులవడంతో సామంతుల చేతుల్లో కీలుబొమ్మలయిరి. 1720–45 మధ్య మహమ్మద్ షా పాలనా కాలంలో పారసీక ప్రభువు నాదిర్షా (చూ.) దండయాత్ర సాగించి వస్తు వాహనాలను ఎత్తుకుపోయాడు. ఔరంగజేబ్ పరమత పీడన వైఖరితో మహారాష్ట్రులు, రాజపుత్రులు, సిక్కులు విసిగి విరోధులయినారు. ఈలోపున యూరపియన్‌లు ప్రాబల్యం సంపాదించుటతో మొగల్ సామ్రాజ్యం భారతదేశంలో క్షీణించింది.

## మొజాంబిక్

తూర్పు ఆఫ్రికాలోని గణరాజ్యం (1974). ఉత్తరమున టాంజేనియా, పశ్చిమమున మలావీ, జాంబియా, బోత్స్వానా, జింబాబ్వే, దక్షిణ ఆఫ్రికా, దక్షిణమున స్వాజీలాండ్, తూర్పున హిందూ మహాసముద్రం ఉన్నాయి.

విస్తీర్ణం: 7,99,380 చ.కి.మీ.; జనాభా: 1,48,90,000 (1988); రాజధాని: మాపుటో; అధికార భాష: పోర్చుగీస్. బంటూ ప్రజలలో మాకా 47 శాతం, త్సోంగా 23 శాతం, మలావీ శాతం, షోనా 11 శాతం, ఇంక స్వాహిలీ మా కోండే తెగల వారున్నారు. క్రైస్తవులు 37 శాతం ఆదిమమత నిశ్వసించే వారు 48 శాతం ఉన్నారు. ఉత్తర సరిహద్దుగా రోవుమా నది ప్రవహిస్తూంది. మలావీ (న్యాసా)సరస్సు పశ్చిమాన ఉంది. జాంబజీనది, సావే నది, లింపోపోనది, డిఫాంట్స్‌నది తూర్పుగా ప్రవహించి హిందూ మహా



సముద్రంలో సంగమిస్తున్నాయి. జీడిమామిడి, కొబ్బరి, సిసాల్ నార, జొన్న, వరి, చెరకు, తేయాకు, మొక్కజొన్న, క్రపెండలం, అరటి పండ్లు, వేరుసెనగ, చిరుగడం వ్యవసాయోత్పత్తులు. ఖనిజసంపద పుష్కలంగా ఉంది. నేలబొగ్గు, వజ్రాలు, బాక్సైట్, త్రవ్వితీస్తున్నారు. బెరిల్ ఖనిజం, టాంటలైట్ ఖనిజం (ఐరన్ టాంటలాట్) విరివిగా లభిస్తున్నవి.

## మొనాకో

ప్రపంచంలోని బుల్లి దేశాలలో ఒకటి. ఇది రాజ సంస్థాన పాలనలో ఉంది. ఫ్రాన్స్ దేశానికి ఆగ్నేయ మూలలో మధ్యధరానానుకుని ఉన్నది. విస్తీర్ణం: 1.9 చ.కి.మీ.; జనాభా: 28,900 (1988); రాజధాని: మొనాకో; అధికార భాషలు: ఫ్రెంచి, మొనాగాస్క్యూ. ప్రజలు క్రైస్తవులు. ఈ రాజ సంస్థానంలో ఒక దానినొకటి మాంటె కార్లో, మొనాకో విల్లీ, ఫాంట్వీయిల్లీలా, కొండమీద అల్లుకుని ఉన్న పట్టణాలు. కేజినో జూద గృహాలు పెద్ద హోటళ్ళు, అంగళ్ళు ఈ పట్టణంలో ఉన్నాయి. మాంటె కార్లో ర్యాలీ, మొనాకో గ్రాండ్ ప్రిక్స్, మోటారు కార్లర్యాలీ, జూద గృహాల సందడి అంతర్జాతీయ వినోద పర్యాటకులకు ఆటవిడుపు స్థలంగా రాణిస్తూంది. రసాయనిక ద్రవ్యాలు, క్షీరోత్పత్తులు, పొగాకు పరిశ్రమ, పర్యాటక పరిశ్రమ మొనాకో ఆర్థికవ్యవస్థకు మూలములు.

## మొరాకో

ఆఫ్రికాలో వాయవ్యాన ఉన్న దేశం. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు మొరాకోను పరిపాలిస్తున్నారు. స్పెయిన్ (జిబ్రాల్టరు)కు 15 కి.మీ దూరంలో దీని తీరం ఉంది. పూర్వం ఫ్రెంచి, స్పెయిన్ అధీనంలో ఉన్న ప్రాంతం. దీనికి1956లో స్వాతంత్ర్యం లభించింది.

విస్తీర్ణం: 4,58,730 చ.కి.మీ.; జనాభా: 2,38, 09,000 (1988); రాజధాని: రాబాత్; అధికార భాష: అరబ్బీ. ప్రజలు బెర్బర్ జాతికి చెందినవారు. ముస్లిం మతస్థులు 99 శాతం. గుయిర్‌నది, జిజ్ నది అట్లాసు పర్వతాల్లో పుట్టి ఎడారిలో ఎండిపోతాయి. జేవ్ ఎర్ ర్బియా నది అట్లాంటిక్‌లో సంగమిస్తుంది. అన్నిటికన్న పెద్దది మౌలేయా నది అట్లాసుకొండలో పుట్టి మధ్యధరాలో కలుస్తున్నది. గోధుమ, చిక్కుడు, బార్లీ, బాదం, నారింజ జాతి పండ్లు, మొక్కజొన్న, ఓట్‌ధాన్యం, బఠాణీ వ్యవసాయోత్పత్తులు. పెట్రోలియం, జింకు, ఆంటిమనీ, బేరియం, కోబాల్టు, రాగి, ఇనుపరాయి, బంకమన్ను, సున్నపురాయి, చలువరాయి, మాంగనీస్, ఫాస్ఫేట్ ఖనిజ నిక్షేపాలు అట్లాసు పర్వతశ్రేణుల్లో ఉన్నాయి. సీడార్, పైన్, ఓక్, ఆర్గాన్, ఆలివ్ మొరాకో వృక్షసంపద. అట్లాంటిక్, మధ్యధరా సముద్రాలలో సార్డీన్, ట్యూనా, ఆంకోవీస్ చేపలు దొరుకుతాయి. ఆహార పానీయాలు, తోలుపరిశ్రమ, జవుళీ, సిమెంట్, ఫాస్ఫేట్ శోధన ప్రధాన పరిశ్రమలు. వెండితో ఆభరణాలు, మృణ్మయపాత్రలు, కంచర పాత్రలు మొరాకోలోని ప్రసిద్ధ హస్త కళలు.

## మొరార్జీ దేశాయి

భారత ప్రధాని (1977–79). పూర్తి పేరు మొరార్జీ రంఛోడ్‌లాల్ దేశాయి. జాతీయ నాయకుడు. నిర్మొహమాటంగా వ్యవహరించే రాజకీయ నాయకుడుగా పేరుపొందాడు. ఈయన 1896 ఫిబ్రవరి 29న జన్మించాడు. చిన్నప్పుడు పేదరికం అనుభవించి శ్రమపడి స్వయంకృషితో బొంబాయి ప్రావిన్షియల్ సర్వీసులో డిప్యూటీ కలెక్టరు అయి ఉద్యోగానికి రాజీనామా చేసి రాజకీయ రంగప్రవేశం చేశాడు. కాంగ్రెసులోని అతివాద శక్తులకు మొరార్జీ తీవ్రప్రత్యర్థి. ఆర్థిక వ్యవస్థలో ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహించాలని 'ఫోరమ్ ఆఫ్ ఫ్రీ ఎంటర్ ప్రైజ్'కు నాయకత్వం వహించేవాడు. బొంబాయి శాసన సభకు ఎన్నిక అయి ముఖ్యమంత్రి అయి, తరువాత 1962–63లో కేంద్ర మంత్రి అయ్యాడు. మరల ఇందిరా గాంధీ మంత్రివర్గం లో 1967లో డిప్యూటీ ప్రధానమంత్రిగా కొన్నాళ్ళు కొనసాగి రాజీనామాచేశాడు. 1977లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో జనతాపార్టీ విజయం సాధించి నప్పుడు భారత ప్రధాని అయ్యాడు.



తరువాత జనతాపార్టీ అంతర్గత కలహాలకు లోనైనప్పుడు రాజీనామా చేశారు. ఈయన ప్రకృతి వైద్యం పట్ల మక్కువ చూపుతూ 'శివాంబు' అను మూత్ర చికిత్స యందు నమ్మకం గలవాడనీ అదే, ఆయన ఆరోగ్యానికి మూలకారణమనీ అంటారు. ప్రస్తుతం (1990) 94 ఏళ్ల వృద్ధాప్యంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు.

## మొల్ల

క్రీ.శ. 16 వ శతాబ్ది

తెలుగు మహా కవయిత్రి. మొల్ల రామాయణ కర్త. "కవితల్లిన తొలి తెలుగు విదుషీమణి, రామాయణ



కావ్యరచనా రసధుని" అని కవిత్వతత్త్వ విమర్శకులు ఈమె వ్రాసినకవిత్వాన్ని శ్లాఘించారు. మొల్ల రచించిన రామాయణాన్ని "తెనుగున కున్ పొంద రుచియై వీనుల విందై విబుధుల మదికిన్" అని ప్రశంసించారు.

## మొహంజొదారో

చూ. సింధునాగరికత.

## మొహర్రమ్

ముస్లిం సంప్రదాయ సంవత్సరంలోని ప్రథమ మాసంలో హజరత్ ఇమామ్ హుసేన్ స్మారకార్థం పదిరోజులు జరిపే విధిక్రమము. ముస్లిములలో షియా తెగలవారు పదిరోజుల దుఃఖంతో మొహర్రమ్ పాటిస్తారు. ప్రార్థనలు జరు పుతూ, ఉపవాసం ఉంటారు. 'ఫాతిహాన్' భాగాన్ని, పవిత్ర ఖొరాన్‌లోని మరికొన్ని భాగాలను పఠిస్తారు. మహమ్మద్ ప్రవక్త (చూ.) కుమార్తె ఫాతిమా ఆమె భర్త హజరత్ ఆలీ. ఈ దంపతుల కుమారుడే హజరత్ ఇమామ్ హుసేన్. యుద్ధంలో ఆయనతో బాటు అనేకమంది అసువులు బాశారు. హజరత్ ఇమామ్ హుసేన్ ఆత్మశాంతికై ఈ పదిరోజులు ప్రార్థనలు చేస్తారు.

## మోక్షగుండం విశ్వేశ్వరయ్య

గొప్ప ఇంజనీరు. రాజనీతివేత్త. నవభారత నిర్మాతలలో ఒకరు. నూరేండ్లకు పైగా జీవించిన ఆయుష్మంతుడు. కర్ణాటకలోని మద్దెన హళ్ళిలో 1861 సెప్టెంబరు 15న విశ్వేశ్వరయ్య జన్మించారు.

మద్రాసు యూనివర్శిటీ ఎల్‌సిఇ పరీక్షపాసై 1884 లో బొంబాయి ప్రెసిడెన్సీ పబ్లిక్ వర్క్స్ శాఖలో అసిస్టెంట్ ఇంజనీరుగా చేరారు.

ఇనిస్టిట్యూట్ ఆఫ్ సివిల్ ఇంజనీర్స్ (లండన్) లో అసోసియేట్ మెంబర్ పదవిని ఆయన సంపాదించారు.



ఆటోమేటిక్‌స్లూయిస్ గేట్ల నిర్మాణంలో ఇరిగేషన్ బ్లాక్‌సిస్టమ్ ప్రవేశపెట్టడంలో విశిష్టమైన ప్రతిభను కనబర్చారు. కృష్ణరాజసాగర్ డామ్, హైదరాబాదు నీటి అభివృద్ధిపథకం, విమా నాల ఫ్యాక్టరీ పథకం, బీహార్‌లో గంగానదిపై రైలువంతెన నిర్మాణం మొదలైన పనుల్లో ఆయనపాత్రగణనీయమైనది. సుక్కూర్‌డ్రైనేజీ, వాటర్ వర్క్స్, ఏడెన్‌కు మంచినీటి సరఫరా, మురికి నీటి పథకాలు ఆయన రూపొందించినవే.

1909లో హైదరాబాదు సంస్థానానికి స్పెషల్ కన్‌సల్టింగు ఇంజనీరుగా నియమితులై అదే సంవత్సరం మైసూరు చీఫ్ ఇంజనీరు పదవిని అలంకరించారు. 1912లో మైసూరు దివాను పదవి చేపట్టి 1919లో రిటైర్ అయినారు. భారతదేశం పారిశ్రామికంగా స్వయం సమృద్ధి చెందాలని ఆకాంక్షించి మైసూరులో సబ్బులు, చందన తైలము, ఉక్కు తయారీకి సంబంధించిన పరిశ్రమలనూ బ్యాంక్ ఆఫ్ మైసూరును స్థాపించడానికీ దోహదం చేశారు. ఆయనకు పలు ప్రముఖ సంస్థలతో సంబంధం ఉండేది. అనేక విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్ పట్టాలు ప్రదానం చేశాయి. 'భారత రత్న' పురస్కారం అందుకున్నారు. 1959లో బంగారు పతకాన్ని (దుర్గాప్రసాద్ మెమోరియల్) పొందిన ఈ కర్మయోగి తన 102 ఏట 1962లో కీర్తిశేషులయ్యారు.

## మోతీలాల్ నెహ్రూ 1861–1931

కాశ్మీరుకు చెందిన ప్రముఖ సంపన్న పండిత కుటుంబానికి చెందిన భారత స్వాతంత్ర్య సమర

యోధుడు. ఈయన ఆగ్రాలో జన్మించాడు. ప్రథమ భారత్ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ (చూ.)కు తండ్రి.



అలహాబాదులోని ముయిర్ కాలేజీలో చదివి న్యాయవాది వృత్తిని చేపట్టి ప్రతిష్ఠనార్జించాడు. ఆదిలో పాశ్చాత్య ప్రభావానికి లోనైనా 1920 తర్వాత న్యాయవాద వృత్తికి స్వస్తిచెప్పి రాజకీయ నాయకుడయ్యాడు. 1928లో ఈయన నెహ్రూ రిపోర్టును సిద్ధపరిచాడు.అందు భారత రాజ్యాంగంరూపురేఖలుపొందుపరచాడు. చాలాసార్లు రాజకీయ ఖైదీగాకారాగారవాసం నందే ఉన్నాడు. ఈయన కుమార్తె విజయలక్ష్మి పండిట్(చూ.) ప్రముఖ రాజకీయ నాయకు రాలు. దౌత్యవేత్త (చూ. భారతస్వాతంత్ర్య పోరాటం).

## మౌంట్‌బాటెన్ 1900–79

బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో నౌకాదళాధిపతి (అడ్మిరల్). ఆఖరి బ్రిటిష్ వైస్రాయిగా ఇండియాకు వచ్చి భారత స్వాతంత్ర్య సమయంలో 1947లో అధికారం బదలాయింపు కార్యక్రమం కడు నేర్పుతో నిర్వహించి స్వేచ్ఛా భారతదేశానికి మొట్టమొదటి 'గవర్నర్–జనరల్' అయ్యాడు. తరువాత 1955లో ఆయన బ్రిటిషు 'ఫస్ట్ సీ లార్డ్' పదవి నిర్వహించాడు. 1959–65 మధ్య 'ఛీఫ్ ఆఫ్ డిఫెన్స్ స్టాఫ్' అయ్యాడు. 1979లో ఐరిష్ విద్రోహుల చేతుల్లో రాజకీయ హత్యకు గురి అయినప్పుడు ప్రపంచంలోని అధినేతలందరూ దిగ్భ్రాంతి చెందారు.

## యజుర్వేదం

సుప్రసిద్ధమైన నాలుగు వేదాలలో రెండవది. తక్కినవి ఋగ్వేదం, సామవేదం, అధర్వణవేదం. యజుర్వేదం యజ్ఞ యాగాదులలో నిర్వర్తించవలసిన విధులనూ ఆధ్వర్యుడికి అవసరమైన ప్రార్థనలనూ, మంత్రాలనూ వివరిస్తూంది. యజుర్వేదంలో మంత్రాలు ఎక్కువ. యజుర్వేదంలోకొన్ని ఋగ్వేద మంత్రాలూ, మరికొన్ని వచన భాగాలూ ఉన్నాయి. దీనికి రెండు సంహితలు. ఒకటి: తైత్తిరీయ సంహిత; రెండు: వాజపేయ సంహిత. వీటినే శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదం అనడం కూడా ఉంది. వ్యాసుడు తన శిష్యుడైన వైశంపాయనుడికి యజుర్వేదం ఉపదేశించాడు.

కృష్ణ యజుర్వేదంలో 7 ఖండాలు, 44 ప్రశ్నలు, 650 అనువాకాలు, 2198 ఖండికలూ ఉన్నాయి. ప్రతి ఖండికలోనూ 50 పదాలు ఉన్నాయి. శుక్ల యజుర్వేదంలో 4 అధ్యాయాలు, 303 అనువాకాలూ, 1975 ఖండికలు ఉన్నాయి.

## యానాం చూ. పాండిచ్చేరీ

## యుగంధరుడు చూ. ప్రతాపరుద్రీయం

## యుగాలు

'యుగం' అంటే ఒక నిర్దిష్ట కాల ఖండం. వివిధ కాలాలలో వేరువేరు విధాలుగా యుగాలు లెక్కించబడ్డాయి. 'యుగ' శబ్దానికి ఋగ్వేదంలో 'తరం' అనీ, అధర్వణవేదంలో 'శతాబ్ది' అనీ అర్థాలు. క్రమంగా యుగాల విస్తృతి పెరుగుతూ వచ్చి కాలాన్ని నాలుగు యుగాలుగా విభజించే పద్ధతి వచ్చింది. ఆ నాలుగు యుగాలు: 1. కృతయుగం (17,28,000 సం.లు), 2. త్రేతాయుగం (12,96,000 సం.లు) 3. ద్వాపర యుగం (8,64,000 సం.లు), 4. కలియుగం (4,32,000 సం.లు).

## యుగోస్లావియా

దక్షిణ యూరప్‌లోని ఒక కమ్యూనిస్ట్ రాజ్యం. బాల్కన్ ద్వీపకల్పంలో ఉత్తర ప్రాంతంలో ఉంది. భాషా సంస్కృతుల–వైవిధ్యంగల దేశం. స్లోవేకియా క్రోషియా, బోస్నియా, హెర్సిగోవినా, సెర్బియా, మేసిడోనియా అనే ఆరు సాంస్కృతిక మండలలాలుగా యుగోస్లావియా విడిపోయింది. ఒకప్పుడు రాజవంశీయుల పాలనలో ఉన్న దేశం. 1947 నుంచి కమ్యూనిస్ట్ పాలన క్రిందికి వచ్చి మార్షల్‌టిటో నియంత పాలనలో ఆర్థికంగా విశేషాభివృద్ధి సాధించింది.

విస్తీర్ణం: 2,55,804 చ.కి.మీ.; జనాభా: 2,35, 91,000 (1988), రాజధాని: బెల్‌గ్రేడ్; అధికార

భాషలు: మేసిడోనియన్, సెర్బో–క్రోషియన్, స్లోవీనియన్ భాషలు. భాషా సంస్కృతుల ప్రాతిపదిక




మీదనే ప్రజాజీవనం సాగుతుంది. రాష్ట్ర విభజన కూడా భాషా ప్రయుక్తంగానే జరిగింది. అడ్రియాటిక్ సముద్రంలో సంగమిస్తున్న నెరెత్వానది ప్రధానమయిన జలాధారం. వర్దార్ నది,దానిఉపనదులు నైరృతి యూగోస్లావియాలో పారుతూ, గ్రీస్‌లో ప్రవేశించి ఏజియన్ సముద్రంలో కలుస్తున్నాయి. డాన్యూబ్ నది, దాని ఉపనది సావానది ఉత్తరాన తూర్పుగా ప్రవహించి నల్ల సముద్రంలో పడుతున్నాయి. డాన్యూబ్ నది ట్రాన్సిల్వేనియా పర్వతశ్రేణికీ బాల్కన్ పర్వతశ్రేణికీ మధ్యగల సన్నని కనుమద్వారా ప్రవహించే స్థానాన్ని 'ఇనుపద్వారం' అంటారు. యుగోస్లావియా ఉత్తరాన పర్వతమయమైన ప్రాంతాలూ, సుమారు 80 పెద్ద సరస్సులూ తటాకాలు ఉన్నాయి. మొక్కజొన్న, బీటుదుంప (పంచదార), గోధుమలు, బంగాళదుంప, ద్రాక్ష, బార్లీ, ప్లమ్‌పండ్లు, ఆపిల్ పండ్లు, పుచ్చకాయలు, ఓట్ ధాన్యం, రైధాన్యం, పొద్దుతిరుగుడు గింజలు, పొగాకు, వరి ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ విరివిగా సాగుతూంది. రాగి, ఇనుపరాయి, సీసం, జింకు, నేలబొగ్గు, బాక్సైట్, ఆంటిమనీ, మాంగనీసు, క్రోమియమ్, పాదరసం, వెండి ప్రముఖ ఖనిజనిక్షేపాలు. అటవీసంపద మెండు— ఓక్, బీచ్, ఫిర్ దేశపు వృక్ష సంపద. జలవిద్యుత్తు ఉత్పత్తి అగుచున్నది. సిమెంటు, బీటు (పంచదార,) జవుళీ, ధాతువులు, కలప, ఎలక్ట్రనిక్ పరికరాలు, యంత్రసామగ్రి, ద్రాక్షసారాయి ప్రధాన పరిశ్రమలు. యుగోస్లావియా తివాచీ నేతకు ప్రసిద్ధి.

## యు ని సెఫ్

అంతర్జాతీయ బాలల నిధి. 1946లో ఐక్య రాజ్యసమితి అనుబంధ సంస్థగా 'యునైటెడ్ నేషన్స్ చిల్డ్రన్స్ ఎమర్జన్సీ ఫండ్' స్థాపించబడినది. 110 ప్రపంచ దేశాలలో ముఖ్యంగా నిరుపేద ప్రాంతాలలోని 0–6 వయోవర్గంలో ఉన్న పిల్లల సమగ్రాభివృద్ధికి సలహా సహకార దోహదాలు అందివ్వడం ఈ సంస్థ ప్రధాన ఆశయం. దీని ప్రధాన కార్యాలయం న్యూయార్క్‌లో ఉంది. ఆగ్నేయాసియా ప్రాంతీయ కేంద్రం న్యూఢిల్లీలో ఉంది. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాల ప్రాంతీయ కేంద్రం హైదరాబాదులో ఉంది. పేదరికంలో ఉన్న పిల్లలకు మంచినీరు, పారిశుద్ధ్య (మరుగుదొడ్లు), కార్యక్రమాలు, వ్యాధి నిరోధక టీకా మందులు, గర్భిణీ–బాలింతలకూ శిశువులకూ మందులు, పోషకాహారాలు అందివ్వడం ఈ సంస్థ కార్యక్రమాల్లో ప్రధానం. పిల్లలు ఆరోగ్యంగా పెరగడానికి జనజాగృతి కార్యక్రమాలు కూడ చేపట్టి నిర్వహిస్తున్నారు.

## యునైటెడ్ అరబ్బు ఎమిరేట్స్

పర్షియన్ సింధు శాఖలోని అజమాన్, అబూ దాబీ, ఉమ్మ్కా, అల్ క్యువెయిన్, ఫుజయిరాహ్ రాహ్, రాస్ అల్ ఖయిమాహ్, షార్జా అను ఏడు షేకు రాజ్యా (షేకడమ్)ల సమాఖ్యను యునైటెడ్ అరబ్బీ ఎమిరేట్స్ అంటారు. 1971–72 మధ్య ఈ సమాఖ్య ఏర్పడింది. ప్రతి ఎమిరేట్‌ను ఒక అమీరు పాలిస్తూ ఉంటాడు. సమాఖ్య ప్రభుత్వంలో విదేశీ విధానం రూపొందించి అమలు పరుస్తుంది. సమాఖ్యలో ప్రతి ఎమిరేట్‌కు భాగస్వామ్యం ఉంది.

విస్తీర్ణం: 77,700 చ.కీ.మీ., జనాభా: 17,74, 000 (1988); రాజధాని: ఆబూదాబీ; అధికార భాష: అరబ్బీ. ప్రజలు సున్నీ 80 శాతం, షియా 20 శాతం ముస్లిములు. ఎక్కువమంది పట్టణప్రాంతాలలో నివసిస్తారు. ఎడారిలో ఖర్జూరం లభిస్తుంది. చేపలు,రొయ్యలు పట్టి అమ్ముతారు. దుబాయీ పెద్దరేవు పట్టణం. ఎమిరేట్ల ఆర్థిక వ్యవస్థ పెట్రోల్ తైల వాణిజ్యం మీద ఆధారపడి ఉంది. పెట్రోలు తప్ప మరొక ఆర్థిక వనరు ఎమిరేట్లలో లేదు. ఆబూదాబీ, దుబాయీలలో పెట్రోలు నిక్షేపాలు పుష్కలం. అమెరికన్లు, యూరోపియనులు, జపాను వారు పెట్రోలు గనులను గుత్తకు తీసికొని రాయల్టీ చెల్లిస్తూ ఉంటారు.

## యునైటెడ్ కింగ్‌డమ్ చూ. గ్రేట్‌బ్రిటన్

## యునైటెడ్ నేషన్స్ చూ. ఐక్యరాజ్యసమితి

## యునైటెడ్ స్టేట్స్

ప్రపంచ రాజకీయాల్లో కీలక పాత్ర వహిస్తున్న ప్రజాస్వామిక గణరాజ్యం. ప్రపంచంలో నాలుగవ పెద్ద దేశం. సోవియట్ రష్యా, కెనడా, చీనా రాజ్యాలు యునైటెడ్ స్టేట్స్ కంటె క్రమంగా పెద్దవి. జార్జి వాషింగటన్ నాయకత్వంలో 4 జూలై 1776 నాడు స్వాతంత్ర్యం ప్రకటించుకొనక ముందు ఈ ప్రాంతం బ్రిటిషు వలసరాజ్యంగా ఉండేది. ఒకప్పుడు ఇది




ఇరాక్వాయియా వంటి రెడ్ ఇండియన్ ఆదిమ జాతులకు స్థావరంగా ఉండేది. కొలంబస్ (చూ.) 15వ శతాబ్దాంతం అమెరికన్ నేలమీద కాలూనడంతో యూరపియన్ల రాక ప్రారంభ మైంది. ఇటలీ దేశపు సాహస నావికుడు అమెరిగో వెస్పుస్సీ (1451–15 12) తన యాత్రా చరిత్రలో ఈ దేశాన్ని వర్ణించుటచే ఈ భాగానికి 'అమెరికా' అని పేరు పెట్టారు. జార్జి వాషింగ్టన్, బెంజమిన్ ఫ్రాంక్లిన్, జేమ్స్‌మాడిసన్, అలిగ్జాండర్ హేమిల్టన్ మున్నగు 40 మందితో కూడిన రాజ్యాంగ పరిషత్తు సిద్ధంచేసిన రాజ్యాంగరీత్యా 1789లో ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వం నెలకొని పని చెయ్యడం ప్రారంభించింది. ఈ రెండువందల ఏళ్ళకాలంలోనూ వాషింగ్టన్, జెఫర్సన్, లింకన్, రూజ్‌వెల్ట్, కెనెడీ అధ్యక్షులుగా ఉండి ఉదాత్త ప్రజాస్వామిక సంప్రదాయాలను పాటించి ప్రపంచ దేశాలకు ఆదర్శప్రాయులైనారు. ఆధునిక శాస్త్ర విజ్ఞా (టెక్నాలజీ)నాన్ని మానవ శ్రేయస్సుకూ, సుఖజీవనానికీ ప్రయోజన పడేటట్టు మలచి పారిశ్రామికాభ్యుదయాన్ని సార్థకం చేశారు. రోదసీ యానం చేయడానికి దోహదాలు సమకూర్చి 1969 జూలై 21 మానవుడు మొదటగా చంద్రమండలంపై కాలుపెట్ట డానికి కారణభూతమయిన దేశం యునైటెడ్ స్టేట్స్. (చూ. కొలంబస్, వాషింగ్టన్, లింకన్)

విస్తీర్ణం: 95,29,063 చ.కి.మీ.; జనాభా: 24,58, 00,000 (1988); రాజధాని: వాషింగ్టన్.డి.సి.; అధికార భాష: ఇంగ్లీషు; స్పానిష్ భాషనుకూడా కొన్ని చోట్ల ప్రజలు వాడతారు. ప్రొటస్టెంటు 56 శాతం, రోమన్ కేతలిక్కులు 30 శాతం, యూదులు 3 శాతం. 50 **రాష్ట్రాల** సమాఖ్య (ఫెడరేషన్). ఆదిమజాతులు రెడ్ ఇండియన్‌లు—వీరికి ప్రత్యేక స్థావరాలు ఏర్పాటు చేశారు. యునైటెడ్ స్టేట్స్‌కివచ్చిన ప్రజలలో ప్రపంచ దేశాలన్నిటికీ ప్రాతినిధ్యం ఉంది. ఎక్కువ మంది యురోపియన్ జాతులు. బ్రిటిషు వారు అందులో ఎక్కువ. యునైటెడ్ స్టేట్స్ జనాభాలో ప్రతివెయ్యికి ఇద్దరు హిందువులు ఉండుట గమనించదగ్గ విషయం. అందులో తెలుగువారు కూడ ఉన్నారు. పూర్వం బానిసలుగా వచ్చిన నీగ్రో వర్గం అల్పసంఖ్య వర్గాల్లో అధికమైనది. **ఇప్పటికీ** అధికసంఖ్యలో ఇతర దేశాలనుండి విద్యార్థికుల్ని బ్రతుకు తెరువుకు యునైటెడ్ స్టేట్స్ ఆకర్షిస్తూ ఉంటుంది. జనసాంద్రత తూర్పు తీర రాష్ట్రాల్లోనూ, పశ్చిమ తీరరాష్ట్రాల్లోనూ, మూడు సరస్సుల ప్రాంతంల్లోను అధికం. మిగతా చోట పలుచగా ఉంటుంది. అపలాచియన్ పర్వతాల్లో హడ్సన్ నది ప్రవహించగా లోయ ఏర్పడింది. ఉత్తర, దక్షిణాలుగా మిసిసిపీ నది ప్రవహిస్తూంది. ఫలితంగా ఆగ్నేయంలో మహా మైదానం ఏర్పడింది. మిస్సోరీనది పశ్చిమాన రాకీ పర్వతాల్లో ప్రారంభమయి మిసిసిపీ నదిలో కలుస్తున్నది. ఆగ్నేయాన ఉన్న మహాలోయ (గ్రేట్‌వేలీ)లో చాలా సరస్సులు, తటాకాలు ఉన్నాయి. విస్తారమయిన సహజ సంపద. అపార జలసంపద, ప్రకృతి సానుకూలత యునైటెడ్ స్టేట్స్ ఆర్థికాభివృద్ధికి తోడ్పడ్డాయి. నేలబొగ్గు, ఇనుపరాయి, చమురు వాయువు, పెట్రోలు తైలనిక్షేపాలు, ఫాస్ఫేట్‌రాయి, మొలిబ్డినమ్, తగరం, నికెలు, బాక్సైట్, రాగి, సీసం, పొటాషు, యురేనియం, ఫాస్ఫరస్, జింకు వంటి ఖనిజనిక్షేపాలు పారిశ్రామికాభ్యు దయానికి తోడ్పడ్డాయి. విలువయిన వెండి, బంగారపు ఖనిజాలు కూడా అపారంగా ఉన్నాయి. అటవీ సంపద పుష్కలం.

జలవిద్యుత్తు భారీ రాశుల్లో ఉత్పాదన జరుగుతూంది. మహానదులపై డాములు, ఆనకట్టలు, బరాజులు నిర్మించి సాగునీటిని పంటచేలకు అందిస్తున్నారు. సోయా, గోధుమ, మొక్కజొన్న, ప్రత్తి పుష్కలంగా పండుతున్న పంట దినుసులు. బీటు (పంచదార) దుంప, రైధాన్యం, జొన్న, బంగాళదుంప, చెరకు, వరి, ద్రాక్ష, నారింజ, పొగాకు, బాదం, అనాస, పీచ్, ప్లమ్‌పండ్లు, వేరుసెనగ ఇతర వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ, కోళ్ళ పరిశ్రమ, పందుల పెంపకం, పాడిపరిశ్రమ వాణిజ్య సరళిలో సాగుతున్నాయి. పరిశ్రమలు అత్యంత ఆధునిక మయిన టెక్నాలజీ ఆధారంగా పనిచేస్తున్నాయి. రాసాయినిక ద్రవ్యాలు, ప్లాస్టిక్స్, విద్యుత్తు పరికరాలు అతి సున్నితమయిన శాస్త్రీయ పరికరాలు, ధాతుసామాగ్రి, విమానాలు, రక్షణసామగ్రి, ఆహారపదార్థాలు, కాగితం, ముద్రణ, రవాణా వాహనాలు, నౌకలు, వస్త్రాలు పేర్కొనదగిన పరిశ్రమలు. ఆధునిక శాస్త్రా ధ్యయన కేంద్రాలు యునైటెడ్ స్టేట్స్‌లో పలుచోట్ల పనిచేస్తు న్నాయి. కాలిఫోర్నియాలో సిలికన్ వేలీలో ఎలక్ట్రానిక్ కంప్యూటర్ విజ్ఞానానికి ప్రసిద్ధి. లాస్ ఏంజిల్స్(టెక్నాలజీ సైన్స్), న్యూయార్క్, హ్యూస్టన్ (రోదసీ విజ్ఞానం), మౌంట్ పాలమార్, విల్సన్, చికాగో, యార్కిస్ అబ్సర్వేటరీలలో ఖగోళ విజ్ఞాన పరిశోధనలు శ్రద్ధాసక్తులతో జరుగుతున్నాయి.

ఫ్లోరిడాలోని ఆర్లాండోలో ఉన్న డిస్నీవరల్డ్ ఆబాలగోపాలాన్ని ఆకర్షించే వినోదయాత్రాస్థలి. కాలి ఫోర్నియా రాష్ట్రంలోని హాలీవుడ్ సినిమా పరిశ్రమ, డిస్నీలాండ్, వర్జీనియాలోని షెనాన్డో లోయలో రమణీ యంగా ఉన్న ప్రకృతి దృశ్యాలుగల లూరే కేవరన్స్ చూడముచ్చటగా ఉంటాయి. రాజధాని వాషింగ్‌టన్ డి.సి. **(చూ.)**న్యూయార్క్(చూ.)లాస్ ఏంజిల్స్; **చికాగో** ఇత్యాది నగరాల్లో అపురూప కళా ఖండాలు ఉన్న మ్యూజియమ్‌లు చాలా ఉన్నాయి. పశ్చిమాన గ్రాండ్ కేన్యన్ ప్రకృతి దృశ్యాలు. కెనడా—యునైటెడ్ స్టేట్స్ సరిహద్దులోని నయాగరా (చూ.) జలపాతదృశ్యాలు ప్రపంచఖ్యాతి బడసినవి. ప్రపంచలోని భారీ శిలావిగ్రహాలు (వాషింగ్‌టన్, జెఫర్సన్, రూజ్‌వెల్ట్, అబ్రహాం లింకన్) గల జాతీయ స్మారక ప్రాంగణం దక్షిణ డకోటాలోని రష్‌మోర్ శిఖరం మీద ఉంది.

## యు.ఎస్.ఎస్.ఆర్.

చూ. రష్యా

## యూరప్

ప్రపంచంలోని అయిదు ఖండాలలో ఒకటి. యూరేషియాలో యూరల్ పర్వతశ్రేణి, కాస్పియన్ సముద్రం, కాకసస్ పర్వతశ్రేణి, నల్ల సముద్రం— వీటికి పశ్చిమ భాగం యూరప్‌గా వ్యవహరింపబడుతూంది. ఆస్ట్రేలియా తరువాత యూరప్ చిన్న ఖండం. ప్రపంచ జనాభాలో 11 శాతం యూరప్‌లో ఉన్నారు. ఆర్థిక పారిశ్రామికాభ్యుదయం సాధించిన భూభాగం. శీతోష్ణస్థితి ఆర్కిటిక్ వలయంలో అతి శీతలంగా ఉండి మధ్యధరా సముద్ర ప్రాంతంలో సమశీతోష్ణ పరిస్థితులు కానవస్తాయి. ఆల్ప్సు పర్వతాలు, పిరనీస్ పర్వతాలు ప్రధాన పర్వత శ్రేణులు. పశ్చిమ యూరప్‌లో స్వర్ణ త్రికోణం అనబడే 'బర్మింగ్‌హామ్—ఫ్రాంక్‌ఫర్ట్—పారిస్' పారిశ్రామిక ఔన్న త్యాన్ని సాధించిన ప్రదేశం. డాన్యూబ్, రైన్, వోల్గా, ఎల్బ్, విస్తులా, పో, సీన్, రోన్, ఓడర్—నీస్ నదులు ప్రధాన జలనిర్గమన సాధనాలు. దాదాపు చిన్నా పెద్దా 35 స్వతంత్ర గణరాజ్యాలు యూరప్‌లో ఉన్నాయి. యూరప్ విస్తీర్ణం: 1,03,60,000 చ.కి.మీ.; జనాభా: 49,04, 56,000 (1984). రష్యా (ఆసియాలో కూడ ఉండడం వల్ల) జనాభా ఇందులో చేరలేదు.

## యూరల్ పర్వతాలు

యూరప్—ఆసియా దేశాలమధ్య సరిహద్దుగా ఉన్న పర్వతశ్రేణి. రష్యాలో మైదానాన్ని తూర్పున సైబీరియా పల్లపు భూముల్ని వేరుపరుస్తూ ఉత్తర—దక్షిణాముగా (2400 కి.మీ) ఉన్న ఈ పర్వతశ్రేణి ఉంది. ఇందులో నరోద్నయా, తెల్పోస్ పర్వతశిఖరాలు అత్యు న్నతమయినవి. ఖనిజ సంపద పుష్కలంగా లభించడం వల్ల యూరల్ ప్రాంతంలో అనేక భారీ పరిశ్రమలు ఉన్నాయి. స్వెర్డ్‌లోవిస్క్, చెల్యాబిన్స్క్, మాగ్నిటూ గోర్సికో ప్రముఖ పారిశ్రామిక కేంద్రాలు.

## యెమెన్ ఏడెన్

అరేబియా ద్వీపకల్పంలో ఆగ్నేయంగా ఉన్న స్వతంత్ర గణరాజ్యం (1967). పూర్వం బ్రిటిషు వారి అధీనంలో ఉండేది.

విస్తీర్ణం: 3,36,869 చ.కి.మీ. జనాభా: 23, 45,000 (1988); రాజధాని: ఏడెన్ (అష్ శాచ్), ఏడెన్ ప్రధానరేవు పట్టణము కూడ. ప్రజలు అరబ్బు జాతులవారు. వారిలో సున్నీ ముస్లిములు 99.5 శాతం. విదేశీయులలో భారతీయులు కూడా ఉన్నారు.

పాతాళగంగ వర్షాదారపు సేద్యం సాగుతున్నది. బార్లీ, జొన్న, గోధుమ చిరుధాన్యాలు, అపరాలు నువ్వులు, పుచ్చకాయలు, బంగాళదుంప, ప్రత్తి, ఖర్జూరం పండి స్తారు. పశుపోషణ సాగుతున్నది. పెట్రోలు తైల శోధన ఏడెన్‌లో సాగుతున్నది. ఉప్పుపండిస్తారు. మత్స్య పరిశ్రమ ధోవ్‌పడవల సహాయంతో సాగిస్తున్నారు. నేత, తోలు పరిశ్రమ, నౌకలకు పెట్రోలు పోయుట ప్రజల జీవనోపాధులు.

## యెమెన్ శాన్ ఆ

దీనిని 'యెమెన్ అరబ్బీ రిపబ్లిక్' అని కూడ అంటారు. అరేబియా ద్వీపకల్పంలోని నైరృతి ప్రాంతాన ఉన్న స్వతంత్ర గణరాజ్యం (1962). 1958–61 మధ్య యునైటెడ్ అరబ్బీ రిపబ్లిక్ (ఈజిప్టుతో)లో అంతర్భాగంగా ఉండేది.

విస్తీర్ణం: 1,35,230 చ.కి.మీ.; జనాభా: 86, 14,000 (1988); రాజధాని: శాన్‌ఆ; అధికార భాష: అరబ్బీ. ప్రజలు జయ్దా శాఖకు చెంది షియామతం పాటిస్తారు. గ్రామీణా జీవనం సాగిస్తున్నారు. పెద్ద పరిశ్రమలు లేవు. హస్తకళల్లో ఆరితేరిన వారు. జవుళీ, తోలుపని, ఇనుపసామాగ్రికి ప్రాచీన **కాలం** నుండి ప్రపంచప్రసిద్ధి పొందినవారు. వర్షం మీద ఆధారపడి సేద్యం చేస్తారు. పర్వతసానువుల్లో జలవాహిక (అక్విడక్ట్) లు నిర్మించి పంటనీటిని వినియోగిస్తారు. గోధుమ, బార్లీ, జొన్న (దూరా) ఆహారపు పంటలు, ఖర్జూరం, ఆప్రికాట్, ద్రాక్ష, దానిమ్మ, బొప్పాయి, నారింజ జాతులు విరివిగా పండిస్తారు. మోచా కాఫీ పండించి ఎగుమతి చేస్తున్నారు. క్వాట్ అను మత్తు పదార్థాన్ని ఇచ్చే మొక్కలను సాగుచేసి (ఔషధం) ఎగుమతి చేస్తున్నారు.

## రంగా, ఎన్.జి.

పూర్తిపేరు గోగినేని రంగనాయకులు. 'ఆచార్య రంగా'గా ప్రసిద్ధి చెందాడు. జాతీయవాది. నిరాడం బరుడు. రైతు నాయకుడు. ఆశావాది. నీతి నిజాయితీలుగల నాయకుడు. ఈయన 1900 నవంబర్ 7న నిడుబ్రోలులో జన్మించారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో ఉన్నత విద్యను అభ్యసించి మద్రాసులోని పచ్చయప్పా కాలేజీలో 1931లో ఆచార్య పదవినిచేపట్టి అనతి కాలంలోనే రాజీ నామాచేసి, రాజకీయ రంగప్రవేశం చేశాడు. రైతుల సమస్యలను శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేసి రైతుయాత్రలు నిర్వహించి జాతీయ రైతునాయకుడుగా ప్రసిద్ది చెందాడు. 1946 – 51 మధ్య



ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవిలో కొనసాగాడు. 1951 ఏప్రిల్ 11వ తేదీన నీలం సంజీవరెడ్డి రాష్ట్ర పి.సి.సి. చేపట్టడంతో రంగా రాజకీయ జీవితంలో మలుపు వచ్చింది. కృషికార్‌లోక్ పార్టీ స్థాపించాడు. అయితే, అది 1952లో కాంగ్రెసు అనుబంధ పార్టీ అయింది. కాని 1957లో దానినుండి విడిపోయాడు. 1959లో స్వతంత్ర పార్టీ అవతరించి నప్పుడు దాని **రాష్ట్ర శాఖను** నిర్వహించాడు. రంగాకు గౌతు లచ్చన్న వంటి శిష్యకోటి ఉంది: రైతాంగ విద్యాలయాలు, రాజకీయ పాఠశాలలు, యువ నాయకులకు శిక్షణ శిబిరాలు నిర్వహించాడు. 50 **ఏళ్ళు పార్లమెంటు రాజకీయ అనుభవం గల రాష్ట్ర నాయకుడు**

## రంగారెడ్డి జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఒకటి. 1978లో హైదరాబాదు జిల్లాలోని గ్రామీణ భాగాన్ని వేరుచేయగా ఇది ఏర్పడినది. రంగారెడ్డి జిల్లాకు ఉత్తరమున మెదకు జిల్లా, తూర్పున నల్గొండ జిల్లా, దక్షణమున మహబూబునగరం జిల్లా, పశ్చిమమున కర్నాటక రాష్ట్రం సరిహద్దులుగా ఉన్నాయి.

విస్తీర్ణం: 7,493 చ.కి.మీ.; జనాభా: 15,79,862 (1981); జిల్లా కేంద్రం: ప్రస్తుతం హైదరా బాద్‌లో

ఉన్నది. మూసీనది, ఈసీనది జిల్లాలోని ముఖ్యమయిన నదులు. అపరాలు, జొన్నపంట ఎక్కువ. వరికూడా




పండుచున్నది. ద్రాక్ష ముఖ్యంగా అనాబ్‌షాహి, కిస్‌మిస్ (తాంప్సన్ సీడ్‌లెస్) పండించి ఇతర చోట్లకు పంపుచున్నారు. కోళ్ల పరిశ్రమ ఆధునిక శాస్త్రీయ పద్ధతులమీద భారీస్థాయిలో జరుగుచున్నది. క్వార్ట్జ్‌లు, పాలరాయి, సున్నపురాయి పొరుగుననే ఉండడం వల్ల రంగారెడ్డి జిల్లాలో పారిశ్రామిక ప్రగతి బాగా జరిగినది. కేంద్ర ప్రభుత్వరంగ పరిశ్రమలు ఎచ్.ఎమ్.టి., ఎల క్ట్రానిక్స్, ఔషధములు, రక్షణశాఖలోని సైనికావసర పరికరములు, రాసాయనిక ద్రవ్యములు బి.హెచ్.ఇ.ఎల్. ప్రధాన పరిశ్రమలు.

## రంజిత్‌సింగ్ 1780–1839

పంజాబీ మహారాజు. సిక్కు రాజ్యకూటమిలో సుకార్ చకియా శాఖకు నాయకుడు. తన ప్రతిభావ్యుత్పత్తులను ప్రదర్శించి విశేష కృషి చేసి ఆఫ్ఘన్ రాజు జమాన్షాను ఓడించి లాహోరును 1799లో తన రాజ్యమున కలుపుకో గలిగాడు. 1822లో అమృతసరును వశపరచుకొని రెండు సిక్కు రాజధానులను తన ఆధిపత్యం లోనికి తీసికొనెను. ఉత్తరమున కాశ్మీర్ వరకూ, పశ్చిమున ముల్తాను వరకూ, వాయవ్యమును పెషావర్ వరకు సామ్రాజ్యమును రంజిత్‌సింగ్ విస్తరింపచేసెను. తన సైనిక పటాలములకు విదేశీ నిపుణులచే శిక్షణనిప్పించెను. పంజాబీ భాషను పోషించుటయేగాక పంజాబీ బైబిలు (1715), అక్బర్ నామా వంటి అనువాదాలు వెలుగు చూచుటకుకారకుడయ్యెను.



## రమణమహర్షి 1879–1950

జగద్విఖ్యాతుడైన, దక్షిణ భారతదేశమున జీవించిన, ఆధునిక మహర్షి. 1879 రామనాధపుర జిల్లా తిరుచులి గ్రామంలో ప్లీడరు సుందరామయ్య కుమారుడుగా రమణమహర్షి జన్మించాడు. 'తనను తాను తెలుసుకొనడమే 'సర్వోత్తమ మైన జ్ఞానం' అనేది రమణమహర్షి ప్రధానమైన బోధన. బాల్యం లోనే ఎప్పుడూ పరధ్యానం లో ఉండేవాడు. రానురాను ఆయనలోని ఆ జిజ్ఞాస మరీ అధికమైంది. చదువుమీద, మనుషుల మీద ఆసక్తి సన్న గిల్లింది.సత్యం తెలుసుకోవా లనుకున్నాడు. ఈ జిజ్ఞాస



తీవ్రమవుతున్న కొద్దీ ఆయనకు ఏదో ఒక అపూర్వానుభవం కలిగి, ఆయన అరుణాచలం చేరకున్నాడు. 1865 వరకు అరుణాచల యెక్కడుందో అతడెరుగుడు. ఒకనాడొక పరిచయస్థుడు తాను అరుణాచలం నుంచి వస్తున్నట్లు చెప్పగానే ఆయననుంచి వివరాలు తెలిసికొని అప్పటికప్పుడు తిరువణ్ణామలై (చూ.) అనబడే అరుణాచలం బయలుదేరి 1950 ఏప్రిల్ 14వ తేదీన తాను సిద్ధిపొందే వరకు అక్కడే ఉన్నారు.కొన్ని యేండ్లు పూర్తిగా మౌనం వహించారు. ఆయన రచించిన 'రమణగీత' సుప్రసిద్ధమైంది. దేశం అంతటా వేలాది మంది ఆయనకు, శిష్యులై నేటికీ ఆయనను ఆరాధిస్తున్నారు.

## రష్యన్ విప్లవం

ప్రపంచ చరిత్రలో ప్రముఖ స్థానంఉన్న ప్రజా విప్లవం 1917లో జరిగిన 'రష్యా విప్లవం'. దీనిని అక్టోబరు విప్లవం అని కూడా అంటారు. అంతకు ముందు క్రిమియా యుద్ధం (1856), రష్యా–జపాన్ యుద్ధం (1905) ఫలితాలు రష్యాను ఏలుతున్న జార్ చక్రవర్తుల ప్రాబల్యాన్ని సన్నగిల్లచేశాయి. ప్రథమ ప్రపంచ యుద్ధంలో రష్యా పాల్గొనడంవల్ల దేశ ప్రజలకు ధన, ప్రాణ, మాన నష్టాలు జరగడంతో నైతిక పరిస్థితి మరింత దిగజారి పోయింది. ఈ నేపథ్యంలో విప్లవం ప్రజ్వరిల్లింది. ఇందు

రెండు వర్గాలవారు ఉన్నారు. ఒకటి **ఉదారభావ** ప్రేరితులగు మితవాద 'మెన్షివిక్'లు; రెండవవర్గం తీవ్రవాద 'బొల్షివిక్'లు. ఈ రెండవ వర్గంవారు సామాజిక విప్లవం తీసుకొనివచ్చి సమ సమాజ స్థాపనకై పాటుపడేవారు. కార్ల్‌మార్క్స్ (చూ.) భావ ప్రేరిత రచన 'దాస్ కాపిటల్' చదివి ప్రభావితుడయిన లెనిన్ (చూ.) నాయకత్వం బోల్షివిక్ వర్గానికి లభించింది. మొదట మెన్షివిక్‌లు 1917లో ఫిబ్రవరి విప్లవాన్ని నడిపారు. తరువాత బోల్షివిక్‌లు లెనిన్ నాయకత్వంలో విజృంభించి మొదటి వర్గాన్ని త్రోసిరాజని అక్టోబరు విప్లవం నిర్వహించి కృతకృత్యులయి అధికారాన్ని కైవసం చేసుకున్నారు. వాస్తవానికి ఆనాడు రష్యాలో అమలులో ఉన్న పంచాగం (కేలండర్) ఇతర దేశాలు పాటిస్తున్న పంచాంగానికి 13 రోజులు తేడా ఉండేది. అక్టోబరు 1917లో జరిగిన విప్లవం నవంబరులో 1917లో జరిగిందన్నమాట. ఫిబ్రవరి విప్లవం మార్చిలో జరిగిన దన్నమాట. ఇందులో మొదట ఫిబ్రవరి విప్లవంలో పెట్రోగ్రాడ్ (ఇప్పటి లెనిన్ గ్రాడ్)లో 1917 మార్చి 8న సమ్మెలు, ఆందోళనలు చెలరేగి విప్లవం రాజుకుంది. రష్యాపటాలం కూడా సమ్మెదారుల ఎడ సానుభూతితో వ్యవహరించింది. 'డూమా' అంటే రష్యా పార్లమెంటు కూడా జార్ చక్రవర్తి ఉత్తర్వులను తిరస్కరిస్తూ ప్రజలవైపు మొగ్గి సానుభూతి చూపి ఒక ఆపద్ధర్మ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. మార్చి 16నాటికి బొల్షివిక్‌లు చేసిన ప్రయత్నం విఫలం కాగా లెనిన్ ఫిన్లాండ్‌లో తలదాచుకున్నాడు. ఈలోపున ఏప్రిల్ 1917 రెండవ వర్గం కార్మిక, కర్షక, సైనిక ప్రతినిధుల సంఘానికి లెనిన్ నాయకత్వం లభించడంతో విప్లవాన్ని తీవ్రతరం చేశారు. ఆపద్ధర్మ ప్రభుత్వం నడుపుతున్న కెరెన్‌స్కీ వైదొలగుటతో సేనాపతి కోర్నిలోవ్ ఒక ప్రయత్నం చేసినా (సెప్టెంబరు 1917) ఫలితం మాత్రం దక్కలేదు. ఈ సంధి సమయంలో ప్రజలలో భయాందోళనలు చెలరేగ టంతో లెనిన్ సైనికులను సమాయత్తం చేసి నవంబరు 6న (ప్రపంచ కేలండరు) ఆపద్ధర్మ ప్రభుత్వ కార్యకేంద్రాన్ని ముట్టడించి చేజిక్కించుకున్నాడు. ఈ విప్లవ కృషితో లెనిన్ సన్నిహితుడు ట్రాట్‌స్కీ(చూ.) ఆయనకు చేదోడు వాదోడుగా వ్యవహరించాడు. మరు నాడు (నవంబరు 7) అఖిల సోవియట్ కాంగ్రెసు సమావేశమై బోల్షివిక్‌లకు ప్రభుత్వాధికారాన్ని అప్పగించింది. వెను వెంటనే క్రయి వేటు వ్యాపారం స్వస్తిచెప్పి కర్మాగారాలను ప్రభుత్వ రంగంలోనికి తీసికొని వచ్చారు. మత సంస్థలకును, విప్లవ వ్యతిరేకులకు సంబంధించిన యావదాస్తినీ ప్రభుత్వం కైవసం చేసుకుంది. (చూ. రష్యా)

## రష్యా

దీనిని యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ (యు.ఎస్.ఎస్.ఆర్) అంటారు. సోవియెట్ రష్యా అని వ్యవహారనామం. ప్రపంచదేశాలలో అతి పెద్దది. అక్టోబర్ విప్లవం (చూ.) తదనంతరం 1917 కమ్యూనిస్టు పాలన కొనసాగుతున్నది. రష్యా రెండు ఖండాలకు వ్యాప్తిచెందినది. యూరప్, ఆసియా రెండింటికి మధ్య యూరల్ పర్వతశ్రేణి ఉంది. సోవియెట్ రష్యాలో 15 రిపబ్లిక్‌లనబడు స్వయం పరిపాలనా విభాగా లున్నాయి. ఒక్కొక్క రిపబ్లిక్ ఒక్కొక్క సోవియెట్ (సమితి సభ్యులు) పరిపాలనలో ఉంటుంది. ఈ దేశంలో ఏకపక్ష పాలన కమ్యూనిజం సిద్ధాంతాలకు కట్టుబడి ఉంది. విప్లవానంతరం (1917) రష్యా జాతిపిత లెనిన్ రాజ్యాధికారం చేపట్టి మార్క్స్ (చూ )ప్రవచించిన సూత్రాలను ప్రాతిపదికగా తీసికుని **సువ్యవస్థిత** కమ్యూనిస్టు పాలనను ప్రారంభించెను. ఆయన మరణించగా స్టాలిన్ తన పాలనను (1924–53) నియంతృత్య ధోరణిలో సాగించెను. ద్వితీయ ప్రపంచయుద్ధ (చూ.) సమయంలో నాయకత్రయం (బిగ్‌త్రీ)లో స్టాలిన్ ఒకడై ప్రముఖ పాత్ర వహించెను. ఈయన పరిపాలన ఇనుపతెర (ఐరన్ కర్టెన్) వెనుక కఠోరంగా సాగిందని చరిత్రకారులు అభిప్రాయం. తూర్పు యూరప్ దేశాలలోనూ, ప్రపంచంలో ఇతరచోట్ల కమ్యూనిస్టు రష్యా భావాలను ప్రచారం చేసి ప్రభావితం చేశారు. ఇతని తరువాత వచ్చిన కృశ్చేవ్ (చూ.), బుల్గానిన్, బ్రెజనివ్, కొసిగన్ ప్రభృతులు స్టాలిన్ నియంతధోరణిని సడలించి పాలన నిర్వహించారు. ప్రస్తుతం (1990)గోర్బచెవ్ పాలనలో ప్రజాస్వామ్య శక్తులు విశృంఖలంగా విజృంభించడంతో పునర్‌వ్యవస్థీకరణ (పెరిస్ట్రోయికా) బహిరంగ రాజనీతి (గ్లాస్‌నాత్) వంటి వినూత్న పరిపాలనాసంస్కరణలు ప్రవేశపెట్టారు. **కమ్యూనిస్టు పాలన అంతరించింది** (1991).

విస్తీర్ణం: 2,24,00,000 చ.కి.మీ., జనాభా: 28,57,96,000 (1988). లెనిన్‌గ్రాడ్, కీవ్, టాష్కెంట్, బాకూ, ఖర్కోవ్, విన్స్లా, నోవూ సిబిర్స్, గోర్కీ, స్వెర్డ్లోవిన్స్క్, ఇతర నగరాలు రాజధాని మాస్కో(చూ.), అధికార భాష: రష్యన్. ప్రజలు ఆయా రిపబ్లిక్‌లలోని 130 కిపైగా ఉన్న ప్రాంతీయ భాషలు మాట్లాడతారు. దేశంలో అందరూ రష్యన్ భాష మాట్లాడతారు. నాల్గింట మూడువంతుల జనాభా యూరోపియన్ రష్యాలో నివసిస్తున్నారు. దేశంలో నూరుకుపైగా జాతులవారు ఉన్నారు. ఎక్కువ మంది కాకసాయిడ్ మానవ వర్గానికి చెందినవారు పశ్చిమవైపు నివసిస్తున్నారు. మంగోలాయిడ్ మానవవర్గానికి చెందిన వారు సైబీరియా తూర్పున ఉన్నారు. యుక్రెనియన్‌లు, పశ్చిమంలో బైలో రష్యన్‌లు స్లావిక్ కూటమికి చెందిన వారు. రష్యాలోనూ వోల్గానది లోయల్లో నివసించేవారు టర్కిష్ జాతులు. ఇందులో కజక్‌లు, ఉజ్బెక్‌లు, కిర్గిజ్ వారు ఉన్నారు. రుమేనియాలో తూర్పున ఉన్నవారు మొల్డేవియన్‌లు. దక్షిణ దేశంలో స్టెప్పీలు అనబడు పచ్చికమైదానాలు, దట్టమయిన అడవులు, పర్వతాలు, ఎగుడుదిగుడు పీఠభూములు ఉన్నాయి: చూ. సైబీరియా.

రష్యాలో 4270 కి.మీ నిడివిగల లీనానది సైబిరియాలో ప్రవహిస్తాంది. ఇతర నదులు ఆమూర్ నది, ఓబ్‌నది, యెనిసే నది సైబీరియా పార్ ఇతర నదులు. అయితే ఇవి ఏడాదిలో రెండు మూడు మాసాలు తప్ప మిగతా కాలంలో ఘనీభవించి ఉంటాయి. **యూరపియన్** రష్యాలో వోల్గా నది (చూ.) పెద్దది. దీని నిడివి 3690 కి.మీ. కాస్పియన్ సరస్సు (విస్తీర్ణం 3,72,000 చ.కి.మీ.) ఆరల్ వంటివి ఉప్పు నీటి సరస్సులు. బాయకల్ మంచి నీటి సరస్సు సైబీరియాలో ఉంది. రష్యాలో ఎముకలు కొరికే చలి. నెపోలియన్, హిట్లర్ వంటి మహాయోధులు ఈ చలివల్ల ఓటమిని చవిచూడవలసి వచ్చింది. రష్యా సహజసంపద గల దేశం. సారవంతమయిన నేలలు, ఖనిజసంపద, జంతుసంపద, వృక్షసంపద గల క్షేత్రం. సాగుకు లాయఖు అయిన నేల కూడ ఎక్కువ. కొంతపంటనేల దాదాపు 16,000 ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలుగా నిర్వహింపబడుతూంది. ఒక్కొక్క ప్రభుత్వ క్షేత్రం 45,320 హెక్టార్లు ఉంటుంది. ప్రభుత్వ కమతాన్ని 'సోవోకోజీ'లు అంటారు. ఇవిగాక, మిగతా సాగునేల 32,000 సమష్టి వ్యవసాయక్షేత్రాలు కూడా నిర్వహింపబడు తూంది. వీటిని కోల్ కేజీలు అంటారు. ఒక్కొక్క కోల్ కేజీ సగటున 4,24,249 హెక్టారులు ఉంటుంది. ప్రతికోల్ కేజీ 400 కుటుంబాలకు కేటాయింపబడి ఉంటుంది. రైతులు కూలీ తీసికొనడమే గాక ఫలసాయంలోని కొంతభాగానికి కూడా అర్హులు. బార్లీ, రైధాన్యం, గోధుమ ప్రధానమయిన పంటలు. యుక్రెయిన్, నైరృతి సైబీరియాలో గోధుమ విరివిగా పండిస్తారు. మొక్క జొన్న, ప్రత్తి, ఫ్లాక్స్‌నార, ఓట్‌ధాన్యం, పొగాకు, బంగాళ దుంప, ద్రాక్ష, బీటు (పంచదార), దుంపలు ఇతర వ్యవసాయోత్పత్తులు. కాడ్, హెర్రింగ్, సాల్మన్, స్టర్జన్ చేపలు లభిస్తాయి. పాడి పరిశ్రమ, పశుపోషణ, ఉన్ని పరిశ్రమ ప్రజల జీవనోపాధులు. నేలబొగ్గు, ఇనుపరాయి, మాంగనీస్, ప్లాటినమ్, బాక్సై ట్, బంగారం, రాగి, సీసం, మెగ్నీషియం, నికెల్, పెట్రోలు, మాగ్నసైట్, ఫాస్ఫేట్ రాయి, పాదరసం, వజ్రాలు, క్రోమియమ్, ఆస్‌బెస్టాస్, మొలిబ్డినమ్, టంగ్‌స్టన్, చమురువాయువు, జింకు రష్యాలో లభించే ఖనిజసంపద. కలప సమృద్ధిగా దొరుకుతుంది. పారిశ్రామికాభ్యుదయం గాంచిన దేశం. రోదసీ యానంలో యునైటెడ్ స్టేట్స్ తరువాత ముందడుగు వేసిన దేశం.

రాసాయనిక ఎరువులు, పంచదార, కాగితం, ఉక్కు, సిమెంట్, నూలు, పట్టు, ఉన్ని, కృత్రిమ పట్టువస్త్రాలు,



ఆహార పదార్థాలు, తోలుసామగ్రి, ఎలక్ట్రికల్ పరికరాలు, విద్యుత్ పరికరాలు, యంత్ర పనిముట్లు, మోటారుకార్లు, బస్సులు, రైలుపెట్టెలు, మద్యపానీయాలు, తైలయంత్ర సామగ్రి పారిశ్రామికోత్పత్తులలో పేర్కొనదగినవి.

## రాకీ పర్వతాలు

ఉత్తర అమెరికా ఖండంలో పశ్చిమాన అలాస్కా, కెనడా, యునైటెడ్ స్టేట్స్, మెక్సికో దేశాలమీదుగా 5,120 కి.మీ. నిడివిని విస్తరించి ఉన్న బ్రహ్మాండమయిన పర్వతశ్రేణి. మధ్యమధ్య లోయలూ, పీఠభూములూ, కొండలలో ఉత్తరాన్ని హిమపాతం (స్నో), హిమఖండాలు (గ్లేసి యర్స్), దక్షిణాన్ని నిర్జల ఎడార్లు కానవస్తాయి. అయితే దక్షిణాన్ని అక్కడక్కడ 'గ్రాండ్ కాన్యన్' వంటి రమణీయమైన ప్రకృతి సుందర దృశ్యాలు ఉన్నాయి. ఈ పర్వతశ్రేణి ప్రాంతాల్లో జన సందడి పలుచగా ఉంది. రాకీ పర్వత సానువునుండి పడే జలపాతాల ఆధారంగా జలవిద్యుత్తు ఉత్పత్తి అవుతూంది. రాకీ పర్వతాల్లో మిక్కిలి ఎత్తయినది మౌంట్ లోగాన్ పర్వత శిఖరం. దీని ఎత్తు 6054 మీ.

## రాఘవ, బళ్ళారి

ప్రముఖ రంగస్థల నటుడు. అసలు పేరు రాఘవాచార్యులు. స్వస్థలం బళ్ళారి. బళ్ళారి రాఘవగా ప్రసిద్ధిపొందారు.

తండ్రి నరసింహాచార్యులు, తల్లి శేషమ్మ. 1880 ఆగస్టు 2న జన్మించారు. రాఘవ బి.ఏ., బి.ఎల్ బళ్ళారిలో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా కొంతకాలం పని చేశారు. తెలుగు, ఇంగ్లీషు, కన్నడం, హిందీ, తమిళ భాషలలో మంచి వ్యావహారిక జ్ఞానం కలవాడు. తెలుగు నాటకాలు రామదాసులో రామదాసుగా చంద్రగుప్తలో



చాణక్యుడు, ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు, చంద్రహాసలో దుష్టబుద్ధి, సుభద్రార్జునీయంలో అర్జునుడు,రోషనారలో శివాజీ, సారంగధరలో రాజరాజు సావిత్రిలో యమధర్మరాజు, ఇంకా ఇతరపాత్రలు ఆయన కీర్తిప్రతిష్ఠలను దశదిశలా వ్యాపింపజేశాయి. విదేశాలలో ఇంగ్లీషు నాటకాలలోని పాత్రలను ధరించి బ్రిటిష్ వారి ఆదరాభిమానాలు చూరగొన్న నటశిఖామణి రాఘవ. ఒథెల్లో, మేక్బెత్, హేమ్లెట్, షైలాక్ తదితర పాత్రలలో అతని అభినయనము ఆంగ్లనటులను ఆశ్చర్యంలో ముంచింది.

రాఘవ అసామాన్య నటనా కౌశల్యమునకు గాను ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 'కళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి గౌరవించింది. 1946 ఏప్రిల్ 2న రాఘవ పరమపదించారు.

## రాఘవరావు, న్యాయపతి

రేడియో అన్నయ్యగా ప్రసిద్ధుడు. ఆంధ్ర బాలానంద సంఘం సంస్థాపకుడు. బాలసాహిత్యవేత్త. బాలబాలికల శ్రేయస్సు, సాంస్కృతిక వికాసానికి తన జీవితాన్ని అంకితం చేసిన విద్యావేత్త. కళావిదుడు. రచయిత. రాఘవరావు 1905లో బరంపురంలో జన్మించారు. ఆలిండియా రేడియోలో 1939లో పిల్లల కార్యక్రమ నిర్వాహకుడుగా చేరారు. అప్పుడే ఆయన బాలల వికాసానికై తగు కార్యక్రమాలను నిర్వహించే ఆశయంతో భార్య కామేశ్వరి సహాయంతో 1940లో ఆంధ్ర బాలానంద సంఘం మద్రాసులో ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత హైదరాబాదుకు దానిని తరలించారు. 'బాల' అనే పత్రిక నడిపారు.

బాలబాలికల కోసం దంపతులు వేయికి పైగా రచనలను చేశారు. వారు రూపొందించిన పాత్రలలో పొట్టిబావ, చిట్టి మరదలు, కొంటె కిష్టయ్య, తాతయ్య, మొద్దబ్బాయి, దొడ్డమ్మ అత్యంత ప్రజాదరణ పొందాయి. జవహర్ బాలభవన్ (1966)ఆంధ్రప్రదేశ్ బాలలకాడమీ (1976)స్థాపనకు ఆయన కృషి చేశారు. బడిగంట జాతీయ బహుమతిని అందుకుంది. 1984 ఫిబ్రవరి 24న రాఘవరావు స్వర్గస్థులయిరి.

## రాజగురు

చూ. భగత్‌సింగ్

## రాజగోపాలాచారి, చక్రవర్తి

రాజాజీ అని వ్యవహారనామము. రాజనీతిజ్ఞుడు. రాజ్యతంత్రజ్ఞుడుగా ప్రసిద్ధిపొందాడు. 1935 ఇండియా చట్టం ప్రకారం 1937లో ఏర్పడిన మద్రాసు మంత్రివర్గానికి నాయకుడు, ప్రధాని (1937–39)

(ప్రీమియర్), మరల 1952–53 ఉమ్మడి మద్రాసు ముఖ్యమంత్రి, భారతదేశానికి స్వాతంత్ర్యానంతరం ప్రప్రథమ భారతీయ గవర్నర్–జనరల్ (1948–50) కేంద్రమంత్రి వర్గంలో దేశీయాంగ శాఖ (హోమ్ మంత్రి) నిర్వహించారు (1950–52). అంతకు ముందు బెంగాలు గవర్నరు (1947–48)గా కూడా వ్యవహరించారు. సేలం జిల్లాలోని హొసూరు (తోరపల్లి) ఈయన జన్మస్థానం (డిసెంబర్ 9, 1878).



న్యాయవిద్యనభ్యసించి న్యాయవాదవృత్తి చేపట్టి మొదట హోసూరులోనూ, పిదప మద్రాసు హైకోర్టున్యాయవాదిగా కొనసాగాడు. 1919నుండి భారతస్వాతంత్ర్య సమరంలోపాల్గొనడంప్రారంభించి 1921–22లో కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడైనాడు.1930లో జరిగిన ఉప్పు సత్యాగ్రహ (చూ.) కార్యక్రమంలో నాయకుడయి మద్రాసులో (నేటి తమిళనాడులోని) వేదారణ్యం శిబిరాన్ని నిర్వహించి జైలుపాలయిరి. 1937–39లో ప్రధానిగానున్న కాలంలో మద్యపాన నిషేధం, హరిజన దేవాలయం ప్రవేశం, రైతుల ఋణమాఫీ (మారిటోరియం) వంటి ప్రగతిశీల కీలక కార్యక్రమాలు చేపట్టి మన్ననలనందుకున్న మహామనీషి. ప్రధానిగా రాజీనామా చేసి రెండవ ప్రపంచయుద్ధవ్యతిరేకప్రచారం చేసినప్పుడు (1939) మరల జైలు పాలయ్యారు. అయితే ఈయన 1942లో క్విట్ ఇండియా తీర్మానముతో ఇతర నాయకులతో ఏకీభవించక వైదొలగారు. తరువాత స్వాతంత్ర్యానంతరం అనేక ప్రముఖపదవులను అలంకరించి దక్షతతో నిర్వహించాడు. 'భారతరత్న' పురస్కారం పొందారు. 'స్వతంత్ర' (1959), 'స్వరాజ్యం' పత్రికలు నిర్వహిస్తూ రామాయణం (ఇంగ్లీషు) భారతం (ఇంగ్లీషు), తమిళంలో 'చక్రవర్తి తిరుమగన్' 'వ్యాసర్ విరుందు' రచనలు చేసి సాహిత్యకారుడుగా ప్రసిద్ధిపొందిన మహనీయుడు.

## రాజతరంగిణి

చూ. కల్హణుడు

## రాజరాజ చోళుడు

చోళ రాజవంశ చక్రవర్తులలో ప్రముఖుడు. తంజావూరు రాజధానిగా చేసుకొని క్రీ.శ. 985లో చోళ సింహాసనాన్ని అధిష్టించి 1018 వరకు పాలించాడు. చేర, పాండ్య, తూర్పు చాళుక్య (వేంగీ), ఓఢ్ర దేశాల్ని జయించి బెంగాలు నుండి సింహళం (శ్రీలంక) వరకూ తన ఆధిపత్యాన్ని నిలుపుకొన్న మహావిజేత. రాజరాజ చోళుడు దేశభాషలను పోషించి స్థానిక సంస్కృతులకు రూపురేఖలు దిద్ది దేవాలయ వాస్తు శిల్ప కళను పోషించి కీర్తి గడించాడు. తంజావూరులోని బృహదీశ్వరాలయం ఈయన కాలంలో నిర్మించినదే. ఈయన పాలనలో దేశం సుభిక్షమై ప్రజలు సుఖజీవనం గడిపినట్లు తెలుస్తూంది.

## రాజ రాజ నరేంద్రుడు

మొదట బెజవాడ రాజధానిగా ఉన్న వేంగీ దేశానికి తూర్పు చాళుక్య ప్రభువు. తరువాత గోదావరికి ఉత్తరంగా ఉన్న రాజమహేంద్రవరం (రాజమండ్రి) రాజధానిగా చేశాడు. 1035–1061 మధ్య ఈ రాజు పాలించాడు. శివభక్తుడు. వైదిక ధర్మ నిష్ఠానిరతుడు. రాజరాజుగా ప్రసిద్ధి పొందిన ఈ చక్రవర్తికి వేదాలన్న ప్రీతి. సంప్రదాయ శాస్త్రాలంటే అత్యంతాభిమానం. హిందూ ధర్మాల పట్ల శ్రద్ధాసక్తులు కలవాడయి వాటిని పోషించుటకు యథాశక్తి తోడ్పడ్డాడు. అంత వరకూ దేశంలో జైన సంప్రదాయ సాహితీగాథలే ప్రాచుర్యంలో ఉండేవి. తాను పాండురాజు సంతతివాడని ఆయనకు ఒక గట్టి నమ్మకం. అందుచేత వ్యాసుడు రచించిన సంస్కృత మహాభారతా (చూ.)న్ని నన్నయ్య (చూ.)చేత తెలుగు లోనికి అనువదింప చేయడానికి కారకుడయ్యాడు.

## రాజస్థాన్

భారతదేశంలోని 25 రాష్ట్రములలో రాజస్థాన్ ఒకటి. భారత స్వాతంత్ర్యానంతరం (1947) రాజపుటానా అజ్మీర్, బికనీర్, జయపూర్, జోద్‌పూర్, ఉదయపూర్, ధోల్‌పూర్ వంటి పూర్వపు రాజసంస్థానాలు భారతదేశంలో 1948–1950 మధ్య విలీనమయి గ్రేటర్ రాజస్థాన్‌గా ఏర్పడి 1956లో భాషాప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు రాజస్థాన్ రాష్ట్రంగా రూపుగొన్నది.

విస్తీర్ణం: 3,42,239 జనాభా: 3,42, 61,862 (1981); రాజధాని: జయపూర్; అధికార భాష: హిందీ, రాజస్తానీ ప్రజల వాడుక భాష.

పశ్చిమ భాగమున థార్ ఎడారి, ఆరావళీ పర్వత శ్రేణి, చంబల్‌లోయ, దక్షిణమున లూనీనది వంటి ప్రకృతి వైవిధ్యం ఈ రాష్ట్రంలో కన్పిస్తుంది. ఇందిరా గాంధి కాలువ (రాజస్తాన్ కాలువ), బానాస్ నది, చంబల్ నది, ప్రధానమ్మయిన జలనిధులు. జొన్న, సజ్జ, మొక్కజొన్న, గోధుమ,అపరాలు, పొగాకు, చెరకు, ప్రత్తి ముఖ్యమయిన సాగుపంటలు.రాజస్తాన్ హస్త కళలకు ప్రసిద్ధి. పాలరాతి బొమ్మలు, ఆభరణాలు, ఎంబ్రాయిడరీ, మృణ్మయ పాత్రలు, ఇత్తడి పోగరు పని, ఉన్ని వస్త్రాలు, జవుళీ, పంచదార, సిమెంటు, నైలాన్ దారాలు, రాగి ధాతు సాధన ప్రధాన పరిశ్రమలు. కోటవద్ద పరమాణు విద్యుత్తు ఉత్పత్తి కేంద్రం ఉన్నది.




అజ్మీరు, ఆల్వార్, భారతపూరు, బికనీర్, జయపూర్, జోద్‌పూర్, ఉదయపూర్, చితోడ్‌గడ్, జెసల్మర్, పాలి, మౌంటు ఆబూ వాస్తుశిల్ప కళలకు ప్రసిద్ధి. జయపూర్'పింక్‌సిటీ'గా ప్రసిద్ధి. ఈ దర్శనీయ స్థలాలు కళావిమర్శకులను, వినోద పర్యాటకుల్ని విశేష సంఖ్యలో ఏడాది పొడవున ఆకర్షిస్తూ ఉంటాయి.

## రాజారామమోహన్‌రాయ్

బ్రహ్మసమాజ సంస్థ స్థాపకుడు. సంఘసంస్కర్త. మహా విద్వాంసుడు. 1772మే 21న బెంగాల్‌లో ఆయన జన్మించాడు. తండ్రి రమా కాంతరాయ్,తల్లి ఫుల్లథాక్కర్ రాణి. అరబ్బీ, పారసీకం, సంస్కృతం, ఇంగ్లీషు, హీబ్రూ భాషలలోఆయన నిష్ణాతుడయ్యాడు.హిందువుల విగ్రహారాధనను నిరసిస్తూ ఆయనఒక గ్రంథంవ్రాశారు.



ఏకధాటిగా 72 గంటలలో వాల్మీకి రామాయణాన్ని పూర్తిగా చదివిన దిట్ట. 1816లో బంగాళా గెజిట్‌కు పారసీక భాషలో ఒక వారపత్రిక 'మిరాత్–ఉల్–అక్బర్ కు ఆయన సంపాదకత్వం వహించాడు. ముఖ్యంగా ఆ కాలంలో ప్రబలి ఉన్న 'సతి' (సహగమనం) అనే దురాచారాన్ని రూపు మాపి అనేక మంది స్త్రీల జీవితాలను కాపాడిన గొప్ప సంఘసంస్కర్త రాజారామమోహన్‌రాయ్. కులాంతర వివాహాలు, స్త్రీ పునర్వివాహాలు వంటి సాంఘిక కార్యక్రమాలనుద్దేశించి 1828లో 'బ్రహ్మసభ'ను ఆయన స్థాపించారు. అదే తరువాత బ్రహ్మసమాజం(చూ.)గా మారింది. 1833 సెప్టెంబరు 27న ఆయన స్వర్గస్తులయారు.

## రాజీవ్ గాంధీ (1944–1991)

భారత ప్రధాని (1984–89). ఇందిరా గాంధీ (చూ.) జ్యేష్ఠపుత్రుడు. జవహర్‌లాల్(చూ.)కు దౌహిత్రుడు. 1944 ఆగస్టు 20న జన్మించిన రాజీవ్ డూన్ స్కూల్ లోనూ, కేంబ్రిడ్జ్‌లోనూ చదివాడు. కేంబ్రిడ్జ్ లోనే ఇంజనీరింగ్ శిక్షణపొంది డిగ్రీతీసుకోకుండా స్వదేశానికి తిరిగివచ్చి ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో పైలట్ అయ్యాడు. కేంబ్రిడ్జ్‌లో చదువుతుండగా ఇటలీవాసి సోనియాను ప్రేమించి వివాహమాడాడు. తన తమ్ముడు సంజయ్ మరణానంతరం (1980) లోక్‌సభ సభ్యుడై తల్లి మరణానంతరం (అక్టో. 31, 1984) భారతప్రధాని అయ్యాడు. 1984 డిసె. సార్వత్రిక ఎన్నికలలో అత్యధిక మెజారిటీ సాధించి మరల ప్రధాని అయ్యాడు (1984–89). తల్లి, తాతగార్లు అనుసరించిన రాజనీతినే (అలీన విధానం,విదేశాంగనీతి,ఆర్థిక విధానం)చేపట్టి పేద జనోద్ధరణకై అనేక కార్యక్రమాలను అమలు పరచాడు. డిసె. సార్వత్రిక ఎనికల్లో 1989లో ఎన్నికల్లో గెలిచాడు. కాని 1991 మధ్యంతర ఎన్నికల్ల ప్రచారసభలో రాజకీయ హత్యకు గురి అయ్యాడు (మే 21, 1991).



## రాజేంద్రప్రసాద్

భారత గణరాజ్యానికి (ఇండియన్ రిపబ్లిక్) తొలి రాష్ట్రపతి (1952–62). భారత స్వాతంత్ర్య

సమరయోధులలో ప్రముఖుడు. జాతీయ వాది. బీహారు లోని శరణ్ ప్రాంతమున సెప్టెంబరు 3,1888లో జన్మించాడు. 1917లో గాంధీ అనుచరు డయ్యాడు. 1920లో లాభసాటి న్యాయవృత్తిని త్యాగంచేసి స్వాతంత్ర్య సమరంలో దూకాడు. 1934, 1939లో కాంగ్రెసు అధ్యక్షుడు అయ్యాడు. 1942లో క్విట్ ఇండియా (చూ.)ఉద్యమంలో పాల్గొని ఇతర నాయకులతో బాటు రాజకీయ ఖైదీ అయి కారాగారవాసం 1945 వరకూ అనుభవించాడు. భారత రాజ్యాంగం సిద్ధపరుచుటకు ఏర్పాటయిన రాజ్యాంగ పరిషత్తుకు అధ్యక్షు డయ్యాడు.



తరువాత 1950లో తొలి రాష్ట్రపతి అయి 12 సంవత్సరాలుభారతదేశంలోప్రజాస్వామ్య సత్‌సంప్రదాయాలను ప్రవేశపెట్టుటలో విశేష కృషిచేసి అందరి ప్రశంసలందు కొని,1963 ఫిబ్ర.23న పాట్నాలోకీర్తిశేషుడయ్యాడు.

## రాజ్యసభ

చూ. పార్లమెంట్

## రాణా ప్రతాపసింగ్

రాజపుత్ర యోధుడు. పరాక్రమవంతుడు.మేవాడ్ ప్రభువు రాణా ఉదయసింగ్ కుమార్డు. అక్బర్ మేవాడ్ రాజధాని చిత్తోడ్‌ను కైవసం చేసుకొనగా ఉదయసింగ్ ఉదయపూరును రాజధానిగా చేసికొని పాలన ప్రారంభించాడు (1527). తరువాత అక్బర్ కుమారుడు సలీం హాల్దీఘాట్ వద్ద ప్రతాపసింగ్‌తోతలపడగా ఓటమికి గురిఅయ్యాడు. చివరకు అక్బర్ జీవించియుండగనే ప్రతాపసింగ్ సాహసపరాక్రమములు ప్రదర్శించి జయము నొంది మేవాడ్ రాజ్యమును పునఃస్థాపించాడు. ఈతడు 1597లో మరణించెను.

## రాధాకృష్ణన్, సర్వేపల్లి

భారత గణతంత్ర రాజ్యానికి రెండవ రాష్ట్రపతి (1962–67). సుప్రసిద్ధ దార్శనిక వ్యాఖ్యాత. అసాధారణ మేధావి. విద్యావేత్త. దౌత్యవేత్త. రాజనీతిజ్ఞుడు. 1888 సెప్టెంబర్ 5న తిరుత్తనిలో తెలుగు కుటుంబమున జన్మించాడు. ఈయన జయంతి (సెప్టె.5) 'ఉపాధ్యాయ దినము'గా దేశ వ్యాప్తంగా పాటింతురు (చూ.). ఆనాడు విద్యార్థులు 'గురుపూజ' చేసి ఆయన మేధా కృషికి నివాళులు అర్పింతురు.



మద్రాసులోని క్రిష్టియన్ కాలేజీలో విద్యాభ్యాసంచేసిన రాధాకృష్ణ పండితుడు, ప్రెసిడెన్సీ కాలేజీ (మద్రాసు), మైసూరు(1918) కలకత్తా యూనివర్శిటీలలో తత్త్వపీఠాల్ని అధిష్ఠించి పేరు ప్రఖ్యాతులు గడించాడు. తరువాత 1929 లండన్‌లోని ఆక్స్‌ఫర్డుయూనివర్శిటీలో తత్వాచార్యునిగా నియమితుడైనాడు. ఆంధ్రాయూనివర్శిటీ (1931–36)బెనారసు హిందూ యునివర్సిటీ (1939–48)లకు వైస్ ఛాన్సలరు అయ్యారు. తరువాత భారతరాజ్యంగ విధాన పరిషత్తు (1948) సభ్యునిగా రాజనీతి పాండిత్యాన్ని ప్రతిఫలించే ఉపన్యాసములు చేసి సదస్యులను ముగ్ధుల్ని చేశారు. సోవియట్ రష్యాలోని భారత రాయబారిగా స్టాలిన్‌ను ప్రత్యక్షముగ కలిసి సంభాషించిన ఏకైక భారతీయుడుగా ప్రసిద్ధి పొందెను. ఆయన మహావక్త. ఆయనే చేసిన ఉపన్యాసాల్లో స్పష్టత ఉట్టి పడుతూ ఉంటుంది. ఈయన రచనలలో 'ఇండియన్ ఫిలాసఫీ', 'ధర్మపథం' పై వ్యాఖ్య, 'నాగరకత భవిష్యత్తు' ప్రముఖమయినవి; విశ్వవిఖ్యాతి గడించినవి. ఇంత వైభయోపేతమయిన కృషి సల్పిన ఈ మహా మనీషి 1975 ఏప్రిల్ 17న మద్రాసులో కీర్తిశేషుడయ్యాడు. హైదారాబాదులోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళా ప్రాంగణమున సర్వేపల్లి రాధాకృష్ణన్ శిల్ప విగ్రహం ప్రతిష్ఠించి గౌరవించారు.

## రానడే, మహదేవ గోవింద

భారతీయ విద్వాంసుడు, తత్త్వవేత, గోపాలకృష్ణ గోఖలే గురువు.జనవరి 1842లో జన్మించాడు.భారతీయ తత్త్వబోధన ప్రధాన ఆశయంగా పెట్టుకొని దేశభక్తిని గురించి దేశం కోసం త్యాగం చేయవలసిన అవసరాన్ని

గురించి ఆయన బోధిస్తూ ఉండేవాడు. హేతువాది అనీ, నాస్తికుడు అనీ పలువరు విమర్శించినప్పటికీ లెక్క చేయక, భారతీయుల ఆత్మగౌరవం పెంపొందింప చేయడానికి ఎందరో పండితులను, యువకులను ఆయన ప్రోత్సహించేవాడు. గోపాలకృష్ణ గోఖలే ఈయన శిష్యుడు.

## రామకృష్ణకవి, తెనాలి

అష్టదిగ్గజ (చూ.) కవులలో వికటకవి. 16వ శతాబ్దంలో కృష్ణదేవరాయలవారి ఆస్థానంలో ఉండేవాడు. ఈ కవిపేర 'తెనాలి రామకథలు' అని ప్రచారంలో ఉన్నాయి. తెనాలి రామకృష్ణుని 'పిల్లి వేడిపాలు', 'గూని చాకలి' వంటి అనేక హాస్యకథలు ఆబాల గోపాలానికి నవ్వు పుట్టిస్తాయి. ఈ కవి చమత్కారంతో హాస్యం ఉట్టిపడుతూ అందరినీ నవ్విస్తూ ఉంటుంది. ఈయన వ్రాసిన ప్రబంధ కావ్యాలు మహాప్రౌఢ కావ్యాల కోవకు చెందుతాయని పండితుల అభిప్రాయం. 'ఉద్భటారాధ్య చరిత్ర', 'ఘటికాచల మహత్మ్యం', 'పాండురంగ మహత్మ్యం' ఈయన రచనలలో ప్రసిద్ధిచెందినది. ఈయన కవిత్వంలో ఉక్తివైచిత్ర్యం, మాధుర్యం, సౌకుమార్యం ఎక్కువ అని విజ్ఞుల అభిప్రాయం. పాండురంగ మహత్యంలో నిగమశర్మో పాఖ్యానంలో ఈయన మలచిన 'నిగమ శర్మ' పాత్రను ప్రశంసనీయమైనదిగా కొనియాడతారు.

## రామకృష్ణ పరమహంస 1836–1886

జగత్ ప్రసిద్ధి పొందిన ఆధునిక భారతీయ ప్రవక్త. వివేకానంద స్వామికి గురువు. బెంగాల్ రాష్ట్రంలో కమీర్‌పుకర్ గ్రామంలో 1836 ఫిబ్రవరి 18న రామకృష్ణ పరమహంస జన్మించినారు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు గదాధర ఛటర్జీ. బాల్యం నుంచి వైరాగ్యంతో,



తత్త్వ జిజ్ఞాసతో గడిపేవాడు. రాణీ రాస్మణీదేవి కలకత్తా సమీపంలోని దక్షిణేశ్వరంలో కట్టించిన కాళి కాలయంలో తన 18వ ఏట పరమహంస పూజారిగా జీవితం ప్రారంభించాడు. దిన మంతాపూజలతోధ్యానంతో గడుపుతుండేవాడు. కాళీ దర్శనంకోసం పరితపించి పోతుండేవాడు. ఒకనాడు ఒక ఉపాసిక దక్షిణేశ్వరానికి రాగా ఆమె దర్శనం చేసుకొని ఆమెను గురువుగా స్వీకరించి ఆమె ఉపదేశానుసారం సాధనచేసి అనతి కాలంలోనే జ్ఞానోదయం పొందాడు. చిన్నతనంలోనే ఆయనకు వివాహం అయింది. కాని భార్య శారదాదేవిని ఆయన ఎప్పుడూ తన తల్లిగానే భావించాడు. భర్త ఆధ్యాత్మిక సాధనలో శారదాదేవి ఆయనకు తోడుగా నిలిచింది. గురువు రామకృష్ణ పరమహంస ఆదేశాన్ననుసరించి వివేకానంద స్వామి(చూ.) సర్వమత సామరస్యాన్ని ప్రపంచం అంతటా చాటాడు. 1886 ఆగస్టు 16వ రామకృష్ణ పరమహంస సిద్ధిపొందారు.

## రామకృష్ణారావు, బూర్గుల

హైదరాబాదు రాష్ట్ర చివరి ముఖ్యమంత్రి, ప్రజానాయకుడు. రాజనీతి వేత్త, రచయిత, న్యాయవాది, ఉర్దూ, పారసీకం, తెలుగు, ఇంగ్లీషు భాషలలో పండితుడు.



మహబూబ్‌నగరం జిల్లా పడకల్లు గ్రామంలో నరసింగ రావు, రంగనాయకమ్మ దంపతులకు 1899 మార్చి 13న రామకృష్ణారావుజన్మించాడు. స్వగ్రామం అదే జిల్లాలోని బూర్గుల. బి.ఏ.ఎల్.ఎల్.బి., పట్టా పొందిన రామకృష్ణరావు హైదరాబాదులో న్యాయవాద వృత్తి చేపట్టి పేరు ప్రఖ్యాతులార్జించారు.

నిజామ్ రాష్ట్రంలో ఆంధ్రోద్యమంలో ప్రముఖ పాత్రవహించి 1931లో జరిగిన రెండవ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు అధ్యక్షులైనారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అరెస్టయినారు. హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో చేర్చాలనే ఉద్యమంలో ప్రముఖ పాత్రవహించి అరెస్టయినారు. రామకృష్ణరావు రెవిన్యూ మంత్రిగా ఉండగా వినోభాబావే ప్రారంభించిన భూదానోద్యమానికి (1954)చట్టబద్ధ

స్థాయిని కల్పించడమేగాక తానుకూడా కొంత భూమిని దానం చేశారు.

1952 నుండి 1956 వరకు హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి పదవిలో ఉన్న రామకృష్ణరావు రాష్ట్రంలో ప్రజాస్వామ్య వ్యవస్థకు గట్టి పునాదులు వేశారు. విశాలాంధ్రకై కృషి చేశారు. 1956 తరువాత కేరళ, ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా పనిచేశారు. పారసీకమూలం నుండి ఉమర్ ఖయ్యాం రుబాయీలను సంస్కృత లహరులను తెనిగించారు. 1967 సెప్టెంబరు 14న కన్ను మూశారు.

## రామదాసు 17 శతా.

ప్రసిద్ధ వాగ్గేయకారుడు. రామభక్తుడు, కవి.

కంచర్ల లింగనమంత్రి, కామాంబ దంపతులకు జన్మించిన ఏకైక పుత్రుడు. నేలకొండపల్లి గ్రామనివాసి. అసలు పేరు కంచర్ల గోపన్న. చిన్న తనము నుండి రామ భక్తితత్పరుడై రామతారక మంత్రోపదేశం పొందాడు.

రామదాసుకి అక్కన్న– మాదన్న అనే ఇద్దరు మేనమామలు ఉండేవారు. వారు తానీషా (చూ.) కొలువులో ఉన్నతాధికారులు. వీరి సహాయంతో రామ దాసు భద్రాచలానికి తహసీల్దారుగా నియమింపబడ్డాడు.

తహశీల్దారుగా ఉండగా తాను వసూలు చేసిన శిస్తుపైకం సర్కారువారికి కట్టకుండా భద్రగిరి శ్రీరామా లయ పునర్నిర్మాణానికి, గోపురప్రాకారాలు, శ్రీ సీతారామ లక్ష్మణుల విగ్రహాలకు, ఆభరణాలకు, నిత్యోత్సవాలకు వెచ్చించినందున రాజధనాపహరణ నేరంపై కారాగృహ మున బంధితుడై పన్నెండు ఏళ్లు ఎన్నో హింసలకు గురియై



శ్రీ రామచంద్రుడ్ని ప్రార్థి స్తూ అనేక కీర్తనలూ రచించి పాడు కున్నాడు. "పలుకే బంగారమాయెనా కోదండ పాణి", 'తక్కువేమి మనకు రాముండొక్కడుండువరకు' 'ఏ తీరుగనను దయచూచె దవో', 'నన్నుబ్రోవమని చె ప్పవే' మొదలైన దాదాపు వందవరకు రామదాసురచిం చిన కీర్తనలున్నాయి. (చూ. భద్రాచలం).

## రామప్ప గుడి

కాకతీయ సామ్రాజ్యం గణపతి దేవుడు కాలంలో ఆయన గజసాహిణి రేచర్ల రుద్రుడు నిర్మించిన (క్రీ.శ.1213) ప్రసిద్ధ శైవాలయం. వాస్తుశిల్ప శిల్ప సంపదకు సుప్రసిద్ధమైనదిగా పేరొందింది. ఆంధ్రప్రదేశ్‌లో వరంగల్లుకు సుమారు 70 కి.మీ. దూరంలో ఉన్న పాలంపేటలోని రామప్ప చెరువు ప్రక్కన ఉండుటచే దానిని 'రామప్ప గుడి' అంటున్నారు. ఈ గుడిలోని మూర్తి రుద్రేశ్వరుడు. దేవాలయ వాస్తు 'ద్రావిడ—నాగర' మిశ్ర సంప్రదాయానికి చెందినది. ఆలయ ప్రాంగణంలో తూర్పున ఉన్న మండపం సుమారు 13 మీ. చతురస్రం. ఇందున్న నాలుగు స్తంభాలు రమ్యమైన శిల్పకళా ఖండాలతో తీర్చిదిద్దబడ్డాయి. 6 మీ. ఎత్తున్న నాలుగు స్తంభాలూ నవరంగ స్తంభాలని వ్యవహరిస్తారు. రెండు చిన్న గుడులు, ఒక నంది మండపం ఉన్నాయి. నంది ఏకశిల నల్లరాతి నుండి చక్కగా మలచబడింది. గుడి బయటి గోడలు, స్తంభాలు, గజబంధ, వజ్రబంధాది శిల్పాలు, నట్టువలు, దేవతలు, గాయకులు వంటి శిల్ప మూర్తులచే అలంకరింపబడి ఉన్నాయి. మండపం లోపల పైకప్పు కమ్మీలపై శివలీలలు భాగవత, భారత పురాణాల నుండి త్రిపుర సంహారం, గోపికా వస్త్రాపహరణం, రాసక్రీడా శిల్పాలు, యోధుల శిల్పాలు, గజాసుర సంహారం, క్షీరసాగర మథనం వంటి ఘట్టాలను నల్లరాతిని చక్కగా సునిశితంగా మలచి అమర్చారు. గుడి అంతా పద్మ లతాదులచే అలంకరించారు. రామప్ప గుడి వెలుపల స్తంభాలపై పొదిగి అమర్చిన సుందర శిల్పాలు నాసికా ప్రతిమలు (నృత్య భంగిమలు)కళా విమర్శకులనే కాక సామాన్య ప్రజను కూడా విశేషంగా ఆకర్షిస్తున్నాయి. వీటిలో కొన్ని, నాట్యభంగిమలలో ఉన్న కన్యామూర్తులవి. మరికొన్ని, గజవ్యాళ మూర్తులవి. ప్రసిద్ధ శిల్ప ఆగమగ్రంథం 'శిల్ప ప్రకాశము'న ప్రస్తావించిన అలసా కన్యలకు ప్రతిరూపాలే ఈ



అలసాకన్య — నాగిణి

నాగినీ నర్తకీ మూర్తుల భంగిమలని విజ్ఞుల అభిప్రాయం.

## రామమూర్తి, కోడి 1885–1938

'మల్లమార్తండ', 'అభినవభీమ', 'మల్లరాజు తిలక్', 'కలియుగ భీమ', 'జగదేకవీరుడు' 'వీరకంఠీరవ' ఇత్యాది బిరుదాంకితులైన కోడి రామమూర్తి శ్రీకాకుళం జిల్లాలోని వీరఘట్టంలో 1885 జూలై 5న జన్మించాడు.

మద్రాసులో వ్యాయమ ఉపాధ్యాయుడుగా ఉద్యోగంలో చేరిన రామమూర్తి ఒకనాడు 200 ఏళ్ళకు పై బడిన వయస్సుగల సీతారాంబాబా అనే యోగిని దర్శించి ఆయన వద్ద ప్రాణాయామాన్ని నేర్చుకున్నారు. బరం పురంలో ఒక సర్కస్ జరుగుతూ ఉండగా అక్కడ, పులి బయట పడి ప్రేక్షకులలో జొరబడింది. ప్రేక్షకులలో కలకలం చెల రేగింది. అంతలో బలాఢ్యుడైన కోడి రామమూర్తి ముందుకు వచ్చి ఆ పులిని పట్టి బోనులో బంధించాడు. తుని రాజు రామమూర్తిని పిలిపించి సన్మానించి తన సర్కస్ కంపెనీని ఆయనకు అప్పగించాడు. ఆ కంపెనీని సమర్థవంతంగా నడుపుతూ రామమూర్తి ప్రపంచప్రఖ్యాతి నార్జించాడు. సర్కస్ కంపెనీలో నిండుగా మనుష్యులతో నింపిన రెండు ఎడ్లబళ్ళను ఏకకాలంలో మోయడం, 400 కి.గ్రా. బరువుగల రాతి బండను ఛాతీపై పెట్టించుకొని దానిపై కొట్టించుకోవడం, ఇనుప గొలుసు లను తెంపడం, రోడ్డురోలరును ఛాతీపై లాగించడం, మూడున్నర టన్నుల బరువుగల ఏనుగును తన రొమ్ముమీద ఎక్కించుకోవడం వంటి అద్భుతమైన కార్యాలు ప్రదర్శించేవాడు. మల్లయుద్ధంలో ఆయనకు సాటి ఎవరూ లేరు. ఆయన సంపాదించిన ధనాన్ని



కవులకూ పండితులకూ ధర్మసంస్థలకూ దానం చేశాడు. చివరిదశలో ఆయన, ఆర్థిక దుస్థితికి లోనుకావడంతో మదన్ మోహన్ మాలవీయా ఆయనను పిలిపించి ఉద్యోగమిచ్చి ఆదరించారు. 1938లో వీరఘట్టంలో కోడి రామమూర్తి కాలధర్మం చెందాడు.

## రామమూర్తి, గిడుగు వెంకట

ఆధునిక తెలుగు వైతాళికులలో ఒకరు. తెలుగు భాషాశాస్త్రవేత్త.వాడుకభాష ఉద్యమంలో'గిడుగు పిడుగు' అనిపేరువచ్చింది.1863 ఆగస్టు 29న శ్రీకాకుళం జిల్లా పర్వతాల పేటలో జన్మించారు. తన 12వ ఏట తండ్రి వీర్రాజు మరణించడంతో రామమూర్తి విజయనగరంలో తనమేనమామ ఇంట ఉండి విద్యాభ్యాసం కొనసాగించారు. గురజాడ అప్పారావు రామమూర్తికి సహాధ్యాయి. అప్పట్లో పుస్తకాలలో గ్రాంథిక భాష వాడుతూ ఇంట్లో వాడుక



భాషను వాడుతూ ఉండేవారు. పుస్తకాలలో ఉపయోగించే భాష, మాట్లాడేభాష ఒకే విధంగా ఉండాలని వాదిస్తూ దాని కోసం ఆయన ఒక గొప్ప ఉద్యమం నడిపారు. ఆ ఉద్యమ ఫలితంగానే ఈనాడు పత్రికలలోనూ సినిమా మాటలనూ, పాటలలో, రేడియో_ టెలివిజన్‌లోనూ పాఠ్య గ్రంథాలలోను వ్యావహారిక భాష ఉపయోగంలోకి వచ్చింది.

సవర భాషకు ఒక లిపి ఏర్పాటుచేసి సవర రచనలు సేకరించడానికీ, సవర భాషా నిఘంటువు, సవర భాషా వ్యాకరణం వ్రాయడానికి రామమూర్తి చేసిన కృషి గణనీయమైనది. 1933 లో భారతదేశ ప్రభుత్వం రామ్మూర్తి చేసిన గణనీయమైన కృషికి కైజర్–ఇ–హింద్ బంగారు పతకాన్ని ఇచ్చి గౌరవించింది. 1913లో వీరికి 'రావుసాహెబ్' బిరుదును ప్రభుత్వం ఇచ్చింది. 1938లో ఆంధ్రా విశ్వవిద్యాలయం వారు వీరికి 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చి గౌరవించారు. వీరి కుమారుడు గిడుగు వెంకట సీతాపతి కూడ భాషాసేవ కొనసాగిస్తూ తెలుగు భాషాసమితి(1947–86) నిర్మించిన 'విజ్ఞాన సర్వస్వా'నికి ప్రధాన సంగ్రాహకులుగా పనిచేశారు(1947–58). 1940 జనవరి 22న రామమూర్తి మద్రాసులో దివంగతులయారు.

## రామరాజభూషణుడు చూ.భట్టుమూర్తి

## రామలింగారెడ్డి, కట్టమంచి

పరిపాలనా దక్షుడు. బహుభాషా పండితుడు. రాజకీయవేత్త. రచయిత, సాహిత్య విమర్శకుడు, విద్యావేత్త. చిత్తూరు జిల్లా కట్టమంచిలో 1880 డిసెంబరు 10వ జన్మించారు. మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో బి.ఏ.డిగ్రీ పొంది ప్రభుత్వ స్కాలర్‌షిపుతో కేంబ్రిడ్జిలో ఉన్నత విద్యను అభ్యసించెను. తర్వాత అమెరికా వెళ్ళి విద్యాపరిశ్రమ కొనసాగించి తిరిగివచ్చి బరోడా కాలేజి వైస్ ప్రిన్సిపాల్‌గాను అటు పిమ్మట మైసూరు ప్రభుత్వ విద్యాశాఖ అసిస్టెంట్ ఇన్స్‌పెక్టరు–జనరల్‌గాను మైసూరు మహారాజా కళాశాలలో ప్రొఫెసరుగాను పనిచేశారు. విద్యా విషయక పరిజ్ఞానం కోసం కెనడా, ఫిలిప్పీన్స్, జపాన్ దేశాలలో పర్యటించి వచ్చి మైసూరు మహారాజా కళాశాల ప్రిన్సిపాలై, తర్వాత మైసూరు విద్యాశాఖ ఇన్స్‌పెక్టర్– జనరల్ అయినారు.



కొంతకాలం రాజకీయాశాలలో కొనసాగారు. 1926 లో స్థాపించిన ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఆయన ప్రథమ ఉపాధ్యక్షుడైనారు. రామలింగారెడ్డి తన ప్రతిభా వ్యుత్పత్తులను ప్రదర్శించి దేశంలోనే ఆంధ్రవిశ్వవిద్యాలయాన్నిఆదర్శవిద్యాసంస్థగా తీర్చిదిద్దారు.నాటి నిజాము, తిరువాన్కూరు ప్రభువుల నుండి సైతం ధనం సంపాదించి విశ్వవిద్యా లయ అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. మద్రాసు యూనివర్సిటీ తరపున రెండు పర్యాయాలు శాసనసభకు, చిత్తూరు జిల్లానుండి 1935 లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగా ఎన్నికైనాడు.ఆయన రచించిన'ముసలమ్మ మరణం' ఉత్తమ సాహిత్య రచన, 'కవిత్వతత్త్వ విచారం' తెలుగులో ప్రసిద్ధ విమర్శ గ్రంథము. 1951 ఫిబ్రవరి 24న రామలింగారెడ్డి పరమపదించారు. ఆయన శిల్పవిగ్రహాన్ని హైదరాబాదు లోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ప్రతిష్ఠించి గౌరవించారు.

## రామస్వామి, త్రిపురనేని 1886–1943

హేతువాది. 'కవిరాజ' బిరుదాంకితుడు. తెలుగు దేశంలో భావ విప్లవానికి దోహదం చేసి హేతువాద ఉద్యమాన్ని ప్రారంభించిన ఈ మహనీయుడు కృష్ణాజిల్లా అంగలూరులో 1886లో జన్మించాడు. బందరు, గుడివాడ పట్టణాల్లో చదువుకొని లండన్ వెళ్లి బారిస్టరు అయి న్యాయవాద వృత్తిని చేపట్టి కొన్నాళ్లు నిర్వహించాడు. తెనాలి పురపాలక అధ్యక్షులుగా(1926–28)ఎన్నిక అయి అనేక ప్రజాహిత కార్యాలు చేపట్టాడు. ఆనాటి భావకులకు, పండితులకు, కవులకు ఆయన ఇల్లు ఇష్టాగోష్టి కేంద్రంగా ఉండేది. కుల వ్యవస్థను వ్యతిరేకించి సమ సమాజ నిర్మాణం చేయుట ఆయన ఎన్నుకున్న కార్యక్షేత్రం. వేశ్యావృత్తి నిర్మూలనకు సంస్కరణోద్యమం చేపట్టి సాగించాడు. భారత స్వాతంత్ర్య పోరాటంలో ప్రజలను చైతన్యం చేయడానికి ఉప్పు సత్యాగ్రహ సమయంలో ''వీర గంధము తెచ్చినారము వీరులెవ్వరో తెలుపుడీ'' వంటి దేశభక్తి గేయాలు రచించి నవజాగృతికి తోడ్పడ్డాడు. అంతకుముందు 1911లో విద్యార్థి దశలోనే 'రాణా ప్రతాప్', 'కురుక్షేత్రం' నాటకాలు వ్రాశారు. తరువాత 'ధూర్త మానవ శతకం'లో కులం పేరిట జరుగుతున్న అన్యాయాలను ఎత్తిచూపాడు. 'కొండవీటి సామ్రాజ్య పతనం', 'కారెంపూడి యుద్ధం' వంటి చరిత్ర ప్రధానమైన గ్రంథాలు కూడా అందించాడు. ఈయన శిల్ప విగ్రహం హైదరాబాదులోని తెలుగువెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో చోటుచేసుకుంది.



## రామానుజాచార్యులు 1019-1139

విశిష్టాద్వైత మత ప్రవక్త. శ్రీ వైష్ణవ మతాచార్యులలో ప్రముఖుడు. ఉడైయవరులు, యతిరాజు అనికూడా ఆయనను అంటారు.

రామానుజాచార్యులు క్రీ.శ. 1019 ప్రాంతంలో దక్షిణ భారతదేశంలో ఉన్న శ్రీపెరుంబుదూరు అనే గ్రామంలో జన్మించాడు. కంజీవరం (కంచి)లో యాదవ ప్రకాశుడనే అద్వైత పండితునికి శిష్యుడై వేదాధ్యయనం లోను, వేదార్థ ప్రవచనంలోను ఆరితేరాడు. చిన్ననాడే వివాహం అయింది. కాని భార్య అనుకూలవతి కాదు. కొంతకాలం వైవాహిక జీవితం గడిపి తరవాత రామానుజులు సన్యసించి శేషజీవితం విశిష్టాద్వైత మత ప్రచారంలో గడిపారు. ఎందరో ఈయనకు అనుయాయులు అయ్యారు. విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా బ్రహ్మ సూత్రాలకు ఆయన భాష్యం వ్రాశాడు. వేదాంత సారం, వేదాంతసంగ్రహం, వేదాంత దీపం, ఆయన ఇతర తాత్త్వికరచనలు. భగవద్గీత మీదకూడా భాష్యం వ్రాసి కాశ్మీరు సరస్వతీ పీఠంలో తత్త్వవేత్తల మహా సభలో చదివి వినిపించారు. రామానుజులు వ్రాసిన బ్రహ్మ సూత్ర భాష్యాన్ని 'శ్రీ భాష్యం' అంటారు. 'గద్యత్రయం' మొదలైన భక్తిప్రధానమైన రచనలు చాల చేశారు. భారతదేశం అంతటా పర్యటించి విశిష్టాద్వైత మతాన్ని దేశంలో సుస్థిరం చేశారు. 108 దివ్య తిరపతులు అను వైష్ణవ పుణ్యక్షేత్రాలను ప్రతిష్ఠచేసి తన అనుచరులలో పరిణతు లైనవారిని 74 మందిని పీఠస్థులుగా నియమించి, విశిష్టా ద్వైత మత ప్రచారానికి విశేష కృషి చేశాడు. 120 ఏండ్లు నిండు జీవితం గడిపి 1139 లో రామానుజులు పరమపదించాడు.



# రామాయణం

ఆదికావ్యంగా ప్రసిద్ధి పొందిన ఐతిహాసిక మహాగ్రంథం. వాల్మీకి (చూ.) రామాయణ గ్రంథకర్త. శ్రీరాముడు (చూ.) వాల్మీకి సమకాలీనులని ఒక ఐతిహ్యం. గర్భవతి అయిన సీత(చూ.)ను రాముడు అడవిలో వదలి పెట్టివేయిస్తాడు. అప్పుడు సీత వాల్మీకి ఆశ్రమంలోనే ఉండి కుశలవులను ప్రసవిస్తుంది. ఈ వాత్సల్య సంబంధమే వాల్మీకిని రామాయణం వ్రాయడానికి స్ఫూర్తి నిచ్చింది. రామాయణాన్ని (కాండ బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ, ఉత్తర)లలో 24,000 శ్లోకాలలో వాల్మీకి పూర్తిచేశాడు. తనతో ఉన్న కుశలవులకు వాల్మీకి నేర్పించగా, శ్రీరాముడు అశ్వమేధయాగం చేస్తున్న సమయంలో ఆ బాలురిరువురూ రామకథను చక్కగా ఆలాపించారు. క్రీ.పూ. 800 ప్రాంతంలో రామాయణం ఆదికూర్పు జరిగిందని చెబుతారు. అయితే ఆచార్య కే కీత్ పండితుని లెక్క ప్రకారం రామాయణం క్రీ.పూ. 300 ప్రాంతంలో కూర్చబడినట్లు చెబుతున్నారు. వాశిష్ఠరామాయణం (జ్ఞాన వాశిష్ఠం) అద్భుత రామాయణం (27 కాండలు) సీతా విజయం రామాయణ గ్రంథభేదాల్లో కొన్ని సంస్కృతంలో ఉన్న మరొకటి ఆధ్యాత్మిక రామాయణం బ్రహ్మాండ పురాణం నుండి గ్రహించబడింది. ఆనంద రామాయణంలోనూ, మూల రామాయణంలోనూ హనుమంతుని ప్రశంస కానవస్తోంది. రామాయణమందలి పాత్ర పోషణ, వర్ణన సౌందర్యం, లోకోక్తి చాతుర్యం అనన్య సాధారణమైనవిగా కొనియాడబడుతున్నాయి.

ఉత్తర భారతదేశంలో మహాకవి తులసిదాసు (చూ.) రామచరితమానస్ పేర రామకథను హిందీ భాషలో చెప్పారు. అటులనే దక్షిణాదిని కంబకవి (చూ.) రామాయణాన్ని తమిళంలో మహాకావ్యంగా రచించాడు. తెలుగు రామాయణాన్ని రచించిన మొల్ల (16వ శతాబ్ది) కవితల్లిన తొలి తెలుగు విదుషీమణిగా కీర్తి గడించింది. తెలుగునాట రామాయణ సంప్ర దాయం ప్రజలలోనికి చొచ్చుకుపోయినట్లు కానవస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో భద్రాచలమూ(చూ.) తమిళనాడులో రామేశ్వరమూ (చూ.) సుప్రసిద్ధ రామాలయాలు. రామదాసు (చూ.), త్యాగయ్య(చూ.), కబీరు(చూ.) వంటి ప్రముఖ వాగ్గేయకారులు రామకీర్తనలు రచించి పాడారు.

రామాయణంలోని పాత్రల ప్రవృత్తులు (పితృవాక్య పాలన, సత్య వాక్కు్పాలన, భార్యాప్రేమ, ఏకపత్నీవ్రతం, పతివ్రతాధర్మం) భారతీయ ప్రజల వ్యక్తిగత శీలజీవితాలపై ప్రగాఢ ముద్రలు పడ్డాయి. తెలుగులో గోన బుద్ధారెడ్డి (13వ శతా.)వ్రాసిన రంగనాథ రామాయణం, గోపీనాథ రామాయణం (19వ శతా) ప్రముఖ రచనలు. 20వ శతాబ్దంలో విశ్వనాథ సత్యనారాయణ (చూ.)వ్రాసిన

శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి జ్ఞానపీఠ (చూ.) పురస్కారం (1970) లభించింది.

బాలకాండ పుత్రకామేష్టియాగం, విశ్వామిత్ర కోరికపై దండకారణ్యంలో తాటక వధ, రాక్షస సంహారం, అహల్యా శాపవిమోచనం, శివధనస్సు, సీతారాముల కళ్యాణం, అరణ్యపర్వం, మంథర—కైకేయి ప్రహసనం, రామవన గమనం, చిత్రకూటం, పంచవటి, జటాయువుకథ, శూర్పణఖ ముక్కు, చెవులు కోయుట, మారీచుని (బంగారు లేడి)కథ, రావణుడు సీతను ఎత్తుకుని పోవుట, జటాయువధ, శబరికథ, కిష్కింధకాండ, హనుమంతుని ద్వారా సుగ్రీవ మైత్రి, వాలిసంహారం, సుగ్రీవ పట్టాభిషేకం, సుందరకాండ (సీతాన్వేషణ, చూడామణి ప్రదానం, లంకాదహనం) యుద్ధ కాండ విభీషణుడు రావణునికి నీతులు చెప్పుట, సేతు బంధనం, అంగద రాయబారం, రామ—రావణ యుద్ధం, కుంభకర్ణుని వధ, లక్ష్మణుని మూర్ఛ, ఆంజనేయుడు సంజీవని పర్వతం తెచ్చుట, ఇంద్రజిత్తు సంహారం, రావణ సంహారం, విభీషణ పట్టాభిషేకం, సీత అగ్నిప్రవేశం, పుష్పక విమానంలో సీతారాములు అయోధ్య చేరుట, శ్రీరామ పట్టాభిషేకం, ఉత్తర రామాయణం (సీత అడవికి పంపబడుట, కుశలవులు జన్మించుట, వాల్మీకి రామకథ బోధించుట, శ్రీరామునిచే అశ్వమేధ యజ్ఞం, తలిదండ్రులను, కుశలవులు కలుసుకొనుట, ఇత్యాది ఘట్టాలు) కొద్ది ప్రాంతీయ పాఠ్యభేదాలతో వాల్మీకి, తులసీదాసు, కంబరామాయణ మహాకావ్యాల్లో ఈ ఘట్టాలు కానవస్తాయి.

## రామారావు, దామెర్ల

ప్రముఖాంధ్ర చిత్రకారులలో ఒకరు. 1897 మార్చి 8న రాజమండ్రిలో ఈయన జన్మించాడు. చిన్నతనం నుంచీ ఈయనకు చిత్రకళ పట్ల అమితమైన అభిరుచి ఉండేది. ఆ రోజులలో రాజమండ్రిలోని ఆర్ట్సు కాలేజిలో ఆస్వాల్డ్ కూల్డ్రే అనే ఆంగ్లేయుడు ప్రిన్సిపాల్‌గా ఉండేవాడు. ఆయన గొప్పకవీ, చిత్రకారుడూకూడ. పదేళ్ళుకూడా నిండని రామారావులోని ప్రజ్ఞను కూల్డ్రే గుర్తించి, అతనికి చిత్రకళలోని మెళుకువలు ఎన్నో నేర్పి ఎంతగానో ప్రోత్సహించాడు.

కూల్డ్రే దొర సొంతఖర్చుమీద రామా రావును బొంబాయిలోని జె.జె. స్కూల్ ఆఫ్ఆర్ట్సుకి పంపాడు. చివరి సంవత్సరంలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడై 'మేయో' బంగారు పతకాన్ని రామారావు పొందాడు. వెంటనే చిత్రకళాశాలలో వైస్ ప్రిన్సిపాల్ ఉద్యోగానికి ఆయనకు ఆహ్వానం వచ్చింది. కాని స్వరాష్ట్రంలోనే కళాసేవ చేయాలన్న ఆకాంక్షతో రాజమండ్రికి తిరిగివచ్చాడు. 1922లో కలకత్తా చిత్రకళా ప్రదర్శనలో ఆయన ప్రదర్శించిన 'ఋష్యశృంగ బంధనం' చిత్రానికి ప్రథమ బహుమతిగా 'వైస్రాయి ఆఫ్ ఇండియా' పతకం వచ్చింది. అంతే కాకుండా అప్పటి వైస్రాయి లార్డ్ రీడింగ్ రామారావును స్వయంగా పరిచయం చేసుకొని ఆయన వేసిన చిత్రాల్లో ఒకదాన్ని కొన్నాడు. 'సిద్ధార్థుని రాగోదయం', 'బావి దగ్గర'వంటి రామారావు చిత్రాలు దేశ, విదేశాలలో ఎన్నో ప్రశంసలు పొందాయి.


సిద్ధార్థుని రాగోదయం

1923లో రామారావు రాజమండ్రిలో ఒక చిత్రకళా పాఠశాలను స్థాపించి అనేక మంది యువకులకు శిక్షణను ఈయన ఇచ్చాడు. 1925లో 27 ఏళ్ళకే ఆయన అకాల మరణం చెందాడు. ఈయన చిత్రాలను రాజమండ్రిలోని 'దామెర్ల రామారావు ఆర్ట్సు గ్యాలరీ'లో భద్రపరచారు. ఆ కీర్తిశేషుని పేర ఒక చిత్రకళామందిరం వెలిసింది. అందులో ఆయన వేసిన చిత్రాలు ఉన్నాయి.

## రామేశ్వరం

దక్షిణ కాశీగా ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రం. తమిళనాడులో మధురకు సమీపంలోని ఒక చిన్న

ద్వీపంమీద ఉంది. రాముడు నిర్మించిన సేతువులో ఇది ఒక భాగం అని భావిస్తున్నారు. ఇక్కడ సముద్ర తీరాన రాముడు నిర్మించిన సేతువు గుర్తులు కానవస్తాయి. పూర్వం రామేశ్వర ప్రాంతాన్ని గంధమాదన పర్వతమని పిలిచేవారు. రాముడు సేతువును నిర్మించబోగా ఈ పర్వతం అడ్డువచ్చింది. అంత రాముడి ఆజ్ఞతో కైలాసం నుండి, శివలింగాన్ని తీసుకొని రావడానికి వెళ్ళిన హనుమంతుడు తిరిగి రావడంలో కొంత ఆలస్యం జరగడంతో రాముడు 'సైకత' లింగాన్ని (ఇసుకతో చేసిన లింగాన్ని)ప్రతిష్ఠించాడు. రాముడు బాణం వేసి గంగ నుద్భవింపజేసి ఆ సైకత లింగాన్ని అభిషేకించాడు. ఇంతలో ఆంజనేయుడు లింగాన్ని తీసుకొనిరాగా దానిని కూడా తాను ప్రతిష్ఠించిన సైకత లింగానికి ఎడమ వైపున ప్రతిష్ఠించాడు. ఈ లింగాన్ని హనుమదీశ్వరుడు అంటారు.

భక్తులు తొలుత గంగాపూజ చేసి తరువాత రామలింగేశ్వర స్వామి దర్శనం చేసుకుంటారు. రామేశ్వర మందిరానికి కుడివైపున పార్వతీదేవి మందిరం ఉంది. ఇక్కడ పార్వతిని అన్నపూర్ణాదేవి అంటారు. రామేశ్వరానికి తూర్పున సముద్రంలో ఉన్న ఘట్టాన్ని 'అగ్నితీర్థం' అంటారు. ఇక్కడ అనేక తీర్థాలు ఉన్నాయి. ఇవన్నీ కుండాల రూపంలో ఉంటాయి. రామేశ్వర క్షేత్రాన్ని ప్రదక్షిణాం చేసేటప్పుడు బ్రహ్మకుండం కనిపిస్తుంది. దీనిలో సహజ సిద్ధంగా దొరికే భస్మాన్ని యాత్రికులు ఎంతో భక్తితో తీసుకొని వెళతారు. ఇచ్చటి దేవాలయం శిల్పకళకు ప్రసిద్ధిగాంచినది.

రామేశ్వరం గుడి



పంబ నుండి రామేశ్వర ద్వీపానికి కట్టిన రైల్వే వంతెన చాలా చిత్రంగా ఉంటుంది. కిందనుంచి నౌకలు వెళ్ళేటప్పుడు ఈ వంతెన మధ్యభాగం యంత్రాల ద్వారా పైకి లేస్తుంది. పైన రైలు వెళ్ళేటప్పుడు మామూలుగా ఉంటుంది. అందుకే దానిని 'వేలాడే వంతెన'(హేంగింగ్ బ్రిడ్జి) అంటారు.

## రాయ్ ఎమ్.ఎన్. 1887–1954

రాజనీతిజ్ఞుడు. తత్వవేత్త. మానవతావాది. రాడికల్ డెమొక్రటిక్ పార్టీ వ్యవస్థాపకుడు. ఆర్బేలియా (ప.బెంగాల్)లో 1887లో జన్మించాడు. అసలు పేరు నరేంద్రనాథ్ భట్టాచార్య. బాగా చదువుకుని ప్రాచ్య, పాశ్చాత్య భావాలను జీర్ణించుకున్నారు. జితిన్ ముఖర్జీ నాయకత్వంలో చెలరేగిన విప్లవ ఉద్యమంలో చేరి ఆయుధాల సేకరణకై జావా వెళ్లాడు. ఈలోపున విప్లవాన్ని బ్రిటిషు ప్రభుత్వం అణచివేయుటతో ఆయన యునైటెడ్ స్టేట్స్ చేరి తన పేరును మానవేంద్రనాథ్ రాయ్ (ఎమ్.ఎన్.రాయ్)గా మార్చుకుని అమెరికన్ యువతిని వివాహ మాడాడు. అక్కడనుంచి మెక్సికోకు పోయి కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపనకు దోహదమిచ్చి లెనిన్ పిలుపు నందుకుని 1919లో మాస్కో చేరి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సమావేశంలో పాల్గొన్నాడు. పిదప చీనాకు వెళ్లాడు. కాని 1928లో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీనుండి వైదొలగి దొంగ ప్యాసుపోర్టుతో భారతదేశానికి 1930 డిసెంబరులో తిరిగి వచ్చాడు. వెంటనే అరెస్టయి 7 ఏళ్లు జైలుశిక్ష అనుభవించి 1936లో విడుదలయిన తరువాత భారత జాతీయ కాంగ్రెసులో చేరాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో ఫాసిస్టు నియంతృత్వ ధోరణిని ప్రతిఘటించారు. యుద్ధానంతరం భారతదేశానికి స్వాతంత్ర్యం ఇమ్మని ప్రతిపాదించాడు. 1940లో కాంగ్రెసు నుండి వైదొలగి తన సొంత రాజకీయ వాదాన్ని ప్రచారంలోకి తేవడానికి రాడికల్ డెమొక్రాటిక్ పార్టీని నెలకొల్పాడు. 1946 లో కమ్యూనిజానికి పూర్తిగా



వ్యతిరేకిమై తీవ్రవాద ప్రజా స్వామ్యం (రాడికల్ కమ్యూనిజం) అను సరికొత్త రాజకీయ తత్వాన్ని 1948లో ప్రతిపాదించాడు. ఈయన 1954 జనవరి 25న కీర్తిశేషుడయ్యారు. పిదప రాడికల్ డెమోక్రటిక్ పార్టీని రద్దుచేశారు. ఈయన ప్రతిపాదించిన తీవ్ర మానవతావాదం (రాడికల్ హ్యూమనిజం) పలుపురు ప్రపంచరాజకీయ దార్శనికుల ప్రశంసలను అందు కుంది.

## రాయలసీమ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మూడు ప్రధాన భౌగోళిక ప్రాంతాలలో రాయలసీమ ఒకటి. మిగతావి కోస్తా ప్రాంతం (చూ.) తెలంగాణా (చూ.). ఆంధ్రప్రదేశ్‌లోని దక్కను పీఠభూమిలో ఉన్న మెట్ట జిల్లాలు రాయలసీమలో చేరి ఉన్నాయి. పూర్వం బ్రిటిషు పాలనలో వీటినిట దత్త మండలాలుట అని పేర్కొనేవారు. 1800 ప్రాంతంలో నాటి హైదరాబాదు నిజాం నవాబు బ్రిటిషు వారికి నాలుగు జిల్లాలను దత్తం (సీడెడ్)చేసి నందువల్ల వాటికి ఆ పేరు వచ్చింది. అవి: అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు. వీటికి సముద్రతీరం లేదు. పెన్నానది ఈ జిల్లాలలో ప్రవహిస్తూంది. అనావృష్టి ప్రాంతంకావడం వల్ల రైతాంగం మెట్ట పంటల సాగుకే పరిమితమయింది. కర్నూలు— కడప కాలువ, తుంగభద్ర కాలువలు, చెరువులు, తటాకాలవల్ల పంటనీరు లభిస్తున్నది. వేరుసెనగ, మామిడి, చీనీ నారింజ పండ్లతోటలు ఎక్కువ.

## రావణుడు

లంకాధీశ్వరుడు. 'విశ్రవసు'ని పుత్రుడు. భార్య 'మండోదరి'. సోదరులు కుంభకర్ణ, విభీషణ, ఇంద్రజిత్తు (మేఘనాధుడు) అక్షయుడు, త్రిశూలుడు, దేవాంతకుడు, నరాంతకుడు, అటకాయుడు మొదలైనవారు కుమా రులు. ఇతనికి దశాననుడు అని పేరు రావడానికి కారణం ఇతడు పుట్టినప్పుడు పదిముఖాలుగల అద్దం ఆ గదిలో ఉంచబడిందనీ, ఆ పది ముఖాలలోనూ ఆ శిశువు ప్రతిబింబించడం వల్ల అతనికి 'దశాననుడు' అనే పేరు వచ్చిందనీ పంపరామాయణం వర్ణిస్తూంది. అతడు కైలాసపర్వతం ఎత్తబోగా శివుడు తన బొటన వేలితో దానిని నొక్కిపట్టాడనీ ఆ బాధ భరించలేక అతడు కెవ్వున కేక పెట్టాడనీ అందువలననే అతడు 'రావణుడు' (భయంకరమైన 'రావం' గలవాడు) అయాడనీ ఐతిహ్యం. రావణుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి సురాసురలవల్ల తనకు మరణం లేకుండా వరాలు పొందాడు. అందుకే రావణ సంహారానికి విష్ణుమూర్తి నరుడుగా శ్రీరామావ తారం ఎత్తవలసి వచ్చింది. (చూ. జయవిజయులు, రామాయణం, శ్రీరాముడు, సీత)

## రాష్ట్రపతి

రాజ్యాంగరీత్యా భారతదేశానికి అధినేత. దేశ పాలన రాష్ట్రపతి పేరు మీదనే నిర్వహింపబడుతుంది. పార్లమెంట్ ఉభయసభల సభ్యులు రాష్ట్రాల విధానసభ సభ్యులు కలిసి ఎలక్టోరల్ కాలేజీ అయి రాష్ట్రపతిని ప్రతి అయిదేళ్ళకు ఒకసారి ఎన్నుకుంటారు.

భారతపౌరుడై 35 సంవత్సరాలకు తక్కువగాని వయస్సు గలిగి, ఏ ఇతర ప్రభుత్వోద్యోగాలను వహించని వాడై, లోక్‌సభకు ఎన్నుకోబడుటకు అన్ని అర్హతలు గలిగిన ఏ వ్యక్తి అయినా రాష్ట్రపతి పదవికి పోటీ చేయవచ్చు. రాష్ట్రపతికి శాసన నిర్మాణంలోను, న్యాయ పరిష్కారం లోను అనేక అధికారాలున్నాయి. పరిపాలన అంతా రాష్ట్రపతి పేరు మీదనే జరిగినప్పటికీ అధికారాలను స్వతంత్రంగా చెలాయించడానికి వీలులేదు. కేంద్ర మంత్రి మండలి సలహా మేరకు మాత్రమే వాటిని చెలాయించాల్సి ఉంది. కీలకమైన అధికారపదవుల్లో నియమకాలు చేసే అధికారం రాష్ట్రపతికి ఉంది. వీటిలో సుప్రీం కోర్టు,



హైకోర్టుల న్యాయమూర్తులు, ప్రధాన న్యాయమూర్తి, రాష్ట్ర గవర్నర్లు, అటార్నీ జనరల్, కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్, ప్రభుత్వోద్యోగులను ఎంపిక చేసే యుపిఎస్‌సి చైర్మన్, సభ్యులు, ఇతర దేశాలలో భారత రాయబారులను నియమించడం ప్రధానమైనవి. అటులనే విదేశీ రాయ బారులను ఆహ్వానించడం; భారత రక్షణ దళాలకు రాష్ట్రపతి అధిపతి (సుప్రీం కమాండర్)గా వ్యవహరిస్తారు. కాని ఇతర దేశాలపై యుద్ధం ప్రకటించే అధికారం మాత్రం పార్లమెంట్‌కు మాత్రమే వుంది. హరిజన, గిరిజన, వ్యవరాల నిర్వహణపై ప్రత్యేకాధికారిని రాష్ట్ర పతియే నియమిస్తాడు.

రాష్ట్రపతికి ఉన్న న్యాయపరమైన అధికారాలు వినియోగించుకుని శిక్షలు తగ్గించడం, మాఫీ చేయడం వంటివి చెయ్యవచ్చును. మరణదండన విధించిన వారికి క్షమా భిక్షపెట్టి విడిచిపెట్టడయో, శిక్ష తగ్గించుటయో చెయ్య వచ్చును. ఇతర దేశాలతో సంధి ప్రకటన చేసే అధికారం రాష్ట్రపతికి ఉంది. దేశం అత్యవసర పరిస్థితిని ఎదుర్కొంటున్నప్పుడు అత్యవసర పరిస్థితి (ఎమర్జెన్సీ)ని ప్రకటించ వచ్చును. పార్లమెంట్‌ను సమావేశపరిచే అధికారం ఉంది. పార్లమెంట్ సమావేశంలో లేనప్పుడు అత్యవసర శాసనా (ఆర్డినెన్స్)న్ని ప్రకటించవచ్చును. ప్రతిఏడు ఆడిటర్‌తో ఆదాయ—వ్యయ పట్టికను పార్ల మెంట్ ముందుంచే అధికారం రాష్ట్రపతికి ఉంది.

ఉపరాష్ట్రపతి: ఉపరాష్ట్రపతి రాజ్యసభకు అధ్యక్షుడుగా ఉండి ఆ సభా కార్యక్రమాలను నిర్వహిస్తారు. ఉపరాష్ట్ర పతిని పార్లమెంట్ ఉభయసభల సభ్యులు మాత్రమే ఎన్ను కుంటారు. ఇతని పదవీ కాలం ఐదు సంవత్సరాలు. భారతీయ పౌరుడై 35 సంవత్సరాల వయస్సు కలిగి రాజ్యసభకుఎన్నికయేఅర్హతఉన్న వ్యక్తి ఉపరాష్ట్రపతిపదివికి పోటీ చేయడానికి అర్హులు. రాష్ట్రపతి ఏకారణం వల్లనైనా తాత్కాలికంగా అధికారాన్ని నిర్వహించ లేకపోయినప్పుడు ఉపరాష్ట్రపతి ఆ పదవిని నిర్వహిస్తారు. రాష్ట్రపతి రాజీనామా చేసినా లేదా మరణించినా తిరిగి రాష్ట్రపతి పదివికి ఎన్నిక జరిగే వరకు రాష్ట్రపతి పదవిలో ఉపరాష్ట్రపతి కొనసాగుతారు. (చూ. పార్లమెంటు, ప్రభుత్వం, భారత రాజ్యంగం, లోక్‌సభ, రాజ్యసభ)

## రాష్ట్ర ప్రభుత్వం

చూ. ప్రభుత్వం

## రాష్ట్రావతరణ

తెలుగుమాట్లాడే వారికి ప్రత్యేక రాష్ట్రప్రతిపత్తి కావాలని మొదట ఆంధ్ర కాంగ్రెసు మహాసభ నిడదవోలు 1912 సమావేశంలో సూచించారు. మరుసటి ఏడు 1913 బాపట్ల సమావేశంలో ఆంధ్రమహా సభ ప్రత్యేక రాష్ట్రం కావాలని తీర్మానించింది. అయితే భారత స్వాతంత్ర్యపోరాటకాలంలో 1947 వరకు ఈ విష యానికి ప్రాధాన్యం ఇవ్వలేదు. స్వాతంత్ర్యానంతరం 1948లో భారతప్రభుత్వం ధార్ కమీషన్‌ను నియ మించింది. కాని ఫలించలేదు. ఆ తరువాత 1949లో జవహర్, వల్లభాయిపటేల్, పట్టాభిసీతారామయ్య అను ముగ్గురు నాయకులతో జె.వి.పి కమీటిని కేంద్ర ప్రభుత్వం నియోగించింది. జె.వి.పి సంఘ నివేదిక ననుసరించి వీలయితే జనవరి 26, 1950 నాటికల్లా ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయుటకు సిఫారసులు చేయగల్గినది. ఒక విభజనసమితిని కూడ నియోగించారు. అయితే ఏర్పడ బోయే నూతనరాష్ట్రానికి రాజధాని విషయంలో ఏకాభి ప్రాయం కుదరక జనవరి 26, 1950 నాటికి ఏమి జరుగలేదు. ఈలోపున హైదరాబాద్ నిజాం రాష్ట్రంలో రజాకార్ల అల్లర్లను పోలీసు చర్య(1948)ద్వారా నియంత్రించగా అది భారత ప్రభుత్వంలో విలీనమయి మిలిటరీ గవర్నర్ ఆధ్వ ర్యంలో అచ్చట కేర్‌టేకర్ ప్రభుత్వం ఏర్పడింది. భారతరాజ్యాంగం ప్రకారం ప్రపథమ సార్వత్రిక ఎన్నికలు 1952లో జరిగి ఉమ్మడి మద్రాసులోనూ, ఇతర రాష్ట్రాలలో ప్రజాప్రభుత్వాలు ఏర్పడ్డాయి. కాని ఆంధ్రరాష్ట్ర మాత్రం ఏర్పడలేదు. ఈ సమయంలో ప్రముఖ జాతీయ నాయకుడు పొట్టి శ్రీరాములు (చూ.)అక్టోబరు 1952లో ఆమరణ ప్రాయోప వేశానికి ప్రారంభించి 58 రోజులు ఉపవాసం చేసి డిసెంబరు 1952 ప్రాణత్యాగం చేశారు. అప్పుడు కేంద్రంలోని నెహ్రూ ప్రభుత్వం కోస్తా, రాయలసీమ జిల్లాలతో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పాటు చేయటానికి అంగీకరించి మిత్రా సంఘాన్ని నియమిం చింది (మే, 1953). ఆ సంఘ సిఫారసు మేరకు శ్రీబాగ్ (చూ.) ఒప్పందాన్ని దృష్టిలో పెట్టుకొని కర్నూలు రాజధానిగాను, గుంటూరు హైకోర్టు పెట్టుటకును అంగీకారం కుదిరింది. 1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్ర ఏర్పడింది. టంగుటూరి

ప్రకాశం మొదటి ముఖ్యమంత్రి, త్రివేది మొదటి గవర్నరు అయ్యారు. 1956లో భారతదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలు (తెలంగాణా) ఆంధ్ర రాష్ట్రంలో కలిసి విశాలాంధ్రగా 1956 నవంబరు 1 నాడు నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ అవత రించినది. చూ. ఆంధ్రప్రదేశ్.

## రిజర్వు బ్యాంకు

**భా**రత ప్రభుత్వానికి చెందిన ప్రధానమైన బ్యాంకు. పూర్తిపేరు 'రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా.' భారతదేశంలోని బ్యాంకింగు కార్యకలాపాలను నియం త్రించే ప్రభుత్వ వ్యవస్థ. 1934లో సిద్ధపరచిన రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా చట్టంలోని నిబంధనల మేరకు 1935లో రిజర్వు బ్యాంకును వ్యవస్థాపించారు. మొదట్లో ఇది వాటాదారు వాటా ధనం (రూ. 55 కోట్లు)తో ఏర్పడింది. 1949లో పూర్తిగా ఇది భారత ప్రభుత్వ పరమయింది. అంతకు ముందు 1921 లో ఏర్పడిన ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఆ పని నిర్వహిస్తూ ఉండేది. అన్నిటికంటె మొదటి బ్యాంకు 1894లో ఏర్పడిన పంజాబ్ నేషనల్ బ్యాంకు.

రిజర్వుబ్యాంకు చేసే ప్రధానమైన పనులలో ఒకటి భారత దేశంలోని ద్రవ్య వినియోగాన్ని అదుపులో పెట్టడం. వాణిజ్య బ్యాంకులు, సహకార బ్యాంకులు అని రెండు రకాల బ్యాంకులు దాని ఆధ్వర్యవంలో ద్రవ్య వ్యాపారం కొనసాగిస్తూ ఉంటాయి. వాణిజ్య బ్యాంకులలో ప్రభుత్వ బ్యాంకులు, విదేశీ బ్యాంకులు, ప్రైవేటు రంగంలోని బ్యాంకులు, ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు అని నాలుగు రకాలు. జాతీయం చేయబడిన ప్రభుత్వ బ్యాంకులు 28 నేడు దేశం అంతటా శాఖోపశాఖలుగా అల్లుకుని పనిచేస్తున్నాయి. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (1) దాని అనుబంధ బ్యాంకులు (7). 1969లో జాతీయకరణకు లోనైన బ్యాంకులు (14), తిరిగి 1980లో జాతీయం చేయబడ్డ బ్యాంకులు (6) మొత్తం 28 ప్రభుత్వ బ్యాంకులు దేశంలోని 90 శాతం బ్యాంకింగు వ్యాపారం అంతా ఈ ప్రభుత్వ బ్యాంకులే నిర్వహిస్తున్నాయి. విదేశీ బ్యాంకుల సంఖ్య 21. వీటికి 136 శాఖా కార్యాలయాలు దేశ వ్యాప్తంగా ఉన్నాయి. 38 ప్రైవేటు రంగానికి చెందనవి, 196 ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు కూడా బ్యాంకింగు వ్యవస్థలో ఉన్నాయి. సహకార బ్యాంకులు ముఖ్యంగా వ్యవసాయ పరపతి బ్యాంకులు 'నాబార్డు' (నేషనల్ బ్యాంకు ఫర్ అగ్రికల్చర్ అండ్ రూరల్ డెవలప్‌మెంట్) సంస్థ ద్వారా పనిచేస్తు న్నాయి. 'నాబార్డ్' రిజర్వు బ్యాంకు అనుబంధ సంస్థ అగ్రికల్చరల్ రీఫైనాన్స్ కార్పొరేషన్ (1963) స్థానే పనిచేస్తూంది. వ్యవసాయ ఋణాలు, గ్రామీణ పరిశ్రమ లను హస్తకళలకు అవసరమైన ఋణాలను ఈ బ్యాంకులు అందిస్తున్నాయి. రిజర్వు బ్యాంకు కార్య కేంద్రం బొంబాయిలో ఉంది. ప్రతిరాష్ట్ర రాజధానిలోను ప్రాంతీయ కేంద్రం పనిచేస్తున్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని హైదరాబాదులో రిజర్వు బ్యాంకు ప్రాంతీయ కేంద్రం ఉంది.

## రుద్రమదేవి

**కా**కతీయ సామ్రాజ్యాన్ని 1262–1289 మధ్య సమర్థవంతంగా పాలించిన మహారాణి. ప్రసిద్ధ కాకతీయ రాజు గణపతిదేవుని ఏకైక పుత్రిక. పుత్ర సంతానం లేకపోవడం వల్ల రాజకీయ వ్యవహారాలలో శిక్షణను ఇచ్చి తన జీవితకాలంలోనే ఆమె చేత రాచకార్యాలు నిర్వహింప చేశాడు. రుద్రమ భర్త చాళుక్య వంశానికి చెందిన వీర భద్రుడు. 1262లో గణపతి దేవుడు దివంగతుడు కాగానే కాకతీయ సింహాసనాన్ని అధిష్ఠించి 'రుద్రదేవ మహారాజా' అనే పురుష నామంతో పాలన కొనసాగించింది. సైన్యాన్ని పునర్నిర్మించి తిరుగు బాటు దార్లను ధైర్యంగా అణచివేసింది. రణరంగంలో ఆమె పురుష వేషం ధరించి ఆయుధం చేత బట్టి వీరవిహారం చేసేది. ఓరుగల్లుపై దండయాత్ర చేసిన యాదవరాజగు మహాదేవుని లొంగ దీసి అతనివద్ద అపార ధన వస్తువుల్ని నష్టపరిహారంగా స్వీకరించిన శౌర్యసాహసి. ఈ వీరవనిత శిల్పవిగ్రహాన్నొక దానిని హైదరాబాదులోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో ప్రతి ష్ఠించి గౌరవించారు.



## రుమేనియా

యూరప్‌లో ఆగ్నేయమున ఉన్న స్వతంత్ర సోషలిస్టు రిపబ్లిక్ (గణరాజ్యం). ఒకప్పుడు రోమన్ సామ్రాజ్యంలో భాగంగా ఉండడం వల్ల దానికి సార్థకనామం 'రుమేనియా' అని పేరు వచ్చింది. ఇది నల్ల సముద్రమును ఆనుకొని వుంది. 1859లో ఏర్పాటయిన ఈ రాజ్యం 1940లో కమ్యూనిస్టుల పాలన క్రిందికి వచ్చింది. సోవియట్ రష్యా ప్రాబల్యం వహిస్తూ ఉంది. ఆ ప్రాబల్యం ఇటీవల సడలిపోయింది.

విస్తీర్ణం: 2,37,500 చ.కి.మీ; జనాభా: 2,31,14, 000 (1988); రాజధాని: బుఖారెస్ట్; అధికార భాష: రొమేనియన్. ప్రజలలో రోమన్‌ల వారసులు 88 శాతం. ప్రజలలో మత ప్రసక్తి లేని వారు 9 శాతం. రొమేనియన్ ఆర్థడాక్స్ క్రైస్తవం 70 శాతం పాటిస్తారు. నాస్తికులు 7 శాతం ఉన్నారు. ట్రాన్స్‌ల్వేనియా పర్వత శ్రేణి పీఠభూమి ప్రాంతం వలయాకారంలో ఆవరించి ఉంటాయి. డాన్యూబునది ప్రధానమైన నది. ఈ దేశంలో దీని నిడివి 1400 కి.మీ ప్రవహించి నల్ల సముద్రంలో కలుస్తుంది. జ్యూనది, ఓల్టుల్‌నది, ప్రూత్ నది, ఆర్గేసుల్‌నది, అయిలోమితా నది, సిరెతోల్‌నది ఇతర ముఖ్య నదులు. దేశంలో ఉన్న 2500 సరస్సులు తటాకాలు, పర్వతాలు ప్రకృతి సౌందర్యాన్ని ఇనుమడింప చేస్తున్నాయి. నేలసార వంతమయినది. మంచి పచ్చిక బయళ్ళు ఉన్నాయి. అటవీ సంపద ఉంది. పెట్రోలు, చమురు వాయువు ఖనిజనిక్షేపాలు పుష్కలం. బాక్సైటు, నేల బొగ్గు, సీసం, రాగి, బంగారం, ఇనుపరాయి, వెండి, జింకు ఇచ్చట లభించే ఇతర ఖనిజాలు. గోధుమ, మొక్కజొన్న, రైధాన్యం, పండ్లు, బంగాళాదుంప, బీటు (పంచదార) దుంపలు సమృద్ధి వ్యవసాయ క్షేత్రాల్లో సాగుచేస్తారు. యంత్రసామగ్రి, దుస్తుల తయారీ, ఆహారపు దినుసులు డీజెల్ రైలు ఇంజనులు, చమురు వాయువు, పెట్రోలు, పెట్రో రాసాయనిక ద్రవ్యాలు ఎరువులు ముఖ్యమయిన పరిశ్రమలు.

## రువాండా

ఆఫ్రికా మధ్యలో భూమధ్య రేఖమీదనున్న స్వతంత్ర గణరాజ్యం.

విస్తీర్ణం: 26,33,87 చ.కి.మీ.; జనాభా: 67, 09,000 (1988), రాజధాని: కిగాలీ; అధికార భాష: ఫ్రెంచి, కిన్యార్వాండ్ భాషలు; ప్రజలలో బాహుతూ జాతులు, పిగ్మీబెత్వా, వాటూట్సీ ఆదిమ జాతులు వారున్నారు.

వబగసేరా సరస్సు, కీవూ సరస్సు, తేమా సరస్సు, కాగేరా నది, ఆకన్యారూ నది, రూజీజీ నది, న్యాబరోన్గో నది ముఖ్యమయిన జలాధారాలు. నీటి వనరులున్నప్పటికీ రైతాంగం తమ అవసరాలకు మాత్రమే ఆహారపు పంటలు పండిస్తున్నారు. జొన్న, మొక్కజొన్న, కర్ర పెండలం, కందమూలాలు, బంగళాదుంపలు వాణిజ్య స్థాయిని అందుకోలేదు. కాఫీ (రోబుస్టా, అరెబికా)విరివిగా పండించి ఎగుమతి చేస్తున్నారు. రోబుస్టా కాఫీరకం ఇన్‌స్టెంట్ కాఫీ తయారీకి పనికి వస్తుంది. తేయాకు, పొగాకు ఇతర వాణిజ్య పంటలు. జిరేనియం, పైర్థ్రెమ్ ఓషధులు కూడ పండించి ఎగుమతి చేస్తున్నారు. పశువుల పెంపకం ప్రజలకు బ్రతుకు తెరువును కల్పిస్తూంది. కేసిటరైట్ (తగరపు రాయి) వుల్ఫ్రమైట్ (టంగ్‌స్టన్), టాంటలైట్, బెరిల్ ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందుచున్న దేశం. తోళ్ళు, చర్మాలు ఎగుమతి అవుతున్నాయి.

## రూజ్ వెల్ట్, ఫ్రాంక్లిన్ డిలానో

యునైటెడ్ స్టేట్స్‌కు 32వ ప్రెసిడెంట్ (అధ్యక్షుడు). యునైటెడ్ స్టేట్స్ 1924లో ఆర్థిక సంక్షోభానికి గురియైన సమయంలో 1932లో మొదటిసారిగా ఎన్నికోబడిన రాజనీతి దిట్ట. మరల 1936లోను, 1940లోను, 1944లోను మొత్తం నాలుగు సార్లు వరుసగా అధ్యక్షునిగా ఎన్నుకోబడిన వ్యక్తి, అమెరికా చరిత్రలో ఈయన ఒక్కరే. బ్యాంక్ హాలీడే (1933), న్యూడీల్, ప్రజాపనులు (పబ్లిక్‌వర్క్స్)వంటివి సంక్షోభానికి విరుగుడుగా అనేక వినూత్న ఆర్థిక పరిష్కార మార్గాలు కనిపెట్టి ప్రవేశ పెట్టిన ఘనత ఈయనకే



దక్కింది. నిరుద్యోగులకు వెసులబాటు కల్పించడానికి సాంఘిక భద్రత (సోషియల్ సెక్యూరిటీ)ను కల్పించి పేదవారిని ఆదుకున్నాడు. పొరుగు రాజ్యాలతో సఖ్యతను నెరపి వారి విశ్వాసాన్ని చూరగొన్నాడు. రెండవప్రపంచ యుద్ధ సమయంలో (1939–45)ఈయన అవలం బించిన విదేశీవిధానం చారిత్రాత్మక మయింది.మిత్రపక్షాలకు చేయూత నిచ్చాడు. అదే సమయంలో రూజ్వెల్ట్, చర్చిల్ (చూ.), స్టాలిన్ (చూ.) ప్రపంచ నాయకత్రయంగా (బిగ్‌త్రీ) ప్రసిద్ధి పొంది శత్రుపక్షాల ఎత్తుగడలకు ప్రతివ్యూహాలు పన్ని కడకు నాగసాకీ, హిరోషిమాలపై ఆటంబాబు (పరమాణుబాంబు)ప్రయోగంతో 1945లో యుద్ధ విరమణకు దారి తీశారు. ఈ నిర్ణయం 1944 ఫిబ్రవరిలో నాయకత్రయం యాల్టా సమావేశంలో చేసింది. అయితే పరమాణు బాంబు ప్రయోగం (ఆగస్టు 1945)ముందే రూజెవెల్ట్ మార్చి 1945 లోనే మరణానికి గురి అయ్యాడు. వాస్తవానికి పరమాణు పరిశోధనకు 1942నుంచీ దోహదం చేసింది ఈయనయే. న్యూయార్కులోని హైడ్‌పార్కు రూజ్‌వెల్డ్ జన్మస్థానం. హార్వర్డ్ యూనివర్సిటీలో విద్యనభ్యసించి న్యాయపట్టభద్రు డయ్యెను (1907.)దూరపు బంధువు ఎలినార్‌ను అంతకు ముందే (1903) ప్రేమించి పెళ్ళి చేసికొన్నాడు. 1921లో రూజ్‌వెల్ట్ ఈతకు వెళ్ళి నప్పుడు అతి శీతల జలములో జలకాలాడినప్పుడు పోలియో పోటుకు గురియై నడక అసాధ్యమైంది.అప్పటినుంచే వికలాంగుడవడం వల్ల చక్రాల బండియే (వీల్‌చైర్) అతనికి శరణ్యమైంది. అయినా రాజకీయ జీవితానికి తన అవిటితనం ఏమాత్రం అడ్డురాలేదు. 1928లో న్యూయార్కు గవర్నరుగా ఎన్నిక అయ్యాడు. తరువాత 1932లో అమెరికా అధ్యక్షుడై సుమారు 12 ఏళ్లు ఏకధాటిగా పాలనసాగించి అందరి మన్ననలందుకున్న చారిత్రాత్మక మహనీయుడు.

## రూసో, జాన్ జాక్విస్

ఫ్రెంచి తత్త్వవేత్త. మహామేధావి. విద్యావేత్త. ఈయన ప్రవచించిన సిద్ధాంతాలు సుమారు 200 ఏళ్లబాటు ప్రపంచ రాజకీయభావాలను ప్రభావితం చేశాయి. 1776లో జరిగిన అమెరికా విప్లవం, 1789లో సంభవించిన ఫ్రెంచి విప్లవానికి రూసో భావాలే బీజాలు. 1762లో "సోషియల్ కాంట్రాక్టు అను ఉద్గ్రంథంలో 'మానవుడు స్వేచ్ఛజీవి గా జన్మించాడు. కాని ఎల్లచోట్ల అతడు శృంఖలా బద్ధుడయి కన్పిస్తున్నాడు' అని చెప్పాడు. వ్యక్తి స్వాతంత్ర్య స్వత్వమును గూర్చి నొక్కి చెప్పేడు. అతి కీలకమయిన ఈ ప్రగతి శీలక రాజ్యభావం వైపు పెక్కుమంది ఆకర్షింపబడ్డారు. ఈ భావం మేధావుల్ని ఆలోచింపచేసింది. చివరకు పైన చెప్పిన రెండు భావాలూ భావకుల్ని ప్రభావితంచేయడమే గాక, ప్రపంచంలో నేడు పెక్కు దేశాలు ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యాలుగా పరిణమించడానికి వీలయింది.

## రోమ్ మహానగరం

అతి ప్రాచీన చరిత్ర గల మహానగరం. ఇటలీకి రాజధాని. రోమన్ కేథలిక్ చర్చ్‌కీ పోప్‌లకూ స్థావరమూ అవడం వల్ల రోమ్‌ను దివ్యనగర (హోలీసిటీ) మని పేర్కొంటారు. కేథలిక్‌లకు పవిత్ర యాత్రాస్థలం వటికన్ సిటీ,వారి పవిత్ర దేవళం సెయింట్ పీటర్ చర్చి రోమ్ నగరంలోనే ఉన్నాయి. వర్ణచిత్రాలు, అనేకమయిన అపురూప వస్తువులు ఇక్కడ ప్రదర్శింపబడి ఉన్నాయి. లియోనార్డో డావిన్సీ, మైకేల్ ఏంజిలో, రాఫియల్ వంటి సుప్రసిద్ధ కళాకారుల కళాఖండాలు ఇందులో చోటుచేసికొన్నాయి. వటికన్‌లోని సిస్టైనే చర్చిలో పైకప్పు (సీలింగ్) మైకేల్‌ఏంజిలో కుడ్యచిత్రం చిత్రింపబడివుంది. కాపిటో లీనే మ్యూజియము అతి పురాతనమైనది (1471). ఇంకను విల్లా గుయిలియా లోని నేషనల్ మ్యూజియం, బోర్గీస్ సంగ్రహం, నేషనల్ రోమన్ మ్యూజియం, నేషనల్ గాలరీ ఆఫ్ మోడర్న్ ఆర్ట్‌వంటివి కళా విమర్శకులనూ వినోదపర్యాటకులనూ విశేషంగా



ఆకర్షిస్తూ ఉంటాయి. 15వ శతాబ్దిలో నిర్మించిన లెనీజియా రాజప్రాసాదం వాస్తుకళకు ప్రసిద్ధి పొందినది. పేంతియన్‌లో రోమన్ దేవతా విగ్రహాలు ప్రదర్శింప బడినవి. నీరో రాజప్రాసాదం, మాడోనా రాజప్రాసాదం గారిబాల్డీ స్మారక చిహ్నం, కొలోసియమ్ మార్కస్ అరీలియస్ స్తూపం (క్రీ.శ 100), ఆగస్టస్ సమాధి (క్రీ.పూ 28) రోమన్‌నగరంలో దర్శనీయస్థలాలు. రోమన్ మహానగర విస్తీర్ణం:1500 చ.కి.మీ ఉంటుంది. జనాభా: 28,15, 457 (1988)

## రౌండ్ టేబుల్ సమావేశాలు

**భా**రతస్వాతంత్ర్య సమరంలో ఈ సమావేశాలు ప్రధానఘట్టాలు. మహాత్మగాంధీ నాయకత్వంలో భారత స్వాతంత్ర్యోద్యమం క్రమంగా తీవ్రతరంకానారంభించింది. ప్రజలలో రాజకీయ అసంతృప్తిని రూపుమాపడానికై బ్రిటిషు ప్రభుత్వం నాడు జాతీయనాయకులతో ఏదో ఒక పరిష్కారం కుదుర్చుకోవాలని వివిధ రాజకీయ పక్షాల ప్రతినిధులను లండన్‌లో జరిగే రౌండ్‌టేబుల్ సమావేశాలకు రమ్మని ఆహ్వానించేవారు. భారతీయ ప్రతినిధులు లండన్ వెళ్ళి బ్రిటిష్ మంత్రివర్గ సభ్యులను కలుసుకొని భారతదేశ సమస్యలను గూర్చి దానిలో చర్చించేవారు. ఈ సమావేశాలకే 'రౌండ్‌టేబుల్ సమావేశా'లని పేరు. అలాంటి రౌండ్‌టేబుల్ సమావేశాలు మూడు సార్లు జరిగాయి. మొదటి సమావేశం 1930 నవంబరు 30న లండన్‌లోజరిగింది. జార్జి చక్రవర్తి ఆ సమావేశాన్ని ప్రారంభించారు. అయితే 'పూర్ణ స్వరాజ్యం' కావాలని పట్టుబట్టి ఆ సమావేశాన్ని బహిష్కరించి కాంగ్రెస్ దానిలో పాల్గొనలేదు. భారతదేశ సమస్య పరిష్కారం కావాలంటే జాతీయ నాయకుల సహకారం తప్పనిసరి అని బ్రిటిష్ ప్రభుత్వానికి అవగతం అయింది. తరువాత వైస్రాయి ఇర్విన్—గాంధీల మధ్య ఒక ఒప్పందం కుదిరింది. ఈ గాంధీ ఇర్విన్—పాక్ట్‌ను వల్లభాయి పటేలు అధ్యక్షత వహించిన కరాచీ కాంగ్రెసు (1931 మార్చి 29)లో ఆమోదించారు. రెండవ రౌండు టేబుల్ సమావేశం 1931 సెప్టెంబరు 7న లండనులోనే జరిగింది. కాంగ్రెసు ప్రతినిధిగా గాంధీజీ ఓడలో లండను వెళ్లి పేదవారు నివసించే 'ఈస్టేఎండ్'అనే పేటలో బసచేశారు. ఏ మతానికి ఎంత ప్రాతినిధ్యం ఉండాలి అన్న సమస్యమీద ఏకీభావం కుదరకపోవడం వల్ల రెండవ రౌండ్‌టేబుల్ సమావేశం విఫలమయింది. జాతీయ కాంగ్రెస్ సహాయ నిరాకరణ ఉద్యమం కొనసాగించడంతో నాయకులు మళ్లీ అరెస్టు అయ్యారు. 1932 ఆగస్టులో బ్రిటిష్ ప్రధాని మేక్డనాల్డ్, శాసనసభల్లో ఏ మతానికి ఎంత ప్రాతినిధ్యం ఉండాలి అన్న విషయంలలో ఒక తీర్పు చెప్పారు. దానినే రామ్సే మేక్డనాల్డ్ 'కమ్యూనల్ అవార్డు' అంటారు. ఈ తీర్పును అనుసరించి వివిధ మతాల వారికి ప్రత్యేక వోటర్ల విభాగాలను నిర్ణయించారు. హిందువుల విషయంలో దళిత జాతులవారికి ప్రత్యేక స్థానాలు ఏర్పరచారు. ఆ స్థానాలకు ఎన్నుకోబడేవారు కొన్ని ప్రత్యేక నియోజకవర్గాలనుంచి ఎన్నుకోబడతారు. అట్టివారికి దళిత జాతుల వారు మాత్రమే వోటు వేయాలి. తక్కిన హిందువులు వోటు వెయ్యరు. ఆ విధంగా హిందూ సమాజం నుంచి హరి జనులను వేరుచేసి వారికి వేరే స్థానాలు కేటాయించడం హిందూ సమాజాన్ని చీల్చ డమేనని గాంధీజీ భావించారు. గాంధీజీ అంటరాని తనాన్ని సమాజంలో సమూలంగా నిర్మూలించి హరి జనులను సవర్ణులు తమతో సమానులుగా పరిగణించాలని మొదటి నుంచే చెబుతూ వచ్చేరు. అందుచేత మేక్డనాల్డ్ తీర్పును వ్యతిరేకిస్తూ గాంధీజి పూణే లోని ఎరవాడ జైలులో ఆమరణ ఉపవాసదీక్ష ప్రారంభించారు. ఆ జైలులోని హిందువులలో సవర్ణ నాయకులు, హరిజన నాయకుడుడైన అంబేద్కర్ (చూ.) జైలు ఆవరణలోనే సమావేశ మయ్యారు. చివరకు 1932 సెప్టెంబరు 24న ఒక అంగీకారానికి వచ్చారు. దీనినే 'పూనా ఒడంబడిక' అంటారు. దానిననుసరించి తాను తలపెట్టిన కమ్యూనల్ అవార్డుమ మేకనాల్డ్ ఉప సంహరించుకోక తప్పలేదు. బ్రిటిషు వారు అనుసరిస్తూ వచ్చిన 'విభజించి—పాలించు' (డివైడ్ అండ్ రూల్) అనే వైఖరి మరొక సారి విఫలమైంది. భారతీయులు జాగరూకతతో వ్యవహరించారు. హిందూ సమాజ సమగ్రత పరిరక్షించ బడింది. బ్రిటిష్‌వారు జాతీయ నాయకులతో ఏదో ఒక ఒప్పందం కుదుర్చు కోవాలని తహతహ లాడుతూ వచ్చారు. ఈ నేపథ్యంలో మూడవ రౌండ్‌టేబుల్ సమావేశం 1932 నవ 17 డిసె 24 మధ్య లండన్‌లో జరిగింది. ఈ సమావేశంలోచేసిన ప్రతిపాదలను బ్రిటిష్ ప్రభుత్వం ఒక శ్వేత పత్రం (వైట్ పేపర్) లో

ప్రకటించారు. ఈ శ్వేత పత్రాన్ని ప్రాతిపదికగా తీసికొని తరువాత 1935 భారత ప్రభుత్వ చట్టాన్ని సిద్ధం చేశారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వా స్వరూపం దీనిలో వివరించబడిది. తత్ఫలితంగా ఎన్నికలు జరిగి 1937లో రాష్ట్రమంత్రి వర్గాలు ఏర్పడ్డాయి.

## లండన్ మహానగరం

గ్రేట్ బ్రిటన్ (చూ.)కు రాజధాని నగరం. ఒకప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యానికి రాజధాని. థేమ్స్‌నదికి ఇరువైపులా విస్తరించి ఉన్న ఈ మహానగరాన్ని టవర్‌బ్రిడ్జి వంటి అనేక వంతెనలు కలుపుతున్నాయి. ఈ మహానగరంలో నేడు మిడిల్‌సెక్స్, కెంట్, సర్రే, హెర్ట్ ఫర్డ్ షైర్, ఎసెక్స్ వంటి 20 మండలాలుగా శివార్ల భాగాలతో కలిసి ఉన్నాయి. చాలా పురాతన చరిత్రగల నగరం. క్రీ.శ.7వ శతాబ్దంలోనే శాక్సన్ రాజులకు పూర్వమే స్థాపించబడి ఆల్ఫ్రెడ్ (క్రీ.శ. 886) రాజు కాలంలో బాగా అభివృద్ధి చెందింది.

నార్మన్‌ల కాలం (11 శతాబ్ది)లో వెస్ట్ మినిస్టర్ వైపుకు నగరం పెరగడం ప్రారంభించి 14వ శతాబ్ది నాటికి పార్లమెంట్, కోర్టులు అక్కడికి చేరి దానిచుట్టూ నగరాభివృద్ధి జరిగింది. 1666లో లండన్ పెద్ద అగ్నిప్రమాదానికి గురియై నేటి లండన్ పునర్నిర్మించ బడింది. బ్లూమ్స్‌బరీ, వెస్టెండ్, ఈస్టెండ్ బస్తీలు ఈవిధంగా 18–19వ శతాబ్దంలో రూపుగొన్నవి. పిదప పారిశ్రామిక విప్లవంతో ఈ మహానగర జనాభా విపరీతంగా పెరిగి శివార్లు కమ్ముకున్నాయి. 1863–1884 మధ్య నగర రాకపోకల సేకరణలకు రైల్వే వ్యవస్థను సువ్యవస్థీక రించి ఆ తరువాత భూమ్యంతర్గత (ట్యూబ్ రైల్వే) రైల్వేను నిర్మించారు. విక్టోరియా రాణి పాలనలో లండన్ ఆంగ్ల సాహిత్యానికి కేంద్రమైంది. ఆధునికాభివృద్ధికి లోనై లండన్ పరిసరాలు పర్యావరణలు దెబ్బతినకుండా 1938లో హరితమండలం (గ్రీన్‌బెల్ట్) చట్టాన్ని అమలుచేశారు. దీనితో శివారులలో నివేశ స్థలాలు అభివృద్ధి అవుతున్నా లండన్ నడిబొడ్డున కార్యాలయాల్లోనూ, కర్మాగారాల్లోనూ జనసందడి తగ్గలేదు. 40 కి.మీ. పైబడి సుదూర ప్రాంతాలనుండి పనిచేసే వారు హైడ్‌పార్క్ వంటి లండన్ నడిబొడ్డు ప్రాంతాలకు ప్రతిరోజూ ఉదయం 7–10 గం. మధ్య వచ్చేవారి సంఖ్య 12 లక్షలకు పైబడి ఉన్నట్లు తెలుస్తూంది. ఈ సంఖ్య ఇంకా పెరుగుతూనే ఉంది. నడిబొడ్డున ఆకాశహర్మ్యాల సంఖ్య కూడా పెరుగుతూనే ఉంది.

ఉన్నత విద్యా విజ్ఞాన పరిశోధనలకు లండన్ ప్రపంచంలోనే సుప్రసిద్ధ అధ్యయన కేంద్రం. పునరుజ్జీవనం కాలం నుండీ ఇచ్చటకు శాస్త్రీయ పరిశోధనలకు ప్రపంచం నలుమూలలనుండీ పండితులూ విద్యార్థులు



టవర్ బ్రిడ్జ్

వచ్చిపోతూ ఉంటారు. క్రీ.శ. 12వ శతాబ్దిలో వ్యవస్థాపించిన కేంబ్రిడ్జి యూనివర్శిటీ, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలు గణుతికెక్కిన విద్యాపీఠాలు, అతి పురాతన మయినవి. లండన్ యూనివర్శిటీ మరొక పెద్ద విద్యాకేంద్రం. లండన్‌లో ఉన్న బ్రిటిషు మ్యూజియం జగత్ప్రసిద్ధిగన్న వస్తు సంగ్రహాలయం. ఇది అమరావతి బౌద్ధసంప్రదాయ కళాఖండాలు, పురాతత్త్వ వాస్తు శిల్పకళాఖండాలకూ ప్రసిద్ధి. సాహిత్య భాండాగారం, జంతు, వృక్షప్రకృతి వస్తు సంగ్రహాలయం అనేకములయిన పరిశోధన వస్తు జాలానికి నిలయం. ప్రాచ్య(ఓరియంట్) విభాగంలో తెలుగుకు సంబంధించిన ముద్రితా ముద్ర గ్రంథాలెన్నో ఇక్కడ భద్రపర్చారు. ఆక్స్‌ఫర్డ్‌కు సంబంధించిన బోడ్లియన్ లైబ్రెరీలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ లైబ్రెరీలో భారతదేశానికి సంబంధించిన చారిత్రక పరిశోధనా సామగ్రిని ముందు తరాలవారికి జాగ్రత్త చేశారు. ప్రపంచానికి కాల నిర్ణయం సూచించే రాయల్ అబ్జర్వేటరీ లండన్‌కు సమీపంలోని గ్రీనిచ్‌లో ఉంది (చూ. గ్రీనిచ్ కాలమానం).

ప్రపంచవర్తక వాణిజ్యాలకు లండన్ ఒక పెద్ద కేంద్రం. లండన్ హార్బరు చాల పెద్దది. వాణిజ్యనౌకల రద్దీ ఎక్కువ. లండన్ ప్రపంచద్రవ్య వినిమయానికి కూడలి. ప్రపంచంలోని బ్యాంకింగ్ వ్యవస్థకు ప్రధాన కేంద్రం లండన్. ఇది స్టాక్ ఎక్స్‌చేంజీ కార్పొరేట్ వ్యాపారానికి దోహదం చేస్తుంది. ఇంకను జంతు ప్రదర్శనాలయం, సోనే మ్యూజియం, జెఫ్రీ మ్యూజియం, మేడమ్ టస్సాడ్ మైనపు బొమ్మలకొలువు, సుప్రసిద్ధ సాహిత్యకారులు— కార్లైల్ జాన్సన్, డికెన్స్‌ల గృహ ప్రాంగణాలు, నేషనల్ ఆర్ట్ గేలరీ, టేట్ గేలరీ, కెన్సింగ్ టన్‌లోని సైన్స్ మ్యూజియం, క్యూగార్డెన్‌లోని హెర్బే రియం నేచురల్ హిస్టరీ మ్యూజియం, విక్టోరియా & ఆల్బర్ట్ మ్యూజియం వంటి ఎన్నో దర్శనీయ స్థలాలు లండన్‌లో ఉన్నాయి. బ్రిటిషు పార్లమెంట్ భవన ప్రాంగణం బిగ్‌బెన్ పాశ్చాత్య వాస్తు శిల్పసంప్రదాయానికి మచ్చుతునక. ఇంకా చర్చీలు, కెథడ్రల్‌లు క్రైస్తవ దేవాలయవాస్తువుకు అద్దంపట్టి చూపిస్తాయి. 'ట్రఫాల్గర్ స్క్వేర్ జనసమ్మర్దం గల లండన్ బస్తీ. 1703లో నిర్మించిన బకింగ్‌హామ్ ప్యాలెస్ క్రీ.శ. 1837 నుండి బ్రిటిషు రాజప్రాసాదం. ఇది బ్రిటిషు రాజకుటుంబ నివాసప్రాంగణం. సమీపంలో ఉన్న 'వెస్ట్ మినిస్టర్ అబ్బీ, గోతిక్ వాస్తు సంప్రదాయంలో నిర్మించిన ప్రసిద్ధ చర్చి. ప్రముఖుల సమాధుల ప్రాంగణం ఇక్కడ ఉంది. లండన్ మహానగరం చారిత్రకంగా పలువురు సుప్రసిద్ధ ఆంగ్ల సాహితీపరులకు కేంద్రమయింది. షేక్స్‌పియర్, మిల్టన్, బైరన్, షెల్లీ, టెనీసన్, ఇలియట్, గోల్డ్‌స్మిత్, బెర్నార్డ్ షా, బెర్ట్రాండ్‌రసెల్ వంటి ఇంగ్లీషు మహాకవులు తమ ప్రసిద్ధ రచనలను లండన్ నుంచే ప్రపంచానికి అందించారు.



## లక్జెంబర్గ్

యూరపులో పశ్చిమ జర్మనీ, బెల్జియమ్ ఫ్రాన్స్ దేశాలమధ్య ఉన్న చిన్న రాజ్యం. ఇది ఒక 'గ్రాండ్‌డచీ'. లండన్‌తో 1867నాటి ఒప్పందానికి లోబడి ఇది స్వతంత్ర మైనది. అత్యధిక పారిశ్రామికాభ్యుదయం సాధించిన దేశం. రాజ్యాంగానికి లోబడి రాజ వంశీయులు పాలిస్తున్నారు.

విస్తీర్ణం: 2,586 చ.కి.మీ.; జనాభా: 3,72, 000 (1988) రాజధాని: లక్జెంబర్గ్; అధికార భాష: ఫ్రెంచి; ఇంగ్లీషు, జర్మన్ భాషలు మాట్లాడతారు. క్రైస్తవం పాటిస్తున్నారు. లక్జెంబర్గ్ దేశములో ఎస్బీ—సుర్ ఆల్ జెట్టే, డిఫర్‌డాంగే, డుడులాంగే ప్రముఖపట్టణాలు. సాగునేల ప్రధానంగా ఉన్న ప్రాంతాన్ని బాన్‌పేస్ అంటారు. ఇవి నదుల వెంబడిని, కొండలతోను, పీఠభూమితోను నిండి ఉంది. ఉత్తర ప్రాంతాన్ని ఆర్డెన్నెస్ అంటారు. అతెర్ట్‌నది, ఆల్జెత్తేనది, మొసల్లేనది, సూరేనది బాన్‌పేస్ ప్రాంతంలో ప్రవహిస్తున్న ముఖ్యమయిన నదులు. గోధుమ, బార్లీ, ఓట్‌ధాన్యం, బంగాళాదుంపలు, ద్రాక్ష ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. ఇనుపరాయి పుష్కలంగా దొరుకుతుంది. పశువుల పెంపకం, పందుల పెంపకం ప్రజల జీవనోపాధులు. ఉక్కు ఉత్పత్తి ప్రధాన పరిశ్రమ. ద్రాక్షసారాయి తయారీ మరొక పరిశ్రమ. యూరపియన్ ఆర్థిక సంఘంలో(ఇ.ఇ.సి.) సభ్యత్వం పొంది అంతర్జాతీయ వాణిజ్యాన్ని సాగిస్తోంది

## లక్షదీవులు

అరేబియా సముద్రంలో కేరళ తీరానికి పశ్చిమంగా ఉన్న భారతకేంద్రపాలిత రాష్ట్రం. యూనియన్ టెరిటరీ లన్నిటిలో చిన్నది. ఈ ద్వీపసముదాయంలో 12 అటోల్‌లు ఉన్నాయి. మొత్తం 136 దీవుల్లోనూ 10 దీవులు మాత్రం వాసయోగ్యం. వాటిపేర్లు అంద్రోత్తు, అమినీ, అగత్తీ, బిత్రా, చెట్లాత్, కిల్తాన్, కవరత్తి.

విస్తీర్ణం: 32 చ.కి.మీ.; జనాభా: 40,249 (1981); రాజధాని కవరత్తి, అధికార భాష: మలయాళం. 1956లో కేంద్రపాలితమయిన ఈ ప్రాంతానికి 1973లో లక్షదీవులు అని పేరు పెట్టారు. ఈ దీవులలో సేద్యం ప్రజల ప్రధాన వృత్తి. సాగునేల

అంతటిలోను కొబ్బరితోటలను పెంచుతారు. చెట్టుకు సగటు కాయ దిగుబడి ఎక్కువ (58). మునగ, అరటి, అనాస, జామ, సపోట, నారింజ జాతులు ఈ కొబ్బరి తోటలలో అంతర పంటగా వేస్తారు. మత్స్యపరిశ్రమ కూడా భారీస్థాయిలో సాగుతుంది. పగడపు పరిశ్రమ, పీచు పరిశ్రమ వంటి కుటీర పరిశ్రమలు ప్రజలకు జీవనోపాధిని కల్పిస్తున్నాయి. వినోద పర్యాటకులకు విహార కేంద్రంగా ఉంది.

## లక్ష్మణరావు, కానూరి

ఇంజనీరింగ్ రంగంలో అంతర్జాతీయఖ్యాతిని ఆర్జించిన ప్రముఖుడు కె.ఎల్.రావు. కృష్ణాజిల్లా కంకిపాడులో 1902 జూలై 14న జన్మించారు. గిండీ ఇంజనీరింగ్ కళాశాలలోనూ ఇంగ్లండ్ లోనూ ఇంజనీరింగ్ అధ్యయనం చేశారు. ఇంగ్లండ్‌లో కొంతకాలం ఇంజనీరింగ్ అధ్యాపకుడుగా పనిచేశారు. భారతదేశంలో స్వాతంత్ర్య సముపార్జన అనంతరం నదీలోయలలో నిర్మించిన భారీడాము ప్రతి దానితోనూ రావుగారి ప్రమేయం ఉంది. రీయిన్‌ఫోర్స్‌డ్ సిమెంటు కాంక్రీటు నదీలోయ ప్రాజెక్టులు ఈయన ప్రత్యేకంగా అధ్యయనం చేసిన సాంకేతిక రంగాలు. ఇంజనీరింగ్ విజ్ఞానం సామాన్య ప్రజలకు సైతం అర్థం అయేలా ఉపన్యాసాలిచ్చిన మహావక్త. నాగార్జున సాగర్, భక్రా—నంగల్, హీరాకుడ్ ప్రాజెక్టుల విషయంలో భారతప్రభుత్వం విదేశీ ఇంజనీర్ల సలహాలను పొందగా అలా వచ్చిన విదేశీ ఇంజనీర్ల భారతదేశంలో శ్రీరావును సంప్రదించేవారు. ఆసియా, ఆఫ్రికా దేశాలవారు నదీలోయ నిర్మాణాలపై రావును పిలిపించుకొని సలహాలు తీసుకుంటుండేవారు. నమూనాల రూపకల్పనలో రావు సిద్ధహస్తుడు. ఆయన తీర్చిదిద్దిన ఇంజనీరింగ్ నిపుణులు అనేకులు. రెండుపర్యాయాలు కేంద్రమంత్రి వర్గంలో (1963–71)మంత్రిగా పనిచేశారు. 1986 మే 18న శ్రీరావు కీర్తిశేషులయ్యారు. అనేక సాంకేతిక విషయా లతో 'క్యాసెక్ క్యాండిడేటు' అని ఆయన స్వీయ చరిత్రను వ్రాసి అందించారు.

## లక్ష్మణరావు, కొమర్రాజు

ఆంధ్రపునరుజ్జీవనోద్యమంలో ప్రముఖ పాత్రవహించినవాడు. పూర్తిపేరు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు. 1876 మే 12వ తేదీన విజయవాడ వద్దగల నందిగామ సమీపంలోని పెనుగంచిప్రోలులో జన్మించారు. సంస్కృతం, ఇంగ్లీషు, తెలుగు, మరాఠీ, హిందీ, గుజరాతీ, బెంగాలీ, కన్నడం, తమిళం వంటి పలుభారతీయ భాషలలో నిష్ణాతుడైన పండితుడు. లక్ష్మణరావు 1912 లో తెలుగు భాషలో 'విజ్ఞాన సర్వసం' 'అ'కారం మీది శీర్షికలతో రెండు సంపుటాలు ప్రకటించారు. ఆయన అనేకభాషలను నేర్చినప్పటికీ తెలుగులో వ్యాసాలు వ్రాసి 'జనాభా'వంటి ప్రముఖ తెలుగు పత్రికలకు పంపుతుండేవారు. పరిశోధనలు చేసి 'శివాజీచరిత్ర'వ్రాశారు.



తండ్రి తర్వాత మునగాల సంస్థానానికి దివానుగా పనిచేశారు. రాజాగారైన వెంకట రంగారావుతో పరిచయం ఏర్పడడంతో సాహిత్యసేవ చేయడానికి మంచి అవకాశం లభించింది.హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం, విజ్ఞాన చంద్రికా గ్రంథమాల స్థాపించి తెలుగుజాతికి ఆధునిక విజ్ఞానాన్ని మొదటిసారిగా అందజేశారు. గ్రంథాలయోద్యమ కృషిలో కూడా ఎక్కువగా తోడ్పడ్డారు. 'విశ్వవిద్యాలయం', 'సంపాదకుడు' 'విద్యా భ్యాసం' వంటి ఆధునిక తెలుగు పదాలను శ్రీ లక్ష్మణరావుగారే మొదట సృష్టించి వాడుకచేశారు. తన 48వ ఏట 1923 జూలై 13న లక్ష్మణరావు పరమపదించారు.

## లక్ష్మీదేవి

విష్ణుమూర్తి అర్ధాంగి. సర్వసౌభాగ్యాలకూ పుట్టినిల్లు. బ్రహ్మవైవర్త పురాణం లోనూ, దేవీభాగవతంలోనూ లక్ష్మీదేవిని గురించి చిత్రాతి చిత్రాలైన కథలున్నాయి. సృష్ట్యాదిని గోలోకంలో కృష్ణుని ఎడమభాగం నుంచి ఒక సుందరాంగి పుట్టింది. ఆమె రెండురూపాలు ధరించింది. ఒక రూపం రాధ. రెండవరూపం లక్ష్మి. కృష్ణుడు కూడా రెండురూపాలు ధరించి చతుర్బాహులుగల నారాయణ రూపంలో లక్ష్మిని వెంటబెట్టుకుని వైకుంఠం చేరు

కున్నాడు. దుర్వాసుడిశాపం వల్ల లక్ష్మి సముద్రం లోపడి దేవదానవులు ఆ సముద్రాన్ని మథించినపుడు తిరిగి జన్మించి విష్ణుమూర్తిని చేపట్టింది. (చూ. క్షీరసాగరం మథనం)ఆయనతో పాటు భూమిమీద అవతరించ సాగింది. రామావతారంలో లక్ష్మి సీతగానూ, శ్రీకృష్ణావ తారంలో రుక్మిణిగానూ అవత రించింది. లక్ష్మిపుత్రుడు మన్మథుడు.

## లక్ష్మీనరసింహం, చిలకమర్తి

సుప్రసిద్ధ తెలుగు నాటక రచయిత. పశ్చిమ గోదావరి జిల్లా ఖండవల్లిలో 1876 సెప్టెంబరు 26న లక్ష్మీనర సింహం జన్మించారు. ఆనాడు నాటక సమాజాలు పెట్టి ప్రదర్శనలు ఏర్పాటు చేసే ఇమ్మానేని హనుమంత రావు నాయుడు అనే ప్రముఖుని నిమిత్తం వచనంలో మొదటనాటకాలను చిలకమర్తి రచించారు. ఆయన తొలినాటకం 'కీచకవధ'. ద్రౌపదీ పరిణయం, శ్రీరామ జననం, గయోపాఖ్యానం, పారిజాతపహరణ, నలచరిత్ర, సీతాకళ్యాణం నాటకాలు రాశారు. అప్పటి రంగస్థలావస రాలకు అనుగుణంగా ప్రదర్శన యోగ్యాలైన నాటకాలను ఆయన వ్రాశారు.

1920నుండి తన నాటకాలలో పద్యాలను కూడా ప్రవేశపెట్టారు. మొదట్లో వ్రాసిన గయోపాఖ్యానం మొదలైన నాటకాల్లో పద్యాలను చేర్చి ఆయన ప్రజాభిమా న్ని చూరగొన్నారు. అనేక సంస్కృత నాటకాలను కూడా ఆయన ఆంధ్రీకరించారు. 'పార్వతీ పరిణయం' ఆయన తొలి రచన. భాసుని నాటకాలన్నిటినీ ఆంధ్రకరించి ప్రచురించారు. దృష్టిలోపం ఆయన రచనలకు అడ్డుకా లేదు. స్వతంత్ర రచనలకు ప్రోత్స హించడానికి కందుకూరి వీరేశలింగం పెట్టిన ఉత్తమ నవలపోటీలో చిలకమర్తి వ్రాసిన రామచంద్ర విజయం కి చింతామణి బహుమతి లభించింది. ఆయన వ్రాసిన హేమలత, అహల్యాబాయి, కర్పూర మంజరి, సౌం దర్యతిలక కూడా ప్రథమ బహుమతులను అందు



కున్నాయి. లక్ష్మీనరసింహం వీరేశ లింగం పంతుల్ని తన గురువుగా స్వీకరించారు. 1910లో 'దేశమాత' అను వారపత్రిక పెట్టి సంపాదకుడుగా, ఉండి 'రామాయణం, ధర్మ విజయము' మున్నగు గ్రంథాలను ప్రచురించారు. బ్రిటిష్ పాలకుల అన్యాయాలను విమర్శిస్తూ అనేక వ్యాసాలు వ్రాశారు. 1911లో రేగిన వాదుకభాష, గ్రాంథిక భాషా వివాదంలో గ్రాంథిక భాషోద్యమా న్ని సమర్థిస్తూ ఉపన్యాసాలు చేశారు. రాజమండ్రిలో బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలను (1905) విని చిలకమర్తి వ్రాసిన పద్యం ఆయన దేశభక్తిని చాటుచున్నది.

> *భ రతఖండంబు చక్కని పాడియావు*
> *హిందువులు లేగదూడలై యేడ్చుచుండ*
> *తెల్లవారను గడుసరి గొల్లవారు*
> *పితుకుతున్నారు మూతులు బిగియగట్టి*

1934లో ఆంధ్రవిశ్వవిద్యాలయం లక్ష్మీనరసింహంకు 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించింది. 1945లో ఏప్రిల్ 17న ఆయన స్వర్గస్థులైరి.

## లక్ష్మి నరసింహారావు, పానుగంటి

ప్రసిద్ధమైన 'సాక్షి' వ్యాసాల కర్త. నాటక రచయిత. హాస్య రసపోషకుడుగా ఆధునిక సాహిత్య చరిత్రలో ఒక విశిష్టస్థానం సంపాదించుకున్న మహ నీయుడు. ద్రోణంరాజు వెంకటరమణారావు నిర్వహించిన 'సువర్ణ లేఖ' పత్రికతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొని వ్యాసాలు, కథలు, ప్రహసనాలు అందులో ప్రచురిస్తుండే వారు. అందులోనే మొదటిసారిగా 'సాక్షి' వ్యాసాలు ప్రచురితమైనాయి. ఆ తర్వాత ఆంధ్రపత్రికలో కూడా 'సాక్షి' వ్యాసాలను ప్రచురించారు. 'సాక్షి'లో ఈయన ప్రవేశపెట్టిన జంఘా లశాస్త్రి జనాదరణ పొందిన పాత్ర.

సారంగధర, రాధాకృష్ణ, వృద్ధ వివాహం, కంఠాభర ణము, విచిత్ర వివాహము పానుగంటివారి రచనలలో ప్రసిద్ధములయినవి. కందు కూరివీరేశలింగంప్రారంభిం చిన సమాజ సంస్కరణ మ హోద్యమాన్నికొనసాగించిన



మహనీయులలో పానుగంటి ఒకరు. పైన చెప్పిన 'సాక్షి' ప్రసంగవ్యాసాలు ఆనాటి సాంఘిక జీవన శైలికి అద్దం పడుతూ ఉంటాయి. విశేషజనాదరణ పొందిన ఈ 'సాక్షి' వ్యాసాలు ఆరు సంపుటాలలో ప్రచురితమయ్యాయి. (1920–22) ఆ తరువాత, మరొక రెండుసార్లు పునర్ముద్రితాలయ్యాయి. నాటకకర్తగా ప్రసిద్ధిపొందిన పానుగంటి లక్ష్మీనరసింహారావు 1865 ఫిబ్రవరి 11న రాజమండ్రిలో జన్మించి పిఠాపురం రాజావారి సంస్థానం లోనే చాలకాలం గడిపిరి. 1940 జనవరి 1వ తేదీన కాలధర్మం చెందారు.

## లచ్చన్న, సర్దారు గౌతు

జాతీయ నాయకుడు. సమసమాజవాది. సంఘం లోని బలహీన వర్గాలకు పెద్దదిక్కు. ఈయన 1909 ఆగస్టు 16వ తేదీన బారువా జమీందారీలో విద్యాగంధం లేని కుటుంబంలో జన్మించాడు. తండ్రి చిట్టెయ్య. తల్లి రాజమ్మ. ఉప్పు సత్యాగ్రహం (చూ.) సమయంలో ఉన్నత పాఠశాలలో చదువుతున్న లచ్చన్న గాంధీజీచే ప్రభావితుడై తాను ధరించిన విదేశీ దుస్తులను మంటలో వేసి శ్రీకాకుళం సమీపాన బారువా సముద్రతీరాన ఉప్పు వండి అరెస్టయి జైలుకు వెళ్లిన సాహసి. వివిధ ఉద్యమాల్లో పాల్గొని కారాగారాల్లో చాలా ఏళ్లు గడిపి కష్టాలు అనుభవిస్తూ జాతీయ నాయకులతో పరిచయముయి ఉత్తేజితులయ్యాడు. 1942 క్విట్ ఇండియా ఉద్య మంలో ప్రముఖపాత్ర వహించాడు. దేశానికి స్వరాజ్యం వస్తేగాని పెళ్లి చేసుకోనని భీష్మించిన లచ్చన్న స్వాతంత్ర్యం వచ్చిన తరవాతనే 1948లో యశోదమ్మను వివాహ



మాడాడు. విశాఖపట్టణం హార్బరుకూలీల కోరిన నాయకుడుగా 1948లో ఎన్నికయ్యాడు. ప్రముఖ జాతీయనాయకుడు ఎన్.జి.రంగా (చూ.) శిష్య పరంపరలో లచ్చన్న ప్రముఖుడు. 1951లో రంగాగారి కృషీకార్ లోక్ పార్టీలోచేరి 1952లో మొదటి సార్వత్రిక ఎన్నికల్లో పెద్ద మెజారిటీతో ఎన్నికయ్యాడు. 1953 అక్టోబరు 1, ఆంధ్రరాష్ట్రం అవతరించి, టంగుటూరి ప్రకాశం ముఖ్యమంత్రి అయినప్పుడు ఆయన ప్రతిపక్ష నాయకుడుగా కొనసాగాడు. ఆ తరవాత గోపాలరెడ్డి మంత్రివర్గం (1955)లో విద్యుత్తు శాఖా మంత్రి పదవి నిర్వహించాడు. ఆ తరువాత రంగా నాయకత్వంలో ఏర్పాటు అయిన స్వతంత్ర పార్టీలో చేరి సమాజంలో అట్టడుగున ఉన్న ప్రజలకు ఆర్థిక సామాజిక న్యాయం చేకూరాలని పోరాటం సాగించిన యోధుడు. విధాన పరిషత్తు సభ్యుడయి ఆ తరువాత లోక్ దళ్ నాయకు డయ్యాడు. అత్యవసర పరిస్థితి సమయం(1975)లో అరెస్టయి 1978లో శాసన సభ్యుడయి మరల శాసనసభ ప్రతిపక్ష నాయకుడయ్యాడు. ప్రస్తుతం (1990) వెనుకబడిన తరగతులవారైన గీత కార్మికులు వంటి కులవృత్తులు చేసుకుంటున్నవారి ఆర్థిక, సాంఘికాభ్యు దయానికి ఎనలేని కృషి చేస్తు న్నారు.

## లజపతిరాయ్ లాలా 1865–1928

'పంజాబ్ కేసరి'గా ప్రసిద్ధిపొందిన జాతీయ యోధుడు. ఆర్యసమాజాన్ని—అతివాద రాజకీయాలను సమన్వయపరచిన భారత జాతీయ అగ్రనాయకులలో లాలా లజపతిరాయ్ ఒకరు.

తండ్రి లాలారాధాకిషన్ ఇస్లామ్‌మత భావాలను పాటిస్తూ ఉండగా తల్లి సిక్కు సంప్రదాయాలలో పెరిగి భర్తకు తెలియకుండా హైందవాచారాలను పాటిస్తూ ఉండేది. పంజాబ్‌లోని జాగ్రాన్ పట్టణంలో ఈ దంపతులకు లజపతి రాయ్ 1865లో జన్మించారు. ఈ రెండు మతాలనూ అతీతంగా లజపతి ఆర్యసమాజ్‌కు సన్నిహితుడైనారు. సురేంద్రనాథ్ బెనర్జీ ఉపన్యాసాలు, ఇటలీ జాతీయనాయకుడు గుసెప్పీ మజినీ (1805–72)జీవిత చరిత్ర లజపతిరాయ్‌ని ఉత్తేజితుణ్ణి చేశాయి. హిందూ, ముస్లిమ్ ఐక్యతా ప్రయత్నాన్ని మొదట ఆయన వ్యతిరేకించాడు. కాంగ్రెసు హిందూ సంస్థగా ఉండాలని ఆయన వాదించాడు. ఆంగ్లేయుల జాతి అహంకారాన్ని నిరసిస్తూ, లిబరల్స్ సభలలో ఉపన్యాసాలిచ్చాడు. ఈ ఉపన్యాసాల ఫలితంగానే బ్రిటిష్ వారు ఆయనను నిర్బంధించారు. బెంగాల్ విభజన ఉద్యమాన్ని, విదేశీ వస్తు బహిష్కరణోద్యంగా మార్చాలని లజపతిరాయ్ కోరాడు.

జాతి విముక్తికి హింసాచర్యలను ఆయన సమర్థించాడు. లజపతిరాయ్‌ని ప్రమాదకరమైన నాయకునిగా బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించి 1907లో ఆయనను అరెస్టు చేసింది.



1908 నుండి 1914 వరకు అతివాద రాజకీయాలకు స్వస్తిచెప్పి, కరువునివారణ, అంటరానితనం నిర్మూలన, హిందూ—ముస్లిం ఐకమత్యం వంటి విషయాలలో కృషిచేశాడు. ప్రజలను అజ్ఞానంనుంచి కాపాడడానికి విద్య ఒక్కటే శరణ్యమన్నాడు. 1911లో హిందూ ప్రాథమిక విద్యాలీగ్‌ను ఏర్పరచాడు. హిందూస్తాన్ కావాలని కొత్త వాదన చేశాడు. గాంధీ తలపెట్టిన సహాయనిరాకరణోద్యమం విఫలమైనందున గాంధీని విమర్శించాడు. 1926లో కేంద్ర శాసనసభకు ఎన్నికై, మదనమోహన మాలవీయాతో కలసి 'స్వతంత్ర పార్టీ' స్థాపించి ముస్లిం సభ్యులను వ్యతిరేకిస్తూ వచ్చాడు. పంజాబ్‌ను విభజించి హిందువులకు, ముస్లింలకు పంచాలన్నాడు. సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా లాహోర్‌లో జరిగిన నిరసన ఉరేగింపులో లాఠీ దెబ్బలు తిని 1928 నవంబరు 17న లజపతిరాయ్ శాశ్వతంగా కన్నుమూశాడు. (చూ. భారతస్వాతంత్ర్య పోరాటం)

## లాల్ బహదూర్ శాస్త్రి

భారత దేశానికి ద్వితీయ ప్రధాని (1964–66). రాజనీతిజ్ఞుడు. శాంతికాముకుడు. వారణాసిలో 1904 అక్టోబరు 2న జన్మించాడు కాశీ విద్యాపీఠంలో విద్యాభ్యాసం. కార్మిక సంక్షేమమునకు పాటుపడి ఎనిమిది సార్లు నిర్బంధమునకు గురియై పదేళ్లపాటు కారాగారాములలో గడిపెను. 1952లో రాజ్యసభ సభ్యుడై నెహ్రూ మంత్రి వర్గంలో రైల్వేశాఖను నిర్వహించాడు.అరయలూర్ (తమిళనాడు) రైలు ప్రమాదమునకు నైతిక బాధ్యత వహించి పదవినుండి వైదొలగాడు. పదవిపట్ల ఆసక్తి లేని నిరాడంబరుడుగా కీర్తి సాధించాడు. తరువాత 1957లో లోక్‌సభ సభ్యుడై రవాణా, వాణిజ్య, దేశీయాంగశాఖలు నిర్వహించి అవినీతి నిర్మూలనకు 'సంతానం కమిటీ' నియామకమునకు కారకుడయ్యెను.1964లో నెహ్రూ మరణాంతరం భారతప్రధాని అయ్యెను. ఈ సమయములోనే పాకిస్తాన్ (1965) యుద్ధం జరుగగా ఆ సమస్య పరిష్కారమునకై టాష్కెంట్ (రష్యా )వెళ్లి హఠాన్మరణమునకు గురియయ్యెను. అలీన విధానం, ప్రపంచ శాంతి వంటి ప్రగతిశీల భావాలుపాటించి ప్రశంసలనందుకొనెను.



## లాటిన్ అమెరికా చూ. దక్షిణ అమెరికా

## లావోస్

ఆగ్నేయ ఆసియాలోని పర్వతమయ ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యం (1949). దీనిని లావూ పీపుల్స్ డెమోక్రటిక్ రిపబ్లిక్ అని కూడా పిలుస్తారు. దక్షిణమున తాయిలాండ్, కంపూచియా, తూర్పున వియత్నామ్, పశ్చిమమున, ఉత్తరమున బర్మా ఉన్నాయి. విస్తీర్ణం: 2,36,800 చ.కి.మీ.; జనాభా: 38, 50,000 (1988); రాజధాని: వియెంటీనే; అధికార భాష: లావూ; ప్రజలు ఆదిమభాషలు కూడ మాట్లాడతారు. బౌద్ధం 58శాతం,ఆదిమమత విశ్వాసాలను 34 శాతం పాటిస్తారు. నాస్తికులు 1 శాతం, మతవిశ్వాసం లేనివారు 4 శాతం. మీకాంగ్ నదీలోయ సారవంతమైనది. వరి ప్రధానమైన పంట. మొక్కజొన్న, చెరకు, చిరుగడం, పొగాకు, కాఫీ, తేయాకు, నారింజ జాతులు, కర్ర పెండలం, అనాస, ఉల్లి, ఏలకులు, బెంజోయిన్ ఓషధి, చింకోనా, నల్లమందు పండించి ఎగుమతి చేస్తుంటారు. పశువుల పెంపకం, పట్టు పరిశ్రమ, షెల్లాక్, తోలుపరిశ్రమ మృణ్మయపాత్రలు పేర్కొనదగిన పరిశ్రమలు. జిప్సమ్, రాతి ఉప్పు, తగరం, జింకు ఖనిజనిక్షేపాలు. టేకు కలప లభిస్తున్నది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న దేశం.

## లింకన్, అబ్రహాం 1809–1865

దేశాన్ని పరిపాలించడానికి ప్రజాస్వామ్యం ఒక్కటే మంచి సాధనమని అనుభవం ద్వారా చాటిచెప్పిన మహనీయుడు. ఈయన ప్రపంచ రాజనీతిజ్ఞులలో మరపురాని మహామనీషి. ప్రపంచ ప్రజాస్వామ్యాలపై ఈయన ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది. అమెరికా పౌర యుద్ధ సమయంలో (1861–65) అమెరికన్ రాష్ట్రాల ఐక్యతకై పోరాటం సలిపిన మహాయోధుడు. ఆయన రచనలు ముఖ్యంగా 'గెటీస్‌బర్గ్' ప్రసంగం అనేక మందిని ప్రభావితం చేసింది. ఆయనకు గుండె నిబ్బరం మెండు. ఆయన ఆత్మవిశ్వాసమే ఆయనకున్న సొత్తు. త్యాగశీలి.

కెంటకీలోని ఎలిజబెత్ టౌన్ సమీపమున హాడ్జెన్ విల్లీలోని లాగ్ కేబిన్ ఆయన జన్మస్థలం. జన్మ తేది ఫిబ్రవరి 12, 1809. చిన్నప్పుడు బీదరికంలో చాల కష్టాలు పడి వీధిబడిని పోలిన పాఠశాలలోనే విద్యనభ్యసించాడు. వీమ్స్ రచన 'వాషింగ్‌టన్ జీవిత చరిత్ర' పట్ల ఆకర్షితుడై అనేక సార్లు చదివి స్ఫూర్తిని పొందాడు (1823). ఆజానుబాహుడయిన లింకన్ మంచి వక్త. ధారాళంగా మాట్లాడగలడు. న్యూసెలమ్‌లో వ్యక్తిగత జీవితం ప్రారంభించి ఐచ్ఛిక సైనికోద్యోగి అయ్యాడు (1831). ఆ తరువాత 1832లో స్నేహితులు ప్రోద్బలం చెయ్యగా రాష్ట్ర శాసనసభకు అభ్యర్థిగా నిలబడి ఓడినా 1834లో విజయం సాధించాడు. న్యాయశాస్త్రం అధ్యయనం చేసి న్యాయవాదియై 1840 నాటి జాతీయ రాజకీయరంగంలో అడుగు పెట్టాడు. కాంగ్రెసు సభ్యుడయ్యాడు (1847–49). మరల న్యాయవాది వృత్తిని చేపట్టి కీర్తిని, పలుకుబడిని మరింత సంపాదించుకొన్నాడు. 1858లో సెనేటు సభ్యుడయ్యాడు. పిదప 1861లో అమెరికన్ ప్రెసిడెంట్‌గా ఎన్నుకొనబడ్డాడు. అదే సంవత్సరంలో ఉత్తర–దక్షిణ ప్రాంతాలమధ్య యుద్ధమారంభమయింది. 1862లో బానిస జనోద్ధరణ ప్రాథమిక ప్రకటన గావించాడు. 1863 లో దీనిని బలపరచి మరల ప్రకటన చేశాడు. 1864 మరల అధ్యక్షుడయ్యాడు. 1865 అంతర్యుద్ధం ముగిసింది. నీగ్రోలకు , తెల్లవారికి ఒకే విధమయిన రాజ్యాంగ ఉండవలెనని లింకన్ పట్టుదల. వ్యత్యాసభావం ప్రజాస్వామ్య విధానానికి గొడ్డలిపెట్టు అని ఆయన తలంపు. ఇటువంటి ప్రగతిశీలక సమాజ కళ్యాణ భావాలకన్నిటికీ కార్యరూపమివ్వడం సాధ్యమా అని వాపోతూ ఉండేవాడు.



అయితే అబ్రహాం లింకన్ రాజధాని వాషింగ్‌టన్‌డి.సి. లో నాటక ప్రదర్శనను ఒక ప్రేక్షకుడుగా తిలకిస్తూ ఉండగా శత్రుపక్ష ప్రోద్బలంతో బూత్ అనువాడు తుపాకీతో వెనుకనుండి కాల్చగా హఠాన్మరణమునకు గురి అయి కీర్తిశేషు డయ్యాడు. లింకన్ అధ్యక్షుడుగా ఉండగా మొదటిసారి నోట్లు (కరెన్సీ) ప్రవేశపెట్టబడ్డాయి (1861). బంజరు భూముల పట్టాలనిచ్చే హోమ్‌స్టీడ్ చట్టం (1862), నీగ్రో బానిసజనోద్ధరణ ప్రకటన (1863) ప్రధాన ఘట్టాలు. ఈయన పేరు చిరస్థాయిగా నిలుచుటకు ఈ చివరి చర్య తోడ్పడినది. సౌత్ డకోటాలోని రష్‌మోర్ పర్వత ప్రాంతంలో ఉన్న ఒక జాతీయ స్మారక ప్రాంగణ శిఖరాగ్రమున వాషింగ్‌టన్, జెఫర్సన్, తియొడోర్ రూజ్‌వెల్ట్‌తో బాటు లింకన్ శిలావిగ్రహాన్ని శిల్పించి అమెరికన్ ప్రజలు నివాళులు అర్పించారు. వాషింగ్‌టన్ (డి.సి.)లోని లింకన్ మెమోరియల్ చూడదగ్గ విశేషం.

## లిక్టెన్‌స్టీన్

యూరప్‌లో స్విట్జర్లండ్, ఆస్ట్రియా దేశాల మధ్య రైన్ నది మీద ఉన్న బహుచిన్న రాజ్యం. 1866లో ఏర్పడిన ఈ దేశాన్ని రాజవంశీయులు పాలిస్తున్నారు. విస్తీర్ణం: 160 చ.కి.మీ.; జనాభా: 27,840 (1988); రాజధాని: వాడుజ్; అధికార భాష: జర్మన్. ప్రజలు 87 శాతం రోమన్ కేథలిక్ క్రైస్తవాన్ని పాటిస్తారు. బార్లీ, గోధుమ, మొక్కజొన్న పండిస్తారు. పాడి పరిశ్రమ ఉంది. ఆర్థిక వ్యవస్థ పరిశ్రమలమీదనే ఆధారపడి ఉన్నది. జపుళీ, యంత్రపు పనిముట్లు, ఎలక్ట్రానిక్ సామగ్రి, ఎలక్ట్రాన్ మైక్రో స్కోపులు, సున్నితమైన పరికరాలు, ఆహార పదార్థాలు, ధాతుసామగ్రి, హై–వాక్యూమ్ పంపులు, తోలు సామగ్రి ప్రధాన పరిశ్రమలు.

## లిబియా

మధ్యధరా సముద్రాన్ని ఆనుకొని ఉత్తర ఆఫ్రికాలోని సోషలిస్టు రాజ్యం. ఇది 1977 నుండి ది సోషలిస్టు పీపుల్స్ లిబియన్ అరబ్బీ జమాహిరీయా అని పిలువబడుతూంది. ఒకప్పుడు ఇటలీ వలసరాజ్యంగా ఉండి 1949లో స్వతంత్ర్య రాజ్యమయింది. 1986లో దీనిరాజధాని ట్రిపోలీనుండి 650 కి.మీ. దూరాన ఆల్–జుఫూర్ (హూన్) కు తరలించారు.




విస్తీర్ణం: 17,75,000 చ.కి.మీ; జనాభా: 43, 16,000; రాజధాని: ఆల్–జుఫూర్ (హూన్), 1986 వరకూ ట్రిపోలీ; అధికార భాష: అరబ్బీ; ప్రజలు లిబియన్ అరబ్బీ, బెర్‌బెర్ జాతులకు చెందినవారు సున్నీ ముస్లిం సంప్రదాయం పాటిస్తారు. వాయవ్యాన్ని కోస్తా మైదానం, ఈశాన్యంలోని మిట్టప్రాంతం సారవంతమయిన నేలలు. దక్షిణ లిబియా అంతా సహారా ఎడారి ఆక్రమించింది. అయితే సహారాలో అక్కడక్కడ ఉన్న పచ్చపట్టు (ఒయాసిస్సు)ల ప్రాంతాల్లో నేల సారవంతమైంది. ఆగ్నేయంలో ఆల్‌కుఫ్రా వద్ద ఉన్న భూమ్యంతర్గత సరస్సు అవసరమయిన పంట నీటిని అందిస్తున్నది. సముద్రమట్టానికి 2286 మీ. ఎత్తున్న బెట్టే పర్వత శిఖరాగ్రం లిబియాలో మిక్కిలి ఎత్తయినది.

గోధుమ, ఆలివ్, పుచ్చకాయలు, బంగాళాదుంపలు, బార్లీ, ఉల్లి, ఖర్జూరం, టమోటాలు, నారింజ, ద్రాక్ష, అపరాలు ప్రధానమయిన పంటదినుసులు. ఒంటెలు, గాడిదలు మెండు. గొర్రె, మేక, పశువుల పెంపకం ఉన్నది. కలప లభిస్తున్నది. జిప్సమ్, ఉప్పు ఖనిజోత్పత్తులు. లిబియాలో పెట్రోలు తైల నిక్షేపాల ఉనికిని 1957లో కనుగొన్నారు. అప్పటి నుండీ లిబియా పెట్రోలు ఎగుమతి దేశంగా ప్రసిద్ధి గాంచినది. పొగాకు, జవుళీ, మత్స్యపరిశ్రమలు ఆర్థిక వ్యవస్థను ఇనుమడింప చేస్తున్నాయి. ప్రపంచంలో అత్యధిక ఉష్ణోగ్రత (58°C) నమోదయినపట్టణం. ఆల్ ఆజియిహ్ లిబియాలోనేవుంది.

## లెనిన్ 1970–1924

రష్యన్ రాజనీతిజ్ఞుడు. స్వాతంత్ర్య సమరయోధుడు. బొల్షివిక్ విప్లవ నాయకుడు. అసలు పేరు వ్లాడిమర్ ఇల్యిచ్ ఉలయానావ్ లెనిన్. తండ్రి పాఠశాల పర్యవేక్షకుడు. విద్యావంతులయిన మధ్యతరగతివారికి వారి ఇల్లు ఇష్టాగోష్ఠులకు కేంద్రంగా ఉండేది. కజన్ యూనివర్సిటీలో విద్యనభ్యసించాడు. కార్ల్‌మార్క్స్ రచన 'దాస్ కాపిటల్' (చూ.) చదివి ప్రేరితుడయి సాంఘిక, ఆర్థిక అసమానతలను రూపుమాపుటానికి కమ్యూనిజమే శరణ్యమని నమ్మాడు. సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో కార్మికులను, కర్షకులను దాస్యవిముక్తులను చేయడానికి సమ్మెలు చేయించాడు. 1893–1917 మధ్యకాలంలో రష్యాలోనూ, జర్మనీ, స్విట్జర్లాండు వంటి దేశాలలో అజ్ఞాత విప్లవవీరుడుగా పనిచేశాడు. ఈ సమయంలోనే సోషియల్ డెమోక్రాటిక్ పార్టీ అవతరించి 1903 నాటికి అందులో మెన్షివిక్, బోల్షివిక్ పక్షాలు ఏర్పడ్డాయి. విప్లవ పంథాను తొక్కిన బోల్షివిక్ పక్షానికి లెనిన్ నాయకత్వం వహించాడు. అంతకు ముందు 1897లో లెనిన్ సైబీరియా ప్రవాసానికి పంపబడ్డాడు. 1905లో పీటర్స్‌బర్గ్‌కు తిరిగి వచ్చి వర్కర్స్ సోవియట్‌ను స్థాపించాడు. ట్రాట్‌స్కీ (చూ.) లెనిన్‌కు తలలో నాలుకగా నమ్మినబంటు అయి సలహా సహాయాలు చేశాడు. 1905 విప్లవం ఫలించక జెనీవా పారిపోయాడు. అక్కడ గోర్కీ (చూ.) పరిచయమయింది. 1913లో పీటర్స్‌బర్గ్ వచ్చి 'ప్రావ్దా' అను పత్రికను ఉత్తేజకర వ్యాసాలతో నడిపాడు. ఏప్రిల్ 1917లో ప్రవాసంలో ఉన్న విప్లవ నాయకులందరు రష్యాకు తిరిగి రావడంతో వారికి లెనిన్ నాయకుడై నవంబరు విప్లవం తరువాత స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచాడు. అనతికాలంలో అరాచకాన్ని అరికట్టి 1921లో సరికొత్త ఆర్థిక విధానాన్ని (న్యూ ఎకనామిక్ పాలసీ)రూపొందింపచేసి అమలుచేయడం ప్రారంభించాడు. రష్యాలో ప్రణాళికాబద్ధమైన పారిశ్రామికాభ్యుదయానికి బీజాలు వేసిన లెనిన్ వోల్గా నదీతీరాన






సింబుర్స్క్ (నేటి ఉలయానావ్స్క్)లో 1870 ఏప్రిల్ 10న జన్మించి 1924 జనవరి 2న కీర్తిశేషుడయ్యాడు. రసాయనిక సంస్కారం (ఎమ్బామింగ్) చేసి మాస్కోలోని క్రెమ్లిన్ రెడ్‌స్క్వేర్‌లో భద్రపరచిన లెనిన్ భౌతిక కాయాన్ని ఉంచిన ప్రత్యేక మాసోలియమ్' (లెనిన్ సమాధి)ని దర్శించడానికి నిత్యమూ వేలకొద్దీ సోవియట్ పౌరులు వచ్చి నివాళులు అర్పించి వెళుతూ ఉంటారు. (చూ. రష్యా విప్లవం)

## లెబనాన్

పశ్చిమ ఆసియాలో మధ్యధరాను ఆనుకొని యున్న స్వతంత్ర గణ రాజ్యం. వైభవోపేతమయిన చరిత్ర గల ప్రాంతం. ఫొనీషియన్‌లు (చూ.ఫొనీషియా) ఒకప్పుడు ఈ ప్రాంతమును ఏలి ఘన చరిత్రను సృష్టించారు. లెబనాన్‌కు ఉత్తరాన సిరియా, దక్షిణాన ఇజ్రాయెల్ ఉన్నాయి.

విస్తీర్ణం: 10,230 చ.కి.మీ; జనాభా: 28,28,000 (1988); రాజధాని: బీరుట్; అధికార భాష: అరబ్బీ; ఇంగ్లీషు, ఫ్రెంచి కూడా మాట్లాడతారు. ప్రజలలో ముస్లిములు షియా 32 శాతం, సున్నీ 21 శాతం, క్రైస్తవులు 40 శాతం, డ్రూజే 7 శాతం. దేశం కొండల మయం. లితానీ నది, ఓరెంటీస్ నది ముఖ్యమయిన నదీ సంపద. ఇవి మధ్యధరా సముద్రంలో సంగమిస్తున్నాయి. ప్రజలకు జీవనాధారం సేద్యం. బార్లీ, మొక్క జొన్న, గోధుమ, ఆలివ్, పుచ్చ, దోస, ద్రాక్ష, ఆపిలు పండ్లు, అరటి పండ్లు, నిమ్మ, నారింజ జాతులు, కూరగాయలు అంగూర ప్రధానమైన వ్యవసాయోత్పత్తులు. ఉప్పు, జిప్సమ్ ఖనిజనిక్షేపాలు. పెట్రోలు తైలశోధన, ఆహార పదార్థాలు, సిమెంట్, తోలు సామగ్రి, జవుళీ లెబనాన్‌లోని పరిశ్రమలు. మత్స్య పరిశ్రమ ఉంది. కలప దొరుకుతుంది. వినోద యాత్రా పరిశ్రమ వల్ల కూడా విదేశీ ద్రవ్యం సమకూరుతున్నది.

## లెసోతో

అన్నివైపుల దక్షిణ ఆఫ్రికా సరిహద్దుగా ఉండి రాజవంశీయులు పాలిస్తున్న దేశం. 1966కు పూర్వం బసూటాలాండ్ పేరుతో వ్యవహరింపబడి బ్రిటిషు వలస రాజ్యంగా ఉండేది.విస్తీర్ణం: 30,355 చ.కి.మీ.;జనాభా: 16,71,000(1988);రాజధాని:మసేరు;అధికారభాష ఇంగ్లీషు, సూతో భాషను, సేసూలో భాషను ప్రజలు మాట్లాడతారు. ప్రజలు 84 శాతం క్రైస్తవం, 6 శాతం ఆదిమ మత విశ్వాసాల్ని పాటిస్తారు. ప్రజలలో నీగ్రో జాతికి చెందిన సోతో తెగవారు 99 శాతం ఉన్నారు. దేశం పర్వతమయం. ఆరెంజీ నది, కాల్డెడెన్ ఫ్రూట్ నది ప్రధానమయిన నీటి వనరులు. గోధుమ, మొక్క జొన్న, చిరుధాన్యాలు, జొన్న, గోధుమ, ఓట్ ధాన్యం, కూరగాయలు, బఠాణీ, చిక్కుడు, అపరాలు, కంద మూలాలు పంటదినుసులు. పశువుల పెంపకం ఎక్కువ మందికి జీవనాధారం. మోహెయిర్, తోళ్లు, ఉన్ని ఎగుమతి సరుకులు.

## లేపాక్షి

విజయనగర రాజుల కాలంలో అనంతపురం జిల్లా హిందూపురం సమీపాన వెలసిన సుప్రసిద్ధ కళాప్రాంగణం. ఇచ్చటి లేపాక్షి దేవళంలోని వాస్తు శిల్పకళా ఖండాలు అత్యంత అద్భుతంగా ఉంటాయి. చతుర్ముఖ బ్రహ్మ విగ్రహం భయవిభ్రమానందం కలిగిస్తుంది. రంగమండపం తీర్చిదిద్దిన నిర్మాణం. ఇందులోని 64 స్తంభాలు ఏకశిలనుండి చెక్కిన రాతి కంబాలు. వీటిలో రెండు


లేపాక్షి బసవయ్య

నేలను ఆనకుండా వేలాడుతూ ఉంటాయి. రంగమండపంలో ఉన్న 'శివతాండవకేళి' రమణీయంగా ఉండి చూపరులను ఆకట్టుకుంటుంట. ఇచ్చట శిల్పకళాఖండాలు శిల్పుల సృజనాత్మకతను అద్దంపట్టి చూపిస్తాయి. ఇక చతుర్ముఖ బ్రహ్మ మృదంగాన్ని, తుంబరుడు వీణను, నందికేశ్వరుడు హుడక్కాను వాయిస్తూ ఉంటారు. దేవవేశ్య మనోహరంగా నాట్యంచేస్తూ ఉంటుంది. మృత్యుంజయ గాథ, సిరియాలుని కథ వంటి శివకథల్ని లేపాక్షిలో శిల్పించారు. ఇక్కడ ఉన్న నందికేశ్వరుడు బ్రహ్మాండమయినది. ఏకశిల నుంచి చెక్కిన ఈ లేపాక్షి నంది ఎత్తు దాదాపు 7 మీటర్లు పొడవు 10మీటర్లు. 'లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా' అంటూ సుప్రసిద్ధ తెలుగు కవి అడవి బాపిరాజు లేపాక్షినందిని శ్లాఘించాడు.

## లైబీరియా

అట్లాంటిక్ మహాసముద్రాన్ని ఆనుకునియున్న స్వతంత్ర గణ రాజ్యం. 1847లో స్వాతంత్ర్యం సంతరించుకుంది. అంతకు ముందు 1822లో అమెరికాలోని నీగ్రోబానిసలకు పునారావాసం కల్పించే సత్‌సంకల్పంతో యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వార్థిక సహాయంతో లైబీరియాను ఏర్పాటు చేశారు.

విస్తీర్ణం: 99,067 చ.కి.మీ.; జనాభా: 24,36,000(1988); రాజధాని: మన్రోవియా; అధికార భాష: ఇంగ్లీషు. ఆదిమ భాషలు ప్రజలు వాడుక చేస్తారు. ప్రజలు క్పెలీ, బస్సా, గ్రీబో, గియో, క్రూ, మానో ఇత్యాది ఆదిమ నీగ్రో జాతులవారున్నారు. లైబీరియా ప్రభుత్వ వ్యవస్థ యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగ ప్రాతిపదిక మీదనే ఆధారపడి రూపొందిచబడినది. మానో నది, లోఫ్లా నది, సెయింట్ పాల్ నది, జాన్ నది, సెస్టోస్ నది, కెవేలియా నది ప్రధాన జలాధారాలు. కాఫీ, కోకో, పామ్ నూనెగింజలు, పెండలం, నారింజ, అనాస, చెరకు, కర్ర పెండలం, అరటి పండ్లు, వరి, రబ్బరు ముఖ్యమైన పంట దినుసులు. రబ్బరు, కాఫీ, నారింజ జాతులు ఎగుమతి ప్రాధాన్యం వహిస్తున్నాయి. పశుపోషణ ఉంది. చేపలు పట్టి విక్రయిస్తారు. ఖనిజ పరిశ్రమలు ప్రముఖమయినవి. ఇనుపరాయి, బంగారం, వజ్రాలు దొరుకుతాయి. సిమెంటు, పామ్ నూనె, సిగరెట్లు, పానీయాలు ప్రధానమైన పరిశ్రమలు. అడవుల ఉత్పత్తులలో కోలాకాయలు, పామ్ నూనె, పియాస్సావార (చీపుళ్లకు పనికి వచ్చేది) పేర్కొనదగినవి.

## లోక్‌సభ

పార్లమెంట్‌లోని రెండు సభలలో ఒకటి; రెండవది రాజ్యసభ. దీనినే దిగువసభ అంటారు. రాజ్యాంగ ప్రకారం అత్యధిక అధికారులు కలిగి వుండి సభ్యులను ప్రజలు, ప్రత్యక్షంగా ఎన్నుకుంటారు. ఆయా రాష్ట్రాలలోనూ, కేంద్రపాలితప్రాంతాలలోను ఓటర్ల సంఖ్యను బట్టి నియోజక వర్గాలుగా విభజించారు. ప్రతి నియోజక వర్గం నుండి ఒక అభ్యర్థిని ఎన్నుకుంటారు. ఓట్ల సంఖ్య అధికంగా వచ్చిన అభ్యర్థి లోక్‌సభ సభ్యుడుగా ఎన్నికల కమీషన్ తరపున ప్రకటిస్తారు. లోక్‌సభకు 545కి మించకుండా ప్రత్యక్షంగా ఎన్నికైన సభ్యులు ఉంటారు. వీరిలో 525 మంది సభ్యులు వివిధ రాష్ట్రాల నుండి ఎన్నికాగా 20 మంది కేంద్రపాలిత ప్రాంతాలనుండి ఎన్నుకోబడతారు. వీరుగాక ఇద్దరు ఆంగ్లో ఇండియన్లను రాష్ట్రపతి నామినేట్ చేయవచ్చు. లోక్‌సభ కాల అవధి ఐదు సంవత్సరాలు. ఆత్యయిక పరిస్థితులేర్పడిన పక్షంలో పార్లమెంట్ అవధిని మరో సంవత్సర కాలం పొడిగించవచ్చు. అవసరమైతే ఐదు సంవత్సరాల కాలం పూర్తి కాకుండానే రద్దు చేయవచ్చు. ఇప్పటి వరకూ (1990) లోక్‌సభకు పది సార్లు ఎన్నికలు జరిగాయి.

## లోహియా, రామ్‌మనోహర్



ప్రపంచ జాతుల మధ్య సమానత్వాన్ని ఆశించిన సామ్యవాది. భారత సోషలిస్టు ఉద్యమానికి మూల పురుషులలో ఒకరు. 1910 మార్చి 23న ఉత్తరప్రదేశ్‌లో రామ్‌మనోహర్ లోహియా జన్మించారు. 1932లో జర్మన్ విశ్వవిద్యాలయంనుండి డాక్టరేట్ పట్టా పొందారు.

మహాత్మాగాంధీవలె లోహియా దేశవిభజనను వ్యతిరేకించారు. 1946–47లో రేగిన మతకల్లోలాల సమయంలో ముస్లింలకు ధైర్యం చెప్పాడు. ఆయన పరాజయం ఎరుగని ప్రజానాయకుడు. అన్ని రకాల అక్రమాలపై ఏకకాలంలో పోరాటం ప్రారంభించాలన్నది ఆయన లక్ష్యం. రాజకీయ ఉద్యమాలు అనేకం నడిపి జైలుపాలైనారు. ప్రపంచంలో ఏదో ఒక తృతీయ శక్తిని సమీకరించాలని ప్రతిపాదించి తన దూరదృష్టిని నిరూపించాడు. అది నేటి అలీనోద్యమ (చూ. నాన్ ఎలైన్డ్ మూవ్‌మెంట్) రూపంలో నిజమవుతోంది. 1955లో సోషలిస్ట్‌పార్టీని స్థాపించాడు. 1967 అక్టోబరు 12న లోహియా ఢిల్లీలో మరణించారు.

## వందేమాతరం చూ. జాతీయగీతం

## వటికన్ సిటీ

క్రైస్తవ పవిత్ర పుణ్యక్షేత్రం. ఇటలీలోని రోమ్ (చూ.) నగర సమీపమున అతి బుల్లి రాజ్యం. విస్తీర్ణం: 0.4 చ.కి.మీ.; జనాభా: 1,000. ఇది కేతలిక్ మత ప్రధానమైనది. ప్రపంచ కేతలిక్ పీఠాధిపతి పోప్‌కు స్థావరం. ఇది స్వతంత్ర ప్రజాసత్తాక రాజ్యంగా పాలింపబడు తూంది. సెయింట్ పీటర్ చర్చి, వటికన్ ప్రాసాదం, మ్యూజియం, వటికన్ గార్డెన్స్ ప్రధానమయిన దర్శనీయ స్థలాలు. 1929 నుండి స్వతంత్రంగా పాలింపబడుచున్న వటికన్ సిటీకి సొంత తపాల వ్యవస్థ, పోలీసు వ్యవస్థ ప్రత్యేకంగా ఉన్నాయి. ప్రధాన ప్రపంచ భాష లన్నీ మాట్లాడతారు. వటికన్ సిటీని ఇటాలియన్ భాషలో 'స్టాటో డెల్లా సిట్టా డెల్ వాటికనో' అని పిలుస్తారు.

## వనౌతూ

పసిఫిక్ మహాసముద్రంలోని స్వతంత్ర గణ రాజ్యం. పూర్వం న్యూహెబ్రిడీన్ అని పిలువ బడుతున్న ఈ ప్రాంతము 1980 లో స్వాతంత్ర్యం సంతరించుకుని 'వనౌతూ'గా పేరు మార్చుకుంది. ఇందులో 13 పెద్ద దీవులు, 80 చిన్న దీవులు ఉన్నాయి. పెద్ద దీవి పేరు ఎస్పిరితూ సాంతో. ఒకప్పుడు యూరపు దేశానికి చెందిన దొంగనావికులకు స్థావరంగా ఉండి 1906లో ఫ్రెంచి అధీనంలోకి వచ్చింది. విస్తీర్ణం: 12,190 చ.కి.మీ; జనాభా: 1,49,000 (1988); రాజధాని: విలా; అధికార భాష: ఇంగ్లీషు, పిడ్జిన్. ప్రజలు మెలనీషన్ జాతులకు చెందినవారు. ప్రజలలో క్రైస్తవం 82 శాతం, ఆదిమ మత విశ్వాసాలకు చెందిన వారు 8 శాతం ఉన్నారు. కొబ్బరి, కాఫీ, కోకో, కంద మూలాలు, వేరుసెనగ, అరటి, మొక్కజొన్న, ప్రధాన పంట దినుసులు. పందుల పెంపకం విరివిగా సాగుతున్నది. మత్స్యపరిశ్రమ ఉంది. మాంగనీసు ఖనిజాన్ని త్రవ్వి జపాన్‌కు ఎగుమతి చేస్తున్నారు.

## వరంగల్లు జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 23 జిల్లాలలో ఒకటి. ఇది 17° 20', 18° 35' ఉ. అక్షాంశ 78° 51', 80° 45' తూ. రేఖాంశల మధ్య ఉత్తరాన మధ్యప్రదేశ్, తూర్పున ఖమ్మం జిల్లా, దక్షిణాన నల్గొండ, ఖమ్మం జిల్లాలు పశ్చిమాన మెదకు, కరీంనగరం జిల్లాలు




సరిహద్దులుగా ఉన్నాయి. పూర్వం 12–14 శతాబ్దుల మధ్య కాకతీయులు ఓరుగల్లు (వరంగల్లు) రాజధానిగా పెద్ద సామ్రాజ్యాన్ని ఏలినారు. విస్తీర్ణం: 12,846 చ.కి.మీ; జనాభా: 23,01,374 (1981); జిల్లా కేంద్రం: వరంగల్లు; ఈ జిల్లాలో లంబాడీ (బంజారా), కోయ ఆదిమ జాతుల ప్రజలు ఉన్నారు. ఈ జిల్లాలో ప్రవహించే పెద్ద నది గోదావరి. ఆలేరు, పాలేరు, మున్నేరు వంటి ఏరులు, వాగులు, లక్నవరం, పాకాలా, రామప్ప చెరువులు ఇతర జలాధారాలు. జిల్లాలో సున్నపురాయి, డోలమైటు ఖనిజనిక్షేపాలు ఉన్నాయి. వరి, జొన్న, సజ్జ, వేరుసెనగ, ప్రత్తి, మిర్చి ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ సాగుతూంది. గొర్రెలు, మేకలు, కోళ్ళు రైతాంగానికి అదనపు జీవనాధారాలుగా ఉన్నాయి.

వరంగల్లు పారిశ్రామిక కేంద్రం. జవుళీ మిల్లు ఉంది. దోర్నకల్లులో బేరియం లవణాన్ని ఉత్పత్తి చేసే కర్మాగారం ఉన్నది. వరంగల్లు విద్యాకేంద్రం. కాకతీయ యూని వర్శిటీ, రీజనల్ ఇంజనీరింగు కాలేజి, మెడికల్ కాలేజి, పాలిటెక్నిక్ విద్యాసంస్థలున్నాయి. చారిత్రకప్రసిద్ధిగలవరంగల్లు కోట, వెయ్యి స్తంభాల (హనుమకొండ) గుడి వరంగల్లు పట్టణంలో ఉన్నాయి. వరంగల్లుకు 70 కి.మీ దూరంలో ఉన్న రామప్ప గుడి రమణీయమయిన కాకతీయ వాస్తు శిల్ప సంపదకు కేంద్రం. పాఖాలా సరస్సు, రామప్ప చెరువు, లక్నవరం చెరువు ఆటవిడుపు స్తలాలు. ఏటూరునాగారం వద్ద వన్యప్రాణికి అభయారణ్యం ఉంది.చూ. రామప్పగుడి

## వరుణుడు

జల దేవుడు (సముద్రాధినేత). బ్రహ్మచే పశ్చిమ దిక్పాలుడుగా నియమింపబడ్డాడు. ఈయన ఒక ప్రజా పతికి అడితివల్ల కలిగిన కుమారుడు. గౌరి, వారుణాణి, కార్శనీ మొదలగువారు ఈయనకు భార్యలు. సుశేన, వండీ మొదలగువారు కుమారులు. ఖాండవ దహన సమయంలో అర్జునునికి గాండీవాన్ని, కపిరాజు ఉన్న పతాకాన్ని వరుణుడు ప్రసాదిస్తాడు. ఈయన నివాసం 'శ్రద్ధావతి'.

## వల్లభాయి పటేల్

ఉక్కుమనిషి, ధర్మనిరతుడు, భారతస్వాతం త్ర్య పోరాటాన్ని నైతిక మార్గాన నడిపిన ధైర్యశాలి. గాంధీ మహాత్ముని పట్ల భక్తి కలిగిన నమ్మినబంటు.

కైరాజిల్లా నడియాద గ్రామంలో రైతుకుటుంబంలో 1875లో అక్టోబరు13 వల్లభాయి జన్మించారు. చిన్ననాటినుండీ పట్టుదల, దీక్ష, కార్యసాధనలో అనురక్తి, క్రమశిక్షణ కలిగి ఉండి న్యాయంకోసం పోరాడుతుండే వాడు. ఇంగ్లండ్‌లో బారిస్టర్ చదివి న్యాయవాద వృత్తి స్వీకరించాడు. 1909లో ఆనంద నగర న్యాయస్థానంలో వాదిస్తుండగా భార్య మరణించినదనే టెలిగ్రామ్ అందింది. ఆయన ఆ సమయంలో వాదిస్తున్న కేసు మరణశిక్షకు గురైనది. వల్లభాయ్ టెలిగ్రామ్ చూసి చలింపక ముఖ్యమైన సాక్షినిక్రాస్ పరీక్ష చేయడం కొనసాగించారు. అప్పటికి ఆయన వయస్సు 39 ఏళ్లు.

1917లో మహాత్ముని ఉపదేశాలకు ఆకర్షితుడై లాభసాటి న్యాయవాదవృత్తిని త్యాగంచేసిన ధీశాలి. వెట్టిచాకిరీ నిర్మూలించి శ్రామిక ప్రజలకు విముక్తి కల్పించడానికి నడుం కట్టాడు. అహమ్మదాబాదులో 1917లో ప్లేగువ్యాధి వ్యాపించినపుడు, ఆ తర్వాత నెలకొన్న కరువు పరిస్థితులలో ప్రజలకు వల్లభాయ్ చేసిన సేవ మరువరానిది. అహమ్మదాబాదుమునిసిపల్ ఉద్యోగుల అవినీతి చర్యలను అరికట్టి మునిసిపల్ పరిపాలనలో నైతిక స్థాయిని పెంచాడు. గాంధీజీ నాయకత్వంలో



నిర్వహింపబడిన సహాయ నిరాకరణ, శాసనోల్లంఘనం, ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమం — అన్నింటిలోనూ పాల్గొని జైలుకెళ్లారు. 1932 కరాచీ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించారు. ఖేడా జిల్లాలో అతివృష్టి, క్షామం ఏర్పడినపుడు రైతులు శిస్తు కట్టలేని పరిస్థితి ఏర్పటగా ప్రభుతవ ఏమాత్రం కనికరించకపోవడంతో రైతుల క్షేమంకోసం వల్లభాయి పెద్దఎత్తున ఉద్యమం చేపట్టి సాధించారు. స్వాతంత్ర్యానంతరం (1947) ఉపప్రధాని (డిప్యూటి ప్రైమ్ మినిస్టరు) అయి దేశీయాంగ (హోమ్) శాఖను నిర్వహిస్తూ సుమారు 520 చిన్న, పెద్ద రాజసంస్థానాలను భారత ప్రభుత్వంలో **విలీనం చేసి దేశసమగ్రతను, సమైక్యతను పరిరక్షించారు. 1950 డిసె. 15వ కీర్తిశేషుడయిన పటేల్‌కు మరణానంతరం 'భారతరత్న' (1991) లభించింది.**

## వశిష్ఠుడు

సప్త మహర్షు(చూ!)లలో ఒకడు. ఈయన బ్రహ్మ నాలుక నుండి ఉద్భవించాడని ఒక పురాణ గాథ సూర్య వరుణులకు ఊర్వశిని చూడడం వలన రేతఃపతనం కాగా ఆరేతస్సు నుండి వసిష్ఠుడూ, అగస్త్యుడూ పుట్టారని మరొక పురాణం చెబుతున్నాయి. మరొక శ్లోకం వసిష్ఠుడు ఒక వేశ్యపుత్రుడనితెలుపుతూంది వేశ్యగర్భంలో జన్మించి తపస్సు చేసి వసిష్ఠుడు

బ్రాహ్మణత్వం సాధించాడు. వసిష్ఠుని ధర్మపత్ని అరుంధతి. ఆమె పరమ పతివ్రత. ఈ పురాణ దంపతులకు కలిగిన పలువురు పుత్రులలో 'శక్తి' పెద్దవాడు. ఈ శక్తి పుత్రుడే పరాశరుడు. ఆ పరాశరుని కుమారుడు వ్యాసుడు (చూ.) వసిష్ఠుడు హోమధేనువు (చూ. కామధేనువు) నీయలేదని అలిగి, విశ్వామిత్రుడు దానిని బలవంతంగా కొనిపోవ ప్రయత్నించగా ఆధేనువు నుంచి పుట్టిన సైన్యం విశ్వామిత్రుణ్ణీ, అతని సైన్యాన్నీ ఓడించింది. అప్పటి నుంచి విశ్వామిత్రుడు వసిష్ఠునితో వైరం పూని అతనితో సమానమైన తపశ్శక్తి సాధించడానికి తపస్సుచేసి రాజర్షి అయాడు (చూ. విశ్వామిత్రుడు). సూర్యవంశపు రాజులకు వసిష్ఠుడు కుల గురువు. దశరథుని చేత పుత్రకామేష్టి చేయించి శ్రీరామావతారానికి మార్గం కల్పించిన మహనీయుడు. వసిష్ఠుణ్ణి గురించి భారతీయ పురాణాలలో అనేక కథలు ఉన్నాయి.

## వాత్స్యాయనుడు క్రీ.శ. 2వ శతాబ్ది

సుప్రసిద్ధమైన 'కామసూత్ర' శాస్త్ర గ్రంథ కర్త. ఈయనకే పాక్షిలస్వామి, ద్రమిడ (ద్రవిడ), మల్లనాగాది నామాలు కూడా ఉన్నాయి. కామసూత్రాలనే గాక ఈయన 'న్యాయభాష' అనే గ్రంథం కూడా వ్రాశాడు. ఈ న్యాయ భాష అక్షపాదుడు వ్రాసిన న్యాయసూత్రాలకు భాష్యం. ఈయనకు 'ద్రవిణుడు' అనే పేరుండటం వలన ఈయన దాక్షిణాత్యుడనీ, కంచినివాసి అని అంటారు.

## వాయుదేవుడు

అష్టదిక్పాలకులలో ఒకడు. వాయవ్య దిశకు పాలకుడు. మొదట ఇతడు పూతాత్ముడనే బ్రాహ్మణుడు. కాశిలో శివుణ్ణి గురించి తపస్సు చేసి ఆయన అనుగ్రహం వలన దిక్పాలకత్వాన్నీ, ప్రాణాపానాదులై 5 రూపాలను ధరించే శక్తినీ, సర్వగతత్వాన్నీ (అంతటా వ్యాపించి ఉండడాన్ని) పొందాడు. వాయు దేవుడికి అంజనాదేవి యందు హనుమంతుడు(చూ.) జన్మించాడు. అలాగే కుంతీదేవి యందు భీముడు (చూ.) జన్మించాడు. కుశనాభుని పుత్రికలను చూచి వాయువు మోహించి తనను వివాహం చేసికొనమని వారిని కోరాడు. వారు నిరాకరించడంతో కోపం వచ్చి వారిని వికృత రూపులను చేశాడు.

## వారణాసి

హిందువుల పరమ పవిత్ర శైవ పుణ్యక్షేత్రం. వరుణ- అసిని బెనారసు అనీ కాశీ అనీ కూడ అంటారు. వరుణ—అసి నదుల సంగమస్థానం. ఇచ్చటి విశ్వనాథుని దేవాలయం ప్రసిద్ధమైనది. చాలా ప్రాచీన మయింది. ద్వాదశ జ్యోతిర్లింగాల (చూ.)లో విశ్వేశ్వర లింగం ఒకటి. ఇక్కడ గంగానదిలో స్నానం చేసి విశ్వనాథుని దర్శించు కోవడం ప్రతి హిందువుకూ జీవితలక్ష్యం. గంగా స్నానంవల్ల చేసిన పాపాలు ప్రక్షాళన మవుతాయని హిందువుల విశ్వాసం. స్నానం చేయటానికి గంగానదీ తీరాన చాలా (మణికర్ణిక, దశాశ్వఘట్టాలు) స్నానఘట్టాలు ఉన్నాయి. సాధువులకు కేంద్రం. దేవాలయం వెలుపల 'కాళీమాత' భీకర విగ్రహం ఉంది. సమీపంలోనే అన్నపూర్ణ అమ్మవారి దేవళం ఉంది. ఇక్కడ వేంచేసిన అన్నపూర్ణను కాశీ విశాలాక్షి అని కూడ అంటారు. ఇది సుప్రసిద్ధమయిన శక్తి పీఠాల్లో ఒకటి.

ఇంకా కాలభైరవ ఘట్టం, కేశవ ఆలయం, పంచగంగ (కిరణ, గంగ, ధూతపాప, యమునా, సరస్వతీ నదీ సంగమం) ఘట్టం వంటి పవిత్ర తీర్థాలు. బెనారసు హిందూ యూని వర్శిటీ, నాగరీ (హిందీ) ప్రచారణీ సభవంటి ఉన్నత విద్యాపీఠాలు ఉన్నాయి. గంగానదికి ఆవలివైపున వ్యాసకాశీ ఉంది. జైసింగ్ నిర్మించిన నక్షత్ర వేధశాల, పురావస్తు సంగ్రహాలయం కూడ ఉన్నాయి. బెనారసు జరీపట్టు వస్త్రాలకు ముఖ్యంగా చీరలకు ప్రసిద్ధి. వారణాసి జనాభా 7,08,647 (1981) శివార్లు కలుపుకుంటే జనాభా: 7,91,162. డీజలు రైలు ఇంజనులుతయారీ వంటి భారీ పరిశ్రమలు కూడ ఉన్నాయి. (చూ. ఉత్తరప్రదేశ్)



గంగానది ఘాట్

## వాల్ట్ డిస్నే 1901–66

పిల్లలే ఆయన ప్రపంచం. పిల్లలు ఎప్పుడూ ఆనందోత్సాహాల్లో మునిగి ఉండాలంటే ఏమి చేయాలి? అనే ఆలోచన వాల్ట్ డిస్నేకి తట్టింది. పిల్లలను అలరించే కార్టూన్ ఫిల్మ్‌లు, ఏనిమేషన్ ఫిల్మ్‌లను తయారుచేసి అందించాడు. ఈయన 'యునైటెడ్ స్టేట్స్' వాసి. డిస్నే సృష్టించిన 'మిక్కీ మౌస్' 'మిన్నీ మౌస్' డోనాల్డ్ డక్ ప్రపంచ బాలలకు సుపరిచితం. స్నోవైట్ & సెవెన్



వాల్‌డిస్నే సృష్టించిన మిక్కీమౌజ్ డొనాల్‌డక్

డ్వార్ఫ్స్ (1937), పినిక్కియో, సిల్లీ సింఫనీస్ డిస్నే నిర్మించిన కార్టూన్ ఏనిమాషన్ చలన చిత్రాలు. ఇందులో స్నోవైట్ & సెవెన్ డ్వార్ఫ్స్ ఇటీవలే (1987)స్వర్ణోత్సవం చేసుకుంది. ఇది 40 ప్రపంచ భాషలలో బాల బాలికలను నిత్యమూ అలరిస్తూంది. కాలిఫోర్నియాలో ఈయన పేరున వెలసిన 'డిస్నేలాండ్' ఒక అద్భుత ప్రపంచం. ఫ్లోరిడాలోని ఆర్లెండోలో మరొక పిల్లల వినోద కేంద్రం 'డిస్నీ వరల్డ్'.

## వాల్మీకి

సంస్కృత భాషలోనే గాక ప్రపంచ వాఙ్మయంలోనే ఆదికవిగా ప్రసిద్ధిగాంచిన మహాకవి. వల్మీకం అంటే పుట్ట. పుట్టలోనుంచి వెలువడిన వాడు 'వాల్మీకి' వ్యాసుడు వ్రాసిన ఆధ్యాత్మరామాయణంలో వాల్మీకి కథ ఇలా వివరించబడింది. జన్మచేత బ్రాహ్మణుడైనా కిరాతులతో కలిసి తిరుగుతూ ఒక శూద్రస్త్రీని వివాహమాడి, దారి దొంగతనాలతో అతడు జీవితం గడుపసాగాడు. ఒకరోజున సప్తమహర్షులను దోచుకోడానికి అతడు ప్రయత్నించగా, వారు అతనికి జీవిత పరమార్థాన్ని బోధించారు. 'మరా' అనేమంత్రాన్ని ఉపదేశించారు. ఆ మంత్రం జపిస్తూ అతడు వేల ఏళ్లు తపస్సు చేయగా, అతనిచుట్టూ పుట్టలు పెరిగాయి. సప్తమహర్షులు తిరిగి వచ్చి అతనిని పుట్టనుంచి బయటికి రమ్మని ఆదేశించి, ఋషిత్వాన్ని ప్రసాదించారు. ఋక్షుడు, భార్గవుడు, ప్రాచేతసుడు అని వాల్మీకికి మరి మూడు పేర్లున్నాయి.

తమసా నదీతీరాన ఒకబోయవాడు కామక్రీడలో ఉన్న క్రౌంచపక్షుల జంటలో మగపిట్టను వధించగా అప్రయత్నసిద్ధంగా ఆ దృశ్యంచూసిన వాల్మీకి మహర్షి నోటివెంట క్రింది శ్లోకం వెలువడింది:

> మా నిషాద! ప్రతిష్ఠాం త్వ
> మగమ శ్శాశ్వతీ స్సమాః!
> యత్క్రౌంచ మిథునా దేక
> మవధీః కామమోహితమ్

అదే ప్రపంచంలో వెలువడిన మొట్టమొదటి కవితా రచన! తరువాత బ్రహ్మ ఆదేశంతోను, నారదుని ప్రోత్సాహంతోనూ 6 కాండలూ, 24,000 శ్లోకాలూ గల శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని వాల్మీకి మహర్షి రచించాడు (చూ. రామాయణం).

## వాషింగ్‌టన్, జార్జి 1732–99

అమెరికన్ 'జాతిపిత'. యునైటెడ్ స్టేట్స్ వ్యవస్థాపకులలో ఒకడు. ప్రప్రథమ అమెరికా అధ్యక్షుడు (1789–97). వర్జీనియా రాష్ట్రంలోని ఫ్రెడరిక్స్‌బర్గ్‌లో నార్త్ హేంప్‌షైర్ కుటుంబంలో పదిమంది సంతానంలో ఒకడుగా 1732 ఫిబ్రవరి 22న జన్మించాడు. చిన్నప్పుడే తండ్రి మరణించగా కష్టపడి సర్వేయర్ అయి బ్రిటిషు సైన్యంలో చేరి ఫ్రెంచివారితో పోరాడాడు. బ్రిటిషువారి పన్ను విధింపు విధనానికి నిరసనగా చెలరేగిన వివాదంలో నాయకత్వం వహించి జయాపజయాల తరవాత చివరకు 1781లో యార్క్‌టౌన్ వద్ద కార్న్‌వాలీస్‌ను లొంగదీసుకుని జయం సాధించాడు. 1787లో అమెరికన్ రాజ్యాంగ నిర్మాణానికి ఏర్పాటయిన 13 రాష్ట్రాల ఫిలడెల్ఫియా పరిషత్తుకు అధ్యక్షుడై తత్ఫలితంగా రూపుగొన్న "యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా"కు మొట్టమొదటి అధ్యక్షుడుగా (1789 మార్చి 4) ఎన్నుకోబడ్డాడు. తన హయాములో చెలరేగిన అల్లర్లనూ తిరుగుబాట్లనూ అతి చాకచక్యంగా అణచి పరిపాలన సాగించాడు. 1799 డిసెంబరు 14న కీర్తిశేషుడయ్యాడు.

## వాషింగ్‌టన్ డి.సి.

యునైటెడ్ స్టేట్స్ రాజధాని. పోటోమాక్ నదీ తీరాన ఉన్న జాతీయ ప్రభుత్వ రాజధాని ప్రాంతాన్ని కొలంబియా మండలం డి.సి.(డి.సి. అంటే డిస్ట్రిక్ట్ కొలంబియా)లో భాగంగా ఉంది. అమెరికా (ప్రెసిడెంట్) అధ్యక్షుని నివాసం 'వైట్‌హవుస్' ప్రాసాదంలో ఉంది. అమెరికన్ పార్లమెంట్ (శాసనసభ) ఉభయసభ (కాంగ్రెస్, సెనేట్)ల ప్రాంగణాన్ని'కాపిటల్' అంటారు. వాషింగ్‌టన్ జనాభా: 6,22,800 (1984) శివార్లు కలుపుకుంటే జనాభా 33,69,600. సగం జనాభా నీగ్రో తెగలవారు ఉన్నారు.




జార్జి వాషింగ్‌టన్ (చూ.) మాన్యుమెంట్, జెఫర్సన్ మెమోరియల్ (చూ.) లింకన్ మెమోరియల్, కెనడీ రంగస్థల కేంద్రం, ఆర్లింగ్‌టన్ సమాధి (సెమిట్రీ), ప్రాంగణం, నేషనల్ ఆర్ట్ గ్యాలరీ, రోదసీ మ్యూజియమ్, సుప్రసిద్ధ స్మిత్సోనియన్ సంస్థ ప్రాంగణం, అమెరికన్ చారిత్రక మ్యూజియమ్ ప్రముఖ దర్శనీయ స్థలాలు. ప్రపంచంలోని అతిపెద్ద గ్రంథ సంచయం 'లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్' వాషింగ్‌టన్‌లోనే ఉంది. అమెరికన్ రక్షణ వ్యవస్థకు కార్యకేంద్రం 'పెంటగన్', ఇంకా ఇతర ఫెడరల్ ప్రభుత్వ కార్యాలయలన్నీ వాషింగ్‌టన్‌లోనే ఉన్నాయి.

## వాస్కో_డిగామా 1460–1524

యూరపు నుండి సముద్రమార్గం ద్వారా ఆఫ్రికా ఖండమును(గుడ్‌హోప్ అగ్రం)చుట్టి ఇండియా చేరిన మొట్ట మొదటి పోర్చుగీసు నావికుడు. 1498లో భారతదేశంలోని పశ్చిమ తీరానున్న కళ్లికోట (కాలికట్టు) చేరి మిరియములు ఇతర సుగంధద్రవ్యాల వ్యాపారం సాగించాడు. ఈ విధంగా మొదలయిన పోర్చుగీసు పలుకుబడి పెరిగి పోర్చుగీసు సామ్రాజ్య విస్తరణకు దారి తీసింది. ఆఫ్రికా తీరంవెంబడి పెక్కు పోర్చుగీసు స్థావరాలు ఏర్పరచాడు. గామాకు పోర్చుగీసుప్రభుత్వం'కౌంట్ ఆఫ్‌విడిగ్యూరా' బిరుదును ఇచ్చి సత్కరించింది.



చూ. గోవా, పోర్చుగల్.

## విక్టోరియా

ఇంగ్లండ్ రాణి. బ్రిటిషు సామ్రాజ్యానికి మహారాణి (1837–1901). భారతదేశానికి చక్రవర్తిని (1876–1901). 1840 లో ఆల్బెర్ట్ యువరాజును వివాహమాడింది. ఉత్తమ రాజనీతి విలువలను పాటిస్తూ పాలితుల మన్ననలందుకుంది. ఈమె పాలనా కాలంలోనే భారతదేశం ఈస్ట్ ఇండియా కంపెనీ పాలననుండి బ్రిటిషు పార్లమెంట్ అధీనంలోకి (1876) వచ్చింది. బ్రిటన్ పారిశ్రామికభ్యుదయం పొందింది కూడా ఈమె కాలంలోనే. మానవతావిలువలు పెరిగాయి. ఇంగ్లీషు సాహిత్యం అభివృద్ధి చెందడంతో విక్టోరియన్ సాహితీ యుగాన్ని సువర్ణయుగంగా పేర్కొంటారు. ఈమె పరిపాలనాకాలంలోనే బ్రిటిషు సామ్రాజ్యం ప్రపంచం నలుమూలలా విస్తరించి రవి అస్తమించని సామ్రాజ్యంగా వెలుగొందంది. శాంతి భద్రతలు పరాకాష్ఠనందుకొన్నాయి.విక్టోరియామహారాణి వ్యక్తిగతంగా శ్రమజీవి. ప్రతిభాశాలి. దానికితోడు డిజ్రేలి (1804–81)గ్లాడ్‌టన్ (1809–1898) అను ఇరువురుమేధావులయిన రాజనీతితంత్రజ్ఞులు ఆమె కాలంలో ప్రధానులుగా ఉండి రాచకార్యాల్నికడు సమర్థవంతంగాచక్కపెట్టారు.



## విజయదశమి

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి (మహాలయామావాస్య మరునాడు) తొమ్మిది దేవీనవరాత్రులు జరిపి పదవరోజు ఈ పండుగ జరుపుకుంటారు. దీనికి 'దసరా' అని కూడా అంటారు. విజయదశమినాడు ఉదయం అభ్యంగన స్నానం చేసి, నూతన వస్త్రాలు ధరించి, ఇష్టదైవాన్ని కొలిచి మృష్టాన్నాలు భుజించి సాయంత్రం మేళతాళాలతో ఊరిబయటకి వెళ్ళి జమ్మి చెట్టును పూజించి తిరిగి గ్రామంలో ప్రవేశించి పెద్దలకు జమ్మి ఆకు ఇచ్చి నమస్కరిస్తారు. తెలంగాణా ప్రాంతంలో జమ్మి ఆకును 'బంగారం' అంటారు.

దక్షిణ భారతదేశంలో ఈ నవరాత్రి ఉత్సవాలు ప్రముఖంగా మైసూరులో దసరా ఉత్సవాలు ఏనుగుల సంబరం బాగా జరుగుతాయి. ఉత్తర భారతంలో రామలీలా ఉత్సవాలు జరుగుతాయి. శ్రీరాముడు దేవీపూజలు చేస్తూ ఎనిమిదవనాడు రావణ సంహారం చేసి పదవరోజు అయోధ్యకు తిరిగి వచ్చాడని అంటారు. బెంగాలులో ముఖ్యంగా కలకత్తా నగరంలో 'దుర్గపూజ' బ్రహ్మోత్సవ స్థాయిలో చేస్తారు. ప్రతివారు వారి వారి జీవనోపాధికి ఉపయోగించే సామగ్రికి విజయదశమిరోజున ఆయుధ పూజ చేస్తారు.

## విజయనగరం జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 23 జిల్లాలలో ఒకటి. ఇటీవల (1984) విశాఖపట్టణం జిల్లాలో కొంత ప్రాంతాన్ని, శ్రీకాకుళం జిల్లా కొండ ప్రాంతాన్ని వేరుచేసి ఈ జిల్లాను ఏర్పరచారు. ఈ జిల్లాకు ఉత్తరాన ఒరిస్సా రాష్ట్రం, తూర్పున శ్రీకాకుళం జిల్లా, దక్షిణాన బంగాళాఖాతం, పశ్చిమాన విశాఖపట్టణం జిల్లాలు సరిహద్దులుగా ఉన్నాయి.విస్తీర్ణం: 6,539 చ.కి.మీ; జనాభా : 18,09,688 (1981); జిల్లాకేంద్రం: విజయనగరం; జిల్లాలో సవర జాతి ఆదిమ తెగలవారున్నారు. నాగావళి పెద్ద నది, చంపావతి, గౌతమి, స్వర్ణముఖి, వేదవతి చిన్న నదులు జలాధారాలుగా ఉన్నాయి. మాంగనీస్, క్వార్ట్జ్ ఖనిజ నిక్షేపాలున్నాయి. వరి, రాగులు, జొన్న ఆహార ధాన్యాలు. వేరుసెనగ, చెరకు, మెస్టా ఇతర పంటదినుసులు. బొబ్బిలి వద్ద పంచదార మిల్లు, ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలు ఉన్నాయి. గరివిడి (శ్రీరామనగర్) వద్ద పెద్ద ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీ ఉంది. విజయనగరం కోట, బొబ్బిలి కోట, వీరుల స్తంభం చారిత్రక ప్రసిద్ధములు. విజయనగరం కళలకు నిలయం, సంగీత కళాశాలకు కేంద్రం. బొబ్బిలి వీణావాద్య పరికరాలకు ప్రసిద్ధి. తూర్పు బాణీ గొల్లకలాపం జానపదకళా రూపానికి ఈ జిల్లా ప్రసిద్ధిచెందింది.




## విజయలక్ష్మి పండిట్ జననం 1900

జవహర్ లాల్ నెహ్రూ సోదరి. భారత స్వాతంత్ర్య పోరాటంలో అన్నగారితో బాటు పాల్గొని అనేక సార్లు కారాగారాల్లో నిర్బంధించబడిన వీరవనిత. స్వతంత్ర్య భారత దేశానికి మొట్టమొదటి దౌత్యప్రతినిధిగా (1949--51) గ్రేట్ బ్రిటన్‌కు హై కమీషనర్ పదవిని నిర్వహించింది. ఐక్య రాజ్యసమితి సాధారణసభకు ఎన్నిక అయిన (1954) తొలి మహిళాధ్యక్షురాలు. ఉత్తరప్రదేశ్ గవర్నరు పదవిని నిర్వహించింది.

## విజయవాడ

ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానదీ(చూ) తీరాన ఉన్న విజయవాడ సుప్రసిద్ధ మహానగరం. ఒకప్పుడు ఇది 'బెజవాడ'గా వ్యవహరింపబడేది. రైల్వే కూడలి స్థలం. బస్సు రవాణాలకు లారీ రవాణాలకు కూడా బెజవాడ ముఖ్యమయిన కేంద్రం. చారిత్రకంగా ప్రసిద్ధిగన్న పల్లవుల నాటి గుహాలయాలు విజయవాడ సమీపాన మొగల్రాజపురం, ఉండవల్లి గుహలలో ఉన్నాయి. ఇక్కడ కృష్ణానది మీద రెండు పెద్ద రైలు వంతెనలు ఉన్నాయి. పూర్వపు ఆనకట్టను పునర్నిర్మించి (1958) పంట నీటిని సరఫరా చేసే ప్రకాశం బరాజు మీద కృష్ణా, గుంటూరు జిల్లాలను కలుపుతూ రోడ్డు వంతెన ఉంది. అటులనే ఈ రెండు జిల్లాలను కలుపుతు కనకదుర్గ వారధి మరొక రోడ్డు వంతెన. ఇచ్చట కొండపై వేంచేసిన అమ్మవారి గుడి కనకదుర్గ దేవళం అశేష భక్తజనులను నిత్యమూ ఆకర్షిస్తూ ఉంటుంది. దగ్గరలోనే ఇంద్రకీలాద్రి పర్వతం ఉంది.


గాంధీహిల్

గాంధీ కొండ (గాంధీహిల్)పై గాంధీ స్మారకస్తూపం, దారిలో ఖగోళ ప్రదర్శనశాల – ప్లేనిటోరియం ఉన్నాయి. విజయవాడ వార్తా ప్రసారా, ప్రసార (మీడియా)లకు కేంద్రం. పుస్తక ప్రచురణకు విక్రయాలకు రాష్ట్రంలో పెద్ద కేంద్రం. పెక్కు విద్యాసంస్థలు సాంస్కృతిక సంస్థలు ఉన్న విజయవాడ జనాభా 4,54,577 (1981); శివార్లుకలుపుకుంటే జనసంఖ్య5,43, 000 ఉంటుంది. ఇది కార్పొరేషన్ స్థాయినందు కుంది. రాష్ట్రంలో టోకు వర్తక,వాణిజ్యాలకు,వ్యాపారానికి విజయ వాడ భారీ కేంద్రం.మధ్యమస్థాయి,చిన్నతరహా పరిశ్రమలుఅనేకంఉన్నాయి. గన్నవరం వద్ద బీకన్ ఫ్యాక్టరీ, ఐస్‌క్రీమ్ ఫ్యాక్టరీ, పాలపాడి ఫ్యాక్టరీ ఉన్నాయి. పోరంకిలో పచ్చళ్ల ఫ్యాక్టరీ, ఔషధాల ఫ్యాక్టరీలు ఉన్నాయి.

## విదురుడు

వ్యాసమహర్షికి అంబిక అంతఃపురంలోని దాసి యందు జన్మించిన కుమారుడు. యమ ధర్మరాజే మాండవ్య ముని శాపం వల్ల విదురుడుగా పుట్టాడని ఐతిహ్యం. ధృతరాష్ట్రుడూ, పాండురాజూ కూడా అంబిక, అంబాలిక యందు వ్యాసమహర్షి వలననే జన్మించడం చేత వారు విదురుణ్ని కూడ తమ సోదరుడుగానే చూసుకునే వారు. విదురుడు గొప్ప ధీశాలి, నీతివిద్యాపారంగతుడు, రాజనీతి వేత్త. విదుర నీతి ప్రసిద్ధమైన నీతిబోధ. పాండుపుత్రుల సుగుణాలను మెచ్చుకుంటూ విదురుడెప్పుడూ పాండవపక్షపాతిగానే ఉండేవాడు. పాండవులను లక్క ఇంట దుర్యోధనుడు తగుల బెట్టించాలని ప్రయత్నిస్తూ ఉండగా రహస్యంగా ఒకఖనకుణ్ని (సొరంగాలు త్రవ్వేవాడు) పంపించి విదురుడే వారు తప్పించుకుపోవడానికి తోడ్పడ్డాడు. ద్రౌపదినిపాండవులు వివాహమాడిన తరువాత విదురుడే ధృతరాష్ట్రునిచే వారికి అర్ధరాజ్యం ఇప్పించాడు. అడగడుగునా విదురుడు ధృతరాష్ట్రునకు ధర్మం ఉపదేశిస్తున్నా దైవబలం వల్ల అతని ఉపదేశం ధృతరాష్ట్రుడు పాటించలేదు. కౌరవ పాండవయుద్ధంలో కౌరవులు అంతరించిన తరువాత విదురుడు ధృతరాష్ట్రుడికి వైరాగ్యం ఉపదేశించాడు. ధృతరాష్ట్రుడితో పాటు విదురుడు కూడా నగరం విడిచి తపోవనానికి వెళ్లాడు. అక్కడ ధృతరాష్ట్రుణ్ణి కూడా విడిచి పెట్టి ఘోరమైన తపస్సు చేసి తన యోగబలంతో తన శరీరాన్ని విడిచి ధర్మరాజు శరీరంలో ప్రవేశించాడు. విదురుని శరీరానికి దహన కార్యం చేయాలని ధర్మజుడు ప్రయత్నించగా ఆకాశవాణి విదురుడు యతిశ్రేష్ఠుడనీ, అతని దేహానికి అగ్నికార్యం తగదని వారించిందనీ ఒక ఐతిహ్యం ఉంది.

## విద్యానాథుడు 14వ శతాబ్ది

సుప్రసిద్ధ సంస్కృత ఆలంకారికుడు. 'ప్రతాపరుద్రీయ' కర్త. 'విద్యానాథుడు' ఇతని బిరుద నామమనీ, అసలు పేరు 'అగస్త్యుడ'ని కొందరంటున్నారు. ఈయన కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుని ఆస్థాన విద్వాంసుడుగా ఉంటూ 'ప్రతాపరుద్రీయ యశోభూషణం' అనే ఈ అలంకార గ్రంథం వ్రాసి ఆయనకే అంకితం చేశాడు. ఈ లక్షణ గ్రంథంలోని లక్ష్యాలన్నీ ప్రతాప రుద్రుణ్ణే వర్ణిస్తూ వ్రాసినవే. కావ్య, గుణ, దోష, అలంకార, నాటకాది వివిధ ప్రకరణాలుగా ఈ అలంకార గ్రంథం విభజించబడింది. తెలుగుదేశంలో ఈ అలంకార శాస్త్రం బహుళంగా వ్యవహారంలో ఉండిన ఉద్గ్రంథం. ఈ శాస్త్ర గ్రంథానికి 'రత్నాపణం' అని ఒకటీ, 'రత్నశాణం' అని ఇంకొకటీ రెండు ప్రముఖ వ్యాఖ్యానాలు ఉన్నాయి. సుప్రసిద్ధ సంస్కృత కావ్య వ్యాఖ్యాత మల్లినాథ సూరి కుమారుడైన కుమారస్వామి సోమపీథి 'రత్నాపణ' వ్యాఖ్యకర్త.

## విన్‌స్టన్ చర్చిల్ 1874–1965

పూర్తిపేరు విన్‌స్టన్ లెనార్డ్ స్పెన్సర్ చర్చిల్. బ్రిటిషు రాజనీతి వేత్త. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయం (1939–45)లో బ్రిటిషు ప్రజలకు నాయకత్వ బాధ్యత స్వీకరించి బ్రిటిషు ప్రభుత్వాన్ని గట్టెక్కించిన రాజకీయ ధురంధురుడు. 1900 లోనే పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికలయ్యాడు. విదేశాల్లో బ్రిటిషు సైనికోద్యోగిగా ప్రవేశించి బోయర్ యుద్ధ సమయంలో యుద్ధ విలేఖరిగా పనిచేశాడు. తరువాత బ్రిటిషు ప్రభుత్వంలో కార్యదర్శి

(1908–11) గాను, బ్రిటిషు నౌకాధిపతి (ఫస్ట్‌లార్డ్ ఆఫ్ అడ్మిరాలిటీ)గా 1911–15, 1939-40 సంవత్సరాలలో పని చేశాడు. 1917లో ఆయుధ సామగ్రి మంత్రిత్వశాఖ నిర్వహించాడు. 1918–21 మధ్య యుద్ధమంత్రిగా ఉన్నాడు. 1921–22 మధ్య వలస రాజ్యాల శాఖ నిర్వహించి, 1924–29 మధ్య ఆర్థిక మంత్రి పదవి చేపట్టి దక్షతతో నిర్వహించాడు. 1940–45 మధ్య బ్రిటిషు ప్రధాని అయి రక్షణ శాఖను కడు సమర్థవంతంగా నిర్వహించాడు. మరల 1951–55 మధ్య బ్రిటిషు ప్రధాని అయ్యాడు. ప్రపంచ యుద్ధాల చరిత్రను లిపిబద్ధం చేసి ప్రముఖ సాహిత్యకారుడుగా ప్రసిద్ధి చెందాడు. సాహిత్యంలో 1953 నోబెల్ బహుమతి అందుకొన్నాడు.

## వినోబాభావే

భూదాన యజ్ఞస్థాపకుడు. విద్వాంసుడు. ప్రాయోపవేశం చేసి స్వచ్ఛందంగా దేహం త్యాగం చేసిన ఆధునిక భారతయోగి. బహుభాషావేత్త.

మహారాష్ట్రకు చెందిన కొలాబా జిల్లా గగోదే గ్రామంలో 1895 సెప్టెంబరు 11వ తేదీన నరహరి శంబూరావు, రుక్మిణీ దేవి దంపతులకు వినోబా భావే జన్మించారు. తల్లి నుండి వినోబాకు ఆత్మనిగ్రహం, భక్తి భావం అలవడ్డాయి. చిన్నప్పుడే వినోబా బ్రహ్మచర్య దీక్షను స్వీకరించారు. బరోడాలో ఇంటర్మీడియట్ చదువుతుండగా ఈ చదువు పొట్టకూటికి తప్ప విజ్ఞానాన్ని కలిగించదని వినోబా అర్థం చేసుకొని తన 17వ ఏట స్కూల్ సర్టిఫికెట్లన్నీ తగుల బెట్టి కాశీకివెళ్ళి పోయారు. 1916లోగాంధీజిని కలిసిన



తక్షణం గుజరాత్‌లోని సబర్మతీ ఆశ్రమంలో చేరాడు. ఆశ్రమంలో వినోబా పారిశుద్ధ్యం పని మొదలు వంట పనిదాకా అన్ని రకాల పనులు చేస్తుండేవాడు. 1923, 1932, 1942లో సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని వినోబా జైలు కెళ్ళారు. 1937లో పౌనార్‌లో సొంత ఆశ్రమం నిర్మించుకున్నాడు.

1951 ఏప్రిల్‌లో కాలినడకన ఢిల్లీనుండి ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదు చేరుకొన్నారు. పోచంపల్లి అనే గ్రామాన్ని సందర్శించి పొలం లేకుండా నిరాధారంగా ఉన్న హరిజనుల దుస్థితిపై భూస్వాములతో చర్చలు జరిపారు. రామచంద్రారెడ్డి అనే భూస్వామి తనకు గల వంద ఎకరాల భూమిని వినోబాకు మొట్టమొదటగా దానం చేయగా, వినోబా ఆ భూమిని భూములు లేని హరిజనులకు పంచిపెట్టారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన భూదాన యజ్ఞానికి ఆవిధంగా 1951లో అంకురార్పణ జరిగింది. ఆ తర్వాత 20 ఏళ్ళపాటు 64 వేల కి.మీ దూరం ఇండియాలోని అన్ని రాష్ట్రాలలో పాదయాత్ర జరిపి వేల ఎకరాల భూమిని దానంగా స్వీకరించి నిరుపేద గ్రామీణులకు పంచిపెట్టారు. ఒక్క భూదానమే కాక గ్రామదాన్, సంపత్తిదాన్, శ్రమదాన్, బుద్ధిదాన్ ఉద్యమాలను కూడా వినోబా చేపట్టారు. 1960లో ఉత్తర భారతదేశంలో 19 మంది బందిపోటు దొంగలను తన శక్తియుక్తులతో లోబరచుకుని వారిని మంచివారులుగా మార్చాడు.

వినోబా 34 గ్రంథాలు వ్రాశారు. అందులో మహారాష్ట్ర భాషలో ఆయన రాసిన 'గీతై' ప్రఖ్యాతి గాంచింది. చివరికి ఆహారం, ఔషధాలు, మంచినీళ్ళు తీసుకోవడం మానేసిన 155 గంటల తరువాత అంటే 1982 నవంబరు 15న వినోబాభావే అంతిమ శ్వాస విడిచారు.

## వియత్నామ్

తూర్పు ఆసియాలో సోషలిస్టు రిపబ్లిక్ రాజ్యం. ఇందులో ఉత్తర వియత్నామ్ దక్షిణ వియత్నామ్ కలిసివున్నాయి. ఇది పర్వతమయ దేశం. అన్నామైట్ పర్వతశ్రేణికి ఇరువైపులా ఉత్తరమున ఎర్రనది (రెడ్ రివర్), దక్షిణమున మీకాంగ్ నది ప్రవహిస్తున్నాయి. ఈ రెండు నదులుసాగర సంగమమయ్యే చోట నదీముఖద్వారాలలో డెల్టాలు ఏర్పడడంతో నేల అతిసారవంతమయి దేశానికి ధాన్యాగారమయినాయి.

విస్తీర్ణం: 3,31,653 చ.కి.మీ; జనాభా: 6,38,07,000 (1988); రాజధాని: హనోయ్; అధికార భాష: వియెత్నామీస్; ప్రజలలో వియెత్నామీస్ 88 శాతం. చైనీస్, తాయి, క్మెర్, మూవాంగ్, నూంగ్ తెగలవారు

న్నారు. ప్రజలలో బౌద్ధం (55 శాతం) టావోమతం పాటిస్తున్నారు. వరి ప్రధానమైన పంట. రబ్బరు, కొబ్బరి తోటపంటలు. చెరకు,కాఫీ పండుతాయి. నేలబొగ్గు, తగరం, రాగి, జింకు, క్రోమైట్, ఫాస్ఫేటు రాయి ఖనిజనిక్షేపాలు ఉన్నాయి. సిమెంటు, కాగితం, సిగరెట్లు,తోలు సామగ్రి, వ్యవసాయ యంత్ర సామగ్రి ప్రధానమయిన పరిశ్రమలు. సరస్సులలో మత్స్య పరిశ్రమ సాగుతున్నది. (చూ. హోచిమన్)




## విశాఖపట్టణం జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 23 జిల్లాలలో ఒకటి. ఒకప్పుడు 1952కు పూర్వం విశాఖపట్టణం భారతదేశపు జిల్లాలలోనే అతిపెద్దది. ఇది ఇప్పుడు (1980) మూడు జిల్లాలయింది. విశాఖపట్టణం జిల్లా నుండి వేరుపరిచి కొంతభాగాన్ని శ్రీకాకుళం జిల్లా (చూ.)ను(1950)ఏర్పరచారు. తరువాత 1984లో ఈ రెండు జిల్లాలోని కొన్ని ప్రాంతాలను విడదీసి విజయనగరం జిల్లాగా రూపొందించారు. విశాఖజిల్లాలోని మన్యపు ప్రాంతంలో వీరయ్య దొరనాయకత్వంలో రంప తిరుగుబాటు (1879) జరిగింది. ఈ జిల్లాకు ఉత్తరాన విజయనగరం జిల్లా, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన తూర్పు గోదావరి జిల్లా, పశ్చిమాన ఒరిస్సా రాష్ట్రం సరిహద్దులుగా ఉన్నాయి.

విస్తీర్ణం: 11,161 చ.కి.మీ, జనాభా, 25,27,313 (1981), జిల్లాకేంద్రం: విశాఖపట్టణం. పాడేరు, చింతపల్లి, గూడెం మన్యపు ప్రాంతాలలో సవరలు, కొండరెడ్లు అనబడు గిరిజనులు ఉన్నారు. వీరు మాట్లాడే భాషపై గిడుగువెంకట మూర్తి (చూ.) పండితుడు పరిశోధనలు జరిపి నిఘంటువు కూడ తయారు చేశాడు. విశాఖ జిల్లాలో ప్రధానమయిన నీటి వనరులు గోస్తని, చంపావతి నది, తాండవనది, వర్హ, శారద నదులు, గెడ్డలు ఉన్నాయి. ఒరిస్సా సరిహద్దులు ఉన్న మాచ్‌కొండ జలపాతం ద్వారా జలవిద్యుత్తు ఉత్పత్తి అగుచున్నది. అటవీ సంపదకూడ ఎక్కువ. కుంకుడు, చింతపండు లభిస్తున్నాయి. బంకమన్ను (క్లే), బాక్సైట్ (అల్యూమినియం ధాతువుకు ఖనిజాధారం), మాగ్నిసైట్, వెర్మిక్యులేట్ ఖనిజనిక్షేపాలు.




వరి, రాగి, జొన్న, చిరుధాన్యాలు ముఖ్యమయిన ఆహారపు పంట దినుసులు. వేరుసెనగ, చెరకు, మిర్చి వాణిజ్య పంటలు. జిల్లా తీర సంపద 176 కి.మీ నిడివి. ఈ తీర ప్రాంతంలో భారీ స్థాయిని లోతునీటి మత్స్యపరిశ్రమ సాగు తూంది.

విశాఖపట్టణం ఆంధ్రప్రదేశ్ రెండవ పారిశ్రామికాభివృద్ధి కేంద్రం. రైలు కూడలి స్థలం. తూర్పు తీరానున్న రేవు పట్టణాలలో ప్రముఖమయింది. ఇప్పుడు ఉక్కు ఫ్యాక్టరీని నెలకొనినది (1990). ఇనుపరాయి గోదావరి లోయలోని గనులనుండి సరఫరా అవుతూంది. హెవీప్లేట్స్ అండ్ వెసల్స్, జింకు ధాతు సాధన కర్మాగారం, నౌకా నిర్మాణం, ఎరువుల ఫ్యాక్టరీ, పెట్రోలు తైల శుద్ధి కర్మాగారం (రిఫైనరీ) విశాఖపట్టణపు ఆర్థిక మనుగడకు


విశాఖపట్టణం—నౌకాశ్రయం దృశ్యం

మూలాధారాలు. నౌకాయానానికి గల కీలకమయిన స్థాన బలిమిని బట్టి రక్షణశాఖవారు తూర్పు నౌకాదళాస్థావరాన్ని (ఈస్టర్న్ నేవల్ కమాండ్) విశాఖపట్టణంలోనే వ్యవస్థాపించారు.

అనకాపల్లి బెల్లం పరిశ్రమకు కేంద్రం. ఇచ్చటి చెరకు పరిశోధనా క్షేత్రం ప్రసిద్ధిగాంచిన వ్యవసాయ పరిశోధనా కేంద్రం. భీముని పట్నం, అరకులోయ (దిమ్సా నృత్యం) ముదసరలోయ, సింహాచలంలోని వరాహ నరసింహస్వామి (అప్పన) దేవళం, శంకరం (బౌద్ధ ప్రాంగణం), బొర్రా గుహలు (కేవరన్స్), విశాఖపట్టణంలోని 'డాల్ఫిన్‌నోస్' కొండ దర్శనీయ స్థలాలుగా పేరుగాంచాయి

## విశ్వనాథ్ ప్రతాప్ సింగ్

ఏడవ భారత ప్రధాని. డయ్యా సంస్థానానికి చెందిన రాజవంశ కుటుంబంలో విశ్వనాథ ప్రతాప్ సింగ్ 1931 జూన్ 25న జన్మించాడు. తరవాత మాండా సంస్థానానికి దత్తత వెళ్లారు. చిన్నప్పుడు కుక్ దంపతులు ఈయనను పెంచారు. తరువాత అమర్‌సింగ్ మాథుర్ పోషణలో కొంతకాలం పెరిగాడు. దత్తత స్వీకారం చెల్లక పోవడంతో మరల డయ్యాకు పోవల్సి వచ్చినా మాండాను విడచిపెట్టలేదు. విద్యాభ్యాసం అలహాబాదు లోని ఇంగ్లీషు స్కూలులోను, డెహ్రాడూన్‌లో కల్నర్‌బ్రేక్ స్కూలులోను జరిగింది. వన్యమృగాల వేట అంటే విశ్వనాథ్‌కు అమిత ఇష్టం. సవతి సోదరుడు పంత్ బక్షీతో కలిసి డయ్యా సంస్థానంలో జమీందారీల రద్దు గురించి ప్రచారం చేసేవాడు. అలహాబాదు యూనివర్శిటీలో న్యాయశాస్త్ర పట్టభద్రుడయ్యాడు. వినోబాభావే ప్రారంభించిన భూదానోద్యమంపట్ల ఆకర్షితుడై తన పంట చేలను దానం చేశాడు. రాచరికపు అలవాట్లకు స్వస్తిచెప్పాడు. నిరాడంబర జీవి. నిజాయితీపరుడుగా ప్రసిద్ధిచెంది లాల్‌బహదూర్



శాస్త్రిసలహా, ప్రోత్సాహాలరకు రాజకీయరంగప్రవేశం చేశాడు. 1969లో ఉత్తరప్రదేశ్ శాసనసభకు ఎన్నికయి కాంగ్రెస్ 'విప్' పదవిని చేపట్టాడు. 1971లో లోక్‌సభ సభ్యుడయి 1974లో ఇందిరాగాంధీ మంత్రివర్గసభ్యుడయ్యాడు. 1977లో ఓటమిని చవిచూసినా, 1980 లో విజయం సాధించి ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి పదవిని చేపట్టాడు. 1982లో దొంగల ఏరివేత కార్యక్రమంలో నైతిక బాధ్యత వహించి రాజీనామా చేశాడు. 1984లో లోక్‌సభకు ఎన్నిక అయి రాజీవ్ మంత్రివర్గ సభ్యుడై అవినీతి విషయంలో మంత్రివర్గం నుండి వైదొలగి లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేసి మరల ఉపఎన్నికలలో గెలిచాడు. 1989 డిసెంబరు సార్వత్రిక ఎన్నికలలో మరల లోక్‌సభ సభ్యుడై కాంగ్రేసేతర వామపక్ష కూటమి 'నేషనల్ ఫ్రంట్' తరపున అల్పసంఖ్యాక ప్రభుత్వానికి నాయకత్వం వహించి భారత ప్రధానియై 1990 నవంబరులో పదవికి రాజీనామా చేయగా 1991 మే—జూన్‌లో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో 'జనతాదళ్' అభ్యర్థిగా గెలిచాడు.

## విశ్వామిత్రుడు

గాధిరాజు కుమారుడు. పూర్వాశ్రమంలో కౌశికుడు. మహారాజు. గొప్పతపస్సంపన్నుడు. భృశాశ్వుని దగ్గర అస్త్రవిద్య అభ్యసించాడు. కొన్నాళ్ళు రాజ్యమేలిన తరువాత వసిష్ఠుని ఆశ్రమంలో తన పరివారానికి ఇష్టాన్నాలు కలిపించిన హోమధేనువును బలాత్కారంగా తీసికొని పోవ ప్రయత్నించాడు. వసిష్ఠుని తపఃప్రభావం చేత ఆ ధేనువు దేహం నుంచి శబరాదులు పుట్టి విశ్వామిత్రుని పరివారాన్ని అంతమొందించారు. తన భుజబలం కంటె తపశ్శక్తే గొప్పదని గుర్తించి విశ్వామిత్రుడు సిద్ధాశ్రమం చేరి తపస్సు చేయసాగాడు. ఆయనవద్దకుతపోభంగం చేయడానికి ఇంద్రుడు మేనక అను అప్సరసను పంపాడు. విశ్వామిత్రుడు మోహితుడై ఆమె వలలో చిక్కుకుని ఆమె యందు శకుంతలను కన్నాడు. అనంతరం తిరిగి తపస్సు కొనసాగించాడు. గాలవుడనేశిష్యుణ్ణి ఒక్క చెవిమాత్రంనీలంగా ఉండే 800 తెల్లని గుర్రాలను గురుదక్షిణగా కొని రమ్మనగా, అతడు అలాంటి 600 గుర్రాలనూ, యయాతి కూతురు మాధవినీ తెచ్చి గురుదక్షిణగా అర్పించాడు. మాధవి యందు విశ్వామిత్రునికి అష్టకుడనే కుమారుడు కలిగాడు. విశ్వామిత్రుడు యజ్ఞపశువుగా కొనిపోబడు తున్న శునశ్శేపుణ్ణి కాపాడి అతనిని తన కుమారుడుగా స్వీకరించాడు. విశ్వామిత్రుని 100 మంది కుమారులలో మొదటి 50 మంది శునశ్శేపుణ్ణి తమకు అన-

అంగీకరించలేదు. మధ్యవాడైన మధుచ్ఛందుడు అతడి తరువాత వారు మాత్రం అందుకు అంగీకరించారు.

త్రిశంకుడు సశరీరంగా స్వర్గం పొందగోరి అందుకు తగిన యజ్ఞం చేయించమని వసిష్ఠుణ్ని అడిగాడు. ఆయన అది అసాధ్యం అన్నాడు. త్రిశంకుడు విశ్వామిత్రుణ్ని ఆశ్రయించగా అతడు తన తపస్సును ధారపోసి త్రిశంకుణ్ణి సశరీరంగా స్వర్గానికి పంపాడు. కాని ఇంద్రుడు త్రిశంకుణ్ణి క్రిందికి త్రోసివేశాడు. అతడు విశ్వామిత్రుణ్ణి ప్రార్థించగా భూ, స్వర్గలోకాల మధ్య విశ్వామిత్రుడు 'త్రిశంకుస్వర్గం' సృష్టించాడు. విశ్వామిత్రునికి వసిష్ఠునితో వైరం చివరివరకూ కొనసాగింది. ఆ వైరం వల్లనే సత్యవాక్య పరిపాలకుడైన హరిశ్చంద్రుణ్ణి విశ్వామిత్రుడు నానా యాతనలూ పెట్టాడు.

## విష్ణువు

సృష్టి, స్థితి, లయాలకు హేతుభూతులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే త్రిమూర్తు(చూ.)లలో ఈయన రెండవవాడు. జగత్తుస్థితిని కాపాడడం ఈయన పని. ప్రళయాంతంలో విష్ణువు క్షీర సముద్రం మీద వటపత్రశాయి అయి ఉండగా ఆయన నాభిలో నుంచి పుట్టిన పద్మంలో బ్రహ్మ జన్మించాడు. చెవులలోనుంచి మధుకైట భులు పుట్టారు. మధుకైటభులనే ఆ రాక్షసులు జగద్వినాశనానికి పూనుకోగా చివరికి విష్ణువే వారిని సంహరించాడు. విష్ణుమూర్తి వాహనం గరుత్మంతుడు. ఆయన ఆయుధం సుదర్శన చక్రం. సూర్యుడు, చంద్రుడు ఆయనకు కళ్లు. లక్ష్మి (చూ.)ఆయన భార్య. ఒకప్పుడు విష్ణువు లక్ష్మిని గుర్రపు రూపు దాల్చమని శపించి తరువాత తనుకూడా అశ్వం రూపం ధరించి ఆమెయందు హయహయుడు అనే కుమారుణ్ణి పొందాడు.

## వీరబ్రహ్మేంద్రస్వామి

కాలజ్ఞాన గ్రంథకర్త. 17వ శతాబ్ది పూర్వార్థంలో తెలుగునాట అవతరించిన సిద్ధ పురుషులలో ఒకడు. అసలు పేరు వీరనారాయణ. గోవిందమ్మను వివాహమాడి కందిమల్లయ పల్లె (కడప జిల్లా)లో కాపురం చేసుకుంటూ దూదేకుల సిద్దయ్య వంటి శిష్య గణానికి ఉపనిషత్తుల సారం, యోగతత్త్వ మార్గాలను బోధిస్తూ ఉండేవాడు. శిల్ప వృత్తులు, కమ్మరం, వడ్రంగం చేసుకుంటూ 'కాలజ్ఞాన తత్త్వాలు', 'గోవింద వాక్యాలు' తేట తెలుగులో అందరికీ సుబోధకమయ్యేలాగ రచనలు చేసి అందించాడు. ఈయన ప్రవర్తింప చేసిన మతాన్ని 'అచల మత'మనీ లేదా 'శివాద్వైత' మతమని అంటారు.

## వీరేశలింగం పంతులు కందుకూరి

ప్రముఖాంధ్ర వైతాళికుడు. సంస్కర్త. ఆధునిక సాహిత్యయుగ సంఘ వైతాళికుడు. 1848 ఏప్రిల్ 16న రాజమండ్రిలో వీరేశలింగం పంతులు జన్మించాడు. తల్లి పున్నమ్మ, తండ్రి సుబ్బారాయుడు. 1861లో రాజ్య లక్ష్మమ్మ గారితో ఈయన వివాహం జరిగింది. వీరేశలింగం కొంతకాలం ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసి తర్వాత 1874లో ధవళేశ్వ రంలో ఆంగ్లభాషా పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు అయాడు. 1876లో 'వివేక వర్ధని' అనే పత్రిక పెట్టి అధికార వర్గాలలో అవినీతిని, లంచగొండితనాన్ని ధైర్యంగా బట్టబయలు చేసేవాడు. ఆంధ్రదేశంలో స్త్రీల సమస్యలను గురించి ఉద్యమం ప్రారంభించాడు. విజయనగరం మహా రాజా వారి బాలికాపాఠశాలలో మొదటిసారిగా (1879 ఆగస్టు 3) స్త్రీ పునర్వివాహంపై ప్రసంగం చేశాడు.



1881లో రాజమహేంద్రవరంలో బాలికా పాఠశాల, నాటక సమాజం స్థాపించి 'చమత్కార రత్నావళి' అనే నాటకం ప్రదర్శింపజేశారు. ఆంధ్రదేశంలో మొట్టమొదటి నాటక ప్రదర్శన అదే! 1881 డిసెంబరు 11వ రాజమహేంద్రవరంలో మొదటి వితంతు వివాహం జరిగింది. ఆ తరువాత కందుకూరి అనేక మంది వితంతువులకు తిరిగి వివాహాలు చేశారు. 1883 లో స్త్రీలకోసం 'సతీహితబోధిని' అనే మాసపత్రిక ప్రచురించారు. చిన్నయసూరి ఆరంభించిన నీతిచంద్రికలోని సంధి, విగ్రహం' అను అధ్యాయాలను వ్రాశారు. నలచరిత్ర, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధం అనే పేరుతో అచ్చతెలుగు కావ్యాలు వ్రాశారు. పంతులు గారు వ్రాసిన 'రాజశేఖర చరిత్ర' తెలుగులో మొట్టమొదటి

నవల. కాళిదాసు వ్రాసిన 'అభిజ్ఞాన శాకుంతలం' నాటకాన్ని తెలుగుచేశారు. ఈయన వ్రాసిన 'ఆంధ్ర కవుల చరిత్ర, స్వీయచరిత్ర' బహుళ ప్రచారం పొందాయి. హితకారిణీ సమాజంద్వారా ఎన్నో నాటకాలను ప్రహసనాలను ఆయన వ్రాసి ప్రదర్శించారు. 1891లో రాజమండ్రిలో పుర మందిరం కట్టించారు. ఆయన నిస్వార్థ సేవకు మెచ్చి ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం 1893లో 'రావు బహద్దూరు' బిరుదాన్నిచ్చి ఆయనను సత్కరించింది. 1919 మే 27న మద్రాసులో ఆయన పరమ పదించారు. హైదరాబాదులోని తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో కందుకూరి వీరేశలింగం విగ్రహాన్ని ప్రతిష్ఠించి ప్రభుత్వం(1986)నివాళులర్పించింది.

## వెంకటప్పయ్య, కొండా

స్వాతంత్ర్యసమరయోధుడు. ఆంధ్రోద్యమ జనకుడు, గొప్పకవి, వక్త, 'దేశభక్త' బిరుదాంకితుడు.



గుంటూరులో విద్యాభ్యాసం చేసి మచిలీపట్నంలో న్యాయవాద వృత్తి ప్రారంభించాడు. కృష్ణాపత్రికను స్థాపించిన వారిలో వెంకటప్పయ్య ఒకడు. కృష్ణాపత్రికకు కొంతకాలం సంపాదకుడుగా పనిచేశాడు. 1913లో బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభకు ఆయన కార్యదర్శియై కాంగ్రెస్ నాయకత్వాన స్వరాజ్య సంగ్రామం ప్రారంభమయేవరకు కార్యదర్శి పదవిని అకుంఠిత దీక్షతో నిర్వహించారు. సహాయనిరకరణోద్యమంలో చేరినప్పుడు నుండి న్యాయవాద వృత్తిని వదిలి పెట్టి గాంధీ మహాత్ముని ఆదేశాలను తుచతప్పకుండా పాటిస్తూ కాంగ్రెస్‌లోని జిల్లా అధ్యక్షపదవి వంటి అనేక పదవులను నిర్వహించారు. గాంధీమహాత్ముని నాయకత్వంలో జరిగిన వివిధ ఉద్యమాల్లో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. తత్ఫలితంగా వెంకటప్పయ్యను ప్రభుత్వం 1921, 1930, 1932, 1942లలో కారాగారంలో నిర్బంధించారు. అఖిల భారత చరఖా సంఘంలో ఆయన యావజ్జీవ సభ్యుడుగా ఉన్నారు. ఆంధ్రరాష్ట్రంలో హరిజనుల దేవాలయ ప్రవేశ విషయమై ఎనలేని కృషి చేశారు. వివిధ రంగాలలో ఆయన చేసిన సేవను గుర్తించి ఆంధ్రప్రజానీకం ఆయనకు 'దేశభక్త' బిరుదునిచ్చారు. 1948లో ఆయన కన్ను మూశారు. వెంకటప్పయ్య రచించిన 'డచ్ రిపబ్లిక్' ఆయన మరణానంతరం ప్రకటితమైంది.

## వెంకటరత్నం నాయుడు, రఘుపతి

సంఘ సంస్కర్త, విద్యావేత్త, బ్రహ్మసమాజ కార్యకర్త. ఈయన మచిలీపట్టణంలో జన్మించాడు. మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో విద్యనభ్యసించారు. ఈయన్ని 'బ్రహర్షి' అని అందరూ అనే వారు.

వీరేశలింగం పంతులుగారు స్థాపించిన హితకారిణీ పాఠశాలలోను మదరాసు పచ్చయప్ప పాఠశాలలో, బందరు నోబుల్ కళాశాలలో అధ్యాపకులుగాను సికిందరాబాదులోని మెహబూబ్ కళాశాల, కాకినాడలో పిఠాపురం మహరాజా స్థాపించిన కళాశాల (1919) అధ్యక్షులుగా పనిచేశారు. బ్రహ్మప్రకాశిక, 'పీపుల్స్ ఫ్రెండ్, ఫెలోవర్కర్' అనే పత్రికలకు 1896–98 మధ్యసంపాదకత్వం వహించి సాంఘిక సమస్యల మీద ప్రబోధాత్మకమయిన రచనలను ప్రచారం చేశారు. నాయుడుగారికి స్త్రీ విద్య పట్ల అభిమానం మెండు.

అనాథ బాలలకోసం కాకినాడలో ఒక అనాథశరణాలయాన్ని స్థాపించి ఎంతో మందిని పోషించి విద్యాధికుల్ని చేశారు. 'అంటరాని తనం' రూపు మాపాలనే ఉద్యమాన్ని ప్రారంభించారు. బ్రహ్మసమాజ సిద్ధాంతాలలో ఒకటైన కులవ్యవస్థ నిర్మూలన కోసం ఆయన కొన్ని వర్ణాంతర వివాహాలను జరిపించారు. పొగ తాగడం, కల్లుసారాయి తాగడం నిషేధించే కార్యక్రమాలు, హరిజనోద్ధరణ చేపట్టి నిర్వహించారు. వేశ్యా వృత్తిని నిర్మూలించడానికి కళావంతుల సంఘాలను స్థాపించారు. మద్రాసు యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా పనిచేశారు. బ్రిటిషు ప్రభుత్వం 'రావుబహద్దూర్' 'దివాన్ బహద్దూర్' 'కైజర్–ఇ–హింద్' బిరుదులిచ్చి గౌరవించారు



మద్రాసు, ఆంధ్ర యూనివర్శిటీలు డి.లిట్. బిరుదు లిచ్చి సన్మానించాయి.1862లో జన్మించిన వెంకట రత్నం నాయుడు 1939లో స్వర్గస్థులైనారు.

## వెంకట రామన్, రామస్వామి

ఎనిమిదవ భారత రాష్ట్రపతి (1987–92) తమిళనాడులోని తంజావూరు జిల్లా రాజమండలంలో 1911 డిసె. జన్మించి న్యాయవిద్య నభ్యసించి కార్మిక న్యాయ విషయాలలో ప్రత్యేక శ్రద్ధ చూపడం మొదలు పెట్టాడు. ఆదిలో (1935) మద్రాసు హైకోర్టులోనూ, తరువాత సుప్రీం కోర్టులోనూ న్యాయవృత్తి కొనసాగించాడు. తోట కూలీలు (ప్లాంటేషన్ లేబర్) హార్బరు కార్మికులు, రైల్వే కూలీలు, పత్రికా సిబ్బంది, సమస్యల



పరిష్కారాల్లో శ్రద్ధాసక్తులు చూపడంవల్ల చివరకు రాజకీయాలవైపు ఆకర్షితుడై స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలుకు వెళ్లాడు. 1946లో ఆజాద్ హిందూఫౌజ్ (చూ.) నేరస్థుల తరపున వాదించడానికి నియోగింపబడినాడు. 1950--52, 1952--57 మధ్య పార్లమెంట్ సభ్యుడుగా ఉన్నారు. 1957లో కూడ లోకసభ సభ్యుడుగా ఎన్నిక అయి రాజీనామా చేసి మద్రాసు మంత్రివర్గంలో చేరి 1967 వరకూ మంత్రిగా కొనసాగి తమిళనాడులో అనేక పరిశ్రమలు నెలకొనడానికి కృషి చేశాడు. 1977 ఎన్నికల్లో లోక్‌సభ సభ్యుడయ్యాడు. 1982లో కేంద్ర రక్షణ మంత్రి అయ్యాడు. అంతర్జాతీయ సమావేశాలకు అనేకసార్లు (1953, 1955, 1958, 1959, 1960, 1961) భారత ప్రతినిధి వర్గాలకు నాయకత్వం వహించాడు. 1987లో 8వ భారత రాష్ట్రపతిగా ఎన్నిక అయ్యాడు.

## వెంకటాచలం, గుడిపాటి 1894–1979

'చలం' కలంపేరుతో కీర్తిని ఆర్జించిన తెలుగు సాహిత్యస్రష్ట. కథ, గేయం, నవల, నాటకం, లేఖావ్యాసం వంటి సాహిత్య ప్రక్రియలన్నింటిలోను ప్రసిద్ధ రచనలు అందించాడు. 'స్త్రీకి స్వేచ్ఛ' అను ఇతివృత్తం చుట్టూ ఈయన రచనలు చాలావరకూ సాగాయి. బి.ఏ.,ఎల్.టి. చదివి ప్రభుత్వ విద్యాశాఖలో పలుచోట్ల పనిచేసి ఉత్తమ ఉపాధ్యాయుడుగా పేరు తెచ్చుకున్నాడు. 'పాపం', 'శశి' 'చిత్రాంగి', 'సావిత్రి', 'మైదానం' వంటి రచనలలో స్త్రీకి పురుషునితో సమాన ప్రతిపత్తికై ఈయన సల్పిన సాహిత్య పోరాటం సనాతనులను కలవరపరచింది. 'స్త్రీ' అను ఆయన వ్యాస సంపుటిలో స్త్రీకి స్వాతంత్ర్యం గూర్చి అనేక ప్రతిపాదనలుచేశారు.'మ్యూజింగ్స్'



కూడ ఈ కోవకు చెందినవే. 'సీత తల్లి' కథ, సాహితి పరులు ఆదరించిన రచన. 'పురూరవ', 'భానుమతి', 'సీత అగ్నిప్రవేశం', 'శశాంక' చలంగారి 30 నాటికలలో ప్రసిద్ధిగన్నవి. రవీంద్రుని 'గీతాంజలి'కి ఈయన తెలుగుసేత ప్రసిద్ధి చెందింది. 1894 మే 19న మద్రాసులో జన్మించిన గుడిపాటి వెంకటాచలం పదవీ విరమణ చేసిన పిదప తమిళనాడులోని తిరువణ్ణామలై (చూ.) లోని అరుణాచలం చలం చేరి రమణ మహర్షి అంతేవాసి అయి 1979 మే 4న కీర్తిశేషులయ్యారు. ఒకప్పుడు తన రచనల ద్వారా విశృంఖుల శృంగారాన్ని ప్రతిపాదించిన 'చలం' తన అవసాన దశలో ఆధ్యాత్మిక జీవనశైలికి మారి 'భగవాన్ రమణ మహర్షి పాదాల ముందు', 'యశోద గీతాలు' ఇత్యాది రచనలు చేశారు. 'చలం' రచనావ్యాసంగంపై పురాణం సుబ్రహ్మణ్యశర్మ విమర్శనాత్మక గ్రంథం వ్రాశారు.

## వెంకటాధ్వరి క్రీ.శ. 18వ శతాబ్ది

సుప్రసిద్ధ సంస్కృత కవి. 'విశ్వగుణాదర్శ చంపూ' గ్రంథకర్త. ఈయన కాంచీపుర వాసి. రఘునాథ దీక్షితుని కుమారుడు. తల్లి సీతాంబ. గద్యం, పద్యం కూడిఉండే కావ్యాన్ని 'చంపూకావ్యం' అంటారు. అలాంటి చంపూ కావ్యంగా ఈయన వ్రాసిన 'విశ్వగుణాదర్శం' విశేష ప్రశస్తి పొందింది. కృశానువు, విశ్వావసుడు అనే ఇద్దరు గంధర్వులు విమానంలో ఆసేతు హిమాచలం

పర్యటిస్తూ హిమాలయాలలోని బదరికాశ్రమం మొదలు కొని దక్షిణాన సేతువు వరకూ ఉన్న ప్రధానమైన విష్ణు క్షేత్రాలనూ, పుణ్యతీర్థాలనూ వర్ణిస్తారు. సంభాషణాత్మకంగా సాగే ఈ కావ్యంలో శేషశైలం (తిరుపతి) మొదలు సేతువు వరకూఉన్న క్షేత్రాలు మరింత విపులంగా వర్ణించబడ్డాయి. దివ్యక్షేత్రాల వర్ణనే ప్రధానాంశం అయినా దక్షిణ భారతదేశంలో ఆనాడు ఉన్న జనుల ఆచార వ్యవహారా లనూ, సాంఘిక రాజకీయ వ్యవస్థలనూ, మత విషయాలనూ కూడా ఈ కావ్యం వివరిస్తూంది. మద్రాసు తిరువళిక్కేణిలోని పార్థసారథి స్వామి ఆలయాన్ని వర్ణిస్తూ ఆనాడు మద్రాసులోని ఆంగ్లేయుల పరిపాలనా విధానాలను కూడా కవి వర్ణించాడు. వేంకటాధ్వరికి 'శ్లేష యమక చక్రవర్తి' అనే బిరుదం ఉంది. ఆ బిరుదుకు తగినట్టుగానే ఈ కావ్యంలో శ్లేషాలంకారం, యమకాలంకారం అద్భుతంగా పోషించబడ్డాయి. వేంకట రామకృష్ణ కవులు మొదలైన పలువులు ఈ కావ్యాన్ని తెలుగులోనికి అనువదించారు.

## వెనుజ్యులా

దక్షిణఅమెరికా ఉత్తర ప్రాంతాన వున్న స్వతంత్ర గణరాజ్యం. ఒకప్పుడు స్పెయిన్ వలస రాజ్యం. 1821లో స్వాతంత్ర్యం సంతరించుకుని రాజ్యాంగాన్ని రూపొందించుకుంది.

విస్తీర్ణం: 912,050 చ.కి.మీ; జనాభా: 1,87,57,000 (1988); రాజధాని: కారకాస్; అధికార భాష: స్పెనిష్. ప్రజలలో ఎక్కువ మంది రెడ్ ఇండియన్‌లు, యూరప్‌యన్‌లతో సంకరించగా ఏర్పడిన మిశ్రమజాతి మెస్టిజోలు ఉన్నారు. క్రైస్తవం పాటిస్తారు. నీగ్రోలు కారిబియన్ తీరాన్ని అంటి నివసిస్తారు. పర్వతావృతమయిన దేశం. ఓరినోకో నది పెద్ద జీవనది. దాని ఉపనదులు దేశం అంతా అల్లుకుని జల నిర్గమనానికి తోడ్పడుతున్నాయి. సుమారు 16000 చ.కి.మీ. విస్తీర్ణం గల మారాకాయిబూ సరస్సు వాయవ్య భాగంలో ప్రధానమయిన నీటి వనరుగా ఉంది. బాడువాలు ఈ సరస్సు చుట్టూరా ఉన్నాయి. 3,11,000 చ.కి.మీ. గల ఓరినోకో మైదానం దేశంలో మూడవవంతు ఆక్రమించి ఉంది. ఏంజెల్ జలపాతం (979 మీ. ఎత్తు) ; నయాగరా (చూ.) కంటె 15 రెట్లు ఎత్తుగలది. ఉత్తర ప్రాంతంలోని మెట్టభూములు వ్యవసాయయోగ్యమయిన వాటిలో మొక్కజొన్న ప్రధానమైన పంటగా సాగుచేస్తున్నారు. అయితే కాఫీ పంట వాణిజ్య రీత్యా విలువయిన పంట. చెరకు, అరటి, జొన్న, వరి, ప్రత్తి, సిసాల్ నార, నువ్వు, కోకో, పండ్లజాతులు, పొగాకు ఇతరములయిన వ్యవసాయోత్పత్తులు. ఓరినాకోమైదానపు పచ్చిక బయళ్ళలో పశువులకు కావల్సినంత పచ్చిక లభిస్తుంది. వెనిజ్యులా వజ్రాల ఉత్పత్తికి పేరొందింది. పెట్రోలు తైల నిక్షేపాలు పుష్కలంగా ఉన్నాయి. పెట్రోలు గనులు మారాకాయిబూ సరస్సు ప్రాంతంలో ఉన్నాయి. ఇనుపరాయి, బాక్సైట్, రాగి, తగరం, వజ్రాలు, బంగారం, మాంగనీస్, సిలికా ఖనిజాలు దొరుకుతున్నాయి. పారిశ్రామిక ప్రగతి కూడ పేర్కొనదగినదే. ఉక్కు, పెట్రోలు, పానీయాలు, సిమెంటు, రవాణా వాహనాలు, ఔషధాలు, ఆహార పదార్థాలు, రాసాయనిక ద్రవ్యాలు తయారై ఎగుమతి అవుతున్నాయి.

## వేదాంత దేశికులు 1300 ప్రాంతం

విశిష్టాద్వైత ప్రధానాచార్యులలో ఒకరు. అసలు పేరు వేంకటనాథుడు. 'వేదాంత దేశికులు', 'వేదాంతాచార్యులు', 'కవితార్కిక సింహ' అనేవి ఈయన బిరుదనామాలు. ఈయన తండ్రి అనంతసూరి. తల్లి తోతారంబ. తాత పుండరీకాక్షుడు. ఈయన కాంచీపుర నివాసి. వేదాంత దేశికులు విద్యారణ్యుని సహాధ్యాయి అని ఒక ఐతిహ్యం. వేదాంత దేశికులు బహు గ్రంథకర్త. కాళిదాసుని మూడు కృతులకు ప్రతిగా ఈయన 'యాదవాభ్యుదయం', 'హంస సందేశం' మొదలైన ప్రసిద్ధమైన కావ్యాలను రచించాడు. ఈయన రచించిన 'సంకల్పసూర్యోదయం' అనే నాటకం ప్రబోధ చంద్రోదయం వలే అన్యాపదేశ లక్షణం గలది. ఈయన వ్రాసిన ఇతర కృతులలో 'తత్త్వటీక', 'సుభాషిత నీవి', 'యజ్ఞోపవీత ప్రతిష్ఠ', 'ఆరాధనాక్రమం', 'వైశ్వదేవ కారిక', 'శ్రీపాంచరాత్రరక్ష', 'వాదిత్రయ ఖండనం', 'ముక్తా కలాపం' చెప్పు కోదగ్గవి. విశిష్టాద్వైత సిద్ధాంతంలోని వడగళ్ సంప్రదాయానికి ఈయన మతాచార్యులు. సంస్కృతంలోని వేదాలకు ప్రాధాన్యం ఇవ్వడంవల్ల

ఈయనను సంస్కృతాచార్యులనీ, ద్రవిడవేదాన్ని సమర్థించిన శ్రీమద్రామానుజులకు (చూ. రామానుజాచార్య) ద్రవిడాచార్యులనీ వ్యవహరిస్తారు.

## వేమన 1396–1424

తెలుగు జానపద తత్త్వవేత్త, యోగి, ప్రజాకవి, వేమన శతక కర్త. వేమన తండ్రి కొమరగిరి మేమారెడ్డి, తల్లి మల్లమ్మ. కవిగా, యోగిగా ప్రజాభిమానాలను ఎక్కువగా చూరగొన్న వేమన గొప్ప నీతిధర్మబోధకుడు. సంఘ సంస్కర్త.చిన్నతనంలో చెడుదారులు పట్టిన వేమనను మంచి దారికి మరల్చి అతని వదిన—అతని సోదరుని భార్య—నరసాంబ బుద్ధి గరిపింది. ఆమె వల్లనే వేమనకు సాహిత్యాభిరుచి కూడా కలిగింది. లంబికా శివయోగి వద్ద వేమన గురూపదేశం పొంది ఐహిక సుఖాలను త్యజించి యోగి అయినాడు. అప్పుడప్పుడు ఆశువుగా చెప్పిన వేలాది పద్యాలలో ప్రతి ఒకటి వేమన అనుభవం నుంచి పుట్టిందే! తేలిక అయిన వాడుక భాషా పదాలతో ప్రగాఢమైన జీవిత సత్యాలను ఈ పద్యాలలో వేమన ప్రకటించాడు. ఇనుమును, బంగారంగా చేసి స్వర్ణయోగ విద్య సాధించాలని కూడా వేమన కొన్నాళ్ళు కృషిచేశాడు. వేమన 'విశ్వదాభిరామ వినురవేమ' మకుటంతో ఇప్పటికి



సుమారు 4000 పద్యాలు లభించాయి. 'ఉప్పుకప్పురం నొక్కపోలిక'నుండు చూడచూడ రుచులు జాడ వేరు' 'గంగిగోవు పాలు గరిటెడైనను చాలు కడవడ యుననేని ఖరము పాలు, వంటివి వేమన భావాలకు మచ్చుతునకలు. వేమన పద్యాలను సేకరించి వాటికి సాహిత్య స్థాయిని కల్పించిన వాడు బ్రౌన్ (చూ.).

## వోటు

ప్రజాతంత్ర పరిపాలనగల వ్యవస్థలందు వ్యక్తుల అభిప్రాయ ప్రకటనకు వినియోగించే సాధనం. ఒకప్పుడు ఈ అభిప్రాయ సేకరణ ముఖతాగాగాని, చేతిని ఎత్తుట మొదలగు చేష్టలద్వారా జరిగేది. ఈ పద్ధతిలో కొన్ని ఇబ్బందులు, ముఖ్యంగా వ్యక్తులు ధన, బల ప్రాబల్యాలకు లొంగుబాటు అయ్యే అవకాశం ఉండుటవల్ల రహస్య బేలట్ పద్ధతి అములులోనికి వచ్చింది. బేలట్ కాగితం మీద పోటీచేసే అభ్యర్థుల అందరి పేర్లు (వారి అధికారిక చిహ్నాలు) వరుసగా ముద్రింపబడి ఉంటాయి. వోటరు నకు ఇచ్చిన ఈ బేలట్ పేపరుమీద తనకు నచ్చిన వ్యక్తి పేరు(చిహ్నం) ముందు 'X' వంటి గుర్తు (రబ్బరు ముద్ర సహాయంతో) ఉంచి, మడచి బేలట్ పెట్టెలో వేస్తారు.

## వోల్గానది

యూరపులో అతి పెద్ద జీవనది. ఇది రష్యాలోనే ప్రవహిస్తున్నది. లెనిన్‌గ్రాడ్‌కు ఆగ్నేయంగా 320 కి.మీ దూరంలోని వాల్డాయా కొండలలో పుట్టుచున్నది. 3600 కి.మీ ప్రవహించి కాస్పియన్ సముద్రంలో సంగమానికి ముందు డెల్టా వోల్గా ఏర్పడుతుంది. ఈ డెల్టా సముద్రమట్టానికి 26 మీ. పల్లంగా ఉంటుంది. ఒకా నది, కామా నది ఉంర్ఘానదివోల్గానదికి ఉపనదులు. వోల్గా నది దాని ఉపనదులు మొత్తం నిడివి 32,000 కి.మీ. ఉండి సుమారు 5 కోట్లు మందికి జీవనాధారం సమకూరుస్తూంది.

## వ్యాసమహర్షి

సంస్కృత మహాభారత (చూ.) మహాభాగవతాది (చూ.) పురాణేతిహాస కర్త. వేదాలను విభజించిన మహానుభావుడు. బ్రహ్మసూత్రాలనూ, భగవద్గీత(చూ.) నూ రచించిన భారతీయ దార్శనికుడు.

వ్యాసుడు కృష్ణుని అంశంలో పరాశర మహర్షికీ, మత్స్యగంధి (సత్యవతి) అనే ఒక పల్లెకన్యకు ఒక ద్వీపంలో జన్మించాడు. అందుకే ఈయనకు 'పారాశర్యుడు' (పరాశరుని కుమారుడు) అనీ, 'సాత్యవతేయుడు' (సత్యవతి కుమారుడు)అనీ, 'కృష్ణద్వైపాయనుడు' (నల్లని వాడు ద్వీపం స్థానంకలవాడు) అనే నామాంతరాలు కలిగాయి. చూ పరాశరుడు.

వ్యాసుడు రచించిన మహాభారత సంహిత పంచమ వేదంగా ప్రసిద్ధిపొందింది. మహాభారత రచనలో సాక్షాత్తూ

గణపతి వచ్చి వ్యాసునికి లేఖకుడుగా పనిచేశాడని ప్రసిద్ధి. గణపతి ఒక షరతు విధించాడు. తన ఘంటం ఆగకుండా వ్యాసుడు శ్లోకాలు చెప్పాలని! వ్యాసుడందుకంగీకరించి, ఏ శ్లోకమూ అర్థం కాకుండా గణపతి వ్రాయకూడదని షరతు విధించాడు. గణపతి అందుకంగీకరించాడు. తనకు ఆలోచనకు వ్యవధికావలిసివచ్చినప్పుడల్లా వ్యాసుడు తేలికగా అర్థం కాని శ్లోకం ఒకటి చెప్పి దానిని అర్థం చేసుకోడానికి గణపతి తికమక పడుతూ ఉండగా తాను కొత్త శ్లోకాలు ఆలోచించుకుంటూ ఉండేవాడు. అలా తేలికగా అర్థం కాకుండా వ్యాసుడు చెప్పిన శ్లోకాలనే 'వ్యాసఘట్టాలు' అంటారు. వాల్మీకితో పాటు వ్యాసమహర్షి కూడా భారతీయులందరికీ ప్రాతఃస్మరణీయుడు.

## శంకరపిళ్లే 1902–1989

శంకర్‌గా జాతీయ, అంతర్జాతీయ బాలబాలికలకు పరిచయమయిన శంకరపిళ్లే కేరళలోని కృష్ణాపురంలో 1902 జూలై 31న జన్మించాడు. అభ్యసిస్తున్న న్యాయవిద్యకు స్వస్తి పలికికొన్నాళ్లు సిందియా కంపెనీలో పనిచేసి చివరకు 1931లో కార్టూనిస్టుగా హిందూస్తాన్ టైమ్స్'లో చేరాడు. 1938లో లండన్‌వెళ్లి ఆర్ట్ స్కూలులో చేరి వృత్తి నైపుణిని సంపాదించి స్వదేశానికి వచ్చి పూర్వం పనిచేసే చోటే 1946 వరకు పనిచేశాడు. 1948లో 'శంకర్స్ వీక్లీ'ని ప్రారంభించి 1975 వరకూ జనరంజ కంగా నిర్వహించాడు. 1949 నుండి బాలికలలో అణగివున్న సృజనాత్మక శక్తిని రాణింపుకు తేవడానికి దోహదకారిగా 'రచన'లోనూ సద్యోచిత్రణ (స్పాట్ పెయింటింగ్) లోనూ పోటీలు ప్రారంభించాడు. 1950 నుండి ఈ పోటీలు అంతర్జాతీయ స్థాయి నందుకున్నాయి. 1952లో దేశాదేశాలనుండి బొమ్మలను సేకరించడం మొదలుపెట్టి 1965లో డాల్ మ్యూజియాన్ని స్థాపించాడు. 1953లో పిల్లల పుస్త కాలను ప్రచురించడానికి గాను చిల్డ్రన్స్ బుక్‌ట్రస్టు ఆరంభించాడు. చిల్డ్రన్స్ ఆర్ట్ నంబర్ అనుపేరుతో ప్రతిఏడాదీ ఒక బాలల చిత్ర వార్షిక సంచికను ప్రచురించడానికి ఏర్పాట్లు చేశాడు. బాలలకు గ్రంథాలయమొకదానిని రూపొందించి 1967 నుండి నిర్వహించాడు. పిల్లలకై ప్రత్యేకరచనలు చేసే రచయితలకూ చిత్రాలు సిద్ధపరచే కళాకారులకు ప్రత్యేక శిక్షణ శిబిరాలు నిర్వహిస్తూ దానిని 'అసోసియేషన్ ఫర్ రైటర్ అండ్ ఇలస్ట్రేటర్' సంస్థగా రూపొందిం చాడు. 1968లో పిల్లలకు 'చిల్డ్రన్స్ వరల్డ్' అను ఆంగ్ల మాసపత్రిక ఆరంభించాడు. బాలల సృజనాత్మక సంపదను మెరుగు పడడానికి జీవిత





పర్యంతమూ కృషి చేసిన శంకరపిళ్లేకు భారత ప్రభుత్వం 'పద్మభూషణ' పురస్కారం అందించి గౌరవించింది. పోలండ్ బాలల నుండి 'ఆర్డర్ ఆఫ్ స్మైల్' ను అందుకున్నాడు. ఢిల్లీ యూనివర్శిటీ డాక్టరేటు ప్రదానం చేసి సత్కరించింది. ఆయన 1989 డిసెంబరు 26 నాడు న్యూఢిల్లీలో కీర్తిశేషు డయ్యాడు.

## శంకరాచార్య

హిందూమతంలోని ఒక ప్రముఖ శాఖ అయిన అద్వైతాన్ని ప్రవచించిన మహాప్రవక్త. ఈయన కాలం నిర్ణయం కాలేదు. క్రీ.శ. 8వ శతాబ్దం వాడని పండితుల అభిప్రాయం. ఈయన కేరళ రాష్ట్రంలోని పవిత్ర పెరియార్ నదీతీరమున ఉన్న కాలడిలో జన్మించాడు. తండ్రి శివగురు, తల్లి ఆర్యాంబ. చిన్నప్పుడు తల్లితో నదికి స్నానానికి వెళ్లేవాడు. నీటిలోకి దిగగానే ఒకనాడు మొసలి ఆ బాబుడ్ని కరచి పట్టిందనీ తాను సన్యసించడానికి అప్పుడే తల్లి అనుమతి కోరేడనీ ఆమె అనుమతినివ్వగా ఆ మకరం అంతర్థానమైందనీ అపాయమేమీ జరగకుండా బయటపడ్డాడనీ ఐతిహ్యం. నాటినుంచీ అనగా 8 ఏళ్ల వయస్సులోనే గురువును అన్వేషిస్తూ దేశాటనకు బయలుదేరాడు. నర్మదా నది ఒడ్డున శ్రీ గౌడపాద స్వామి శిష్యుడు గోవింద భగవత్పాద స్వామిని విజ్ఞుల సమావేశంలో ఉండగా సందర్శించి శిష్యునిగా స్వీకరించమని కోరుతూ సన్యాసాన్ని అర్థించాడు. గురువు ఆ బాలుని కోరికను తీర్చాడు.

ఆ ఆశ్రమంలో ఉన్నప్పుడే ఒకసారి నర్మదా నదికి

భయంకరమైన వరదలు రావడంతో ప్రజలు బీభత్సానికి లోనయిరి. అప్పుడు శంకరాచార్య జలాకర్షణ మంత్రాన్ని



ఉచ్చరించడంతో వరద పొంగు ఉపశమించిందంటారు. ప్రజలు ప్రాణనష్టం, ఆస్తి నష్టం లేకుండా బతికి బయటపడ్డారు. తరవాత గురువాజ్ఞానుసారం కాశీ పీఠానికి వెళ్లి ప్రస్థానత్రయం (బ్రహ్మ సూత్రాలు, ఉపనిషత్తులు, గీత) మీద భాష్యాలు వ్రాయడం మొదలు పెట్టాడు. పద్మపాదుడు, హస్తమాలక అనే ఇద్దరు శిష్యులు కూడా చేరారు.

ఒకనాడు శంకరాచార్యుడు గంగానదిలో స్నానంచేసి ఆశ్రమానికి వస్తుండగా పరమశివుడు చండాలుని వేషంలో వేటకుక్కల్ని వెంటబెట్టుకుని ఎదురు వెళ్తాడు. తన దారినుండి చండాలుడిని తప్పుకొనమని శంకరుడు ఆనతిస్తాడు. అప్పుడు దారినుండి తప్పుకోవల్సింది 'శరీరమా?' 'ఆత్మా?' అని చండాలుడు ఎదురు ప్రశ్నిస్తాడు. ప్రతి మనిషి శరీరమూ, రక్తమాంస, అస్థికలు మొదలగు వాటితోనేకదా తయారైంది కాగా 'ఆత్మ' సర్వాంతర్యామి కదా! ఏది నీ దారినుండి తప్పుకోవాలి అని చండాలుడు అర్థ వివరణ ఇస్తాడు. అప్పుడు చండాలుడు సాధారణ వ్యక్తి కాదు ఎవరో దివ్య పురుషుడని శంకరాచార్య గ్రహించి సాష్టాంగపడి మోకరిల్లుతాడు. బ్రాహ్మణుడయినా, చండాలుడయినా బ్రహ్మత్వమును పొంది అన్నిటితోనూ తాదాత్మ్యం పొందినవాడు భగవంతుడు, తన గురువేనని నిశ్చయానికి వస్తాడు. తరువాత ఉద్దండ పండితులతో గోష్ఠులు జరిపి పరకాయ ప్రవేశం వంటి అన్ని విద్యలూ అభ్యసించాడు. చివరకు తన తల్లి మరణం తెలుసుకున్నవాడై ఆమె అపర కర్మలకై స్వగ్రామం కాలడి చేరి,అవిపూర్తిచేసికొని ఆధ్యాత్మిక పీఠాల స్థాపనలో నిమగ్నమవుతాడు. కైలాసగిరి నుండి సుప్రసిద్ధమైన పంచలింగాల్ని తీసికొని వస్తాడు. కేదారలో ముక్తి లింగాన్ని, నేపాలులోని నీలకంఠ దేవళంలో పరలింగాన్ని, చిదంబరంలో మోక్షలింగాన్ని, శృంగేరిలో భోగలింగాన్ని, కంచిలో యోగలింగాన్ని శంకరాచార్య ప్రతిష్ఠించాడని ప్రసిద్ధి. ఆదిత్యుడు, అంబిక, విష్ణు, గణనాథుడు, మహేశ్వరుడు అయిదుగురికీ కలిపి పూజలుచేసి ప్రార్థనలు సమర్పించటం శంకరాచార్యులవారి అద్వైత మత సంప్రదాయంలోని ముఖ్య లక్షణం. భక్తులు తమ తమ ఇష్టదైవాన్ని ప్రార్థించుకునే స్వేచ్ఛ ఉంది. అద్వైత మతం ప్రచారాన్ని కొనసాగించడానికి ఆది శంకరాచార్యులవారు 1.బదరికాశ్రమంలో జ్యోతిర్మఠం; 2. జగన్నాథ పూరీలో గోవర్ధన పీఠం; 3. శృంగేరిలో శారదాపీఠం; 4. కంచిలో కామకోటి పీఠం అను నాలుగు మఠాల్ని కూడా వ్యవస్థాపించి, వాటికి ఆగమ శాస్త్రాలు, పూజా విధానాలు సిద్ధపరచి ఆయా మఠాలకు దర్శన వేదాంత సంప్రదాయ వేదాధ్యయనంలో నిష్ణాతులయి, నిష్ఠాగరిష్ఠులైన ఉద్దండ పండితులే పరంపర మఠాధిపతులుగా నియమించడానికి ఆనాడే కట్టుదిట్టమయిన ఏర్పాట్లు చేశారు. ఈ విధంగా తన జీవిత లక్ష్యాన్ని కృషిచేసి సాధించి తన 32వ ఏట శంకరాచార్య సిద్ధిపొందారు. (చూ. కంచి)

## శబరిమలై

'శరణం అయ్యప్పన్' పుణ్యక్షేత్రం కేరళ రాష్ట్రంలో కొట్టాయంకు 64 కి.మీ దూరంలో వుంది. క్షీరసాగర మథనానంతరం లభించిన అమృతాన్ని పంచడానికి అవతరించిన సుందరాంగి మోహిని (విష్ణువు)ని శివుడు మోహించగా హరిహరుడు జన్మిస్తాడు. మెడలో ఒక మణిమాల వేసి ఆ పసివాడు అడవుల్లో వదలివేయబడతాడు. పంత్ అనే మహారాజు వేటకై వచ్చినపుడు ఆ పసికూనను తీసికొని పోయి పెంచి పోషించి 'మణికంఠు'డని పేరు పెడతాడు. పెరిగిపెద్దవాడయి సకల విద్యలు నేరుస్తాడు. అయితే మహారాణి మణికంఠుడంటే వ్యతిరేక భావం చూపిస్తూ ఉంటుంది. మహారాజా మాత్రం మణికంఠుని ప్రజ్ఞాపాటవాలను మెచ్చుకుని ప్రేమాభిమానాలు కురిపిస్తూ ఉంటాడు. అప్పుడు ఏలగయినా మణికంఠుణ్ణి వదిలించుకోవడానికి మహారాణి ఒక కుట్ర పన్నుతుంది. తనకు ఏదో తెలియని జబ్బు ఆవహించిందనీ చికిత్సకు పులిపాలు కావాలంటుంది. ఇది నిజంగా దుస్సాధ్యమే. ఆ తేవడంలో పులి బారినుండి మణికంఠుడు తప్పించుకోలేడని మహారాణి దుష్ట

పన్నాగం. అయితే తన తెలివితేటల నుపయోగించి పులిపాలు సేకరించి తెచ్చి మహారాణికి సమర్పిస్తాడు. అప్పుడు మహారాణి తాను చేసిన తప్పిదాన్ని తెలుసుకొని పశ్చాత్తప పడుతుంది. తూర్పువైపు 18 మెట్లుగల ఒక దేవాలయాన్ని నిర్మించమని మహారాజా దంపతులను కోరి తాను అంతర్ధానమయి పోతాడు. మణికంఠుని ఆజ్ఞాను సారం మహారాజా శబరిమలై కొండల్లో 'అయ్యప్పన్' దేవాలయాన్ని అర్పకరం స్థలంలో నిర్మింపచేయించాడని స్థల పురాణాన్ని బట్టి తెలుస్తూంది. అసలు ఈ ప్రదేశంలో పరుశురాముడు సంచరించేవాడనీ శ్రీరాముని వల్ల అహల్యకు శాపవిమోచనమయింది ఇక్కడేనని స్థానికుల విశ్వాసం.

భక్తజనులు ప్రతిఏడాదీ డిసెంబరు-జనవరి మాసాల్లో కనిపించే 'మకరజ్యోతి' దర్శనానికి శబరిమలై యాత్ర చేస్తూ ఉంటారు. దర్శనానికి ముందు భక్తజనులు 40 రోజులు మెడలో జపమాల వేసుకుంటారు. ఈ 40 రోజులూ నల్లటి దుస్తులు ధరించి, మద్యపానాదులు విసర్జించి, పాదరక్షలు ధరించకుండా క్షవరం చేసుకొన కుండా బ్రహ్మచర్యం పాటిస్తూ మడిగా నిష్ఠ గా మెలగుతూ 'శరణం అయప్పన్' పాట ఆలపిస్తూ ఉంటారు. యాత్రా సన్నాహాలు చేసికోనడంలో 'బిచానా' సర్దుకుని తిండి మూట కట్టుకుని నెత్తిమీద పెట్టుకుని తీర్థ యాత్రకు బయలుదేరతారు. అయ్యప్పన్ దేవుడికి సమర్పించడానికి పూజాసామగ్రి సర్దుకుని శబరి మలై చేరుకుంటారు. భక్త్యావేశంతో యాత్ర చెయ్యడం వల్ల బడలిక అనిపించదు. శబరిమలై యాత్ర దుస్సాధ్యమయింది. ప్రమాదాలతో దారి కీకారణ్యం. అంతవరకూ బస్సు మీద పోయి అక్కడ నుండి కాలినడకనే వెళ్లాలి. దేవళం వాకిలి ముందర 'బలికుండం' వద్ద కర్పూరం హారతి సమర్పించి 'మండలపూజ' ముగించి 'మకర జ్యోతి' దర్శనం కాగానే తిరుగు ప్రయాణం చేసుకుంటారు. శబరమలై యాత్ర స్త్రీలకు నిషిద్ధం.

శబరిమలై క్షేత్రం



**శాంతినేకేతనం** చూ. **టాగూర్**, రవీంద్రనాథ్

## శాలివాహనుడు

శకకర్త. ఆంధ్ర సాతవాహన రాజులలో ఒకడైన హల సాతవాహన చక్రవర్తి. ఈయనను హాలుడు అని కూడ అంటారు. 'గాథా సప్తశతి'(చూ.)లోనే, ఒక గాథలో హాలుని పర్యాయనామంగా, 'శాలివాహన' పదానికి ప్రాకృత రూపం కన్పిస్తూంది. శాలివాహన శకం మొదట జ్యోతిష పండితుల లెక్కలలోనే మనుగడ సాగించింది. క్రీ.శ. 6 వ శతాబ్దిలో భారతదేశంలోని వివిధ రాజవంశాలు దీనిని వ్యాప్తి ప్రాముఖ్యాన్ని గుర్తించి తమ శాసనాల్లో (శక 488) వాడటం ప్రారంభించారు. భారతదేశంలోనే కాక ఆనాడు విష్ణుకుండిన రాజవంశ ప్రభువు విక్రమదేవ వర్మ II భారతీయ సంస్కృతి విస్తరించిన ఇండోనేషియా, కంపూచియా మొదలైన విదేశాల్లో కూడ ఈ శాలివాహన శకాన్నే వాడకంలో పెట్టారు. స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం నియమించిన పంచాంగ సంస్కరణ సంఘం శాలివాహన శకాన్నే జాతీయ శకంగా గుర్తించి సౌరమాన పద్ధతితో జోడించింది. మేషరాశిలో సూర్యుడు ప్రవేశించే రోజు (మార్చి 22)ను శక సంవత్సరాది అయిన చైత్ర ఒకటవ తేదీగా నిర్ణయించి ప్రభుత్వ అధికార పత్రాలలో గ్రెగరీ కేలండర్‌తోబాటు నేడు అమలులో ఉంది. శ్వారూఢుడయినశాలివా నుని శిల్పవిగ్రహాన్నొకదా హైదరాబాదులోని తెలుగ వెలుగుల మూర్తి నిక్షిప్తక ప్రాంగణంలో ప్రతిష్ఠించ ఈ ప్రథమ ఆంధ్రమహ లకునికి నివాళులర్పించా (1986).



## శాసనసభ

రాష్ట్ర శాసన నిర్మాణం, సవరణ, ఉప సంహారణలను జరిపే ప్రజాప్రతినిధుల సభ. (చూ. పార్లమెంటు). దీనిని శిష్ట సభ అని కూడ అంటారు. ఒకో రాష్ట్రానికి రెండు శాసన సభలు ఉంటాయి. 1. ప్రజా ప్రతినిధుల సభ (లెజిస్లేటివ్ అసెంబ్లీ), 2. విధాన పరిషత్తు లేదా ఎగువ సభ (లెజిస్లేటివ్ కౌన్సిల్).

## శిలప్పదికారం

తమిళ సంప్రదాయ సాహిత్యంలో సుప్రసిద్ధ కావ్యం. ఇలాంగో అడిగళ్ (చూ.) దీని కర్త. కావేరి నగరంలో కోవలన్ వర్తకుడు. అతని భార్య కణ్ణగి మహా పతివ్రత. కోవలన్ వేశ్యాలోలుడై మాధవిని మెప్పించ టానికి తన భార్య సొమ్ములు అమ్మివేస్తాడు. కాలి 'కడియం' జతలో ఒకటి కూడా అందులో ఉంటుంది. అదే సమయంలో పాండ్యరాజు ప్రాసదంలో దొంగతనం జరిగి సొమ్ములు తస్కరించబడతాయి. అందులో కూడా ఒక కడియం ఉంటుంది. రాజభటులు కోవలన్ దొంగి లించి అమ్మజూపుతున్నాడని అనుమానించి నిర్బంధం లోనికి తీసికొని మహారాజా ముందు హాజరు పెడతారు. మహారాజా నిజంగా అతనే దొంగిలించడాని నమ్మి 'కోవలన్'కు ఉరిశిక్ష వేస్తాడు. మహాపతివ్రత 'కణ్ణగి' కోపోద్రిక్తురాలై కడియం జతలో రెండవదానిని చేత పట్టి తన భర్త యథార్థంగా నిర్దోషి అని ఎలుగెత్తి అరుస్తూ రాజవీధులు తిరిగి రాజా వారి ఆస్థానానికి వచ్చి నేలకు వేసి కొట్టి ఆ కడియాన్ని పగలకొడుతుంది. అందునుంచి ముత్యాలూ, రత్నాలు బయట పడతాయి. రాజావారి దగ్గర ఉన్న జతలో రెండవ కడియాన్ని పగలగొట్టమని సవాలు చేసి, రాజ్యం నాశనంకావాలనీ దగ్ధం అయిపోవాలనీ శపించి పతిచితిపైకి పోయి సహగమనం చేస్తుండగా అధి దేవతలు కల్పించుకుని కోవలన్ దంపతులకు ప్రాణభిక్ష పెట్టి పునర్జన్మ నిస్తారు. ఇది 'శిలప్పది కారం'లోని కథావస్తువు. ఇది క్రీ.శ రెండవ శతాబ్దికి చెందినదని పండితుల అభిప్రాయం.

## శివధనస్సు

సీతా స్వయంవర సమయాన శివుని చాపమును ఎక్కుపెట్టగల రాజకుమారునకు తన కుమార్తె (సీత)ను ఇచ్చి వివాహం చేస్తానని జనకమహారాజు శపథం చేస్తాడు. ఆ శివచాపమే శివధనస్సు. తాటకి మొదలయిన రాక్షసులను సంహరించడానికి విశ్వామిత్రుడు రామలక్ష్మ ణులను తనవెంట తీసికొని పోతాడు. రాక్షస సంహార మయిన తరువాత మిథిలా నగరంలోని జనక రాజు దగ్గరకు రామలక్ష్మణులను తీసికొని వస్తాడు. సీతా స్వయంవరం జరుగుతూ ఉంటుంది. విశ్వామిత్రుడు రాముడిని శివచాపం ఎక్కుపెట్టమంటాడు. వాస్తవానికి రాముడు వివాహమాడకోరి రాలేదు. గురువుగారి ఆజ్ఞానుసారం శివ ధనస్సును ఎక్కుపెట్టు చుండగా అది ఫెళ్లున విరిగింది. జనక వాక్యం ప్రకారం సీతారామ కళ్యాణం జరుగుతుంది. (చూ. శ్రీరాముడు; సీత)

## శివాజీ 1627–1680

మహారాష్ట్ర రాజ్య వ్యవస్థాపకుడు. 'ఛత్రపతి' బిరుదాంకితుడు. బీజపూర్ సంస్థానంలో జాగీర్దార్‌గా ఉన్న షాజీ భాంస్లే ఈతని తండ్రి. జిజాబాయి శివాజీ తల్లి. పురాణ కథలు, వీరగాథలు తల్లి చెప్పగా విని ఉత్తేజితుడయ్యేవాడు. ముస్లిముల కొలువులో హిందువులు దాస్యం చేయటం సహించలేక వారిని దాస్య విముక్తుల్ని చేయడానికి కంకణం కట్టుకున్నాడు. 1646లో తోరణ దుర్గాన్ని వశపరచుకుని బీజపూర్ పాలకుని ప్రతిఘటింప గలిగాడు. మరల 1659లో బీజపూర్ పాలకుడు అఫ్‌జల్ ఖాన్‌ను పంపగా వారిని చాకచక్యంగా తరిమికొట్టాడు. 1666లో మొగల్ చక్రవర్తి ఔరంగ జేబు పన్నిన కుట్ర ఫలితంగా బందీయై మాయోపాయంచే తప్పించుకుని తిరిగివచ్చి మొగల్ ప్రభువులపై తిరుగుబాటు చేసి గెలిచాడు. 1674 జూన్ 4న రాయగడ్ దుర్గంలో మహారాష్ట్ర(చూ.) సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడై 'ఛత్రపతి' అయ్యాడు. రాజ్యాన్ని తన గురువు సమర్థ రామదాసుకు ధారపోశాడు. సమర్థ రామ దాసు తన ప్రతినిధిగా రాజ్యం ఏలమని మరల శివాజీకే అనుజ్ఞ ఇచ్చాడు. అందుచేతనే శివాజీ పతాకం కాషాయరంగులో ఉంటుం ది. శివాజీ తన పేరుమీద నాణాల్ని చలామణీ చేయిం చాడు. ముస్లిముల పట్ల సమాదరణ చూపుతో దక్ష తగల పరిపాలకుడుగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాడు.



## శివుడు

త్రిమూర్తు(చూ.)లలో లయకారుడు. రుద్రుడు మరొక పేరు. శివుడ్ని భవ, సర్వ, ఈశాన, పశుపతి,

భీమ, ఉగ్ర, మహదేవ అని కూడ అంటారు. తామసం ఈయన గుణం. శివునికి ఇద్దరు భార్యలు: గంగా, గౌరి (పార్వతి). గంగను శిరస్సున ధరిస్తాడు. మహామేరు ప్రదేశమున ఉన్న కైలాసం ఈయన నివాసస్థానం. శివుని కుమారులలో ఇరువురు ప్రముఖులు: సుబ్రహ్మణ్య, గణపతి. శివుని జుట్టు జడలుకట్టి ఎర్రగా ఉండడంవల్ల 'కపర్ది' అంటారు. ఈయనకు ఫాలభాగాన మూడవ కన్ను కూడ ఉంది. అందుకే ఈయనను అగ్నిలోచనుడు, త్రినేత్రుడు, ఫాలనేత్రుడని అంటారు. లయకారుడు కావున 'శూల' ధరుడు. అందుకే ఈయనను 'పినాకపాణి' అంటారు. శివుని వాహనం తెల్లటి నంది. రెండు, నాలుగు, ఎనిమిది, పది చేతులున్నవాడుగా శివుణ్ని వర్ణిస్తారు. పినాక, ఖట్వాంగ అనే గద, అజగవ అనే ధనుస్సు, లేడి, పూసలు, కపాలం (కపాలి), ఢమురకవంటి పవిత్ర సామగ్రి చేతులందు ఈయన ధరిస్తాడు. శిరస్సునందు గంగా, చంద్రవంక ఉంటాయి. అందుకే గంగాధరుడు, చంద్రచూడుడు అని అంటారు. కపాల హారం మెడలో ఉంటుంది. పులి చర్మం మొలచుట్టూ ఉంటుంది (చూ. నటరాజు). సర్పం ఆభరణంగా ధరిస్తాడు. క్షీరసాగర మథన(చూ.) సమయంలో వాసుకి నోటినుండి కాలకూట విషం పుట్టినప్పుడు దానిని తన కంఠంలో ఉంచుకుంటాడు. అందుకే గరళ కంఠుడు, నీలకంఠుడు అయ్యాడు. అర్జునుడు తపస్సు చేసినప్పుడు శివుడు కిరాత వేషంలో (కిరాతార్జు నీయం) పాశుపతా స్త్రాన్ని ఇస్తాడు. లింగరూపంలోని శివుడికి అభిషేకాలు, పూజలు చేస్తారు (చూ. జ్యోతిర్లింగాలు). శంభు (సాంబ), పశుపతి, మహేశ్వర, శంకర, కృతివాస, శ్రీకంఠుడు, ఈశ్వర, ఉమాపతి, త్ర్యయంబక వంటి పేర్లు శివునికి చాల కలవు. శివరాత్రి (చూ) హిందువులకు పెద్ద పండుగ. కాశీ, శ్రీకాళహస్తి, శ్రీ శైలం పుణ్యక్షేత్రాలు.

## శూద్రకుడు క్రీ.పూ. 300

సంస్కృత మహాకవి. సుప్రసిద్ధమైన మృచ్ఛకటిక నాటక కర్త. అనంతకవి తన వీరచరితంలో శూద్రకుడు బ్రాహ్మణుడనీ, శాలివాహనునికి మిత్రుడనీ, శాలివాహ నుడూ, అతని కుమారుడూ గతించిన పిమ్మట శూద్రకుడే ఉజ్జయినికి రాజైనాడనీ పేర్కొన్నాడు. దశ విధరూపకాలలో మృచ్ఛకటికం ఒకటి. దీనిలో 10 అంకాలు ఉన్నాయి. భాస (చూ.) మహాకవి రచించిన 'చారుదత్తం' దీనికి మూలం. ఒక సాధారణ వేశ్యను కూడా ఉదాత్త నాయికగా తీర్చిదిద్దడం ఈ రూపకంలోని విశేషం. సంస్కృతంలో వచ్చిన సాంఘిక నాటకాలలో ఇది అగ్రగణ్యమైంది. తిరుపతి వేంకటకవులు ఈ నాటకాన్ని తెనుగు చేశారు.

## శ్రీకాకుళం జిల్లా

ఆంధ్రప్రదేశ్‌లోని 23 రాష్ట్రాలలో ఒకటి. 1950 లో విశాఖపట్టణం జిల్లాలో తూర్పు ప్రాంతాన్ని వేరుపరచి శ్రీకాకుళం జిల్లా ఏర్పాటు చేశారు. (చూ. విశాఖపట్టణం జిల్లా; విజయనగరం జిల్లా) దీనికి ఉత్తరాన ఒరిస్సా రాష్ట్రం, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన పశ్చిమాన విజయనగరం జిల్లా సరిహద్దులుగా ఉన్నాయి.

విస్తీర్ణం: 5,837 చ.కి.మీ; జనభా: 19,02, 941 (1988), జిల్లాకేంద్రం: శ్రీకాకుళం, సవరలు, గదబలు, ఖోస్తుడ్ జాతి గిరిజనులు పశ్చిమాన కొండలలో నివసిస్తున్నారు. వంశధారా నది, నాగావళి నది, బాహు దానది, మహేంద్రతనయ వంటి చిన్న నదులు, గెడ్డలు జిల్లాలోని జలాధారాలు. అడవులలో టేకు కలప, వెదురు లభిస్తుంది - సున్నపురాయి. మైకా, గ్రాఫైట్,



పొయ్యిలకు పనికి వచ్చేమన్ను, క్వార్ట్జ్ ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. వరి, సజ్జ, జొన్న, చెరకు, వేరుసెనగ, పొగాకు ప్రధానమయిన పంటసరుకులు.

శ్రీకూర్మంగుడి, అరసవల్లిలోని సూర్యదేవళం, ముఖలింగ దేవాలయం ఈ జిల్లాలోని పుణ్యక్షేత్రాలు. శాలిహుండం బౌద్ధరామాల ప్రాంగణం, కళింగపట్నం సముద్రతీరం విహార స్థలాలుగా పేరుగాంచాయి.

## శ్రీకాళహస్తి

ఆంధ్రప్రదేశ్‌లో సుప్రసిద్ధ శైవక్షేత్రం. త్రిలింగా (చూ.)లలో ఒకటి. ఇది తిరుపతికి (చూ.) సమీపంలో ఉంది. పంచలింగాలలో ఒకటి అయిన వాయులింగం ఇచ్చట ఉందని జనశ్రుతి. ఇందలి శ్రీ కాళహస్తీశ్వరుడు

శివభక్తులకు పరమ దైవం. శ్రీ— సాలెపురుగు, కాళ— సర్పం, హస్తి— ఏనుగు అని 'శ్రీకాళహస్తి'కి వివరణ.

అష్ట దిగ్గజా(చూ.)లలో ఒకడైన ధూర్జటి దైవాన్ని కీర్తిస్తూ 'శ్రీకాళహస్తీశ్వరశతకాన్ని' రచించాడు. తమిళంలో అప్పర్, సంబందర్ కూడా కీర్తనలు భక్తి పాటలు పాడారు. ఆది శంకరులు ఈ క్షేత్రాన్ని దర్శించి 'శ్రీ చక్రాన్ని' ప్రతిష్ఠించారని చెప్పుతారు. మహాశివరాత్రినాడు ఉత్సవం జరుగుతుంది.

## శ్రీకూర్మం

ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళం జిల్లా కేంద్రానికి 10 కి.మీ.దూరంలో ఉన్న వైష్ణవ పుణ్యక్షేత్రం. స్వామి కంఠంలో దీపించెడు గొప్ప సాలగ్రామ మాలికతో సహా శ్రీ మహావిష్ణువు కూర్మాకృతిని పొందాడని భక్తుల విశ్వాసం. 11వ శతాబ్ది నాటికే ఈ దేవళం ప్రసిద్ధి చెందిందని చారిత్రకుల అభిప్రాయం. వాస్తు శిల్ప సంపదకు ఈ కూర్మనాథ స్వామి దేవాలయం ప్రసిద్ధి చెందింది. మహాభక్తుడు కృష్ణ చైతన్య 16వ శతాబ్దిలో ఈ దేవళాన్ని దర్శించాడని అందురు. ప్రతిఏడు చైత్ర మాసంలో జరుగు డోలోత్సవానికి విశేష సంఖ్యలో భక్తజనులు వస్తూ ఉంటారు.

## శ్రీకృష్ణుడు

కురుక్షేత్ర రణరంగంలో అర్జునునికి సారథిగా ఉంటూ గీతోపదేశం (చూ. భగవద్గీత)చేసి అర్జునుని కార్యోన్ముఖుని చేసిన మహా పురుషుడు శ్రీకృష్ణుడు. యాదవ రాజ(యదు)వంశంలో దేవకీ వసుదేవు లకు జన్మించాడు. బలభద్రుడు కృష్ణుని సవతి తల్లి రోహిణి కుమారుడు. కంసుడు కృష్ణునికి మేనమామ (దేవకి సోదరుడు). దశావతారాల్లో కృష్ణావతారం ఒకటి అని హిందువుల విశ్వాసం. చిన్నప్పుడు కృష్ణుడు అనేకము లయిన అల్లరి చిల్లర పనులుచేయగా అవి కృష్ణలీలలుగా ప్రసిద్ధి పొందాయి. దేవకి అష్టమ గర్భంవల్ల కంసుని చావు ఉందని ఆకాశవాణి పలుకగా దేవకీ వసుదేవులు కారాగారంలో బంధింపబడతారు. శ్రీకృష్ణుడు కారాగారంలోనే పుడతాడు. అందుకే కారాగారానికి శ్రీకృష్ణజన్మ స్థానమని రూఢి వాచకం అయింది. ఎటులనో తప్పించి వసుదేవుడు ఆ శివువును పెంపకానికి యశోదకు అప్పగిస్తాడు.

యశోద ఇంట పెరుగుతున్న సమయంలోనే శ్రీకృష్ణుణ్ణి చంపడానికి కంసుడు పంపిన రాక్షసుల్నందరినీ అవలీలగా హతమారుస్తాడు. వీరిలో పూతన, శకటాసురుడు వంటి అనేక మంది ఉన్నారు. బాలకృష్ణుడు రుబ్బురోలును దొర్లించుకు పోవడం, వెన్న దొంగిలించడం, గొల్లభామలను విసిగించ డం వంటి అనేక అల్లరి పనులు చేస్తూ ఉంటాడు. కాళీయమర్దనం, గోవర్ధన గిరిని గొడుగులాగ పట్టి ఉంచడం, గోపిక వస్త్రాపహరణం (రాసలీలలు) వంటి అనేక ఘట్టాలు శ్రీకృష్ణుని జీవితంతో పెనవేసుకొనిపోయి ఉన్నాయి. అవి పోతన (చూ.) మహాభాగవతం (చూ.)లో చక్కగా వర్ణింపబడ్డాయి. కంసుడ్ని వధించ డం, నూరు తప్పులుచేసిన తరువాత శిశుపాలుడ్ని వధించడం భాగవతంలోని రసవత్తర ఘట్టాలు.

శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహం చేసుకున్నాడు. జాంబవంతుని కుమార్తె జాంబవతిని, శమంతకమణిని సత్రాజిత్తుకు చేర్చి ఆయన కుమార్తె సత్యభామను కృష్ణుడు వివాహమాడాడు. కాళింది, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, లక్ష్మణ ఆయన ఎనమండుగురు భార్యల్లోని ఇతరులు. సత్యభామ ఇష్టసతి. ఈమెతో భాగవతంలో పారిజాతాపహరణం వంటి అనేక సరసవంతమైన కథలున్నాయి. 'నరకాసుర వధ' ఘట్టంలో కూడ సత్యభామ పాత్ర ఉంది. మహాభారత కథలో శ్రీకృష్ణుడు పాండవ శ్రేయోభిలాషిగా ప్రముఖపాత్ర వహిస్తాడు. చివరకు కురుక్షేత్ర సంగ్రామ సమయంలో పాండవుల తరఫున పాంచజన్యం శంఖారావం చేసి అర్జునునికి రథసారథిగా, వారి గెలుపుకు అనేక విధాల సాయపడతాడు. ముఖ్యంగా భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడువంటి మహారథులు యుద్ధసమయంలోనిర్వీర్యమగుటకు కారణ భూతుడైన వాడు శ్రీకృష్ణుడే. ధర్మరాజుని రాజసూయాగం చెయ్యమని ప్రోత్స హిస్తాడు. జరాసంధుడ్ని చంపుతాడు. నిండు సభలో ద్రౌపది (చూ.)వస్త్రాపహరణకు గురి అయినప్పుడు తన దివ్యశక్తులనుపయోగించి ఆమె వివస్త్రకాకుండా కాపాడ తాడు.

కృష్ణునికి రుక్మిణి యందు ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సత్యభామ యందు తామ్రుడు, చక్రుడు, జాంబవతి యందు సాంబుడు, మిత్రవింద యందు మిత్రవర్ణుడు, నాగ్నజితి యందు సునీధుడు, మిత్ర

బాహువు కలిగిరి. ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు బాణాసుర కథలోని కథానాయకుడు.

అవసాన కాలమున తపస్సుకై కృష్ణుడు అరణ్యమున ఒకచోట పరుండగా ఈతనిని చూచి మృగమని తలచి ఒక బోయవాడు బాణంవేయగా అరికాలుకి తగలగా పరమ పదించెనని ఐతిహాసం.

కాలక్రమేణా, శ్రీకృష్ణుడు శ్రీవైష్ణవ సంప్రదాయంలో దివ్యపురుషుడుగా పూజింపబడుతున్నాడు. ఉత్తరభారత దేశమున మథుర (చూ.) పరిసరాల్లో కృష్ణభక్తి మెండు. ద్వారక మరొక పుణ్యక్షేత్రం. దక్షిణ భారతదేశంలో గురువయూరులోని ఉన్న కృష్ణమందిరం అనేకమంది భక్తజనాల్ని ఆకర్షిస్తూంది. అంతర్జాతీయంగా నేడు ప్రభు పాదానందస్వాముల వారి పూనికపై 'హరేకృష్ణ' ఉద్యమం ద్వారా కృష్ణభక్తి ప్రచారం సాగుతూంది. (చూ. చైతన్య, మీరాబాయి)

## శ్రీనాథుడు

కవిత్రయం (చూ.) తరవాత పేర్కొనదగిన తెలుగు మహాకవి శ్రీనాథుడు. 14వ శతాబ్ది చివరలో పండిత కుటుంబంలో జన్మించిన ఈ కవి కృష్ణ యజుర్వేదం, న్యాయవైశేషికాలు, మహాభాష్యం, ప్రాకృత భాష అధ్యయనం చేశాడని విజ్ఞుల అభిప్రాయం. కుశాగ్రబుద్ధిగా పేరు సంపాదించి కొండవీటి పెదకోమటి వేమారెడ్డి (1404–1420 ప.) ఆస్థానంలో విద్యాధి కారిగా ఉండేవాడు. ఆ రాజవంశం అంతరించిన తరువాత రాజమండ్రి రెడ్డిరాజుల కొలువులో చేరాడు. ఈయన రచించిన ప్రబంధకావ్యాలు 'కాశీఖండం', 'భీమఖండం', 'శృంగార నైషధం', 'హరవిలాసం', 'మరుత్తరాట్చరిత్ర', 'శాలి వాహన సప్తశతి', 'పల్నాటి వీరచరిత్ర', 'శివరాత్రి మహాత్మ్యం' తెలుగు సాహిత్యానికి పుష్టిని చేకూర్చాయి. పద్యరచన, (ముఖ్యంగా సీస పద్యం), పదగుంఫన, తెలుగు నుడికారపు సొంపు, భావశిల్పం వంటి సాహిత్య విషయాలలో శ్రీనాథుడు కొత్త పుంతలు తొక్కాడని పండితుల అభిప్రాయం. మహాభాగవత రచయిత బమ్మెర పోతన, శ్రీనాథుడు దగ్గర బంధువులనీ (బావమరుదు లనీ) ఒక స్థానిక ఐతిహ్యం. అయితే ఈ బంధుత్వం సందేహాస్పదమని తెలుస్తూంది. (చూ. పల్నాటివీరచరిత్ర; పోతన)

## శ్రీనివాసరావు, శ్రీరంగం

ఆధునిక యుగంలో తెలుగు సాహిత్య రంగంలో 'శ్రీశ్రీ' అనే సంక్షిప్త నామంతో విస్తృతఖ్యాతి నార్జించిన మహాకవి. 1910 జనవరి 2న విశాఖపట్టణంలో వెంకటరమ ణయ్య, అప్పలకొండ దంపతులకు శ్రీశ్రీ జన్మించారు. విశాఖపట్టణం, మద్రాసులలో విద్యాభ్యాసం చేసి, వివిధ ప్రాంతాలలో ఉద్యోగాలను నిర్వహించి చివరికి 1950లో సినిమా రచయితగా ఆయన మద్రాసులో స్థిరపడ్డారు. అయితే శ్రీశ్రీకి అజరామరఖ్యాతినా కలిగించినది ఆయన సాహిత్య కృషి. ఈ శతాబ్దపు కవితా ధోరణికి కవితా శక్తికి ప్రతీకగాను యుగకర్తగాను శ్రీశ్రీ నిలిచారు. ఆయన రచించిన తొలి కావ్యాలను 'ప్రభవ' అను పేర సంపుటిగా 1928లో కవితా సమితి ప్రచురించింది. 1946లో 'వారంవారం' అనే వచన రచనల సంకలనం అచ్చుకాగా 1950లో 'మహాప్రస్థానం' పేరున గీతాల సంపుటి మొదటిసారి అచ్చయింది. ఆయన్ని సుప్రసిద్ధుణ్ణి చేసింది ఈ గ్రంథమే. ఇందులోనే 'కదం తొక్కుతూ, పదం పాడుతూ, హృదంతరాళం గర్జిస్తూ పదండి పోదాం, వినబడలేదా మరో ప్రపంచపు జలపాతం వంటి గేయాలున్నాయి.



1956లో 'మరో ప్రపంచం' అనే రేడియో నాటిక ల సంపుటి, 1957లో 'చరమరాత్రి' కథల సంపుటి అచ్చయినాయి. 1966 లో 'ఖడ్గసృష్టి' పేరుతో 'మహాప్రస్థానం' తరవాతి గీతాలు అచ్చయినాయి.దీనికి సోవియట్ ల్యాండ్—నెహ్రూ అవార్డు లభించింది. ఇందులో 'పతితులార, భ్రష్టులార, బాధాసర్పదష్టులార' కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్లా, హీనంగా చూడకు దేన్నీ కవితామయమేనోయ్ అన్నీ' (బుక్కులు)వంటివి చోటుచే సుకున్నాయి. అరసం అధ్యక్షపదవిలో 1955 70 మధ్యనూ విరసం అధ్యక్షపదవిలో 1970 77 మధ్యనూ కొనసాగారు.

భావకవిగా కవిత్వాన్ని ప్రారంభించి అభ్యుదయ కవిగా మారారు. పీడిత వర్గపు కవిగా తనను తాను గుర్తించుకొని ప్రజాకవిగా గుర్తింపు పొంది వర్గ రహిత సమాజ స్థాపనే

తన ఆదర్శంగా కృషి చేశారు. తెలుగు సాహిత్యమున అనేక క్రొత్త పోకడలూ, ప్రక్రియలూ ప్రవేశపెట్టారు. ప్రాస క్రీడలు అనుపేరుతో కార్టూన్ కవిత్వాన్ని ప్రవేశపెట్టారు. 'లిమరుక్కులు' పేరుతో హాస్యధోరణి గల కవితలు వ్రాసారు. చైతన్య స్రవంతి (స్ట్రీమ్ ఆఫ్ కాన్షసనెస్) పద్ధతిని కథలలో ప్రవేశపెట్టింది శ్రీశ్రీయే. పెక్కు సాహిత్య సంఘాలతో, సాహిత్య ఉద్యమాలతో శ్రీశ్రీకి సంబంధం ఉంది. **1977 నుండి విప్లవ** రచయితల **సంఘంలో సభ్యుడుగా** ఉన్నారు. 1973లో కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు లభించింది. 1983 జూన్ 15న శ్రీశ్రీ అమరుడైనాడు.

## శ్రీ బాగ్ ఒడంబడిక

చూ. నాగేశ్వరరావు, కాశీనాథుని

## శ్రీరంగం

శ్రీవైష్ణవపుణ్యక్షేత్రం. మంగళాశాసనం పొందిన 108 దివ్య తిరుపతులలో ఒకటి. తమిళనాడు లోని తిరుచిరాపల్లికి 5 కి.మీ దూరంలో కావేరీ నదీ తీరాన ఉంది. అనంతశయన భంగిమలో ఉన్న శ్రీ రంగనాథ స్వామి సన్నిధి ఇది. ప్రతి ఏకాదశి ఉత్సవం జరుగుతూ ఉంటుంది. సప్తప్రాకారాలు గల ఈ దేవాలయ ప్రాంగణాన్ని హిందూ శిల్ప ఆగమశాస్త్ర బద్ధంగా శుచి, శుభ్రత, సౌందర్యాలను దృష్టిలో పెట్టుకుని దేవాలయ వాస్తు రూపురేఖలు తీర్చిదిద్దారు. పెరియాళ్వారు నమ్మాళ్వారు మున్నగు ఆళ్వార్లు (చూ.) అందరూ శ్రీ రంగనాథుని స్తుతిస్తూ పాశురాలు పాడి కీర్తించారు.

## శ్రీరామనవమి

చైత్రశుద్ధ నవమి తిథి పునర్వసు నక్షత్రంలో శ్రీరాముడు(చూ.)అయోధ్యలో జన్మించాడు ఆ రోజునే శ్రీరామ నవమి అంటారు. రామనవమినాడు ఉపవాసం చేసి పూజా పునస్కారాలు జరిపి, రాత్రి జాగరణ చేయాలని వ్రత గ్రంథాలు చెబుతున్నాయి. చైత్రశుద్ధ పాడ్యమి నుంచి రామనవరాత్రోత్సవాలు జరుపుతారు. ఈ తొమ్మిది రోజులూ పగలు రామాయణ పఠనం రాత్రి రామకథాకాలక్షేపాలు జరుపుతారు. నవమినాడు రామజనన ఘట్టం చదివి పూజలు చేస్తారు. పానకము, వడపప్పు అతిథులకు ప్రసాదంగా పంచుతారు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధిగల శ్రీరామాలయం భద్రాచలం (చూ.)లో ఉంది. అక్కడ శ్రీరామనవమిరోజున సీతారామకళ్యాణాన్ని అతి వైభవంగా కోవెలలో జరుపుతారు.

## శ్రీరాముడు

దుష్టులను సంహరించడానికీ, శిష్టులను కాపాడడానికి విష్ణుమూర్తి ధరించిన 10 అవతారాలలోను 7వ అవతారం ఇది. అయోధ్య రాజైన దశరథుడు చేసిన పుత్రకామేష్టి యజ్ఞానికి ఫలితంగా కలిగిన నలుగురు కుమారులలో రాముడు జ్యేష్ఠుడు. ఈయన తల్లి కౌసల్య. సుమిత్రా, కైకేయి సవతి తల్లులు. సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులూ, కైకకు భరతుడూ కలిగారు. బాల్యంలో రామలక్ష్మణులను తనవెంటకొని పోయి విశ్వామిత్ర మహర్షి వారికి అస్త్ర శస్త్రాది విద్యలు ఉపదేశించాడు. ఆయన వెంట వారు మిథిలానగరంలో జనకమహారాజు ప్రకటించిన సీత (చూ.)స్వయంవరానికి వెళ్లారు. అక్కడ శివుని విల్లు ఎక్కు పెట్టడానికి భూలోకంలోని రాజులందరూ విఫలులు కాగా, శ్రీరాముడు ఆ విల్లును ఎక్కుపెట్టి సీతను వివాహం ఆడాడు. శివధనుస్సు (చూ.) విరిచాడనే కోపంతో శ్రీరామునిపైకి యుద్ధానికి వచ్చిన పరశురాముడిని, గర్వభంగం చేసి ఆయన శక్తిని శ్రీరాముడు హరించాడు.

కైక దశరథుణ్ణి కోరుకున్న వరాలననుసరించి పితృవాక్యపరిపాలకుడై శ్రీరాముడు 14 సంవత్సరాలు అరణ్యవాసం చేయవలసివచ్చింది. సీతాలక్ష్మణులు కూడా ఆయన వెంట వనానికి వెళ్లారు. అక్కడ కపటోపాయంతో రావణుడు(చూ.) సీతను అపహరించగా సుగ్రీవుడు, హనుమంతుడు మొదలైన కపివీరులసాయంతో రావణుణ్ణి సంహరించి శ్రీరాముడు విభీషణుణ్ణి లంకాధిపతిగా పట్టంకట్టి రావణుని పుష్పక విమానం ఎక్కి 14 సంవత్సరాలు పూర్తి అయిన నాటికి తిరిగి అయోధ్య చేరుకున్నాడు. సీతారాములకు మహావైభవంగా పట్టాభిషేకం జరిగింది. (చూ. రామాయణం, వాల్మీకి).

## శ్రీరాములు, పొట్టి 1901–1952

ఆంధ్రరాష్ట్ర స్థాపనకోసం అసువులు అర్పించిన త్యాగధనుడు. అమరజీవి. గురవయ్య, మహాలక్ష్మమ్మ

దంపతులకు 1901లో మద్రాసులో శ్రీరాములు జన్మించారు. చిన్ననాటి నుండి నీతి, నిజాయితీలతో



ప్రవర్తిస్తూ1925లో రేల్వే లో అసిస్టెంట్ ప్లంబర్‌గా చేరి నాలుగైదు సంవత్సరాలు ఆ ఉద్యోగం చేశారు. తరవాత ప్రజాసేవకే తన జీవితాన్ని అంకితం చేయదలచుకొని గాంధీజీ అనుయాయుడయ్యాడు. ప్రకాశంజిల్లా మారెళ్ళలో మద్యపాన నిషేధం సమస్యమీద నిరాహారదీక్ష బూనాడు. నెల్లూరు శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయంలో హరిజనుల ప్రవేశం కోరుతూ 9 రోజులు నిరాహారదీక్ష చేయగా ధర్మకర్తలలోమనఃపరివర్తన కలిగింది. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం 1952 అక్టోబరు 19 నుండి 58 రోజులు కఠోర ఉపవాస వ్రతం సాగించాడు. డిసెంబరు 15న ఆయన అసువులు అనంతవాయువులలో కలిసి పోయాయి. ఆ అమరజీవి ఆత్మార్పణ ఫలితంగానే అనంతరం ప్రత్యే కాంధ్ర రాష్ట్రం నిర్మాణానికి నెహ్రూ అంగీకరించగా కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు 1న ఏర్పడింది. చూ. రాష్ట్రావతరణ

## శ్రీలంక

భారతదేశానికి దక్షిణంగా ఉన్న ప్రజాతంత్రి సమాజవాది జనరాజ్యం. భారతదేశాన్ని శ్రీలంక నుండి పాక్ జలసంధి వేరుచేస్తున్నది. దక్షిణాన్ని హిందూ మహాసముద్రం, ఉత్తరాన, తూర్పున బంగాళఖాతం, పశ్చిమాన మన్నారు సరిహద్దులు. పూర్వం క్రీ.శ. 1100–1530 మధ్యన ఉత్తర శ్రీలంకను తమిళ చక్రవర్తులు, దక్షిణాన సింహళరాజ వంశపు చక్రవర్తులు ఏలేరు. 16, 17 శతాబ్దాలలో పోర్చుగీసు అధీనంలో ఉండి 1796 నాటికి బ్రిటిషు వారి కైవసమయినది. 1948లో స్వతంత్ర డొమినియన్ ప్రతిపత్తిని సాధించుకున్నది.

విస్తీర్ణం: 65,610 చ.కి.మీ.; జనాభా: 1,66,06,000 (1988); రాజధాని: కొలంబో; అధికార భాష: సింహళం (సిన్హలీస్), ప్రజలలో 74 శాతం సింహళీయులు18 శాతం తమిళ జాతులకు చెందినవారున్నారు. హీనయాన బౌద్ధం 70 శాతం మంది ప్రజలు పాటిస్తున్నారు. 15 శాతం హిందూమతం, 7 శాతం ఇస్లాం, 8 శాతం క్రైస్తవం మతాలకు చెందినవారు ఉన్నారు.

ఆగ్నేయంలో ఉన్న సేనానాయకే సరస్సు, మహావాలీనది, కుంబుక్కన్ నది, వాజవానది,గిన్ నది, కొలానీనది, దేదూరునది, కాలానది, పరంగినది ముఖ్యమయిన జలాధారాలు. మహావాలీ నది మీద డామ్‌ను కట్టి సాగునీటిని పంటచేలకు అందిస్తూ జలవిద్యుత్తును కూడా ఉత్పత్తి చేస్తున్నారు. తేయాకు, రబ్బరు, కొబ్బరి తోట పంటలు. ఇవి ఎగుమతి పంటలు కూడా. వరి కోస్తా ప్రాంతంలో పండుతున్నది. చెరకు, కర్రపెండలం, ప్రత్తి చిరుగడం ఇతర వ్యవసాయోత్పత్తులు. దేశావసరాల నిమిత్తం ఆహార దినుసుల్ని దిగుమతి చేసుకోవాలి. ఎబనీ, శాటిన్ కలప లభిస్తుంది. మత్స్య పరిశ్రమ ఉంది. బంకమన్ను, ఇల్మెనైట్, ఉప్పు, రూటైల్, గ్రాఫైట్, రత్నాలు ఖనిజోత్పత్తులు. ఆహార పదార్థాలు, పానీయాలు, పొగాకు, జవుళీ, పెట్రోరాసాయనిక ద్రవ్యాలు పరిశ్రమలలో పేర్కొనదగినవి. అనూరాధపురం, కాండీ బౌద్ధ పుణ్య క్షేత్రాలు. సిగిరియాలోని బౌద్ధ కుడ్యవర్ణ చిత్రాలు చూడదగ్గవి. అచ్చటి దంతదేవాలయం విదేశీయుల్ని ఆకర్షిస్తూంది.

## శ్రీశైలం

ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో నల్లమలై కొండలలో ఉన్న ఒక పుణ్యక్షేత్రం. ప్రసిద్ధిచెందిన 12 జ్యోతిర్లింగా(చూ.)లలో శ్రీశైలం మల్లికార్జునాలయం ఒకటి. శ్రీశైలం శిఖరం చూసినవారికి పునర్జన్మ ఉండదని భక్తుల విశ్వాసం. శ్రీశైల క్షేత్రం ఎంతో పురాతనమైనది. ఇక్కడ పార్వతీదేవి భ్రమరాంబగాను, పరమశివుడు మల్లికార్జున స్వామిగాను పూజింపబడుతున్నారు. మహాభారతాన్ని రచించిన మహర్షి వేదవ్యాసుడు స్కాంద పురాణంలో శ్రీశైలం మహిమను వర్ణించారు. తల్లిదండ్రులతో (పార్వతీ పరమేశ్వరులు) వివాదం పెంచుకొని వెళ్ళిపోయిన స్కందుడ్ని (కుమారస్వామి) వెతుకుతూ పార్వతీ పరమేశ్వరులు శ్రీశైలం వచ్చి చాలాకాలం ఇక్కడే

ఉండాల్సి వచ్చింది. ఆనాటినుండి ఇదొక పవిత్రమైన దివ్యక్షేత్రంగా మారిపోయిందని ఐతిహ్యం.

అద్వైత మత స్థాపకులు శ్రీ ఆది శంకరులు ఇక్కడ శ్రీచక్ర ప్రతిష్ఠ చేశారు. మహారాష్ట్ర వీరుడు శ్రీ ఛత్రపతి శివాజీ దేవాలయ సంరక్షణకు పాటుపడి ఉత్తరద్వారంపై పెద్ద గోపురం కట్టించాడు. శ్రీశైలం క్షేత్రంలో చుట్టుపక్కల కొండ ప్రదేశంలో అమూల్యమైన ఓషధులు, మూలికలులభిస్తాయి. సమీపంలోని కృష్ణానది (చూ.) పై శ్రీశైలం డామ్ ఉంది.

ప్రతి సంవత్సరం మహాశివరాత్రి పర్వదినంనాడు ఇక్కడ పెద్దఎత్తున పూజలు ఉత్సవాలు జరుగుతాయి. లక్షలాదిమంది భక్తులు దైవదర్శనానికి వస్తారు. భక్తుల సౌకర్యార్థం ప్రత్యేక బస్సులు ఇతర సదుపాయాలు ఏర్పాటు చేస్తారు.

## శ్రీ శ్రీ

చూ. శ్రీనివాసరావు శ్రీరంగం

## షర్షా



మొగల్ చక్రవర్తి హుమాయూన్‌ను తరిమివేసి కొంతకాలం ఢిల్లీ రాజధానిగా భారతదేశాన్ని పాలించిన సూర్ (ఆఫ్ఘన్) రాజవంశీయుడు. గుర్రాల వ్యాపారి హసన్‌ఖాన్. కొన్నాళ్లు ఢిల్లీ రాజు దౌలత్‌ఖాన్ లోడీ కొలువులో (1519) చేరి, తరువాత జౌన్‌పూర్ దివాణంలో పనిచేశాడు. అప్పుడే అడవి మృగాలవేటలో సాహసోపేతంగా పెద్దపులిని చంపుటచే అతను 'షేర్ ఖాన్' అయ్యాడు. 1527లో బాబర్ (చూ.) సామ్రాజ్యంలో జాగీర్దార్ అయి రాజ్య నిర్వహణ తంత్రాల్ని క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. ఈతని కుశాగ్రబుద్ధికి మెచ్చి బాబర్ బీహార్‌కు గవర్నరు చేశాడు. 1540లో షర్షా స్వతంత్రించి హుమయూన్‌తో పోరాడి, గెల్చి ఢిల్లీని ఆక్రమించి 'షర్షా'గా పట్టాభిషిక్తుడయ్యాడు. షర్షా పరిపాలనలో అనేక సంస్కరణలను రూపొందించి అమలు జరిపాడు. రాజ్యాన్ని పరగణాలుగా విభజించాడు. ప్రతి పరగణాకు ఒక అమాన్, ఒక షేక్‌దార్, ఒక ఖజాంచి (లెక్కలు వ్రాసేవాడు) ఉండేలాగ ఏర్పాటుచేశాడు. పంజాబు నుండి బెంగాలుకు 3200 కి.మీ. నిడివిగల ఒక రాజమార్గాన్ని వేయించాడు. బాట కిరువైపులా చెట్లు, చలివేంద్రాలు, భోజన సౌకర్యాలు సమకూర్చాడు. రూపాయి వెండి నాణాన్ని ప్రవేశపెట్టింది షర్షా కాలంలోనే. భూముల సర్వే పద్ధతిని ప్రవేశపెట్టాడు. శిస్తు వసూలు ఏర్పాటు చేశాడు. ఈ పద్ధతినే తరువాత అక్బర్ కొనసాగించాడు. బ్రిటిషువారి పాలనలో 'రైతువారీ పద్ధతికి' కూడా షర్షా విధానమే ప్రాతిపదిక. చట్టవిరుద్ధంగా ప్రవర్తించే వారిని కఠోరంగా శిక్షించే పద్ధతి ప్రవేశ పెట్టాడు. హిందూ—ముస్లిం సామరస్యానికి దోహదం చేశాడు. భారతదేశాన్ని పాలిం చింది పదేళ్లు మాత్రమే అయినా ఆయన ముద్ర పరిపాలనా పద్ధతిలో మాత్రం ఇప్పటికీ కనిపిస్తుంది. కాలింజర్ కోటను ముట్టడించి రాజ పుత్రు లను వశపర్చుకుందామనే ఎత్తుగడలో రణరంగం లోనే ఘోరయుద్ధం చేస్తూ 1545లో మరణించాడు.

## షా, జార్జి బెర్నాడ్ 1856–1950

ఇంగ్లీషు కవి. నాటక కర్త. ఐర్లాండ్‌లో 1856లో జన్మించిన జార్జి బెర్నాండ్ తన రచనా చాతుర్యంతో ఇంగ్లీషువారి మన్నన లందుకున్నాడు. చిత్తశుద్ధి లేకుండా ప్రగల్భాలు పలికే రాజకీయ నాయకుల తత్వాన్ని తన సహజ హాస్య వ్యంగ్య ధోరణిలో సమాజంలోని కుళ్లును బయటపెట్టేవాడు. సోషలిజాన్ని గూర్చి అనేక వ్యాసాలు వ్రాశాడు. ఆయన వ్రాసిన నాటకాల్లో 'మాన్ అండ్ సూపర్ మాన్', 'బాక్ టూమెతుసెలాహ్', 'ది ఆపిల్ కార్ట్', 'పిగ్మేలియన్', 'సీజర్ అండ్ క్లియోపాత్రా' ప్రముఖ మైనవి. ఈ నాటకాలకు ఆయన వ్రాసిన సుదీర్ఘమైన పీఠికలు సాహితీవేత్తలను ఆకట్టుకున్నాయి. ఫాబియన్ సొసైటీలో 1884 నుండి సభ్యుడు. 1925లో ఆయన నోబెల్ సాహితీ పురస్కారాన్ని అందుకున్నాడు.

## షాజహాన్

భారతదేశంలో ఐదవ మొగల్ చక్రవర్తి (1627-58). అక్బర్ (చూ.) మనుమడు. జహంగీర్ (చూ.) తనయుడు. షాజహాన్ అసలు పేరు ఖుర్రమ్. నూర్జహాన్



రాజ దంపతులు షాజహాన్ — ముంతాజ్

సోదరుడు అసఫ్‌ఖాన్ కుమార్తె ముంతాజ్ మహల్‌ను షాజహాన్ వివాహమాడాడు. ఆమె పేరుమీదుగానే ఆమె మరణానంతరం సుప్రసిద్ధ తాజ్‌మహల్ (చూ.)ను నిర్మించాడు (1631–43). భారతదేశాన్ని పాలించిన మహారాజులలో గొప్ప చక్రవర్తిగా షాజహాన్ కీర్తి నార్జించాడు. ఈయన కాలంలో మొగల్ సామ్రాజ్యం పతాకస్థాయిని విస్తరించింది. ముప్ఫయి ఏళ్ల శాంతి భద్రతలను పరిరక్షిస్తూ చక్కని పాలన సాగించాడు. శిస్తు వసూళ్ళు పుష్కలంగా ఉండేవి. రాజ్యం ఐశ్వర్యవంత మయింది. కాని సొమ్మంతా కళాపోషణలకూ, మనస్బ దారీల జీతాలకే ఎక్కువయ్యేది. సుందర భవన నిర్మాణాలకు, కళా సాహిత్య పోషణలు షాజహాన్ పాలనలో బాగా సాగాయని చారిత్రకుల అభిప్రాయం. నెమలి సింహాసనం ఈయన కాలంలోనే సృష్టింపబడ్డది. కళా కారుల్ని పోషించడానికి కార్ఖానాలు నెలకొల్పబడ్డాయి. న్యాయ పాలనలో 'హాన్షీ—ఇ—అదిల్' బిరుదాంకితు డయ్యాడు. ముస్లిం న్యాయ స్మృతి ననుస రించి పండితుల అభిప్రాయాన్ని తీసికొని తీర్పునిచ్చేవాడు. తాత, తండ్రి వలెకాక మత దురహంకారి. ఆయన పెద్ద కుమారుడు దారాషుకో ఆధ్యాత్మిక చింతన కలిగి వేదాంతం, ఉపనిషత్తులు అధ్యయనం చేసేవాడు. అయితే దారా షుకోకు పరిపాలకునికి ఉండవలసిన లక్షణాలు ఏమీలేవు. షుజా, మురద్, ఔరంగజేబ్ అనువారు మిగతావారు. చివరకు షాజహాన్ తరవాత 1658లో కడపటి వాడయిన ఔరంగజేబ్ (చూ.) మొగల్ సింహాసనాన్ని అధి ష్ఠించాడు. మొగల్ సామ్రాజ్యాన్ని ఉచ్ఛదిశకు తీసుకువచ్చి న షాజహాన్ 31 ఏళ్లు రాజ్యపాలన కొనసాగించి 1666లో కీర్తిశేషుడయ్యాడు. అయితే ఈయన తరవాత మొగల్ సామ్రాజ్యం క్షీణింపసాగింది.(చూ.మొగల్ సామ్రాజ్యం. అక్బర్, జహంగీర్, బాబర్, హుమాయూన్)

## షార్లమేన్ 742–814

పశ్చిమ యూరప్ దేశమున మధ్యయుగంలో నాగరకతాభివృద్ధికి దోహదం చేసిన రోమన్ చక్రవర్తి. రాజకీయంగాను, సంస్కృతిపరంగాను ఆయన ముద్ర ఆ ప్రాంతం మీద వెయ్యేళ్లపాటు నిలిచి ఉంది. ఆయన దండయాత్రలు సాగించి సామ్రాజ్యాన్ని విస్తరింపచేశాడు. గొప్ప మనీషిగా ప్రసిద్ధిపొందాడు. కళాకారులను, పండితులను పోషించాడు. నేటి ఫ్రాన్స్, బెల్జియమ్, జర్మనీ, ఉత్తర ఇటలీ మున్నగు ప్రాంతాలు ఆనాడు ఈయన సామ్రాజ్యంలో భాగాలుగా ఉండేవి. షార్లమేన్ అనీ కరోలస్ మాగ్నస్ (లాటిన్‌లో--చార్లెస్ ది గ్రేట్) అనీ కూడా ఈయనను వ్యవహరిస్తారు.

## షేక్స్‌పియర్, విలియమ్ 1564–1616

ఇంగ్లండులో పుట్టిన సుప్రసిద్ధ సాహిత్యవేత్త, మహాకవి, నాటక రచయిత. స్ట్రాట్‌ఫర్డ్–ఆన్-ఎవాన్ అను చోట జన్మించాడు. ఇంగ్లీషు సాంస్కృతిక పునరుజ్జీవనం జరుగుతున్న రోజుల్లో షేక్స్‌పియర్ లండన్ నగరం చేరుకుని గ్లోబ్‌థియేటరులో నాటక రచయితగాను, నటుడుగానూ చేరి స్థిరపడ్డాడు. ఆయన కలం నుండి వెలువడిన 38 నాటకాలను రంగస్థల నిర్వాహకులు ప్రదర్శించేవారు. ఆయన మరణించిన తరువాత 1623 నాటికి 36 నాటకాలను సంకలించి మొదటిసారిగా ఫోలియోగా ప్రచురించారు. ఇందులో 16 నాటకాలు క్వార్టరుగా ఆయన జీవిత కాలంలోనే ప్రచురితమయాయి. ఇందులో సుఖాంతాలు, విషాదాంతాలు, చారిత్రకాత్మక నాటకాలు వంటివి ఉన్నాయి. లవ్స్ లేబర్స్ లాస్ట్, కామెడీ ఆఫ్ ఎర్రర్స్ మొదటి నాటకాలుగా తెలుస్తున్నాయి. తరువాత ది టూ జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా, రోమియో&జూలియట్ వ్రాశాడు. హెన్రీ VI, రిచర్డ్ III, టేమింగ్ ఆఫ్‌ది ష్రూ, కింగ్‌జాన్, మర్చెంట్ ఆఫ్ వెనిస్, ఏ మిడ్ సమర్ నైట్స్ డ్రీమ్, ఆల్స్ వెల్ దట్ ఎండ్స్‌వెల్, హెన్రీ IV, మెర్రీ వైవ్స్ ఆఫ్ విండ్సర్, హెన్రీ V,యాజ్‌యూ లైక్ ఇట్, ట్వెల్ఫ్త్ నైట్,మచ్ ఎడో ఎబౌట్ నతింగ్ వ్రాసిన పిదప,ఆయనకు కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిన సుప్రసిద్ధ నాటకాలు వ్రాశాడు. అందులో జూలియస్‌సీజర్, హేమ్లెట్, ట్రోయిలస్–క్రెసిడా, ఒథెల్లో, మెషర్ ఫర్ మెషర్, మేక్బెత్, కింగ్‌లియర్, టైమన్ ఆఫ్



ఏథెన్స్, పెరికిల్స్, ఆంటోని&క్లియోపాత్రా, కొరియో లినస్, సింబలీన్, వింటర్స్ టేల్, ది టెంపెస్ట్, హెన్రీ VIII, టూనోబుల్ కిన్స్‌మన్. ఈ నాటకా లన్నింటి లోనూ షేక్స్‌పియర్ భాషా ప్రయోగంలోను పాత్ర పోషణలోనూ, నాటకీకరణలోనూ తనకు తనే సాటి అనిపించుకున్నాడు. స్ట్రాట్‌ఫర్డ్ ఆన్ ఎవాన్‌లో ఈయన జన్మించిన స్థలంలోని స్మారక చిహ్నం ప్రపంచ సాహితీపరు లకూ రంగస్థల కళాకారులకూ పుణ్యస్థలి అయింది.

## సం|క్రాంతి

చూ. మకరసంక్రాంతి

## సంజీవయ్య, దామోదరం

ప్రజానాయకుడు. రాజకీయవేత్త. సాహిత్యాభి మాని. మునియ్య, సుంకలమ్మ దంపతులకు 1921



ఫిబ్రవరి 14న కర్నూలు జిల్లా పెదపాడులో జన్మించారు. బి.ఏ., బి.ఎల్., పట్టా సంపాదించిన సంజీవయ్య మద్రాసులో కొంతకాలం న్యాయవాదిగా ప్రాక్టీసుచేశారు. తర్వాత రాజగోపాలచారి (1952), ప్రకాశం (1953–54), బెజవాడ గోపాలరెడ్డి (1955) మంత్రివర్గాలలోను 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత నీలం సంజీవరెడ్డి మంత్రివర్గంలోను మంత్రిగా పనిచేశారు. 1960లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఎన్నికై ప్రప్రథమ హరిజన ముఖ్యమంత్రిగా పేరెన్నిక గన్నారు. 1962లో అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షపదవిని అలంకరించి ఎంతో సమర్థతతో నిర్వహించారు. 1964 లో కేంద్రంలో జవహర్ లాల్ నెహ్రూ మంత్రివర్గంలో కార్మికమంత్రిగాను 1966లో ఇందిరాగాంధీ మంత్రి వర్గంలో పరిశ్రమ మంత్రిగానూ 1970లో కార్మిక మంత్రిగానూ పనిచేశారు. తిరిగి 1972 మే నెలలో కాంగ్రెస్ అధ్యక్షపదవిని చేపట్టారు. ఆయన మంచి వక్త. పద్యాలు, పాటలు రచించారు. అఖిలభారత తెలుగు రచయితల సంఘానికి అధ్యక్షుడుగా కొంతకాలం ఉన్నారు. 1972 మే 7న సంజీవయ్య కన్నుమూశారు. ఈయన జీవిత చరిత్రనొకదానిని శ్రీ డి. రామలింగం వ్రాశారు (1991).

## సంజీవరెడ్డి నీలం

జననం 1913

భారతదేశానికి ఆరవ రాష్ట్రపతి (1977–82). ప్రముఖ రాజకీయవాది. ఆంధ్రప్రదేశ్‌కు మొట్టమొదటి ముఖ్యమంత్రి (1956–60). రాజకీయ నేపథ్యంగల కుటుంబంలో సంజీవరెడ్డి 1913 మే 19న అనంత పురం జిల్లాలో జన్మించాడు. 1949లో ఉమ్మడి మద్రాసుకు పి.ఎస్. కుమార స్వామి రాజా మంత్రివర్గంలో చేరి 1953లో ఆంధ్రరాష్ట్రం అవతరించినప్పుడు ప్రకాశం మంత్రివర్గంలో ఉప ముఖ్యమంత్రి అయ్యాడు. తరవాత ఏర్పడిన గోపాలరెడ్డి మంత్రివర్గంలో ఉపముఖ్య మంత్రిగానే కొనసాగి ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు ముఖ్యమంత్రి అయి రాష్ట్రాభివృద్ధికి దోహదం చేశాడు. నాగార్జునసాగర్ డాము నిర్మాణం ఈయన హయాములో చేపట్టిన పథకమే. 1964లో కేంద్రమంత్రి వర్గంలో చేరి 1967లో లోక్‌సభ సభాపతి అయ్యాడు. 1977 లోక్‌సభ ఎన్నికల్లో జనతాపార్టీ విజయం సాధించినప్పుడు ఆంధ్రప్రదేశ్ నుంచి ఎన్నిక అయిన ఏకైక జనతా అభ్యర్థి సంజీవరెడ్డి. అప్పుడు ఆయన భారత రాష్ట్రపతి ఎన్నికల్లో పోటీచేసి ఏకగ్రీవంగా ఎన్నిక అయ్యారు. నిర్భీతి, ధైర్య సాహసాలుగల రాజకీయ ధురంధరుడుగా పేరు, ప్రఖ్యాతులు గడించారు. రాజకీయాల్లో ఉన్నత సంప్రదాయాల్ని నెలకొల్పిన ధీశాలి సంజీవ రెడ్డి.



## సంవత్సరం

భూమి సూర్యుని చుట్టూ ప్రదక్షిణం చెయ్యడానికి పట్టేకాల వ్యవధిని 'సంవత్సరం' అంటారు. అది సాధారణంగా 365 రోజులు. సౌర సంవత్సరం 365 రోజుల 5 గంటల 48 నిముషాల 40 సెకనులు. సైడీరియల్ సంవత్సరం 365 రోజుల 6 గంటల 9 నిముషాల $9\frac{1}{2}$ సెకనుల కాలం. కేలండరు (పంచాంగం) లెక్కల ప్రకారం సాధారణ సంవత్సరం 365 రోజులే. నాలుగేళ్ల కొకసారి అధిక మాసం ఫిబ్రవరి నెలలో 29

రోజులుగా పరిగణిస్తారు. 4 చే భాగింపబడిన సంవత్సరం అధిక మాసం ఉన్న 'లీపు ఇయర్' అవుతుంది. అంటే 1988, 1992 ఇలా. ప్రాచీన ఈజిప్టులో మొదట సంవత్సర భావాన్ని కనిపెట్టారని చెబుతారు. సౌర పంచాంగం ప్రకారం ప్రపంచమంతా సంవత్సరమంటే జనవరి 1న మొదలు డిసెంబరు 31 వరకు ఉంటుంది. అయితే ఆయా దేశాల్లో మత ధర్మ ప్రకారం మారుతూ ఉంటుంది. తెలుగు వారికి ఉగాది (చూ.) నుండి ప్రారంభమవుతూ ఉంటుంది. తెలుగు పంచాంగం ప్రకారం సంవత్సరాలు 60 ఏళ్ల కొకసారి చాక్రికంగా మారుతూ ఉంటాయి.

*1. ప్రభవ; 2. విభవ; 3. శుక్ల; 4. ప్రమోదూత; 5. ప్రజోత్పత్తి; 6. అంగీరస; 7. శ్రీముఖ; 8. భావ; 9. యువ; 10. ధాత; 11. ఈశ్వర; 12. బహుధాన్య; 13. ప్రమాది 14.విక్రమ 15. వృష 16. చిత్రభాను 17. స్వభాను 18. తారణ 19. పార్థివ 20. వ్యయ 21. సర్వజిత్తు 22. సర్వధారి; 23. విరోధి; 24. వికృతి; 25. ఖర; 26. నందన; 27. విజయ; 28. జయ; 29. మన్మథ; 30. దుర్ముఖి; 31. హేవిళంబి; 32. విళంబి; 33. వికారి; 34. శార్వరి; 35. ప్లవ; 36. శుభకృత్తు; 37. శోభకృత్తు; 38. క్రోధి; 39. విశ్వావసు; 40. పరాభవ; 41. ప్లవంగ; 42. కీలక; 43. సౌమ్య; 44. సాధారణ; 45. విరోధికృతు; 46. పరీధావి; 47. ప్రమాదీచ; 48. ఆనంద; 49 రాక్షస; 50 నళ; 51. పింగళ; 52. కాళయుక్తి; 53. సిద్ధార్థి; 54. రౌద్రి; 55. దుర్మతి; 56. దుందుభి; 57. రుధిరోద్గారి; 58. రక్తాక్షి; 59. క్రోధన; 60 అక్షయ.*

ఇస్లాం మతస్థులు హిజీరా సంవత్సరాన్ని పాటిస్తారు. చూ. శాలివాహనుడు.

## సట్లైజ్ నది

హిమాలయ పర్వతాల్లో పుట్టి సింధునదిలో కలుస్తున్న నది. ఇది ఎక్కువ భాగం పాకిస్తాన్‌లో ప్రవహిస్తూ పంటనీటిని అందిస్తూంది. దీని నిడివి 1600 కి.మీ.

## సత్తిరాజు లక్ష్మీనారాయణ

'బాపూ'గా అందరికీ సుపరిచితుడు. ప్రముఖ కార్టూనిస్టు, రేఖాచిత్రకారుడూ 'బుడుగు' సృష్టికర్త. సినీమా దర్శకుడుగా ప్రసిద్ధి చెందాడు. బాపూ నర్సాపురం(పశ్చిమ గోదావరి జిల్లా)లో 1933 డిసెంబరు 15న జన్మించి న్యాయవిద్య నభ్యసించాడు. కొన్నాళ్లు ప్రసిద్ధ అడ్వర్టయిసింగ్ ఏజెన్సీలలో ఆర్ట్ డైరక్టరుగా పనిచేశాడు. సుప్రసిద్ధ రచయిత ముళ్లపూడి వెంకట రమణతో కలిసి ఒకరు బొమ్మా, మరొకరు రచన ఇద్దరూ కలిసి 'బాపూ రమణీయం' హాస్య—వ్యంగ్య కళాకారుల జంటగా నాలుగు దశాబ్దాల (1949–1990) పాటు తమ 'బొమ్మ— రచన'లతో తెలుగు ప్రజానీకాన్ని అలరించారు. ఈ ఇద్దరి సచిత్ర రచనలు బాలసాహిత్యాలలో చోటుచేసుకున్నాయి. బాలచిత్ర కారుడుగా 'బాల' పత్రికకు సరదాగా (1949) బొమ్మలు వేస్తూ చివరకు ఆ ప్రవృత్తినే వృత్తిగా మలచుకున్నాడు.



రేఖా సృజనాత్మకత ఆయన సొత్తు. క్విల్ పెన్‌తో ఆడుతూ పాడుతూ బాపూ బొమ్మ, ముఖ్యంగా స్త్రీని, అంద చందాలతో మలచడంలో ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్నాడు. ఎదిగే ప్రతి అమ్మాయీ బాపూ గీసిన 'రెండు జడల సీత'లా ఉండాలనుకుంటూంది. ఈ కళాతపస్వి 'జనార్దనాష్టకం' (1966), 'బాల రామాయణం' (1976)లలో రంగులజిలుగుతో తీర్చిదిద్దిన బొమ్మలు ప్రముఖ కళాఖండాలు. నైతిక విలువలు ఉండి, ఆయన సృష్టించిన వినోదాత్మక చలనచిత్రాలు కళాఖండాలు— సాక్షి, బుద్ధి మంతుడు, గోరంతదీపం, వంశవృక్షం, 'సీతాకళ్యాణం', 'త్యాగయ్య', 'సంపూర్ణ రామాయణం'. ఆయన దర్శకత్వం వహించిన 'ముత్యాల ముగ్గు' బహుజనాదరణ పొందిన సినిమా. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నియోగంపై ప్రాథమిక తరగతులకు 'వీడియో పాఠాలు' అందించారు (1986–89). ఆంధ్రయూని



బుడుగు-సీగాన పెసూనాంబ | రెండు జెళ్ళ సీత

వర్సిటీ 'కళాప్రపూర్ణ' గౌరవ డాక్టరేట్ బిరుదును ప్రదానంచేసి సత్కరించారు (1989).

## సత్యనారాయణ, గరిమెళ్ళ

తెలుగులో జాతీయకవి. భారతస్వాతంత్ర్య సమర కాలంలో ఆంధ్రులను ఉత్తేజితులకు చేసిన ప్రబోధ వాఙ్మయాన్ని సృష్టించి తెలుగువారిలో గొప్ప జాతీయ చైతన్యం కలిగించిన మహాకవి.

శ్రీకాకుళం జిల్లా గోనపాడు గ్రామ శివారులోని ప్రియాగ్రహారంలో 1893లో వెంకటనరసింహం, సూరమ్మ దంపతులకు సత్యనారాయణ జన్మించారు. రాజమండ్రి ట్రెయినింగ్ కళాశాలలో చదువుతూ ఉండగా గాంధీజీ విదేశవస్తు బహిష్కార శంఖారావంతో ఉత్తేజితుడై కళాశాల విద్యకు స్వస్తి చెప్పి ప్రబోధ గీతాలను వ్రాసి వాటిని పాడుతూ తిరుగుతూ ప్రచారం చేసేవాడు. అందులో అత్యంత జనాదరణ పొందిన గీతం 'బాబు! మాకొద్దీ తెల్లదొరతనము, రెండు దండాలండోయ్ సైతాను ప్రభుత్వానింక సాగనీయమండోయ్' అని ఆరంభం అవుతోంది. ఆయన పాటలు విని ఆంధ్రులు ఉత్తేజితులు కావడం చూసి గాంధీజీ ఇతర భారతీయ భాషలలో కూడా అట్లాంటి గీతాలను వ్రాయమని అక్కడ కవులను కోరారు. జాతీయోద్యమంలో పాల్గొని గరిమెళ్ళ రెండు న్నర సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించారు.

గృహలక్ష్మి, త్రిలింగ పత్రిక, ఆంధ్రపత్రికలలో ఆయన పనిచేశారు. శారదా గ్రంథమాలను స్థాపించారు. తమిళం నేర్చుకొని ప్రసిద్ద తమిళ రచన కురళ్‌ను తెనిగించారు. 'హార్ట్ ఆఫ్ ది నేషన్', 'మదర్ ఇండియా' మొదలయిన ఇంగ్లీషు పద్యకావ్యాలను రచించారు. 'నాలడియార్' వంటి ప్రసిద్ధ తమిళగ్రంథాలను తెనిగించాడు. 'తళ్లికోట' మొదలయిన కన్నడ నాటకాల్ని, గ్రంథాల్ని తెలుగులోకి అనువదించి సాహిత్య సేవచేశారు. ఆయన వ్రాసిన హరిజనోద్యమ గీతాలు, స్వరాజ్యపు గీతాలు తెలుగుదేశంలో వాడవాడ ప్రతిధ్వనించాయి. "కొందరు త్యాగంచేయాలి, నశించాలి, నాశనమైపోవాలి అప్పుడుగాని దేశం బాగుపడదు" అంటూనే గరిమెళ్ల సత్యనారాయణ చివరకు కటిక దారిద్ర్యం అనుభవించి 1952 డిసెంబరు 18న అమరుడైనాడు.

## సత్యనారాయణ, విశ్వనాథ

జ్ఞానపీఠ్ అవార్డు అందుకున్న మొదటి తెలుగు మహాకవి. కవిసామ్రాట్, పద్మభూషణ, కళాప్రపూర్ణ, డాక్టర్ బిరుదాంకితులు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి (1966–76).

కవిగా, కథకుడుగా, నవలా రచయితగా, నాటకకర్తగా, సాహిత్యవిమర్శకుడుగా, మహావక్తగా, కావ్యగాయకుడుగా సుమారు ఆరుదశాబ్దాల పాటు తెలుగు ప్రజలను అలరించారు.

కృష్ణాజిల్లా నందమూరు గ్రామంలో శోభనాద్రి, పార్వతమ్మ దంపతులకు 1895 సెప్టెంబరు 10న సత్యనారాయణ జన్మించారు.



విశ్వనాథ రచించిన వాటిలో 'వేయిపడగలు' నవలకు ఆంధ్ర విశ్వకళాపరిషత్ నిర్వహించిన పోటీలో బహుమతి రాగా 'శ్రీమద్రామాయణ కల్పవృక్షమునకు జ్ఞానపీఠ్ అవార్డు (1970)లభించింది. స్వర్గానికి నిచ్చెనలు, చెలియలికట్ట, ఆంధ్ర ప్రశస్తి, కోకిలమ్మ పెళ్లి, కిన్నెరసాని పాటలు, ఏకవీర గిరికుమారుని ప్రేమగీతాలు, భ్రమరగీతాలు, మధ్యాక్కరలు ఆయన రచనలో ప్రధానమైనవి. వరలక్ష్మీ త్రిశతి ఆయన వ్రాసిన విలాపకావ్యం. చారిత్రకములు, సామాజికముల పౌరాణికాలు కలిపి దాదాపు 66 నవలలను, 20వేల పైగా పద్యాలను వివిధ పత్రికలలో వందలకొలది ఖండకావ్యాలను ఆయన రచించారు.

సంస్కృత భాషలో 'అమృత శర్మిష్టమ్', 'గుప్త పాశుపతమ్' వంటి నాటకాలను రచించారు.

1938 నుండి 1959 వరకు విజయవాడ ప్రభుత్వకళాశాలలో ఆంధ్రశాఖాధిపతిగా తర్వాత కరీంనగర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసి 1963లో పదవీ విరమణ చేశారు. సహస్ర చంద్ర దర్శనోత్సవం చేసి 1976 అక్టోబర్ 18న హృద్రోగంతో విశ్వనాథ కీర్తిశేషులయినారు.

## సప్తర్షులు

'సప్తర్షులు'గా ప్రసిద్ధిపొందిన ఏడుగురు మహర్షులు: 1.భరద్వాజుడు; 2.కాశ్యపుడు; 3.గౌతముడు; 4.విశ్వామిత్రుడు; 5.జమదగ్ని; 6. వశిష్ఠుడు; 7.అత్రి.

అగ్నిదేవుడు ఒకప్పుడు సప్తర్షుల భార్యలను చూసి మోహించాడట. ఆ సంగతి తెలుసుకొని అగ్నిదేవుని భార్య స్వాహాదేవి తానే ఆ ఋషిపత్నుల వేషంకట్టి భర్తను సంతోష పరచింది. అయితే ఆమె ఆరుగురు మహర్షుల భార్యల వేషాలను మాత్రమే ధరించగలిగింది. వశిష్ఠుని భార్య అరుంధతి వేషం మాత్రం ధరించలేకపోయింది. అందుకే అరుంధతి మహాపతివ్రతగా ప్రసిద్ధిపొంది ఆకాశంలో కృత్తికారాశిలో కనిపించే సప్తర్షిమండలంలో వసిష్ఠ నక్షత్రం ప్రక్కన మినుకు మినుకుమనే ప్రత్యేక నక్షత్రంగా నేటికీ ఆమె మనకు దర్శనమిస్తూంది. హిందువుల వివాహానంతరం నూతన వధూవరులకు పురోహితుడు చూపించే నక్షత్రమే 'అరుంధతి'. కొన్ని పురాణాలు భృగువు, పులస్త్యుడు, మరీచి మొదలైనవారితో 10మంది మహర్షులను ఏకరువు పెడుతున్నాయి. కాని సప్తర్షులు, పైన పేర్కొనబడిన ఏడుగురు మహర్షులే!

## సప్త వింతలు

ప్రాచీన ప్రపంచంలో సప్తవింతలు (సెవెన్ వండర్స్ ఆఫ్‌ది వరల్డ్) గా ప్రసిద్ధమైనవి: 1. ఈజిప్టులోని పిరమిడ్‌లు (చూ); 2. కారియా మహారాజు మాసోలస్ (క్రీ.పూ. 350) సమాధి (ఆసియా మైనర్); 3. ఈఫసెస్ (పశ్చిమ ఆసియా మైనర్)లో చంద్ర వంశపు ఆర్టిమస్ (డయానా) దేవళం; 4. బాబిలోనియా లోని వేలాడే ఉద్యానవనాలు, మహా కుడ్యాలు; 5. రోడ్స్‌లోని అపోలో దేవత మహాకాంస్య శిల్ప విగ్రహం—కొలోసస్ (క్రీ.పూ.3 శతా.); 6. గ్రీక్ స్వర్గాధిపతి జూస్ (జూపిటర్—బృహస్పతి) దంత—స్వర్ణ శిల్ప విగ్రహం; 7. ఫారోస్ దీవి మీద రెండవ టాలమీ అలిగ్జాండ్రియా హార్బర్‌లో నిర్మించిన (క్రీ.పూ. 280) 'ఫారో' దీపస్తంభం (లైట్ హవుస్). దీనికి బదులు ఈజిప్టు రాజు టాలమీ ఫిలడెల్ఫస్ అలిగ్జాండ్రియాలో నిర్మించిన ఘంటా (వాచ్‌టవర్) స్తంభాన్ని కూడా సాధరణంగా ఏడవ వింతగా పేర్కొంటారు.

## సభాపతి

లోక్‌సభ వ్యవహారాలను సభాపతి నిర్వహిస్తారు. లోక్‌సభ సభ్యులు సభాపతిని, ఉపసభాపతిని ఎన్నుకుంటారు. సాధారణంగా సభాపతి సభలో మెజార్టీ సభ్యుల పార్టీకి చెందిన వారై ఉంటారు. అయితే సభాపతిగా ఎన్నికైన తర్వాత సభా వ్యవహారాలను రాజకీయ పార్టీ ప్రమేయం లేకుండా నిష్పక్షపాతంగా నిర్వహించాల్సి ఉంటుంది. సభాపతి రూలింగ్‌కి అనుగుణంగా సభా వ్యవహారాలు నడుస్తాయి. అధికార పార్టీ సభ్యులు, మంత్రులతో సహా సభ్యులందరూ సభాపతి అధికారానికి లోబడి ఉండాల్సి వుంటుంది. సభాపతి సభలో లేనప్పుడు ఉపసభాపతి సభా కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉంటారు. (చూ. రాజ్యసభ)

## సముద్రగుప్తుడు

భారతదేశాన్ని పాలించిన గుప్తరాజ వంశీయులలో ప్రముఖ చక్రవర్తి. ఈయన పరిపాలన క్రీ.శ. 330 నుండి 375 వరకు సాగింది. తండ్రి చంద్రగుప్త-1 తరువాత క్రీ.శ. 330లో పట్టాభిషిక్తుడయ్యాడు. పరాక్రమవంతుడు, శౌర్యశీలి అయిన సముద్రగుప్తుడు ఉత్తర భారతదేశాన్ని ఆక్రమించి పిదప తన దృష్టిని దక్షిణాపథం వైపు మళ్లించాడు. అప్పుడు వేంగీ దేశాన్ని హస్తివర్మ, కాంచీపురంలో విష్ణుగోపుడు పాలనలో ఉండగా (346-347) దక్షిణదేశ ధర్మ విజయాలు సాధించాడు. సముద్రగుప్తుడు అశ్వమేధ యాగం చేశాడనీ తత్సూచకంగా నాణాల్ని ముద్రించి వానిపై 'రాజాధిరాజ, అప్రతిహత యోధానుయోధ' బిరుదనామాలు చెక్కించాడనీ పండితుల అభిప్రాయం. సముద్రగుప్తుడు కళాపోషకుడుగాను, దానకళా విశారదుడుగాను అలహాబాదు శిలా శాసన పాఠాన్నిబట్టి తెలుస్తూంది. ఈతని కీర్తి ఆనాడు విదేశాలకు కూడ వ్యాపించింది. సముద్రగుప్తుని పట్టమహిషి దత్తాదేవి వలన రామగుప్త, చంద్రగుప్త అను ఇరువురు కుమారులు కలిగిరి.

## సరస్వతి

చదువులరాణి. ఈమె బ్రహ్మ మానసపుత్రిక. ఈమెను బ్రహ్మయే వివాహమాడాడు. నిత్యం ఈమె చేతిలో ధరించి ఉండే వీణకు 'కచ్ఛపి' అని పేరు. ఈమెను వాణి అని కూడా అంటారు.

సరస్వతి అనే పేరుతో భారతదేశంలో ఒక నది కూడా ఉంది, ఆ నది బ్రహ్మ సరస్సు నుంచి పుట్టిందనీ, ఏడు రూపాలు ధరించడం చేత 'సప్త సారస్వతం' అని ప్రసిద్ధి పొందిందనీ భారతంలో ఉంది. విశ్వామిత్రుడు వసిష్ఠుణ్ణి తనకు అప్పగించలేదని ఈ నది మీద కోపం వచ్చి ఆమెను 'శోణితవు (రక్తవర్ణం కలదానివి)కమ్ము' అని శపించాడని ఐతిహ్యం. సరస్వతీదేవికి ఆదిలాబాదులో దేవళం ఉంది.

## సరోజినీనాయుడు 1879–1949

ప్రముఖ కాంగ్రెసు నాయకురాలు. ఆంగ్ల కవయిత్రి. 'భారతకోకిల' బిరుదు వహించిన సరోజినీ నాయుడు 1879 ఫిబ్రవరి 13న వంగదేశంలో



జన్మించింది. తండ్రి అఘోరనాథ చటోపాధ్యాయ, తల్లి వరదసుందరీదేవి. తండ్రి హైదరాబాదు నిజాం ఆహ్వానం మేరకు నిజాం కాలేజీలో ఆచార్యుడుగా నియమింపబడడంతో సరోజినీదేవి బాల్యం హైదరాబాదులో గడిచింది. సరోజినీదేవికి ఆమె తండ్రి ఇంగ్లీషు భాషలో అక్షరాభ్యాసం చేశారు. 11వ ఏటనే ఇంగ్లీషులో ఆమె కవిత్వం వ్రాయడం ప్రారంభించింది. 12వ ఏట మెట్రిక్యులేషన్ ప్యాసైంది. చిన్నప్పుడు తరచు అనారోగ్యంతో ఆమె బాధపడుతూ ఉండేది. డాక్టర్లు ఆమెను మంచం దిగవద్దని కట్టడి చేయడంతో ఆమె మంచం మీద కూర్చుని కవిత్వం వ్రాస్తూ ఉండేది. ఆమె కవిత నాటి నిజాం ప్రభువును కూడా ఆకర్షించడంతో విదేశాలలో ఉన్నత విద్యను అభ్యసించ డానికి సంవత్సరానికి 4500 రూపాయల స్కాలర్ షిప్ ఇచ్చి ఆమెను ఇంగ్లండ్ పంపించారు. సరోజనీదేవి లండన్‌లోని కింగ్స్ కాలేజీ లోనూ, కేంబ్రిడ్జ్‌లోని గర్టన్ కాలేజ్‌లోను చదివింది. అలా చదువుతూనే కవితావ్యాసంగం మరీ కొనసాగించింది. సరోజినీదేవికి హైదరా బాదులో చీఫ్ మెడికల్ ఆఫీసర్ డాక్టరు ముత్యాల గోవిందరాజులు నాయుడుతో 1898లో కందు కూరి వీరేశలింగం ఆధ్వర్యంలో వివాహం జరిగింది. 1914లో రాయల్‌సొసైటీ ఆఫ్ లిటరేచర్‌లో సభ్యురాలుగా ఎన్నికైంది. ఈమె కవితా సంపుటాలలో 'దిగోల్డెన్ త్రెషోల్డ్, ది పాయెమ్స్ ఆఫ్ లైఫ్ అండ్ డెత్, దిబర్డ్ ఆఫ్‌ది టైమ్, ది బ్రోకెన్ వింగ్' ప్రసిద్ధిపొందాయి. సరోజినీదేవి తియ్యని కావ్యగానం దేశదేశాలకు పాకింది. దినైటింగేల్ ఆఫ్ ది ఈస్ట్'గా ఆమె కీర్తించబడింది. సరోజినీదేవి కాంగ్రెస్‌లో చేరి గాంధీజీ అడుగు జాడలలో దేశసేవ చేసింది. ఆమె చేసే రాజకీయ ప్రసంగాలు హాస్య భరితాలై ప్రజలను ఎక్కువగా ఆకర్షించేవి. ఉప్పుసత్యాగ్రహంలో(చూ.) పాల్గొన్నది. జెనీవాలో జరిగిన అంతర్జాతీయ మహిళా సభకు భారత మహిళా ప్రతినిధిగా వెళ్ళి భారతస్త్రీలకు గొప్ప కీర్తిని సంపాదించిపెట్టింది. 1934లో కారాగారవాస శిక్ష అనుభవించింది. రౌండ్ టేబిలు మహాసభలకు హాజరై స్త్రీలకు వోటింగ్ హక్కుకావాలని ఆందోళన చేసింది. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత ఆమె ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి తొలిమహిళా గవర్నర్ అయింది. 1949లో ఆమె పరమపదించింది.(చూ.భారత స్వాతంత్ర్యపోరాటం)

## సహదేవుడు

పంచ పాండవులలో ఆఖరివాడు. పాండు రాజుకు క్షేత్రజ కుమారుడు. మాద్రియందు అశ్వనీ దేవతల వలన పుట్టిన కుమారుడు (చూ. నకులుడు). ద్రౌపదియందు సహదేవునికి శ్రుతసోముడు కలిగాడు. ఈయనకు స్వయంవర లబ్ధయగు విజయ అను మరొక భార్యయందు సుహోత్రుడు అనే కుమారుడు కలిగాడు.

## సహాయ నిరాకరణోద్యమం

ఆంగ్లసేనాని డయ్యర్‌వల్ల1919లో జలియన్ వాలాబాగ్‌లో జరిగిన దురంతం విషయంలో బ్రిటిష్ పాలకులు అతని మీద ఎలాంటి చర్య తీసికోడానికి పూనుకోలేదు. దానికి తోడు డయ్యర్ ప్రవర్తనలో దోషం లేదని వారు తేల్చడంతో జాతీయ నాయకులు దిగ్భ్రాంతులయ్యారు. గాంధీజీ చాల మథన పడ్డారు. ఫలితంగా అహింసాయుత సహాయ నిరాకరణోద్యమానికి 1920 ఆగస్టులో పిలుపు నిచ్చారు. ఈ ఉద్యమం మూడు విధాలుగా సాగింది. అందులో ప్రభుత్వ సంస్థల బహిష్కరణ, ఉపాధ్యాయులు, విద్యార్థులు ప్రభుత్వ పాఠశాలలు వదలి బయటికి రావడం వంటి చర్యలు

చేశారు. విద్యకోసం కొన్నాళ్లువేచి ఉండవచ్చు కాని, స్వరాజ్యం కోసం మనం వేచి ఉండజాలమని చిత్త రంజనదాసు (చూ.) ఎలుగెత్తి చాటాడు. నాయకుల పిలుపుతో ఉత్తేజితులై వేలాది విద్యార్థులు ప్రభుత్వ విద్యాలయాలను బహిష్కరించారు.దేశ వ్యాప్తంగా వాటి స్థానే జాతీయ కళాశాలలు, విద్యాపీఠాలు నెలకొన్నాయి. బందరులో అవతరించిన జాతీయ కళాశాల అటువంటిదే! బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన గౌరవ పురస్కారాలను బిరుదులను కొందరు తిప్పికొట్టగా, మరికొందరు ప్రభుత్వ ఉద్యోగాలకే రాజీనామా ఇచ్చారు. వివిధ వృత్తులవారు ఐక్యకంఠంతో ఈ ఉద్యమాలలో పాల్గొన్నారు. అప్పుడే ఐ.సి.ఎస్.లో చేరిన సుభాష్ చంద్రబోస్ ఆ ఉన్నతోద్యోగాన్ని త్యజించి ఉద్యమంలో దూకేరు. బాగా ఆర్జిస్తున్న న్యాయవాదులు చాల మంది తమ న్యాయవాద వృత్తికి స్వస్తిపలికి ఉద్యమంలో పాల్గొన్నారు. అట్టివారిలో రాజాజీ, ప్రకాశం, పటేలు సోదరులు, రంగస్వామి అయ్యంగారు, బాబూ రాజేంద్రప్రసాద్,చిత్త రంజన్‌దాసు, మోతీలాల్ నెహ్రూ ప్రభృతులు ప్రధానులు. ప్రభుత్వపు కౌన్సిళ్లను కాంగ్రెసు శాసన సభ్యులు బహిష్కరించారు. మద్యపానానికి వ్యతిరేకంగా సంఘ సేవకులు కల్లుసారాయి దుకాణాల వద్ద పికెటింగు జరిపారు. ఫలితంగా ప్రభుత్వపు రాబడి కుంటుపడింది. సహాయ నిరాకరణోద్యమం ఆ విధంగా బ్రిటిష్‌వారిని ఆలోచనలో పడేట్టు చేసింది. (చూ. భారత స్వాతంత్ర్యపోరాటం.)

## సాంచీ

ప్రాచీన బౌద్ధమత కేంద్రం. నేటి భోపాల్ పట్టణ సమీపంలో ఉన్న సాంచీ ఒకప్పుడు బౌద్ధులకు విహార




స్థలంగా ఉండేది. ఇక్కడ ఒక ఎత్తయిన వేదిక మీద అర్ధగోళాకారంగా ఒక పెద్ద స్తూపం ఉంది. ద్వారాలు చాలా పెద్దవిగా ఉండడమే కాక వాటి మీద జాతక కథలలోని కథా ఘట్టాలు చెక్కబడి ఉన్నాయి. మూడో స్తూపం అడుగున బుద్ధుని ఇద్దరు శిష్యుల ధాతువులు భద్రపరచబడ్డాయి.

## సాతవాహనులు

ఆంధ్రుడగు సిముకుడు క్రీ.పూ. 270 ప్రాంతంలో ధాన్యకటకమును రాజధానిగా రాజ్యస్థాపన చేయుటతో సాతవాహన రాజవంశపాలన ప్రారంభమయినట్లు చారిత్రకుల అభిప్రాయం. తరువాత రాజధాని మహారాష్ట్రలోని ప్రతిష్ఠాన (పెయిథాన్)మునకు తరలింపబడెనని చెప్పుచున్నారు. సాతకర్ణి పేరు గల ప్రభువుల పాలన తరవాత పులోమావి I & II పాలనలు పేర్కొనదగినవని అంటారు. వీరి కాలంలోనే (క్రీస్తుశక సంధి సమయంలో) ఆంధ్ర సంస్కృతి ఆగ్నేయ ఆసియా దేశాలకు సముద్ర వ్యాపారాల ద్వారా విస్తరించిందనుటకు చారిత్రక దాఖలాలు కలవు. క్రీ.పూ. మొదటి శతాబ్దిలో గౌతమీపుత్ర సాతకర్ణి ఏలిక ఔన్నత్యమునొందినదని చారిత్రకుల అభిప్రాయం. మొత్తం మీద సాతవాహనుల ఏలుబడి నాలుగు శతాబ్దాలకు పైబడి (క్రీ.పూ. 2వ శతా. నుంచి క్రీ.శ 2వ శతా)సాగినట్లుంది. సాంస్కృతిక కళలకు, చేతిపనులకు ప్రోత్సాహం లభించినట్లు పెరిప్లస్ (చూ)లోని వ్రాతలను బట్టి తెలుస్తూంది. గుంటుపల్లి, నాసిక్, కార్లే, కన్హారీ గుహాశిల్పాలు, సాంచీతూర్పు తోరణ, అజంతా, ఎల్లోరా గుహలలోని కుడ్యచిత్రాలు, శిల్పాలు, అమరావతి, భట్టిప్రోలు, నాగార్జునకొండలోని శిల్పసంపద, వాస్తు శిల్పకళలు, మహాచైత్యాల రూపురేఖలు, చెక్కడపు పనులు నాటి శిల్పుల హస్త కళాకౌశలాలను కీర్తిస్తున్నాయి. జాతక కథలు బుద్ధుని జీవిత విశేషాలు నాటి శిల్పుల బౌద్ధమతానురక్తిని తెలియజేస్తున్నాయి. గుణాఢ్యుని బృహత్కథ, హాలుని గాథాసప్తశతి, నాగార్జునుని సుహృల్లేఖ అను ఉద్గ్రంథాలు సైతం సాతవాహన కాలంలోనే వెలసి నాటి విద్వాంసుల కవితా పటిమను, మేధావైపుణ్యాన్ని వారి సౌందర్యోపాసన, రసికత మనకు తెలియజేస్తున్నాయి. చూ. శాలివాహనుడు

## సాన్‌మారినో

యూరప్‌లో ప్రాచీనమైన (క్రీ.శ. 301) స్వతంత్ర గణ రాజ్యం. అపినైన్ పర్వత శ్రేణులలో చుట్టూర ఇటలీ ఆవరించియున్న ప్రాంతం. విస్తీర్ణం: 61 చ.కి.మీ.; జనాభా: 22,830 (1988); రాజధాని: సాన్ మారినో; అధికార భాష: ఇటాలియన్; ప్రజలు క్రైస్తవులు—95 శాతం రోమన్ కేథలిక్కులు. మత విశ్వాసం లేనివారు 3 శాతం. గోధుమ, ద్రాక్ష, ఆలివ్ వంటదినుసులు. పింగాణీ, ఆహార పదార్థాలు, సిమెంటు, కాగితం, తోలు, ఉన్ని ప్రధాన పరిశ్రమలు. వినోద పర్యాటకుల్ని అధిక సంఖ్యలో ఆకర్షించి విదేశీద్రవ్యాన్ని ఆర్జిస్తూంది.

## సామవేదం

భారతీయులకు పరమ పవిత్రగ్రంథాలైన నాలుగు వేదాలలో మూడవది. మిగిలినవి ఋగ్వేదం (చూ.), యజుర్వేదం (చూ.), అధర్వణ వేదం (చూ.). సామవేదం పూర్తిగా ఛందోబద్ధమైనది. దీనిలో వచన భాగాలు లేవు. దీనిలోని మంత్రాలలో ఎక్కువగా 'సోముణ్ణి' ఉద్దేశించి చెప్పినవి. అగ్నిని, ఇంద్రుణ్ణి ఉద్దేశించినవి కూడా స్వల్పంగా ఉన్నాయి. దీనిలో ఉన్న 1549 మంత్రాలలోను 78 తప్ప తక్కినవి అన్నీ ఋగ్వేదంలో ఉన్నాయి. సామవేదంలోని మంత్రాలు గానం చేయడానికి ఉద్దేశించబడ్డాయి. సోమయాగం సందర్భంలో సామవేదాన్ని ప్రధానంగా గానం చేస్తారు.

## సావోటోమీ & ప్రిన్సిపీ

పశ్చిమ ఆఫ్రికా గినీ సింధు శాఖలోని ద్వీపరాజ్యం. ఒకప్పుడు పోర్చుగల్ అధీనంలో ఉండి 1975 లో స్వతంత్రం సంతరించుకుంది. విస్తీర్ణం: 1,001 చ.కి.మీ; జనాభా: 1,17,000(1988); రాజధాని: సావోటోమీ; అధికార భాష: పోర్చుగీసు. ప్రజలు ఆదిమ భాషలు మాట్లాడతారు. ప్రజలు రోమన్ కేథలిక్కు క్రైస్తవం పాటిస్తారు. సెవిన్త్ డే ఎడ్వంటిస్టులు ఉన్నారు. కోకో ప్రధాన వ్యవసాయోత్పత్తి. కొబ్బరి, అరటి, కర్ర పెండలం, కూరగాయలు కూడ పండిస్తారు. పశుపోషణ ఉంది. కలప దొరుకుతుంది.

## సామ్యూల్ జాన్సన్ 1709–84

ఇంగ్లీషు నిఘంటు కర్త, సాహిత్య వేత్త. ఆధునిక పద్ధతులపై నిఘంటువును నిర్మించి ఇంగ్లీషు భాషకు సేవచేసిన సుప్రసిద్ధ భాషావేత్త. ఈయన తయారుచేసిన మొదటి ఇంగ్లీషు నిఘంటువు 1755లో ప్రచురితమైంది. 'ది ఐడ్లర్' అను పత్రికను కూడ నిర్వహించేవాడు. జాన్సన్ వ్రాసిన కవుల చరిత్ర కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టింది.నాటి లండన్ సాహిత్య లోకంలో జాన్సన్ మణి పూసగా వెలిగాడు. జేమ్స్‌బాస్వెల్ అను చరిత్ర కారుడు జాన్సన్ జీవిత చరిత్రను విమర్శనాత్మకంగా చక్కగా వ్రాశాడు.



## సారంగధరుడు

రాజమహేంద్రవరం (నేటి రాజమండ్రి) రాజధానిగా ఆంధ్రదేశమును పరిపాలించిన చోళరాజు రాజరాజ నరేంద్రుని పెద్దభార్య రత్నాంగి. ఆమె కుమారుడు సారంగధరుడు. యుక్తవయస్సు రాగానే అతడికి పెళ్లి చేయాలని రాజు ఒక రాచకన్యను చూస్తాడు. ఆమె పేరు చిత్రాంగి. సొగసరి అందకత్తె. చిత్రాంగి అందచందాలు చూచి మోహ పడి రాజరాజే ఆమెను తన రెండవ భార్యగా చేసుకుంటాడు. కాని చిత్రాంగి మనస్సు అంతా సారంగధరుడి మీదనే ఉంటుంది. ఒకసారి రాజరాజు వేటకై అడవికి వెళ్లిన సమయంలో సారంగధరుడు చెలికాళ్లతో పావురాలు ఎగురవేస్తూ ఆనందిస్తూ ఉంటాడు. ఆ పావురాలలో ఒకటి చిత్రాంగి మేడమీద వాలుతుంది. చిత్రాంగి ఆ పావురాన్ని పట్టేస్తుంది.

సారంగధరుడు ఆ పావురంకోసం ఒంటరిగా చిత్రాంగి భవనంలోనికి ప్రవేశిస్తాడు. ఆమె అప్పుడు తన మనసు తెలిపి తన కోరిక తీర్చిపొమ్మని బలవంతం చేస్తుంది. అయితే గుణశీలి అయిన సారంగధరుడు ఆమె కోరికను నిరాకరించి అక్కడనుండి వెళ్లిపోతాడు. అప్పుడు చిత్రాంగి యువరాజుపై పగబట్టి రాజరాజు వేటనుంచి రాగానే, సారంగధరుడు తన భవనానికి వచ్చి తనను బలాత్కా

రించబోయాడని కక్షతో చాడీలు చెప్పి నమ్మిస్తుంది. ముసలిరాజు పడుచుపెళ్లాం మాటల్నే నమ్మి కొడుకు 'సారంగధరు'ని కాళ్లు చేతులు నరికిస్తాడు. తరువాత ఒక యోగి పుంగవుడు వచ్చి సారంగధరుడికి కాళ్లూ చేతులూ తిరిగి మొలిచేటట్టు చేసి రాజరాజుకు అసలు సంగతి తెలియజేస్తాడు. చిత్రాంగి విషం మింగి ఆత్మహత్య చేసుకుంటుంది. చిత్రాంగి మేడ, సారంగధరుడి మెట్ట శిథిలావశేషాలు ఇప్పటికీ రాజమండ్రిలో ఉన్నాయి. తెలుగులో 'సారంగధర' ఒక ప్రసిద్ధ నాటకం.

## సారనాథ్

కాశికి 8 కి.మీ దూరంలో ఉన్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం. ప్రపంచంలోని బౌద్ధులందరికీ ఇది ప్రధాన పుణ్యక్షేత్రం. దీనిని 'హరిణం' అని కూడా అంటారు. క్రీ.పూ. 522 ప్రాంతంలో ఆషాడ శుద్ధపూర్ణమి నాటి సాయం సమయాన బుద్ధుడు ఇక్కడ తన మొట్టమొదటి మతబోధనా ప్రసంగం చేశాడు. ఆనాటి నుంచి ఇది బౌద్ధులకు ప్రధావ యాత్రాస్థలమైంది.అశోకచక్రవర్తి తన గురువైన బౌద్ధ బిక్షువు గౌరవార్థం ఒక స్తూపాన్ని, ఒక స్తంభాన్ని ఇక్కడ కట్టించాడు ఆ స్తంభం మీద మూడు సింహాలముద్రే నేటి భారతప్రభుత్వ జాతీయ చిహ్నం (చూ.)గా గ్రహించబడింది. బ్రాహ్మిలిపిలో అశోకుడి శాసనం కూడా ఆ స్తంభంమీద ఉంది. ఈ స్థలాన్ని గురించిన విశేషాలు సారనాథలోని పురాతన వస్తు ప్రదర్శనశాలలో చూడవచ్చును. క్రీ.శ 1794లో రాజాచైత్ సింగ్ దివాన్ అయిన జగత్‌సింగ్ అశోకుడు నిర్మించిన స్తూపాన్ని పడగొట్టగా అక్కడ కొన్ని పాలరాతి పాత్రలు బయట పడ్డాయి. ఆ పాత్రలలో మానవుని శల్యాలు, ముత్యాలు, బంగారు ఆకులు కనిపించాయి. అది మొదలు ఈ ప్రదేశం త్రవ్వకాలు చేయగా క్రమంగా సారనాథ్ బయటపడింది.

## సాలార్‌జంగ్ మ్యూజియం

నైజాం ఆస్థానంలో ప్రధాన మంత్రిగా పనిచేసిన సాలార్‌జంగ్ (1889–1949) ఒక కళాపిపాసి. ఆయన వ్యక్తిగతంగా సేకరించిన అపూర్వ వస్తు సామగ్రినంతటివి నేడు ఆయన పేరున హైదరాబాదులో వెలసిన మ్యూజియంలో భద్రపరచారు. భారతదేశంలో ఈ మ్యూజియానికి ఒక విశిష్ట స్థానం ఉంది. ఇది 1949 నుండి భారత ప్రభుత్వ ఆధ్వర్యవంలో నిర్వహింపబడు తూంది. ఇందు పిల్లలకై ప్రత్యేకంగా ఒకవిభాగం ఉంది. అందులో బొమ్మరిల్లు, ఆటసామగ్రి వంటి అనేక వస్తువులను ప్రదర్శించారు. పాశ్చాత్యవిభాగంలో ప్రదర్శించిన మేలి ముసుగులో రెబెక్కా వనిత, ముందు నుంచి 'మెఫిస్టోఫిలీస్' పృష్ఠభాగాన 'మార్గరెట్టా' మలచిన దారుశిల్పం అందరినీ ఆకట్టుకుంటాయి. పింగాణీ సామగ్రి రకాలు ఉన్నాయి. జేడ్ మందిరంలో రవ్వలు పొదిగిన


మేలిముసుగులో రెబెక్కా వనిత

నూర్జహాన్ చాకు, ఔరంగజేబు ఖడ్గం, మరకతాలు పొదిగిన షాజహాన్ కాటార్, నవరత్నాలు పొదిగిన జహంగీర్ వేటకత్తి, తానీషా ఖడ్గం చూడవచ్చును.

భారతదేశంలోని జవుళీ, దక్కన్ మస్లిన్, మొగల్ తెరలు, పర్షియన్ తివాచీలు వంటివి ప్రత్యేక గ్యాలరీలలో ప్రదర్శింపబడ్డాయి. చిత్రాలుగల లిఖిత గ్రంథాలు, జహంగీర్, షాజహాన్, ఔరంగజేబు ప్రభువుల చేవ్రాతలు ప్రదర్శింపబడ్డాయి.

## సావర్కార్ వి.డి. 1883–1966

పూర్తిపేరు వినాయక దామోదర్ సావర్కార్. ఏ మార్గాన్ని అనుసరించి అయినా సరే దేశానికి పూర్తి స్వాతంత్ర్యం కావాలనీ, హిందువులంతా ఒకటే జాతి, హిందూ రాష్ట్రంలోగల ప్రజలకు ఒకేభాష, చరిత్ర, సంస్కృతి, దేశం ఉండాలని ఎలుగెత్తి చాటిన వీరుడు సావర్కార్. 'హిందూత్వం', 'అఖండ్ భారత్' ఆయన నినాదాలు. 1883 మే 28న మహారాష్ట్రలోని నాసిక్ సమీపానగల భాగోరులో సనాతన బ్రాహ్మణ కుటుంబంలో సావర్కార్ జన్మించాడు. తన పదవ ఏటనుండే సాహస చర్యలు చేస్తూ స్నేహితులను కూడగట్టుకొని 'మిత్రమేళ' ప్రారంభించాడు. ఇది తర్వాత రహస్య సంస్థగా మారి వారి

కార్యకలాపాలకు నిలయమైంది. కుర్రవాళ్ళకు శిక్షణ ఇచ్చి కసరత్తు నేర్పి వీరులుగా తయారుచేసి పోరాటాలకు సిద్ధం చేయడం సావర్కార్ ఆశయం. చిన్నతనం నుండే



సుశిక్షితుడైన కార్యకర్తగా, నాయకుడుగా, ఉగ్రవాదిగా, రచయితగా, వక్తగా రూపొం దాడు. విదేశీ వస్త్రదహన కాండలో ప్రధాన పాత్ర వహించాడు. ఆయన వ్రాసిన 'తాభాజీ'బాజీప్రభుగేయా లు నిషేధింపబడ్డాయి.

1960లో సావర్కార్ లండన్‌కి వెళ్ళి అక్కడ 'ఫ్రీ ఇండియా సొసైటీ' పెట్టి విప్లవకారుల్ని తయారుచేస్తూ, ప్రచారం చేస్తూ, గందరగోళం సృష్టించడమేకాక బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికై మారణాయుధాలు, మందుగుండు సామగ్రి, ఉత్తేజపరిచే గ్రంథాలను ఇండి యాకు పంపిస్తుండేవాడు. సావర్కార్, ఆయన సంఘం కార్యకలాపాలను కనిపెట్టి 1910 మార్చి 13న బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి జన్మాంతర శిక్ష విధించి భారతదేశమునకు పంపుతూ ఉండగా త్రోవలో ఈయన ఓడ కిటికీగుండా సముద్రంలోకి దూకి ఇంగ్లీషు ఛానల్ అంతా ఈది ఫ్రాన్స్‌గడ్డ చేరాడు. కాని, బ్రిటిషువారు అంతర్జాతీయ న్యాయసూత్ర విరుద్ధముగ నిర్బంధించి విచారణ జరిపి అండమాన్ దీవులకు పంపించారు. 1923లో విడుదలైనాడు. తిరిగి 1934లో రెండు వారాల పాటు అరెస్టయ్యాడు. 1939లో హిందూ మహాసభ అధ్యక్షులైనారు. 1942లో అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. గాంధీ హత్య జరిగినపుడు (1948) ఆయనకు ప్రమేయం ఉందని అరెస్టు చేశారు. సంబంధంలేదని తేలిన తరువాత నిర్దోషి అని విడుదల చేసేశారు. మరాఠీ భాషలో 'ప్రథమ భారతీయ స్వాతంత్ర్య యుద్ధం' అను గ్రంథాన్ని వ్రాసి చరిత్ర కారుడయ్యాడు. కవిగా, వక్తగా కూడా ప్రసిద్ధుడయ్యాడు. నిప్పులుచెరిగి నట్లు ఉపన్యసించగల అసాధారణ వక్త. అండమాన్ సెల్యులర్ జైలులో ఉండగా జైలు అధికారులు వ్రాత పరికరాలు ఇవ్వ నిరాకరించారు. అప్పుడు సావర్కార్ ముల్లుతో గోడలపై 'పానిపట్టు యుద్ధం'ను పదివేల పద్యాలుగల పద్యకవితను వ్రాసి కంఠస్థం చేశాడు.

## సింగపూరు

ఆగ్నేయ ఆసియాలోని చిన్న ద్వీపరాజ్యం. చుట్టూతావున్న 54 చిన్న దీవులు ఇందులోని భాగాలే జనసందడి ఎక్కువగా గల ప్రాంతం. 1965లో స్వాతంత్ర్యం సంతరించుకుంది. చీనా వారు ఎక్కువ. నాల్గింట మూడు వంతులువారే. సింగపూరులోని చీనావారు వ్యాపార దక్షత గలవారని ప్రసిద్ధి చెందారు. వర్తక వ్యాపారాలన్నీ వారి చేతుల మీదుగనే జరుగుతాయి.

విస్తీర్ణం: 622 చ.కి.మీ; జనాభా: 26,41,000 (1988); రాజధాని: సింగపూరు సిటీ; అధికార భాషలు: మలే, చైనీసు, తమిళం, ఇంగ్లీషు. ప్రజలు బౌద్ధం (27 శాతం), ఇస్లాం (16 శాతం), క్రైస్తవం (10 శాతం), టావో (29 శాతం), హిందూ (4 శాతం) మతాలు పాటిస్తారు. ఆగ్నేయ ఆసియాలోని దేశాలన్నిటికి వాణిజ్య కేంద్రం. తటాకాలు, చెరువులు, చిన్న సరస్సులు ప్రధాన జలాధారాలు, కొబ్బరి తోటలు, పండ్ల తోటలు; రబ్బరు, పొగాకు, కాయగూరలు పండిస్తారు. వరివంటి ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకుంటారు. మత్స్య పరిశ్రమకు కేంద్రం. ఎలక్ట్రానిక్ పరికరాలు, రవాణా వాహనాలు, ఔషధాలు, రసాయనిక ద్రవ్యాలు, యంత్రపు సామగ్రి, ప్రధాన పరిశ్రమలు. కొబ్బరి ఉత్పత్తులు, రబ్బరు సామగ్రి, సుగంధ ద్రవ్యాలను శుద్ధిచేయుట, కలప సామగ్రి, తగరపు సామగ్రి, దుస్తులు తయారీ ప్రధాన పరిశ్రమలు. రబ్బరు, తగరం ప్రముఖమయిన ఎగుమతులు. అంత ర్జాతీయ వాణిజ్యంలో ప్రముఖ స్థానం వహించుట వలన నౌకా పరిశ్రమ, మరమ్మతులు ఎక్కువ. ఏడాదికి సుమారు 40,000 చిన్న పెద్ద నౌకలు సింగపూరు హార్బర్‌కు వస్తూపోతూ ఉంటాయి. ఈ హార్బరు చక్కటి సహజ వనరులతో ఏర్పడిన నౌకాశ్రయం. అందుచేత నౌకా వ్యాపారానికి అత్యంత అనువుగా ఉంది.

## సింగిరెడ్డి నారాయణ రెడ్డి

'జ్ఞానపీఠ' (చూ.) పురస్కార గ్రహీత. ప్రముఖ కవి. జనరంజక సినిమా గేయ రచయిత. ఈయన

1931 నవంబరు 15న కరీంనగరం జిల్లాలోని హనుమాజీపేటలో జన్మించారు. ఉస్మానియా యూనివర్శిటీలో విద్యనభ్యసించి 'ఆధునికాంధ్ర కవిత్వతత్త్వం'పై పరిశోధనలు జరిపి సిద్ధాంత వ్యాసం (థీసిస్) వ్రాయగా డాక్టరేట్ ( పి.ఎచ్.డి. ) లభించింది. ఆయన రచించిన 'నవ్వనిపువ్వు'(1954)'అజంతా సుందరి', 'కర్పూర వసంత రాయలు', 'నాగార్జున సాగరము', 'రామప్ప'



వంటి సంగీత రూపకాలు 'దివ్వెల మువ్వలు' 'విశ్వనాథుడు' వంటి పద్యకావ్యాలు సాహిత్య విమర్శకుల ప్రశంసల నందుకున్నాయి. ఈయన చలనచిత్ర రంగంలో 3,000 పైగా పాటలు వ్రాసి సుప్రసిద్ధ గేయరచయిత(సినారె)గాపేరుపొందాడు. ఈయనకృతి'విశ్వంభర' (1981) మహాకావ్యంగా ఎంపికచేసి 'జ్ఞానపీఠ' పురస్కారం (1989) ప్రదానం చేశారు. ఉస్మానియా యూనివర్శిటీలో 1982 వరకు తెలుగు పీఠాధ్యక్షులై అధికార భాషాసంఘ (1982–85) అధ్యక్షులైనారు. తరువాత ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్శిటీ (1986–89)ఉపాధ్యక్షులైనారు. 1989 నుండి తెలుగు యూనివర్శిటీ ఉపాధ్యక్షులుగా కొనసాగుతున్నారు. ఈయన ప్రతిష్ఠాత్మకమైన సోవియెట్ లాండ్–నెహ్రూ అవార్డు, ఆసాన్ అవార్డు వంటి ఇంకా చాల పురస్కారాలు అందుకుని తెలుగు భాషా సారస్వాతాలకు వన్నె తెచ్చి కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించారు. ఈయన స్వగ్రామం హనుమాజీపేటను ఇటీవల (1990) ఆ గ్రామవాసులు 'నారాయణరెడ్డి పేట' అని నామకరణం చేశారు.

## సింధు నది

భారత ఉపఖండంలో ప్రసిద్ధమయిన హిమ నది. ఇది హిమాలయాలలో టిబెట్టు (చీనా)లో పుట్టి కాశ్మీర్, పంజాబు, సింద్ రాష్ట్రాలలో ప్రవహించి పాకిస్తాన్‌లో కరాచీ సమీపంలో (అరేబియా సముద్రం)లో సాగరసంగమమవుతుంది. సింధు నది దీని ఉపనదులు జీలం, చీనాబ్, రావీ, బియాస్, సట్లైజ్ ప్రవహించే ప్రాంతం అంతా అతి సారవంతమయిన నేల. ఈ నదుల మీద పాకిస్తాన్ ప్రభుత్వం మంగళా డాము, సుక్కూలారు బరాజు. భారతదేశంలో పంజాబులో సట్లైజ్ నది మీద భాక్రా–నంగల్ డాము భారీ డాములు, ఆనకట్టలు కట్టి సాగునేలకు పంటనీటిని అందించి గోధుమ, వరి, చెరకు విరివిగా పండించుటయే గాక జలవిద్యుత్తును ఉత్పత్తి చేసి పరిశ్రమలకు సరఫరా చేస్తున్నారు. సింధునది పొడవు 2880 కి.మీ. హరప్పా, మొహంజోదారో ప్రాంతాల్లో ఈ సింధునదీ లోయలో సుమారు 5000 ఏళ్ల ఉజ్జ్వల నాగరకత వెలసివర్ధిల్లింది. (చూ. సింధునాగరకత).

## సింధునాగరకత

భారత ఉపఖండంలో ప్రాచీనకాలంలో (క్రీ.పూ. 3000–క్రీ.పూ 1500) ప్రశస్తమైన నగర సంస్కృతి వర్ధిల్లింది. ఇది ఈజిప్టు, సుమేరియన్, మెసపోటేమీయాల వంటి ప్రాచీన సంస్కృతుల కోవకు చెందుతుందనీ అంత ప్రాచీనత దీనికీ ఉందని చరిత్ర పరిశోధకుల అభిప్రాయం. 1922లో మార్టిమర్ వీలర్ వంటి పురాతత్త్వ వేత్తల ఆధ్వర్యవంలో మొహంజోదారో, హరప్పా ప్రాంతాలలో త్రవ్వకాలు జరుగగా సంస్కృతి అవశేషాలు బయటపడ్డాయి. ఆ తరువాత కాలీబంగన్, రూపార్, లోతాల్, అలంగీర్‌పూర్, రామగిరి మొదలగు ప్రాంతాలలో సైతం నాటి నాగరకతావశేషాలు కొల్లలుగా బయటపడ్డాయి. ఈ నాగరకత ప్రముఖంగా సింధు నదీలోయ (నేటి పాకిస్తాన్)లో కేంద్రీకృతమయి గంగా, యమునా నదుల వైపుకు రాజస్తాన్, గుజరాత్ రాష్ట్రాల వైపుకు విస్తరించింది. సింధునాగరకత కాలంలో ప్రదర్శించిన నగర నిర్మాణ కౌశలం హరప్పా, మొహెంజదారో (పాకిస్తాన్–పంజాబ్)లలో కొట్టవచ్చినట్లు కనబడుతుంది. నగర నిర్మాణం తీర్చిదిద్దినట్లుంటుంది. కాలిన ఇటుకలతోనూ, కలపతోనూ రెండు, మూడు అంతస్తుల మేడలు



కూడా ఇందులో కానవస్తాయి. భూగర్భంలో మురుగు కాలువలు నిర్మించి చక్కటి మురుగు నీటి సౌకర్యాలు సమకూర్చుకున్నట్లు త్రవ్వకాలను బట్టి తెలుస్తూంది. రాగి పాత్రల వాడుక, మట్టి పాత్రలపై చిత్రాలంకరణ, స్త్రీ పురుషుల వేషభూషణాదులలో అంతరీయం, ఉత్తరీయం, నడికట్టు, తలపాగ ధరించినట్లు దాఖలాలు బయట పడ్డాయి. స్త్రీలు జడలు వేసుకొనుటయేగాక కొప్పు ముడివేసి అలంకరించుకొనుట కన్పిస్తూంది. మగవారు జుట్టు, మీసం తీసివేసి గడ్డం పెంచేవారు. సింధు సంస్కృతిలో మరో విశేషం. పడవలు నిర్మించి నాటి మెసపొటేమియా వంటి సుదూర ప్రాంతాలతో వర్తక వాణిజ్యాలు నెరపేవారని తెలుస్తూంది. ఉత్తరప్రదేశ్‌లోని గంగా మైదానంలోనూ, మధ్య భారతదేశంలోని చంబల్, నర్మదా, తపతీలోయలలో నాసా, నవదతోళీ, కాళీ భంగన్, రూపార్, లోతాల్, రామగిరి, అలంగీర్ (మీరట్) మున్నగు పెక్కు తావులలో జరిపిన త్రవ్వకాలలో (1958) హరప్పా సంస్కృతి బయట పడింది. మొహెంజొదారోలో చిత్రలిపి బిళ్లలు దొరికాయి.




సింధు నాగరకతావశేషాలు

ఈ లిపిని చదివి అందలి అర్థాన్ని తెలుసుకొనుట పండితులకే దుస్సాధ్యంగా ఉంది. రాగిని విరివిగా వాడుక చేసేవారనీ, ఇనుమును వాడే విధానం సింధు ప్రజకు తెలియకపోయివుండ వచ్చునని పురాతత్త్వ పండితుల అభిప్రాయం. ద్రావిడులకు ఈ నాగరకతతో సంబంధం ఉన్నట్లు తెలుస్తూంది.

అయినా సింధు నాగరకత వర్ధిల్లిన నగర నిర్మాణ విధానం సమకాలీన ఇతర నాగరకతల (సుమేరు, మెసపొటేమియా) కంటే మిన్న అనడంలో సందేహం లేదు. త్రవ్వకాలలో లభించిన అనేక గృహోపకరణాలు, ఆటవస్తువులు, వేషభూషణాదులు, శిల్పావశేషాలు వంటి వస్తు శిథిలావశేషాలు నాటి సింధు ప్రజల జీవనశైలి సౌందర్యోపాసన భోగలాలసత జీవన ప్రమాణాస్థాయి తెలియచేస్తున్నాయి. శౌచవిధియందు వారికి గల అత్యంతాసక్తి, పట్టణ నిర్మాణ రీతి, గృహనిర్మాణ పద్ధతి, పురజనులకు సమకూర్చబడిన సదుపాయాలూ మొహెంజొదారో శిథిలాలలో స్పష్టంగా తెలుస్తూంది.

## సింహాచలం

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రముఖ పుణ్యక్షేత్రాలలో ఒకటి. విశాఖపట్నానికి సమీపంలో ఉంది. ఇక్కడ పర్వతంమీద వరాహలక్ష్మీనృసింహ స్వామి ఆలయం వుంది. కొండ ఎక్కేందుకు మెట్లదారి ఉంది. ఈ పర్వతం సుమారు 255 మీ. ఎత్తు ఉంది. పర్వతం ఎక్కుతుంటే క్రమంగా గంగాధర, గోదావరి ధార, కూర్మధార, మాధవధార, ఆకాశధార మొదలైన ధారలు కనిపిస్తాయి. ఈ జలధారలు లెక్కడనుంచి వస్తున్నది తెలియదు. స్నానానికి అనుకూలంగా ఉంటాయి. వైశాఖ శుద్ధ తదియనాడు స్వామి నిజస్వరూప దర్శనం. మిగిలిన రోజులలో స్వామికి దేహమంతా చందనం పూసి వుంటుంది. ఆ విధంగా ఏడాది పొడుగునా పూసిన చందనాన్ని నిజస్వరూప దర్శనం రోజున వలిచి వేస్తారు. అందుకే ఆ పండుగను 'చందనపు కొలువు' అనికూడా అంటారు. పూర్వం హిరణ్య కశ్యపుణ్ణి చంపిన తరువాత ప్రహ్లాదునిచేత ఈ స్వామి ఇక్కడ ప్రతిష్ఠినబడినట్లు చెబుతారు. ఇక్కడ ప్రధాన దైవం విష్ణువు. ఈ క్షేత్రాన్ని పాలించే క్షేత్రపాలకుడు ఈశ్వరుడు.

## సిక్కిం

భారతదేశంలో 25 రాష్ట్రాలలో ఒకటి. హిమాలయా పర్వతాల మధ్య ఇరుక్కుని యున్న కొండ ప్రాంతం. ఉత్తరాన టిబెట్టు, పశ్చిమాన నేపాల్, తూర్పున భూటాన్, దక్షిణాన పశ్చిమ బెంగాలు సరిహద్దులుగా ఉన్నాయి. భారతదేశంలోని రాష్ట్రాల్లో అతి తక్కువ జనాభాగల రాష్ట్రం సిక్కిం. పూర్వంరాజవంశీయులు



పాలిస్తూ భారతదేశ రక్షణలో ఉన్న సిక్కిమ్ 1975 పార్లమెంటు చట్ట ప్రకారం ఇండియాలో ఒకరాష్ట్రంగా విలీనమయింది. ప్రపంచ పర్వత శిఖరాల్లో మూడవ స్థానంగల కాంచన గంగా (8579మీ) సిక్కిమ్‌లోనే ఉంది. ఇచ్చటి ఇతర పర్వత శిఖరాల సగటు ఎత్తు 7000 మీ. విస్తీర్ణం: 7,096 చ.కి.మీ.; జనాభా: 3,16, 385 (1981); రాజధాని: గాంగ్‌టక్; అధికార భాషలు: లెప్చా, భూటియా, హిందీ, నేపాలీ, లింబూ. ప్రజలు ఇంగ్లీషు కూడా మాట్లాడతారు, ప్రజలు లెప్చాజాతికి చెందినవారు. వీరు అస్సాం నుండి వచ్చినట్లు చెప్తుతారు. భూటియన్‌లు టిబెట్టు నుండి వచ్చారు. పర్వత సానువు నుండి టిస్టానదిలోనికి ప్రవహించే ఏరులు, వాగులు వలన లోయ ఏర్పడి వ్యవసాయ యోగ్యమయింది. గోధుమ, బార్లీ, వరి, మొక్కజొన్న, ఏలకులు, నారింజ పండ్లు, బంగాళ దుంప, ఆపిలు వ్యవసాయోత్పత్తులు. వందల కొద్దీ రకాల ఆర్కిడ్ పుష్పజాతులు సిక్కిమ్‌లో కానవస్తాయి. వృక్ష విజ్ఞానులను ఆకర్షిస్తూ ఉంటుంది. సిక్కిమ్‌లో ఇప్పుడు చేతి గడియారాలు తయారవుతున్నాయి. సిక్కిమ్‌లో ఖనిజ నిక్షేపాలలో రాగి, సీసం, జింకు పేర్కొనదగినవి. వినోద యాత్రికులకు కావల్సిన సదుపాయాలు చేశారు.

## సిక్కుమతం

భారతదేశంలో గురునానక్ (1469–1539) వ్యవస్థాపించిన మతం. 'సిక్కు' అను మాట 'శిష్య'అను సంస్కృత పదం నుండి వచ్చినది. ''హిందువుడూ లేడు , మహమ్మదీయుడూ లేడు మానవులందరూ సమానులే! దైవ దృష్టిలో అంతా సోదరులే'' అని గురునానక్ సందేశం. హిందూ–ముస్లిం మతాల సామరస్యం కోసం నానక్ కృషిచేశాడు. హిందువులకు భగవంతుని అవతారా లయందున్న విశ్వాసాన్ని మహమ్మద్ యొక్క భగవదౌ న్నత్యాన్ని జోడించి ఇరుమతాలవారికీ ప్రీతి పాత్రుడై ఎందరో శిష్యుల (సిక్కుల)ను ఆకర్షించారు. నానక్ తరవాత ఆయన శిష్యుడు అంగదుడు (1540–1550) 2వ గురువు అయ్యాడు. ఈ గురుపరంపరలో తరవాతివారు అమరదాసు, రామదాసు (1574–15 81), అర్జునుడు (1581–1606), హరిగోవిందుడు, (1606–1645), హరిరాయడు (1645–1661), తేజ బహదూర్. వీరిలో అమరదాసు సతీసహగమనాన్ని ప్రతిఘటించాడు. ఆంతరంగిక సంస్కారం అవసరమని పాటలు అల్లాడు. 10వ గురువు కట్టకడపటివాడు గురు గోవింద్‌సింగ్ (1606–1708). నానక్ కాలమున సంపూర్ణ శాంతి మార్గాన్ని అనుసరించిన సిక్కుమతం గురుగోవిందుని హయాములో యుద్ధ పద్ధతికి మారింది. సిక్కులను సువ్యవస్థీకరించి ధర్మ రక్షణకై యోధ వర్గాన్ని రూపొందించిన ఖ్యాతి గురుగోవిందునకు దక్కినది. ఒక స్నాతక కర్మ జరపడం ద్వారా గురుగోవిందుడు ఈ మార్పు తెచ్చాడు. ఈ కర్మను అనుసరించి ఒక ఇనుప పాత్రలో నీరుపోసి రెండంచుల కత్తితో కలుపుదురు. అమృత తుల్యమైన ఈ జలాన్ని సిక్కుమతాన్ని అవలంబించే స్నాతకులపై చల్లుతారు. స్నాతక శుద్ధి పొందిన తోడనే తమ పేరు చివర 'సింగ్' పదాన్ని జోడిస్తారు. ఈ విధంగా సిక్కు ధర్మమును అవలంబించిన వారికే 'ఖల్సా' (శుద్ధ)సంప్రదాయానుయా లనిపేరు కలిగింది. సిక్కు దీక్షావలంబకులు 'క' పంచకాన్ని పాటిస్తారు. అంటే 1. కేశ్ (శిరం నిండ కత్తిరింపని కేశాలు) 2. కంఘా జుట్టుకు పెట్టుకునే దువ్వెన3. కృపాణ్ (ఖడ్గం), 4. కచ్చా(లంగోటీ), 5. కర (ముంజేతికి ఇనుప మురుగు) ధరించాలనే నియమం ఏర్పడింది. 5వ గురువు అర్జునుని కాలమున నానక్ మొదలగు ఇతర సిక్కు గురువుల పాటలు, కీర్తనలు (1604) సంకలితమైన ఆదిగ్రంథం (చూ. గ్రంథ సాహెబ్) సిక్కుల పవిత్ర గ్రంథం. హిందీ, హిందూస్తానీ గురుముఖి భాషలలో కీర్తనలు, భక్తికి సంబంధించి పద్యాలు, పాటలు ఇందులో ఉంటాయి.

నాలుగవ గురువు రామదాసు అక్బర్ చక్రవర్తి వద్ద సంపాదించిన అమృతసరము (అమరత్వాన్ని ఒసగే సరస్సు)లోని ద్వీపంపై నిర్మించిన స్వర్ణ దేవాలయం—అఖాలీతక్త్' సిక్కులకు పవిత్ర పుణ్యక్షేత్రం (చూ. అమృత్‌సర్). ఈ సిక్కుదేవాలయ నిర్మాణం అర్జునుడు (1581–1606) కాలంలో పూర్తి అయింది. సిక్కుల భాష పంజాబీని (చూ. జాతీయ భాషలు) గురుముఖి లిపిలో వ్రాస్తారు. సిక్కు ప్రార్థనాలయాలను 'గురుద్వార్' అని అంటారు. ఇంకను సిక్కుమతమును గూర్చి అమృత్‌సర్,గురు గోవింద సింగ్, గురునానక్, గ్రంథసాహెబ్ అకారాది శీర్షికలలో విపులంగా ప్రస్తావించడమైనది.

## సిద్ధేంద్రయోగి

క్రీ.శ. 15వ శతా.

కూచిపూడి నృత్యగురు పరంపరలో ప్రథముడు (చూ. కూచిపూడి నాట్యం). 15వ శతాబ్ది ప్రాంతంలో జన్మించిన సిద్ధప్ప అనాథ. నిరాశ్రయుడు. ఉడిపి ఆనందతీర్థులు శ్రీకాకుళంలో నెలకొల్పిన మఠంలో ఉంటుండేవాడు. ఒకనాటి రాత్రి సిద్ధప్ప కృష్ణా అని ఎలుగెత్తి పిలుస్తూ నృత్యం చేయడం ఆ మఠాధిపతి చూసి



అతనిలో దాగి ఉన్న ప్రతిభను వెలికితీయడానికై విద్యా సముపార్జన కోసం ఉడిపికి అతన్ని పంపించగా కఠోరమైన ఆశ్రమ నియమాలను పాటిస్తూ చదువు కొనసాగించి సంస్కృతంలోను నృత్యంలోను సంగీతంలోను వేదవేదాంగాలలోను నిష్ణాతుడై స్వస్థలానికి తిరిగివచ్చాడు. కూచిపూడి గ్రామంలో బ్రాహ్మణ బాలకుల్ని ఎన్నుకొని వారికి సంస్కృతం, వేదం, సంగీతం, నృత్యం నేర్పించేవాడు. కూచిపూడి గ్రామంలో సిద్ధేంద్రయోగి పైగల భక్తి ప్రపత్తులకు తార్కాణంగా 'సిద్ధేంద్ర కళాక్షేత్రం అనే నృత్య కళాశాలను 1963లో స్థాపించారు. నాట్యశాలతోను విద్యార్థులవసతి గృహంతోను ఆ కళాశాల వర్ధిల్లుతూంది. సిద్ధేంద్రయోగి 'శ్రీ కృష్ణ పారిజాతం 'గొల్లకలాపం' అనే రెండు నృత్య నాటికలను రచించారు. ఆ గొల్ల కలాపమే నేడు 'భామాకలాపం' గా ప్రసిద్ధికెక్కింది.

## సిపాయిల తిరుగుబాటు

చూ. భారత స్వాతంత్ర్య పోరాటం

## సియెర్రా లియోనీ

పశ్చిమ ఆఫ్రికాలో గినీ, నైజీరియా దేశాలమధ్యనున్న ఏక పక్ష గణ రాజ్యం. ఒకప్పుడు బ్రిటిషు వలస రాజ్యంగా ఉండి 1961లో స్వాతంత్ర్యం పొందింది. సియెర్రా లియోనీ అంటే 'కొండ సింహం'అని అర్థం వచ్చేటట్టుగా నాటి పోర్చుగీసు నావికులు పెట్టిన పేరు, మేఘ ఘర్జనలు, సింహగర్జనలు వినపడేవి. అందుచేత ఆ పేరు పెట్టారు.

విస్తీర్ణం. 71,740 చ.కి.మీ.; జనాభా: 38,83,000 (1988); రాజాధాని. ఫ్రీటౌన్; అధికార భాష: ఇంగ్లీషు; ప్రజలలో నీగ్రో జాతికి చెందిన మెండే తెగ 34 శాతం, తెమ్నే తెగ 31 శాతం, లింబా 8 శాతం, ఇంకా కోనూ, బుల్లోమ్, ఫులానీ, కోరంకో, యాలుంకా, కీస్సీ తెగల వారున్నారు. బానిసత్వం నుండి విముక్తి పొందిన క్రియోలీ అనుబడు వారు కూడా ఉన్నారు. ఆదిమ మత విశ్వాసాల్ని పాటించేవారు 52 శాతం, సున్నీ ముస్లిములు 39 శాతం ఉన్నారు. మిగతావారు క్రైస్తవులు.

వరి, జొన్న, కర్రపెండలం, చెరకు, పామ్ గింజలు, కోలాకాయలు, అపరాలు, అల్లం, జొన్న, మొక్కజొన్న, కోకో, కాఫీ, చిరుగడం, వేరుసెనగ, అల్లం, పిస్సావానార (బ్రష్ల తయారీకి) ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ, పందుల పెంపకం, గొర్రె—మేకల పెంపకం, మత్స్య పరిశ్రమ ఉన్నాయి. బాక్సైట్, రూటైల్ (టైటేనియం ఖనిజం) దొరుకుతాయి. సియోర్రా లియోనీ వజ్రాల ఉత్పత్తికి ఎగుమతికి ప్రసిద్ధి గాంచినది. టూనా చేపలు దొరుకుతాయి.

## సిరియా

పశ్చిమ ఆసియాలో మధ్యధరా సముద్రాన్నానుకొని వున్న స్వతంత్ర్య గణరాజ్యం. దీని అసలు పేరు సిరియన్ అరబ్బీ రిపబ్లిక్ (1946). వేలకొద్ది సంవత్సరాల క్రిందట వైభవోపేతమయిన నాగరకతలు అవతరించిన ప్రాంతం. డమాస్కసు, అలెప్పో, పాల్మయిరా నగరాలు క్రీ.పూ. 2000 ప్రాంతంలో అతి ప్రాచీన కాలములోనే వెలసినవి. ఆనాడు సిరియా వ్యాపారకూడలి. వర్తకులు బిడరాలమీద సిరియా ద్వారా సంచరించేవారు. ఒరోంటిక్ నది, యూఫ్రటీస్ నది దాని ఉపనదులు, యార్ముక్ నది సిరియాలో ప్రధాన జలాధారాలు. ప్రజలకు సేద్యమే బ్రతుకు తెరువు. పశుపోషణ కూడాజీవనోపాధి. బార్లీ



గోధుమ, అపరాలు, ఆలివ్, ప్రత్తి, బీటుదుంప, పండ్లు ప్రధానమయిన పంట దినుసులు. ఉన్ని పరిశ్రమ, సిమెంటు, తోలు పదును, వంటనూనెలు, పంచదార, పొగాకు, పండ్లను ఎండబెట్టి డబ్బాలలో నిల్వ చేయుట. సిరియాలోని ముఖ్యమయిన పరిశ్రమలు. పెట్రోలు తైల నిక్షేపాలు ఉన్నాయి.

విస్తీర్ణం: 1,85,180 చ.కి.మీ., జనాభా: 1,13, 38,000 (1988); రాజధాని: డమాస్కస్, అలెప్పో, హోమ్స్, లతాకియా, హమాహ్ ఇతర పట్టణాలు. అధికార భాష: అరబ్బీ. ప్రజలలో అరబ్బీలు, కుర్దిష్ జాతులవారున్నారు. ప్రజలలో ముస్లిములు 90 శాతం, వారిలో సున్నీశాఖ వారు ఎక్కువ. క్రైస్తవులు 9 శాతం.

## సీజర్, గెయిస్ జూలియస్

క్రీ.పూ.101–44.

రోమన్ యోధుడు. లాటిన్ భాషలో సీజర్ వ్రాసిన అంతర్యుద్ధ వ్యాఖ్యానాలు బహుళ ప్రచారం పొందాయి. చరిత్రలో ప్రసిద్ధికెక్కిన మహావీరుడు. మహావక్త. రోమన్ సామ్రాజ్యం క్షీణిస్తున్న కాలం (క్రీ.పూ. 61)లో గాల్ పాలకుడుగా నియుక్తుడయ్యాడు. 55లో బ్రిటన్‌పైకి దండయాత్ర జరిపాడు. రోమ్‌లో ముఖ్యంగా పాంపే ఈతనిపట్ల వ్యతిరేకత ప్రకటించడంతో విజృంభించి పాంపేను జయించాడు. తరువాత ఈజిప్టు వైపుకు తన దృష్టి మరల్చి క్లియోపాత్రా (చూ.)ను ఈజిప్టుకు మహారాణిని చేశాడు. తాను రోమ్‌లో నియంత అయి పాలన సాగించాడు. సీజర్ ప్రవేశపెట్టిన సంస్కరణలలో జూలియన్ పంచాంగం (కేలండరు) సవరణ పేర్కొన దగింది. క్రీ.పూ. 44౦, మార్చి 15 నాడు సీజర్ హత్య గావింపబడ్డాడు. సీజర్ తరువాత రోమన్ సామ్రాజ్యానికి తన మేనల్లుడు ఆక్టేవియన్ పాలకుడయ్యాడు.

## సీత

శ్రీరాముని భార్య. పురాణ ప్రసిద్ధిచెందిన లక్ష్మీదేవి యొక్క అవతారం. జనక మహారాజుకు ఈమె అయోనిజ అయిన పుత్రిక. జనకుడు పుత్రకామేష్టి యాగం చేయాలని భూమిని దున్నుతూ ఉండగా, నాగటి చాలులో ఒక బంగారపు పెట్టెలో జనకునికి ఈమె దొరికింది. నాగటి చాలులో దొరికింది గనుకనే ఈమెను 'సీత' అని పేరు పెట్టారు. తమ ఇంట్లో ఉన్న 'శివ ధనుస్సు 'ను ఎక్కుపెట్టగల పరాక్రమవంతుడికి సీతను ఇచ్చిపెండ్లి చేస్తానని జనకుడు స్వయంవరం చాటాడు. భూలోకంలోని మహారాజు లందరూ ప్రయత్నించినా ఆ శివుని విల్లును ఎవ్వరూ ఎక్కుపెట్ట లేకపోయారు. ఇలా విఫలులయిన రాజాధి రాజులలో లంకాధిపతి రావణుడు కూడా ఉన్నాడు. చివరికి విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు మిథిలా నగరం వచ్చారు. విశ్వామిత్రుని కోరికపై రాముడు అవలీలగా ఆ విల్లును ఎక్కుపెట్టి సీతను వివాహమాడాడు. (చూ. శ్రీరామనవమి)

భర్త వెంట 14 ఏళ్లు అరణ్యవాసం చేసి, రావణాసురునిచే అపహరించబడి లంకలో సీత అనేక యాతనలు అనుభవించింది. చివరికి కపిసేనతో వచ్చి రాముడు రావణుణ్ణి సంహరించి సీతను అయోధ్యకు తీసికొని పోయి ఆమెతో కలసి పట్టాభిషేకం చేసుకున్నాడు. తరువాత గర్భవతిగా ఉన్న సీతను రాముడు అడవిలో దిగ విడిచి రమ్మని ఆదేశించడం అక్కడ వాల్మీకి ఆశ్రమంలో ఆమె కుశలవులను ప్రసవించడం జరిగింది. చివరికి రాముని అశ్వమేధ యాగమండపంలో సీత తన తల్లి అయిన భూదేవి ప్రార్థించి ఆమెలో లీనమై పోయింది. (చూ.శివధనుస్సు; శ్రీ రాముడు; రామాయణం).

## సీతమ్మ, డొక్కా 1841–1909

నిరతాన్నదాతగా కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించిన తెలుగింటి ఆడబడుచు. అద్వితీయ ఔదార్యానికి మారు పేరయిన సీతమ్మ తూర్పుగోదావరి జిల్లా లంకల (డెల్టా) గన్నవరం వాసి. తండ్రి అన్నపిండి భవానీ శంకర్. తల్లి నరసమ్మ భర్త జోగన్న. వీరిది బహు అనుకూల దాంపత్యం. భర్త అన్నివిధాల ఆమెకు సాయపడేవాడు. అతిథులు ఏ వేళ ప్పుడు వచ్చి అడిగినా 'లేదు' అనకుండా ఆప్యాయతతో ఆదరించి భోజనం పెడుతుండేది. ధాతు కరువు సంభవించినప్పుడు డొక్కా దంపతులు చేసిన ఆతిథ్య కృషి అపారం. కారణజన్మురాలైన సీతమ్మ అన్నదాత విశిష్టత బ్రిటీషు ప్రభుత్వదృష్టి నాకర్షించగా ఒక ప్రశంశాపత్రాన్ని, ఒక బంగారు పతకాన్ని గౌరవ పురస్కారాలందించారు(1903). 1909లో స్వర్గస్థురాలైన

ఈ ధన్యజీవి డొక్కా సీతమ్మతల్లి ప్రజల మనస్సులో మహా ఇల్లాలుగా చోటు చేసుకుని ఇప్పటికీ నిలిచిపోయింది.

## సీతారామాచార్యులు, బహుజనపల్లి

సుప్రసిద్ధ ఆంధ్ర వ్యాకర్త, నిఘంటు రచయిత, 'ప్రౌఢ వ్యాకరణ', 'శబ్దరత్నాకర' కర్త సీతారామాచార్యులు నాగపట్నంలో 1827లో జన్మించారు. చిన్నతనంలో తండ్రి దగ్గరే విద్యాభ్యాసం చేసి నాగపట్టణ క్షేత్రస్వామి మీద 'సుందర రాజస్వామి శతకం' చెప్పాడు. 1849లో ఆయన మద్రాసుచేరి చిన్నయసూరి, పురాణం హయగ్రీవ శాస్త్రి మున్నగువారి వద్ద వ్యాకరణాది శాస్త్రాలను అధ్యయనం చేశారు. 1885లో 'శబ్దరత్నాకరం', 'ప్రౌఢ వ్యాకరణం' రచించారు. వైకృత దీపిక, పదార్థ నామకోశం, బాల చంద్రోదయం, అలఘు కౌముది, నీతిమాల, సతీ ధర్మసంగ్రహం, ప్రసన్న పారిజాతం, ఆంధ్ర శబ్దమంజరి, ఉపాధ్యాయబోధిని, వినాయక శతకం ఆచార్యులవారి ఇతర రచనలు. ఆధునిక నిఘంటు రచనా పద్ధతిని వ్రాసిన తెలుగు నిఘంటువులలో 'శబ్దరత్నాకరం' మొట్టమొదటిది. 1891 మార్చి 20న సీతారామాచార్యులు స్వర్గస్థులయ్యారు.

## సుందరయ్య,పుచ్చలపల్లి1913–85

స్వాతంత్ర్య సమరయోధుడు. తెలుగునాట కమ్యూనిస్టు పార్టీని వ్యవస్థాపించిన (1934) ప్రజానాయకుడు. పీడిత జనోద్ధారణకై పాటుపడిన త్యాగశీలి. 1913 మే 1న అలగానిపాడు (నెల్లూరు)లో జన్మించాడు. 1925లో విప్లవభావాలు గల సోదర సమితిని నెలకొల్పాడు. చదువుకు స్వస్తి చెప్పి 1930లో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని రెండేళ్ళు కఠిన కారాగార శిక్ష ననుభవించాడు. మరల



1936 లోనూ, 1946 లోనూ కూడ జైలు శిక్ష అనుభవించాడు. 1939–42 మధ్య అజ్ఞాతంలో గడిపాడు. 1946 నుండీ విశాలాంధ్ర ఏర్పాటుకు కృషి నారంభించాడు. 1946–48 మధ్య, నాటి నిజాం రాష్ట్రంలో అజ్ఞాతంలో ఉండి ప్రజాపోరాటం సాగించాడు. 1952–54 మధ్య రాజ్యసభ సభ్యుడుగాను, 1955–67 మధ్య రాష్ట్ర శాసన సభ్యుడుగాను కొనసాగి కమ్యూనిస్టు (మార్క్సిస్టు) కార్యకలపాల్లో నాయకుడుగా వ్యవహరించాడు. సంఘ సంస్కరణా, సాంస్కృతిక వ్యవహారాలూ, అస్పృశ్యతానివారణా, కులవిభేద నిర్మూలనా, పయోజన విద్యా సుందరయ్య కార్యరంగాలు. 1955 మే 19న కీర్తిశేషుడయిన ఈ మహాప్రజానాయకుని పేర హైదారాబాదులో 'సుందరయ్య విజ్ఞాన కేంద్రం' వ్యవస్థాపించారు.

## సుందరాచారి, శంకరంబాడి

సుప్రసిద్ధ 'మా తెలుగుతల్లికీ మల్లెపూదండ' గీత రచయిత. తిరుపతిలో జన్మించి అచ్చటనే విద్యాభ్యాసంచేసి సంస్కృతాంధ్రాలను అధ్యయనం చేశాడు. పాతాళభేది సుబ్రహ్మణ్యం శర్మ, అల్లసాని రామనాథ శర్మ వంటి పండితుల ప్రభావంతో ఉత్తేజితుడయ్యాడు. కొన్నాళ్ళు విద్యాశాఖలో స్కూళ్ల ఇన్స్పెక్టరుగా పనిచేశాడు. 1940–1950 మధ్య సుందరాచారి కొన్ని సినిమాలకు మాటలు, పాటలు వ్రాసేవాడు. ఆ సమయంలోనే 'మా తెలుగుతల్లికి మల్లెపూదండ' గీతాన్ని వ్రాశాడు. దానిని ఒక గ్రామఫోను కంపెనీ వారు ముందుకు వచ్చి ఆ పాటకు స్వరకల్పన చేయించి టంగుటూరి సూర్యకుమారిచే పాడించి రికార్డుచేసి విడుదల చేశారు. ఆ పాట ఆ రోజుల్లో బహుజనాదరణ పొందింది. సుందారాచారికి మరింత కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టింది 'మా తెలుగు తల్లి' గీతమే. శంకరంబాడి సుందరాచారి 1977 ఏప్రిలు 8న తిరుపతిలో పరమపదించాడు.(చూ. తెలుగుతల్లి)

## సుడాన్

ఆఫ్రికాలో ఈశాన్య ప్రాంతంలోని స్వతంత్ర గణరాజ్యం. ప్రాచీన కాలం (క్రీ.పూ. 1500)లో కుష్ నాగరకత వర్ధిల్లిన ప్రాంతం. 19వ శతాబ్ది ప్రారంభంలో బ్రిటిష్ వారి ఆధిపత్యం క్రిందికి వచ్చింది. 1895లో స్వాతంత్ర్యాన్ని సాధించుకుంది. ఉత్తరాన ఈజిప్టు, దక్షిణాన జెయిరీ, ఉగాండా, పశ్చిమాన సెంట్రల్ ఆఫ్రికా రిపబ్లిక్, చాడ్ లిబియా, తూర్పున ఎతియోపియా, రెడ్‌సీ ఉన్నాయి.

విస్తీర్ణం: 25,03,890 చ. కి.మీ.; జనాభా: 2,62, 63,000 (1988), రాజధాని: ఖార్టూమ్: అధికార భాష: అరబ్బీ, ఇంగ్లీషు; ప్రజలు అరబ్బీ, నీగ్రో, డింకా, నూబియా జాతులకు చెంది ఇస్లాం (సున్నీ) 73 శాతం, క్రైస్తవులు 7 శాతం, ఆదిమ జాతల మత విశ్వాసాలను 17 శాతం పాటిస్తున్నారు. ప్రజలు చెరువులు, దొరువులు, నదులు ఉన్నచోట్లలోనే నివసించడానికి ఇష్టపడతారు. ఉత్తరప్రాంతం లిబియా ఎడారి, సహారా ఎడారి కమ్మి ఉన్నాయి. ఎగువవైట్ నైలు నది, బ్లూనైలు నది, ఆల్ అరబ్ నది, నాసర్ సరస్సు దక్షిణ భాగం సుడాన్‌కు




జలాధారాలు. గోధుమ, చిరుధాన్యాలు, మొక్కజొన్న, పుచ్చకాయలు, పెండలం, కర్రపెండలం, నువ్వు గింజలు, వేరుసెనగ, వరి, చెరకు, పొగాకు, జొన్న (సుడాన్ ముఖ్యాహారపు పంట), మిర్చి, పొడుగుపింజప్రత్తి ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. జిగురు (గమ్ అరాబిక్) ఉత్పత్తిని ప్రపంచంలోనే సుడాన్ ఎక్కువ చేస్తోంది. పశుపోషణ ప్రజలకు జీవనోపాధి. బంగారం, క్రోమైట్, ఇనుపరాయి, మాంగనీస్, మాగ్నెసైట్, రాగి, పెట్రోలు తైలనిక్షేపాలు సుడాన్ ఖనిజ నిక్షేపాల్లో పేర్కొనదగినవి. పంచదార, సిమెంటు, జవుళీ, పాదరక్షలు పరిశ్రమల్లో పేర్కొనదగినవి.

## సుబ్బారావు, రాయప్రోలు

'ఏ దేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీతల్లి భూమి భారతిని' అనే సుప్రసిద్ధ గేయాన్ని వ్రాసిన రాయప్రోలు సుబ్బారావు 1914లో శాంతినికేతనానికి వెళ్లి రవీంద్రనాథ్ టాగూర్ అంతేవాసిగా చదువు సాగించాడు. భావకవిత్వం ప్రారంభించి ఆశువుగా చెప్పదొడగాడు. భజగోవిందం శ్లోకాలను, సౌందర్యలహరి శ్లోకాలను తెలుగు చేశాడు. ఉమర్‌ఖయ్యామ్(చూ.) రుబాయీలను ఇంగ్లీషు నుండి 'మధుకలశం'గా తెనిగించాడు. గోల్డ్‌స్మిత్ రచన 'హెర్మిట్'ను 'లలిత' గానూ, టెనిసన్ రచన 'డోరా'ను 'అనుమతి' గానూ తెలుగులో కావ్యాలుగా రచించాడు. తృణ కంకణం ఆయన రచించిన సొంత పద్యకావ్యం. ఇది అమలిన శృంగారం స్థాయినందుకొందని పండితుల అభిప్రాయం. 'జడకుచ్చులు', 'ఆంధ్రావళి', వనమాల ఆయన ఇతర ఖండకావ్యాలు. మిశ్ర మంజరికి కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 'శ్రీలు పొంగిన జీవగడ్డ' అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు' అనే ఆంధ్ర ప్రశస్తిని కొనియాడుతూ వ్రాసిన ప్రసిద్ధ గేయ రచనలు. ఆయన కావ్యశైలిలో రామణీయకత ఉట్టిపడుతుందని సాహిత్య విమర్శకుల అభిప్రాయం. 1892లో జన్మించిన రాయప్రోలు సుబ్బారావు 1984 జూన్ 30న సికింద్రాబాద్‌లో కాలధర్మం చెందారు.

## సుబ్రమణ్యా భారతి 1882–1921

జాతీయవాది. సుప్రసిద్ధ తమిళ మహాకవి. 'సుబ్బయ్య' ఈయనకు ముద్దుపేరు. చిన్నప్పుడే సరదాగా కవితలల్లడం చూచిన శివజ్ఞానయోగి ఈయనను 'భారతీ' అని పిలిచేవారు. మొదట తిరునల్వేలిలోనూ తరువాత వారణాసిలోనూ భారతి విద్యాభ్యాసం సాగింది. ఇంగ్లీషు కవిత్వం బాగా చదివేవాడు. షెల్లీ ఈయన అభిమాన కవి. కాశీలో విద్య ముగిసిన తరువాత కొన్నాళ్లు ఎట్టయాపురం రాజావారి కొలువులో పనిచేశాడు. దివాణం సంప్రదాయాలు తన మనస్తత్వానికి సరిపడక 22వ ఏట 1904లో మద్రాసు వచ్చి 'సుదేశ మిత్రన్' (స్వదేశ మిత్రన్) అనే తమిళ పత్రికలో చేరాడు. ఆ రోజుల్లో 'ది హిందూ' ఇంగ్లీషు దినపత్రిక వ్యవస్థాపకుడు జి.సుబ్రమణ్య అయ్యర్ 'సుదేశమిత్రన్'ను కూడ నడిపేవాడు. అయ్యర్ కాంగ్రెసు మహాసభలకు వెళ్లినప్పుడల్లా భారతి కూడా వెళ్లడంవల్ల జాతీయనాయకులతో ఆయనకుపరిచయాలు ఏర్పడ్డాయి. స్వామి వివేకానందుని శిష్యురాలు నివేదిత (చూ.)ప్రోత్సాహపరచగా 'స్త్రీజనోద్ధరణ'పట్ల ఆకర్షితు



డయ్యాడు. 'స్వదేశ గీతంగళ్','జన్మభూమి' అనే జాతీయగీతాల సంపుటాల్ని రచించి నివేదితాదేవికే అంకితం చేశాడు (1909). మహిళలకై 'చక్రవర్తిని' అనే తమిళ మాసపత్రికను నిర్వహిస్తూ ఉండేవాడు. తరువాత 'ఇండియా' పత్రికను నడిపాడు. ఇందు రాజకీయ విశేషాలు, వ్యంగ్య (కార్టూన్) చిత్రాలు ఉండేవి. సూరత్ కాంగ్రెసు మహాసభలకు వెళ్లినప్పుడు బాలగంగాధర తిలక్‌తో గాఢ పరిచయం ఏర్పడింది. ఆయన ఉపన్యాసాలు భారతిని బాగా ఆకట్టుకున్నాయి. అప్పటినుంచి దేశంలో పరులకు బానిసలమై బ్రతకబోమని ప్రజలలో నవజాగృతిని కలిగించాడు. తమిళజాతిని ఈ విధంగా జాగృతి కవితల ద్వారాను, తన రచనల ద్వారాను రాజకీయంగా చైతన్యం చేయడం ఇంగ్లీషువారికి గుర్రుగా ఉండేది. చివరకు తన 'ఇండియా' ప్రచురణ కేంద్రాన్ని మద్రాసు నుండి పాండిచ్చేరి మార్చవలసి వచ్చింది (1908). ఆనాడు గాంధీజీ దక్షిణాఫ్రికాలో చేస్తున్న రాజకీయ కృషి కూడా 'ఇండియా'లో చోటు చేసుకునేది. ఋజువర్తనకు, ధైర్య సాహసాలకు, త్యాగబుద్ధికి, క్రమశిక్షణకు భారతి పేరు మారుపేరుగా చలామణీ అయ్యేది. 'పాంచాలి శపథం', 'కుయిల్‌పాట్టు', 'కణ్ణన్ పాట్టు' ప్రసిద్ధిగాంచిన భారతి రచనలు. 'కదైక్కొత్తు', 'నవ స్వతంత్ర కథలు' ఆయన రచించిన హాస్య కథలు. 'పాంచాలి శపథం'లో ద్రౌపది కథను సంకేత కావ్యంగా దేశభక్తిని మేళవించి బానిసత్వాన్ని గూర్చి వ్రాశాడు. పాండిచ్చేరిలో ఉండగానే అరవింద ఘోష్ ఆధ్యాత్మిక కృషిపట్ల ప్రభావితుడై 'తల్లి పరాశక్తి' కవితలందించాడు. దేశభక్తి, తాత్త్విక గీతాలనేకాక తేలిక పదాలతో ప్రబోధాత్మక పాటలను కూడా అల్లాడు. వాటిలో—

పరుగెత్తి ఆడాలి పాపా — నువ్వు
బద్ధకం మానాలి పాపా!
కలిసి మెలిసి ఆడాలి పాపా — ఎవ్వ
రినీ ఏమీ అనబోకు పాపా!!

అని తెలుగు అర్థం వచ్చే

ఓడి విళైయాడు పాప్పా — నీ
ఓయిందిరుక్కల్ ఆగాదు పాప్పా!
కూడాడి విళైయాడు పాప్పా — ఒరు
కుళందైయై వైయాదే పాప్పా!!

అంటూ భారతి తమిళంలో అల్లిన పిల్లల పాటను భారత ప్రభుత్వం విడుదల (ఎన్.సి.ఇ.ఆర్.టి.)'కలసి పాడుదాం' సామూహిక సంగీత కాసెట్టు సంచికలో (13 భాషల్లో) చోటు చేసుకుంది. సమైక్యభావ జాగృతిని పిల్లలలో ఇనుమడింప చేయడానికి ఈ సంచికా కార్యక్రమం దేశవ్యాప్తంగా పాఠశాలల్లో నిత్యమూ ఆలాపిస్తూ ఉంటారు (1984).

భారతి 1918లో పాండిచ్చేరి నుండి మద్రాసు తిరిగివచ్చాడు. 1919లో గాంధీజీ మద్రాసు వచ్చి నప్పుడు 'భారతమాతా నవరత్నమాలా' అని ఆయన బహిరంగ సభలో ఆలాపించాడు. మళ్లీ 'స్వదేశ మిత్రన్'లో చేరాడు (1920). 1882 డిసెంబరు 11న ఎట్టయా పురం (తిరునల్వేలి)లో జన్మించిన సుబ్రమణ్య భారతి ప్రమాదవశాత్తు ఏనుగు కాలుకింద పడి, దెబ్బతిని 1921 సెప్టెంబరు 11న కీర్తిశేషులయ్యాడు.

## సుభాస్ చంద్ర బోసు(నేతాజీ)

భారత స్వాతంత్ర్యోద్యమ నాయకులలో నేతాజీ సుభాస్ చంద్ర బోసు మహా సాహసికుడు. నయాన లేదా భయాన బ్రిటిషువారిని భారతదేశం నుంచి సాగనంపి ఈ దేశాన్ని బలిష్ఠమైన స్వతంత్రరాజ్యం చేయడం ఆయన ధ్యేయం. బోసు 1897 జనవరి 23వ తేదీన కటక్‌లో ఒక బెంగాలీ కుటుంబంలో జన్మించాడు. తండ్రి జానకీనాథ బోసు, తల్లి ప్రభావతి. చిన్నతంలోనే బోసు స్వామి వివేకా నందుడు, రామకృష్ణ పరమహంసల మానవసేవ, ఆధ్యాత్మిక జీవనం వంటి మహదాశయాల వల్ల ప్రేరితు డైనాడు. 15వ ఏటనే మెట్రిక్యులేషన్ పరీక్షలో మొత్తం విశ్వవిద్యాలయంలో ద్వితీయుడుగా నెగ్గాడు. 1919లో తత్వశాస్త్రంలో ఫస్టుక్లాస్ ఆనర్స్‌తో బి.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. అదే సంవత్సరం ఇంగ్లండు వెళ్ళి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చేరి, 1920 జూలైలో లండనులో ఇండియన్ సివిల్ సర్వీసు (ఐ.సి.ఎస్)పోటీ పరీక్ష వ్రాసి అందులో నెగ్గడమేకాక కృతార్థులైన వారిలో నాల్గవవాడుగా నిలిచాడు.

ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చిన తర్వాత బ్రిటిషువారి క్రింద ఐ.సి.ఎస్. అధికారిగా పనిచేయడానికి ఆయన అంతరాత్మ అంగీకరించలేదు. 1921లో బొంబాయి

మహాత్మాగాంధీని కలుసుకొని ఆయన సూచనపై కలకత్తాలో దేశబంధు చిత్తరంజన్ దాసును కలుసుకున్నాడు. అప్పటినుంచీ దాసు ఆయనకు గురువు, మార్గదర్శి. బోసు కాంగ్రెసులో చేరి 1921లో మొదటిసారిగా అరెస్టు అయ్యాడు. మొత్తం 11 మార్లు బ్రిటిషు ప్రభుత్వం బోసును అరెస్టుచేసి జైలులో ఉంచింది. 1924లో చిత్తరంజన్ దాసు కలకత్తామేయర్‌గా ఎన్నుకోబడగా, దాసుగారు బోసును కలకత్తా కార్పోరేషన్ ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమించాడు. 1938లో హరిపురా (గుజరాత్)లో జరగబోయే 51వ భారత జాతీయ కాంగ్రెసు మహా సభకు అధ్యక్షుడుగా బోసు ఎన్నుకొబడ్డాడు. ఆ తర్వాత గాంధీజీకి ఇష్టం లేకపోయినప్పటికీ బోసు మరొకమారు కాంగ్రెసు అధ్యక్ష పదవికి పోటీచేసి గెలిచాడు. ఆ తర్వాత కాంగ్రెసు నాయకులతో విభేదాలు వచ్చి ఆయన ఫార్వర్డ్ బ్లాక్ అనే సంస్థను స్థాపించాడు. 1941లో బ్రిటిషు పోలీసుల కన్నుకప్పి స్వగృహం నుంచి తప్పించుకుని అదృశ్యమైపోయాడు. భారతదేశం నుంచి వెళ్ళిపోయి తొమ్మిది నెలలకు జర్మనీ రేడియోలో ప్రసంగించాడు. స్వగృహం నుంచి ఆయన తప్పించుకుని పోయిన వైనం ఒక సాహసగాథ. జర్మనీనుంచి ఒక జలాంతర్గామిలో 90 రోజులు ప్రయాణం చేసి, బ్రిటిషు దీవుల మీదుగా ఆఫ్రికా ప్రదక్షిణం చేసి హిందూ మహాసముద్రం మీదుగా సుమత్రా, పెనాంగ్‌లకు వెళ్ళి, అక్కడినుంచి విమానంలో జపాను చేరుకుని, జపాను ప్రధాని టోజోను కలుసుకొని మాట్లాడి, 1943 జూలై 2వ తేదీన సింగపూరు చేరుకుని ఇండియన్ నేషనల్ ఆర్మీకి (అజాద్ హింద్ ఫౌజ్—ఐ.ఎన్.ఎ.) సర్వ సైన్యాధిపతిగా నాయకత్వం వహించి, ఆ సేనను చక్కని క్రమశిక్షణగల సైన్యంగా బ్రిటిషువారి పైకి నడిపించాడు. ఈయన సైన్యం బర్మా అడవులను దాటి ఈశాన్య భారతదేశంలోకి ప్రవేశించింది.



1945 ఆగస్టు 5–9 అమెరికా వేసిన ఆటంబాంబులకు త్వరలోనే జపాన్ లొంగిపోయింది. బోసు ఒక విమానంలో జపానుకు వెళ్ళుతూ దారి మధ్యలో ఫార్మోసాలో విమానం కూలి 1945 ఆగస్టు 18వ తేదీన మరణించాడు. "మీరు మీ రక్తం ఇవ్వండి. నేను మీకు స్వాతంత్ర్యం తెచ్చిపెడతాను" అంటూ ఐ.ఎన్.ఎ. వీరులను ప్రబోధించిన యోధుడు నేతాజీ.

## సుమేరియన్ నాగరకత

యూఫ్రటీస్, టైగ్రిస్ నదుల మధ్య ప్రదేశంలో (నేటి ఇరాన్) క్రీ.పూ. 3500 నాడు వర్ధిల్లిన అతిప్రాచీన నాగరకత. క్రీ.పూ. 3500 నాటికే సుమేరియన్‌లు గోధుమలు వంటి గింజధాన్యాలను సాగుచేసి పండించే వారనీ, పశువులు, మేకలు, గొర్రెలు పెంచేవారనీ తెలుస్తూంది. సుమేరి యన్‌లు ఆరాధించే దేవత గోవు రూపంలో ఉండేది. ఆ దేవత వారి ఆలమందలను కాపాడేదని వారి నమ్మకం. బండ్లను లాగుటకు ఎద్దులు, గాడిదలు వాడుకలో ఉండేవి. పశుపాలను, పాడి పరిశ్రమ ధనాదాయ వృత్తులుగా ఆ నాగరకతలో ప్రముఖ స్థానం వహించేవి. మధ్యధరా సముద్ర ప్రాంతం నుండి సింధు నదీ ప్రాంతం వరకూ వారు అంతర్జాతీయ వర్తక వాణిజ్యాలు నెరపేవారు. సుమేరియన్‌లు వాడుక చేసిన లిపిని కీలలిపి అనీ, బాణాగ్రలిపి (క్యూనిఫారమ్ లిపి) అనీ అంటున్నాం. ఈ లిపిలో వ్రాసిన లేఖనలు గల మన్ను బిళ్లలు దొరికాయి. బయటపడిన సుమేరియన్ దేవాలయ శిథిలాలను గోరీల శిథిలాలను బట్టి నాటి రాజవంశాల వైభవోపేతమయిన జీవన శైలి ప్రాచీన ఈజిప్టు నాగరకతకు తీసిపోదని తెలుస్తూంది.

## సురినామే

దక్షిణ అమెరికాలో ఈశాన్యంలో ఉన్న స్వతంత్ర గణరాజ్యం. దీనిని సురినామ్ అనికూడా అంటారు. ఒకప్పుడు డచ్చి వలసరాజ్యంగా డచ్చి గయానా పేరుమీద ఉండేది. 1975లో స్వాతంత్ర్యం పొందింది.

విస్తీర్ణం: 1,63,820 చ.కి.మీ; జనాభా: 4,25,000; రాజధాని: పరమారిబో; అధికార భాషలు: డచ్చి, హిందీ, శ్రానన్టాంగా, వనీస్. ప్రజలు విభిన్న జాతులకు

ఛెందిన వారున్నారు. భారతీయులు 37 శాతం మిగతావారిలో ఇండోనీషియన్‌లు 14 శాతం, చైనీసు, లెబనీస్, రెడ్ ఇండియన్‌లు 3 శాతం, నీగ్రోలు 8 శాతం ఉన్నారు. హిందూ మతాన్ని పాటించేవారు 27 శాతం, క్రైస్తవులు 40 శాతం, ముస్లిములు 19 శాతం, ఇతర మతాలవారు 14 శాతం ఉన్నారు. చెరకు, అరటి, నారింజ, పామ్ నూనె గింజలు, కొబ్బరి, క్రరపెండలం, కూరగాయలు, ముఖ్యమయిన పంటదినుసులు. పశు పోషణ, పందుల పెంపకం ఉన్నాయి. మత్స్యపరిశ్రమలు, రొయ్యలు ఎక్కువ. బాక్సైట్, బంగారం, తైలనిక్షేపాలు ఖనిజోత్పత్తులు. బాక్సైట్ ఎగుమతి అవుతున్నది.




# సురేంద్రనాథ్ బెనర్జీ

మహావక్త. ఇంగ్లండ్ పాలనతో ఇండియాను బాగుపరచాలని ఘోషపెట్టిన మహామనీషి. లండన్ యూనివర్శిటీలో చదివి ఐ.సి.ఎస్. పాసైన మొట్టమొదటి భారతీయుడు. అసాధారణమైన జ్ఞాపక శక్తి గలవాడు. భారత జాతీయ కాంగ్రెస్ సంస్థాపకులిద్దరిలో ఆయన ఒకరు. 1848లో కలకత్తాలో బెనర్జీ జన్మించారు. ఐ.సి.ఎస్. పాసైన తర్వాత 1869లో భారతదేశంలో అసిస్టెంట్ మేజిస్ట్రేట్‌గా నియమితులైనప్పటికీ కొన్ని కారణాలవల్ల ఉద్యోగం పోగొట్టుకున్నారు. రాజ్యాంగ బద్ధంగా పోరాటం సాగించాలనే భావంతో రాజకీయాల్లోకి దిగి 1876 జూలై 26న కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్ స్థాపించారు. 'బెంగాలీ' పత్రికా సంపాదకుడుగా కొంతకాలం పనిచేశారు. భారతీయుల ప్రేమాభిమానాలు పొందడానికి పరిపాలనలో సంస్కరణలుతేవాలనీ, వారిని అనుమానించరాదనీ, రాజకీయాల్లో నీతిఉండాలని ఆయనఆంగ్లేయులకుస్పష్టం చేశారు.భారతదేశ ఐక్యత కాంక్షించాడు. భారతదేశం బాగుపడాలంటే పేదవారికి పన్ను మినహాయింపు, ఆర్థిక బాధలనుండి రైతుల విముక్తి, ప్రభుత్వ సేవలలో భారతీయుల నియామకం, కొత్త పరిశ్రమల స్థాపన, స్వదేశీ వస్తువులను ప్రోత్సహిస్తూ, స్వదేశీయుల అవసరాలకు అనుగుణంగా విదేశీ వస్తువులను మలచుకోవడం అవసర మని సురేంద్రనాథ్ నొక్కి చెప్పారు. 1905లో జరిగిన బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళనలో బెనర్జీ ప్రముఖ పాత్ర వహించారు. 1925 ఆగస్టు 6న బెనర్జీ కీర్తిశేషు లయ్యారు.



# సూరదాసు

సుప్రసిద్ధ కృష్ణ భక్తుడు. భక్తగాయక శిఖామణిగా కీర్తి ప్రతిష్ఠలనార్జించారు. శుద్ధాద్వైత మతప్రవక్త వల్లభాచార్యుని శిష్యుడు. మథుర (చూ.)లో జన్మించి సమీపముననే గోగట్‌లో నివసిస్తూ వ్రజభాష (హిందీ మాండలికం)లో ద్రుపద్ బాణీ గేయాలు పెక్కింటిని రచించి ఆలాపించి భక్తిగానామృతాన్ని అందించేవాడు. సూరదాస్ తీర్థయాత్రలు చేస్తూ చివరకు గోపాల పురంలోని శ్రీనాథ దేవళంలో ఆలయ గాయకుడై అంధత్వం ప్రాప్తించిన జీవయాత్ర సాగించారు. వేలసంఖ్యలో కీర్తనలున్న ఆయన రచన 'సూర్‌సాగర్' సుప్రసిద్ధ మైంది. ఇందు ఆయన ప్రయోగించిన రాగాల సంఖ్య 79. ఇందు కరుణ, భక్తి, వాత్సల్య, వీర, శాంత, శృంగార రసాలు ద్యోతకమవుతాయి. సూరదాసుకు అంధత్వం ప్రాప్తించిన తరవాత కూడ, అనేక శిష్యుల సాయమున కీర్తన గ్రంథాలను వ్రాశాడు. ఈ మహాభక్తుడు 1563 లో పరమపదించాడు.

# సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్

ఆఫ్రికా ఖండంలో భూమధ్య రేఖ మీదనున్న స్వతంత్ర గణరాజ్యం. 1958లో ఫ్రెంచి వారినుండి స్వపరిపాలనాధికారం పొంది 1960లో సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించుకుంది.

విస్తీర్ణం: 6,22,436 చ.కి.మీ; జనాభా: 28, 43,000(1988); రాజధాని: బంగూయీ; అధికార భాషలు: ఫ్రెంచి, సాంఘో; ప్రజలలో ఆదిమ జాతులకు చెందిన బండా 28 శాతం, బాయా 25 శాతం, న్గబందీ 10 శాతం, అజాండే 10 శాతం, సారా, మ్బాకా,

మ్బువ్మ్, కారే తెగలవారు ఉన్నారు. క్రైస్తవులు 83 శాతం, సంప్రదాయ మతాల వారు 12 శాతం, ముస్లిములు 3 శాతం. కాంగోనదికి ఉపనది ఉబాంగీ (ఔబాంగుయా) నది దక్షిణ సరిహద్దుగా ప్రవహిస్తున్నది. దానికి తోడు లోబాయే నది, కొట్టోనది, ఇవిగాక చాలినది, పశ్చిమాన కషేయీనది ప్రధాన నీటి వనరులు. మెట్టభూములు సవన్నా పచ్చిక బయళ్లతో నిండి ఉన్నాయి. కర్రపెండలం, కంద మూలములు, వేరుసెనగ, కోకో, అరటి, టారో, కాఫీ, దుంపలు, ప్రత్తి, మొక్కజొన్న, చిరుధాన్యాలు, అపరాలు ప్రధానమయిన వ్యవసాయోత్పత్తులు. పశు పోషణ, గొర్రె, మేకల పెంప కం, కోళ్ళ పెంపకం, పందుల పెంపకం ప్రజలకు జీవనోపాధులు. మత్స్య పరిశ్రమ ఉంది. విలువయిన వజ్రాలు, పారిశ్రామిక వజ్రాలు, బంగారం, యురేనియం ఖనిజోత్పత్తులు. ఈ దేశంలోని నైరృతి ప్రాంతంలో అడవులను ఆధారంగా ఆర్థికాభివృద్ధి చేయడానికి కృషి సాగుతూంది.

## సెకెల్లిస్(సెషెల్జ్)

మడగాస్కర్‌కు ఈశాన్యాన 1100 కి.మీ. దూరంలో హిందూ మహా సముద్రంలోని ద్వీపరాజ్యం. ఈ దీవులు ప్రకృతి సౌందర్యంతో అలరారుతూ చూడ ముచ్చటగా ఉంటాయి. 1770లో ఫ్రెంచివారు వచ్చినప్పుడు ఈ దీవులలో జనవాసాలు మృగ్యం. 1976లో స్వతంత్ర గణరాజ్యమయింది. ఈ ద్వీప సముదాయంలో మొత్తం చిన్న, పెద్ద 92 దీవులు. ఇందులో 45 పగడపు దీవులు ఉన్నాయి. అన్నిటికంటే పెద్దది మాహేదీవి. దీనిమీదనే రాజధాని విక్టోరియా ఉంది.

విస్తీర్ణం: 453 చ.కి.మీ.; జనాభా: 66,900 (1988); రాజధాని: విక్టోరియా; అధికార భాషలు: క్రియోలీ, ఫ్రెంచి. ఇంగ్లీషు కూడా మాట్లాడతారు. ప్రజలు యూరప్, ఆఫ్రికన్, ఇండియన్, చైనా జాతుల సంకర మిశ్రమం. వీరు క్రియోలీ అనే సంకర భాషను సృష్టించుకుని వాడుక చేస్తున్నారు. వ్యవసాయోత్పత్తులలో కొబ్బరి ప్రధానమైనది. ఆ తరువాత దాల్చిన చెక్క (మసాలాలో ఉపయోగించేది), అరటి, తేయాకు, నిమ్మ పండిస్తున్నారు. టూనా, ముల్లెట్, మెకెరెల్, సార్డీన్, షెల్ ఫిష్ చేపలు పుష్కలంగా దొరుకుతాయి.

## సెనెగల్

పశ్చిమ ఆఫ్రికాలోని స్వతంత్ర గణరాజ్యం. అట్లాంటిక్‌ను ఆనుకొని ఉంది. ఫ్రెంచి ఆధిపత్యంలో ఉండి తరవాత మాలీ సమాఖ్యలో భాగమై 1960లో స్వతంత్ర రాజ్యమయింది.

విస్తీర్ణం: 1,96,722 చ.కి.మీ.; జనాభా: 71,87,600 (1988), రాజధాని: డాకర్, అధికార భాష: ఫ్రెంచి. ప్రజలు నీగ్రో జాతికి చెందిన వూలోఫ్, ఫులానీ, సెరీర్, టుకులోర్, డైయోలా, మాండింగో తెగలవారు. ఎక్కువమంది సున్నీ ముస్లిములు 91 శాతం, క్రైస్తవులు 6 శాతం. సంప్రదాయ ఆదిమజాతి విశ్వాసాలను 3 శాతం పాటిస్తున్నారు.

సినేనది, సాలూమ్‌నది, గాంబీనది, కసామాన్స్ నది ప్రధాన జలాధారాలు. సవన్నా భూములు. సెనెగల్ ప్రధాన వ్యవసాయోత్పత్తి వేరుసెనగ. 72 శాతం ఎగుమతి అవుతూంది. వరి, జొన్న, మొక్కజొన్న, చిక్కుడు, కర్రపెండలం, బంగాళదుంప, చిరుగడం, చెరకు, ప్రత్తి ఇతర పంట దినుసులు. పశుపోషణ (పశువులు, గొర్రెలు, మేకలు) ప్రజలకు జీవనాధారం కల్పిస్తూంది. జిర్కోనియం, కాల్షియమ్, ఫాస్ఫేట్‌లు సెనెగల్ ఖనిజ సంపద. ఫాస్ఫేట్‌లు ఎగుమతి అవుతున్నాయి. టూనా చేపలు దొరుకుతాయి. సిమెంటు, జవుళీ, బీరు, సారాయి, వేరుసెనగ ఉత్పత్తులు ప్రధాన పరిశ్రమలు.

## సెయింట్ కిట్స్—నెవిస్

సెయింట్ కిట్స్ (క్రిస్టాఫర్)— నెవిస్ జంట ద్వీపరాజ్యం తూర్పు కారిబియన్ సముద్రంలోని వెస్టిండీస్‌లో ఉంది. 1967 వరకు గ్రేట్ బ్రిటన్ ఆధీనంలో ఉన్న ఈ రాజ్యం 1983లో స్వాతంత్ర్యం పొందింది.

విస్తీర్ణం: 269 చ.కి.మీ.; జనాభా: 43,200 (1988); రాజధాని: బస్సే—టెర్రే; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలు నీగ్రో జాతికి చెందినవారు 90 శాతం, భారతీయులు 3 శాతం, సంకర జాతులు 5 శాతం. మొత్తం మీద క్రైస్తవులు 76 శాతం. చెరకు, కొబ్బరి, పండ్లు, వేరుసెనగ, ప్రత్తి ముఖ్యమైన పంట దినుసులు. పశుపోషణ, మత్స్య పరిశ్రమ ఉన్నాయి. బెల్లపు పానకం (మొలాసిస్), పంచదార పరిశ్రమ ప్రముఖమైనవి.

## సెయింట్ లూసియా

సెయింట్ విన్సెంట్‌కు ఉత్తరంగా కారిబియన్ సముద్రంలోని వెస్టిండీస్‌లో ఉన్న ద్వీపరాజ్యం. 1979లో స్వాతంత్ర్యం పొందింది. అగ్నిపర్వతాలు మెండు. అడవులు సారవంతమయిన లోయలు ఎక్కువ.

విస్తీర్ణం: 617 చ.కి.మీ.; జనాభా: 1,45,000 (1988); రాజధాని: కాస్ట్రీస్; అధికార భాష: ఇంగ్లీషు, ఫ్రెంచి పేషోయ్. ప్రజలు నీగ్రో జాతికి చెందిన వారు 90 శాతం, సంకర జాతులవారు 5 శాతం, భారతీయులు 3 శాతం. క్రైస్తవం పాటిస్తున్నారు. అరటి, మామిడి, కొబ్బరి, చిరుగడం, నారింజ, కోకో, అల్లం, కూర గాయలు ప్రధానమైన పంట దినుసులు. పశువుల పెంపకం ప్రజలకు జీవనోపాధి. చేపలవేట కొందరికి బ్రతుకు తెరువును కల్పిస్తూంది. కాగితం, బోర్డు, పానీయాలు, ఆట వస్తువులు ముఖ్యమైన పరిశ్రమలు. అరటిపండ్లు ఎగుమతి అవుతున్నాయి.

## సెయింట్ విన్సెంట్

కారిబియన్ సముద్రంలోని వెస్టిండీస్‌లో ఉన్న ద్వీపరాజ్యం. 1979లో స్వాతంత్ర్యం సాధించుకుంది. దీని పూర్తి పేరు సెయింట్ విన్సెంట్ & ది గ్రెనాడీన్స్.

విస్తీర్ణం: 369 చ.కి.మీ.; జనాభా: 1,30,000 (1988); రాజధాని: కింగ్స్‌టౌన్; అధికార భాష: ఇంగ్లీషు. 74 శాతం ప్రజలు నీగ్రో జాతులకు చెందినవారు. 19 శాతం ములత్తో, 3 శాతం తెల్లవారు, రెడ్ ఇండియన్‌లు 2 శాతం, భారతీయులు 2 శాతం ఉన్నారు.

అరటి, కొబ్బరి, ఎడ్డో, దాషీను అను టారో దుంప జాతులు, చిరుగడం, అల్లం, అరోరూట్, జామ, బొప్పాయి పండ్లు ప్రధానమైన వ్యవసాయోత్పత్తులు. చేపలవేట, పశుపోషణ ఉన్నాయి. సిగరెట్ల తయారీ, పానీయాలు, దుస్తులు, వినోద యాత్రా సామగ్రి ప్రముఖ పరిశ్రమలు.

## సైప్రస్

ఆసియా, ఆఫ్రికా, యూరపు మూడు ఖండాలకు అతి సమీపంలో ఉన్న స్వతంత్ర ద్వీప గణరాజ్యం. ఇది మధ్యధరా సముద్రంలో తూర్పున ఉంది. క్రీ.పూ. 7000 ఏళ్లనాటి నాగరకత వర్ధిల్లిన ద్వీపం. అప్పుడే ఆ మూడు ఖండాలకు నాగరకత విస్తరించింది.ఇంత వైభవోపేతమైన నాగరకత గల ఈ దేశం 1960లోస్వాతంత్ర్య సాధించుకుంది. దీనిని గ్రీక్‌భాషలో'క్సైప్రియారీ డెమోక్రటిక్'అంటారు.సైప్రస్‌లో కొంత భాగం టర్కీ ఆక్రమణలో ఉంది– టర్కిష్ భాషలో 'కిబ్రిస్ కుమ్హూరీ మేటీ అని అంటారు.




విస్తీర్ణం: 5,896 చ.కి.మీ.; జనాభా:5,53,000(1988); రాజధాని: నికోసియా; అధికార భాషలు: గ్రీక్, టర్కిష్. ప్రజలంతా గ్రీక్ జాతికి చెందినవారే. ప్రజలు గ్రీక్ ఆర్తడాక్స్ క్రైస్తవం పాటిస్తారు. ఓహియారి జోస్ నది, సెరాకిస్ అకాకీనది, పెడియోస్ నది, కొకియా సరస్సు సైప్రస్‌కు జలాధారాలు. గోధుమ, బార్లీ, బంగాళ దుంప, కారట్ దుంప, గ్రేప్ ఫ్రూట్, ద్రాక్ష, గజనిమ్మ, నారింజ వ్యవసాయోత్పత్తులు. రాగి, ఇనుపరాయి, జిప్సమ్, ఆస్బెస్టాస్, సైప్రస్‌లోని ఖనిజ సంపద. సిమెంటు, ద్రాక్ష సారాయి, జవుళీ, పాదరక్షలు, దుస్తులు, కలప సామగ్రి, ఆలివ్ నూనె, సిమెంటు ఈ దేశంలోని ముఖ్యమైన పరిశ్రమలు. ప్రాచీనశిల్ప కళాఖండాలు విపరీతంగా గల సైప్రస్ ఆరోగ్యవంతమైన వాతావరణం కలిగి , వినోద పర్యాటకుల్ని ఆకర్షిస్తూ ఉంటుంది.

## సైబీరియా

రష్యాలో తూర్పున ఆసియాలో, యూరల్ పర్వతశ్రేణి నుండి బేరింగ్ జలసంధి వరకూ వ్యాపించి ఉన్న ప్రాంతాన్ని సైబీరియా అని పిలుస్తారు. దీనికి రాజకీయ సరిహద్దు లంటూ ఏమీ లేవు. రాజకీయంగా రష్యాలోని ఒక భాగం. ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గం వెంబడి జనవాసాలు ఉంటాయి. సైబీరియాలోని మైదానాలు అడవులతో నిండిన కీకారణ్యాలు. జనసందడి అరుదు. అతిశీతల ప్రదేశం. సైబీరియా ప్రాంతం. విస్తీర్ణం 1,09,97,000 చ.కి.మీ. సుమారు మూడు కోట్ల

మంది నివసిస్తున్నారు. అంటే జనసాంద్రత చ.కి.మీ.కి 20 మంది. నోవూసిబిరిస్క్ పశ్చిమ సైబీరియాలోను, ఇర్కుటుస్క్ తూర్పు సైబీరియాలోనూ ప్రధాన నగరాలు. పశ్చిమ సైబీరియా మైదానం యూరల్ పర్వతాల్ని ఆనుకొని అడవులు, స్టెప్పీలనబడు పచ్చిక బయళ్లతో నిండి ఉంటుంది. మధ్య సైబీరియా పీఠభూమి లీనానది వరకు విస్తరించి ఉంది. ఇందులో దక్షిణాన్ని ఆల్టాయా, సయాన్ పర్వతాలు బాయకల్ సరస్సు ఉన్నాయి. ఈ సరస్సు ఉత్తర ఆసియాలోనే (విస్తీర్ణం: 31,499 చ.కి.మీ.)పెద్దది. ప్రపంచంలో అన్నింటికంటే లోతైన సరస్సు. తూర్పు సైబీరియా మెట్ట ప్రాంతం లీనానది నుండి బేరింగ్, ఓకోటస్క్ సముద్రాల వరకు విస్తరించి ఉంది. సైబీరియాలో రైధాన్యం, ఓట్ ధాన్యం, గోధుమ పంట దినుసులు, పశుపోషణ ప్రజల జీవనాధారం. నేలబొగ్గు, ఇనుపరాయి, బంగారం, సీసం, టంగ్‌స్టన్, జింకు, వెండి, చమురు వాయువు, పెట్రోలు, తైల నిక్షేపాలు సైబీరియాలోని ఖనిజ సంపద. అనువైన చోట్ల పారిశ్రామిక ప్రగతి జరిగింది. పాడి పరిశ్రమ, గుర్రాలు, రెయిన్ డీర్, మేక పెంపకం ప్రజలు చేపడుతున్నారు. చూ.రష్యా.

## సోక్రటీసు

జగత్ప్రసిద్ధిపొందిన గ్రీక్ తత్త్వవేత్త. మహా మేధావి. సోక్రటీసు ఏథెన్స్ పట్టణంలో (క్రీ.పూ. 469) జన్మించాడు. తండ్రి సాఫోర్నికస్ శిల్పవిద్యలో ప్రవీణుడు. తల్లి ఫెనార్టీ మంత్రసాని. కొన్నాళ్ళు సోక్రటీసు తండ్రి వృత్తిని అవలంబించి సుమారు 40 సంవత్సరాల వయస్సులో సైన్యంలో ప్రవేశించి కొంతకాలం అక్కడ

సోక్రటీస్ మరణదండన (హెమ్‌లాక్ విషస్వీకరణ)



పనిచేసి పోటెడియా, డేలీయమ్, ఆంఫీపోలిస్ దండ యాత్రలలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు.

సోక్రటీసు గొప్పవక్త. అతని పల్లెటూరి వాలకం, నిరాడంబరత దేశంలో అందరికీ విడ్డూరంగా కనిపించేది. ప్లేటో, జెనోఫాన్ ఈతని శిష్యులు. ఏథెన్సు న్యాయసభలో సభ్యుడై ఉండగా ఒక నేరస్థుడికి విధించబడిన మరణదండన అక్రమమని చెప్పి ఆ తీర్పును వ్యతిరేకించాడు. ఏథెన్సు పట్టణ న్యాయపరిపాలకులలో ఒకడుగా పనిచేస్తూ ఉండగా అక్రమంగా కొన్ని నిర్బంధాలు జరపడానికి సోక్రటీసును నియోగించారు. తాను ఆపని చేయకపోతే తన ప్రాణం మీదికి వచ్చే అవకాశం ఉందని తెలిసికూడా సోక్రటీసు అక్రమమైన ఆ నిర్బంధాలు చేయడానికి నిరాకరించాడు. ఆయన యథార్థ వాదిగా ఉండుటవలననే అనేకులకు ఆయన శత్రువయాడు. 70 ఏట క్రీ.పూ. 399లో సోక్రటీసు మీద రెండు నేరాలు మోపి ఆయనకు మరణదండన విధించారు. న్యాయస్థానాలలో తన నిర్దోషిత్వాని నిరూపించుకొనేందుకు మరణ దండనకు బదులు మరేదైనా శిక్ష విధించమని అర్థించడానికి గానీ జైలునుంచి ఒకరాత్రి వేళ తప్పించుకొని దేశాంతరం వెళ్ళిపొమ్మని చెప్పిన స్నేహితుల సలహాను పాటించడానికిగాని ఆయన అంగీకరించలేదు. న్యాయస్థానం తీర్పుకు లోబడడమే ధర్మంఅని ఆయన అన్నాడు. కొద్ది సేపట్లో శిక్ష అమలు జరుగుతుందనగా కూడా నిశ్చలంగా నిర్విరామంగా తనను చూడవచ్చిన వారితో మాట్లాడారు. మరణదండితులకిచ్చే 'హెమ్‌లాక్' విషపాత్రను చేత బట్టుకొని ఎలాంటి తడబాటు లేకుండా గడగడ త్రాగి వేసి సోక్రటీసు కీర్తిశేషుడయాడు. ఆయన శిష్యులు ప్లేటో, జెనోఫాన్‌లతో జరిపిన సంభాషణలే మనకు నేడు లభిస్తున్నాయి.

## సోమనాథుడు, పాల్కురికి

సుప్రసిద్ధ శైవకవి. బహు భాషా పండితుడు. తెలుగులో తొలి ద్విపద కావ్యకర్త. తెలంగాణాలోని 'పాల్కురికి' గ్రామంలో సోమనాథుడు జన్మించాడు. ఈయన రచించిన 'పండితారాధ్య చరిత్రం', 'బసవ పురాణం' అనే ద్విపద కావ్యాలు తెలుగులో ప్రసిద్ధి పొంది, వీర శైవులకు పారాయణ గ్రంథాలు అయ్యాయి. సోమనాథుడు రచించిన 'బసవోదాహరణం' ఉదాహరణ

కావ్య ప్రక్రియకు తొలి ఉదాహరణగా భావించబడు తూంది. సోమన రచించిన 'వృషాధిప శతకం'లో ఆయన బహు భాషా పాండిత్యం వ్యక్తం అవుతూంది. తెలుగు భక్తి శతకాలలో 'వృషాధిప శతకం' ముఖ్యమైనది. అక్షరాంక గద్యం, అక్షరాంక పద్యాలు, నమస్కార గద్య, పంచ ప్రకార గద్య, అష్టోత్తర శతనామ గద్య, శరణు బసవ గద్య, పంచరత్నాలు, బసవాష్టకం సోమనాథుడు బసవేశ్వరుని మీద చెప్పిన స్తుతి ప్రబంధాలు. 'సద్గురు రగడ'ను సోమన కన్నడ భాషలో రచించినట్లు తెలుస్తూంది. ఇవికాక సోమన కృతులలో ప్రధానంగా పేర్కొనదగినవి: అనుభవసారం, చతుర్వేద సారం, వీటిలో భక్తిమార్గం చక్కగా ప్రతిపాదించబడింది. సంస్కృతంలో కూడా ఈయన 'సోమనాథ భాష్యం' అనే 25 ప్రకరణాల మహాగ్రంథం రచించాడు. దీనికి 'వీర మహేశ్వర సారోద్ధారం' అని ఇంకొక పేరు. సోమనాథుని 'చెన్నమల్లు సీసములు' అనే 32 సీసపద్యాల కృతిలో పలు ఆధ్యాత్మిక రహస్యాలు వివరించబడ్డాయి.

## సోమాలియా

ఆఫ్రికాలో తూర్పుతీరాన హిందూ మహాసము ద్రాన్ని ఆనుకొనియున్న స్వతంత్ర గణరాజ్యం. 'జమ్హూరీ యద్దా డిమూక్రాదిగా సూమాలియా' అని దీనికి అధికారనామం. ఒకప్పటి ఇటలీ, బ్రిటన్ వలస ప్రాంతాల్ని కలపగా 1960లో స్వతంత్ర సోమాలియా రూపొందింది.

విస్తీర్ణం: 6,37,000 చ.కి.మీ.; జనాభా: 63, 34,000 (1988), రాజధాని: మొగదిషూ; అధికార భాష: సోమాలియా. నీగ్రో జాతికి చెందిన సోమాలీ తెగ 98 శాతం. బంటూ, అరబ్బు తెగలవారు కూడా ఉన్నారు. ప్రజలు ఇస్లాం మతస్థులు. దేశదిమ్మరులు. ఒంటె, గొర్రె, మేక మందలను మేపుకుంటూ జీవయాత్ర సాగిస్తూ ఉంటారు. స్కెబిలీనది, గియిబా నది, షెబాలేనది ప్రధానమైన నీటివనరులు. దక్షిణాన్ని వెబీషెబెల్ జూబా ప్రాంతాల్లో తోటపంటలు ఎక్కువ. రైతాంగబలం లేక సేద్యం అంతగా అభివృద్ధి కాలేదు. పంటనీరు లభించే లోయలలో అరటిపండ్లు, జొన్న, చిరుధాన్యాలు, కూరగాయలు,నువ్వులు,కందమూలాలు, మొక్క జొన్న, వరి, నిమ్మజాతి పండ్లు, చెరకు పండిస్తారు. ఇనుపరాయి, జిప్సమ్ ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. ఆహార పదార్థాలు, పాదరక్షలు, పెట్రోల్ ఉత్పత్తులు పేర్కొనదగిన పరిశ్రమలు. పొరుగున ఉన్న ఎతియోపియా నుండి ఇటీవల చాలమంది కాందశీకులు సోమాలియాకు వచ్చారు. (1988).

## సోలమన్ దీవులు

పసిఫిక్ మహా సముద్రంలో నైరృతి మూలలో పాపువా—గినీకి తూర్పుగా ఉన్న ద్వీపరాజ్యం. అగ్నిపర్వ తాలు ఎక్కువ. ఒకప్పుడు బ్రిటిషు రక్షిత దేశంగాఉన్న సోలమన్ ద్వీపరాజ్యం 1978లో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించుకుంది.

విస్తీర్ణం: 28,370 చ.కి.మీ.; జనాభా: 3,01, 000 (1988); రాజధాని: హూనియారా; అధికార భాష: ఇంగ్లీషు. ప్రజలలో 94 శాతం మెలనీషియన్‌లు, 4 శాతం పాలినీషియన్‌లు, మిగతావారు పసిఫిక్ ద్వీప వాసులు, ఆసియావాసులు, యూరపియన్‌లు. ఎక్కువమంది (75 శాతం) దేశద్రిమ్మర్లు. 97 శాతం క్రైస్తవం పాటిస్తున్నారు. కొబ్బరి, చిరుగడం, టారో దుంపలు, కందమూలములు, పామ్ నూనె గింజలు, వరి, కోకో ప్రధానమైన పంట దినుసులు. పశుపోషణ ఉంది. కలప లభిస్తూంది.చేపలను వేటాడతారు.

## సౌదీ అరేబియా

పశ్చిమ ఆసియాలోని పెద్ద దేశం. దీనిని రాజవంశీయులు పాలిస్తున్నారు. ఆల్ మామ్లు ఖాహ్— ఆల్—అరాబియాహ్—అస్—సా ఉదీయాహ్' అని దీనికి



అధికార నామం కలదు. ఇది ఎడారి దేశం. పర్వతాలు, పీఠభూములు, కొండలు, మిట్టలతో కూడిన మైదానాలు ఈ దేశం అంతా కమ్మి ఉన్నాయి. పరిపాలించే రాజుల వంశం పేరు ఆల్—సౌద్.

విస్తీర్ణం: 22,40,000 చ.కి.మీ.; జనాభా: 1,29, 72,000 (1988); రాజధాని: రియద్. జిడ్డా, మెక్కా, మెదీనా, అల్‌తయిఫ్ ఇతర పట్టణాలు. అధికార భాష: అరబ్బీ. ప్రజలు సున్నీ సంప్రదాయపు ముస్లిములు 99 శాతం. క్రైస్తవులు 1 శాతం కంటే తక్కువ. ప్రజలలో 82 శాతం సౌదీలు. యెమినీలు 10 శాతం, ఇతర అరబ్బు జాతులు 3 శాతం. ఎడారి అయిన సౌదీ అరేబియాలో జల సంపద పూజ్యం. నదులు, సరస్సులు, తటాకాలుగాని లేవు. వడీ అను అగాధమైన లోయలు కానవస్తాయి. వర్షం పడినప్పుడు నీరు లోయలలో చేరుతుంది. పచ్చపట్టులు (ఒయాసిస్‌లు)ఉన్నచోట ఆహార ధాన్యాలు కొద్దిగా పండుతాయి. గోధుమ, బార్లీ, ఆల్ఫాల్ఫా చిరుధాన్యాలు, ఖర్జూరం, ఉల్లి, గుమ్మడి జాతులు, అపరాలు, పండ్లు కొద్దిగా పండుతాయి. సౌదీ అరేబియాలో పెట్రోలు నిక్షేపాలు పుష్కలం. పెట్రోలు ఉత్పత్తివల్ల దేశం సుసంపన్నమైంది. ముత్యాలు లభిస్తాయి. కాడ్, మేకరిల్ అను చేపలు ఎర్ర సముద్రం (రెడ్‌సీ), పర్షియన్ సింధు శాఖ తీర ప్రాంతాల్లో దొరుకుతాయి. అరేబియా మేలయిన అశ్వజాతికి ప్రపంచ ప్రసిద్ధి. ఒంటెలను గాడిదలను, గొర్రెలను పెంచడం ప్రజలకు బ్రతుకు తెరువు. ప్రపంచంలోని ముస్లిములందరికీ పుణ్యక్షేత్రమైన మెక్కా (చూ.) మెదీనా పవిత్ర పుణ్యక్షేత్రాలు సౌదీ అరేబియాలోనే ఉన్నాయి. హాజీ యాత్రకై ప్రపంచం అన్నివైపుల నుండి ముస్లిము యాత్రికులు వస్తూ ఉంటారు.

## స్పీకర్

చూ. సభాపతి

## స్పెయిన్

పశ్చిమ యూరప్‌లో రష్యా, ఫ్రాన్స్ తరువాత యూరప్‌లో పెద్దదిగా మూడవస్థానం ఆక్రమిస్తుంది. 'రీనోడీ ఎస్పానా' అని స్పెయిన్‌కు అధికార నామం. రాజ్యాంగానికి లోబడి రాజవంశీయులు పాలిస్తున్న రాజ్యం. కొన్నాళ్లు ఫ్రాంకో నియంత (1930–75) పాలనలో ఉండేది. స్పెనిషువారు ప్రసిద్ధి చెందిన సాహసోపేతమయిన నావికులు. అమెరికా ప్రాంతంలో కాలుబెట్టిన మొదటి యూరపియన్ కొలంబస్ (చూ.) స్పెయిన్ వాసి. 'మెటడార్' అనబడే గిత్తలతో పోరాట క్రీడకు స్పెయిన్ పేరొందింది.




విస్తీర్ణం: 5,04,783 చ.కి.మీ.; జనాభా: 3,89, 96,000(1988); రాజధాని: మాడ్రిడ్. బార్సిలోనా, వేలెన్షియా, సెవిల్లా, జారాగోజా ఇతర ప్రధాన పట్టణాలు. అధికారభాష: స్పెనిష్. ప్రజలలో రోమన్ కేతలిక్కులు 97 శాతం. ప్రజలలో ఎక్కువమంది స్పెనిష్ జాతులు, కాటాలిన్ గాలీషియన్ బాస్క్ తెగల వారున్నారు. మెసెతా పెద్ద పీఠభూమి. మైదానాలూ మధ్యమధ్య కొండలూ ఉంటాయి. ప్రధానమైన నది టాగస్ పశ్చిమానికి 900 కి.మీ. ప్రవహించి పోర్చుగల్ ప్రవేశించి ఉత్తర అట్లాంటిక్‌లో సంగమిస్తుంది. గ్వాడల్ క్వివిర్ నది 640 కి.మీ. ప్రవహించి అట్లాంటిక్‌లో కలుస్తుంది. ఇంకను చిన్న నదులు నీటి వనరులు ఉన్నాయి. స్పెయిన్ 1950కి పూర్వం ఆర్థికాభివృద్ధికి నోచుకొనలేదు. ఆ తరువాత పారిశ్రామిక ప్రగతి సాధించింది. ఆలివ్, నారింజ, సారాయికి పనికివచ్చే ద్రాక్ష, గోధుమ ప్రధానమైన పంటలు. ఇతర పంట దినుసులలో బార్లీ గజనిమ్మ, ఉల్లి, మొక్కజొన్న, నారింజ, బార్లీ, రైధాన్యం, బీటు (పంచదార) దుంప, బంగాళదుంప, గోధుమ పేర్కొనదగినవి. కాంటాబ్రియన్ పర్వతాల్లో నాణ్యమైన ఇనుప ఖనిజం, నాసిరకం నేలబొగ్గు, రాగి, పాదరసం, పొటాషు, సీసం, జింకు, పైరిటీస్, టైటేనియం, మాంగనీసు లభిస్తాయి. మోటారు కార్లు తయారీ, నౌకా నిర్మాణాలకు స్పెయిన్ ప్రసిద్ధి. చమురు వాయువు, పెట్రోల్ ఉత్పత్తులు, సిమెంటు, రాసాయనిక ద్రవ్యాలు, దుస్తులు, పానీయాలు, ఉక్కు, పాదరక్షలు, ఫర్నిచర్, రవాణా వాహనాలు, విద్యుత్ యంత్రాలు ఇతర పరిశ్రమలలో పేర్కొనదగినవి. స్పెయిన్ ఆర్థిక వ్యవస్థలో వినోద పర్యటన పరిశ్రమ ప్రముఖపాత్ర వహిస్తూంది. తీరప్రాం

తాల్లో (కోస్టాబ్రావా) యాత్రిక సౌకర్యాలు ఉన్నాయి. రాజసౌధాలు, గిత్తలతో పోరాటం (మెటడార్) వైభవంగా జరుపుకునే సాంస్కృతిక సంబరాలు విదేశీ యాత్రికుల్ని విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ధరలు ఆర్థికంగా అందరికి అందుబాటులో ఉంటాయి.

## స్వాజీలాండ్

మూడువైపుల దక్షిణాఫ్రికా సరిహద్దుగా ఉన్న స్వాజీలాండ్‌ను రాజవంశీయులు పాలిస్తున్నారు. నాలుగో వైపు తూర్పున మొజాంబిక్ ఉంది. స్వాజీలాండ్‌కు సాధికారిక నామం 'ఉమ్బ్యాసో వెస్వాతిని'. బ్రిటిషు రక్షిత రాజ్యంగా ఉన్న ఈదేశం 1968లో స్వాతంత్ర్యం సాధించుకుంది. విస్తీర్ణం: 17,364 చ.కి.మీ.; జనాభా: 7,16,000 (1988); రాజధాని: మ్బాబేనే; అధికార భాష: స్వాజీ, ఇంగ్లీషు. ప్రజలు స్వాజీ ఆదిమ తెగకు చెందినవారు 84 శాతం, జూలూ తెగ 10 శాతం, త్సొంగాతెగ 3 శాతం. వీరుగాక భారతీయులు, యూరపియన్‌లు కొద్దిగా ఉన్నారు. 77 శాతం క్రైస్తవం పాటిస్తుండగా మిగతావారు ఆదిమ సంప్రదాయ మత విశ్వాసాలను పాటిస్తున్నారు.

చెరకు ప్రధానమైన పంట. మొక్కజొన్న, నారింజ జాతులు, కందమూలాలు, ప్రత్తి, అపరాలు ఇతరములైన పంట దినుసులు. పశుపోషణ, కోళ్ళు, గొర్రె, మేక, పంది పెంపకం సాగుతూంది కలప లభిస్తుంది. విలువయిన వజ్రాలు, ఆస్బెస్టాస్ ఖనిజోత్పత్తులు. ఇనుపరాయి ఎగుమతి అవుతున్నది. కాగితం, రాసాయనిక ద్రవ్యాలు, ఆహార పానీయాలు, కర్ర సామగ్రి, ధాతు సామగ్రి, జవుళీ పేర్కొనదగిన పరిశ్రమలు.

## స్వాతంత్ర్య దినోత్సవం

చూ. జాతీయ పండుగలు

## స్వామిరామతీర్థ 1873–1905

ఆధునిక యుగంలో హిందూమత విశిష్టతను ప్రపంచానికి చాటిన ప్రముఖుడు. అసలుపేరు తీర్థ రాముడు. సన్యసించిన తరువాత స్వామి రామతీర్థ అయ్యారు. 1873 అక్టోబరు 22న పంజాబు రాష్ట్రంలో మురళీవాలాలో జన్మించారు. చిన్నతనంలోనే ఆయన హృదయంలో భక్తిబీజాలు నాటుకున్నాయి. కటిక దారిద్ర్యంతో బాధపడుతూనే విద్యాభ్యాసం పూర్తిచేసి ప్రాక్‌పశ్చిమ శాస్త్రాలన్నిటిలో ప్రావీణ్యం సంపాదించారు. ఒక అమెరికన్ పాఠశాలలో అధ్యాపకులయ్యారు. 10వ ఏటనే తండ్రి ఆయనకు వివాహం చేశాడు. భార్య ఉత్తమురాలు. వేసవి సెలవులలో ఏకాంత ధ్యానానికి ఆయన హరిద్వారంలోనూ, హృషీకేశ్‌లోనూ గడిపే వారు. హిందూ ధర్మ ప్రచారం నిమిత్తం ఆయన జపాన్, అమెరికా దేశాలలో పర్యటించారు. రామతీర్థకు ప్రతి జీవి దైవ స్వరూపమే. సంఘం లోని అట్టడుగు వారిని కూడా ఆయన ఆత్మస్వరూపులుగా భావించేవారు. ఆయన గొప్ప వక్త. కాలిఫోర్నియా యూనివర్శిటీ ఆయనకు 'మహా పండితు'డనే బిరుదు ప్రదానం చేయగా ఆయన దానిని స్వీకరించడానికి ఇష్టపడలేదు. 1905లో స్వామి రామతీర్థ విదేశాలనుంచి భారత దేశం తిరిగివచ్చి ఒకనాడు గంగాస్నానానికి వెళ్ళి కంఠంలోతు నీటిలోదిగి శరీర స్మృతిలేని సమాధిస్థితిలోకి వెళ్ళి జలసమాధి అయ్యారు.

## స్వామి రామానంద తీర్థ 1903–72

స్వాతంత్ర్య సమరయోధుడు. అసలుపేరు వెంకటరావు ఖేడ్గికర్. గాంధీజీ అనుచరుడు. హైదరాబాదులో ప్రముఖ విద్యావేత్తగా కీర్తినార్జించాడు. ఝువర్గీ (గులబర్గా)లో 1903 అక్టోబరు 3న ఈయన జన్మించాడు. 'ప్రజాస్వామ్యం దాని క్రమాభివృద్ధి' అన్న వ్యాసం వ్రాసి పూణే యూనివర్శిటీలో ఎమ్.ఏ., పట్టాని అందు కున్నాడు. 'విద్వత్ సన్యాసం' అనే పద్ధతి ప్రకారం సన్యాస దీక్ష (1932)ను స్వీకరించాడు. తరువాత రాజకీయ రంగంలో (1938) ప్రవేశించి నిషేధాజ్ఞలకు నిరసనగా సత్యాగ్రహం చేయగా ఆయనను అరెస్టు చేసి చిన్న చీకటి గదిలో నిర్బంధించారు. 1942–50 మధ్య హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులయ్యాడు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అరెస్టయి 1943, డిసెంబరులో విడుదల అయ్యాడు. మరల 1948 నిర్బంధితుడై 'పోలీసు చర్య (1948)' అనంతరం విడుదలయ్యాడు. 1952 నుండి 1962 వరకు రాష్ట్ర కాంగ్రెసులో

నాయకుడుగా కొనసాగాడు. 1962 నుండి రాజకీయా లకు దూరంగా ఉన్నారు. తోటపల్లి కొండలలో శాంతి ఆశ్రమంలో విద్యాగోష్ఠి, శిక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తూ 1972 జనవరి 22న హైదరాబాదులో సిద్ధి పొందాడు.

## స్వామివివేకకానంద 1863–1902

రామకృష్ణ పరమహంసకు ప్రధానశిష్యుడు. ఆధు నికకాలంలో హిందూ మతప్రాశస్త్యాన్ని జగత్తుకుచాటిన ప్రవక్త. 1863 జనవరి 12న కలకత్తాలో వివేకానందుడు



జన్మించాడు. తల్లి భువనేశ్వ రీదేవి, తండ్రి విశ్వనాథ దత్తు. వివేకానందుని అసలు పేరు నరేంద్రనాథదత్తు. కళాశాలలో చదివేటప్పుడు పాశ్చాత్య తత్వశాస్త్రం పట్ల ఎక్కువ ఆసక్తి ప్రదర్శిం చాడు. దక్షిణేశ్వరంలో రామ కృష్ణ పరమహంస (చూ.) సందర్శనంతో నరేంద్రుని జీవన విధానం మారిపో యింది. 1886లో రామ కృష్ణుని నిర్యాణం తర్వాత సన్యాసం స్వీకరించి రామకృష్ణుని బోధనలను ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం చేయడానికి పూనుకున్నాడు. వివేకా నందుడు హిమాలయాలకు వెళ్ళి ఏకాంత ధ్యాన నిష్ఠలో 6 ఏళ్లు గడిపాడు. టిబెట్టు సందర్శించి బౌద్ధధర్మాన్ని ఆకళింపు చేసుకున్నాడు. భారతదేశం అంతటా పర్య టించాడు. 1893లో చికాగోలో ప్రపంచమత మహాసభకు హిందూ ధర్మ ప్రతినిధిగా వెళ్ళాడు. ఉపన్యాసమిచ్చి శ్రోతల మనస్సులను ఉర్రూతలూగించాడు. 1896లో ఇంగ్లాండ్ వెళ్ళి అక్కడ ఉపన్యాసాలిచ్చాడు. స్వదేశానికి తిరిగి వచ్చి, 1899లో మళ్ళీ ఇంగ్లాండ్, అమెరికా దేశాలకు వెళ్లి ఉపన్యాసా లిచ్చాడు. ఈ రెండు దేశాలలోను వివేకా నందుని శిష్యకోటి అపారంగా పెరిగింది. శాన్‌ఫ్రాన్సిస్కోలో వేదాంతసమితిని, 'శాంతి' ఆశ్రమాన్ని స్థాపించాడు. హిమాలయాలలో అద్వైతాశ్రమాన్ని, కలకత్తా సమీపంలో ఒక ఆశ్రమాన్ని స్థాపించి 100 మంది బ్రహ్మచారులను పోషించే ఏర్పాటు చేశాడు. రామకృష్ణ మిషన్ అనే పేరుమీద సేవాధర్మ సంస్థను స్థాపించి 1897లో కరువు నివారణ కెంతగానో పాటుపడ్డాడు. సాధువుల సేవకే సేవాశ్రమం. పేద విద్యార్థుల పోషణకూ, అధ్యయనానికి పాఠశాలలను రామకృష్ణుని పేర వివేకనందస్వామి స్థాపించాడు. 1902లో కలకత్తా వద్దగల బేలూరు మఠంలో వివేకానందస్వామి పరమ పదించాడు.

## స్వీడెన్

యూరప్‌లో ఉత్తరమున ఉన్న సంపన్నదేశం. సోవియట్ రష్యా, ఫ్రాన్స్, స్పెయిన్ తరువాత నాలుగవ పెద్దదేశం. క్రీ.శ. 1434నుండి రాజవంశీయులు పాలిస్తున్న దేశం. ఒక రాజ్యాంగానికి లోబడి పరిపాలన సాగుతోంది. స్వీడిష్ భాషలో 'కొనుంగారికెట్ స్వెరిగే' అని ఈ దేశానికి పేరు. ఉత్తరాన ఆర్కిటిక్ వలయం కమ్మి ఉంది. దక్షిణాన, తూర్పున బాల్టిక్ సముద్రం, పశ్చిమాన నార్వేదేశం సరిహద్దులుగా ఉన్నాయి.

విస్తీర్ణం: 4,49,732 చ.కి.మీ.; జనాభా: 84, 15,080 (1988); రాజధాని: స్టాక్‌హోమ్, అధికార భాష: స్వీడిష్. ప్రజలు నార్డిక్ జాతికి చెందినవారు. క్రైస్తవం పాటిస్తారు. గోటెబర్గ్, మాల్మో, ఉప్సలా, ఓరెబ్రో, నోర్కోపింగ్ ఇతర ప్రధాన పట్టణాలు. నార్వేను స్వీడెన్ నుండి స్కాండినేవియా పర్వతశ్రేణి వేరుపరు స్తోంది. కొనిఫెరస్ అడవుల సంపద మెండుగాగల దేశం. జలవిద్యుత్తు పుష్కలం. రాగి, సీసం, బంగారం, జింకు, ఇనుపరాయి, యురే నియం ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. యంత్రపు పని ముట్లకు ఆవశ్యకమగు ఒక రకం ప్రత్యేకమైన ఉక్కుకు స్వీడెన్ ప్రసిద్ధి చెందింది. ప్రపంచంలో కలప, కలప గుజ్జు, కాగితంతయారీలో అ గ్రస్థానం వహిస్తూంది. ఫిర్, పైన్, స్ప్రూస్ వృక్షజాతులు ఎక్కువ. హిమనదులు, తటా కాలు, సరస్సులు చాలా



ఉన్నాయి. అయితే అతి శీతల ప్రాంతమవడంవల్ల నేల సాగుకు లాయఖుకాదు. అయినా దేశానికి కావల్సిన ఆహార పంటలయిన బార్లీ, ఓట్ ధాన్యం, రైధాన్యం, బంగాళ దుంపలు, బీటు (పంచదార) దుంప, గోధుమ సాగుచేసి పండిస్తున్నారు. పాడిపరిశ్రమ, పశుపోషణ (ఆవులు, పందులు) జోరుగా సాగుతున్నవి. కాడ్‌చేప, హెర్రింగ్, మెకెరెల్, సాల్మన్ చేపలు లభిస్తున్నాయి. అత్యధిక పారిశ్రామికాభ్యుదయం చెందిన దేశం స్వీడెన్. విమానములు, మోటారుకార్లు, సేద్యపు పనిముట్లు, బాల్ బేరింగులు, విద్యుత్తు యంత్ర సామగ్రి, డీజెలు యంత్రాలు, ఎరువులు, సునిశిత పరికరాలు, అగ్గిపుల్లలు, గాజు, కాగితంలో అనేక రకాలు, న్యూస్‌ప్రింటు, నౌకా నిర్మాణం, ఉక్కు సామగ్రి, టెలిఫోన్‌లు, జవులీ, విదారక ద్రవ్యాలు, ప్లాస్టిక్, ప్లైవుడ్, కలప సామగ్రివంటి అనేక ఎగుమతి పరిశ్రమలు స్వీడెన్‌లో ఉన్నాయి. సుప్రసిద్ధ నోబెల్ బహుమానం (చూ.) ప్రతిష్ఠించిన రాబర్ట్ నోబెల్ స్వీడెన్ దేశీయుడే.

## హంగేరీ

మధ్యయూరప్‌లోని సోషలిస్టు గణ రాజ్యం. కమ్యూనిస్టు సిద్ధాంతాలకు కట్టుబడి పరిపాలింప బడుతూంది. హంగేరీని దేశభాష అయిన మాగ్యార్ భాషలో 'మాగ్యార్ నెప్కొజ్తార్యాసాగ్' అంటారు.

విస్తీర్ణం: 93,031 చ.కి.మీ.; జనాభా: 1,05,91,000 (1988); రాజధాని: బుడాపెస్ట్; అధికార భాష: మాగ్యార్. ప్రజలు మాగ్యార్, ఫిన్నిష్–ఉగ్రిక్, టర్కిష్ జాతులకు చెందినవారు. క్రైస్తవం పాటిస్తున్నారు. రోమన్ కేథలిక్కులు ఎక్కువ. నాస్తికులు 7 శాతం, ఏ మతానికీ సంబందించని వారు 9 శాతం. హంగేరీ జానపదుల సంగీతం వినసొంపుగా ఉంటుంది. డాన్యూబ్ నది, తిస్జానది ప్రధాననదులు. మైదానాలు సారవంతమైనవి. బాలాటన్ సరస్సు ప్రాంతం ద్రాక్షకు ప్రసిద్ధి. బార్లీ మొక్కజొన్న, రైధాన్యం, ఓట్ ధాన్యం, బీటు(పంచదార)దుంప, ఉల్లి, పండ్లు, బంగాళ దుంపలు, పొద్దు




తిరుగుడు, గోధుమ ప్రధానమైన వ్యవసాయోత్పత్తులు. పశుపోషణ, పందుల పెంపకం, గొర్రెల పెంపకం, కోళ్ల పెంపకం సాగుతున్నాయి. చేపల పరిశ్రమ ఉంది. బాక్సైట్, యురేనియమ్, మాంగనీసు, నేలబొగ్గు, ఇనుపరాయి, లిగ్నైట్, డోలమైట్, చమురు వాయువు, పెట్రోలు ఖనిజ నిక్షేపాలు హంగేరీలో ఉన్నాయి. సిమెంటు, రసాయనిక ద్రవ్యాలు, ధాతు సామగ్రి, ఆహార పదార్థాలు, దుస్తులు, మోటారు కార్లు, తోలు సామగ్రి, యంత్ర సామగ్రి తయారీ ప్రముఖమైన పరిశ్రమలు.

## హంపీ

విజయనగర సామ్రాజ్య శిథిలాలుగల ప్రాంగణం. క్రీ.శ. 1330లో తుంగభద్ర నదీతీరాన ఈ పట్టణం వెలిసింది. రాతితో చెక్కిన కాలువల ద్వారా పట్టణానికి నీటివసతి సమకూర్చారు. వేల సంఖ్యలో ఏనుగులు, గుర్రాలు నిలిచేందుకు సువిశాలమైన శాలలు నిర్మించ బడ్డాయి. కోటగోడలు దుర్భేద్యంగా ఉండి మూలలలో ఎత్తయిన బురుజులు గోపురాలు ఉండేవి. ఇక్కడ ముఖ్యంగా చూడదగింది ఏకశిలా విగ్రహం. సుమారు 7 మీటరుల ఉగ్ర నృసింహస్వామి విగ్రహం. హంపీరథం ఒకే శిలతో మలచబడింది. ఒకప్పుడు దేవేంద్ర వైభవం అనుభవించిన ఈ విజయనగర పట్టణం 1565లో విజయ నగర సామ్రాజ్యం శత్రువులచే జయింపబడడంతో సర్వనాశనం చేయబడింది. హంపీ గత వైభవాన్ని గూర్చి న్యూనిజ్ (చూ)తన యాత్రా చరిత్రలో వ్రాశాడు.


హంపీ శిథిలాలు

## హనుమంతుడు
చూ. ఆంజనేయుడు

## హనుమంతరావు, మాడపాటి

ఆంధ్రపితామహుడని బిరుదుపొందిన ప్రజా నాయకుడు. నాటి నిజాన్ రాజ్యంలో వున్న తెలుగు వారిలో జాగృతిని కలిగించి వారి సామాజిక, సాంస్కృతిక రాజకీయ వికాసానికై నిరంతం కృషి చేసిన ప్రముఖుడు. బహుభాషా పండితుడు. కృష్ణాజిల్లా నొక్కనూరు గ్రామంలో 1885 జనవరి 22న హనుమంతరావు జన్మించారు. తెలంగాణంలో ఆంధ్రోద్యమవ్యాప్తికి ఆయన



మూల పురుషుడు. హనుమకొండలోని 'రాజరాజనరేంద్ర ఆంధ్ర గ్రంథాలయం' హైదరాబాదులోని 'శ్రీకృష్ణదేవ రాయాంధ్ర భాషానిలయం' అభివృద్ధికై ఆయన చేసిన కృషి అపారం. ఆంధ్రజన సంఘము, ఆంధ్రమహాసభ, నిజాం రాష్ట్రాంధ్ర జనకేంద్ర సంఘం మొదలైన సంస్థలను స్థాపించి వార్షికమహాసభలను, వాటితోబాటుగా మహిళా సభలను నిర్వహించి తెలంగాణా ఆంధ్రులలో జాగృతిని, రాజకీయ చైతన్యాన్ని కలిగించారు. స్త్రీ విద్య పట్ల అత్యంతాభిమానం గలవారు. హరిజనాభ్యుదయానికై ఆయన కృషి చేశారు. 'తెలంగాణా, ముషీర్‌దక్కన్ పత్రికలకు సంపాదకీయాలువ్రాశారు. బంకించంద్రఛటర్జీ వ్రాసిన 'ఆనందమఠ్' అను ప్రసిద్ధ నవలను తెనిగించారు. ఆయన తెలుగు, ఉర్దూ, పారసీకం, ఇంగ్లీషు భాషలలో పండితుడు. మంచివక్త. రచయిత. హైదరాబాదు నగరపురపాలక సంఘపు తొలి అధ్యక్షుడు (మేయరు)గా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ విధానమండలికి ఆయనయే తొలి అధ్య క్షుడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం 'డాక్టరేట్', భారత ప్రభుత్వం 'పద్మభూషణ' బిరుదులనిచ్చి సత్కరించాయి. 1970 నవంబరు 11న హనుమంత రావు పరలోక గతులైనారు.

## హనుమంతు, కన్నెగంటి

బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాడిన ఆంధ్ర యోధుడు. కన్నెగంటి హనుమంతు గుంటూరు మండలంలోని పల్నాటిసీమకు చెందినవాడు. పల్నాడు రాళ్ళమయమై వ్యవసాయానికి అనువుగా ఉండనందున అక్కడి ప్రజలు కటిక దరిద్రంతో మ్రగ్గుతూ ఉండేవారు. అక్కడి అడవులలో మేకలను, గొర్రెలను మేపుకుంటూ జీవనం సాగిస్తూ ఉంటారు. బ్రిటిష్ ప్రభుత్వం అడవిలో మేకలను మేపుకొనడంపై ఆంక్ష విధించింది. అందుకు అడవి పుల్లరి (సుంకం) చెల్లించాలని శాసనం చేసింది. సుంకం చెల్లించకుండా మేపితే ఆ పశువులను బందెల దొడ్లకు తరలించడం, జప్తుచేయడం వంటి పనులకు దిగేది. ప్రజలు చాలా ఇబ్బందులకు గురి అయ్యేవారు. ఉన్నవ లక్ష్మీ నారాయణ, మాడభూషి వేదాంత నరసింహాచారి వంటి పెద్దల నాయకత్వంలో ఈ కఠిన శాసనాలను రద్దు చేయాలని కోరుతూ ప్రజలు గుంటూరు జిల్లా కలెక్టరుకు మహజరు పెట్టుకున్నారు. అయినా ఫలితం లేకపోయింది. పైగా నాయకులను అరెస్టు చేసి ఒక సంవత్సరం జైలుశిక్ష విధించారు. దానితో ప్రజలు రెచ్చిపోయి పన్నుల నిరాకరణోద్య మం ప్రారంభించి, పుల్లరి (సుంకం) కట్టకుండానే అడవులలో పశువులను మేపుకు రాసాగారు. ఆ పశువులను అటవీశాఖ ఉద్యోగులు స్వాధీనం చేసుకోగా ప్రజలు తిరగబడి వాటిని విడిపించే వారు. ఈ ఉద్యమం మరింత తీవ్రమై ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య 1921 ఫిబ్రవరి 16న మంచాల పాడులో తీవ్రమైన సంఘర్షణకు దారితీసింది. దీనికి నాయకత్వం వహించినవాడు కన్నెగంటి హనుమంతు. గుంపును చెదరగొట్టడానికి ప్రజలపై పోలీసులు కాల్పులు జరిపారు. ధైర్యంగా ప్రజలముందుకు వచ్చి నిలబడ్డాడు హనుమంతు. పోలీసులు హనుమంతుని కాల్చి చంపారు. ఆ కాల్పులలో మరో ఇద్దరు కూడా చనిపోయారు. ఈ ఉద్యమం ఆంధ్రదేశం స్వాతంత్రోద్యమ చరిత్రలో ఒక ఉజ్జ్వల ఘట్టం.

## హయిటీ

కారిబియన్ సముద్రంలో హిస్పానియోలా దీవిలో పశ్చిమభాగం హయిటీ. ఒకప్పుడు ఫ్రెంచి వలసరాజ్యం. 1804లో స్వతంత్ర గణరాజ్యమైంది. విస్తీర్ణం: 27, 400 చ.కి.మీ.; జనాభా: 54,51,000 (1988); రాజధాని: పోర్ట్–ఔ–ప్రిన్స్. అధికార భాష: ఫ్రెంచ్.

ప్రజలు క్రియోలీ మాండలిక భాష మాట్లాడతారు. ఎక్కువమంది నీగ్రోలు (95 శాతం), ములత్తోతెగ 5 శాతం ఉన్నారు. ఫ్రెంచివారు బానిసలతో సంకరమైన జాతులవారిని ములత్తోతెగ అంటారు. క్రైస్తవం (96



శాతం), రోమన్ కేతలిక్కులు ఎక్కువ (80 శాతం). వూడూ అనే ఆదిమ మత విశ్వాసాల్ని పాటిస్తారు. ఆర్టిబొనైట్ నదీలోయ ఉత్తరంవైపు విస్తరించి ఉంది. కాఫీ ప్రధానమైన పంట. సిసాల్ నార, మామిడి, నారింజ, అరటి, ప్రత్తి, చెరకు, కోకో, పొగాకు ఎగుమతి పంటలు. చిక్కుడు, జొన్న, చిరుగడం, మొక్కజొన్న వరిసాగు దేశావసరాలకు పరిమితమైనవి. రాగి, బాక్సైట్ ఖనిజ సంపద. పంచదార తయారీలో మిగిలిన మొలాసిస్‌నుంచి రమ్ము సారాయి వండి ఎగుమతి చేస్తున్నారు. దుస్తుల తయారీ, ఎలక్ట్రికల్ పరికరాలు, ఆటవస్తువులు, క్రీడా సామగ్రి, గ్రామఫోన్ రికార్డులు, సిగరెట్టు పరిశ్రమలు పేర్కొనదగినవి.

## హరప్పా

చూ. సింధునాగరకత

## హరిశ్చంద్రుడు

పురాణ పురుషుడు. సత్యవ్రత పరిపాలకుడు. త్రిశంకుని కుమారుడు. అయోధ్యకు రాజు. ఈయన భార్య చంద్రమతి గొప్ప సాధ్వి. కుమారుడు లోహితుడు. ఇంద్రుణ్ణి మెప్పించి హరిశ్చంద్రుడు బంగారు రథం కానుకగా పొందాడు. ఒకరోజున ఇంద్రసభలో సత్యవ్రతం పాటించేవాడు భూలోకంలో హరిశ్చంద్రుడు ఉన్నాడని వశిష్ఠుడు చెప్పగా విశ్వామిత్రుడు హరిశ్చంద్రునిచేత అసత్యం ఆడిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. తరువాత తన ప్రతిజ్ఞను నెరవేర్చుకోడం కోసం హరిశ్చంద్రుణ్ణి తాను చేస్తున్న యజ్ఞానికి ధనంకావలెనని అడుగుతాడు ఎంత ఇచ్చినను సరిపోదని ఎన్నెన్నో బాధలకు గురిచేస్తాడు. అతణ్ణి రాజ్యచ్యుతుణ్ణి చేసి భార్యాపుత్రులతో సహా అతనిని అడవులపాలు చేశాడు. తన ఋణం వసూలు చేసుకోడానికి తన శిష్యుడు నక్షత్రకుణ్ణి పంపాడు. కాశీనగరంలో తన భార్య చంద్రమతిని కౌశికుడనే ఒక బ్రాహ్మణుడికి అమ్మి హరిశ్చంద్రుడు ఆ ధనం నక్షత్రకుడికి ఇచ్చాడు. అయినా విశ్వామిత్రుడి ఋణం తీరలేదు. చివరికి హరిశ్చంద్రుడు తనను తాను వీరబాహుడనే కాటికాపరికి అమ్ముకొని విశ్వామిత్రుని అప్పుతీర్చాడు. దర్భలు తేవడానికి అడవికి వెళ్లిన లోహితుడు పాము కాటుకు మరణిస్తాడు. పుత్రుని శవం భుజాన వేసుకుని చంద్రమతి స్మశానానికిపోయి కాటికాపరి అయిన తన భర్తను కలుసుకుంటుంది. అంతలో రాజభటులు వచ్చి రాజపుత్రుణ్ణి చంపిన నేరానికి చంద్రమతిని బంధించి హరిశ్చంద్రుణ్ణి ఆమె శిరస్సు ఖండించమంటారు. సత్యవ్రత నిష్ఠుడయిన హరిశ్చంద్రుడు ఆ పనికి పూనుకోగా ఇంద్రాదులు, విశ్వామిత్రుడు ప్రత్యక్షం అవుతారు. హరిశ్చంద్రుడిచేత అసత్యం ఆడించలేకపోయానని చివరకు విశ్వామిత్రుడు ఒప్పుకుంటాడు. మహాభారతంలో హరిశ్చంద్రోపాఖ్యానం ఒక ప్రముఖ ఘట్టం.

## హరిసర్వోత్తమరావు, గాడిచెర్ల

స్వాతంత్ర్యసమరయోధుడు. రచయిత పత్రికా సంపాదకుడు. గ్రంథాలయోద్యమ ప్రముఖులలో ఒకరు. 1883 సెప్టెంబరు 14న కర్నూలులో జన్మించారు. మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో ఎమ్.ఏ., పట్టాపొంది, రాజమండ్రి ప్రభుత్వ ఉపాధ్యాయశిక్షణా కళాశాలలో అధ్యాపకుడుగా చేరారు. 1906లో బి.సి.పాల్ రాజమండ్రిలో చేసిన ఉపన్యాసం విని ప్రభావితుడై హరిసర్వోత్తమరావు 'వందేమాతరం' బ్యాడ్జిని ధరించారు. ఆ బ్యాడ్జిని తీయడానికి నిరాకరించిన హరిసర్వోత్తమరావును కళాశాల ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ కళాశాలనుండి బహిష్కరించారు. దీనితో ఆయన దేశసేవకు నడుంబిగించి కార్యరంగంలోకి దూకారు. 1908లో ఆయన నిర్వహించిన 'స్వరాజ్య' పత్రిక లోని ఒకరచనను పురస్కరించుకొని రాజద్రోహ అభియోగం బనాయించి ప్రభుత్వం ఆయనను మూడేళ్ళ కఠిన కారాగార శిక్ష విధించింది. మదరాసులోని పనివారల సంఘం, ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయపనిముట్ల ఉత్పత్తి దారుల సంఘం వంటి అనేక సంస్థలకు అధ్యక్షుడుగా ఉన్నారు. 1936 నుండి

జీవితాంతం ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి అధ్యక్షుడిగా ఉన్నారు. వయోజన విద్యాసంస్థకు గౌరవ డైరెక్టరుగా వయోజన విద్యావ్యాప్తికి చక్కని ప్రణాళికను రూపొందించడమే గాక వేల సంఖ్యలో వయోజనులకు విద్యాబోధన, శిక్షణ ఇచ్చారు. తెలుగులో వయోజన విద్యకు సంబంధించిన పుస్తకాలను తయారు చేశారు. 1960 ఫిబ్రవరి 29న ఆయన స్వర్గస్థులైరి.

## హర్యానా రాష్ట్రం

పంజాబు (చూ.) రాష్ట్రాన్ని విభజించి పునర్వ్యవస్థీకరించడంతో (1966 నవ. 1నాడు) హర్యానా రాష్ట్రం అవతరించింది. పంజాబులోని దాదాపు హిందీమాట్లాడే ప్రాంతాలన్నిటినీ ఇందులో చేర్చారు. తూర్పున ఉత్తర ప్రదేశ్, ఉత్తరాన హిమాచలప్రదేశ్, పశ్చిమాన పంజాబు, దక్షిణాన రాజస్తాన్ సరిహద్దులుగా ఉన్న హర్యానారాష్ట్రంలోకి భారత రాజధాని 'న్యూఢిల్లీ' (చూ.) ఆగ్నేయంలో చొచ్చుకుని ఉంటుంది. నైసర్గికంగా ఉత్తరాన హిమాలయా పర్వత సానవులూ దక్షిణాన ఇండో గంగామైదనాలూ ఉన్నాయి. మైదానాలు అతి సారవంతమై ఉత్తరం నుంచి దక్షిణానికి ఏటవాలు గలిగి ఉంటాయి. ఇది సముద్ర మట్టానికి 250 – 300 మీ. ఎత్తు ప్రదేశం. ఈ రాష్ట్రానికి జల సంపద లేదనే చెప్పాలి. ఘాఘర్నానది ఉత్తర సరిహద్దులో ప్రవహిస్తూంది. వేదాల్లో చెప్పిన దృష్ట వాదితి నది ఇదేనని చారిత్రుకుల అభిప్రాయం. భారత యుద్ధం జరిగిన 'కురుక్షేత్రం' (చూ.) రణరంగస్థలి ఇక్కడే వుంది. ఈ ప్రాంతం ఐతిహాసిక భారత రాజవంశానికి పుట్టినిల్లని పండితుల అభిప్రాయం.

విస్తీర్ణం: 44,212 చ.కి.మీ.; జనాభా: 1,29,22,618 (1981), రాజధాని: చండీగఢ్; అధికార భాష: హిందీ. రాష్ట్ర రాజధాని చండీగఢ్ (చూ.) పంజాబ్ రాష్ట్రానికి, హర్యానా రాష్ట్రానికి ఉమ్మడిగా వ్యవహరిస్తూ కేంద్ర పాలిత ప్రాంతంగా ఉంది. స్వాతంత్ర్యానంతరం (1947) రాష్ట్రంలో శీఘ్ర వ్యవసాయాభి వృద్ధి జరిగి పంట దిగుబడులు ద్విగుణీకృతమయ్యాయి. ఆహార ధాన్యాలు ముఖ్యంగా గోధుమ, వరి దిగుబడులు బాగా పెరిగాయి. రసాయినిక ఎరువులు వాడకంతో చెరకు (బెల్లం), నూనెగింజలు, ప్రత్తివంటి వాణిజ్య పంటలలో కూడా అధిక దిగుబడులు సాధించారు. ఉత్తర భారతదేశంలో పంటల భీమా పథకాన్ని ప్రవేశపెట్టిన మొట్టమొదటి రాష్ట్రం హర్యానా. 'కార్నాల్, హిస్సార్' ప్రాంతాలలో పాడిపరిశ్రమ బాగా అభివృద్ధి చెందింది.




ఫరీదాబాదు, గుర్గావ్ ప్రాంతాలలో సుమారు 300 భారీ, చిన్న తరహా పరిశ్రమలు నెలకొనడంతో రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ పటిష్టమయింది. సిమెంటు, పంచదార, కాగితం, జవుళీ, ఇత్తడి సామాగ్రి, వ్యవసాయంలో పనికి వచ్చే ట్రాక్టర్లు (పింజోర్), ఉక్కు గొట్టాలు, టెలివిజన్ సెట్లు, శస్త్ర చికిత్స పనిముట్లు (అంబాలా) మొదలగు పరిశ్రమలతో హర్యానా పారిశ్రామికాభ్యుదయం గాంచినది. ఎగుమతి వాణిజ్యం నానాటికీ బాగా పెరుగుతూంది. భారతదేశం వినోద యాత్రకు సంబంధించిన స్వర్ణత్రికోణం (ఢిల్లీ—ఆగ్రా—జయపూర్) హర్యానా దక్షిణభాగంలో ఉంది. వినోద పర్యాటకుల్ని ఆకర్షించే రాజహంస, సూరజ్ కుండ్, దాచ్—చిక్, బార్బెత్, బాద్కల్, తటాకం సుల్తాన్ పూర్, సోహ్నా ప్రాంతాలలో అన్ని ఆధునిక సదుపాయాలతోనూ 32 ప్రత్యేక ప్రాంగణాలను రూపొందించారు. పైగా పొరుగు రాష్ట్రాల్లో ఉన్న ప్రసిద్ధ వినోద యాత్రా స్థలాలకు హర్యానా ద్వారా (కాశ్మీర్, సిమ్లా, భాక్రా—నంగల్ డాము, చండీగఢ్)నే చేరుకోవాలి. అందుచేత వినోద యాత్రా వ్యవస్థ హర్యానాలో పారిశ్రామిక స్థాయినందుకుంది.

## హర్షుడు క్రీ.శ. 590–647

ఉత్తర భారతదేశంలో హిమాలయ పర్వత సానువులనుండి దక్షిణాన నర్మదానది వరకూ, పశ్చిమాన వల్లభి నుండి తూర్పున గంజాం వరకుగల భూభాగాన్ని పరిపాలించిన మహాచక్రవర్తి. ఈయనను శ్రీహర్షుడు, హర్షవర్ధనుడు అని కూడా అంటారు. ఈయన పరిపాలన నిర్దుష్టంగా సాగిందని చారిత్రకారుల అభిప్రాయం. పరిపాలనా యంత్రాంగం పటిష్టమైంది. ఈయన ఏలుబడిలో ప్రధానోద్యోగి 'మహాసంధి విగ్రహాధికారి.' అతనికి సిబ్బంది వ్యవస్థ సహాయం చేస్తూ ఉంటుంది. రాష్ట్రపాలన రాజప్రతినిధుల (గవర్నర్ల) ద్వారా జరుగుతూ

ఉండేది. మత సహనం ఉండేది. హర్షుడు ఆదిలో హిందూ మతావలంబికుడు. ఈయన కాలంలో వచ్చిన



చీనా యాత్రికుడు హుయాన్‌స్యాంగ్ (చూ.) ప్రభావం వల్ల మహాయాన బౌద్ధాన్ని స్వీకరించాడు. అయితే హిందూ మతాన్ని దుయ్యబట్ట లేదు.అశోకునివలె ఈయన అనేక ప్రజాహిత కార్యాల్ని చేపట్టి, అమలుచేశాడు. ఆ కాలముననే హుయాన్‌స్యాంగ్ కన్యాకుబ్జము నందును, ప్రయాగ యందును రెండు పెద్ద బౌద్ధ ఉత్సవాలు నిర్వహించగా హర్షుడు అన్ని విధాలా ఆయనకు సాయపడ్డాడు. ఆరోజుల్లో నలందా విద్యాపీఠం ఉచ్ఛస్థితిలో ఉండేది. మొదట స్థానేశ్వరం కేంద్రంగా తన పరిపాలన సాగించిన హర్షుడు క్రీ.శ. 606 తన రాజధానిని కన్యాకుబ్జమునకు తరలించాడు. హర్షుడు సార్వభౌముడే కాక సంస్కృతంలో మహాకవి. కవి పోషకుడు. 'నాగానందం' నాటకం, 'ప్రియదర్శిక' నాలుగు అంకాల మరొక చిన్న నాటిక, 'రత్నావళి' ఉత్తమమైనదిగా ప్రశస్తి పొందినది. మూడో నాటకం ఈయన రచనలు హర్షుడు పాలన గూర్చి , కళాసాహిత్య పోషణ గూర్చి హుయాన్‌స్యాంగ్ తన యాత్ర చరిత్రలో ఘనంగా చిత్రించాడు.

## హాంగ్‌కాంగ్

సుప్రసిద్ధ అంతర్జాతీయ వాణిజ్యకేంద్రం. చీనా తీరాన కాంటన్ (పెర్ల్) నదీముఖద్వారంలో ఉన్న బ్రిటిషు వలస రాజ్యం. ఈ దేశానికి చెందిన పొరుగు దీవుల సంఖ్య 230కి దాటుతుంది. హాంగ్‌కాంగ్ దీవి, కౌలూన్ ద్వీపకల్పం, లాంటౌ దీవి ప్రధానమైన దీవులు. ఒప్పందం ప్రకారం 1997 నాటికి బ్రిటిషువారు ఈ వలస రాజ్యాన్ని చీనా ప్రభుత్వానికి అప్పగించవలసి ఉన్నది. అయినా ఒప్పందం ప్రకారం మరొక 50 ఏళ్లు పెట్టుబడిదారీ వ్యవస్థ కొనసాగుతుంది. విస్తీర్ణం: 1045 చ.కి.మీ.; జనాభా: 56,83,000 (1988); రాజధాని: విక్టోరియా; అధికార భాష: కాంటొనీస్, ఇంగ్లీషు. ప్రజలు అధికశాతం (97 శాతం) చీనావారు. బౌద్ధం, కన్‌ఫ్యూషియస్ (టావూ) మతాలను పాటిస్తున్నారు. కూరగాయలు, పండ్లు పండిస్తారు. కోళ్ల పెంపకం, పశుపోషణ, పాడి పరిశ్రమ ఉన్నాయి. హాంగ్‌కాంగ్ ప్రపంచ నౌకామార్గాలకు కూడలి. అంతర్జాతీయ టోకు వర్తక వ్యాపారాలకు కేంద్రం. జవుళి, వాచీలు, ఆటసామగ్రి, సున్నితమయిన పరికరాలు, ప్లాస్టిక్స్, పుస్తకముద్రణ, ప్రచురణ, ఎలక్ట్రానిక్స్, ధాతు సామగ్రి, విద్యుత్తు పరికరాలు ప్రముఖమైన పరిశ్రమలు. చూ. చీనా (దేశపటం)

## హిందూమతం

భారతదేశంలో పాటింపబడుతున్న మత విశ్వాసం. సువ్యవస్థీకృత సంఘ జీవనానికి చేసుకున్న కట్టుబాట్లు, ఆచార వ్యవహారాలు, నియమావళియే హిందూమతానికి ఆధారాలు. అపౌరుషేయాలుగా చెప్పబడుతున్న ప్రాచీన వేదాలు (చూ. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం), ఉపనిషత్తులు (చూ.) బ్రాహ్మణాలు, భగవద్గీత వంటి రచనలే హిందూ మతానికి ప్రాతిపదికలు. వేదకాలంనాడు హిందువులు ప్రకృతిని ఆరాధించేవారు (చూ. పంచభూతాలు). దేవతలనే సృష్టి, స్థితి, లయ కారకాలయిన త్రిమూర్తి (చూ.) వ్యవస్థ వేదభావాల నుండి వచ్చినదే. హిందువుల మతానికి 'కర్మ', 'పునర్జన్మ' మౌలికమైనవి. ఆత్మ 'పరమాత్మ'లో లీనమైపోవుటయే 'మోక్షం' మానవుని జీవితపరమావధి. ఈ భావం 'భగవద్గీత'లో వివరించబడింది. చేసిన కర్మ ఫలితంగా (మంచి పనులు చెడు పనులు) బట్టి మోక్షం సాధించడానికి వీలుంటుందని హిందూ మత సారం. ఈ జన్మలో చేసిన పుణ్యపాప కార్యాలనుబట్టి వారి జన్మలోని ఉత్తర గతులుంటాయని హిందువులు విశ్వసిస్తారు. జ్ఞాన, భక్తిమార్గాలు, ముక్తిని ప్రసాదిస్తామంటారు. భక్తిమార్గంలో 'విగ్రహారాధన' జనసామాన్యంలో పాతుకుపోయింది. అరిషడ్వర్గా(చూ.)లను అదుపులో పెట్టు కుంటూ 'యోగ' సాధన ద్వారా మోక్షం సాధించవచ్చునని హిందువుల విశ్వాసం. హిందువులు చతురాశ్రమాలు (చూ.) పాటించాలనీ, చతుర్విధ పురుషార్థాలకు లోబడి జీవ యాత్ర సాగించాలనే నియమం ఉంది. హిందువులకు 'భగవద్గీత'(చూ.)యే పవిత్ర గ్రంథం. రామాయణ

(చూ.) మహాభారతం ఇంకను అష్టాదశ పురాణా(చూ. పురాణాలు)లలోను ఉప పురాణాలలోనూ త్రిమూర్తులు (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు) ఉపాఖ్యానాలలో కాన వస్తారు. (ఉదా. శ్రీకృష్ణుడు, శ్రీరాముడు). మనుస్మృతి (చూ.) హిందువుల కట్టుబాట్లు, ఆచారవ్యవహారాలు, సమాజ జీవనాన్ని నిర్ణయించే శాసనావళి. అయితే వస్తున్న సంఘ పరిణామాల దృష్ట్యా నేడు సమసమాజ నిర్మాణానికి వీలుగా భారత రాజ్యాంగానికి లోబడి హిందూకోడ్‌ను సవరించి (1956) పాటిస్తున్నారు. ఆనాడు వెలసిన వేదశాస్త్రాలు, **ఉపనిషత్తులు,** ఆరణ్యకాలు, బ్రహ్మ సూత్రాలు, గౌతమ సూత్రాలు, యాజ్ఞవల్క్య, భారద్వాజ పరాశరాది మహ ర్షులు అందించిన ఆర్ష సామగ్రి షడ్దర్శనాలు (న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంస వేదాంత) హిందుమత తత్వానికి ప్రాతిపదికలు. ఇవి అన్నీ సంస్కృత భాషలోనే వ్రాయబడినాయి. క్రీ.పూ. 3000 ఏళ్ల నాటి నుండి హిందూ సమాజం మనుతున్నట్లు చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. క్రీ.పూ. 5–6 శతాబ్దాల మధ్య గౌతమ బుద్ధుడు (చూ.) వర్ధమాన మహావీరుడు (చూ.) వంటి ప్రవక్తలు బౌద్ధాన్ని, జైనాన్ని వ్యవహారంలోనికి **తీసుకువిరాగా** నాటి కొన్ని రాజవంశాలు పెంచి పోషించారు. అయితే ఉత్తర భారతంలో గుప్తుల క్రీ.శ. 3,4, కాలంలోనూ, క్రీ.శ. తరువాత 4వ శతాబ్దం నుండీ దక్షిణాదిని ఆళ్వార్లు (చూ.) నాయన్మార్లు కృషి ఫలితంగా హిందూ మతం మరల పుంజుకొనడంతో బౌద్ధ, జైనాలు భారతదేశంలో క్షీణించసాగాయి. 8వ శతాబ్దిలో శంకరాచార్యులు (చూ.) అద్వైతాన్నీ, 11వ శతాబ్దిలో రామానుజల (చూ.)వారూ, వేదాంత దేశికులు వారూ విశిష్టాద్వైతాన్నీ, 12వ శతాబ్దిలో మధ్వాచార్యులు (చూ.) ద్వైతాన్నీ వల్లభ చార్యులు శుద్ధాద్వైతాన్నీ ప్రవచించి వ్యాపించడానికి దోహదకారు లయ్యారు. ఈ కాలముననే హిందూ దేవాలయ నిర్మాణం శిల్ప, వాస్తు ఆగమ శాస్త్రాలు, పూజా(వైఖానస, పాంచరాత్ర) విధానాలు ఏర్పాటయ్యాయి. 16–17 శతాబ్దాలలో భారతదేశం పరపాలన క్రిందికి వచ్చినప్పుడు కొన్ని ప్రాంతాలు మతాంతీకరణకు లోనైనా, ఆ తరవాత 19–20 శతాబ్దాలలో మహాభక్తులు రామకృష్ణ పరమ హంస, వివేకానంద స్వామి, దయానంద సరస్వతి, స్వామి రామానంద తీర్థ, చైతన్య, తుకారామ్, జ్ఞానేశ్వర్, మీరాబాయి, ఏక్‌నాథ్, రామదాసు, కబీరు, సూరదాసు వంటి మహా భక్తుల కృషి ఫలితంగా హిందుమత పునరుజ్జీవనం జరిగింది.

## హిందూ మహా సముద్రం

ప్రపంచ మహా సముద్రాల్లో ప్రముఖమయింది. ఇది దక్షిణ ఆసియా తూర్పు ఆఫ్రికా గుడ్‌హోప్ అగ్రం (దక్షిణ ఆఫ్రికా) నుండి లీయూవిన్ (ఆస్ట్రేలియా) వరకూ వ్యాపించి ఉంది. దీని విస్తీర్ణం: 7,59,90, 000 చ.కి.మీ. మారిషస్ దీవులు, మడగాస్కర్, సెకెల్లిస్, ఇండోనేషియా, డిగో గార్షియా, మాల్ దీవులు ఉన్నాయి. పసిఫిక్ మహా సముద్రాన్ని దీని నుండి మలయా ద్వీపకల్పం వేరుచేస్తూంది. హిందూమహాసముద్రంలో లోతైన ప్రాంతాలు తూర్పుదిశగా ఉన్న 1.సుందాగాడి లోతు 7455 మీటరులు (24,458'); 2.వార్తాన్ సముద్ర గర్భం లోతు 6459 మీ.(21,191')పేర్కొనదగినివి.

## హిట్లర్, అడాల్ఫ్ 1889–1945

జర్మనీ నియంత. నాజీ నాయకుడు. ఆస్ట్రియాలో జన్మించిన హిట్లర్ 1933–45 మధ్య జర్మనీ అధ్యక్షుడు (ఛాన్సలర్)గా ఉన్నాడు. 1933లో నాజీ నాయకుడై రాజకీయాధికారాన్ని హస్తగతం చేసికొని ప్రతిపక్షాల్ని సమూలంగా అణచివేసి సాంస్కృతికంగానూ, ఆర్థికంగానూ రాజకీయంగానూ ప్రజా జీవనాన్ని స్తంభింప చేసి నియంతృత్వ ధోరణిని కొనసాగించాడు. ప్రపంచంలో జర్మనీని అత్యంత బలవంతమైన దేశంగా తీర్చిదిద్ది తీరుతానని తాను 1925–27 మధ్య వ్రాసుకున్న స్వీయచరిత్ర 'మైన్‌కావ్ప్'లో హెచ్చరించాడు. 1939లో పోలాండ్‌పైకి దాడి చేసి ద్వితీయ ప్రపంచయుద్ధానికి (చూ.) నాంది పలికాడు. ఆ తరువాత మొదటి మూడు ఏళ్లు ఎదురులేని విజయపరంపర సాధించి కడకు యునైటెడ్ స్టేట్స్ రంగంలోనికి రావడంతో ఓటమిని చవిచూశాడు. 1945, ఏప్రిల్ 30న ప్రియురాలగు 'ఇవా్‌బ్రాన్'తో సహా ఆత్మహత్య చేసికొన్నాడు.

## హిమాచల్‌ప్రదేశ్

భారతదేశంలోని 25 రాష్ట్రాలలో ఒకటి. దేశానికి వాయవ్యమూలలో హిమాలయ పర్వత సానువులను

అనుకుని ఉన్న ఈ రాష్ట్రం ఒకప్పుడు సంస్థానాల గుంపు. 1948–56 మధ్య 'సి' గ్రూప్ రాష్ట్రంగా కొనసాగి 1971లో రాష్ట్రప్రతిపత్తిని సంతరించుకుంది. తూర్పున టిబెట్టు దీనికి సరిహద్దు. ఉత్తరాన జమ్ము—కాశ్మీర్ ఉంది. పశ్చిమాన పాకిస్తాన్, పంజాబు ఉన్నాయి. దక్షిణాన హర్యానా, ఉత్తర ప్రదేశ్ ఉన్నాయి. సముద్ర మట్టానికి 460 మీటర్ల నుండి 600 మీటర్ల ఎత్తు కొండలతో రాష్ట్రం పర్వతమయం. దక్షిణాన్ని ఉష్ణమండల మైదానాలు ఉత్తరాన్ని వేసవిలో సమశీతోష్ణ స్థితి, శీతాకాలం తీవ్రమయిన శీతలంగా ఉండి సదా మంచు పడుతూ ఉంటుంది.

విస్తీర్ణం: 55,673 చ.కి.మీ. జనాభా: 42,80,818 (1981): రాజధాని: సిమ్లా. అధికార భాష: హిందీ; పహాడీ భాషను కూడా ప్రజలు మాట్లాడతారు.




చీనాబ్, రావీ, బియాస్, సట్లెజ్, యమునా-ఈరాష్ట్రం లోని హిమనదులు. తటాకాలు, ఎత్తుమీదనుండి పడుతున్న జలపాతాలు చౌకగా జలవిద్యుత్‌ను ఉత్పత్తి చేయడానికి అనువుగా ఉన్నాయి. నాల్గింట మూడువంతుల ప్రజలకు పండ్లతోటల పెంపకంజీవనాధారం.పంటనీటి వసతి సాగునేలలో నాల్గవ వంతుకు మాత్రం అందుతుంది. నైసర్గిక శీతోష్ణ స్థితులు తోట పంటలకే అనువుగా ఉంది. ఆపిల్ పండ్లను విరివిగా పండించి ఇతర చోట్లకు పంపుతున్నారు. అల్లం, బంగాళదుంప, కూరగాయ విత్తనాలు, తోటపంటల్లో పేర్కొన దగ్గవి. గోధుమ, వరి, మొక్కజొన్న ముఖ్యమయిన ఆహార పంటలు. పర్వానూ వద్ద భారీ పండ్ల పానీయ పరిశ్రమ నెలకొని పనిచేస్తూంది. బిలాస్పూర్, నహాన్ వద్ద అరపూస (రెజిన్) కర్పూర తైలం (టెర్పంటైన్ ఆయిల్) తయారు చేసే కర్మాగారాలు ఉన్నాయి. మద్య పానీయలు సోలాన్ వద్ద తయారవుతున్నాయి. హిమాచలప్రదేశ్ వినోద పర్యాటకులకు మంచి విహార స్థలం. ప్రకృతి రామణీయకత, హరితవనాల్లో సుందర ప్రకృతి దృశ్యాలు, వేసవిలో చల్లదనం పెక్కుమంది పర్యాటకుల్ని ఆకర్షిస్తున్నాయి. కులూ, మనాలీ, సిమ్లా, డల్‌హౌసీ, కుఫ్రీ, ధర్మశాల, కాశౌలీ, చెయిల్, సోలాన్ కొన్ని ప్రముఖ పర్యాటకుల విడిది స్థలాలు. వన్యప్రాణులు కూడా ఈ రాష్ట్రంలో మెండు. కస్తూరి మృగం (మస్క్‌డీర్), హిమాలయా ఎలుగు, మంచుపులి (స్నోలెపర్డ్) ఎక్కువగా కానవస్తాయి. ఇచ్చట నదులు కూడ మత్స్య సంపదకు ప్రసిద్ధి. ట్రౌట్ చేపలకు కెయుత్రాన్, చేరత్, రొహ్రూమశూరి చేపలకు. మార్యోగా, కార్గానేనంద, దేదహో నదులు ప్రసిద్ధి.

## హిమాలయాలు

భారత దేశానికి పెట్టని గోడలుగా ఉత్తర సరిహద్దులో ఉన్న పర్వతశ్రేణులు. ఇవి సింధునది, బ్రహ్మపుత్రానదీ లోయలందు తూర్పు పడమరులుగా 2,500 కి.మీ. మేరకు విస్తరించి ఇండియా, చీనా (టిబెట్టు), నేపాల్, పాకిస్తాన్, భూటాన్ దేశాలలో కమ్మి ఉన్నాయి. ఇందులో కారకోరం, సివాల్కా, హిందూ కుష పర్వతశ్రేణులు కలిసిఉన్నాయి. ప్రపంచంలోనే అతి ఎత్తయిన ఎవరెస్ట్ (చూ.) పర్వత శిఖరం నేపాల్‌లో ఉంది. కాంచన గంగా (చూ.) కె–2 (చూ.) (గాడ్విన్—ఆస్టిన్) పర్వత శిఖరాలు కూడా హిమాలయ పర్వతాలలోనే ఉన్నాయి. భారతదేశంలో హిమాలయ పర్వత సానువుల్లో సిక్కిం రాష్ట్రం, కాశ్మీర్ లోయా, హిమాచల్‌ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలు ఉత్తర భాగాలు ఉన్నాయి. నైనీటాలు, ముస్సోరీ, సిమ్లా, డార్జిలింగ్ వేసవి విడిది కేంద్రాలు ఈ హిమాలయా పర్వత సానువుల్లోనే ఉన్నాయి. హిమాలయాలలో బోలాన్ కనుమ కైబర్ కనుమ (హిందూ కుష్) వంటి కనుమలు చాలా ఉన్నాయి. ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ దేశాల నడుమన ఉన్న ఈ కైబర్ కనుమ చారిత్రక ప్రసిద్ధి గల కనుమ మార్గం. దీనిగుండానే ఆనాడు అలిగ్జాండర్ (చూ.)వంటి మహాయోధులు భారతదేశం మీదికి దండయాత్రలు చేయడానికి వీలయింది.

## హుమాయూన్ 1508–1556

భారతదేశంలో రెండవ మొగల్ చక్రవర్తి (1530– 1556). బాబర్ (చూ.) కుమారుడు. అక్బర్ (చూ.)కు తండ్రి. తన 23వ ఏట 1530లో

మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఈయన కాలంలోనే సూర్ వంశీయుడు షర్షా (చూ.) 1540లో ఈతనిని ఓడించగా దేశం విడిచి పెట్టి పోవల్సి వచ్చింది.



హుమాయూన్ ప్రవాసంలో ఉన్నప్పుడే అక్బర్ జన్మించాడు. చివరకు 1555లో పర్షియా సాయంతో షర్షావంశీయుడు మహమ్మద్ అదిల్ సూర్, అతని మంత్రి హేమూని జయించి హుమాయూన్ మొగల్ సామ్రాజ్యాన్ని పునః స్థాపించు కోగలిగాడు. ఆగ్రా ఢిల్లీ కోటలను కైవసం చేసుకున్న కొద్ది కాలనికే 1556లో హుమాయూన్ మరణం పాలయ్యాడు.

## హుయాన్‌స్యాంగ్ క్రీ.శ. 604–664

హర్షుని (చూ.) కాలంలో భారతదేశం సందర్శించిన చీనా యాత్రాచరిత్రకారుడు. చీనాలో 604లో జన్మించి చిన్నప్పుడే సన్యాసం స్వీకరించాడు. 629–645 మధ్య భారతదేశానికి వచ్చి నలంద, తక్షశిల విద్యాపీఠాల్లో అధ్యయనం సాగించాడు. 643లో కన్యాకుబ్జము నందు హర్షవర్ధనుడు ఏర్పాటుచేసిన పాంచ వార్షిక బౌద్ధ మహా సభలో హుయాన్‌స్యాంగ్ అధ్యక్షపీఠాన్ని అలంకరించాడు. అలహాబాదులో జరిగిన బౌద్ధ మహా సభలో పాల్గొని చీనా వెళ్లిపోయాడు. ఆయన సేకరించిన బౌద్ధ వస్తు సామగ్రిలో బంగారు, వెండి, చందనాలతో చేసిన బుద్ధ ప్రతిమలు, 657 బౌద్ధ లిఖిత పత్రాలు ఇరవయి గుర్రాలపై వేసుకొని చీనా చేరాడు. హుయాన్‌స్యాంగ్ వ్రాతలే నాటి భారతదేశ చరిత్రకు లిఖితాధారాలు. తాను సేకరించిన బౌద్ధ విషయ సామగ్రిని 74 సంపుటాల్లో చీనాబాషలో పొందు పరచాడు.

## హేన్స్ క్రిస్టియన్ అండర్సన్

బాల సాహిత్యవేత్త. 1805–1875 మధ్య కాలంలో డెన్మార్క్ దేశంలో జీవిస్తూ పిల్లల మనస్సును ఆకట్టుకునే అనేక కథల్ని వ్రాశాడు. అండర్సన్ వ్రాసిన అద్భుత కథలలో పేర్కొనదగినవి 'ది అగ్లీ డక్లింగ్', 'ది లిటిల్ మెర్మెయిడ్'.

## హేస్టింగ్స్, వారెన్ 1732–1818

ఈస్ట్ ఇండియా కంపెనీ తరపున ప్రప్రథమ గవర్నరు–జనరల్‌గా భారత దేశాన్ని పాలించాడు (1774–84). **క్లైవ్** (చూ.)తో వాలంటీర్‌గా చేరి ప్రజ్ఞాపాటవాల్ని ప్రదర్శించాడు. 1761లో బెంగాల్ కౌన్సిల్ సభ్యుడయ్యాడు. అయితే చైత్‌సింగ్ వ్యవహారంలోనూ, రోహిల్లాలను అణచివేయటంలోనూ ఈయన రాజకీయ వైఖరి విమర్శనలకు గురి అయింది. ఇంగ్లండు వెళ్లిన తరువాత అవినీతి అభియోగాలు బనాయించి పార్లమెంటు ఈయనపై అభిశంసన తీర్మానం పెట్టి నిందలకు పాలు చేయగా చివరకు నిర్దోషిగా బయట పడ్డాడు. తరువాత, ఈ విచారణ భారతదేశ పాలన సువ్యవస్థీకరించడానికి మాత్రం ఉపయోగ పడినట్లు రాజనీతిజ్ఞుల అభిప్రాయం.

## హైదరాబాదు

ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరం. కులీకుతుబ్ షాహ్ (చూ.)తన ఇష్టపత్ని భాగ్‌మతి పేర 'భాగ్యనగరాన్ని' 1589లో స్థాపించాడు. నగరానికి 10 కి.మీ. దూరంలో గోల్కొండ కోట (చూ.) ఉంది. నగరంలోని ప్రజల సంస్కృతిలో **భారతదేశంలోని** అన్ని భాషా సంస్కృతుల ఛాయలూ కన్పిస్తూ ఉంటాయి. ఒక విధంగా ఇది సమిశ్ర సంస్కృతి (కాస్మపాలిటన్) అని చెప్పవచ్చును. నడిబొడ్డున హైదరాబాదును సికింద్రాబాదును వేరు చేస్తూ హుస్సేన్ సాగరం, టాంక్‌బండ్ ఉన్నాయి. ఒకప్పుడు సికింద్రాబాదు వేరుగా ఉన్నప్పటికిని ఇప్పుడు హైదరాబాదులో అంతర్భాగంగా ఉన్నది. ఈ మహానగరంలో పాత భవనాలు ఇండో–పార్సనిక్ వాస్తు శిల్ప సంప్రదాయానుసారం తీర్చిదిద్దేరు. ఉస్మానియా యూనివర్శిటీ, హైకోర్టు, శాసనసభ, ఉస్మానియా ఆసుపత్రి మున్నగునవి ఈ కోవకు వస్తాయి. నౌబత్ పహాడ్ సమీపంలో బిర్లాలు నిర్మించిన శ్రీ వెంకటేశ్వర దేవళం (బిర్లా మందిర్) నిర్మాణంలో ఉత్తరాది వాస్తు పోకడలు కన్పిస్తాయి. సమీపంలో ఉన్న బిర్లా ప్లానిటోరియం, సైన్స్ మ్యూజియం శాస్త్ర విజ్ఞాన ప్రచారానికి

కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉన్నాయి. పబ్లిక్‌గార్డెన్స్‌లో రాష్ట్ర పురాతత్త్వశాఖవారి మ్యూజియంలో ఈజిప్షియన్ మమ్మీ ప్రత్యేక ఆకర్షణ. భారతదేశంలో సుప్రసిద్ధ ఏకవ్యక్తి సంగ్రహాలయం సాలార్‌జంగ్ మ్యూజియం (చూ.) లో సుమారు 64 పెద్ద గదులలో వర్గీకృత అపూర్వ వస్తుజాలాన్ని ప్రదర్శించారు.

హైదరాబాదు వైజ్ఞానిక నగరం (సైన్స్ సిటీ)గా పేర్కొనవచ్చును. ఇక్కడ పెక్కు పరిశోధనాగారాల్లో అత్యంత ఉన్నత స్థాయి శాస్త్ర విజ్ఞాన పరిశోధనలు జరుగుతూ ఉంటాయి. సెంటర్ ఫర్ సెల్యులర్ అండ్ మొలిక్యులర్ బయాలజీ (సి.సి.ఎమ్.బి.), ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజీ (ఐ.ఐ.సి.టి.), నేషనల్ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ (ఎన్.ఆర్.ఎస్.ఎ.) ఇన్స్టిట్యూట్ ఆఫ్ జెనిటిక్స్, నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ (ఎన్.ఐ.ఎన్.) వంటి అపూర్వ శాస్త్ర విజ్ఞాన పరిశోధన సంస్థలు, డి.ఎమ్.ఆర్.ఎల్.; డి.ఆర్.డి.ఎల్. వంటి రక్షణశాఖ ప్రయోగ శాలలు ఉన్నాయి. కేంద్ర ప్రభుత్వ రంగ పారిశ్రామిక వ్యవస్థలు భారత హెవీ ఎలక్ట్రికల్స్, ఎలక్ట్రానిక్స్ కార్పోరేషన్ (ఇ.సి.ఐ.ఎల్.) భారత డైనమిక్స్, ఎచ్.ఎమ్.టి., రాష్ట్ర ప్రభుత్వ రంగ సంస్థ హైదరాబాదు ఆల్విన్స్ హైదరాబాదులోనే ఉన్నాయి.




గండిపేటలో హిమాయత్‌సాగర్, దానికి పది కిలో మీటర్ల దూరంలో ఉస్మాన్ సాగర్, మూసీనది జలనిర్గమన మార్గమున ఉన్న జలాశయాలు. హుస్సేన్ సాగర్ గట్టు (టాంక్‌బండ్)న ఉన్న తెలుగు వెలుగుల మూర్తి విక్షిప్త కళాప్రాంగణంలో 33 ఆంధ్రమహాపురుషులు, మహిళా మణుల శిల్ప విగ్రహాల్ని ప్రతిష్ఠించి బహిరంగ ప్రదర్శన శాలగా తీర్చిదిద్దేరు(1986). హుస్సేన్ సాగర్‌లోని జిబ్రాల్టర్ రాక్‌మీద సుమారు 22 మీ. ఎత్తుగల బుద్ధుని మహా విగ్రహాన్ని ఒకదానిని ప్రతిష్ఠించుటకు సన్నాహాలు జరుగుతున్నాయి (1990). హైదరాబాదు భారతదేశం లో ఒక భారీ విమాన శిక్షణ కేంద్రం.

అమెరికన్ స్టడీస్ రిసెర్చి సెంటర్ (ఎ.ఎస్.ఆర్.సి.) కేంద్ర ఇంగ్లీషు విదేశీ భాషాధ్యయన సంస్థ (సీఫెల్), అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీ, ఇంజనీరింగ్ స్టాఫ్ కాలేజీ, ఇస్లామిక్ కల్చర్ బోర్డ్, జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థ, నిజాం ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ స్మాల్ ఇండస్ట్రీ & ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగ్ (నీసెట్), వాలన్‌టరీ సంస్థ వంటి పరిశోధన—శిక్షణ సంస్థలు పనిచేస్తున్నాయి. హైదరాబాదు సమీపంలో పటాన్‌చెరువద్ద అంతర్జాతీయ మెట్ట పంటల (జొన్న, సజ్జ, కంది, సెనగ, వేరుసెనగ) పరిశోధన సంస్థ (ఇక్రిశాట్) ఒక అపూర్వమయిన పరిశోధనా కేంద్రం. సమీపంలోని గోల్కొండ, కులీ కుతుబ్‌షాహీ సమాధులు, నెహ్రూ జూలాజికల్ పార్కు ( జూ) పబ్లిక్ గార్డెన్స్, తెలుగు లలితకళాతోరణం, ఫలక్‌నామా పాలెసు, జుమ్మా మసీదు, మెక్కా మసీదు, చార్మినారు, హెల్త్ మ్యూజియం, జవహర్ బాలభవన్, రవీంద్ర భారతి దర్శనీయ సంస్థలు. (చూ. ఆంధ్రప్రదేశ్, తెలుగుతల్లి, సాలార్‌జంగ్ మ్యూజియం **గోల్కొండ కోట, చార్మినార్**)

## హోండూరాస్

మధ్య అమెరికాలోని స్వతంత్ర గణరాజ్యం. ఇది అరటిపండ్ల (బనానాస్టేట్) దేశంగా ప్రసిద్ధి. దక్షిణభాగం పర్వతమయం. ఈ ప్రాంతంలో అరటిపండ్లను విరివిగా పండించి ఎగుమతి చేస్తారు. ఒకప్పుడు స్పెయిన్ వలసరాజ్యం. 1821లో దానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. విస్తీర్ణం: 1,12,088 చ.కి.మీ.; జనాభా: 48,03,000 (1988); రాజధాని: టెగుసిగల్పా; అధికార భాష:

స్పేనిష్. ప్రజలు మెస్టిజో అను సంకర జాతులు 90 శాతం, ఆదివాసులు రెడ్ ఇండియన్‌లతో సంకరణకు లోనైన స్పెయిన్ దేశీయులు, నీగ్రో జాతులు ఉన్నారు. ప్రజలు రోమన్ కేతలిక్కు క్రైస్తవ సంప్రదాయాన్ని పాటిస్తున్నారు. సాన్‌పెడ్రో సూలా, లా సీబియా, కొలూటెకా, ఎల్‌ప్రోగ్రెసో ఇతర ప్రధాన పట్టణాలు. అరటిపండ్ల ఎగుమతి రవాణాకు వీలుగా రైల్వేవ్యవస్థ ఉంది. పటూకనది, అగాన్‌నది, సికోనది, గేయాపీనది, ఉలానది జలాధారాలు. అరటిపండ్లు, కాఫీ, పొగాకు, మొక్కజొన్న, ప్రత్తి, వరి, చెరకు ప్రధానమైన వ్యవసాయోత్పత్తులు. వెండి ఖనిజం దొరుకుతుంది. కలప పరిశ్రమ, ఆహార పానీయాలు, సిగరెట్ల తయారీ, బీరు, సారాయి, సిమెంటు, పంచదార, నూలు వస్త్రాలు ప్రముఖ పరిశ్రమలు.

## హోచిమిన్ 1890–1969

వియత్నామ్ జాతీయ నాయకుడు. 1890 మే 19న నామ్‌డాన్ జిల్లాలోని కిమిలీన్‌గ్ఘితిన్హలో జన్మించాడు. అసలు పేరు న్గూయెన్ సిన్‌కుంగ్. ఈ పేరు న్గూయెన్ తాత్‌తాన్హ గానూ, న్గూయెన్ అయికూక్‌గానూ మారింది. 1942 నుండీ ఈయనను హోచిమిన్‌గా వ్యవహరిస్తున్నారు. ఫ్రెంచి విప్లవం, రూసో రచనల వల్ల ప్రేరితుడయ్యాడు. దేశాన్ని ఫ్రెంచి వలసాధిక్యత నుండి విముక్తి చెయ్యడానికి మూడు దశాబ్దాలపాటు (1911–1930) విదేశాలలోనే గడిపాడు. 1941లో రహస్యంగా స్వదేశానికి తిరిగివచ్చి 'వియెత్‌మిన్' జాతీయసంస్థను స్థాపించి స్వాతంత్ర్యపోరాటం సాగించాడు.

1945 సెప్టె. 2న జబరదస్తీ తాత్కాలిక ప్రభుత్వానికి అధినేతగా కొనసాగుతూ 1954లో వియెత్నామ్‌ను విభజించి ఉత్తర వియత్నామ్‌కు పూర్తి స్వాతంత్ర్యానికి కారకుడయ్యాడు. 1969 సెప్టె. 2న



హోచిమిన్ మరణించినప్పటికి ఐక్య వియత్నామ్‌కు ప్రజా పోరాటం సాగించారు. చివరకు 1975 ఏప్రిల్‌లో ఐక్య వియత్నామ్ రూపుగొన్నది. శాంతి కాముకుడయిన హోచిమిన్ భారతదేశానికి సన్నిహిత మిత్రుడు. నిరాడంబరుడుగానూ, త్యాగశీలిగానూ హోచిమిన్ ప్రసిద్ధుడయ్యాడు. (చూ. వియెత్నామ్ )

## హోమర్

గ్రీక్ మహాకవి. క్రీ.పూ. 700 ప్రాంతంలో కియోస్, స్మిర్నా నగరాల్లో నివసిస్తూ ఇలియెడ్, **ఒడెస్సీ** ఐతిహాసిక మహాకావ్యాలను రచించి అందించాడని తెలుస్తూంది. (చూ. ఇలియెడ్ కావ్యం; **ఒడెస్సీ** కావ్యం)

## హోమ్‌రూల్ ఉద్యమం

సుషుప్తావస్థలో ఉన్న భారతీయ ప్రజలను చైతన్యవంతం చెయ్యడానికే ఆనిబిసెంట్ (చూ) తిలక్‌తో కలసి హోమ్‌రూల్ ఉద్యమాన్ని చేపట్టి నిర్వహించింది. అలాగని ఆనిబిసెంట్ బ్రిటిష్‌వారికి విరోధి అని చెప్పడానికి వీలు లేదు. అతివాదుల్ని విప్లవకారులనుండి వేరుచేసి మితవాదులతో చెయ్యి కలప డానికే ఈ ఉద్యమం చేపట్టిందని చెప్తారు. "నేను భారతీయుణ్ణి—నిద్ర పోతున్న ఓ భారతీయ వీరుడా! మేల్కొని భారత మాతను రక్షించు" అని టముక్కు టామ్‌టామ్ వేయించేది. భారతీయులే **స్వయంగా** రాజకీయ సంస్కరణలు చేసి దిగువన గ్రామస్థాయి నుంచి జిల్లా, మున్సిపల్ స్థాయి నుండి, శాసనసభ, జాతీయ పార్లమెంట్ వరకూ సమానహక్కులతో స్వపరిపాలన గావించుకునే హక్కును సంపాదించడానికే హోమ్‌రూల్ ఉద్యమం అనీ, హోమ్ రూల్ భారతీయ ప్రజల జన్మహక్కు అనీ ఆవిడ చెప్పేది. భారతీయ యువకుల రక్తంతోనూ, భారతీయ ఆడపడుచుల కన్నీళ్లతోనూ స్వేచ్ఛను కొనడానికి బేర మాడడం లేదనీ వక్కాణించి చెప్పేది. ఆ హక్కు భారతీయులకు ఉందని పోరాడేది. అయితే 1917లో ఈ ఉద్యమం పరాకాష్ట నందుకునడంతో ఆనిబిసెంట్‌ను బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించింది. ఆమె విడుదలకై ఆందోళనలు జరిగాయి. తిలక్ సత్యాగ్రహం చేస్తానని బెదిరించాడు. ఈ పరిస్థితుల్లో దశలవారీగా బాధ్యతా యుతమయిన ప్రభుత్వ పాలనాధికారం ఇవ్వడానికి (ఆగ. 1917) బ్రిటిషు ప్రభుత్వం ముందుకు రావడంతో హోమ్‌రూల్ ఉద్యమం అణగారి పోయింది. 1919లో సంస్కరణల శాసనం రూపుగొన్నది. (చూ. భారత స్వాతంత్ర్యపోరాటం)



## పుణ్యక్షేత్రాలు / చారిత్రకస్థలాలు

అంతర్వేది 2; అన్నవరం, అమరావతి 7; అమృత్‌సర్ 8; అయోధ్య 9; అహోబలము 14; కన్యాకుమారి 47; కంచి 44; కాశీ 56 కాళేశ్వరం 57; కురుక్షేత్రం 59; కేదారనాథ్ 66; కోణార్క్ 69; గయ 78; గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా 92; గోల్కొండకోట 87; గోమతేశ్వరం 86; చార్మినార్96;చిదంబరం98; జయపూర్ 104; జోతిర్లింగాలు 121; తక్షశిల 131; తళ్ళికోట 132; తాజ్‌మహల్ 133; తిరుపతి 135; తిరువణ్ణామలై 137; తెలుగుతల్లి 140; త్రివేణి 143; ద్వారక 149; నలంద 153; నాగార్జునకొండ 154; పిరమిడ్లు 180; పాంపే 177; త్రిలింగ 143; పాటలీపుత్రం 177; పూరీ 182; ప్రయాగ 197; బదరీనాథ్ 204; బీజాపురము 208; భద్రాచలం 221; భువనేశ్వరం 235; మథుర 238; మధుర 239; మహాబలిపురం 244; మైసూరు 258; మెక్కా(కాబాశిల) 254; రామప్పగుడి 274; రామేశ్వరం 278; లేపాక్షి 294; వాటికన్ 256;వారణాసి 298; శబరిమలై 312; శ్రీకాళహస్తి 315; శ్రీకూర్మం 316; శ్రీరంగం 318; శ్రీశైలం 319; సాంచి 327; సారనాథ్ 329; సింహాచలం 332; హంపీ 348; హరప్పా 350.



## జాతీయవాదులు / సమరయోధులు / విప్లవవీరులు
## సంఘసంస్కర్తలు / సంఘసేవకులు

అజాద్, మౌలానాఅబుల్‌కలామ్ 5; అల్లూరి సీతారామరాజు 11; ఇందిరాగాంధీ 26; కన్నెగంటి హనుమంతు 47; కస్తూర్బాగాంధీ 52; కామరాజ్‌నాడార్ 55; కృపలానీ జె.బి. 61; గరిమెళ్ళ సత్యనారాయణ 78; గాంధీ 79; గిరి.వి.వి. 81; గోపాలకృష్ణయ్య దుగ్గిరాల 86; గోఖలే గోపాలకృష్ణ 85; గోవిందవల్లభపంత్ 88; చంద్రశేఖర ఆజాద్ 94; చిత్తరంజన్‌దాస్ 96; జగజీవన్‌రామ్ 101; జయప్రకాశ నారాయణ 104; జవహర్‌లాల్ నెహ్రూ 107; జాకీర్ హుస్సేన్ 109; జైల్‌సింగ్ (రాష్ట్రపతి)120; ఝాన్సీలక్ష్మీబాయ్ 122; టంగుటూరి ప్రకాశం 123; తాంతియా తోపే 132; తిలక్, బాలగంగాధర 137; దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ 146; నందా, గుల్జారిలాల్ 150; నరేంద్రదేవ్ 152; నౌరోజీ, దాదాబాయి 165; పద్మజానాయుడు 172; పట్టాభి సీతారామయ్య 170; పింగళి వెంకయ్య 179; ప్రకాశం, టంగుటూరి 184; ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ 199; ఫిరోజ్‌షా మెహతా 200;బిపిన్‌చంద్రపాల్ 208; బులుసు సాంబమూర్తి 210; బెజవాడ గోపాలరెడ్డి 211; బ్రహ్మయ్య, గొట్టిపాటి 217; భగత్‌సింగ్ 219; మదన్‌మోహన్ మాలవియా 238; మహమ్మదాలీ జిన్నా 244; మొరార్జీదేశాయ్ 259; మోతిలాల్‌నెహ్రూ 260; రంగా, ఎన్.జి. 265; రాజగోపాల చక్రవర్తి 269; రాజేంద్రప్రసాద్ 271; రానడే మహదేవ్‌గోవింద 272; రామకృష్ణారావు, బూర్గుల 273; అచ్చన్న, సర్దారుగౌతు 290; లజపతిరాయ్ 290; లాల్‌బహదూర్ శాస్త్రి 291; లోహియా, రామ్‌మనోహర్ 295; వల్లభాయ్‌పటేల్, 170, 297; విజయలక్ష్మి పండిట్ 301; వెంకటప్పయ్య, కొండా 307; వెంకటరామన్, రామస్వామి 308; శ్రీరాములు, పొట్టి 183, 318; సంజీవరెడ్డి, నీలం 322; సత్యనారాయణ, గరిమెళ్ళ 324; సరోజిని నాయుడు 326; హనుమంతరావు, మాడపాటి 349; హరిసర్వోత్తమరావు, గాడిచర్ల 350; హనుమంతు, కన్నెగంటి 349; సుందరయ్య, పుచ్చలపల్లి 336; సుభాష్‌చంద్రబోస్ (నేతాజీ) 338; సావర్కార్ వి.డి. 329; సురేంద్రనాథ్ బెనర్జీ 340; విశ్వనాథప్రతాప్ సింగ్ 305;

అజాద్‌హింద్‌ఫౌజ్ 5; కమ్యూనల్ అవార్డు 48; ఉప్పుసత్యాగ్రహం 34; కాంగ్రెస్ భారతజాతీయ 52; క్విట్‌ఇండియా ఉద్యమం 73; జలియన్‌వాలాబాగ్ దురంతం 106; దండీయాత్ర 144; నాన్‌కోఆపరేషన్ మూవ్‌మెంట్ 158; భారతస్వాతంత్ర్య పోరాటం 230; రౌండుటేబుల్ సమావేశాలు 285; సహాయనిరాకరణోద్యమం 326; వందేమాతరం 296; సిపాయిల తిరుగుబాటు 334; హోమ్‌రూల్ ఉద్యమం 357. పి.వి.నరసింహారావు 180

అంబేద్కర్ 3; ఈశ్వరచంద్ర విద్యాసాగర్ 31; ఉన్నవ లక్ష్మీనారాయణ 33; కార్వే డి.కె. 56; కుమారిలభట్టు 59; దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్ 146;గాంధీ 79;బాపా అమృత్‌లాల్ తక్కర్ 131, 206; బేడెన్ పవల్ 212; మండేలా, నెల్సన్ 162, 236; మదర్‌తెరిసా 239; మార్టిన్‌లూథర్ కింగ్(జూ) 249; రాజారామ మోహన్‌రాయ్ 271; రామస్వామి, త్రిపురనేని 276; వినోబాభావే 303; వెంకటరత్నంనాయుడు, రఘుపతి 307; నివేదిత 160. వీరేశలింగం, కందుకూరి 306.



## భాషావేత్తలు / మేధావులు / వాగ్గేయకారులు ప్రసిద్ధగ్రంథాలు / ఐతిహాసిక పురాణాలు

అప్పకవి 7; అప్పయ్యదీక్షితులు 7; చిన్నయసూరి, పరవస్తు 98; పతంజలి 171; పాణిని 178; గిడుగు రామమూర్తి 81, 275; గురజాడ అప్పారావు 83; బ్రౌన్, **చార్లెస్ ఫిలిప్** 218; లక్ష్మణరావు, కొమర్రాజు 68; సామ్యూల్ జాన్సన్ 328; అన్నంభట్టు 6; అమీర్‌ఖుస్రూ 8; అష్టదిగ్గజాలు 13; ఇక్బాల్, మహమ్మద్ 28; ఇలంగో అడిగళ్ 30; ఇలియట్, టి.ఎస్ 30; **ఇలియెడ్‌కావ్యం** 30; ఉమర్‌ఖయ్యాం 34; ఎర్రాప్రెగడ 36; ఏక్‌నాథ్ 38; కంబకవి 45; కవిత్రయం, 52; కాళిదాసు 56; కిప్లింగ్ 57; కృష్ణశాస్త్రి ; దేవులపల్లి 62; గాలిబ్ 80; గుర్రం, జాషువ 84, 116; టాగూర్, రవీంద్రనాథ్ 124; టాల్‌స్టాయ్ 125; డోస్టొవిస్కీ 130; తిరుపతి వెంకటకవులు 136; దండికవి 143; పండితత్రయం 170; పెద్దన, అల్లసాని 182; పోతన 183; ప్రేమ్‌చంద్ 198; బంకించంద్ర చటర్జీ 203; బాణుడు 205; బాపిరాజు, అడవి 206; భట్టుమూర్తి 220; భర్తృహరి 222; భారతి 234; భవభూతి 222; భారవి 234; భాసుడు 234; మాఘుడు 248; మొల్ల 280; మిల్టన్, జాన్ 253; రామరాజ భూషణుడు ; రామకృష్ణకవి, తెనాలి 140; 273; రూసో, జాన్‌జాక్విన్ 284; వాత్స్యాయనుడు 298; వాల్మీకి 293; విద్యానాథుడు 302; వేమన 310; వెంకటాచలం, గుడిపాటి 308; వెంకటాధ్వరి 308; వ్యాసమహర్షి 310; శూద్రకుడు 315; శ్రీనాథుడు 317; శ్రీరంగం శ్రీనివాసరావు 317; శ్రీశ్రీ 320; షా, జార్జి బెర్నార్డ్ 320; షేక్స్‌పియర్ 321; సత్యనారాయణ, విశ్వనాథ 324; సింగిరెడ్డి నారాయణరెడ్డి 330; సుబ్రహ్మణ్యభారతి 337; సుందరావారి, శంకరంబాడి 336; సుబ్బారావు రాయప్రోలు 337; సోమనాథుడు, పాల్కురికి 179,343; **హేన్స్**, క్రిస్టియన్ అండర్సన్ 355; హోమర్ 357. అష్టావధానం 13; గోర్కీ 86; గ్రిమ్‌సోదరులు 89; జగన్నాథ పండితరాయులు 101; తిక్కన 135; తోరుదత్తు 141; దీక్షితులు, చింతా 146; నన్నయభట్టు 151; నన్నెచోడుడు 151; నాచన సోమన 157; పండితత్రయం 170; మాక్స్‌ముల్లర్ 247;

**అరిస్టాటిల్** 22; కార్ల్‌మార్క్స్ 56; 249; కౌటిల్యుడు 71; ప్లేటో 199; మార్కస్ అరీలియస్ 249; రాధాకృష్ణన్, సర్వేపల్లి 272; రామలింగారెడ్డి, కట్టమంచి 276; రూసో, జాన్ **జక్విన్** 283; సోక్రటీస్ 343;

అభిజ్ఞాన శాకుంతలము 7; అధర్వ(ణ)వేదం 5; అమరకోశం 7; అరేబియన్ నైట్స్ 10; అష్టాదశపురాణాలు 13; అష్టాధ్యాయి 13; ఆముక్తమాల్యద 22; ఒడెస్సీకావ్యం 41; కన్యాశుల్కం 48; కురళ్ 59; ఖొరాన్ 76; గాథాసప్తశతి 80; గ్రంథసాహెబ్ 89; చంపూకావ్యం 94; **త్రిపిటకాలు** 142; తిరుక్కురళ్ 135; పంచకావ్యాలు 167; పంచతంత్రం 167; పల్నాటి వీరచరిత్ర 174; మృచ్ఛకటికం 254; పురాణాలు 181; పెరిప్లస్ 182; ప్రతాపరుద్రీయం 186; ఫౌస్ట్ 201; బైబిలు 213. మనుచరిత్ర 241; మనుస్మృతి 241; మహాభారతం 222; 245; మహాభాగవతం 245; ముద్రారాక్షసం 254; రాజతరంగిణి 279; రామాయణం 277; శిలప్పదికారం 314.



## కళలు కళాకారులు / వాగ్గేయకారులు / బహుముఖ ప్రజ్ఞావంతులు

అజంతా, ఎల్లోరా గుహలు 4; ఒడిస్సీనాట్యం 41; కథకనృత్యం 45; కథకళి 46; కూచిపూడి నాట్యం 61; ఖజురహోశిల్పం 74; తోలుబొమ్మలాట 141; నాట్యశాస్త్రం 157; నాయకులు, నాయికలు 158; నారాయణదాసు, ఆదిభట్ల 159; **పికాసో** 180; పురందరదాసు 181; భరతనాట్యం 221; భరతముని 222; మైఖేల్ ఏంజిల్ 257; శంకర్ పిళ్లే 311; సిద్ధేంద్రయోగి 334; రామారావు, దామెర్ల 278; సత్తిరాజు లక్ష్మీనారాయణ (బాపు)323; వాల్ట్ డిస్నీ 299;

అన్నమాచార్య 6; ఆదిభట్ల నారాయణదాసు159; కాటన్ ఆర్థర్ 54; కృష్ణారావు, ముట్నూరి 253; రామమూర్తి కోడి; 275; కొమర్రాజు లక్ష్మణరావు 68; జామినీరాయ్ 116; జి.డి.నాయుడు 117; తాతా, జె.ఆర్.డి. 133; దేవేంద్రనాథ టాగూర్ 147; నందలాల్‌బోసు 150; నాగేశ్వరరావు, కాశీనాథుని 156; ప్రతాపరెడ్డి, సురవరం 187; **మెకన్జీ, కల్నల్ కాలిన్** 254; మోక్షగుండం, విశ్వేశ్వరయ్య 260; రాఘవ, బళ్ళారి 269; రాఘవరావు, న్యాయపతి 269; రామమూర్తి, కోడి; రామారావు, దామెర్ల 278; లక్ష్మణరావు, కామూరి 288; వాల్ట్‌డిస్నీ 299; శంకరపిళ్ళై 311; సత్తిరాజు లక్ష్మీనారాయణ (బాపూ) 323; సీతమ్మ, డొక్కా 335.



## ప్రవక్తలు /మతవిశ్వాసాలు /మహాభక్తులు /వాగ్గేయకారులు

ఆళ్వార్లు 24; ఇస్లాం 30; ఏసుక్రీస్తు 38; **కన్ఫ్యూషియస్**46; కాళి 56; క్రైస్తవమతం 71; ఖోరాన్ 76; గౌతమబుద్ధుడు 88; గ్రంథ సాహెబ్ 89; చైతన్య ప్రభువు 100; జరతుస్త్ర (జొరాష్ట్రియన్ మతం) 105; 121; జైనమతం 120; బౌద్ధం 215; పార్శీమతం 179; భగవద్గీత 220; మధ్వాచార్యులు 240; మహమ్మద్ ప్రవక్త 243; మహావీరుడు 246; రామానుజాచార్యులు 276; వేదాంతదేశికులు 309; శంకరాచార్య 311; సిక్కుమతం 333; హిందూమతం 352; అరవిందఘోష్ 9; అనిబిసెంట్ 21; గురుగోవింద్ సింగ్ 83; గురునానక్ 84; జిడ్డు కృష్ణమూర్తి 118; తేజ్‌బహదూర్ సింగ్ 140; తులసీదాసు 138; దయానంద సరస్వతి 144; దలైలామా 145; బసవేశ్వరుడు 205; రమణమహర్షి 266; రామకృష్ణ పరమహంస 273; వీరబ్రహ్మేంద్రస్వామి 306; స్వామి రామానందతీర్థ 346; స్వామి వివేకానంద 347; జయదేవుడు 104; జ్ఞానేశ్వర్ 122; కబీరుదాసు 48; క్షేత్రయ్య 74; తాన్సేన్ 134; తులసీదాసు 138; త్యాగయ్య 142; మీరాబాయి 253; రామదాసు 274; సూరదాసు 340.



## సంప్రదాయ శీర్షికలు /పురాణ విశేషాలు

అగ్నిత్రయం 4; అగ్నిదేవుడు 4; అధోలోకాలు 6; అప్సరసలు 7; అరిషడ్వర్గాలు 10; అర్జునుడు 11; అష్టదిక్పాలురు 13; అష్టభోగాలు 13; అష్టసిద్ధులు 13; అష్టైశ్వర్యాలు 14; ఆంజనేయుడు 14; ఆళ్వార్లు 24; ఇంద్రుడు 27; ఉపనిషత్తులు 33; ఊర్ధ్వలోకాలు 35; ఋగ్వేదం 44; ఋత్విక్ 44; ఓం 43; కర్ణుడు 49; కల్పవృక్షం 51; కామధేను 55; కుంతీదేవి 57; కౌరవులు 71; క్షీరసాగరమథనం 73; గజేంద్ర మోక్షం 77; గౌతమసూత్రాలు 89; చతుర్దశ విద్యలు 94; చతురాశ్రమాలు 94; చతుర్విధోపాయాములు 94; చతుర్విధపురుషార్థాలు 95; **చతుష్షష్టికళలు** 95; జయవిజయులు 105; తాపత్రయం 134; త్రిమూర్తులు 143; త్రిగుణాలు 142; త్రేతాగ్నులు 143; దత్తాత్రేయుడు 144; దుర్యోధనుడు 147; దశావతారాలు 145; ద్రోణాచార్యుడు 148; ద్రౌపది 149; ధర్మరాజు 149; ధృతరాష్ట్రుడు 150; నకులుడు 150; నటరాజు 151; నవగ్రహాలు 153; నవధాన్యాలు 154; నవరత్నాలు 154; నవరసాలు 154; పంచభూతాలు 168; పరాశరుడు 173; పరీక్షిత్తు173; పాండవులు 176; పురుషార్థాలు 181; పుష్కరం 182; బ్రహ్మ 216; బ్రహ్మసూత్రాలు 217; భీముడు 234; భీష్ముడు 235; మత్స్యయంత్రము 238; యజుర్వేదం 261; యుగాలు 261; రావణుడు 280; లక్ష్మీదేవి 288; వరుణుడు 297; వశిష్ఠుడు 297; వాయుదేవుడు 298; విదురుడు 302; విశ్వామిత్రుడు 305; విష్ణువు 306; శివధనుస్సు 314; శివుడు 314; శ్రీకృష్ణుడు 316; శ్రీరాముడు 318; సప్తర్షులు 325; సరస్వతి 325; సహదేవుడు 326; సామవేదం 328; సీత 335; హరిశ్చంద్రుడు 350; హనుమంతుడు 348.





## ఇతరములు

అజెటిక నాగరికత 20; కోహినూర్ వజ్రం 70; ఫోనీషియా 201; మనువు ; సింధునాగరకత 331; సుమేరియన్ నాగరకత 339; ఆకాశహార్మ్యం 20; ఇంద్రప్రస్థం 27; సప్తవింతలు 328; సారంగధరుడు 328; సాలార్‌జంగ్ మ్యూజియమ్ 329; అంతర్జాతీయ కార్మిక సంఘం 1; అంతర్జాతీయ ద్రవ్యనిధి 2; అలీనోద్యమం11ఆర్యసమాజం 23; ఈస్టిండియా కంపెనీ 32; నానాజాతిసమితి 158; నాబార్డ్ 158; ఐక్యరాజ్యసమితి 39; యునైటెడ్ నేషన్స్ 262; బాలభట్ట వ్యవస్థ 207; బ్రహ్మసమాజం 217; యునిసెఫ్ 262;

కమ్యూనిజం 48; ప్రజాస్వామ్యం 185; మాగ్నకార్టా247; నాన్‌అలైన్డ్ మూవ్‌మెంట్ 157; ప్రపంచయుద్ధం, ప్రథమ 193; ప్రపంచయుద్ధం, ద్వితీయ 193; ప్లాసీయుద్ధం 199; ఫ్రెంచివిప్లవం 202; బోస్టన్‌టీపార్టీ 215; రష్యన్‌విప్లవం 266.